అంతర భారతీయ పుస్తకమాల

# కథాభారతి
# కన్నడ కథానికలు

సంకలన కర్త

జి. హెచ్. నాయక్

అనువాదం

శార్వాణి



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ISBN 81-237-1203-0

1995 (శక 1916)



*Original title in Kannada:*

Kannada Sanna Kathagalu *compiled by G.H. Naik*

*Telugu Translation:* Kannada Kathanikalu

రూ. 41.00

డైరెక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్ పార్క్,
న్యూ ఢిల్లీ -110 016 ద్వారా ప్రచురింపబడినది.

# ప్రస్తావన

క్రీ.శ. 1900 సంవత్సరంలో పంజె మంగేశరాయులు (1874-1937) సువాసిని పత్రికలో ప్రకటించిన 'భారత శ్రవణ', కమలపురద హొటేలినల్లి (కమలాపురం హొటల్లో), 'నన్న చిక్కతాయి', 'నన్న చిక్కతందెయవర ఉయిలు' కథలతో ఆధునిక కథా సాహిత్యపు చరిత్ర మొదలయింది. ఆయన కథలలోని వస్తువు సాంఘికం మరియు చారిత్రకం. చారిత్రక కథలలో ఆదర్శాలకు ఎక్కువ ప్రాధాన్యత వున్నది. ఆయన రాసిన నాలుగు చారిత్రక కథలు వీర నారీమణుల పవిత్ర ప్రేమ, అద్భుత సాహస కార్యాలను వర్ణించేవి. ఆ నారీమణుల జీవితాలన్నీ విషాదాంతాలే. ఈ నారీమణుల పేర్లనే ఆయన ఆ కథలకి శీర్షికలుగా వాడుకున్నారు. పంజెగారి తొమ్మిది కథలలోని వస్తువు, చిత్రీకరణలలో ప్రముఖంగా కనిపించే లక్షణం హాస్యం. ఆయన కన్నడ కథలన్నిటిలోను నవ్య కన్నడ గద్యపు తేజస్సు కనిపిస్తుంది. ఆ తరువాత ఇంచుమించు ఒకే సంవత్సరంలో కీ.శే. ఎం.ఎన్. కామత్, కీ.శే. కెరూర్ వాసుదేవాచార్యులు, శ్రీ మాస్తి వెంకటేశ అయ్యంగార్ (శ్రీనివాస) వీరు చిన్న కథలు రాశారు. (మాస్తి వెంకటేశ అయ్యంగార్ కన్నడ సణ్ణకతెయల్లి వాస్తవికతె -1957) చారిత్రకంగా చూసినా కన్నడంలో చిన్న కథల రచయితల్లో శ్రీ మాస్తి గారే మొదటివారు అనడానికి వీల్లేకపోయినా, ఆయన కన్నడంలోని మొదటి ముఖ్యమైన కథా రచయిత అన్నది నిర్వివాదమైన విషయం.

చాలా తీవ్రమైన ధార్మిక శ్రద్ధతో జీవితపు అన్ని వ్యవహారాలనీ పరిశీలించి, వ్యాఖ్యానించి, విలువల్ని నిర్ణయించే సాత్విక మనస్తత్వం మాస్తి వెంటేశ అయ్యంగార్ (శ్రీనివాస) గారి కథల్లో కనిపించే అనుభవాల్ని రూపొందిస్తున్నట్టు కనిపిస్తుంది. తరతరాల్నుంచీ వస్తున్న సంస్కృతిలోని చైతన్యాన్ని, దాని స్థిర స్థాయిని, దాని అంతులేని వైవిధ్యాన్ని, వ్యక్తి విషయాల సందర్భాల్లో తీసుకొచ్చి కీర్తించే ప్రయత్నం ఆయన రచనల్లో కనిపిస్తుంది. అందువల్ల జీవితంలోని దుష్ట, అధార్మిక, నిష్ఠుర ముఖాలన్ని, సంస్కృతి విలువలని నిరూపించడానికి కావల్సినంతవరకు నేపథ్యంగా వినియోగించుకుంటారు. కనుక పరంపరాగత శ్రద్ధ, నమ్మకాల్ని ప్రశ్నించే సన్నివేశం, సందర్భాలు ఎదురైనపుడు కూడా సాంప్రదాయికమైన విలువల పరిధిలో దానికి పరిష్కార మార్గాన్ని వెతికే దృక్పథం, ఆత్మ విశ్వాసం మాస్తిగారి రచనల్లో కనిపిస్తుంది. ఆ విలువల

హద్దుల్లో పక్వమైన అనుభవం, జీవితం ఇచ్చిన వివేకం ఆయనలో కనిపిస్తాయి. వాటితో బాటే వస్తు నిరూపణ తులనాత్మకంగా చేసే లక్షణం కూడా వుండటంతో ఆయన కళకు వినూత్నమైన తేజస్సు, ప్రత్యేకంగా ఏర్పడుతాయి.

మాస్తి గారి చాలా భాగం కథలలో ప్రధాన పాత్ర లేకుండా జనుల నమ్మకాల అడుగున పరిపూర్ణమైన ముగ్ధత్వం ఎల్లప్పుడూ కనిపిస్తుంది. కథకుడిగా మాస్తిగారు, ఆ ముగ్ధత వల్ల వచ్చే దురంత పరిణామాలను సానుభూతి, మానవతా కోణాల్నుండి మాత్రమే కాక వాటికి ఒక గొప్పదనాన్ని ఆపాదించడంతో ఆయన ఒక ఆరాధక స్థానంలో నిలుస్తారు. అందువల్ల కథకుడు కూడా అతని పాత్రలలాగానే, వాటి జీవితాల్లో విషాదాంతాన్ని మించి వేరే సార్థకతనుగాని, సాధ్యతనుగాని చూడలేని, ఆలోచించలేని ముగ్ధమైన నిస్సహాయ స్థితిలో వున్నట్టనిపిస్తుంది. అందువల్ల మాస్తిగారి కథనంలో కనిపించే ఒక రకమైన నిర్భావుకత సృజనాత్మకమైన సందర్భాలలో జీవితపు అనుభవాల తర్కించి, జీవితపు సాధ్యతల్ని, అన్వేషించే తులనాత్మక దృక్పథం అనిపించదు. మాస్తిగారి రచనలకున్న ముఖ్యమైన పరిధి ఇదే.

మాస్తిగారి నిర్భావుకతకు ఆయనుపయోగించే రచనా ప్రక్రియ కూడా చాలా చోట్ల తోడ్పడుతుంది. ఎప్పుడో ఎక్కడో జరిగిన సంఘటనను ఎవరికో చెపుతున్నట్లు లేక ఎవరో చెపుతున్నట్లు ఉంటుంది. "మొసరిన మంగమ్మ" (పెరుగు మంగమ్మ) లోని కథనం కూడా ఇలాంటి ఒక ప్రక్రియ. ఇందులో మాస్తిగారికి ఆయన కథల్లో సామాన్యంగా కథను నడిపించే ఆతృత లేదు. తరతరాల్నుంచి వస్తున్న విలువలని కీర్తించే కోరిక అంత ముఖ్యమైనదీ కాదు. ఒక ప్రత్యేకమైన సాంసారికమైన, సామాజికమైన సందర్భంలో కలిగేటటువంటి అనుభవాన్ని పొరలు పొరలుగా విడదీస్తూ తాను చెప్పదలచుకున్న విషయాల్లో భిన్నమైన అర్థాలని స్పష్టంగా చెప్పకుండా ధ్వనింప చేసే ప్రక్రియ ఇది. కథను చెపుతున్నది కథలోని పాత్ర మాత్రమే కాదు. కథలోని ఆశయాన్ని ఎత్తి చూపే కథకుడి నుంచి విడదీయలేని అంగం కూడాను. మధ్య తరగతి గృహిణిఅయిన ఆమె చివర్లో చేసిన తాత్విక వ్యాఖ్యానం ఆ సందర్భంలో కృతకమని అనిపించకపోయినా, కథకుని అభిప్రాయాన్ని ఆమె వ్యాఖ్యానంతో కలిసిపోయేలా సన్నివేశాన్ని ఏర్పరచడంతో కథా సంవిధానం చాలా సరళంగా అనిపిస్తుంది. మాస్తిగారు ఒక తాత్వికమైన అభిప్రాయాన్ని వెలిబుచ్చడానికి ప్రయత్నించి నప్పుడల్లా దానికి కావల్సిన బౌద్ధికమైన ఆలోచనను తోడు చేయకపోడంతో దానికి తగిన బలం లేకుండా పోతుంది. అయినా ఈ కథలో నిరూపించిన విషయాలు ఈ కథా సందర్భంలో చాలా సహజమైనట్లు

చూపెడుతూనే, ఒక విషయానికి మరో విషయానికి గల సంబంధాన్ని సున్నితంగా చూపెడుతూ వాటి అర్థ సంపదని హెచ్చిస్తూ, కథని అల్లడంలో చాలా సున్నితమైన పనితనం కనబడుతుంది.

ఎ.ఆర్. కృష్ణశాస్త్రి (శ్రీపతి) గారు మాస్తిగారికన్న వయసులో పెద్ద వారైనా ఆయన కథానికలు ఆలస్యంగా వ్రాయడానికి మొదలుపెట్టారు. సాహితీ విలువల దృష్టితో చూసినా మాస్తిగారి చిన్న కథలకున్న విలువ ఈయన కథలకు లేదు. ఈ సంకలనంలో మాస్తి గారి కథ ముందు వుండడానికి కారణం అదే. మొత్తం పదమూడు కథలు రాసిన కృష్ణశాస్త్రిగారు 1923 నుంచి 1930 వరకు రాసిన ఎనిమిది కథల్ని శ్రీపతి అనే పేరుతోను, 1940 నుంచి 1949 వరకు రాసిన కథల్ని వరుసగా కమల, ఆర్.వి. కుప్పణ్ణ, శామణ్ణ, గోపాల, పద్మనాభ అనే పేర్లతోను ప్రకటించారు. "దేవుని సృష్టి చాలా విచిత్రమైనది. అందులో ఒక్కొక్క వస్తువు స్వరూపం ఒక్కొక్కటి. అది ఎందుకు అలాగున్నదో, ఎలాగ వుండాలో అతనికే తెలుసు". "కర్త ఎవరైనా కానీ, దాత ఎవరైనా కానీ, భోక్త మాత్రం జీవుడు. కాని ఆ కారణంగా జీవుడు జగన్నాయకునితో దెబ్బలాడగలడా? సమ్మె చేసి గెలవడం సాధ్యమా? వాడు తన సంకల్పాన్ని నెరవేర్చుకోనీ! లీల అలా నడవనీ నిస్సహాయుడైన నరమానవు డేమన గలడు!" (శ్రీపతియ కథెగళు-మున్నుడి) గరుగళమహిమె (గురువుల మహిమ) ను అర్థం చేసుకోవడానికి కావల్సిన వాతావరణాన్ని ఇది కల్పిస్తుంది.

హిందూ సంస్కృతిలోని సాంప్రదాయ సిద్ధమైన తత్వ సిద్ధాంతాలను పరిపూర్ణమైన శ్రద్ధతో నమ్మిన మనస్సు అల్లిన కథ ఇది. గురువు ఆ తాత్విక అవగాహనకు ప్రతీకగా, ఆ అవగాహన లభించక అల్లాడుతున్న జీవానికి ప్రతీకగా ఆ స్త్రీని నిలిపి, గురువు జ్ఞానాన్ని ఆ స్త్రీ జీవి పరం చేసే ప్రక్రియలోనే ఈ కథలోని అనుభవానికి ఒక ఆకారం వస్తుంది. కథలో వచ్చే అద్భుతాలనిపించే విషయాలు, వాటిని ఆ కథా సందర్భంలో తాత్విక దృష్టికి అనుగుణంగా ఒక తత్వ సిద్ధాంతానికి అన్వయించి, వ్యాఖ్యానించే గురువుకున్న జీవితానుభవం, వాటి సత్యతను గురించి కథకుడికి ఎట్టి అనుమానమూ లేదు. దీని మూలంగా జీవన సత్యాల పరిశోధన గురించి ఎక్కువ అనుమానాలకు తావిచ్చేలా వుంది. అయినా మొత్తం మీద కృష్ణ శాస్త్రిగారు, "తమ సామాజికమైన నమ్మకాలను ఉపయోగించు కోవడంలో సమర్థులైనందువల్ల ఈ కథలో ఆయన నిరూపించే సత్యాలు వ్యక్తి పరంగా మాత్రమే మిగలక మొత్తం సంప్రదాయాన్ని బలపరుస్తాయి".(ఎ.జి. కృష్ణమూర్తి

ఆధునిక కన్నడ సాహిత్య ఆధునిక భారత సాదాత్య) ఇలా పూర్వ నిశ్చితమైన భావాలను కథా వస్తువుగా తీసుకుని రాసినప్పుడు, మాస్తిగారు కూడా ఇలాంటి విమర్శకే గురి అవుతారు. సంభాషణలోనే మొత్తం కథంతా అల్లబడింది. ఈ కథా విధానాన్ని ఇంతకు ముందే "అత్తె", "ఊటద ఉపచార" కథల్లో కృష్ణశాస్త్రిగారే ఉపయోగించారు. కాని ఈ రకమైన కథా సంవిధానపు శక్తిలో కథకుడికే నమ్మకం వున్నట్టు కనిపించదు. అందువల్లే "తల్లి బాధ, గురువుగారి ఓదార్పు, వీటి మధ్యలో కథను కనుక్కోవడం కష్టం అవుతుంది కదా అని ఆయన కథా సంగ్రహాన్ని మొదట్లోనే పొందుపరచారు. అది అనవసరమని పించదు".

మాస్తిగారి తరువాత ఆ తరం కథకులలో ఎక్కువ ప్రజాదరణ పొందిన రచయిత అజ్జంపుర సీతరామం(ఆనంద) గారు. ఈయన కథలలో చాలా భాగం ఒక కుటుంబపు పరిధిలోనే నడుస్తాయి. అందులోనూ భార్యా, భర్త ఉంటే ఒక బిడ్డ మాత్రమే వున్న కుటుంబాలను తీసుకొంటారు. మధ్య తరగతిలో పెద్ద ఇబ్బంది లేని , పరస్పర సౌహార్ద్రం, రసికత వున్న దంపతుల సంసారాలవి. అక్కడ కూడా సరస సంభాషణ, ప్రణయ సల్లాపాలకి ప్రాధాన్యత కుటుంబపరిధి నుంచి బయటకి పోతే కూడా వివాహ పూర్వ ప్రేమ వ్యవహారాలు, ప్రణయం కనిపిస్తాయి. అయినా కాని గృహస్థుల వివాహ ధర్మాల ఆవరణ దాటి ప్రేమ ప్రకరణాలు వుండటానికి సాధ్యం లేదు. భార్య పట్ల అంత పరిపూర్ణమైన విశ్వాసము, శ్రద్ధలేని భర్త బహుశ ఒక్కడు కూడా లేడు.. భార్య కూడా అంతే. అలాటిదేదయినా వున్నాఅది ఒక మాయ లేదా ఉన్మాద స్థితిలో మాత్రమే. అలాంటి సందర్భాల్లో పురుషుడు నిజమైనా స్త్రీ మాత్రం కల్పనగాని, కలగాని అయి వుంటుంది. పైన పేర్కొన్న సందర్భాల్లోని పురుషుడు సాధారణంగా కథకుడో, నటుడో చిత్రకారుడో అయి వుంటాడు. మొత్తంమీద శృంగార భరితమైన ప్రేమ కలాపాలను, లేదా సంభాషణలను మళ్ళీ మళ్ళీ చప్పరించే స్వభావం 'ఆనంద' గారిలో కనిపిస్తుంది. ఈ లాలసనే కళగా మార్చే రసికత, నైపుణ్యం ఈయన విశిష్టత, మొత్తంమీద 'ఆనంద' గారి రచనా శక్తి చాలా చిన్న ప్రపంచానికి పరిమితమై వుంది. మాస్తి గారి కున్న ధార్మిక విశ్లేషణ గాని, సాంస్కృతిక పరమైన ఆలోచనగాని ఈయనకు లేవు. జీవితాన్ని గురించిన మరే విధమైన గంభీరమైన ఆలోచన ఈయనలో లేకపోవడంవల్ల అనుభవానికి అంతర్ముఖమైన ఆలోచన జోడు కాక ఆయన కథలు శృంగార భావనతో నిండి వుంటాయి. దీనికి విరుద్ధంగా వుండి మంచిపేరు పొందిన కథ 'నాను కొందహుడుగి' (నేను చంపిన అమ్మాయి). అంతేకాక

నవ తరంలోని చిన్న కథలలో చాలా ముఖ్యమయిన కథ కూడా. మాస్తిగారి "మొసరిన మంగమ్మ" లో లాగానే ఈ కథ రచనా విధానంలో కూడా సామాజికంగానూ, సాంస్కృతికంగానూ, పై స్థాయిలో వున్న వ్యక్తి కథలోని పాత్ర, కథకుడు కూడాను. కథకుడు తెలిసిగాని, తెలియకగాని చేసే పనులు, చెప్పే మాటలు, కల్పించే ఉపాయాలు కథను విషాదాంతానికి దారి తీయడాన్ని చాలా కళాత్మకంగా నిర్వహించారు. అస్తవ్యస్తమైన శ్రద్ధ, నమ్మిక, వ్యవస్థల తెర ముందు ఈ కథ విషాదాంతంగా తయారు కావడం చాలా నేర్పుగా చూపబడింది. దానితో బాటే తన క్రియ, ప్రతిక్రియలకున్న అసంబద్ధతను దాటి నిలువలేని వ్యక్తి, ఇంకో వ్యక్తి నమ్మకాల పట్ల తీర్పు నివ్వడం వల్ల కలిగే దుష్పరిణామాన్ని ధ్వనింప జేసేటంతటి కథా వస్తువు ఇక్కడుంది. కాని ఆ విషయాన్ని వ్యంగ్యంగా వ్యాఖ్యానించే ఆలోచనా స్థాయి రచయితలో లోపించడంతో కథ భావపరమైన విలువనే కలిగి వుంది.

కె.వి. పుట్టప్ప (కు.వెం.పు) గారు కావ్యం, నాటకం, నవలలను చిత్రించినంత గంభీరంగా, చిన్న కథను తమ సృజనాత్మకమైన చైతన్య వ్యక్తీకరణకు మార్గంగా మలచుకోలేదు. ఆదర్శం - దాన్ని అపహాసించడం, హాస్యం-విషాదము, మోసపోయే మోసపుచ్చే, దెయ్యమని భ్రాంతి కలిగించే మనిషి - మనిషనే భ్రమ కలిగించే దెయ్యాలు, పురాణ పురుషులను భారతదేశంలో తిప్పించడం భార్య మగ వేషంలో వచ్చి ఆర్నెల్లు స్నేహం చేసినా అతను కనుక్కోలేకపోవడం లాంటి భిన్నమైన కథా వస్తువులతో, మరే ప్రత్యేకమైన దృక్పథం, ఆశయాలు అంటూ లేనట్టే కథలు రాశారు కు.వెం,పు. అందువల్ల ఆయన కథలన్నీ కలిపి చూస్తే ఒక ప్రత్యేకమైన జీవన దృక్పథం వాటిల్లో కనిపించదు. కాని విడిగా చూస్తే చాలా భాగం కథల్లో కనిపించే విషయాలు, కథా సంవిధానం, ఆయన కావ్యాల్లో కనిపించే అపురూపమైన భాషలోని మాధుర్యం సహజమైన లయకు, మొత్తం మీద కనిపించే కళా నైపుణ్యం నవతరం కథల్ని దృష్టిలో పెట్టుకుని చూస్తే చాలా ప్రత్యేకమైనవి అనవచ్చు. రెండు కథా సంకలనాల్ని ప్రకటించిన కు.వెం.పు. గత ముప్పై నాలుగేళ్ళలోనూ మళ్ళీ కథలేమీ రాసినట్టు అనిపించదు. ఆయన లాగానే వేరే సాహితీ ప్రక్రియలలో పేరు పొందిన, నవ తరానికి చెందిన ద.రా.బేంద్రె, శివరామ కారంత, పు.తి. నరసింహాచార్ మొదలైన వారు కూడా చిన్న కథలు రాసినా ఆ ప్రక్రియ వారికి చివరి వరకూ ఎందుకు లొంగిరాలేదో ఓ ప్రశ్నగానే మిగిలి పోయింది.

'అజ్ఞాత వీరుడు' (యారూ అరియద వీర) సామాన్య మానవునిలో కూడా కనిపెంచగలిగే అసామాన్య కృతజ్ఞతా భావం, త్యాగాలను, చిత్రించే కథ. భావా

వేశానికి లోను కాకుండా రచయిత, చాలా హేతుబద్ధంగా కథ నడుపుతోనే కథలోని ఆశయాన్ని చాలా బలంగా చెప్ప గలిగారు దీనిలో. 'యారూ అరియద వీర" కు. వెం.పు కథా సంవిధానంలో చివరి మెట్టు నెక్కగలిగారు". అన్న కుర్త కోటి గారి అభిప్రాయం. (యుగధర్మ మత్తు సాహిత్య దర్శన) కు. వెం.పు గారి కథలకు మాత్రమే వర్తించినట్లయితే సరయినదే.

మాస్తి, 'ఆనంద' గారి లాగ అశ్వత్థ గారి అనుభవ ప్రపంచానికి ప్రత్యేకమైన ఎల్లలంటూ లేవు. ఏ రకమైన సనాతన భావాల సంకెళ్ళు, బంధాలు లేకుండా, జీవితంలో అన్ని రకాలయిన అనుభవాల్ని ఆహ్వానించిన మనస్థితి ఆయనది. అలా ధ్యేయ రహితం అనిర్దిష్టం అనిపించే ఆయన రచనల వెనుక ఒక మానవతా దృష్టి ఎల్లపుడూ కనిపిస్తుంది. మానవుని ఉదాత్తత, దౌర్బల్యం, బలహీనతల్ను సాంప్రదాయిక ధర్మం యొక్క నీతి నియమాల చట్రంలో బిగించ కుండా మనిషి మనస్సు మరియు మానవీయతలోని మిగిలిన అన్ని రకాల కోణాలుండడానికి వీలున్నదన్న విషయం గుర్తించగల ఉదారత ఈయనలో కనిపిస్తుంది. దాని వ్యక్తీకరణలో ఒక రకమైన యధాలాప ధోరణి (Casualness)చివరి వరకు ఉండటంతో కథనంలో కావల్సిన బిగి, సృజనాత్మకమైన ఏకాగ్రత వుండదు. 'ఆనంద ' గారి కథల్లో వున్న కళాత్మక ధోరణి అశ్వత్థగారి కథల్లో లేదు. కాని అశ్వత్థ గారికి విషయాల్ని మలచుకోవడంలో వున్న సరళత బహుశ నవ్య కథా రచయితలలో ఎవరికీ లేదు.

ధర్మకొండద కథె(ధర్మ కొండకథ) లో అశ్వత్థ గారు జీవ పోషకం కావాల్సిన ధర్మం జీవ వినాశనానికి కారణం కావటాన్ని మానవతా దృష్టితో విశ్లేషిస్తారు. తీర్పు అడిగే వారు, తీర్పు ఇచ్చే వారు, తీర్పుకు లోబడే వారు అందర్నీ నిస్సహాయుల్ని చేసే ధర్మ శాస్త్రంలోని క్రౌర్యం ఈ కథలోని విషాదానికి కారణం అవుతుంది. ధర్మ కొండ (కొండ-కుండ యొక్క తద్భవ రూపం) అన్న శీర్షిక కాళప్ప (కాళ-కాలుని యొక్క తద్భవ రూపం కాలుడు=యముడు) గుండమ్మ (గుండు = రాయి), దేవమ్మ, గంగమ్మ ఈ పేర్లు కూడా రసార్ధకమైన పేర్లుగా ఉండేలా చేయడంలో, ఆ యా గుణాలకు వారు ప్రతినిధుల్లా ఉండేలా చూడటంలో ఒక కళాత్మక దృష్టి వున్నా, వాటినలా ఉపయోగించుకోవడంలో చాలా తెలివి తేటలు కనిపిస్తాయి. త్రాగే నీటి బావి సాంకేతికమైన చిహ్నంగా వాడుకోవడంలో ఉత్తమ స్థాయి కళా కుశలత కనిపిస్తుంది.

## 2

అభ్యుదయ పథానికి చెందిన నాలుగు కథల్ని దీనిలో చేర్చాను: చదురంగ గారి "నాలుగు మూరల భూమి" (నాల్కు మొళ భూమి), బసవరాజు కట్టీమని

గారి అజ్ఞాతవాసి, త.రా.సు. గారి 0-0=0, మరియు నిరంజన గారి "కొనెయ గిరాకి" (ఆఖరి గిరాకి) చదురంగ గారు అభ్యుదయ రచయితలందరిలోకి సామాజిక స్పృహతో రాస్తారు. ఒక సాంఘిక సందర్భంలో అన్యాయానికి గురి అయిన వ్యక్తి యొక్క జీవితపు దుస్థితి పట్ల జాలి చూపేటటువంటి సాత్వికాంశం ఈయన రచనల్లో కనిపిస్తుంది. మిగిలిన అభ్యుదయ రచయితల్లో, అన్యాయం పట్ల నిప్పులు కక్కే ధోరణి వుండటంతో అన్యాయానికి గురైన వ్యక్తి లేక వర్గం పట్ల వున్న సానుభూతిలో రాజసాంశ కనిపిస్తుంది.

చదురంగా గారి "నాల్కు మొళె భూమి" (నాలుగు మూరల భూమి) లో కథలో కథ అనే ప్రక్రియ వుంది. కథలోని కథను మాత్రమే చూసినట్లయితే నవ్య కథల కోవకి అందునా మాస్తిగారి రచనలకి దగ్గరగా వున్నట్టనిపిస్తుంది. కాని ఈ ముఖ్య కథ ద్వారా ఆయన చూపెట్ట దల్చుకున్న అనుభూతికి ఈ లోపలి కథ కావల్సిన ప్రేరేపణ ఇచ్చి వెనక్కి తప్పుకుంటుంది. లాయరు భార్య లలిత సంజీవుడి కథను తనదిగా చేసుకుంటుంది. కాని సంజీవుడి కథలో కాళింగయ్యను బాధ పెట్టే పాప పుణ్యాల ఆలోచన ఆమెకు లేదు. ఈ వ్యంగమే ఈ కథలో వున్న ముఖ్యమైన ధ్వని. ఈ వ్యాజ్యాలకు పరిష్కారమే లేదా అని పరితపిస్తున్న లాయరుకు కథలోని కథలో జవాబు కనిపించి, దాన్నతడు ఆమోదించే క్షణంలో అతని భార్య నేరం బయటపడడంలో కఠినమైన వాస్తవికత వేలెత్తి చూపే వ్యంగ్యపు ఇంకో ముఖం కనిపిస్తుంది. పల్లెటూరి పేద రైతుకున్న న్యాయ బుద్ధి, పాపప్రజ్ఞ, ఆ పట్న వాసపు లాయరు భార్యకు లేదు అన్న పరోక్షమైన సూచన ఈ కథపై అభ్యుదయ భావాల ప్రభావాన్ని ఎత్తి చూపెడుతుంది. ఈ రకంగా వర్గాలలో తేడాను తీసుకుని, దీన దళిత వర్గపు గొప్పదనాన్ని ఎత్తి చూపెడుతూ రాసే ధోరణి అభ్యుదయ రచయితలలో చాలా సామాన్యం. దానికి చదురంగ మినహాయింపు కాదు. కాని ఆయన ప్రత్యేకత ఏమంటే, ఆ రచనల్లో కోపం కాని, ద్వేషం గాని కనిపించవు.

బసవరాజ కట్టీమని గారు చాలా ప్రజాదరణ పొందిన అభ్యుదయ రచయితల్లో ఒకరు. "వాస్తవ పరిస్థితులను తెలుసుకుని, మంచి జీవితం కోసం పోరాడుతున్న ప్రజలకు స్ఫూర్తినిచ్చే రచనలు చేయడమే అభ్యుదయ వాదం" అని ఆయన అభిప్రాయం. (కట్టీమని: బదుకు-బరవా, పూర్వ దృష్టియ పథ (హా.మా.నాయక) 1942, ఆగస్ట్ ఉద్యమాన్ని కథా వస్తువుగా తీసుకుని రాసిన ఏడు కథల సంపుటి "ఆగస్ట్ ఒంబత్తు" (మే 1947) సంపుటిలోంచి ఎన్నుకొన్న అజ్ఞాతవాసి ఈ అభిప్రాయాన్ని ప్రతిపాదించే కథలలో

ఒకటి. నవ్య కథా రచయితలు, మిగిలిన అభ్యుదయ రచయితలందరి కన్నా ఎక్కువ ఆవేశం, తీవ్రతలలో స్వాతంత్ర్య పోరాటం, గోవా విముక్తి, పాకిస్థాన్ యొక్క దాడి లాంటి కథా వస్తువులతో కథల్ని రాసిన వ్యక్తి ఈయన. ఇలాంటి కథా వస్తువులతో చిత్రీకరించేటప్పుడు కన్నడ కథలలో సాధారణంగా కనిపించే ధోరణి, భావ పక్షపాతం మొదలైన వాటికి ఈ కథ ప్రాతినిధ్యం వహిస్తుంది. కన్నడ ఐతిహాసిక కథలు ప్రతిపాదించే ధోరణి కూడా ఇది ప్రతిబింబిస్తుంది. ఎక్కువ బలమయిన సంస్కృతిలోని అన్ని కోణాలను పరిశీలించే ప్రక్రియలతో కూడిన మాస్తి గారి చారిత్రక పరమయిన కథలు మాత్రం దీనికి మినహాయింపుగా కనిపిస్తాయి. అభ్యుదయ రచనల్లో సాధారణంగా కనిపించే ఆవేశం, మెలో డ్రెమటిక్ వాతావరణం, పాత్రలు మరియు సన్నివేశాల అమరికలో కొట్టొచ్చినట్లు కనపడే ప్రత్యేకత ఈ కథలో కూడా వుంది. మొత్తం మీద కన్నడ కథా పరంపరలో ఓ వైవిధ్యమైన అంశానికి ఈ కథ ప్రతినిధి.

త.రా.సు. గారు 'చదురంగ' గారిలా తమ సృజనాత్మక కళను వ్యక్తీకరించడానికి చిన్న కథల్ని మాత్రమే వాడుకోలేదు. మిగిలిన అభ్యుదయ రచయితలకు కూడా ఈ మాట వర్తిస్తుంది. నవల వారందరికీ స్వతసిద్ధమైన ప్రక్రియ. త.రా.సు గారి మొదటి సంకలనాల్లో వున్న అభ్యుదయ వాదపు మత్తు క్రమేణా తగ్గిపోయింది. "ఇదే నిజవాద సంపత్తు" సంకలనంలోని కథల్లో అభ్యుదయ వాదపు వాసన కూడా కనిపించదు. ముందు ముందు కథలు రాయాలన్న ఉత్సాహం కూడా ఆయనలో మిగిలినట్టు అనిపించదు. పది సంవత్సరాల్లో రాసిన కథలు రెండే అని తెలుపుతూ నవల రాయడం కన్న చిన్న కథ రాయడం కష్టం అన్న సత్యం నాకిప్పుడే తెలిసింది" అన్నారాయన.

'త.రా.సు' గారి 0-0=0 మొదలైన కథల్లో అభ్యుదయ వాదపు ధోరణి వున్నా, దాన్ని మించి కథా వస్తువును వ్యక్తీకరించడంలో కొత్త ప్రయోగాలు చేయాలన్న కుతూహలం కనిపిస్తుంది. కన్నడంలో చిన్న కథల చారిత్రకుడు కథావస్తువు, మరియు ప్రక్రియల దృష్ట్యా '0-0-0' కథ యొక్క చారిత్రక స్థానాన్ని గుర్తించకుండా ముందుకు పోవడానికి కుదరదు. నవ్య మరియు అభ్యుదయ రచయితల కథలలో సామాన్యంగా కనిపించే బలమైన కథ, తిన్నగా కథను చెప్పుకుపోయే పద్ధతి దీనిలో లేదు. నాకు తెలిసినంత వరకు కన్నడంలో చైతన్య స్రవంతిని ఉపయోగించిన మొట్టమొదటి చిన్న కథ ఇదే. చిన్న కథకు భావగీతాలకుండే లక్షణాన్ని ఆపాదించే ప్రయత్నంలో కూడా కొత్త దనం కనిపిస్తుంది. ఈ కథలోని కథా వస్తువు జీవితం - చావులను గూర్చిన

ఒక తాత్వికమైన ఆలోచన. ఒక సూత్రాన్ని ఆమోదించి దాన్ని ఒక సిద్ధాంతానికి అన్వయించడంలో దాన్ని స్వంతం చేసుకోవాలన్న ఆతృత కనిపిస్తుంది. చిహ్నం, రూపకం లాంటి ప్రక్రియలను వాడుకోవడంలో ఏర్పడిన కంగారు మూలంగా ఒకదానికొకటి వుండాల్సిన సంబంధం లేకపోవడంతో ఆయన చెప్పదల్చుకున్న తత్వవిచారం పాఠకునికి అందదు.

నిరంజన గారు తమ రచనల ధ్యేయానికి తగినట్టు తమ గద్య రచనల శైలి, రచనా ధోరణి మార్చుకోవడమన్నది చాలా గొప్ప విషయం. త.రా.సు గారి శైలికి కూడా ఒక ప్రత్యేకత వున్నా, అది సాంప్రదాయికమైన భాషలో చెప్పాలంటే కావ్యమయం కావడంతో నిరంజన గారి శైలిలా నేల మీద నడవదు. అభ్యుదయ రచయితలందరిలో ఉన్నతమైన ఆలోచనా ధోరణిలో క్రూరమైన వాస్తవికతను చూడడంతో సమస్యకున్న మిగిలిన కోణాలు కూడా నిరంజన గారికి కనిపిస్తాయి. సమాజం, మరియు దేశంలో కనిపించే వ్యక్త్యతీత పరిస్థితి, లేదా వ్యక్తికే ప్రత్యేకించిన కుటుంబ పరమైన లేదా సాంప్రదాయికమైన హద్దులు, వ్యక్తికి వున్న మానసిక ఇబ్బందులు అతని నిస్సహాయకతకు, అవస్థకు కారణభూతం కావటాన్ని గుర్తిస్తారు నిరంజన గారు. ఇక్కడ పొందుపరిచిన 'కొనెయ గిరాకి' (ఆఖరి గిరాకి) ఈ అంశానికి నిదర్శనం కాజాలదు. అది అచ్చమైన అభ్యుదయ వాదానికి, దాని హద్దులకు, కళాత్మకమైన సాధ్యా సాధ్యతలకు ప్రతినిధి. ఈ కథకు ప్రక్రియలోని కొత్త దనం మూలంగా చారిత్రకంగా చాలా ప్రాముఖ్యత వున్నది. పదిమంది నడిచి వెళ్ళే సర్కిల్‌కి అవతల చచ్చి పడి వున్న దిక్కులేని కాణి (కాణి= చూడండి ఈ అర్థాన్ని ఇక్కడ గమనించాలి మనం) ని చూడకుండా వెళ్ళే వారిని కూడా వదల కుండా చుట్టుముట్టే మూగ కాణి శవపు దుర్గంధం, కథ ప్రారంభంలోను, మళ్ళీ చివరి భాగంలోను కనిపించే కొన్ని వాక్యాలు కథలోని కొన్ని సహజమైన అంశాలను నిరూపించడమే కాక వేరే ధ్వని పరివేషాన్ని కూడా పొంది వున్నాయి. అలాగే చివర్లో వచ్చే బలమైన గ్రద్ద ఏక కాలంలోనే మానవత అన్నది లేని, కనిపించని సమాజాన్ని హేళన చేస్తుంది. కాణి శరీరంపై కన్ను వేసిన విషయ లంపటులకు చిహ్నం అవుతుంది. కాణికి సంబంధించిన విషయాలన్నీ అస్పష్టంగా సూచ్యమయ్యే కుక్క జన్మ పరిస్థితిని వ్యక్తీకరిస్తాయి. ఇంతా వున్నా కథాసారం, సరళమైన సిద్ధాంతంలో భావాడంబరత వుండటం వల్ల అనుభూతిలోని ఆవేశానికి కళ కన్న ఎక్కువ ప్రాముఖ్యత వున్నట్టుగా అనిపిస్తుంది.

## 3

**అభ్యుదయ వాదుల కథలో క్రొత్తదనం, ముఖ్యంగా సాహితీ ప్రక్రియలలో**

కనిపించింది గాని, కథావస్తువు, ప్రక్రియ మరియు సాహిత్య ధోరణికి సంబంధించినంతవరకు మొత్తం మీద మొట్టమొదట కనిపించేది బి.సి. రామచంద్ర శర్మగారి కథల్లో అభ్యుదయ వాదుల కథల్లో కనిపించే సంఘ సంస్కరణ, సామాజిక న్యాయం వీటినుంచి కథల కేంద్రాన్ని (Focus) తప్పించి, మనిషి మనసు, మరియు మూల ప్రవృత్తి వేపు మరల్చడం అన్నది చారిత్రకంగా చాలా ముఖ్యమైన విషయం. కాని క్రొత్త సాహితీ ప్రక్రియల పట్ల అత్యుత్సాహం, ఎక్కువగా ప్రయోగించిన చిహ్నాలు, కామం పట్ల యువకుల కుండే కుతూహలం వీటి మూలంగా శర్మగారి కథలకు సాహితీ విలువలు ఎక్కువ కాలేదు. వారి ఇటీవలి కథల్లో ఈ అంశాలకు సంబంధించినంత వరకు కొంచెం ఎక్కువ జిజ్ఞాస కనిపించినా అంత గుర్తించ దగిన మార్పు కనిపించదు.

'యారు వాతవరు నినగె' (ఆ ముగ్గురిలో అతనెవరు) శర్మ గారి ముద్ర వున్న కథల్లో ఒకటి. నవ్య, అభ్యుదయ రచనల్లో కనబడే అంశాలన్నీ వున్నా నవ్య విధానాన్ని పట్టుదలతో సాధించే తీరు, మార్పు జరుగుతున్న కాలం యొక్కప్రభావం ఈ కథ నిడిపంచే విధానంలో కనిపిస్తాయి. కథ పొడుగునా అచేతనమైన వస్తువు, విషయాలకు కూడా చేతన రూపాన్నిచ్చే సంకేతాలు- చిహ్నాలు, ఉపమా - రూపకాలు, వర్ణనలు, రతి సంబంధమైన వివరాలు తెలుపుతూనే చైతన్య వాతావరణాన్ని సృష్టిస్తాయి. అలా చేయటంలో ఔచిత్యమైతే వుంది గాని, ఆయన వుపయోగించిన ప్రక్రియల ఆడంబరతతో ధ్వని లోని సున్నితత్వమంతా పోయింది. కథ చివరలో మల్లిని వానతో తడిసిన నేలకు పోల్చి, ఆమెను అస్పష్ట స్థితిలో వదిలి వేయకుండా ఆమె భావాల ఆర్ద్రతను, దాని విషాద స్వభావాన్ని చూపడం ద్వారా కథలో అనుభూతి తీవ్ర స్థాయిని చేరుకుంటుంది.

యశవంత చిత్తాల గారి కథల్లో క్రియాస్థలి సాధారణంగా ఉత్తర కన్నడ జిల్లాలోని హనేహళ్ళి బంకి కొడ్ల ఇంకా దాని చుట్టు పక్కల వున్న పల్లెల పరిసరాలకే పరిమితం (ప్రయణ లాంటి కథలు కొన్ని ఈ సూత్రానికి మినహాయింపు) వ్యక్తులు, ఆ పరిసరాలు మళ్ళీ మళ్ళీ వేరువేరు కథల్లో కనపడటంతో, వీరంతా మనకు తెలిసిన వ్యక్తుల, పరిసరాల కథ అని ఒక ఆత్మీయత కలుగుతుంది. మొదట్లో చిత్తాల గారు అంతఃకరణ చిత్రీకరణ, కొంతవరకు సాహితీ ప్రక్రియల ప్రయోగ విధానంలో మాస్తిగారి రచనా ధోరణికి దగ్గరగా వుండేలా రాసేవారు. కాని 'ఆట' సంకలనంలోని కథల్లో యశ్వంత చిత్తాల గారి ప్రత్యేకత ఎత్తి కనిపిస్తుంది. కళ, దాని తీరు తెన్నులు మాత్రమే

దృష్టిలో వుంచుకుని చెప్పాలంటే చిత్తాలగారు బహుశా నవ్య కథా రచయిత లందరిలోను శ్రేష్ఠులు. మృత్యువు కథా వస్తువుగా అయన చాలా కథల్లో తలెత్తుతుంది. కాని అది అయనలో అలోచన రేకెత్తించదు. తాత్వికమైన అన్వేషణా కాదు. కేవలం అశ్చర్యానికి కారణమైన విషయమది.

కాని 'సెరె' (దిగ్భ్రమ) కథలో చావు కాదు కథావస్తువు. 'కామం'. కామం కథావస్తువుగా కొత్తదేమీ కాదు. నిజం చెప్పాలంటే బాగా అరిగి పోయేవరకు వాడబడ్డ వస్తువది. కాని చిత్తాలగారి 'సెరె' (దిగ్భ్రమ) లో "అంతరంగమంతా నిండి హృదయాన్ని నొక్కివేసే కాముక ప్రవృత్తి ప్రవాహాన్ని నిగ్రహించే ప్రయత్నంలో పుట్టే సెగ, బిగి, పట్టుదల, తన మనస్సును అధీనంలో వుంచుకోవడానికి పోరాడే 'బర్మచారి దొర' ( బ్రహ్మచారి దొర) విఫల ప్రయత్నం, ఆ ప్రయత్నంలోని అసహజత, దాని అనివార్యమైన ఓటమి, ఇవి బయట జరిగే సంఘటనల్లో, ముఖ్య పాత్ర నడవడి, మాట తీరు, ధ్వనిలో చాల సహజంగా ప్రతిబింబించిన ఈ అద్భుతం కన్నడానికి క్రొత్తదనిపిస్తుంది" (గోపాల కృష్ణ అడిగ- "అట" సంకలనంలోని ముందుమాట) రామచంద్ర శర్మగారి "యారు హితవరు నినగె" ( అ ముగ్గురిలో అతనెవరు కథను దృష్టిలో వుంచుకొని "సెరె" (దిగ్భ్రమ) లో రచనల్లో కనిపించే పరిపక్వత, అనుభవాన్ని పరిశోధించే విధానాన్ని గమనిస్తే కథా సంవిధానంలో ఒక అభివృద్ధి పరిపక్వత ప్రస్ఫుటంగా కనిపిస్తాయి.

ఎ.కె. రామానుజన్ గారు కథా రచయితలుగా పేరెన్నిన వారేమీ కాదు. అయన ఈ మధ్య రాసిన రెండు కథల్తో కన్నడ కథానికల ప్రపంచంలో కొత్తదనాన్ని తీసుకొచ్చారు. "అణ్ణయ్యన మానవ శాస్త్రం"లోని శైలి కన్నడానికి చాలా విశిష్టమైనది. కథ సుసంబద్ధమైన తీరులోనే ఒక అసంబద్ధమైన స్థితిని చాలా సమర్థవంతంగా చూపెడుతుంది. అణ్ణయ్య తండ్రి చావు హిందూ ధర్మం చనిపోయిందన్న విషయాన్ని ధ్వనిస్తే అతని తల్లి వైధవ్యపు చిత్రం, అ చనిపోయిన దాన్నే నమ్మి జీవిస్తున్న వాస్తవ స్థితిలోని క్రౌర్యాన్ని, దాని అసంబద్ధ స్థితిని ధ్వనింప జేస్తుంది. దానితో బాటే అతని తల్లి వైధవ్య స్థితికీ, హిందూ ధర్మంలోని నిరర్థకాలైన ధర్మ సూత్రాల అధ్యయనం షికాగోలో చేస్తున్న అణ్ణయ్య స్థితికీ సంబంధాన్ని ఏర్పరిచే సూచన వున్నట్టే అనిపిస్తుంది. సుందరరావుకి హిందూ ధర్మం ఒక వ్యాపార సామగ్రి. సుందర రాయుని వ్యాపార బుద్ధిని అసహ్యించుకుంటాడు. కాని అణ్ణయ్య కూడా మౌలికంగా సుందర రాయుని కన్న భిన్నమైన వాడేమీ కాదు. సుందర్రాయుడు హిందూ ధర్మాన్ని అమ్మితే ఇక్కడ వేరే అర్థంలో అణ్ణయ్య దాన్నే కొంటున్నాడు. ఎంగిలి,

మలం అనేవి అశుభ్రం అని ధర్మ సూత్రాన్ని చదువుతున్న అణ్ణయ్యకు ఫెర్గూసన్ వ్యాఖ్యానం కూడా ఎంగిలే అని తోచదు. ఈ ఎంగిలి, మలాల పట్ల సంశయ బుద్ధిని చూపే అతను ఎంగిలి చప్పరిస్తున్న తన స్థితిని గురించి ఆలోచిస్తున్నట్టే కనిపించదు.

శాంతి నాథ దేశాయి గారిలో వ్యక్తుల మనస్సుల్లోని భావ పరంపరను చాలా సూక్ష్మంగా పరిశీలించాలనే కుతూహలం కనిపిస్తుంది. స్వంత ఆలోచనాత్మకమైన లేదా భావాత్మకమైన పూర్వ నిశ్చితాలైన వూహాలను కథ మీద వేయక, అనుభవపు పొరలను తటస్థమని పించే లాంటి భాష మరియు ఆలోచనల ద్వారా విడదీస్తూ తమ శిల్పానికి అమర్చుకునే తీరు ఆయనది. అనుభూతిని విశ్లేషించడంలో, సన్నివేశాలను చిత్రించడంలో కథకుడి సమర్థమైన ఆలోచనల ప్రాబల్యం కనిపిస్తుంది. కాని ఈ విశ్లేషణ, చిత్రీకరణ వీటి నైతికమైన లేదా తాత్వికమైన బాధ్యతను తీసుకోడానికి అది వెనుదీస్తుంది. లేదా దానికి ఆ కోరిక కూడా లేదు. అంటే చిన్న కథల మూలంగా వ్యక్తమయే దేశాయి గారి వ్యక్తిత్వం, బహుశః మొత్తం మీద జీవితానుభవాల్ని తర్కించి దాని ద్వారా ఒక దృఢమైన జీవన దృక్పథాన్ని పొందినది కాదు. విడి సన్నివేశాల్లోనే తన సృజనశీల చైతన్యాన్ని యుక్తంగా, ఆ పరిమితమైన ఆవరణలోనే సునిశితమైన నైపుణ్యాన్ని చూపెడతారు.

క్షితిజ (క్షితిజము) దేశాయిగారి కథల సందర్భంలో పేర్కొన్న హద్దుల్ని దాటి సఫలమైన కథ మాత్రమే కాక కన్నడంలో చాలా పేరుపొందిన కథల్లో ఒకటి. మిగిలిన కథల్లో లాగనే ఒక ప్రత్యేకమైన సన్నివేశం మరియు పరిస్థితుల వల్ల ఒక వ్యక్తి లేదా వ్యక్తుల ప్రవర్తనను కళాత్మకంగా చిత్రించడమే కాక అక్కడ విశ్లేషించబడిన అనుభూతికి ఒక సాంస్కృతిక ప్రాతినిధ్యం వుండేలా చిత్రించబడింది. ఒక సంస్కృతిలోని కట్టుబాట్లను వదిలించుకునే తీరుని ఒక ప్రత్యేకమైన వ్యక్తి మరియు వంశపు సందర్భంలో ఏ మాత్రం తొందరపాటు ఆవేశం లేకుండా ఈ కథలో చిత్రించారు. రచయిత మందాకిని మనసులోని సందిగ్ధాన్ని, లోపలి, వెలుపలి వివరాలు రూపొందించడంలో చూపించిన సంయమనం, నేర్పు చాలా ఉత్తమ స్థాయికి చెందినవి.

మాస్తిగారి తరువాతి కాలంలోని కథా రచయితల్లో యు.ఆర్. అనంత మూర్తిగారికి చాలా పెద్ద పేరుంది. మన, ఇతర రచయితల్లో కనిపించని గొప్ప ధ్యేయం ఆయన కథలకుంది. జీవిత అర్థాన్ని వెతకాలి! గుర్తించాలి అన్న మహత్వ కాంక్ష ఆయన కథల అడుగున కనిపిస్తుంది. అందుకనే ఏమో ఆయన కథలు సృజనాత్మకమైన సందర్భంలో తమ శక్తికి మించిన

దాన్ని సాధించే ప్రయత్నంలో వున్నట్లుగా కానవస్తాయి. దాని మూలంగా కథకుడు స్వీకరించే సవాలు కూడా మహత్వ పూర్ణమయినదే అయి వుంటుంది. సామాన్యంగా బ్రాహ్మణ కుటుంబ జీవనాల్లో, పల్లెటూరి పరిసరాల్లో గాని లేక దానికి సంబంధించిన క్రియాస్థలి అయన కథల్లో వుంటుంది. ('క్లిప్ జాయింట్' కథలో ఇంగ్లండ్‌లోనే కథ నడుస్తుంది గాని కేశవుని గతమంతా, కొంత వర్తమానం కూడా బ్రాహ్మణ పరిసరాల్లోనే ముఖ్యంగా రూపొందించ బడింది. ఈమధ్యనే వచ్చిన 'రూత్ మరియు రసూల్' మరియు 'ఆక్రమణ' ఈ సూత్రానికి లోబడవు). పరంపరాగతమైన విలువల్ని తీవ్రమైన పరీక్షకి గురిచేసే దృక్పథం వున్న అయన రచనలకు, బ్రాహ్మణ పరిసరాలు, బహుశ దాని గుణదోషాల దృష్ట్యా, ప్రమాణంలో కూడా ఎక్కువ చైతన్యంగా వుండడం కూడా దీనికి ఒక ముఖ్యమైన కారణం కావచ్చును. వేరే కులాల ఆడపిల్లల పాత్రలు-ముఖ్యంగా శూద్రుల ఆడపిల్లలు వస్తే పరంపరాగతమైన విలువల అవగాహనలోని అర్థహీనతను ఎత్తి చూపెట్టడం కోసం వస్తాయి. అందులోనూ ముఖ్యంగా కామం లేక ప్రేమ సంబంధమైన నీతి అవినీతులను వ్యాఖ్యానించడాని క్కావలసిన సమర్థన ఇవ్వడానికి జీవనోత్సాహపు చిహ్నాలుగా వస్తాయి.

అనంత మూర్తిగారి కథల్లో వచ్చే పరంపరాగత విలువల పరీక్షకు క్రియాస్థలియైన పల్లెటూరి పరిసరాల్లో అయన పరీక్షించే విలువలు, ఈకాలంలో చదువుకున్న వారి ప్రపంచంలో సర్వత్రా తమ ప్రాముఖ్యతను పోగొట్టు కుంటున్నాయి. అందువల్ల అధునికం అనిపించే ధోరణి వున్న రచయిత ఆత్మ విశ్వాసము, మరియు ఒక నిర్దుష్టమైన అభిప్రాయం కలిగిన పూర్వ సిద్ధత మరియు అవగాహనతో ఇటువంటి మూల భౌతిక పరిశోధన చేయవచ్చు. కాని ఇలాంటి పరిసరాల్లో పరంపరాగత విలువల పరిశోధనలో బౌద్ధికమైన సవాలు తీవ్రమైనది కాదు. (కన్నడంలో మరి ఏ ఇతర కథకుల్లోను కనిపించ నటువంటి శక్తివంతమైన ఆలోచనా మార్గాన్ని ఎన్నుకొన్న కథకుడు అనంత మూర్తి అన్న గ్రహింపు తోటే అయన రచనల ఉదాహరణ తీసుకుంటున్న సందర్భంలో ఈ మాట చెబుతున్నాను. ఎందుకంటే కథలోని అనుభవాన్ని నియంత్రించే బౌద్ధిక సిద్ధాంతం తీవ్రమైన పరీక్షకు లోనయ్యే సందర్భం అంతగా రాదు. ఈ లోపాన్ని నివారించడానికి గాను పరస్పర విరుద్ధమైన ధోరణి, జీవన దృక్పథం వున్న పాత్రల్ని విరుద్ధంగా నిలబెట్టే ప్రక్రియను అనంతమూర్తి గారు కొన్ని కథల్లో ప్రయోగించారు. (ఉదా: 'ప్రశ్నె', 'ఘటశ్రాద్ధ' అయన పేరు పొందిన నవల 'సంస్కార' లో ఈ ప్రక్రియను చాలా విజయవంతంగా వాడుకున్నారు) 'క్లిప్ జాయింట్'లో కూడా కేశవ్‌కి విరుద్ధంగా స్టువర్ట్‌ని చాలా

చక్కగా నిలిపారు. అక్కడి సమస్య మన తరతరాల నుంచి వస్తున్న విలువల పరిధికి లోబడని రెండు సంస్కృతుల విలువల పరిశోధన. కేశవుని ఆలోచనా ధోరణికి విరుద్ధంగా నిలబడే లేక కేశవుని ఆలోచనా విధానానికి ఇంకో ముఖంగా పోయే పద్ధతి, ఆ రకంగా కేశవ్ కథకుని ముఖవాణి కాకుండా చేసే ప్రయత్నం ఇక్కడ చాలావరకు ఫలించింది. కాని ఈ ప్రక్రియలోని మేధాశక్తి కొన్నిచోట్ల కరిగిపోకుండా నిలిచిపోయినట్టుగా అనిపిస్తుంది. అనంత మూర్తిగారి 'ప్రకృతి', 'కార్తీక', 'ఘటశ్రాద్ధ' లాంటి కథల్లో వున్న కళాత్మకత దీనిలో లేకపోయినా అనంతమూర్తి గారి కథల్లోనే కాక, మొత్తం కన్నడ కథల సందర్భంలోనే 'క్లివ్‌జాయింట్' చాలా మహత్వ కాంక్షతో కూడిన, చిన్న కథల ప్రక్రియలో తన జీర్ణశక్తిని పణమొడ్డిన కథ.

రాఘవేంద్ర భాసనీస గారు కూడా రామానుజన గారిలాగానే కథకులుగా పెద్ద పేరు తెచ్చుకున్న వ్యక్తి కాదు. ఆయన రాసిన కథల సంఖ్య ఎక్కువ కాదు. కాని ఆయన తబ్బరిగళు (నిరాశ్రయులు) కన్నడంలో పరిణతి చెందిన కథల్లో ఒకటి 'అణ్ణయ్యన మానవశాస్త్రం' లో అణ్ణయ్యలో ఒక అసంబద్ధత వుంది. కాని తెలివిగా విశ్లేషించి తెలుసుకోదగిన దానికన్న మించినలోతు, తీవ్రత లేదు. కాని తబ్బలిగళు కథలో చెల్లి, తమ్ముడు, తల్లి, తండ్రి, సంబంధాల్లో వుండే అనివార్య అసంబద్ధత, నిర్హేతుక స్థితి కథలో రూపొందే విధానంలో విషాదాన్ని చూపుతూ సాగే తీరు కొత్తగా వుంది. కథ మొదట్లోనే బస్సు చెడి నిల్చిపోడం అఖర్న రథం బురదలో కూరుకుపోయి మళ్ళీ పైకి లేవడం, చెల్లి రథానికి నిప్పంటుకున్నదని కేకలు పెట్టడం, ఒకర్నొకరు వెతకటం, దొరకడం, దొరక్కపోవడం - ఇలాంటి విషయాలన్నీ వాస్తవిక సంఘటనల్లో వివరాలుగా వుంటూనే సాంకేతిక చిహ్నాలుగా కూడా పని చేసి కథ యొక్క వ్యంజన శక్తిని ఎక్కువ చేసేలా వున్నాయి.

కె.సదాశివ గారు 'నల్లయల్లి నీరు బందితు' (1955) ' గిడ్డి' (19557) కథల మూలకంగా చాలా ప్రసిద్ధులైన నవ్య కథా రచయిత. ఆయన కథలన్నీ కలిపి పరీక్షించినట్టయితే సగం కథలు విడి కథలయితే, మిగిలిన సగం కథలు విరస దాంపత్యాలు, లేదా వివాహ పూర్వమైన అవాతమైన సంబంధపు సెగలో వేగుతున్న జీవితపు వివిధావస్థలను చిత్రించడం కనిపిస్తుంది. 'అనందగారు దాంపత్యపు' లేదా వివాహ పూర్వపు సంబంధాల్లోని సంతోషపు, లేదా విజయవంతమైన రూపాన్ని చూపితే సదాశివగారు దానిలోని ఓటమి బాధ ఘర్షణల రూపాన్ని చూపుతారు. ఇద్దరికి ఆయా రూపాల అనేకానేక భావభేదాల్ని సూక్ష్మాల్ని చాలా శక్తివంతంగా చూపే సామర్థ్యం వుంది. కాని

ఇద్దరూ దానితోనే సంతృప్తిపడి వూరుకుంటారు తప్ప, పరిపూర్ణమైన జీవితపు సందర్భంలో వాటి అర్థాల్ని విశ్లేషించి, తాత్విక విస్తృతిని ధ్వనింపజేసే ప్రయత్నం చేయరు.

'రామన సవారి సంతెగె హోదద్దు' ( రాముడి సవారి సంత కెళ్ళినపుడు) కథలో కె. సదాశివగారి రచనల్లో కనిపించే క్రమనిర్మాణ రీతి వుంది. దాంపత్యంలోని విరసం విభేదం కూడా వుంది. కాని ఆయన రచనల్లో సామాన్యంగా కనిపించని మరికొన్ని అంశాలు కూడా కనిపిస్తాయీ కథలో. (1) ప్రత్యేకమైన ప్రక్రియ ఏదీ ఉపయోగించకుండా తిన్నగా కథ చెప్పే విధానం వుంది. (2) వస్తువు దృష్ట్యా చూస్తే జీవనోత్సాహం నిండిన అబ్బాయి దృష్టికే ప్రాధాన్యత నిచ్చి, పెద్దవాళ్ళ బ్రతుకులోని విరసాన్ని నేర్పుగా విడదీసి చూపడం కనిపిస్తుంది. (3) సరదా అయిన సులభశైలి వుంది. మొత్తంమీద సదాశివగారి రచనల్లో కొత్త గుణాలు వచ్చే అవకాశాన్ని కథ సూచిస్తుంది.

టి.జి.రాఘవగారి చిన్న కథల్లో సామాజిక సందర్భాల్లో అంగీకరింప బడని వ్యక్తికి ఏకాంతంలో కలిగే ఆలోచన, ఆశానిరాశల్లో కొట్టుమిట్టాడే అస్వస్థత, పరకీయ, దుర్బల నాయకులే ఎక్కువ. " తన మనసులోని ఆలోచనల్ని ఇంకొకరికి చెప్పుకో లేని, పరస్పర అవగాహన దెబ్బతిన్న ప్రపంచం ఆయనది. అందువల్ల పరస్పర సంభాషణ వల్ల పుట్టే నాటక క్రియకు బదులుగా స్వగతంలో నడిచే ద్వంద్వం యొక్క నాటకమే ఈయన కథావస్తువు." (యు.ఆర్.అనంతమూర్తి) - హదినైదు వర్షగళ నవ్య గద్య సాహిత్య) ఇలాంటి అనుభవాలకు రూపాన్నిచ్చే టప్పుడు చైతన్య స్రవంతి ప్రక్రియను చాలా ఎక్కువగా, విజయవంతంగా వుపయోగిస్తారు. ఈయన కథల్లో వస్తు వైవిధ్యం తక్కువ కాని చెప్పే విషయాన్ని తరచి తరచి తీసి చూపిస్తారు. ఈయన "శ్రాద్ధ" (శ్రాద్ధం) కథలో "వస్తువు భావం వేరే వేరే కాదు. వర్ణన వేరే కాదు. అంతా కలిపే కథ నుడుస్తుంది. రెండోది ఏమిటంటే మనం ఏ వాత్సల్యాల నయితే పరమ మౌల్యాలని అనుకున్నామో వాటిని ప్రశ్నించి, గుచ్చి పరిశీలించే కుతూహలం, ధైర్యం ఇక్కడ కనిపిస్తుంది; మూడవదిగా బట్టలు తీసే ఆశలో, పనిలో పూర్తిగా నిమగ్నమై మిగిలిన వారి అధికారాన్నుంచి బయటపడి పారిపోవాలన్న ఆశ చాలా సంగ్రహంగానూ, సమర్థకంగానూ వ్యక్తీకరింపబడింది; నాలుగవదిగా, తండ్రి అధికారం, నియంతృత్వం, ఉపాధ్యాయ వృత్తికి సంకేతమై, కొడుకు వాటి నుంచి తప్పించుకుని తన ప్రత్యేకతను పెంపొందించుకునే స్వాతంత్ర్యానికి సంకేతమవుతాడు. వీటన్నిటితో బాటే 'శ్రాద్ధ' కథలో చాలాకాలం నుంచి వస్తున్న ఆచారాన్ని పరీక్షించే, మరియు ఆ ఆచారం పట్ల

గల ద్వంద్వమైన భావాల్ని నిలబెట్టుకునే తీరు గమనార్హం". పి. లంకేశ్ గారి (కళెద ఇప్పత్తు వర్షగళ సణ్ణ కథె - ఎరడు ఘట్టగళు) ఈ మాటలు కథ ప్రాముఖ్యతను చాలా సంక్షిప్తంగా వివరిస్తాయి. అయినా మొత్తంమీద "కొన్ని రచనల్లో కనిపించే అనవసరమైన రోషంలో పుట్టి తీవ్రత మూలంగా రాఘవగారు తమ కథా-వస్తువైన బాల్యంలోని దౌర్బల్యాలకు అనవసరమైన ప్రాముఖ్యత ఇస్తారు" అన్న అనంతమూర్తిగారి విమర్శలోని మాట మర్చిపోవటానికి వీల్లేదు.

పి.లంకేశ్ గారు పీడన, హింసలను గీటురాయిగానూ, రచనా ప్రక్రియగానూ కూడా వాడుకుని, వ్యక్తిలోని ఊసరవెల్లితనాన్ని లేక వ్యక్తిలో నిద్రాణమై, అతను కూడా గుర్తించని అనుభవంలోని పగుళ్ళను, అల్పత్వాన్ని ఒక్కొక్క పొర్రే విప్పుతూ లోపలి సత్యాన్ని నగ్నంగా కాని, లేక పైకి కనిపంచే వ్యక్తిత్వాన్ని దాని మృత స్థితిలో కాని చూపి భయపెట్టటానికి 'షాక్' ఇచ్చే ప్రయత్నం చేస్తారు. రెండోదిగా, ప్రస్తుతం జరుగుతున్న సంఘటన, వ్యక్తి ఎదురు బదురైనప్పుడు నిజం బయటకు వస్తుందన్న భావన లంకేశ్ గారి రచనల వెనుక వున్నట్టుగా తోస్తుంది. అందువల్ల గతం, తరతారాల్నుంచి వస్తున్న ఆలోచనలు వీటి మధ్య పెద్ద ఘర్షణ లేని మనోస్థితిలోనే వ్యక్తి క్రియ, ప్రతిక్రియలు నిర్ధారింపబడతాయి. మూడవదిగా గాఢమైన మానవ సంబంధాలే ఈయన కథలో ఎదురుపడవు. తల్లి, తండ్రి, అన్న, అక్క, చెల్లి, తమ్ముడు, స్నేహితుడు, మరోవ్యక్తి - వీరిలో ఒకరికింకొకరి గురించిన ఆత్మీయ సంబంధాల ఋణానుబంధాల గొడవే వుండదు. అందువల్ల లంకేశ్‌గారి కథల ద్వారా వ్యక్తమయ్యే మనఃస్థితికి మానవుడి మనస్సులోని ఆప్తమైన క్షణాలకు, ఉదాత్తమైన భావాలకు స్పందించలేని శూన్యత కనిపిస్తుంది. ఇలాంటి రచనకు విషాదాన్ని అర్థం చేసుకునే శక్తి వుండదు. అందువల్ల మనిషిలోని అల్పత్వం, ఊసరవెల్లితనం వీటిని తరచి చూపెట్టటంలో రచయిత నైతికమైన ఆలోచన కూడా నిజమయినది కాదేమోనన్న అనుమానం మనకు పలుచోట్ల కలుగుతుంది. మాస్తిగారి కథల్లో కూడా మనకు నైతికమైన లేదా ధార్మికమైన చింతన కనిపిస్తుంది. కాని అయనది మనిషి మనస్సు ఎంత ఉదాత్తంగా ఉండగలదో చూపుదామన్న తపన కనిపిస్తుంది. అందువల్ల మనిషిలోని అల్పత్వం, అధార్మిక లక్షణాలన్ని కించపరిచి చిత్రించడం కనిపిస్తుంది. లంకేశగారి రచనల్లో దీనికి విరుద్ధంగా మనిషిలోని ఉదాత్తత, పెద్దమనిషి తరహాను అనుమానం, అపనమ్మకాలతో చూపే ధోరణి కనిపిస్తుంది. ఈ రెండు రకాల వైఖరులు వాటికి సహజమయిన అనుభవంలోని ఒక ముఖానికి

ఇచ్చే ప్రాముఖ్యత, ఇంకో ముఖానికి చూపే నిర్లక్ష్యము లేదా ఉదాసీనత మూలంగా వాటికే పరిమితమయిన పరిధులకు లోనవుతాయి. తాత్త్వికమైన సిద్ధాంతాలను ధ్వనింపచేయటానికి ప్రయత్నించినపుడు, ఈ రెండు రకాల ధోరణుల మూలంగా రూపొందే అనుభవాలకు తగిన ఆలోచనా శక్తి కొరవడటంతో అవి ఓటమి చెందుతాయి.

లంకేశ్ గారికే ప్రత్యేకమయిన, ఇదివరకే మనం గుర్తించిన ధోరణి మూలంగా, ఆయన రచనా విధానం అననుకరణీయం అనే లాంటి ప్రత్యేకతను పొంది వుంది. లంకేశ్ గారి రచనల్లోని ఇక మిగిలిన లక్షణాల్ని కలిగివున్న నివృత్తరు (నివృత్తులు) కథలో రెండు అంశాల్లో భేదం కనిపిస్తుంది.

(1)ఇక్కడ మనిషిలోని అల్పత్వం పట్ల కనిపించే రచయిత నైతిక చింతన. ఆయన వేరే కథల్లోలాగా వేత్యాత్మక మనిపించకుండా, విషాదపు ఛాయలు శక్తివంతంగా చేరి ఉండటంవల్ల, గుణాత్మకమై వుంది.

(2) తాత్త్విక విస్తృతిని పొందించుకునే ప్రయత్నం, ఆయన మరింకే కథలోని కనిపించని అంతర్ముఖత, గుణాత్మకమైన నిరపేక్షత ఈ కథలో కనిపిస్తుంది.

కె.పి.పూర్ణచంద్ర తేజస్వి గారి మొదటి కథా సంకలనం 'హులియూరిన సరహద్దు' లోని కథ ఏదైనా నిర్దిష్టమైన ధోరణిని ప్రతిబింబించే కథలు కావు. అవి విడిగా ఉన్న కథలు. కాని ఒకటి చెయ్యబోతే మరొకటి అయ్యే, లేదా మోసపోయే అంశం ఒకటి అన్ని కథలలోనూ కనిపిస్తుంది. ఇదే అంశం 'అబచూరిన పోస్టాఫీసు' అనే ఇంకో సంకలనంలో, ఆ పేరు గల కథతో కలుపుకుని సుమారు సగం కథల్లో కనిపిస్తుంది. తేజస్విగారి ఔచిత్యమయిన, హాస్యపూరిత రచనాశైలి దాని స్వారస్యాన్ని హెచ్చరిస్తుంది.

ఇటీవల వచ్చిన కథా సంపుటి "అబచూరిన పోస్టాఫీసు" లోని కథలు చిన్న కథల ప్రక్రియలో కొత్త దారిని చూపే, కొత్త రూపాన్ని పొందే ప్రయత్నంలోంచి వచ్చిన కథలు. "కన్నడంలో నవ్య సాంప్రదాయాన్ని మనం పూర్తిగా వదిలివేసి కొత్త మార్గంలో మనం ఇప్పుడు అన్వేషించాలి". "సరళంగా, తిన్నగా చూసే, కేవల దృష్టి కోణం మాత్రమే సాహితి కథల్లో వ్యక్తమయ్యే ఓ కొత్త తీరును, శైలిని నేను అలవాటు చేసుకోవాల్సి వచ్చింది. దీనికి ఒక కారణం నేను మన గ్రామాల్లో కేవలం ప్రేక్షకుడిగా ఉండాల్సి రావటం". " ఈ నవ్య మార్గాన్ని త్యజించడమే కాక, దాని స్ఫూర్తి కారకాలను, దాని వ్యక్తీకరణ ప్రక్రియలనూ, విలువలనూ అన్నింటినీ త్యజించాలి అంటే రాజకీయంగా, సాంఘికంగా, తాత్వికంగా సమగ్రమైన మార్పు కలగటం ద్వారా మాత్రమే నిజమైన కొత్త సాహిత్యం ఉద్భవిస్తుంది." - ఇలా తేజస్విగారు

తమ "అబచూరిన పోస్టాఫీస్" కథా సంకలనపు " హొసు దిగంతద కడెగె" అనే శీర్షిక వున్న ముందు మాటలో ఘోషించారు. ఈ మాటల్ని సమర్థించు కోవటానికి ఆయన నవ్య సాహిత్యాన్ని గురించి తీసుకుని వచ్చే సాహిత్యానికి సంబంధించిన మరియు సాహిత్యేతర అంశాల్లో కొన్ని తప్పు అభిప్రాయాలు వున్నాయి కాని చాలా ముఖ్యమైన నవ్య సాహితీ కారుల్లో ఒకరైనా ఆయన ఘోషణ వెనక వున్న సృజనాత్మకమైన ప్రేరేపణను కొట్టివేయలేరు. ఇటీవలి సంవత్సరాల్లో నవ్యసాహితీకారుల్లో ప్రముఖులైన వారిలో చాలా మంది ఏదో ఒక తీరులో - ధ్యాసము, ఉపన్యాసము మరియు సృజనశీల ప్రయోగాల ద్వారా - నవ్యసాహిత్యపు ఎల్లలను విస్తరించి, దాని మూలంగా కొత్త కాంతిని విరజిమ్మే ప్రయత్నాలను చేస్తూనే ఉన్నారు. అయినా కొత్త రచనల సాధారణం అనదగిన సడలింపులేని ఆత్మగత రచన మరియు ఆలోచనా భారం వీటి పరిమితులనుంచి బయట పడి వేరే ప్రక్రియలను అన్వేషిస్తూనే,జీవితానికి అంచున నిలబడి ఛాయా చిత్ర గ్రాహకుడిలా ఓ ప్రత్యేకమైన దృష్టి కోణంలో జీవితాన్ని చూపే ప్రక్రియలో కథకుడు తన అవగాహనా శక్తిని ధ్వనింపచేసే రచనలు అని తేజస్విగారి 1972 తరువాత వచ్చిన కథల్ని చదివితే అనిపిస్తుంది.

ఆ దిశలో చేసిన మొట్టమొదటి ప్రయోగం 'అబచూరిన పోస్టాఫీసు' అన్న కథ. అది నవ్య కథల్లో సామాన్యంగా కనిపించే కథ తిన్నగా నడిపే రీతిలోనే సాగుతుంది. ఆ సంకలనంలో మిగిలిన కథలూ అంతే. 'అబచూరిన పోస్టాఫీసు' అన్న కథ మిగిలిన అభ్యుదయ రచనల కన్నా ఏ రకంగా భిన్నమైనది, ఆ సంకలనంలోనే 'తబరన కథె' ప్రగతి మార్గపు కథలకన్నా ఎలాగా భిన్నమైనది అని ప్రశ్నిస్తే జవాబు చెప్పడం అంత తేలిక కాదు. ఆ సంకలనంలోని 'అవనతి', 'కుచిమత్తు ఇయాలా', 'తుక్కోజి' లాంటి కథలు వరుసక్రమంలో చుట్టూ వున్న ప్రపంచంలోని కోరిక, నమ్మకం మరియు నాగరకతలో వాంఛ - వీటికి వ్యక్తిలోని ప్రతిభ, బుద్ధికుశలత, వ్యక్తిగతమైన పాట్లకూ ఉండే సంబంధాన్ని చూపే రీతి వున్న రచనలు. మాస్తిగారి 'మొసరిన మంగమ్మ' లాంటి నవోదయ పథానికి చెందిన కథకూ తేజస్విగారి ఇటువంటి కథలకూ వైఖరి దృష్ట్యా వున్న మౌలికమైన తేడా ఏమిటి అని ప్రశ్నించినా జవాబు అంత సులభం కాదు. ఇలా ఇంకా అడగ గలిగిన ప్రశ్నల్ని పెంచుకోకుండా, ప్రారంభావస్థలో వున్న కొత్త ప్రయోగాల్ని సానుభూతితో అర్థం చేసుకోవటానికి ప్రయత్నించడం అన్ని విధాలా అపేక్షించ దగిన విషయము.

4

పూర్ణచంద్ర తేజస్విగారికన్నా, చిన్న వయస్సులో వున్న అనేకమంది

రచయితలు చిన్న కథల్ని రాస్తున్నారు కాని జి.ఎన్ సదాశివ, రాజశేఖర నీరమాన్వి, వీణా ఎలబర్గి, శ్రీ కృష్ణ ఆలనహాళ్ళి మరియు దేవనూర మహాదేవ - ఈ అయిదుగురి కథల్ని మాత్రమే ఇక్కడ చేర్చాను. ఈ అయిదుగురూ ఇప్పుడే సూ. రమాకాంత. రామచంద్రదేవ మొదలైన కథకులకన్నా ఎక్కువ ప్రాముఖ్యత వున్న కథకులన్న అభిప్రాయం ఈ ఎన్నికకు కారణం కాదు. అల్లాంటి విమర్శనాత్మకమైన అభిప్రాయం వ్యక్తపర్చటానికి ఇంకా కొంతకాలం మనం వేచి వుండాలి. ఎందుకంటే ఒకరినొకరు మించి వీరు అభివృద్ధి చెందే అవకాశం ఎక్కువగా వుంటుంది. ఇక్కడ ఎన్నుకొన్న కథలు నవ్యోత్తరము(!) అనదగిన తరం కథా రచయితల వేర్వేరు రీతులను స్థూలంగా ప్రాతినిధ్యం వహిస్తున్నాయని నాకు అనిపించటమే ఈ ఎన్నికకు కారణము.

జి.ఎన్ సదాశివగారి అన్ని కథల్ని స్థూలంగా పరిశీలిస్తే మనిషి- మానవ సంబంధపు నిజాన్ని విభజించి చూసే నిరంతరాన్వేషణలోని ప్రత్యేకమైన భాగాలుగా కనిపిస్తాయి. ఏ వొక్క కథలోనూ మానవ సంబంధాలను గురించి తాత్వికమైన సందేశాన్ని ఇవ్వటం కనిపించకపోయినా, అన్ని కథల్లోనూ బయటపడే నిజాలు మానవ సంబంధాల్లోని విషాద యోగంలోని వేర్వేరు అధ్యాయాల్లాగా వున్నాయి. ఆసక్తి కలిగించే కథ, కుతూహలాన్ని పుట్టించే సంఘటన,, అలంకారయుతమైన భాష - ఇలాంటి సాంప్రదాయికమైన ప్రక్రియలను ఉద్దేశ పూర్వకంగానే నిరాకరించి, మనిషి మనస్సులోని లయగతులను అనుసరించి సాగే, స్వగతం రీతిలో నడిచే సదాశివగారి రచనారీతి చాలా విశిష్టమైనది. అందువల్ల ఇలాంటి కథలను తన మనస్సు ఒప్పుకోవటమే ఓ సమస్య అయి, పాఠకుడు ముందు ఆ సమస్యను పరిష్కరించుకోవాల్సి వస్తుంది. సదాశివగారి "హ్యాంగోవర్" స్వగతంగా చెప్పిన కథ కాదు. కథలోని వివరాలు, మాటల అర్థం పాఠకునిలో ఆసక్తిని రేకెత్తించి, ఆ వ్యంగ్య ధ్వని వేపు పాఠకుల కుతూహలాన్ని మళ్ళించే ప్రయత్నం మెచ్చదగినది.

రాజశేఖరవీరమాన్వి ఇంతవరకు రాసినవి రెండే కథలైనా అనుభవాల్ని తాత్వికమైన మరియు ఆలోచనా చట్రంలో పెట్టి చూడాలన్న వాంఛాపూరితమైన రచన ఆయనది. "హంగినరమనెయ హొరగె" (కట్టుబాట్ల కోట బయట) కథలో ఆసుపత్రిలో రోగిగా, శస్త్ర చికిత్స కోసం కాచుకున్న కథానాయకుడి అంతరంగంలో అక్కడ జరిగే సంఘటనలు, వ్యక్తుల క్రియ - ప్రతిక్రియలు, ముద్రపడే, వ్యాఖ్యానింపబడే రీతిలో రచన వుంది. ఆ సమయంలో అతడు సినికల్‌గా అవడం, తాత్వికమైన ఆలోచనా ధోరణి చూపడం, భావాతిరేకానికి

లోనవడం -వీటిలో గంభీరం అనిపించే ధ్వని వుంది కాని, అవన్నీ కథానాయకుని గతంలోని అనుభవాల్ననుసరించి వున్నాయి కనుక, ఒకటి ఇంకొకదాన్ని తీసిపారేస్తూ ఉద్వేగ భరితమయిన అతని మనసులోని అస్థిరతను సూక్ష్మంగా సూచించేలా వున్నాయి. అతడి రోగం, దానిక్కావల్సిన శస్త్రచికిత్స, ఆస్పత్రి, వీటిని కేవలం విషయాలుగా చూడకుండా, వాటికి కథ సందర్భంలో కలిగే సాంకేతికమైన అర్థాన్ని కూడా గమనించాలి. అప్పుడతని దైపాక ఆరోగ్యానికి సంబంధం చూపెట్టే ప్రయత్నం అర్థమౌతుంది. కథానాయకుని కథను నిరూపిస్తున్న ప్రక్రియ మూలంగా కథలోని అనుభవం, ఆలోచనా, వ్యాఖ్యానాలను వ్యంగ్యాలోచన ద్వారా వెలకట్టడం సరైన ప్రమాణంలో జరగలేదనిపిస్తుంది.

చిన్న కథా రచయిత్రుల సంఖ్య, వారు రాసిన కథల సంఖ్య హెచ్చుగానే వుంది, కాని కన్నడంలో చిన్న కథల చరిత్రను సాహిత్యపరమైన దృష్టితో చూసినపుడు మహత్వ పూర్ణమనిపించే ప్రత్యేకత చూపినవారెవరూ లేరు. ఉన్న వారిలో కొంత నమ్మకం, ఆశ కలిగించిన ఇరవయ్యేడవ ఏట చనిపోయిన కొడగిన గౌరమ్మ (1912 - 1939) ముప్పయి అయిదేళ్ళకే చనిపోయిన త్రివేణి(1928 -1963) నవ్య కథల ప్రారంభ కాలంలో తమ సంగమ కథాసంకలనం ద్వారా కొంత ఆశ చూపిన రాజ్యలక్ష్మీ ఎన్. రావ్ మరియు వీరికన్న యువతరానికి చెందిన వీణా ఎంబుర్గి గారి పేర్లను ఇక్కడ మనం చెప్పుకోవచ్చును. కథలోని వస్తువు, విశ్లేషణ వీటిలో - మన రచయిత్రులను దృష్టిలో పెట్టుకుంటే - అపూర్వమనిపించే ధైర్యమే వీణాగారి కథల్ని ఆసక్తితో చదివేలా చేస్తుంది.

సామాజికమైన మౌలిక వ్యవస్థ పట్ల సాధారణంగా తిరుగుబాటు ధోరణికల ఈమె కథానాయికలు బాధా తప్తులు అసంతృప్తులు. వారి మానసిక స్థితి యొక్క అన్వేషణ వీణాగారి కథల్లో ప్రధానంగా వుంటుంది. ఈ ప్రక్రియలో ఆమె సంప్రదాయం లేదా ఆచారం గురించి ఏ మాత్రం పట్టించుకోరు. స్త్రీల గురించి, విధవ, వేశ్య, అత్తలు పెట్టే బాధలకు - లేదా భర్త నిర్లక్ష్యానికి గురైనది, కారణాంతరాల వల్ల కాలు జారినది, విరహిణి - ఇలాంటి స్త్రీల పట్ల సానుభూతి కలిగించే లేదా వారి ఆదర్శం, నిష్ఠల పట్ల ఆరాధన కలిగించే కథలు మన చిన్న కథల్లో చాలానే కనిపిస్తాయి. అందులోనూ స్త్రీల రచనల్లో ఇది మరీ ఎక్కువ. ఈ విధమైన వస్తువు మరియు వైఖరికి విరుద్ధమైన దిక్కులో స్త్రీ మనస్సును పరిశీలించే వీణాగారి కథలు సంప్రదాయిస్థులకు ఆందోళన కలిగిస్తాయి. "కొనెయదారి" (ఆఖరిదారి) అలాంటి కథల్లో ఒకటి.

రెండవదిగా, ఎప్పుడో, ఏదో కారణం వల్ల మనస్సులో నిలిచిపోయిన పురుషుడు, అతని గురించిన జ్ఞాపకాలు, ఆకర్షణ మనస్సును కదిలించే విషయం వీణాగారి కథల్లో తరుచూ కనిపిస్తుంది. " కొనెయ దారి" కథ అలాంటి మిగిలిన కథల తీరులోనే వుందని చటుక్కున చెప్పలేము కాని శంకర గౌడ పట్ల ఆమె కున్న ఆకర్షణలో ఈ అంశం తప్పక వుంది. మూడవదిగా, కథానాయికల భర్తలంతా చాలా సాధువైన మనుష్యులు. ఏ విషయంలోనైనా భార్య ఇష్టానికి - అది విచిత్రమనిపించినా - వ్యతిరేకాన్ని సూచించరు. 'కొనెయదారి' కథానాయిక మొదటి భర్త చెడ్డవాడన్న 'సూచన' వుంది కాని, అప్పటికి కథలోని నాయిక 'కొత్త వ్యక్తి' కాలేదు. రెండవ భర్త కానున్న శంకర గౌడ వీణాగారి కథల్లో వచ్చే మిగిలిన భర్తల్లాగానే వున్నాడు. నాలుగవదిగా, ఉన్నదానిలో సుఖం కనిపించకుండా లేని దాని కోసం తపించి, ఆ కారణంగా మనస్సు పాడుచేసుకునే కథానాయికలే అందరూ. 'కొనెయదారి' లోని నాయికా అలాంటిదే. ఈ కారణాల మూలంగా 'కొనెయదారి' వీణాగారి కథలకు ప్రాతినిధ్యం వహిస్తుంది. పైన పేర్కొన్న అంశాల 'ఫార్ములా' ల పరిధి దాటి జీవితాన్ని గురించిన గంభీర దృష్టి, కళాత్మక తృష్ణ నిరూపించటం ద్వారా సాహిత్య దృష్టి లో మహత్వమనిపించదగిన కథల్ని వీణాగారు ఇంకా రాయాల్సి వుంది.

శ్రీకృష్ణ ఆలనహళ్ళి గారి కథల్లో జీవితం పట్ల అమితమైన ప్రేమ వుంది. వారి తరంవారు జీవితానుభవాలు తమను ప్రభావితం చేయటాన్ని చూపకుండా ఉండలేరు. వ్యతిరేకత పట్ల విపరీతమైన సంకోచాన్ని పెంచుకుని, జీవితంలో పండిన వేషం వేస్తున్న ఈ రోజుల్లో శ్రీ కృష్ణ గారికి జీవితం పట్ల గల ప్రేమ చాలా ప్రముఖమైన లక్షణంగా కనిపిస్తుంది. రెండవదిగా, చాలా కొత్తది అనే లాంటి జీవితానుభవం ఆయన కథల ద్వారా ధ్వనించదు కాని, వారు చిన్న కథల ద్వారా చెప్పదల్చుకున్న దానిని చక్కటి నిర్మాణశిల్పానికి అమర్చే పద్ధతి మనస్సును ఆకర్షించేలా వుంటుంది. సంబంధం కొంచెం హెచ్చూ తక్కువగా నవేదయ కథల్లాగానే పాఠకుల అంతఃకరణాన్ని కదిలించే కథ. కథలోని సంఘటనల కూర్పులో సరళమైన విధానం వుంది అనిపిస్తుంది కాని కథ ధ్యేయాన్ని సాధించడంలో కథ విజయవంతమయినది.

దేవనూర మహాదేవ గారు, తేజస్విగారి లాగానే, 1972 తర్వాత రాసిన కథల్లో, నవ్య కథల రీతి, మరియు వైఖరులకు చెందని మార్గాన్ని వెతికే ప్రయత్నంలో వుండటం స్పష్టంగా కనిపిస్తుంది. కథకుడు తటస్థంగా నిలబడి కథను నిరూపించటం, సాంఘిక దృష్టి కోణం నుండి కథలో సాగే సంఘటనలకు,

వివరాలకు అర్థాన్ని కల్పించడం- ఇలాంటి కొన్ని అంశాల్లో తేజస్వి, మహాదేవ గారి కథల్లో సామ్యం ఎక్కువగా కనిపిస్తుంది. కాని మహాదేవ గారు పల్లె ప్రాంతాల భాషను కథను నిరూపించడానికి వాడుకొనడమే కాక, ఆ భాషకే సాధ్యమైన భావ వ్యక్తీకరణ ప్రక్రియల పరిశోధన అనన్యమైన తీరులో సాగించడంలో చాలా ప్రత్యేకతను చూపుతారు. రెండవదిగా ఆర్థికంగా, సాంఘికంగా క్రింద స్థాయిలో వున్నవారు, పై స్థాయిలో వున్నవారి చేతుల్లో తమకు జరుగుతున్న అన్యాయం గురించిన జ్ఞానమే లేక దానికి బలి అవుతున్న, అది తెలిసినా ఏమీ చేయ్యలేని నిస్సహాయతను అంగీకరించి కాలం గడిపే, మహా అయితే తాగిన మత్తులో వున్నప్పుడు, అంటే అజాగృత మనఃస్థితిలో వుండగా మాత్రమే, దానిని మాటలతో, పరోక్షంగా ప్రతిఘటించి, ఊరుకునే ప్రజల జీవితం, ఆలోచనల వెనక వున్న విషాదపు లయ గమనాన్ని భావోద్వేగానికి లోను కాకుండా మన ముందు పెట్టే మహాదేవ గారి రచనా శైలి చాలా విశిష్టమైనది. "అమాస" లో కురివయ్య జీవితమే అమాసలో కూడా పునరావృత మవుతున్న సూచనతో కథ ముగించడంలో అన్యాయ చక్రపు పునరావృతాన్ని సూచిస్తున్నట్లుగా అనిపిస్తుంది. ఈ సూచనలో వున్న విధ్యర్థక మైన ధ్వని రైల్వే గ్యాంగ్‌మన్ సిద్ధప్ప తాగిన మత్తులో వాగే మాటల నేపథ్యంలో గమనించి నప్పుడు కథకుడు నియంత్రించటం ద్వారా అమాసుడి జీవితపు మరో సాధ్యతను చెప్పకనే చెప్పుతున్నట్టని పిస్తుంది.

5

సాంఘికమైన సభ్యతా సంస్కారాల చట్రంలోనే కోరుకున్న పరిణామాలను, అందంగా నవోదయ రచయితలు సాధిస్తారు. సాంఘికంగా అంగీకరింప బడిన విలువలు, ఆదర్శాల పట్ల శ్రద్ధను ఇనుమడింప జేయటం వారి ఆశయం కావటమే దీనికి కారణం. వారికి సమాజం, దాని మౌలికమైన ఆదర్శాల పట్ల కోపం గాని, విరోధం కాని లేదు. విషాదం లేక దుఃఖానికి గురైన వ్యక్తి పట్ల సానుభూతి, దానికి కారణమైన వ్యక్తి లేదా వర్గం పట్ల సాత్వికమయిన కోపం లేదా దుఃఖం కనిపిస్తుంది. మొత్తం సమాజాన్నివాటి విలువలు, ఆదర్శాలను బాధ్యులుగా చేసి, అపరాధి స్థానంలో నిలబెట్టే రోషం ఇక్కడ వుండదు. అశ్వత్థ గారి 'ధర్మకొండద కథె' లాంటి కొన్ని కథల్లో ఈ అంశపు ఛాయ కనబడుతుంది, కాని అభ్యుదయ ధోరణిలో వున్న నిరంజన గారి కథ 'కొనెయగిరాకి ' (ఆఖరి గిరాకి) తో పోల్చి చూస్తే ఈ తేడా స్పష్టంగా కనిపిస్తుంది. వారి ఉద్దేశంలో వ్యక్తి యొక్క నైతిక, ధార్మిక ఆధ్యాత్మిక శ్రద్ధ, నమ్మకాలు తమ మీద పడే ఎటువంటి లౌకికమైన ఒత్తిడికి లొంగని

ఓర్పు కలిగినవి. ఓరిమి ఇంక సాధ్యమే లేదు అన్నంత, అసహనీయమైన ఒత్తిడి పై నుండి వచ్చినా, రాజీపడక చావు మూలంగా నైనా సరే - తన నమ్మకం, ఆదర్శాలను స్థాపించే వైఖరి కనిపిస్తుంది. ఈ కథల్లోని దుఃఖాంతము కూడా బాధ భయాల కన్నా నైతిక, ధార్మిక, అధ్యాత్మిక విలువల గొప్పదనం, శాశ్వతత్వాల పట్ల మన శ్రద్ధను, ఆరాధనా భావాన్ని హెచ్చించేలా వుంటాయి. అది వ్యక్తి, అతను నమ్మిన విలువల గెలుపు అనిపిస్తుందే కాని నిజమైన విషాదాంతం అనిపించదు.

1940 ప్రాంతాల్లో ప్రారంభమయిన అభ్యుదయ రచనల వైఖరి అది కాదు. సమాజంలో పైకి కనిపించే ఆచార విచారాలన్నీ కూడా కపటము. పైకి మర్యాద, సభ్యతల పేరుతో కనిపించేది నిజం కాదు. వాటిని బయటకు లాగటం ద్వారా సమాజపు క్రూరమైన నిజరూపం కనిపిస్తుంది. సమాజం యొక్క ఆర్థిక, నైతిక, సాంఘిక వ్యవస్థలు దీన దళిత వ్యక్తి లేక వర్గాన్ని మానవతా భావంతో చూడక క్రూరంగా చూసేలా వున్నాయి. ఆ క్రౌర్యపు ఒత్తిడికి తట్టుకోలేని దీన దళితులు, వారి నమ్మకాలు, ఆదర్శాలు దాని కోరల్లో చిక్కి నాశనమవుతాయి. సామాజిక న్యాయం దొరకాలంటే సాంఘిక వ్యవస్థ మారాలి - అన్నది వారి నమ్మకం. ఆ విషయంలో వారు చూపే బాధ చాలా తీవ్రమైనది. అందువల్ల మానవతతో కూడిన సానుభూతి క్రోధమై, రోషంగా మారిన మానసిక స్థితిలోనే వారు కథలు రాస్తారు. సమాజాన్ని బల, బలహీన వర్గాలుగా విభజించి చూడటంలో వీరు మార్క్స్ వాదం నుండి ప్రేరేపణ పొందినా, మొత్తం సమాజపు మౌలికమైన మార్పుల గురించిన విషయాల్లో చాలా సరళమైన ధోరణిని చూపెడతారు. అభ్యుదయ వాదుల విలువలు, ఆదర్శాలు, మౌలికంగా పరంపరాగత ఆదర్శాలు విలువకన్నా భిన్నమైనవి కావు. వారి కథల తీవ్రత అప్పుడప్పుడూ పరంపరాగత విలువలు, ప్రజ్ఞ, నమ్మకాల కన్నా భిన్నమైన ధోరణి వీరికుందేమో ననిపిస్తుంది కాని నిజం అది కాదు.

ఈ దృష్టిలో పరికిస్తే నవోదయ మరియు అభ్యుదయ రచయిత కథల్లో ఒక స్పష్టమైన తేడా కనిపిస్తుంది. నవోదయ రచయితలకు బాధకు గురయ్యే వ్యక్తి, ఒక వ్యక్తిలా కాక, ఓ సిద్ధాంతపు, ఆదర్శపు లేదా విలువకు ప్రతినిధిగా కనిపిస్తాడు. అందువల్ల వ్యక్తిగా అతని అనుభవాల్ని, ఆలోచనల్ని అంత సునిశితంగా పరిశీలించక, కొంచెం హెచ్చు తక్కువగా ఓ విలువకు ప్రతినిధి స్థానంలోనే చూడబడతాయి. అయితే అతనిని అన్యాయం చేసేవారిని, కష్టానికి గురిచేసే వారిని మాత్రం వ్యక్తులుగా చూసే ధోరణి వుంటుంది. అలాంటి వారికి సాంఘిక లేదా తాత్విక ప్రాతినిధ్యం వుండదు. కేవలం జీవితంలో

ఎదురయ్యే సందర్భాలుగానే, సంఘటనలు గానే వారు కనిపిస్తారు. కాని అభ్యుదయ వాదులు అల్లా కాదు. అన్యాయం చేసే వాడికి, అన్యాయానికి గురయ్యే వాడికీ ఇద్దరికీ ప్రాతినిధ్యం వుంటుంది. అన్యాయానికి గురయ్యే వ్యక్తి దళిత వర్గపు, పీడిత వర్గపు ప్రతినిధి అయితే, అన్యాయానికి కారణమైన వ్యక్తి లేదా సన్నివేశాలు సంఘంలో పీడనకు వివిధమైన అంగాలు, ఉపకరణాలు. ఈ రకమైన ధోరణి వుండటం వల్ల ఓ సిద్ధాంతం లేదా ఆదర్శం గురించి పోట్లాడే వ్యక్తికి ప్రత్యేకమైన వ్యక్తిత్వం, శక్తి ఉంటుంది అన్న నిజాన్ని గుర్తించకుండా ముందుకు వచ్చినప్పుడు నవోదయ దృష్టి ఉదాత్తమయినదే కాక భావ పూరితమవుతుంది, ఓ స్వప్నమూ అవుతుంది. ఓ సిద్ధాంతం, ధర్మం, నీతి వీటి పట్ల వ్యక్తికి ఉండవచ్చు ననిపించే నమ్మకం, శ్రద్ధలను సామాన్యంగా చేసే సామాజికమైన ఒత్తిడి, అన్యాయాల సర్వాధికారానికి వ్యక్తిని గురి చేసే అభ్యుదయ దృష్టి కూడా చాలా తీవ్రమయినది.

1950 తర్వాతి కాలంలో రాయటం మొదలుపెట్టిన నవ్య చిన్న కథా రచయితల దృష్టిలో నైతిక ధార్మిక, ఆధ్యాత్మికమైన నమ్మకాలు, విలువలు వ్యక్తిలో సంస్కార రూపంలో ఎంతవరకూ నెలకొని వున్నాయో అంత మాత్రమే ఆ సందర్భంలో సత్యము. ఆ సత్యమే అతని క్రియల్ని ప్రతిక్రియల్ని నిర్ణయిస్తుంది. బయట ప్రపంచపు ఒత్తిడి, పరిస్థితిలోని యిబ్బందులు వ్యక్తిని ఇరుకులో పెట్టినప్పుడు ఆ సత్యం వీగిపోయే అవకాశాన్ని చెప్పుకుని వ్యక్తి ప్రజ్ఞా కేంద్రం నుంచి అనుభవాలకు విలువ కల్పించే ప్రక్రియ నిరంతరమూ నవ్యకథల్లో కనిపిస్తుంది. అందువల్ల నవ్య కథలు చాలా అంతర్ముఖాలై నడుస్తాయి. అంతర్ముఖతకు కారణం భావాల తీవ్రత అయితే, నవ్యుల అంతర్ముఖత అనుభవపు సున్నితమైన పొరల పరిజ్ఞానం వల్ల కలిగేది. అందువల్ల ఒక నవ్య కథ కేవలం ఒక వ్యక్తి, ఒక సమాజం, ఒక సిద్ధాంతం గురించిన జిజ్ఞాసగా వుండి పోక, అన్నీ ఒకే కేంద్రంలో బలంగా ఎదుర్కొనే, ఘర్షణ చెందే చైతన్య వంతమయిన క్షణాల్లో తమను తామే అనన్యంగా పొందే క్రియ అవుతుంది. అందువల్ల నవ్య రచయితల ప్రతీ ఒక్క మంచి కథా, అనుభవపు సద్యోజాత, అవిష్కారాన్ని అభినయిస్తున్నట్టు వుంటుంది. మొత్తం మీద భావావేశపు ఒత్తిడి, బౌద్ధిక, జ్ఞానం జీవితపు నిష్ఠురమైన వాస్తవికతను ఎదిరించి నిలబడాలన్న కల - ఈ అన్ని అంశాలు ప్రజ్ఞావంతుడి మనస్సులో ఏకకాలంలో ఎదుర్కోవటం పరిణతి చెందిన నవ్య కథల్లో మనం చూడవచ్చు.

నవోదయం, అభ్యుదయ రచయితలకు చెప్పటానికి బలమైన కథ వుంటుంది. ఆ కథలో హృదయాన్ని కదిలించే లక్షణం లేదా సంఘటనల్ని

అమర్చడంలో రచయుత శైలి, చాతుర్యం మనస్సుపై చూపే ప్రభావం వారికి అతి ముఖ్యం. ఈ ధ్యేయాని కోసం భాషను. దాని సాధారణమైన అర్థాన్ని మించిన తెలివితేటలతో ఉపయోగించాల్సిన అవసరం వీరికి కనిపించలేదు. కాని నవ్య కథా రచయితలు చిన్న కథలోని సృజనాత్మకమైన ప్రక్రియ, అది మనసు పై చూపే ప్రభావం ఒ కవిత్వపు సృజనాత్మక ప్రక్రియ, ప్రభావాలకన్నా భిన్నమైనది కాదు అనే పరిజ్ఞానంతోనే రాస్తారు. అందువల్ల భాషలో దాని సాధారణమైన అర్థాన్ని మించిన సాంకేతికమైన ధ్వనిని వెతుకుతారు. వీరికి కథా భాగం లేదా సంఘటనల సంయోజనా చాతుర్యమే అంత ముఖ్యం కాదు. అవన్నీ కూడా కథలో రూపొందుతున్న అనుభవం ప్రకటింప బడటానికి కావలసిన వస్తు ప్రతి రూపాలుగా మాత్రమే అస్తిత్వాన్ని పొంది వుంటాయి.

6

1) కన్నడంలోని చిన్న కథల ప్రక్రియ చారిత్రక దృక్పథం కనిపించేలా వుండాలి. ప్రారంభకాలం నుంచి, ఇప్పటి యువకులు రాస్తున్న కథల వరకూ దానికి కాలవ్యాప్తి వుండాలి.

2) సాధ్యమైనంతవరకూ చారిత్రకమైన మరియు / లేదా సాహిత్యంలో ప్రాముఖ్యత వున్న కథకులకు మరియు / లేదా కథలకు ప్రాతినిధ్యం ఇవ్వాలి. అలా చేసేటప్పుడు వైవిధ్య పూర్ణమైన ప్రయోగాలను కూడా దృష్టిలో వుంచుకోవాలి. ఆ వైవిధ్యం కథా వస్తువు కన్నా కథా ప్రక్రియ సృజనాత్మక శక్తికి సంబంధించి వుండాలి.

3) ఏ వొక్క కథకుడి దయినా ఒక కథ కన్నా ఎక్కువ వుండకూడదు.

4) ఈ సంకలనంలో ఇరవై అయిదు కథలుండాలి.

స్థూలంగా ఈ నాలుగు సూత్రాల్ని మనస్సుల్లో వుంచుకుని కథల ఎన్నిక చెయ్యడమయినది. ఈ సూత్రాల చట్రం, మరియు పరిధిలోనే అయినా సంకలనకారుని చారిత్రక మరియు సాహిత్యపు దృష్టి నుంచి మరియు అతనికి విమర్శ గురించి వున్న పరిజ్ఞానము దృష్ట్యా కన్నడ కథల అభివృద్ధి మరియు సాహిత్య పరమైన ప్రాముఖ్యతను మొత్తం మీద గుర్తించి, పరిశీలించే ధోరణి ప్రభావం తప్పకుండా వుంటుందని ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు.

మైసూరు — జి. హెచ్. నాయక్
20.7.1974.

# విషయసూచిక

# 1. కమలాపురం హోటెల్లో

పంజె మంగేశరావు

కమలాపురం రేవు వసంత ఋతువులో సాయంకాలపు హాయి ననుభవిస్తోంది. పీఠాపురం నుంచి వచ్చి ఒడ్డున ఆగిన ఒకటి రెండు పడవలు అలల తాకిడికి అల్లల్లాడుతున్నాయి. పడవ వాడు కత్తి పీటని కాలితో తొక్కి పట్టి, చేతిలో చేపని తరిగి, దగ్గిరే వున్న నీళ్ళు నిండిన మట్టి పాత్రలో వేస్తున్నాడు. అప్పుడప్పుడు ఎగిరి వస్తున్న కాకుల్ని తోలు తున్నాడు. కొంచెం దూరంలో బెస్త స్త్రీలు నడుం లోతు నీళ్ళ వరకూ దిగి, గబుక్కున మునిగి బురదలోని 'చిప్ప చేపల్ని' చేతినిండా తీసుకుని తమ ఒంటిన చీరతోనే కట్టుకున్న సంచుల్ని నింపుతున్నారు. ఒడ్డున నుంచున్న మాపిళ్ళె యువకుడు కృష్ణకాయులైన ఈ యోజన గంధుల వేపు దొంగ చూపులు చూస్తూ ఏదేదో ఆలోచిస్తున్నాడు. ఎక్కడ చూసినా జనం, గోల, బళ్ళమోత, కూలీల గడబిడ - ఇటు పక్కన కొండ మీంచి దిగిన కాఫీ గింజల బస్తాలని సముద్రం మీదున్న ఓడలోకి తరలిస్తున్నారు. ఇదుగో, ఈ పక్కన రాశిపోసిన బియ్యం బస్తాలని లెక్క పెట్టి, లెక్క పెట్టి కూలీల్ని కేకేస్తున్నాడు ఒక వర్తకుడు. అటునుంచి బొంబాయినుంచి వచ్చిన సరుకుల్ని ఒడ్డుమీదకి దింపుతున్నారు. ఇక్కడ 'మానిఫెస్ట్' రాసే ముసలి గుమాస్తా కళ్ళజోడు ఎత్తి పట్టుకుని చెవి పక్కన వున్న లేఖినిని అప్పుడప్పుడూ సవరించుకుంటూ పెత్తనం చేస్తున్నాడు. తెల్లదొర ఒకతను తెల్లటి పడవ చుక్కానిని చేత్తో పట్టుకుని సముద్రం వేపు వెళుతున్నాడు. పడవలో అతని సేవకుడు తుపాకీ పట్టుకుని నిలుచున్నాడు. ఇటు కొందరు గృహస్థులు గాలి పీల్చుకోవడానికి కమిటీ వేసుకుని తమ గొప్పదనాన్ని ప్రదర్శిస్తున్నారు. సర్కారు ఆఫీసుల గుమాస్తాలకి సాయంకాలం విహారానికి రావటానికింకా వేళ కాలేదు. వచ్చిన వాళ్ళలో కొందరు మూడు పైసల 'హోటల్' వేపు వెళుతున్నారు. హోటల్లో 'నైవేద్యం' పూర్తి చేసిన కొందరు జేబురుమాళ్ళతో మీసాలు ఒత్తుకుంటున్నారు. కొందరు చుట్టపొగతో ధూపం వేస్తున్నారు. ఇంకొందరు బీడి తాగడానికి అగ్గిపుల్లతో దీపారాధన చేస్తున్నారు. అందరూ మొదటే అర్ఘ్యాన్ని వదిలిపెట్టారు.

హోటల్ యజమాని పూర్ణస్వామి అయ్యంగార్లు. ఆ పేరుని కొందరు పొన్నుస్వామి అని క్లుప్తంగా అనేవారు. కొందరు పెణ్ణుస్వామి అనీ, మరికొందరు పెణ్సామి అనీ సకారణంగా పిలిచే వారు. ఎందుకంటే ఇరవై ఏళ్ళ క్రితం అయ్యంగార్లు ఒక స్త్రీ కోసం ఊరొదిలేసి వెళ్ళారు. తరువాత శ్రీరంగం,

తిరుపతి, జగన్నాథం, రామేశ్వరం మొదలైన పుణ్య క్షేత్రాల్ని దర్శించి, ఎలాగో అలాగా కొంత డబ్బు సంపాదించి మళ్ళీ కమలాపురం వచ్చి పరోపకారార్థం 'హొటల్' స్థాపించారు. యాత్రలవల్ల లాభం వుందని చెప్పేవారు. దేశవిదేశాల మిఠాయి తయారీలను, నానాభాషల్లోవున్న కొద్ది కొద్ది పరిచయాన్ని, ఆశ్చర్యకరమైన విశేషాల్ని సంగ్రహించి వుంచుకున్నారు. ఆయనకు పిల్లా-పాప లేరు. కాని, నల్లూరు నీలాంబ చిన్న కొడుకు మాత్రం "నాన్నా, నాన్నారూ" అని పిలుస్తూ రోజుకి రెండు సార్లయినా డబ్బు పట్టుకుపోతూ వుండేవాడు. స్వతంత్రంగా బ్రతకాలన్న వుద్దేశంతో 'హొటెల్' పెట్టానే గాని దాని వల్ల నాకేం లాభం లేదని ఎందువల్లో ఆయన రోజూ గొణుక్కుంటూనే వుండేవారు. అయినా హొటెల్‌కి వచ్చే వారి సంఖ్య రోజు రోజుకీ పెరిగిపోతూ వుండేది. ఒక పైసా కాఫీ తాగి వెళదామని వచ్చినవాళ్ళు కూడా అయ్యంగార్ల యాత్రా విశేషాలు వింటూ ఏం తింటున్నారో కూడా చూసుకోకుండా చేతిలో వున్న డబ్బు పూర్తిగా సమర్పించుకుని వెళ్ళేవారు. ఒకరిద్దరు అయ్యంగార్లని వారి విశేషాల 'మూట' విప్పేటట్లు చేసి తరువాత ఆయన విశేషాలు చెప్పే ఆనందంలో మునిగిపోగానే చల్లగా జారుకునేవారు. కాని ఆయన వెంటనే పసిగట్టి వారి వెంటబడి డబ్బు వసూలు చేసుకునేవారు.

మొట్టమొదట్లో పూర్ణస్వామిగారికి కమలాపురం యువకులంటే మంచి అభిప్రాయమే వుండేది. ఈ మధ్య ఆ అభిప్రాయం మారిపోయింది. చాలామంది హొటెల్లో లడ్డూలు తినడానికి బదులు డబ్బులు తినడం మొదలెట్టారు. ఈ రోగనివారణ కోసం అయ్యంగార్లు ఎన్నో ఉపాయాలు చేశారు. రావల్సిన డబ్బుని లెక్కల పుస్తకంలో రాయసాగారు. కారణాంతరాల వల్ల దూర దేశాలకి పోయిన బేరాలకి తమ క్షేమసమాచారాలు తెలుపుతూ తరుచు ఉత్తరాలు రాసేవారు. 'పేదవాడి విన్నపం' అంటే నల్లబల్ల మీద అప్పులవాళ్ళ పేర్లు రాసి గోడకి వేలాడ దీశారు. ఆఖరికి ఎలాగోలా లెక్కల్ని మాత్రం సరిచేయ్యకుండా వూరుకోలేదు. ఆరేళ్ళుగా లాక్కొచ్చిన అప్పుల వాళ్ళ పేర్లన్నీ లెక్కల పుస్తకంలో ఎర్ర సిరా గీత మాటున దాచేశారు.

ఆ రోజు సాయంత్రం హొటెల్లో చాలామంది చేరారు. కరియూరు శ్యామరావుగారు గోధుమ రొట్టెను కాఫీ వాడిన గిన్నెలో తడుపుతున్నారు. పలెనాడు కుప్పణ్ణగారు టీ గ్లాసుని ముందు పెట్టుకుని పెదవులతో మెల్లి మెల్లిగా చప్పరిస్తున్నారు. వీళ్ళిద్దరిమీద అయ్యంగార్లకి చాలా కోపంగా వుంది.

అయనకి కోపం తెప్పించే ఉద్దేశంతోనే వాళ్ళిద్దరూ వేళాకోళం ఆరంభించారు. రెండురోజుల క్రిందట ఈ మహానుభావులిద్దరూ హొటెల్లో

కడుపునిండా తిని, తాగి అయ్యంగార్లకి కోపం తెప్పించి వెళ్ళారు. అయ్యంగార్లు తమ స్వానుభవాలు కొన్ని మనోరంజకంగా చెబుతున్నారు. అప్పుడు వీళ్ళిద్దరూ ఆయన చెప్పేవన్నీ అబద్ధాలనీ, వచ్చిన వాళ్ళు ఆ ధ్యాసలో పడిపోతే వ్యాపారం బాగా సాగుతుందనే ఈ ఉపాయం పన్నారనీ ఆ మూర్ఖులిద్దరూ గొడవ పెట్టుకున్నారు. అయ్యంగార్లు తను చెప్పిన సంగతులేవీ అబద్ధాలు కావనీ ఆ అధములిద్దరికీ నిరూపించాలని నిశ్చయించుకున్నారు. ఆ రోజు కుప్పణ్ణగారు కలహానికి నాందిగా "రావుగారూ, అయ్యంగార్లు రామేశ్వరానికి సముద్రంలో ఈదుతూ వెళ్ళిన సంగతి తెలుసా మీకు? అన్నారు.

పూర్ణస్వామి అయ్యంగార్లు ఎప్పటిలా మొహం చిట్లించకుండా మనసులోనే మురిసిపోతున్నారు.

శ్యామరావు: ఆరోజు మీతో ఎవరున్నారండీ? ఆ ఆపద నుంచి మిమ్మల్ని కాపాడింది గుండాచారి గారే కదూ!"

కుప్పణ్ణ : కావచ్చు. లేకపోతే మన అయ్యంగార్లు అండమాన్ ద్వీపంలో తేలేవారో ఏమో.

అయ్యంగార్లు మౌనవ్రతం అవలంబించటంతో శ్యామరావుగారు, "మీ గుండాచారిగా రిప్పుడెక్కడున్నారు?" అనడిగారు.

ఇంతలో ఒకాయ నెవరో హెూటెల్లోకి అడుగు పెట్టారు. అయ్యంగార్లేదో పనిమీద లోపలి కెళ్ళారు. మిగతా వారెవరికీ ఆయన పరిచయం లేకపోవడంతో ఆయన ఒక్క నిమిషం అక్కడే నిలుచుండిపోయారు. అయ్యంగార్లు బయటకి రాగానే ఆ వ్యక్తిని చూసి ఆనందంతో పొంగిపోయారు. వచ్చినతను ప్రతిగా నవ్వుతూ " ఏం అయ్యంగార్లవారు ? క్షేమమా?" అన్నాడు.

అయ్యంగార్లు వచ్చినతన్ని యథోచితంగా సత్కరించి, గౌరవించి "ఎప్పుడొచ్చారండీ, గుండాచారి గారు?" అని విశేషాలడిగారు.

మిగితా వాళ్ళంతా స్థబ్దులై పోయి వచ్చినతన్ని కళ్ళార్పకుండా చూడసాగారు.

ఆ వ్యక్తి " అయ్యంగార్ల వారూ! ఏమి చెప్పమంటారు? మిమ్మల్ని పదేళ్ళుగా వెతుకుతున్నాం ఇవాళ మీ దర్శనం లభించింది." అంటూ అలసట తీర్చుకోసాగాడు. అయ్యంగార్లు కాసేపు ఆలోచన్లో పడ్డట్టు మొహం పెట్టి, " ఆ తరువాత మళ్ళి మనం కలుసుకోనే లేదు కదూ!" అని నవ్వుతూ కుప్పణ్ణ వేపొకసారి చూశారు.

కుప్పణ్ణ : ఎవర్ని కలుసుకోవడం ?

అయ్యంగార్లదేమీ లక్ష్య పెట్టకుండా " మీరు, మేము ఆ తరువాత మళ్ళి కలుసుకోనే లేదు. నేను రామేశ్వరం సముద్రం దాటి మునిగిపోయిన ఓడకు

వెన్నిచ్చి పైకి లేపి (కన్యా) కుమారి అగ్రం చేరాక మళ్ళీ మిమ్మల్ని చూడలేదు నిజమే " అని అన్నారు. ఆ మాటలంటూ శ్యామరావు వేపు నిశితంగా చూశారు.

ఆ వ్యక్తి " సర్లెండి, ఆ రోజులన్నీ పోయాయి. ఇప్పుడు మన మాటల్ని ఎవరూ నమ్మరు కూడా...." అంటూ తమ వేపే చూస్తున్న కుప్పణ్ణగార్ని చూపించి " ఈయన ఎవరు?" అని అడిగారు.

కుప్పణ్ణగారు అందుకోసమే కాచుకున్నట్లు ముందు కొచ్చి " ఆచారిగారూ, మీ పేరు అయ్యంగార్ల నోటివెంట రోజూ వింటూనే వుంటాం గనుక తెలుసు. మా పూర్వస్వామి అయ్యంగార్లు కావేరీ స్నానం చేస్తూ...." అని మొదలు పెట్టాడు.

ఆ వ్యక్తి అవునవును... ' అని తలవూపి, " ఆయన్ని రక్షించిన గుండాచారిని నేనే. నేను లేకపోతే ఈయనగారు ఆ రోజు మొసలికి ఆహుతయిపోయేవారు. ఏమంటారు అయ్యంగార్లు? ఏభై అడుగులు పొడుగున్న మొసలి ఎక్కడ? మన చేతిలోని పవిత్రమైన చిన్న దర్భ ఎక్కడ? ఈయనెవరు?" అని మళ్ళీ అయ్యంగార్లను అడిగారు.

అయ్యంగార్లు అలక్ష్యంగా " ఆయన దళారి కుప్పణ్ణ. మనం చెప్పేవన్నీ శుద్ధ అబద్ధాలనే గృహస్థు, మనకి వారి గొడ వెందుకు లెండి, ఈ వూళ్ళో ఎవరికి తెలుస్తాయి ఆ సంగతులన్నీ?" అన్నారు.

శ్యామరావు : " ఈయనే నేమిటి గుండాచారి?"

గుండాచారి : "కావేరీ స్నానంలో మొసలి బారి నుంచి అయ్యంగార్లని కాపాడిన గుండాచారిని నేనే. మలయాళ సీమలో ఆయన జబ్బు పడినపుడు శుశ్రూష చేసి బ్రతికించిన గుండాచారిని నేనే. నిన్నెప్పటికీ మరచిపోలేను. నీకేదైనా సాయం చేసే అవకాశం వస్తే వదులుకోను. అది నా అదృష్టంగా భావిస్తాను. అని నాకు మాటిచ్చారు. నేను ఒంటరిగా దేశదిమ్మరిలా తిరుగుతుంటే ఎన్నోసార్లు అయ్యంగార్లు గుర్తొచ్చారు. ఒక్కసారి ఆయన్ని చూస్తే నా కష్టాలన్నీ తీరిపోతాయనిపించింది. శ్రీకృష్ణుని దయవల్ల ఈ రోజు ఆయన దర్శనం కలిగి ధన్యుణ్ణయ్యాను అయ్యంగార్లూ, మర్చిపోయారా?"

అయ్యంగార్: లేదు స్వామీ లేదు. నాప్రాణాన్ని నిలబెట్టింది మీరు. తమ ఉపకారాన్ని ఆజన్మాంతం మర్చిపోలేను. ప్రత్యుపకారం చేసే శక్తి వుంటే చెయ్యడానికి సిద్ధంగా వున్నాను.

కుప్పణ్ణ : ఆయన చావు బ్రతుకుల్లో వుంటే తిరిగి సాయం చెయ్యడమే ప్రత్యుపకారం.

ఆ లోపల అయ్యంగార్ల ఆదేశం ప్రకారం నౌకరు కాఫీ నిండిన పాత్రల్నీ ఉపాహారపు దొన్నెల్నీ తెచ్చిపెట్టాడు. గుండాచార్యులు ఒక కన్ను భక్ష్యాల వేపు

పడేసి మరో కన్ను అక్కడ కూర్చున్న వారి వేపు తిప్పి,

"దాని కంటే సింహాళంలో మూడు అడవి ఏనుగులు తరుముకుంటూ వచ్చినపుడు... " అంటూ సగంలో అపేసి తిండి మీద పడ్డాడు.

టిఫిన్ తినేసి కూర్చున్న కుప్పణ్ణ, శ్యామరావు ఆ విషయం గురించి తెలుసుకోవాలన్న ఆశతో గుండాచారి దగ్గర కొచ్చారు. అయ్యంగార్లు, " తినండి, తినండి" అనగానే ఆ మాట తమకే చెప్పినట్లుగా కుప్పణ్ణ, శ్యామరావు దొన్నెల్లో చేతులు పెట్టి, ఎడం చెత్తో కాఫీ పంచపాత్రని అందుకున్నారు. అయ్యంగార్లకి తేలు కుట్టినట్లయింది.

నిమిషంలో భక్ష్యాలన్నీ మాయమయ్యాయి. గుండాచార్యులు " నా కింకా తనివితీర లేదు" అన్నారు విసుగ్గా. అయ్యంగార్లు మిగతా ఇద్దరివేపు కోరగా చూస్తూ అయిష్టంగానే మరింత ఫలహారం తెచ్చి గుండాచారి దగ్గరగా పెడుతూ శ్యామరావు, కుప్పణ్ణ గార్లతో " అయ్యా ఇప్పటికేనా నేను చెప్పిన దంతా నిజమేనని నమ్మకం కుదిరిందా?" అనడిగారు.

కుప్పణ్ణ: " ఈ రోజు ఫలహారంతో మొసలి కథనం నిజంలాగే అనిపించింది. గుండాచారిగారు మీరింకా ఎన్నాళ్ళుంటారు?"

గుండాచార్య: మా రుణానుబంధం వున్నంతవరకూ ఇక్కడుంటాం.

అయ్యంగార్లకి ఈ మాట రుచించలేదు. గుండాచారిగారు చేతులు కడుక్కొని నశ్యం అడిగారు. అయ్యంగార్లు నశ్యం డబ్బీ ఇచ్చారు. గుండాచారి నశ్యం చేతిలోకి వంపుకుని డబ్బీ శ్యామరావు చేతిలో పెట్టారు. ఆయనరెండు మూడు సార్లు చేతిలోకి తీసుకోవాలని ప్రయత్నించినా పట్టు దొరకలేదు. దానితో అర తులం నశ్యాన్ని ముక్కులోకి బదులు తమ డబ్బీలోకి పంపేశారు. అయ్యంగార్లు కోర పీకిన పాములా అల్లాడిపోయారు. ఆఖరికి శ్యామరావుగారు, కుప్పణ్ణగారు మర్నాడు వస్తామని ఇద్దరికీ అభయమిచ్చి వెళ్ళిపోయారు.

హొటెల్‌కి వచ్చినవాళ్ళంతా వెళ్ళిపోయాక గుండాచారి మీసం మెలేస్తూ "అయ్యంగార్లూ ఎలావుంది నాటకం? ఆ పాపిష్టి వాళ్ళు మిమ్మల్ని నమ్మేలా చేశానా లేదా చెప్పండి " అన్నారు.

అయ్యంగారు : "కొంచెం అతి చేశావు. నేను చెప్పినంతే మాట్లాడి వుంటే బాగుండేది. అనవసరంగా అబద్ధాలెక్కువ చొప్పించేశావు."

"అలా చెయ్యడం వల్లనే ఆ దుర్మార్గులు నమ్మారు. నేను ఎంత కల్పించినా ఎవరూ అబద్ధాలనరు."

అయ్యంగారు : నా నశ్యమంతా పంచిపెట్టి ఖాళీ డబ్బా మిగిల్చావు.

గుండాచారి : నేను మాటల జోరులో ఆవేశానికి లోనయాను. మీరు

చెప్పినదంతా మర్చిపోయాను.

"అవును, నువ్వు ఎల్లుండి స్టీమ్ బోటెక్కి కొన్నూరికి పోతానని చెప్పలేదేం?"

గుండాచారి : రేపు చెబితే సరి. అది సరేగాని, మనమాడిన నాటకం ఆ వెర్రి వెంగళాయిల నోళ్ళు మూయించింది కదూ !

అయ్యంగారు: రేప్పొద్దుటనుంచే నువ్వు వెళ్ళే సంగతి చెపుతూండు. అల్లుడింటికి వెళ్ళాలని చెప్పు. ఎల్లుండి వెళ్ళేమాటుంటే మన ఒప్పందం ప్రకారం ఒక వరహా ఇస్తాను.

గుండాచారి గారు నవ్వాపుకుని మాట్లాడ బోయే లోపుగా ఎవరో హొటెల్ తలుపు తట్టి పిలిచారు. అయ్యంగార్లు కంఠాన్ని బట్టి కుప్పణ్ణగారనుకుని " ఈ వేళప్పుడిక్కడ కాఫీ దొరకదయ్యా" అనేసి లోపలికి వెళ్ళిపోయారు. గుండాచారి గారికి ఇక ఆకలి లేకపోవడంతో అయ్యంగార్ల పక్క పరుచుకుని పడుకున్నారు. అయ్యంగార్లు భోంచేసి వచ్చి శయ్యాసీనులైన గుండాచారి గార్ని చూసి మనసులోనే వుడుక్కుంటూ పళ్ళు నూరుకుంటూ లోపలికెళ్ళారు.

ఆదివారం స్టీమ్‌బోట్ కమలాపురం చేరింది. అయ్యంగార్లవారు స్టీమ్ బోటు వచ్చింది అని ఒకటికి రెండుసార్లు గుండాచారితో చెప్పారు. గుండాచారిగారు ఆ మాట విననట్లే వుండిపోయారు. హొటెల్‌కి వచ్చిన వాళ్ళందరికీ "గుండాచారి ఇవ్వాళ వెళ్ళిపోతారని" తెలుసు. కాని ఆయన మాత్రం వచ్చిన వాళ్ళతో చెప్పే కబుర్లతో ఆ మాట చూచాయగానైనా అనటంలేదు. అయ్యంగార్లు అప్పుడప్పుడు ఆయన మాటల్ని మళ్ళించాలని ప్రయత్నించినా ఫలించలేదు. అయ్యంగార్లు హొన్నూరు రథోత్సవం గురించి ప్రస్తావిస్తూ కనుబొమ లెగరేసి సూచన ఇవ్వబోతే, గుండాచారిగారు మహా శ్రద్ధగా ప్లేగు వ్యాధికి ఇచ్చే ఔషధాన్ని గురించి మాట్లాడ సాగారు. అయ్యంగార్లు చాలా కష్టపడి ఓర్పు తెచ్చుకున్నారు. గిరాకీలంతా చీకటి పడ్డాక తమ తమ ఇళ్ళకి వెళ్ళిపోయారు.

అయ్యంగార్లు కోపంతో మండిపడుతూ "ఏమిటి దీనర్థం?" అనరిచారు.

గుండాచారిగారు సావధానంగా " దీనర్థం పొన్నామీ?" అన్నారు.

"నన్ను పొన్నామి అని పిలవకు. రేపు పొద్దున్నే నువ్విక్కడినుంచి వెళ్ళిపోవాలి తెలిసిందా?" అని అయ్యంగార్లు గర్జించారు.

**గుండాచారి** : " వెళ్ళాలా? ఎక్కడి కెళ్ళాలి?"

**అయ్యంగార్లు:** " ఎక్కడికైనా వెళ్ళు. ఇక్కడ వుండకపోతే సరి."

**గుండాచారి** : " అయ్యంగార్లూ ఏదేదో మాట్లాడుతారు రాత్రి సరిగ్గా నిద్ర పట్టలేదా ఏమిటి?"

అయ్యంగారు: " రేప్పొద్దున్న వెళ్ళావే సరి. లేకపోతే మెడ పట్టి గెంటుతాను. మనం చేసుకున్న ఒప్పందం గుర్తులేదా?"

గుండాచారి : " ఒప్పందమా ? ఒప్పందమేమిటి? నా బొంద! రేపు శుభ్రంగా తలంటు పోసుకుందా మనుకుంటున్నాను."

అయ్యంగార్లు కోపం ఆపుకోలేక "పోతావా లేదా ? ఆ అధముల కేదో నేను చెప్పినదాని మీద నమ్మకం పుట్టించడానికి ఏదో సరసంగా నిన్ను పిలుచు కొచ్చాను. నువ్వేమో ఇక్కడే అతుక్కుపోయేటట్లున్నావు " అన్నారు.

గుండా : " ఆ నాడు నేను చేసిన ఉపకారం అంతా మర్చిపోయారన్నమాట. మొసలి పట్టుకున్నప్పుడు నేనొక్కడినే పవిత్రమైన దర్భతో ...."

అయ్యంగారు: " ఊరికే నా ప్రాణం తియ్యకు. నన్ను మొసలి పట్టుకోనూ లేదు, గుండాచారి విడిపించనూ లేదు."

గుండాచారి : " కృతఘ్నుతకి మందు లేదు. నేను నీ ప్రాణం కాపాడిన సంగతే మర్చిపోయావా?" అంటూ రాని కన్నీళ్ళని తుడుచు కోసాగాడు. అంతలో బయట ఎవరో మాట్లాడినట్ల యింది"

అయ్యంగారు : "హు.... పదిహేను రూపాయలు ఇస్తాను మాట్లాడకుండా పోతావా?"

గుండాచారి : అయ్యంగార్లూ, మీరిప్పుడు నిద్ర పొండి. రేపు మాట్లాడొచ్చు. నిద్ర సరిగ్గా లేకపోతే బుద్ధి చెడిపోతుంది.

అయ్యంగారికి, గుండాచారికి దెబ్బలాట జరిగిందన్న సంగతి ఊళ్ళో వ్యాపించింది. కుప్పణ్ణ, శ్యామరావు దీని గురించి అయ్యంగార్లని అడగాలని అనుకున్నారు గాని, ఈ మధ్య అయ్యంగార్లు హొటెల్లో అరువుబేరాలకి స్వస్తి చెప్పటంతో వీళ్ళకి అక్కడికి వెళ్ళే ధైర్యం లేకపోయింది. ఆదివారం స్టీమ్ బోటు ఎక్కి వెళ్ళకపోతే ఇక మూడు నాలుగు రోజుల్లో తన హొటల్ని పిల్చి పిప్పి చేస్తాడని భయపడి అయ్యంగార్లవారు, "ఒరేయ్ గుండా, నువ్వు రేపు వెళితే సరి, తేకపోతే నేనే నోరు విప్పి అందరితో చేప్పేసి నిన్నిక్కడ్నుంచి గెంటిస్తానంతే" అన్నారు.

గుండా: నేను వచ్చే చంద్రవారం వెళతాను సరేనా? నువ్విచ్చే పదిహేను రూపాయలూ దారి ఖర్చుకే చాలవు. నీకోసం అబద్ధాలు చెప్పి పాడయ్యాను నేను.

అయ్యంగారు : "ఇదిగో నువ్వెళ్తే చాలు " అంటూ అతని చేతిలో పదహారు రూపాయలు పెట్టారు.

సోమవారం పది గంటలకి గుండాచారిగారు వెళాతారని **వూళ్ళో అందరికి** తెలిసింది. కుప్పణ్ణగారు, శ్యామరావుగారు హొటెల్‌కి వచ్చారు. **గుండాచారి**

గారు వెళ్ళడానికి సిద్ధంగా వున్నారు.

గుండాచారిగారు వాళ్ళని చూడగానే "నేను ఎన్నో వూళ్ళు చూశాను. ఎందరో జనాల్ని చూశాను. కాని ఇంత మంచి వూరిని, మీ అంత యోగ్యుల్ని ఎక్కడా చూడలేదు." అన్నారు.

కుప్పణ్ణగారు గుండాచారితో " మమ్మల్ని మరవకండని" వేడుకున్నారు.

గుండాచారి :" ఈ వృద్ధాప్యంలో దిక్కు లేక నేను వూళ్ళ వెంట తిరుగుతుంటే మీ జ్ఞాపకం రాక తప్పదు. కడుపు కోసం అగచాట్లు పడ్డప్పుడల్లా ఈ హొటెల్ జ్ఞాపకం...."

శ్యామరావు : " మీరు మీ కూతురింటికి హొన్నూరు వెళ్ళటం లేదా ?

గుండాచారి చిన్నగా నవ్వుతూ " నాకు కుతురూ లేదు, ఏయ్యంకుడూ లేదు. ఈ ప్రపంచంలో నాకు నేనే. నానుంచి ఉపకారం పొందిన వాళ్ళున్నారు గాని, ..."

ఈ మాట విని అందరూ జాలిపడుతూ అయ్యంగార్ల వేపు చూశారు.

కుప్పణ్ణ : మీరు కూతురింటికి వెళుతున్నట్టు అయ్యంగార్లు నాతో చెప్పారే!

అయ్యంగార్లు కోపంగా లేచి నిలుచున్నారు. ఆయన మొహం కందగడ్డలా వుంది.

శ్యామరావు : అయ్యగార్లు మిమ్మల్ని వుండమని బలవంత పెట్టినా మీరు పట్టుబట్టి వెళ్ళిపోతున్నారని చెప్పారు.

గుండాచారి : శుద్ధ అబద్ధం! ఆయన ఒక్కమాట చెబితే నేనిక్కడ వుండిపోవడానికి సిద్ధంగా వున్నాను. ఆయనకి నేనిక్కడ ఉండడం ఇష్టం లేదు. నాకు ఒకపూట భోజనం పెట్టడమే కష్టంగా వుందాయనకు. నేను హొన్నూరికి పోతున్నానని కూడా ఆయనే పుట్టించారు. ఆయన మాటల్ని అబద్ధం చేయ్యడం నా కిష్టం లేదు. అబద్ధాలతోనే అబద్ధాలని బిగించాలని అన్నారు. ఆఖరికి నే నెలైనా వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాను. కాని పోయేటప్పుడు మీతో అబద్ధం ఎందుకు చెప్పాలి!

ఆ మాట విని అందరూ స్థబ్దులైపోయారు.

గుండాచారి : నాకు పిల్లా - పాప లేరు. నన్ను బయటకి గెంటుతానని అయ్యంగార్లు అల్లరి చేస్తున్నారు గనుక పోతున్నాను. ఆయన ఒక్క మాట చెబితే వుండేవాడినే.

గుండాచారిగారు కళ్ళతో నవ్వుతూ అయ్యగార్ల వేపు చూస్తు బయటకెళ్ళి పోయారు. ఆయనెక్కడకి వెళ్ళారో ఇంతవరకూ ఎవరకీ తెలీదు. కుప్పణ్ణ, శ్యామరావుగార్లు, ఆయన వెళ్ళాక ఆయన జాతకం తిరగేయడంతో గుండాచారి,

నల్లూరు నీలాంబ తమ్ముడన్న సంగతి తేలిపోయింది. ఇప్పటికీ కొందరు అయ్యంగార్ల జీవిత చరిత్రని ఆయనెదుటే వ్యాఖ్యానించేటప్పుడు గుండాచారి ఆగమనాన్ని గురించిన సంగతులన్నీ విశదంగా చెప్పడం కద్దు.

# 2.పెరుగు మంగమ్మ

*డా. మాస్తి వెంకటేశ అయ్యంగార్*

చాలా ఏళ్ళుగా మాకు వాడుకగా పెరుగు పోస్తోంది మంగమ్మ. వాడుకగా అంటే ఇది బెంగళూరు వాడుకన్నమాట. మిగతా వూళ్ళలో వాడుకంటే రోజా వచ్చి పెరుగుపోసి నెలాఖారున డబ్బు తీసుకోవడం. బెంగుళూర్లో బహుశః ఆ అలవాటు లేదనుకుంటాను. మంగమ్మ మామూలుగా మా పేట వేపు వచ్చినపుడు మా ఇంటికి రావడం, "పెరుగు తీసుకుంటారా అమ్మా, మంచి పెరుగు తెచ్చాను" అనడం మేం అవసరమైతే తీసుకుని, ఆ రోజు ధర ఎలా వుందో తెలుసుకుని అప్పుడే డబ్బు ఇచ్చెయడం, లేదా మర్నాడివ్వడం, ఇదీ మా వాడుక. వాళ్ళ వూరు అవలూరు పక్కన ఏదో పల్లెటూరు. వెంకటాపురమో ఏదో పేరు. వస్తూ మా ఇంటి ముందునుంచే రావాలి. వేళ్ళేటప్పుడు మా ఇంటి మీదుగానే వెళ్ళాలి. నేను కాస్త నేరారా మాట్లాదేమనిషిని గనుక మంగమ్మ వచ్చేటప్పుడొకసారి, వెళ్ళేటప్పుడు ఒకసారి మా ఇంటికి రావడం అలవాటు. వచ్చి మా లోగిట్లో కాసేపు కూర్చుని, మమ్మల్ని పలుకరించి, తమలపాకులు, వక్క నోట్లో వేసుకుని, లేకపోతే మా దగ్గర పుచ్చుకుని తరువాత వూరికి వెళ్ళేది. ఇలాంటి సమయాల్లో నేను కొంచెం తీరిగ్గా వుంటే తన కష్ట సుఖాల్ని చెప్పుకుని, నన్ను కూడా ఏ మైనా చెప్పమంటుంది. నాకేమున్నాయి కష్టాలు? దేవుడి దయవల్ల అంతా బాగానే వుంది. ఏవేవో చిన్న విషయాలు. పిల్లి వచ్చి పాలు తాగిందనో, ఎలుక వచ్చి గుమ్మడికాయ తిన్నదనో నేను చెబితే, "అయ్యో! ఈ పాడు లోకమే ఇంత!" అని తన అనుభవసారాన్ని చెప్పి దానితో ఏ విధంగా వ్యవహరించు కోవాలో నాకు నేర్పేది. మొత్తం మీద మంగమ్మ నాకు చాలా కావల్సిన మనిషి. మా కిద్దరికీ ఎంతో సఖ్యత.

ఇప్పటికి సుమారు నెలాళ్ళ క్రితం మంగమ్మ పొద్దున్నే "పెరుగు తీసుకుంటారామ్మా?" అంటూ వచ్చినపుడు, నేను లోపలెక్కడో వున్నాను. మా కుర్రాడు, "ఆ తీసుకుంటారు" అని చెప్పి, దగ్గరకెళ్ళి నుంచుని "ఇయ్యి పెరుగు" అంటూ చెయ్యి జాపాడు. మంగమ్మ కుండలోంచి గరిటెదు పెరుగు తీసి వాడి చేతిలో వేసింది. "అమ్మని తొరగా రమ్మను, నే పోవాల" అంది. ఆ లోపల నేనే వచ్చాను. మంగమ్మ, "అమ్మయ్యా, బంగారం లాంటి పిల్లాడిని కన్నావు. నీ గుణం ఎట్లాంటిదో నీ పిల్లాడూ అంతే. కాని ఇయ్యన్నీ ఎన్నాళ్ళు? కుర్రోడు పెద్దోడయ్యే వరకే. అప్పుడెవతో వస్తుంది. ఇప్పుడు 'అమ్మ, అమ్మ! అని కొంగట్టుకు తిరిగిన కొడుకు అప్పుడు అమ్మ వుందో సచ్చిందో కూడా

అడగడు" అంది. నేను "ఏమైంది మంగమ్మా? కొడుకు నువ్వు చెప్పిన మాట విన్లేదా?" అన్నాను. "సర్లే తల్లి, కట్టుకున్న మొగుడిన్లేదు, ఇక కొడుకేటి వినేది?" "మొగుడు నీ మాట విన్లేదా మంగమ్మా" అని అడిగాను. "అయ్యో, నాయమ్మ! నేనేనాడూ మంచి కోక్కట్టుకుని ఎరగను. మరెవతో కట్టుకుంది. కోక అందం చూసి మురిసిపోయి అటెల్లాడు. ఎట్టాగో అట్టా వుణ్ణీ. నా ఇల్లు, నా అదది అనుంటే చాలు మగాడికి అనూరుకున్నాను. అయితే ఏటంట అమ్మయ్యా! అమురుతం అమ్మాను. మొగుణ్ణి పోగొట్టుకున్నాను. ఏదో నా కంతే రాసుంది. నువ్వు మటుకు మొగుడొచ్చే ఏలకు మంచి కోక కట్టుకునుండు. మగాళ్ళ మనసు శానా చంచలం. ఆళ్ళ కంటికి నదురుగా కనిపించే కోకో, రైకో ఆడోళ్ళు తొడుక్కోవాలి. పూలు, గంధం తోచిందేదో పెట్టుకుని వాళ్ళ మనసుకి నచ్చేలా మసులుకోవాలి. ఇదుగో, ఇప్పుడు కట్టుకున్నావే, ఇలాంటి కోకలు పనీ-పాటు చేసేటప్పుడు కట్టు కోవాలి తల్లీ" నా క్కొద్దిగా నవ్వొచ్చింది. కాని ఆమె అనుభవంలోంచి వచ్చిన మాటల్లోని తెలివి గొప్పగా తోచింది. ఆ మాటల వెనకాల ఆమె స్వానుభవంలో కలిగిన నొప్పి తాలూకు ఛాయలు కనిపిస్తున్నాయి. అది గ్రహించగానే నా కెంతో బాధ కలిగింది. నేను, "అవును మంగమ్మా, నీ మాట నిజం" అన్నాను. ఆ తరువాత మంగమ్మ అంది కదా, "చూడు తల్లీ భర్తని సరిగ్గా వుంచుకోవాలంటే నాలుగు చిటకాలు. ఆళ్ళు-ఈళ్ళు చెబుతారనుకో, మందో మాకో పెట్టమనే, నారో వేరో పెట్టమనే. వేరు పెట్టి వల్లకాటికి పంపు" అని సామెతే వుంది. అట్టాంటోళ్ళ మాట ఇనమాకు. అప్పుడప్పుడు తింటానికి రుచిగా ఏమన్నా చేసి పెట్టడం, సక్కగా కళ్ళ కింపుగా తయ్యారై, కష్టమోనిష్టూరమో ఏదెలా వున్నా నవ్వుతూ పలుకరించాలి. ఇంటిక్కావల్సినవన్నీ ఒక్కసారే సరిగ్గా తెప్పించుకుని, మళ్ళీ మళ్ళీ అడక్కుండా వుండాలి. మూడు పైసలో, ఆరు పైసలో పోగేసి దాచి, అవసరమన్నప్పుడొక రూపాయి చేతిలో పెట్టాలి. ఇదే తల్లీ మందూ - మాకూ. ఆడదిట్టా సేస్తే మొగుడన్నోడు ఇంటి కుక్కలా పడుంటాడు. లేదనుకో ఈదులెంట తిరుగుతాడు. నాకు మంగమ్మ మాటల చమత్కారం చూసి ఆశ్చర్యమేసింది. మరో రెండు మాటలాడి ఆ వేళటికి ఇంటికి పంపించేశాను.

ఇప్పటికి పదిహేను రోజుల క్రితం మంగమ్మ వచ్చినపుడదోలాగ వున్నట్టనిపించి, "ఏం మంగమ్మా అదోలా వున్నావేమిటి?" అనడిగాను. "ఏం చెప్పేది తల్లీ, ఈ పాడు జలమ ఎవరికీ అక్కర్లేకుండా పోయింది" అంటూ మంగమ్మ కళ్ళు తుడుచుకుంది. నేను, "ఏమయింది మంగమ్మా, కొడుకేమన్నా అన్నాడా ?" అనడిగాను. "హు , అన్నాడమ్మా. వాడి పెళ్ళాం ఏమెరగని పసివాణ్ణి, వాడేదో చేశాడని పట్టుక్కొట్టింది. ఏమే గయ్యాళీ, ఎందుకు రాక్షసిలా

ఆ పసివాడిని బాదుతావు?" అని అడిగాను. నాకే ఎదురు తిరిగిందది. నేటి కొచ్చినట్టుంది. "ఇదేటే నీ మొగుణ్ణి కన్నదాన్ని నేను. నన్నే ఇంతలేసి మాటలంటావా? కానీయ్, ఆణ్ణే రానీ అడుగుతాను" అన్నాను. ఆ దొర ఇంటి కొచ్చాడు. "చూడయ్యా, సంటోణ్ణారికే బాత్తుంటే 'ఒద్దే' అన్నాని నన్ను నానా తిట్లూ తిట్టింది. నీ పెళ్ళానికి కాస్త బుద్ధి చెప్పుకోరాదా" అన్నాను. కోడలొచ్చి "ఏటి నాకు బుద్ధి చెప్పేది? కుర్రోడల్లరి చేస్తే ఒద్దంటానికి నా కదికారం లేదా? నువ్వు నా మొగుణ్ణి కన్నట్టే, నేనూ ఈణ్ణి కనలేదా? నాకేటి బుద్ధి సెప్పేది?" అంది. ఎంతైనా అది ఆడి పెళ్ళాం కదా! నేను తల్లినాయె దాన్నేమన్నా అంటే అది ఎదురు తిరుగుతుంది. నన్నంటే నేనేటి సెయ్యగల్ను సెప్పు. ఆడన్నాడూ, "ఔనే అమ్మా! అది కన్న బిడ్డనది కొట్టుకుంటుంది. నువ్వెందుకు దాని జోలికి పోతావ్? నేను నీ కొడుకుని కదా, నన్నేమన్నా అను, చెల్లు" అన్నాడు. అయితే నే జేసింది తప్పా? అన్నాను. "తప్పో, ఒప్పో కన్న తల్లి కొడుకుని దండించద్దు, అనగలమా?" అన్నాడు. నా క్కోపం వచ్చేసింది. నేరు జారి అన్నాను, "ఏటిరా దాని మాయలో పడి అది బిడ్డని కొట్టినా, తిట్టినా నాయంగానే కనపడుతోంది నీకు. బాగానే వుందయ్యా రేపు అది మీ అమ్మని బయటకి పంపించమంటే పంపించేటట్టే వున్నావు" అన్నాను. ఆడు, "ఇంకేటి సెయ్యనమ్మా నీ పెళ్ళాముంటే నేనుండను. నేనుంటే నీ పెళ్ళాముండ కూడదు అని నువ్వంటే దిక్కులేని ఆడదాన్ని ఏం చేస్తాము?" అన్నాడు. "నాకెవరయ్యా దిక్కు ? " అన్నాను. " నీకేమిటమ్మా పాడి, డబ్బు వున్నాయి. నిన్ను నేను సాకక్కర్లేదుగా" అన్నాడు. "అంటే నన్ను వేరు పొమ్మంటావేటిరా?" అన్నాను. "నీ ఇష్టం పోతానంటే ఒద్దనను మీ ఇద్దరి గోల పడలేకుండా వున్నాను" అన్నాడు. "సరేనయ్యా, మద్దేన్నం నుంచి నేను వేరే పోతాలే. నువ్వు, నీ పెళ్ళాం సుకంగ వుండండి అనేసి పెరుగు తీసుకుని సక్కా వచ్చాను తల్లీ" అంటూ మంగమ్మ ఏడ్చింది. నేను ఓదార్చాను. "సర్లే మంగమ్మా ఇవన్నీ ఉట్టి మాటలే. మాములుగా ఇంటి కెళతావు. ఎప్పటిలా వుంటావు. అంతా సర్దుకుంటుంది". అని ధైర్యం చెప్పి పంపాను.

మర్నాడు మంగమ్మొచ్చినప్పుడు నిన్నటంత దిగాలుగా లేదు. కాని ఎప్పటిలా చురుగ్గానూ లేదు. "గొడవలన్నీ సర్దుకున్నాయా మంగమ్మా?" అనడిగాను. "సర్దుకోడానికిడుస్తుందా అది. నిన్న నేను పెరుగమ్మి ఇంటి కెళ్ళేసరికి , నా కుండలవీ వారగా వుంచింది. ఓ దాంట్లో బియ్యం, మరో దాంట్ల రాగులు, ఉప్పు, మిరపకాయలు అన్నీను. తను, తన మొగుడూ అన్నం తిన్నామన్నట్లుగా కాళ్ళు జాపుక్కూర్చుంది. ఇంకేముంది తల్లీ సర్దుకునేది

నేనూ ఒకింత ముద్ద (సంగటి) కెలుక్కుని తిన్నాను. నేనేదో అన్నాననుకో. అదే చాలన్నట్టు ఊరుకున్నారు వాళ్ళు. రోజా ఆ పిల్లాడి కింత పెరుగు పెట్టిగాని అమ్మకాని కొచ్చేదాన్ని కాదు. పొద్దున్నే అ వేళకి అడ్నెక్కడో తీసికెళ్ళిపోయింది. ఆ పిల్లాణ్ణి నాకు దూరం చెయ్యాలనే అలా చేసింది. నే నెరుగుదును" అంది. ఒక చిన్న మాట ఎంత దూరం పోయింది అని ఆశ్చర్యమేసింది నాకు. కాని నేను చేయగలిగిందేముంది గనుక. ఏవో రెండు మాటలు చెప్పి మంగమ్మని పంపించాను.

తరువాత ఒకట్రెండు రోజులు ఆ మాట ఎత్తలేదు. మంగమ్మ వేరుగా వుంటున్నట్లే అనిపించింది. తరువాతొకరోజు మంగమ్మ, "తల్లీ నువ్వేసు కుంటావే, ఆ మకమల్ జాకెట్టు గుడ్డ గజ మెంత?" అనడిగింది. "ఎందుకు మంగమ్మా?" అన్నాను. ఇన్ని రోజులు కొడుక్కి, మనవడికి అనుకుంటూ పైసా పైసా కూడ బెట్టాను. ఇంకెందుకు? నేను మకమల్ జాకెట్టు కుట్టించుకుని తొడుక్కు తిరుగుతాను అంది. "జాకెట్టుకి ఏడెనిమిది రూపాయలవుతుంది మంగమ్మా" అన్నాను. ఆ వేళే దర్జీ కొట్లో మంగమ్మ మకమల్ గుడ్డ బేరం చెయ్యనూ చేసింది, కుట్టడాని కియ్యనూ ఇచ్చింది. మర్నాడు వూరికెళుతూ దాన్ని తొడుక్కునీ వచ్చింది. "చూశావా అమ్మయ్యా నా సింగారం. మావేడొచ్చి నప్పుడు కూడా మంచి కోక కట్టలేదు నేను. వాడెవతె వెంటనే పోయాడు కన్న కొడుకు కోసం పైసా పైసా కూడబెట్టి దాస్తే దాని కథ ఇట్టాగయింది. చూడు నా సింగారం" అంది.

కొడుకుని దూరం చేసుకున్న దుఃఖంలో మంగమ్మకొంచెం మతి చలించిందేమో ననిపించింది నాకు. తీవ్రమైన కోపానికి గురైనప్పుడు ఎవరికైనా అలా జరగడం సహజమే గనుక నేనేం మాట్లాడలేదు.

కాని ఆ జాకెట్టు వల్ల ఆమెకి మిగతా వాళ్ళతో గొడవొచ్చింది. వాళ్ళ వూళ్ళో కుర్రాడొకడు బెంగుళూర్లో చదువు కుంటున్నాడట. అతను తెల్లవాళ్ళ లాగానో, లేకపోతే మనలో చదువుకున్న వాళ్ళ లాగానో టై, కాలర్ వేసుకునే నాజూకు మనిషి. అతను మంగమ్మని చూసి, "ఏంటవ్వేయ్ ఏకంగా మఖమల్ జాకెట్టు తొడిగేసావ్?" అన్నాట్ట. "ఏం పిల్లాడా, అదుపు తప్పి మాట్లాడుతున్నావ్? నువ్వు గొంతుక్కి వురిపోసుకోగా లేంది నేను జాకెట్టు తొడుక్కుంటేనేం?" అందట. మాట మాట పెరిగింది. చుట్టూ వున్నవాళ్ళు నవ్వారు.

మర్నాడు మంగమ్మే నాకీ సంగతి చెప్పింది. బయట వాళ్ళ సంగతలా వుంచి, మంగమ్మ కోడలే, "కోడలికో రవిక కుట్టించలేక అత్త వేరు పోయి, మఖమల్ జాకెట్టు తొడిగింది చూడండి" అందట పొరుగు వాళ్ళతో మంగమ్మకి

వినపడేలా. మంగమ్మ కోడలికి పెళ్ళిలో కమ్మలు, కడియాలు, చంపసరాలు, నాగరం, కంటె, ఒడ్డాణం అన్నీ పెట్టింది. తరువాత ఏడాదికొకటి చొప్పున ఏదో ఒక నగ కొంటూనే వుంది. అవన్నీ గుర్తు లేవా కోడలికి? మంగమ్మ రెండు మూడు సార్లు వూరుకుని ఆఖరికి ఓ రాత్రివేళ కొడుకుతో "నీ పెళ్ళాం నన్నేదేదో అంటోంది, జాకీటు కొనుక్కున్నానని, తనక్కొనివ్వ లేదనీను. నేను దానికేమీ కొనివ్వ లేదా? కడియాలు, కంటె, నాగరం, ఒడ్డాణం, నేను కొనిచ్చినవి కాదా?" అందట. కోడలు మొగుణ్ణి మాట్లాడ నియ్యకుండా "మొగుడు లేని ముసల్దానివి నువ్వు, ఇప్పుడు కమ్మలు, ఒడ్డాణం కావల్సొచ్చాయా? తీసుకుపో, ఏస్కో" అంది. ఆ మొగుడు, "ఎందుకే అన్ని మాటలు!" అని పెళ్ళాంతో అని, తల్లితో "అమ్మా! మీ ఇద్దరి తగూల సంగతి నాకెందుకు గాని, నీ నగలు నీక్కావాలంటే పట్టుకుపో" అన్నాడట. మంగమ్మ "చూడు తల్లీ, 'ఇరుగు పొరుగుతో అలాంటి మాటలెందుకే' అని పెళ్ళానికి చెప్పుకోలేదు గాని, కావాలంటే నగలు తీసుకుపో అని నా మీదే తప్పు మోపాడు." అని వాపోయింది. అదంతా విని చాలా బాధ పడ్డాను. ఈమె చూస్తే ముసల్ది. అతనా ఒక్కడే కొడుకు. ఆ మనిషి మొగుణ్ణి, మొగుడి తల్లిని కాస్త బాగా చూసుకో కూడదూ. ఇంతకీ ముసల్ది మనవణ్ణి కొట్టొద్దన్నందుకు ఇంత గొడవా? ఎందుకిలా చేస్తారో కదా అనిపించింది. అవును, ఎక్కడ చూసినా దెబ్బలాటలకి కారణా లిలాగే వుంటాయి. ఒకరికి ఒకరంటే పడక పోవడం వల్ల చిన్న చిన్న విషయాలే పెద్ద పెద్ద గొడవలవుతాయి. ఎక్కడ లేని తగువులూ పుట్టుకొస్తాయి. దానికి సంబంధించిన వాళ్ళంతా బాధల్లో ఇరుక్కోక తప్పదు అనిపించింది.

ఇది జరిగిన కొన్నాళ్ళకి మంగమ్మ నాతో, "అమ్మా మీరు సత్యవంతులు. నాది కొంచెం డబ్బుంది. దాన్ని ఎక్కడైనా బ్యాంకి అంటారు కదా అలాంటి చోట దాచిపెట్ట గలరా? దానికి మీ సాయం కావాలి. ఆ డబ్బు మీద వాళ్ళు, వీళ్ళు కన్నేస్తున్నారు...." అంది. ఏం జరిగిందని అడిగాను. నిన్నేం జరిగిందంటే, మా వూళ్ళో రంగప్పని ఒకడున్నాడు జూదగాడు, సోకులెక్కువ. నేను పెరుగు తీసుకొస్తుంటే తోవలో ఎక్కడ్నుంచో వూడి పడ్డాడు. "ఏటి మంగమ్మా, బాగుండావా?" అన్నాడు. "ఏం బాగులే రంగప్పా, నీకు తెలిందేముంది?" అన్నాను. అదన్నాడు, "ఔన్లే నువ్వు చెప్పేది నిజమే. ఇప్పుడు బాగు సంగతెవడిక్కావాల? ఈ కాలం కుర్రోళ్ళు నీ లెక్కేటన్నట్టు మాట్టాడతారు. మాలాంటి వయసు మళ్ళి నోళ్ళు 'అయ్యో' ఇలా జరిగిందేటి?" అనుకుంటామంతే. ఇంకేటి సేస్తాంలే" అన్నాడు. అట్టాగే నడుసుకుంటూ వచ్చాం. దార్లో తోపు, నుయ్యి వున్నాయి. అక్కడికొచ్చేసరికి ఆ డేటి చేస్తాడేనని భయమేసింది. ఈ

సంచిలో డబ్బుందిలే. అందుకే ఆడు కొంచెం సున్నవుంటే ఇస్తావా?" అన్నాడు. ఇచ్చాను. తీసుకుని పోయాడు. ఈ రోజు వస్తూంటే ఆ తావులోనే మళ్ళీ కలిసాడు. ఆ మాట, ఈ మాట చెప్పి, "మంగమ్మా! కాస్త డబ్బుతో పని బడింది. అప్పిస్తావా? ఈ సారి రాగులమ్మగానే తీర్చేస్తాను" అన్నాడు. "నా దగ్గర యాడుంది?" అన్నాను. "సర్లే మంగమ్మా, నాకు తెల్దా డబ్బు అడా, ఈడా పూడ్చి పెడితే ఏటొస్తాది? నాకు అప్పిస్తావా, నన్ను సమయానికి ఆదుకున్న దానివవుతావు. నీకు వడ్డీ వస్తాది." అన్నాడు. కాసేపాగి, "నువ్వు కొడుకు కలిసున్నట్టయితే నేనడిగే వాణ్ణే కాదు. ఏదో కోడలికి నగా- నట్రా చేయించుకునే దానివి. ఇప్పుడు అట్టాటిదేవీ లేదు కదా! అందుకే అడిగా" అన్నాడు. చూడమ్మయ్యా, అదదొంటిగా వుంటే జనం కళ్ళెట్టా పడతయ్యో. "అంది. మా వార్నడిగి చెబుతాను" అన్నాను.

నేనింకా మావారి దగ్గర ఈ సంగతింకా చెప్పనే లేదు. మర్నాడు మంగమ్మ పెరుగుపోసి, రొంటినవున్న సంచీ తీసింది. "అమ్మయ్యా, లోపలికి పదండి లెక్కెట్టుకుందురుగాని," అంది. "నే నింకా అయనకి చెప్పలేదు, ఇంకో రోజు ఇద్దువు గానిలే" అన్నాను. మంగమ్మ, " నాకు శానా బయంగా వుందమ్మయ్యా. రంగప్ప ఇయాల కూడా వచ్చాడు." తోపు దగ్గర, "కూచో మంగమ్మ, తొందరేటి? ఎల్దువు గాన్లే" అన్నాడు. నా దగ్గర డబ్బు సంచీ వుందేమో , గుండె గుబగుబలాడింది. కూచోను అంటే, పట్టుబట్టి కూచోబెడితే చేసేదేటుంది.' అనుకుని కూర్చున్నా. ఆ మాట, ఈ మాట అడి ఆకరికి సెయ్యెట్టుకున్నాడు. "మంగమ్మా నువ్వెంత సక్కగుంటావని" అన్నాడు. ఇంటున్నావా అమ్మయ్యా? మంచి ఒయసులో వున్నప్పుడే కట్టుకున్నోడే పట్టుకున్న సెయ్యి దిలేశాడు. మరోడు ముట్టలేదు దాన్ని. ఇయాల ఈడట్టు కున్నాడు. ఇడిపించుకుని, "ఏటి రంగప్పా, సరసం ముదిరిందే. నా అంద సందాల వూసెత్తడానికి నువ్వేమన్నా నా కట్టుకున్న మొగుడివా? ఇడిసిపెట్టు" అని ఇదిలించుకుని, లేచి సర సర వచ్చేసినా. నిన్న డబ్బడిగాడు, ఇయాల మానవడిగాడు. పీటల మీద కూసోని, బాసిగం కట్టుకుని సెయ్యి పట్టుకున్న మా రాజు యాడకి పోయాడో తెలవదు. ఒయసులో వదిలేసినాడు. మరోత్తయితే, "కట్టుకున్నోడొదిలేశాడు. కలిసుందాం రారా నా సావిరంగా" అని ఎగిరి గంతేసి పోయేది. కాని నేను మరియాదకి కట్టుబడ్డ మడిసి నమ్మయ్యా ఇయాల ఈ పోకిరోడు వచ్చి చెయ్యి పట్టుకున్నాడు సూస్తివా? అంది.

నాకు, ఇదేమిటి, ఈమె కథ ఏదో ప్రమాదానికి దారి తీసేటట్టుందే అనిపించింది. "ఇదంతా ఎందుకొచ్చిన గొడవగాని మంగమ్మా అయిందేదో

అయిందిగాని, వెళ్ళి కొడుకు దగ్గర వుండరాదా?" అన్నాను.

"నేనుంటానంటే ఏం లాబంలే అమ్మయ్యా, ఆడుండ నియ్యొద్దూ."

"కొడుకుతో చెప్పు ఇదంతా".

"అయ్యో నా తల్లి, రచ్చకీడ్చి వెలివేయిస్తుంది నాకోడలు. నాకు పొద్దు పోతుంద. నేనెళ్ళొస్తా. అయ్యగార్నడిగి రేపు చెప్పు" అంటూ వెళ్ళి పోయింది మంగమ్మ.

మళ్ళి ఒంటి గంటకొచ్చింది. "అమ్మయ్యా, ఇవాళొక పనయింది".

"ఏమయింది?"

"పిల్లాడి కుంటుందిలే అని కాస్త మిటాయి కొని తట్టలో పెట్టుకున్నా." అంది మంగమ్మ. మొన్ననే కదా, కోడలు పిల్లాడిని తన దగ్గరకి రానీకుండా చేస్తోందని చెప్పింది, ఇవాళ పిల్లాడంటే ఏ పిల్లాడనుకోవాలి? "ఏ పిల్లాడని అడిగాను?" "మా పిల్లాడికే అమ్మయ్యా." "నీదగ్గరకి రాడన్నావుగా!" "వెళ్ళొద్దని ఆళ్ళమ్మ సెబుతుంది గాని, ఆడుండ గలడా. ఆళ్ళు సూడకుండా ఎప్పుడో వచ్చి కాసిన్ని పాలు తాగుతాడు. కూసింత పెరుగు బువ్వ పెట్టమంటాడు. ఏదైనా ఇస్తే గంతు లేస్తాడు. గోల చేస్తే మీ అమ్మకి చెప్తానంతే. అంటే, నోరు మూసుకుంటాడు. పిల్లల ఆటే ఆటకదా. ఆడి కోసమని ఒకింత మిఠాయి తట్టలో ఎట్టుకుంటే ఈ సంకరపురంలో వచ్చేటప్పుడు కాకి తన్నుకు పోయింది. చూడమ్మయ్యా ఇట్టా జరిగిందెందుకు?" అంది. "ఏమైందిలే, ఓ పొట్లాం కాకెత్తుకుపోతే మరోటి కొనుక్కెళ్తే పోలా?" అన్నా। "అట్టా కాదమ్మయ్యా, కాకి మనుషుల్ని ముట్టకూడదంటారు కదా! అందుకని అడుగుతున్నా." అంది. "ముట్టుకుంటే ఏమంట?" అన్నాను. "పానానికి ముప్పు-" అంటారు. నాకు కొనకాలం వచ్చిందేమోనని బయం వేసింది ముందు. మళ్ళి అనుకున్నా. ఇదీ మంచిదే ఎవురికీ పనికిరాని జల్మ మెందుకని. ఏమంటావమ్మయ్యా? "ఏం మాటలవి? కాకికి దొరికేలా మిటాయి పెట్టుకుని వీథిలో నడిస్తే కాకెత్తుకు పోదా? దానికేదో ముప్పనుకుంటే ఎలా? బుద్ధి లేకపోతే సరి. ఏం ఫరవాలేదుగాని, ఇంటి కెళ్ళిరా" అన్నాను. "అయితే భయం లేదంటావా అమ్మయ్యా?" "ఏమీ భయం లేదు, గియం లేదు. ఆపదలొచ్చిన కొద్దీ ఆయుస్సు ఎక్కువంటారు. దీని గురించేంకాదు ఆలోచించకుండా హాయిగా ఇంటి కెళ్ళు"

మంగమ్మ వెళ్ళిపోయింది. నేను ఆమె మనఃస్థితి గురించి ఆలోచిస్తూ ఆశ్చర్యపోయాను. కొడుకు కావాలి, కోడలు కావాలి, మనవడు కావాలి. కాని తన పెద్దరికాన్ని అంతా గౌరవించాలి. మనిషన్న వాడికి ఈ చాపల్యం తప్పనిది. అది లేకపోతే బ్రతుకులో ఏదో బాధ. అయినా చావడానికి ఇష్టం లేదు. కాని

ఆ ఇష్టం లేదని ఒప్పుకోవడానికి ఇష్టం వుండదు. పల్లె జానాలకి దాపరికం, మాయ- మర్మం లేదని మనం ఎంతనుకున్నా ఇలాంటి వాళ్ళ మనఃస్థితి ఇంతే. తెరల వెనుక తెరలు. ముడతల మాటున ముడతలు, పొరలు పొరలుగా ... మరుగుగా... అర్థమే కానట్లుంది. ఇదే రకం నాటక సూత్రమో అర్థం కాలేదు నాకు.

మంగమ్మ ఈ సారి మరొక సంగతి చెప్పింది. ఆ మనవడు అమ్మని, నాన్నని వదిలి ఈవిడ దగ్గరకే వచ్చేశాడట. ఆమెకి చాలా సంతోషంగా వుంది. ఆ కుర్రాడి ధైర్యం చూడమంటూ, "చూడమ్మయ్యా. ఇంతున్నాడో లేదో కుర్రకుంక నిన్న మద్దేన్నం నా కాడికి వచ్చినేడు మళ్ళీ అమ్మ దగ్గర కెళ్ళనని మొరాయించాడు. ఇన్నాళ్ళూ దొంగచాటుగా వచ్చేవేడు ఎప్పుడైతే ఇట్టా చేశాడో అళ్ళమ్మొచ్చి నానా గోలా చేసింది. "తంతాను నడింటికి " అంది. పిల్లాడు నా కాళ్ళకి చుట్టుకుని రానని మొర్రోమన్నాడు. ఎల్లరా అని ఎంతో సెప్పా. అళ్ళయ్యా పిల్చాడు. ఉహూఁ ఎల్లనే లేదు. నాకాడే వుండిపోయాడు తెలుసా తల్లీ. పది నాళ్ళుగా ఏరే కొంపలో ఒక్కదాన్నే పడుకునే దాన్ని కదా, కొంచెం బయం వేసేది. నిన్న పసిపిల్లాడైనా ఈడు తోడుగా వుంటే ఎంత దయిర్యంగా వుందో నాకు. ఎంతైనా మగ నలుసు కదా! చూడమ్మయ్యా దేవుడాడికి ఎట్టాటి బుద్ధిచ్చాడో. ఎదిగిన కొడుకు ఎల్లి పొమ్మంటే ఈ బుల్లి మనవడొచ్చి నేనున్నానని తోడు నిలిశాడు. కోడలు రాత్రంతా నోరెట్టుకుని అరుస్తూనే వుంది. కదలమంటే ఈడు కదిల్తేనా? పొద్దుటే నేనిట్టా రావాలిగా. ఒక్కడే ఏడుంటావు? అమ్మకాడికి పోరా అని అళ్ళ గుమ్మం కాడా దిగిడిసా. ఆడు లోన కెళ్ళాడు. నేనిట్టా వచ్చా"

"కోడలు పిల్లాణ్ణి కొడితే ఏం చేస్తావు?" అనడిగాను. "పిల్లాడిప్పటికేనా వచ్చాడని అమ్మకి సంతోసంగా వుండదా ఏం? ఎప్పుడూ ఎదురుగుంటే కొట్టాలనుంటుంది గాని, ఇప్పుడు సూడమ్మా, ఒకే ఇంట్లో వుంటుంటే నా కోడలు ఎంత అందగత్తో నాకు తెలవనే లేదు. ఇప్పుడు దూరం నించి సూత్తానా... ఏదో మొకం ముడుసుకుంటే ఏదో లాగుంటుంది గాని, లేకపోతే మంచి అందగత్తెల్లోకే లెక్క. అందుకే నా కొడుకు దాని వల్లో పడ్డాడు. ఆడిసీ అంతే, పొలానికెప్పు డొస్తాడో సూసేదాన్ని కాదు. ఇప్పుడు గుమ్మం కాడ కూసుని ఇంకా రాలేదేటి అనే, ఇంత తొరగా ఎల్లున్నా డేటనే సూస్తాను కదా. దానికీ అంతే కదా. ఇప్పుడు కొడితే, ఆడు రేపు నాతో బాటు ఇటొచ్చేస్తే ఏటి సేస్తాది? కొడుకునిడిసి పెట్టుకుంటాదా? అన్ని నెలలు మోసి కన్న కొడుకు నెట్టా వద్దనుకుంటాది? "ఆహాఁ ఈమె ఊహాలు ఎంత దూరం పోతున్నాయి కదా" అని ఆశ్చర్యం వేసింది నాకు. ఈ లోపలే వీళ్ళ మధ్య పొరపొచ్చాలు తొలగిపోయే సూచలు కనపడుతున్నట్టుగా

తోచింది నాకు.

అలాగే జరిగింది కూడా. రెండు రోజులాగి తల్లి దగ్గర కెళ్ళిన కుర్రాడు మర్నాడు నాన్నమ్మతో బెంగుళూరొస్తానని పేచీ పెట్టాడు. ముసల్ది పెరుగుతట్ట నెత్తిన పెట్టుకుని కుర్రాణ్ణి చంకలో వేసుకుని మూడు మైళ్ళు రావడం సాధ్యమా? మంగమ్మకి ఏం చేయ్యాలో తోచలేదు. కొడుకు-కోడలు వచ్చి "ఏదో మా వల్ల తప్పయిందనుకో, నువ్వూ కోపం చేసుకుంటే ఎట్టాగమ్మా?" అన్నారు. ఊళ్ళో వాళ్ళు నలుగురూ వచ్చి నాలుగు ఒదార్పు మాటలు చెప్పారు. తన బింకం సదలకుండా మంగమ్మ ఇష్టంగానే కోడలితో కలిసిపోయింది. కాని ఈ మనవడు నాన్నమ్మతో వుండాలని పట్టుబట్టాడు. దాని వల్ల కొత్త ఏర్పాటు చేసుకున్నారు. మొదట్నుంచీ పాలు-పెరుగు వ్యాపారం మంగమ్మ చేతిలోనే వుంది. కోడలు వచ్చాక కూడా మంగమ్మ ఆ పని తన చేతిలోనే పెట్టుకుంది. ఇంటి కోడలు అన్నాక వంట - వార్పు చెయ్యొద్దా? మరో కారణం ఏమిటంటే, పెరుగు అదీ అమ్ముకుంటే చేతిలో కాసిన్ని పైసలు ఆడతాయి. కాని ఎప్పుడైతే మనవడు నాన్నమ్మతోనే వుంటానని పటుబట్టాడో, "ఏటి ఎండలో పోడం, రాడం మాటలా! పెద్ద తనం వచ్చాక ఎన్నాళ్ళ చాకిరీ. ఇంత ముద్ద (సంగటి) కెలికి చారుపెట్టి ఇంట్లో వుండు. నేనెళ్ళి పెరుగమ్ముతాను" అంది. మంగమ్మ ఒప్పుకుంది. "ఎప్పుడైనా ఓ నాడు నే నెడతాను. రోజూ నువ్వే ఎళ్ళిరా" అంది. ఓ రోజు అత్తా కోడళ్ళిద్దరూ వచ్చారు. ఒకరి చంకలో పిల్లాడు, మరొకరి నెత్తిమీద పెరుగు తట్ట. "ఇదిగో నమ్మయ్యా నా కోడలు. పాపం ముసల్ది, తనే వుడకేసుకుని అవస్థ పడుతుందని, మళ్ళీ నన్నింట్లో చేర్చుకుంది. ఉట్టినే ఎండలో పడి తిరగద్దని అంది. సరే నన్నాను. ఇక నుంచదే తెస్తుంది పెరుగు. పోయించు కోండమ్మయ్యా" అని చెప్పి కోడలికి మా ఇల్లు అప్పజెప్పింది. నేను అత్తనీ కోడల్నీ పలుకరించి సరిగ్గా చూసుకోండని మంచి మాటలు చెప్పి, ఆకు-వక్క ఇచ్చి పంపించాను. ఈ మధ్య ఆ కోడలే పెరుగుపోస్తోంది.

అత్త వేపు నుంచిన్ని మాటలు జరిగాయి కదా, ఇక కోడలేమంటుందో ఏందామనిపించి ఓ రోజు, "ఏమే నంజమ్మా! నువ్వన్నీ తెలిసినదానిలా కనిపిస్తున్నావు కదా, అత్తని ఇంటినుంచి వెళ్ళగొట్టచ్చా? అని అడిగాను. దానికి నంజమ్మ అంది కదా, "అత్తనెల్లగొట్టడానికి నేనేటి రాచ్చసినా అమ్మగారూ, అత్త అన్న మనిషి అన్నింటికీ నేనే పెద్దనంటూ తయారైతే, ఇక అదు మొగుడేటి, నేను పెళ్ళానేటి, మేం సంసారం చేసేదేటి? ఏదో అత్త, తను కన్నది, పెంచింది. నా మొగుణ్ణి కావాలంటే తనకి సొంతం అని అట్టే పెట్టుకోనీ. కాని నాకొడుకుని నేను కొట్టకూడదని రూలు పెడితే ఇదెక్కడి కోడం[ట్రికం అమ్మగారు?" అంది.

కొడితేనే కొడుకు నీ సొంతమని లెక్కా? అని అడిగాను. "కొడతానే, అదించుకుంటానే, కొట్టినందుకు ఎందుక్కొట్టావని అడిగినవాళ్ళు, అదించు కున్నప్పుడు ఎందుకాడిస్తున్నావనీ అడగచ్చు. వీటన్నిటికీ ఎవరు జవాబు చెప్పగలరమ్మయ్యా. నా కొడకంటే, నా కొడుకే. నా మొగుడంటే నా మొగుడే. కోడలంటూ వచ్చాక, అత్త ఒక మాటంటే అనచ్చు, ఒక దెబ్బ కొట్టిస్తే కొట్టించచ్చు. ఇది లేకుండా ఎవరి సంసారం మాత్రముంటుంది?" నాకు మంగమ్మ చెప్పినపుడు తను చెప్పింది 'సరి' అనిపించినట్టుగానే, కోడలు చెబుతుంటే కోడలిదీ సరిగ్గా వున్నట్టుగానే అనిపించింది. "అయితే ఇప్పుడు నీకు ఇంట్లో కొంత స్వతంత్రం వచ్చినట్టేనా?" అనడిగాను. "ఇప్పుడు మొదటికన్నా నయం తల్లి. ఎట్టాగో సర్దుకుపోవాలి. లేకపోతే గొడవ పడితే మాకే నష్టం. మా అత్త దబ్బు మీద కన్నేసి వున్నా రెంతోమంది. కాజేసినా చెయ్యొచ్చు. రంగప్ప అని ఒకడున్నాడు. అడు మా అత్త వేరు కాపురం పెట్టినపుడు అప్పుడిగాడట. ఈమె ఇస్తానందట. అదొచ్చి అ మాట చెప్పాడు. అప్పుడు నేను మా కుర్రాణ్ణి పిలిచి, " ఒరే నాన్నమ్మ దగ్గరకెళ్ళి అడుగు, మిఠాయి పెడుతుంది, తాయిలం పెడుతుంది. మళ్ళీ పిల్చేదాకా రామాకు." అని కట్టడి చేశా. గొడవలెలాగైనా సర్దుకుంటే చాలని అట్టా చేశానమ్మా అంది. "అయితే పిల్లాడు మంగమ్మ దగ్గరకి వాడంత వాడు వెళ్ళలేదా?" అడిగాను. వెళ్ళాడమ్మగారు. వెళ్ళనీ అని నేనే వూరుకున్నాను. "కాని అమ్మగారూ, ఇయ్యన్నీ పైకి చెప్పుకోగలమా? మగవాళ్ళ కివన్నీ ఏం తెలుస్తాయి?"

మంగమ్మ కంటె నంజమ్మ తెలివితేటల్లో తక్కువదేం కాదు. ఆ ఇంట్లో ఇప్పుడు అత్తకి, కోడలికి స్వాతంత్ర్యపు పోటీ జరుగుతోంది. దాని అసలు స్వరూపం: ఆ తల్లి కొడుకు, ఈ పెళ్ళానికి మొగుడు. అతడిని తన పట్టునుంచి వదులుకో కూడదని తల్లి మనోవాంఛ, అతడిని గుప్పిట బంధించాలని ఈ కోడలి పట్టుదల. ఇదీ ప్రతిచోట జరిగే భాగోతమే. ఇందులో గెలుపు - ఓటమి, ఈ విధంగా వుంటాయని చెప్పడానికి లేదు. నీటిలో మొసలిలా కాలు పట్టుకుని లోపలి కీడ్చే కోడలు. ఒడ్డున నుంచుని మొసలి బారినుంచి రక్షించడానికై పైకి లాగే తల్లి - మధ్యన ఇరుకునపడ్డ బిడ్డ. పల్లెలో అయితే పెరుగు మంగమ్మ ఇంట్లో, పట్నంలో అయితే పెరుగుకొనే తంగమ్మ ఇంట్లో ఈ నాటకం జరుగుతూనే వుంటుంది. అఖరి అంకం ఊహించలేని నాటకం!

# 3.గురువుల మహిమ

ఎ.ఆర్.క్రిష్ణశాస్త్రి

"స్వకర్మ సూత్ర గ్రథితో వా లోకః"

- అధ్యాత్మ రామాయణం

(ఒక సంసారంలో అందరూ ఆడపిల్లలే పుట్టారు. తల్లికి ఒక మగనలుసు కావాలన్న ఆశ వుండేది. కాని ఆ కోరిక నెరవేరక పోవడంతో ఆఖరి కూతుర్ని, అల్లుడిని ఇంట్లో వుంచుకుని అల్లుడినే కొడుకులా చూసుకో సాగారు. ఆ సమయంలో ఒక గురువుగారు కోరినదల్లా ప్రసాదిస్తారని విని, ఆ తల్లి ఆయన సేవ చేసి తనకి పుత్ర సంతానం కావాలని పట్టు పట్టింది. ఆయన ఎంత వారించినా వినలేదు. ఒక దాని బదులు ఒకటి జరిగింది. తన కడుపున కొడుకు పుట్టడానికి బదులు, కూతురు ఒక మగపిల్లాడిని కని చనిపోయింది. ఆ బిడ్డని పెంచాల్సిన భారం ఆమె నెత్తిన పడింది. ఇదీ కథ.

తల్లి బాధ, గురువుల ఓదార్పు, వీటి మధ్య నలుగుతూ కథ కనిపించడం కష్టమవుతుందని దాని సంగ్రహం మాత్రం ఇవ్వబడిందిక్కడ.)

1

"ఎందుకు తల్లీ ఇలా వూరొదిలి పెట్టి సంసారం వదిలి పెట్టి, ఉపవాసం, వనవాసం చేస్తూ అవస్థ పడుతున్నారు ?"

"నా కెక్కడిది సంసారం? చేసుకునే వాళ్ళు చేసుకుపోతున్నారు".

అదేమిటి తల్లీ అలాగంటున్నారు? నిండు సంసారం, భర్త, పిల్లలు, మనుమలు కావల్సినంత మంది వున్నారే!"

"ఎందరుంటేనేం? 'నాది' అన్న పదార్థం లేకపోయాక".

"వాళ్ళంతా మీ వాళ్ళు కారా?"

"దానికేం, ప్రపంచమంతా నాదే!"

"ఆహా, నిజంగా దొడ్డమాటది. సత్యమైనమాట."

"సత్యంగా కనిపిస్తేనే కదా సత్యం!"

"కాదూ మరి!"

"చూసిన వాళ్ళంతా ఇక్కడంతా సత్యం నిండి వుందని అన్నారు. దాని కోసరం వచ్చాను. నాకూ అది దర్శనమిస్తేనేగా సత్యం!"

" దానికి అడ్డేమీ లేదు. కాని, ఎన్ని రోజులు ఇలా ఇల్లు- వాకిలి విడిచిపెట్టి వుంటారు?"

"నా పని అయ్యేదాకా."

"అయ్యే పని ఎక్కడున్నా అవుతుంది."

"అయితే దేవుడు, గురువులు, యాత్ర, తీర్థం, సేవ, పూజ అని ఎందుకు ర్పాటు చేశారు?"

"అవన్నీ వెట్టి భ్రాంతులమ్మా"

"మరి ఎంతోమంది నేను ఇక్కడకి వచ్చాక వచ్చి, తమ కోరికలు ెరవేరాయని తిరిగి వెళ్ళారుగా మరి?"

"అది వాళ్ళ వాళ్ళ వూళ్ళల్లో వున్నా జరిగేదే. చెట్టు మీదే పండు కాబోయిన వాన్ని ఇక్కడకి తెచ్చుకుని మాగేసుకుని (కావేసుకుని) తీసికెళ్ళారంతే"

"నేను వూళ్ళో వుండి చెయ్యగలిగిన దంతా చేశాను. వ్రతాలు, నోములు, పూజలు, అన్నీ చేశాను. ఏదీ నాకు ఫలించలేదు. అందుకే ఈ సారి నా కోరిక ఫలించే దాకా ఎన్ని రోజులయినా ఇక్కడే వుండి పోవాలని మనసు గట్టి పరచుకుని వచ్చాను."

"మహారాజులా వుండొచ్చు. దానికేమీ అడ్డు లేదు. నా కేమీ బరువు కాదు. దేవుడి సేవ చెయ్యడం మంచిదే. కాని మనసు నిండా ఆశ నింపుకుని చేసే సేవ ఫలించదు."

"ఇది మరీ బాగుంది. సేవ చెయ్యడమే ఆశలు తీర్చుకుందుకు కదా? ఆశలే లేకపోతే ఈ కష్టమెందుకు?"

"మీరు చెప్పేది నిజమే. అందరూ కష్టపడేది ఆశ పెట్టుకునే. ఆ కష్టానికి ప్రతిఫలమూ వుంటుంది. కాని తమ ఆశే నెరవేరుతుందన్న భరోసా ఇవ్వడం కష్టం."

"ఈ మాట వినడానికేనా నే నిక్కడ కొచ్చింది? ఇన్ని రోజులు సేవ చేసింది ఇందుకేనా? ఇదే నా సత్యం?"

"సత్యం ఒక్కటే తల్లీ. అదెప్పుడూ ఒక్కటే. కాని అక్కర్లేని వారికి అది హితవుగా వుండదు. మిథ్య నానారూపాల్లో వుంటుంది. హితవుగానూ వుంటుంది."

"సత్యం - మిథ్య , హితవు - అహితువు ఈ వేదాంత బోధ వినడానిక్కాదు నే నిక్కడి కొచ్చింది. అదంతా నా కనవసరం...."

"ఒద్దంటే ఎలా తల్లీ! ఆఖరికి అందరికీ దొరికేది అదే. మనం వొద్దన్నా వొదలదు."

"ప్రస్తుతం నాకు మరేదీ వద్దు. నేనిక దేనినీ కోరను."

"అయితే మీరు కోరే దేమిటి?"

"నేను అప్పుడే చెప్పాను కదా! మళ్ళీ చెప్పాలా? ఇక్కడికి వచ్చి ఎవరూ దేనినీ అడగక్కర్లేదు. గురువుల దృష్టిపడితే చాలు కోరికలు నెరవేరుతాయి అన్నారు. ఆయన ఎవరితోనూ మాటలే అడరని విన్నాను."

"అది నిజమే తల్లీ. నేనింతవరకూ ఎవరినీ ఇంతగా మాట్లాడించింది లేదు. అందరూ వాళ్ళ వాళ్ళ పని చూసుకుని ప్రసాదం తీసుకుని వెళ్ళేవారు. నేను ఎవరికేం చేశాను? ఏం చెయ్యగలను?"

"అయితే నా కోరిక తీరదని చెప్పడానికి నాతో ఇంతగా మాట్లాడుతున్నారా?"

"నేనేం చెయ్యను తల్లీ. పని జరిగేది, జరగనిది నా చేతుల్లో వుందా?"

"మరెవరి చేతుల్లో?"

"భగవంతుడి చేతుల్లో."

"అతని చేతి నుండే చేయించి పెట్టండి."

"అతడు నా అధీనంలో వున్నాడా?"

"మరి గురువులు, గురువులు అనడం దేనికి?"

"అది వారి వారి విశ్వాసం అంతే."

"మరి నాసేవకు ఫలం లేదా?"

"శ్రమకు ఫలమెందుకు లేదు? వుంది. కాని, ఆశ పెట్టుకుని సేవ చేస్తే ఇంకా కర్మ చుట్టుకుంటుంది అంతే."

"చుట్టుకుంటే చుట్టుకోనియ్యండి."

"దాని వల్ల దేవుడు కూడా చిక్కుల్లో పడతాడు."

"కానివ్వండి. సేవ చేయించుకునేది వూరికేనా?"

"అలా బేరాలకి దిగితే ఆయన కోమటవుతాడు."

"అవనివ్వండి" .

"మీ సేవ చాలదు. ఇంకా గట్టి వస్తువేదైనా ఇమ్మంటే".

"ఇచ్చెయ్యడమే"

"ఏమివ్వగలరు?"

"ఏదైనా సరే."

"ఏదైనా ఇస్తే కుదురుతుందా? మీరు పుత్రఫలం అడిగారు. మీకు ప్రాప్తమున్నంత దేవుడివ్వనే ఇచ్చాడు. ఇప్పుడొక కొడుకు కలిగితే వాడిని దేవుడి కొదిలేస్తారా?"

"దేవుడికి వదలడానికా కోరుకుంటున్నది?"

"మరేం చెయ్యమంటారమ్మా. దేవుడు మీకివ్వవల్సిన భత్యాన్ని కొలిచేశాడు."

"వున్నదాంట్లోనే ఏదైనా ఇస్తే కుదరదా ?"

"వున్న పిల్లల్లో ఎవర్నిస్తారు. వాళ్ళు ఇప్పుడు మీ సొత్తు కాదే. వాళ్ళనంతా దానం చేసేశారు కదా!"

"దానం చేస్తేనేం. మా వస్తువు కాకపోతుందా?"

"అవునూ, కాదు"

"అయితే నా కోరిక తీరదని చెప్పండి. ఇక్కడే ప్రాణత్యాగం చెయ్యడమే తరువాయి. ఇక ఊరికి వెళ్ళి నేను చెయ్యాల్సిన పని కూడా లేదు."

"బాగా ఆలోచించి చెప్పండి. తొందరపాటు తగదు. తరువాత మీరు, నేను ఇద్దరం పశ్చాత్తాప పడాల్సొంటుంది."

"ఈ ఆడపిల్లల్లో ఒకరు లేకపోయినా బాధుండేది కాదు.... ఒక్క మగపిల్లాడు...."

"రామ! రామ! ఎందుకలా అంటారమ్మా, ఆడపిల్లలు పిల్లలు కారా?"

"వాళ్ళేం పిల్లలు! చేయించుకునే దాకా చేయించుకుంటారు. తరువాత వెళ్ళిపోతారు. మా కష్ట-సుఖాలని అదుకునేదెవరు? మొదట మా ఇంట్లో వున్నప్పుడు చిన్న పిల్లలు. పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళేసరికి పెద్దవాళ్ళవుతారు. ఎవరి సంసారం వాళ్ళది. కోడళ్ళా మనింట్లో పడుండడానికి?"

"మగపిల్లలున్న వాళ్ళందరికీ కోడళ్ళు వస్తారా? వచ్చినవాళ్ళంతా కలిసి వుంటారా? వున్నా సుఖంగా వుంటారా? అదంతా ఋణానుబంధం. అమ్మా ఎవరి కెవరు?"

" వుంటారని గాని, వుండరని గాని కోరుకుంటామా?"

"అదంతా మన ఇష్టమేనా తల్లీ!"

"దేవుని ఇష్టమే కానియ్యండి. అందుకే అతన్ని అడుగుతున్నది. ఇప్పించమని మిమ్మల్ని డుగుతున్నది. లేకపోతే ఇక్కడి కెందుకు రావడం?"

"దేవుడైనా కొత్తగా ఎక్కడ్నుంచి తెచ్చి ఇస్తాడమ్మా? వున్న దాంట్లోనే 'తిరకాసు' చేస్తాడు. ఇప్పుడున్నది అక్కర్లేదంటే తలది తీసి కాలికి వేస్తాడు. కాలిది తీసి తలకి వేస్తాడు. అప్పుడు అవలక్షణం అవుతుంది. అస్తవ్యస్తమవుతుంది. మనమూ దాన్ని ఆక్షేపిస్తాం."

"నాకి వేదాంతం వొద్దు. నా కోరిక నాది, ఏమైనా సరే."

"భగవంతుడా నీ సంకల్పం ఇలా వుందా? ఈ పాపానికి నన్ను గురి చేస్తున్నావా? నీ చిత్తం కానీయ్. అమ్మా, ఈ భరిణలోని కుంకుమ పెట్టుకోండి. వచ్చే సంవత్సరం బిడ్డ నెత్తుకుని దైవదర్శనానికి రండి."

## 2

"ఏమిటి తల్లీ, కొడుకు నెత్తుకుని వచ్చారా? రండి."

"అయ్యో! ఆ పుణ్యం నా కెక్కడిది?"

"మరి ఈ బిడ్డ ఎవరు?"

"ఈ బిడ్డా? తల్లి లేని అనాథ."

"ఏం మీరున్నారుగా?"

"ఈ బిడ్డ నా బిడ్డ కాదు తండ్రీ. నాకూతురిది. అది నన్నూ ఈ బిడ్డనీ అనాథల్ని చేసిపోయింది"

"ఉహుం, అలా కాదు. బిడ్డ అనాథ కాలేదు. మీరూ కాలేదు. దానికి మీరు, మీకు అదీ ( బిడ్డా) దిక్కయ్యారు."

"ఇదా నేనడిగింది?"

"మరి దేనిని ? కొడుకుని అడిగారు. దేవుడు కొడుకునిచ్చాడు."

"కూతుర్ని పోగొట్టుకుని దిక్కులేని బిడ్డని పెంచుకోమనా?"

"అదీ మీరే అడిగారు కదమ్మా, ఆడపిల్లల్లో ఒకరు లేకపోయినా ఫరవాలేదు, ఒక మగ నలుసుండ కూడదా అని అడగలేదూ?"

"ఏమో అలా అనుకున్నాను గాని, అంత మాత్రాన అది చనిపోవాలని నేను కోరుకున్నానా?"

"మీరు అడిగింది దేవుడిచ్చాడు."

"తల్లిని పోగొట్టుకున్న ఏదో ఒక బిడ్డ నాదవుతుందా? ఈ వయసులో ఈ బిడ్డని కట్టుకుని వేగనా?"

"మరి దేవుడు మాత్రం ఏం చేస్తాడమ్మా? పూలు లేని చెట్టుకి పళ్ళెలా కాస్తాయి. కన్నబిడ్డ కాకపోతే, పెంచుకున్న బిడ్డ. మనవడు ఇంట్లోని బిడ్డే కదా! మనవల్ని దత్తత తీసుకునే వాళ్ళు కూడా వుంటారు కదా!"

"చాల్చాలు ధర్మ శాస్త్రాలు, ఈ బిడ్డని చూడలేను. వీడి నెవరేనా పెంచుకోనీండి. మీ మఠంలోనే వుంచుకోండి. నా కూతుర్ని కూతురిగా పెంచానా? కూతురొకటి, కొడుకొకటి కాదన్నట్టుగా పెంచాను, కదా?"

" అవునమ్మా దానికి ఎవరేం చేస్తారు. తల్లిని పోగొట్టుకున్న బిడ్డని అవ్వ కాక మరెవరు ప్రేమగా పెంచుతారు? ఇంకెవరికి కావాలి ? ఆ బిడ్డని పెట్టుకుని నేనేం చెయ్యగలను. పరదేశిని. "

"ఉహుం, నా కొద్దు. నా కూతురు నాక్కావాలి"

"ఇదేం పిచ్చి మీకు? ఇప్పుడు ఆ అమ్మాయి వస్తే భూతంలా రాగలదు. ప్రేతంలా రాగలదు. మునుపటిలా రాగలదా? వస్తే మీరే బెదిరిపోతారు. 'ఈ

దెయ్యాన్ని తరిమేయండి' అని పరిగెట్టుకుని వస్తారు. ఒద్దు తల్లి వొద్దు. ఈ దుఃఖంలో మీకలా అనిపించవచ్చు. తరువాత అంతా సర్దుకుంటుంది. మనం దేనికీ ఆశ పడకూడదు. దేవుడ్ని 'ఇదియ్యి, అదియ్యి' అని అడగ కూడదు. ఆయన ఇచ్చిన దానిని మహాప్రసాదం అనుకుని సంతోషంగా స్వీకరించాలి - అని నేను క్రితం సంవత్సరమే చెప్పలేదూ? ఒకసారి ఆశపడి అడిగితే ఇలా అయింది. మరోసారి మళ్ళీ ఆశపడకండి. భగవంతుడి దృష్టిలో. సంకల్పంలో ఏది ఎలా జరగాలని వుందో అలాగే జరగనియ్యండి. ఇలా వుండటం బాగోలేదు, మార్పు కావాలని మనం అడిగితే ఆయన మాత్రం ఏం చేస్తాడు? యంత్రంలో ఒక చోట వున్న భాగాన్ని తీసి, మరొక చోట వెయ్యగలమా?"

"ఇలాంటి కొడుకే ప్రాప్తము అనుకుంటే అదేదో మొదటే జరిగేది కదా?"

"అలాంటి కొడుకూ వున్నాడు కదా!"

"లేడే? అందుకే కదా ఇక్కడికొచ్చి దేహాన్ని దండించుకున్నది."

"ఇంట్లో ఎదిగిన కొడుకుండేవాడు కదా?"

"ఎక్కడ ? ఎవరు?"

"మీ అల్లుడు."

"ఇది మరీ బాగుంది. అల్లుడు కొడుకు కాదు, కోడలు కూతురు కాదని వినలేదూ?"

"అతడే కావాలని కోరి తెచ్చుకున్నారు కదా. ఇంట్లో వుండే అల్లుడే కావాలని తల్లి- తండ్రులు లేని కుర్రాణ్ణి చూసి, కూతుర్ని ఇవ్వలేదా? " కొడుకు కన్నా బాగా చూసుకున్నారు. అతడూ మంచి కుర్రాడని పించుకుని విశ్వాసంగా వున్నాడు. అంతకంటే ఇంకేం కావాలి ? ఎంతో మంది తెలియని వాళ్ళు అతనే మీ కొడుకనీ, కూతుర్నే కోడలనీ అనుకున్నారు."

"అయితే ఆ కొడు కొద్దు, ఈ కొడుకు రానీ అని అడిగానా నేను?"

"అలాగే అయింది మరి "

"ఎలాగ ? "

"అల్లుడు పోవల్సింది. అతడికి బదులుగా కూతురు పోయింది."

" అల్లుడే ఎందుకు పోవల్సింది ?"

"అతడి కర్మ."

"అతడేం కర్మ చేశాడు?"

"ఇదివరకేం చేశాడో తెలీదు గాని, ఇప్పుడు మీ కళ్ళెదుట చేస్తూ వున్నాడు కదా? నవ్వుతూ నవ్వుతూ చేసినదానికి ఏడుస్తూ ఏడుస్తూ అనుభవించాలి."

" అలాంటి పాపపు పని అతనేమీ చెయ్యలేదు గురువుగారు. అతనేం

పోలీసు కాదు, జడ్జి కాదు. దొంగ కాదు, దోపిడిదారు కాదు. ఒకర్ని కొట్ట లేదు. హింసించ లేదు. మరొకరితో గట్టిగా మాట్లాడికూడా ఎరుగడు..."

"నిజమే, అందుకే చెప్పాను, అతను మంచి కుర్రాడని. అందరూ అనడం కూడా అందుకే! అయ్యో! పిల్లాడు ఏడుస్తున్నాడు. ఎత్తుకోండి, సముదాయించండి."

'తల్లి లేని అనాధని నేనేం సముదాయించగలను ? పిల్లల్ని ఎత్తుకునే అలవాటు కూడా తప్పి పోయింది."

"ఎత్తుకోండి. అదే అలవాటవుతుంది. ఇప్పుడు మీరెత్తు కోగానే పిల్లాడు పూరుకుంటాడు చూడండి. మీరే తల్లి అనుకుంటాడు. ఆ బుద్ధి తెలుస్తుంది పిల్లాడికి. మీ పిల్లాడన్న భావం మీరు కూడా తెచ్చుకోవాలి. అలా అయితే దేవుడి సంకల్పం కూడా నెరవేరుతుంది."

" కాస్త పాలుంటే తెప్పించండి పట్టి చూస్తాను."

" బికారి దగ్గర పాలెక్కడివమ్మా. ఇదిగో ఈ తీర్థం తీసుకోండి. ఊ(, లేవండి. లేచి వచ్చి తీర్థం తీసుకుని మీరు తాగండి, పిల్లాడికీ తాగించండి. అవే పాలవుతాయి. ఇప్పుడు పిల్లాడిని సముదాయించండి. మీ కూతురికి అల్లుడికీ మీరెలాగో ఈ పిల్లాడికీ మీరు, అంతకన్న ఎక్కువగా తల్లి ....! ముందు మీరు సమాధాన పడాలి. పిల్లాడిని జోకొట్టండి. చూశారా ఇప్పుడు పూరుకున్నాడు. ఇక నిద్రపోతాడు. మీరు సమాధాన పడగలిగితే వాడు హాయిగా వుంటాడు. నేను సమాధానపడితే మీరూ సమాధాన పడతారు. ఊ(, ఇప్పుడడగండి. ఏదో అడుగుతున్నారుగా ...."

"ఏం చెబుతున్నాను ?"

" పిల్లాడు ఏడవడం మొదలుపెట్టినప్పుడు ఏదేదో చెప్పుకుని ఏడిచారు కదా ఇక్కడికొచ్చి నన్ను ఏమి అడగదల్చుకున్నారు?"

"నా కూతురెందుకు చనిపోయింది అని అడగదల్చుకున్నాను?"

"ఎందుకని చెప్పను? ఎన్నో దారాలు కలిసి చిక్కుముడి ఏర్పడింది. దాన్ని విప్పబోతే ఒ దారం తెగిపోయింది."

"దారం కాదు, తాడు అనండి"

"దాన్నే కర్మ సూత్రం అంటారు."

" అంటే...."

" దాన్ని కూడా నా నోటితోనే చెప్పించాలా ? 'చేసిన వాళ్ళ పాపం, చెప్పుకున్న వాళ్ళకి' అన్నట్టు, అదంతా ఎందుకు ? ముఖ్యంగా భగవంతుడి సంకల్పం అనుకోండి."

"మంచి భగవత్సంకల్పం వెచ్చి పడిందే, అన్నింటికీ భగవత్సంకల్పం! భగవత్సంకల్పం! ఈ పాడు భగవంతుడు, ఎక్కడ ముక్కు మూసు క్కూర్చున్నాడో గాని"

"అవును తల్లీ, భగవత్సంకల్పం లేకుండా ఒక్క గడ్డిపోచ కూడా కదలదు."

"నాకీ మాటలు అర్థం కావు. నాకు తెలిసే లాంటి మాటలేవైనా వుంటే చెప్పండి."

"అలాగే, మీ కూతురు భర్త కోసం ప్రాణం ఇచ్చింది."

"అయ్యో! ఇందుకేనా వాడికి పిల్లనిచ్చి ఇంట్లో పెట్టుకున్నది?"

"మరొకరికి, అందునా భర్తకి, తన ప్రాణం కన్న మరే మివ్వగలదు? తను బ్రతికినంత కాలం ప్రేమ నిచ్చింది. ఆఖరికి ప్రాణాన్నిచ్చింది. అలా కాకుండా అది తిరుగమరుగయ్యుంటే ఆమె ఇంట్లో ఏడుస్తూ కూర్చునేది, ఆమెను చూసి మీరు బెంగటిల్లి జబ్బు పడేవారు. ఇరుగు- పొరుగు, అయినవాళ్ళు - కానివాళ్ళు, ఆమెను శపిస్తూ, నష్ట జాతకురాలు, అపశకునం అని పొడుస్తుంటే దాన్ని చూసి మీరు భరించగలిగేవారా?"

"ఏమో ఏం చేసేదాన్నో!"

" రామ రామ, ఆ దుఃఖం ఎవరికీ వద్దు. మన సంఘంలో తలచెడిన ఆడపిల్ల పడే పాట్లు ఎవరికీ వద్దు. ఇప్పటికన్న అప్పుడు మరింత బాధపడేవారు. మీతో బాటు ఆ పిల్లా మీకన్నా ఎక్కువ బాధ పడేది. పుట్టిన తరువాత ఎవరికేనా చావు తప్పదు. కాస్త వెనుకా - ముందూ. ఆమె పసుపు - కుంకుమలతో వున్నంతకాలం అందరితో మంచి అనిపించుకుని పోయింది. ఆ పుణ్యం అందరికీ ఎక్కడ్నుంచి వస్తుంది ?"

"ఇంత చిన్న వయసులోనే పోవాలా? సంసారంలో మంచీ, చెడు ఏం చూసిందని?"

"ఇంకా బ్రతికి వుంటే తనేం కష్టాలు పడాల్సివచ్చేదో, మీరేమేమి కష్టాలు చూడాల్సి వచ్చేదో ఎవరికి తెలుసు?"

"బ్రతకడం కష్టాపడ్డానికా ?"

"మరి దేనికమ్మా, సంసారంలో కష్టాలు కాక ఏముంది?"

"ఎంతో మంది సుఖంగా వుండటం లేదూ?"

"వున్నారు. ఎవరెవరి సుఖాల్ని దోచుకుని అనుభవిస్తారో మీకు తెలుసా? అదీకాక , ఏ పుట్టలో ఏ పాముందో ?"

"తను భర్తకోసం ఎందుకు ప్రాణాలివ్వాల్సి వచ్చింది? అతను చేసిన పాపమేమిటి? అతడెవరి సుఖాన్ని దోచుకున్నాడు? ఎవరికి అన్యాయం చేశాడు.

అతని కున్నదో మేష్టారి వుద్యోగం. అందులో వంచన, మోసం, అబద్ధం, అన్యాయం, లంచం, ఇలాంటివేమీ లేవే! పిండి కొద్దీ రొట్టె అన్నట్టు గవర్నమెంటు వారు ఇచ్చిన జీతం ఎంతో అంతే కదా. అందులో ఇక అతను చేసిన కర్మేముంది?"

"మీరు చెప్పేది నిజమే తల్లీ. కాని వాళ్ళు చెప్పే పాఠాలేమిటో తెలుసా? పాఠాలు చెప్పేటప్పుడు చేసే పనులు ఏమిటో తెలుసా?"

"నాకేం తెలుసు? ఏదో కలకత్తా వెళ్ళి రెండేళ్ళు చదువుకుని వచ్చాడు. ఇక్కడ పనిలో చేరాడు."

"మీకు తెలిసిదంతే అక్కడ చదువుకున్నప్పుడు, ఇక్కడ ఉద్యోగం చేస్తున్నప్పుడు అయనెన్నో జీవుల్ని చంపి, కోసి, హింసించాడు."

"రామ , రామ"

"అడగండి కావాలంటే. దాన ఫలమంతా ఎక్కడికి పోతుంది ?"

"అయితే అలాంటి పాఠాలు చెప్పేవాళ్ళంకెవరూ లేరా ? వాళ్ళందరికీ ఇలా అవుతుందా ? కసాయి వాళ్ళు రోజు అవుల్ని చంపుతారే, దాన్ని తినేవాళ్ళు రోజూ తింటారే, వాళ్ళందరికీ ఇలా అవుతుందా ?"

"దాన్ని అరిగించు కోగలిగే వాళ్ళు అరిగించుకుంటారు. అలా అందరూ జీర్ణించుకోలేరు. అదీ కాక ఎవరెవరు ఏయే పాపఫలితాన్ని ఎప్పుడెప్పుడు ఏయే తీరుల్లో అనుభవించాల్సి వస్తుందో మీకు నాకు కనిపిస్తుందా తల్లీ ?"

"అతను చేసుకున్న ఖర్మకి నాకూతురెందుకు చావాలి ?"

"ఎన్నో రోజులు సాయంత్రాలు అతడు ఇంటికొచ్చి తలనొప్పిగా వుందని పడుకునేవాడు. ఏదో అలసట, అయాసం అంటూ నీరసపడేవాడు. సరిగ్గా అన్నం తినేవాడు కాదు. నిద్రపోయేవాడు కాదు. డాక్టర్ని అడిగితే "ఏమి లేదు, అయనకేం బాగానే వున్నారు అనేవారు కదూ! మీ అమ్మాయి మాత్రం భర్త బాధ చూడలేక "అయ్యో ఈ రోగం నాకైనా రాకూడదా, అయనకి అరోగ్యం చేకూర కూడదా!" అనుకుంది. ఆ పిల్ల పతివ్రత, సచ్చరితురాలు, దేవుడు ఆమె ప్రార్థన విన్నాడు, అలాగే చేశాడు."

"ఇలా అని తెలిస్తే వాడిని కలకత్తా కి పంపేవాళ్ళం కాదు, వాడి కోసం వేల కొద్దీ రూపాయలు ఖర్చు పెట్టే వాళ్ళమూ కాదు. ఈ ఉద్యోగం కాకపోతే మరో ఉద్యోగం చేసుకునేవాడు."

"ముందు జరిగేది ఎవరు చూడగలరమ్మా ? కళ్ళకి కనిపించినా, నోటి మాటతో చెప్పగలగాలి కదా!"

"మాట నోటికి రాక చేతి కొస్తుందా ?"

" నిజమే మాట రావడం నోటికే, చేతిక్కాదు. కాని నోరు మాట్లాడగలదా తల్లీ, ఆడించేవాడు ఆడిస్తే కదా, అది ఆడగల్గేది ? అది వెట్టి బాకా, ఊదేవాడు వూదితేగాని శబ్దం రాదు."

"ఈ చమత్కారపు మాటలకేం!"

" చమత్కారం కదమ్మా, యాధార్థం. భగవత్సంకల్పాన్ని ఎవరు మీర గలరు? అదీగాక చెబితే మాత్రం మన చెవుల్లో పడుతుందా మనం వింటామా? దేవుడికి ఎన్నో నోళ్ళు ఏ నోటితో ఏమి మాట్లాడతాడో, వినడానికి మనకి చెవులుండొద్దూ. తెలుసుకోడానికి జ్ఞానం వుండొద్దూ? మీరొక్కసారి మీ వూర్నుంచి వస్తున్నప్పుడు చెన్నపట్నంలో ఒకరు రైలెక్కి, మాటలమధ్య "ఇప్పుడు కలకత్తా వెళ్ళడం ఎందుకు? ఇచ్చే దేవుడెక్కడున్నా ఇస్తాడు" అని అనలేదూ? మీరు విన్నారా అప్పుడు? ఇవన్నీ బ్రాహ్మణులకు పనికొచ్చేవి కాదని చెప్పలేదూ మీ పురోహితుడు? వాళ్ళ మాటలెన్నొందుకు లక్ష్యపెట్టలేదు? బండి తోలేవాడు హే హే అని అరుస్తూ పోతాడు. ఆ అరుపులు వినిపించుకోకపోతే బండి క్రింద పడతాం.... అటు చూడండి, పిల్లా దేడుస్తున్నాడు. ఎత్తుకోండి పాపం.... నేల మీద పడుకో బెట్టేశారే.... "

"ఏడవనీండి, ఎవరికేం ?"

"ఇందుకేగా మీరు పిల్లాడిని ఏరికోరి తెచ్చుకున్నది?"

" పిల్లాడిని నేను కోరుకున్నానా? కోరి తెచ్చుకున్నానా ?"

"ఇంకెవరు అడిగారు ? మరెవరు పొందారు? దేవుడు ఇచ్చినదాన్ని బాగా చూసుకోవాలమ్మా, లేకపోతే అది దక్కదు."

" అయితే నా కూతుర్ని నేను బాగా చూసుకోలేదా? అదెందుకు దక్కలేదు?"

"చూసుకున్నారు, కాదనలేదు. కాని ఎంత ఆదరం చూపగలరో అంతా చూపించలేదు. ఎంత అభిమానం చూపించవచ్చో అంతా చూపించలేదు. ఆ పిల్ల ఎన్ని సార్లు కన్నీళ్ళు పెట్టుకోలేదు. ఎన్ని సార్లు 'ఇది' ఎందుకు పుట్టిందో అనలేదు మీరు ? మీ ఇంటి నౌకరు తోటలో మొక్కలకి సరిగ్గా నీళ్ళు పొయ్యక పోయినా, చూసుకోక పోయినా వూరు కుంటారా మీరు ?"

"చెట్లు పోతే పోతాయి లెండి."

"సంసారం కూడా ఒక తోట లాంటిదే తల్లీ! ఎదిగిన చెట్లు పెరుగుతాయి. లేత మొక్కల్ని సరిగా చూసుకోకుండా ఎండబెడితే ఎలా?"

"అయితే, ఎవర్నీ ఏమీ అననే కూడదా?"

"ఎందుకనాలి తల్లీ? ఎవరేనా ఏమన్నా అంటే ప్రతిగా మరొకరంటారు. ఏమీ లేకుండా మన పెద్దరికం, గొప్పదనం, అధికారం చూపించడానికి మరొకరి మనసు

నెప్పించాలా? తెలిసిన వాళ్ళు, దగ్గరవాళ్ళు నెచ్చుకోరు. మిగతావాళ్ళు....? సమాధానపడండి. బిడ్డని పెంచండి. వున్నవాళ్ళని చూసుకుని సంతోషంగా వుండండి. కుంకుమ పెట్టుకుని ఊరికి వెళ్ళరండి."

"నాకు కుంకుమా వెద్దు, ఏమి ఒద్దు. ఒకసారి పెట్టుకుని అనుభవించాను కదా!"

"ముత్తైదువ మీరు అలా మాట్లాడ కూడదు. తీసుకోండి. ఈ పాపాన్ని నా నెత్తిన రుద్దకండి. మనల్ని మనం సమాధాన పర్చుకోకపోతే ఎవరు చెయ్యగలరు? దేవుదొచ్చి సమాధానం చెప్పినా మన మనసుకి తడుతుందా? మన మనసుకదా సమాధాన పడాలి. ఆఖరికి ఎవరికి ఎవరు? మనకి మనమే."

"అవును, అడిగినదాన్ని ఇవ్వకుండా, మరేదో నెత్తిన రుద్ది సమాధాన పడు, అంటే ఎలా పడగలం? వెనకటికి ఎవరో మూగవాడు భార్య కావాలి అని అడిగినందుకు, వాడికి పెళ్ళి చెయ్యలేక పెళ్ళి - పిల్లల కోసమే కదా, ఇదిగో ఇవే నీ పిల్లలు - ఒకటి రెండు కాదు, మూడు. వీటిని పెంచు అని మూడు చెట్లని నాటి వాటికి వాడి చేత నడుం విరిగేలా నీళ్ళు పోయించారట. అలా వుందిప్పుడు."

" నిజమేనమ్మా, నేనూ విన్నానా కథ. కాని అడిగినదంతా ఇచ్చెయ్యడానికి, ఎవరైనా దాన్ని సిద్ధంగా పట్టుకుని మన అజ్ఞాబద్ధుల్లా ఎదురుచూస్తూ నుంచున్నారా ఏమిటి? ఆ కుంకుమ పెట్టుకోండి."

# 4.నేను చంపిన అమ్మాయి

ఆనంద

ఆరేళ్ళ క్రిందటి మాట. వేసవిలో మా మైసూరు సీమంతా తిరిగి రావాలని బయలుదేరాను. నాకు మా దేశంలో పేరుమోసిన శిలా శిల్పాల వైఖరిని చిత్రరూపంలో సంగ్రహించాలన్న పిచ్చి పట్టుకుంది. సోమనాథపురం, బేలూరు, హళేబీడు మొదలైన స్థలాల్లోని దేవాలయాల వర్ణని పుస్తకాల్లో చదివినప్పుడు "కానీయ్, బ్రతికుంటే ఎప్పుడైనా వాటన్నిటినీ కళ్ళారా చూడొచ్చు" అనుకునే వాడిని. ఇప్పుడు ఇలా బయలుదేరినపుడు నా కలలు నిజమవుతున్నాయి కదా అని ఆనందం కలిగింది. ఇక ముందు నేను చెప్పే సంగతి నా ప్రవాసం గురించి వివరణ కాదు. నా ప్రవాసం మధ్యలో ఒకటి రెండు రోజులు గడిపినపుడు జరిగిన విషయాన్ని గురించి.

ఆ పల్లె పేరు నాగవళ్ళి. నేను అక్కడకి వచ్చేసరికి నా ప్రవాసం ముప్పాతిక భాగం పూర్తయిందనొచ్చు. అప్పటికి నూరు, నూట ఏభై చిత్రాల్ని సంగ్రహించ గలిగాను. అన్నీ నేనే స్వయంగా తీసిన ఫోటోలు.

నాగవళ్ళిలో కరియప్పగారని, ఆ వూరి ముఖ్యులు. ఆ పల్లెకే పెద్దగా చలామణీ అవుతున్నవారు. నేను దిగినది వాళ్ళ ఇంట్లోనే. కథ ఇక్కడ్నుంచే ప్రారంభం అనొచ్చు.

నేను ఆ పల్లె చేరుకునేసరికి రాత్రి సుమారు తొమ్మిది గంటలు కావస్తోంది. నా సామాన్లని సంత నుంచి తిరిగొస్తున్న బండిలో వేసి, దాని వెనకాలే నడిచి వచ్చాను. రాత్రంతా ఆ ఎద్దుల బండిలో ప్రయాణం చెయ్యడం ఇష్టం లేక ఆ రాత్రి పల్లెలో గడుపుదా మనుకున్నాను. ఆవూళ్ళో వుండడానికి వసతి వుంటుందా అని బండివాడిని అడిగాను. అతను కరియప్పగారి పేరు చెప్పి, "అయ్యా, మీరు సరేనంటే వెళ్ళి అయ్యగారితో చెబుతాను. ఆయనంతా చూసుకుంటారు" అన్నాడు. నేను సరేనన్నాను. ఇంకో పదిబారలు వెళ్ళేసరికి వాళ్ళిల్లు వచ్చింది. బండివాడు దిగి ఇంటి వేపు వెళ్ళి, ఒకటి రెండు నిమిషాల్లో మరొకాయనతో కలిసి వచ్చి, "అయ్యా, ఈయనే కరియప్పగారు" అన్నాడు. కరియప్పగారు నా దగ్గరగా వచ్చి నమ్రభావంతో చేతులు జోడించి, "స్వామీ, దయచేసి ఇది మీ ఇల్లే అనుకోండి. రండి" అన్నారు. నేనూ చేతులు జోడించి నమస్కారం చేస్తూ "మీకు శ్రమ ఇస్తున్నాను" అన్నాను. అందుకాయన "అలా అనకండి, మాకేమీ శ్రమ లేదు. తమరు పెద్ద మనసుతో మా ఇంటికి రావాలను కోవడమే నా పుణ్యం. శ్రమ, గిమ అనకండి స్వామీ, ఇలా దయ చేయండి"

అంటూ తమ ఇంటి వేపు చూపిస్తూ, బండివాడిని పిలిచి "తిమ్మా అయ్యగారి సామాను తెచ్చి అరుగు మీద పెట్టరా" అన్నారు.

మేము వెళ్ళి అరుగుమీద వేసిన చాపమీద కూర్చున్నాం. కరియప్పగారిది పెద్ద సంసారం, నిండిన ఇల్లు. నేను వెళ్ళి కూర్చోగానే లోపల్నుంచి ముగ్గురు నలుగురు పిల్లలు బయటకు పరుగెత్తుకుంటూ వచ్చి మమ్మల్ని చూస్తూ నుంచున్నారు. నా హ్యాట్, బూటు వాళ్ళకి తమాషాగా కనిపించి వుండాలి.

అరుగుకి ఒక పక్కగా ఒక గది. నౌకరు ఆ గది తలుపు తెరిచి తుడిచి ఓ చాప వేసి దీపం తెచ్చి పెట్టాడు. బండివాడు నా సామాన్లని గదిలోకి చేర్చాడు. నేనతని కివ్వాల్సిన అద్దె ఇచ్చి పంపేశాను. కరియప్పగారు, "బాబుగారూ, ఇక గుడ్డలు మార్చుకోవచ్చుకదా!" అన్నారు. లేచి గదిలోకి వెళ్ళి ప్యాంటు షర్టు విప్పి, పంచె కట్టుకుని చొక్కా తొడుక్కుని వచ్చాను. ఆ సరికి ఎవరో లోపల్నుంచి వేడి నీళ్ళు తెచ్చి పెట్టారు. చేతులు, కాళ్ళు, మొహం కడుక్కున్నాను. మరో అరగంటలో భోజనాలయ్యాయి. మళ్ళీ బయటి అరుగు మీద కూర్చుని, తాంబూలం వేసుకుంటూ మాటల్లో పడ్డాం. నా ప్రవాసం గురించి వాళ్ళకి వివరించాను. నేను వాళ్ళింట్లో దిగినందుకు వాళ్ళు ఎంతగానో సంతోషించారు. అది వాళ్ళ మాటల్లోనూ, చేతల్లోనూ తెలుస్తూనే వుంది. మాటల్లో వాళ్ళ సంగతులు కూడా కొద్దిగా తెలుసుకున్నాను. వాళ్ళు బాగా వున్న వాళ్ళే. నాలుగు వందల రూపాయలు పన్ను కడుతున్నారు. ఇంటి నిండా జనం. నౌకర్లు – చాకర్లు, దేనికీ కొదవ లేదు. ఇల్లు పెద్దగా వుంది. ఆ పల్లెలోనే పెద్దిల్లు. అన్నిటికన్న నన్ను ఎక్కువగా ఆకట్టుకున్నది ఆయన నిష్కపటమైన నమ్రత. అది అక్కడి ప్రజలకి సహజంగా అబ్బినట్టుంది. మొత్తమ్మీద నాకు మంచి ఉపచారమే జరగబోతుందనుకున్నాను.

భోజనాలయ్యాక ఎక్కువ సేపు మాట్లాడుకో లేదు. నడిచి వచ్చానేమో, అలసటగా వుంది. ఆ మాటే చెప్పి గదిలోకి వెళ్ళి దీపం ఆర్పి పడుకున్నాను.

## 2

ఉదయం మెలకువ వచ్చేసరికి గంట ఆరున్నరో ఏడో అయ్యుంటుంది. అప్పటికే నా గది ముందు వేడినీళ్ళు సిద్ధంగా వున్నాయి. మొహం కడుక్కుని గదిలో కూర్చున్నాను. కరియప్పగారు స్వయంగా చేతిలో ఓ గ్లాసుడు పాలు తీసుకుని వచ్చారు. వాళ్ళింట్లో కాఫీ అలవాటు లేదు. నాకు పాలు అలవాటు లేదు. ఎలాగో ఆయన అంత ఆప్యాయంగా తెచ్చినదాన్ని కాదనలేక తాగాను. ఆ తరువాత ఆయన్ని అక్కడే కూర్చో బెట్టుకుని నేను తెచ్చుకున్న ఫోటోలన్నీ ఆయనకి చూపించి విశేషాలన్నీ చెప్పాను. అవన్నీ విని ఆయనకి కలిగిన

ఆశ్చర్యాన్ని సంతోషాన్ని వివరించలేను. ఆయన నాతో "బాబుగారూ, మీరు సరేనంటే ఇక్కడికి దగ్గర్లోనే ఓ దేవాలయం వుంది. రంగప్ప దేవాలయం - చాలా పాతది. చూడదగ్గది. ఎక్కువ దూరం కూడా లేదు" అన్నారు. నేను ఆసక్తిగా....

"ఎక్కడిది?" అన్నాను.

"ఇక్కడే, ఇక్కడికో మూడు మైళ్ళు దూరంలో వుంటుంది. అదిగో ఆ మరడి కొండ కనిపించడం లేదూ? దాని క్రింద భాగంలో వుంది."

నేను బేలూర్లో తీసిన ఫోటోల్లో కొన్నింటికి వివరణ, తాత్పర్యం వ్రాయవలసి వుంది. అదే కాక లక్ష్మికి వుత్తరం రాయాలి కూడా.

"సరే అయితే, రేపు ఉదయం అక్కడికి వెళ్దాం. ఇవ్వాళ కాస్త పని వుంది" అన్నా.

"తమ రిష్టం. అలాగే కానివ్వండి," అన్నారాయన. ఆ రోజు వివరణ అంతా రాసేసరికి మధ్యాహ్నం పన్నెండు గంటలయింది. భోజనాలయ్యాక లక్ష్మికి వుత్తరం రాస్తూ కూర్చున్నాను. నా యాత్రలో వీలు దొరికినపుడల్లా ఆమెకు వుత్తరం రాస్తున్నాను. ఉత్తరాల్లో ముప్పాతిక భాగం వాటి వర్ణనా, ఇవే వుండేవి. నాకు ఎప్పుడూ లక్ష్మి గుర్తొస్తూనే వుండేది. ఎన్నో సార్లు అయ్యో! ఇంత అందమైన వాటిని చూడ్డానికి నా పక్కన లక్ష్మి లేదే, ఆమె వుంటే వాటి అందం ఇనుమడించేది కదా అనుకునే వాడిని. ఆ రోజు నేను నాగవళ్ళికి రావడం, కరియప్పగారి ఆదరంతో కూడిన అతిధ్యం, ఉపచారం, వాళ్ళ పిల్లా - పాప అందరి గురించి వ్రాసి - రేపు మరడి కొండకు వెళ్ళాలనుకుంటున్న సంగతి వ్రాసి తరువాత విహాయాలేవే వ్రాసి వుత్తరం పూర్తి చేశాను. ఆ పల్లెలో టపా ఆఫీసు లేదు. ఒక టపా డబ్బా మాత్రం వుంది. వారానికి రెండు సార్లో మూడు సార్లో బేలూరు నుంచి పోస్టుమ్యాన్ వచ్చి వుత్తరాలని తీసికెళతాడు అని తెలిసింది. కాని పోస్టు డబ్బా ఎక్కడుందో తెలియదు. నౌకరు ఎవరైనా వుంటే ఉత్తరాన్ని పోస్టుకి పంపించవచ్చు అనుకుంటూ గదిలోంచి బయటకి వచ్చాను. గదికి ఎదురుగా కాస్త దూరంలో స్థంబాన్ని ఆనుకుని ఓ అమ్మాయి కూర్చుంది. ఇంటి యజమాని కూతురు అయ్యుంటుందనుకున్నాను. నేను నౌకర్లెవరన్నా కనిపిస్తారేమోనని చూస్తుంటే, ఆ అమ్మాయి లేచి వచ్చి, "ఏమి కావాలి బాబుగారు, చెప్పండి" అంది నవ్వు మొహంతో. ఆ పల్లెటూరి పిల్ల సహజ వినయంతో అలా అడిగేసరికి నాకెంతో సంతోషమయింది.

"ఏం లేదమ్మా, ఈ వుత్తరం పోస్టులో వెయ్యాలి. పోస్టు డబ్బా ఎక్కడుందో తెలియదు. కాస్త చెబుతావా?"

"ఆమె నవ్వుతూ నా వేపు రెండడుగులు వేసి, "ఎందుకు బాబుగారూ మీ కంత శ్రమ, ఆ వుత్తరం ఇటియ్యండి దొరా - నేనెళ్ళి వేసొస్తా" అంది.

ఆ అమ్మాయి మాటలు వింటుంటే ఇంకాసేపు మాట్లాడాలనిపించింది.

"నీకు శ్రమ కాదూ?" అని అడిగాను.

"అయ్యో మాకేం శ్రమ బాబూ, మీరు పెద్దోళ్ళు."

"అయితే నీకేం శ్రమ లేదంటావు?"

"లేదు బాబుగారూ, ఇటివ్వండి ఆ వుత్తరం."

అలా అంటూ రెండు చేతులూ పట్టింది. నేను వుత్తరాన్ని ఆ అమ్మాయి చేతికిచ్చి "నీ పేరేమిటి ?" అన్నాను,

"నా పేరు చెన్ని" సిగ్గుపడుతూ వెళ్ళిపోయింది.

"సొగసైన పేరు" అనుకున్నా. చెన్ని బాగా మాట్లాడింది. ఆమె మొహంలో నమ్రత, కళ్ళలో ప్రతిబింబించే ఆ ముగ్ధ హృదయపు నిర్మల ఛాయ - మాటల్లో పల్లె పడుచులకే పరిమితమైన ఒక లాలిత్యం - ఇవన్నీ నా మనసులో చోటు చేసుకున్నాయి.

ఆ రోజు మధ్యాహ్నం భోజనాలయ్యాక కాసేపు నిద్రపోయాను. మెలకువ వచ్చేసరికి నాలుగ్గంటలయింది. మొహం కడుక్కుందామని గది బయట కొచ్చాను. మళ్ళీ ఆ అమ్మాయే. నేను మొదట చూసిన చోటనే స్థంబాన్ని ఆనుకునే కూర్చుంది. నేను బయటకి రావడం చూడగానే చాపిన కాళ్ళని ముడుచుకుని ఏదో పరధ్యానంలో కొంగు కొసకి వున్న దారపు పోగుని లాగ సాగింది. నాకు నీళ్ళు కావలసి వచ్చింది. అక్కడ మరెవరూ లేరు. ఇంతకు ముందు మాట్లాడిన చొరవతో, "చెన్నమ్మా, మొహం కడుక్కుందుకు కాస్త నీళ్ళు కావాలమ్మా" అన్నాను. "అలాగే బాబుగారూ, అంటూ చిరునవ్వుతో ఏదో సంభ్రమంతో లోపలి కెళ్ళింది." చెన్నమ్మకు పుట్టుకతోనే ఆ చిరునవ్వు వరంగా వచ్చిందేమో అనిపించింది. నేను చూసినప్పుడల్లా ఆమె ముగ్ధమోహనంగా చిరునవ్వు చిందిస్తూనే కనిపించింది. పట్నాలలో యువతుల మందహాసాలని అనేక సందర్భాలలో చూశాను. అవి మహావృక్షాలని పడగొట్టేలాంటి ప్రభంజనం లాగో, మనసునిఅల్లకల్లోలం చేసే విధంగానే వుంటాయా మందహాసాలు. చెన్నమ్మ చిరునవ్వు అలాంటిది కాదు. సున్నితంగా అలవోకగా పూలగుత్తుల నుంచి పరిమళాన్ని మోసుకొచ్చే చల్లగాలిలా, హృదయంలో చిన్ని చిన్ని తరంగాలని కదిలించే లాంటి మృదువైన చిరునవ్వు. తుఫానులో చిక్కుకుంటే వొట్టి దుమ్ము-ధూళి. కళ్ళకి, నోటికి మట్టి. అందులో సౌరభం వుండదు. ఈ పల్లె పడుచు నవ్వు? ఓ! అది మల్లెపూవు లాంటిది. మల్లెపూవు ఎంత

స్వచ్ఛంగా, నిర్మలంగా వుంటుంది! ఎనలేని పరిమళం! నేనిలా ఆలోచిస్తూ వుండగా చెన్నమ్మ నీళ్ళు తెచ్చింది. చేతులు, కాళ్ళు, మొహం, కడుక్కుని గదిలోకి వెళ్ళేసరికి చెన్నమ్మే కొంచెం ఫలహారం, ఓ గ్లాసులో పాలు తెచ్చిపెట్టింది. టిఫెన్ తిన్నాక, కొంత సేపు బయట తిరిగి వద్దామని నా పిల్లనగ్రోవిని, చిన్న క్యామెరాని తీసుకుని బయలుదేరాను.

నేను బయటకి వచ్చేసరికి చెన్నమ్మ అక్కడే కూర్చుని వుంది. నేను ఇల్లు వదిలి కాస్త దూరం వచ్చాను. ఎటువేపు వెళదామా అని ఆలోచించాను. ఇంటి వెనుక వాళ్ళ తోట వుందని విన్నట్టు గుర్తొచ్చింది. సరే, అక్కడికే వెళ్దామనుకున్నా. కానీ దారి తెలీదు. ఏం చేద్దామా అని ఆలోచించి, చెన్నమ్మనే అడిగితే సరి, అనే నిర్ణయానికి వచ్చాను. వెనుదిరిగి వచ్చి, "చెన్నమ్మా, మీ తోట వుందటగా, చూద్దామనుకుంటున్నాను. దారెటో చెబుతావా?" అన్నాను. ఆమె, "అలాగే బాబుగారూ" అంటూ లేచి వచ్చి, ఇంటి వెనుక భాగానికి తీసికెళ్ళి, అక్కడో కాలిబాట చూపించి, "ఇదే బాబుగారూ మా తోటకి వెళ్ళే త్రోవ" అంది. సరే, ఇక వెళతానని చెప్పి ముందుకి నడిచాను. ఆ కాలిదారి పెరటి వేపున్న కూరగాయల తోటని చుట్టి, పెద్ద తోటకి చేరుకుంది. ఆ దార్లో సుమారు నలభై గజాల దూరం నడిచాను. అప్పుడు వీచిన గాలికి నేను కప్పుకున్న పై పంచె కొస కూరగాయల తోటకున్న కంచెలో చిక్కుపడింది. విడిపించుకోవడానికి వెనుదిరిగాను. చెన్నమ్మ అప్పుడెక్కడ నుంచుందో అక్కడే నుంచుంది. నేను దారి తప్పుతానని చూస్తోందేమో ననుకున్నాను!

మళ్ళీ సుమారు నూరు గజాల దూరం నడిచాక తోట కనిపించింది. చాలా అందంగా వుంది తోట. ఎక్కువగా వక్క, కొబ్బరి చెట్లున్నాయి. పళ్ళ చెట్లు ఏవేవో వున్నాయి. సహజంగానే రమ్యమైన ఆ తోట అందం, ఆ సాయంకాలపు సూర్యుడి బంగారు కాంతిలో మరింతగా మెరసిపోతోంది. తోటలోకి అడుగు పెట్టి ముందుకి వెళ్ళేసరికి విశాలమైన బావి కనిపించింది. అది ఏతాం బావి. ఒక పక్కగా నీళ్ళ వరకూ దిగి వెళ్ళ డానికి మెట్లున్నాయి. బావి చుట్టూ సుమారు రెండడుగుల ఎత్తున్న రాతి గోడ. నేను వెళ్ళి ఆ గోడ అంచున కూర్చుని తోట అందాన్ని పరికించసాగాను.

కాసేపు నా మనసు ఆ తోట అందాన్ని ఆస్వాదించడం వల్ల కలిగిన ఏదో వర్ణించలేని సుఖాన్ని అనుభవించింది. తోటలోని చల్లదనం, గాలిలో కలిసిపోయి వీస్తోంది. బావి చుట్టూ రకరకాల పూల చెట్లున్నాయి. వాటి పరిమళ మంతటిని చల్లగాలి తనలో చేర్చుకుంటోంది. రక రకాల పక్షుల కిలకిలా రావాలు ఆకాశంలో, చెట్లల్లో, వృక్షాల్లో ఎక్కడెక్కడో వినిపిస్తోంది. నా హృదయం పక్షుల్లో

పక్షిగా, పూలలో పూవుగా కలిసిపోయింది. కవులు మనం చూడని స్వర్గాన్నెందుకు వర్ణిస్తారా అని అనుకున్నాను. ఎక్కడ సుఖంగా వుంటుందో అదే స్వర్గం అన్న భావనతో మనసులో ఆనంద తరంగాలు వువ్వెత్తున లేచి పడతాయి. ఆవేశంలో పిల్లనగ్రోవిని వూద సాగాను. ఆ గానం ఒకటికి పదింతలై తోటంతా వ్యాపించింది. నా మురళీ గానానికి నేనే పరవశించి పోయాను. ఒకటి రెండు కీర్తనలు వాయించి, తరువాత నేటి పాట ప్రారంభించాను. తోటలో నేనెక్కడినే అన్నభావంతో ధైర్యంగా ఇష్టంవచ్చినట్టు పాడసాగాను. ఉన్నట్టుండి నా వెనుక వేపు 'బుడు బుడు' మని చప్పుడు వినిపించింది. నేను చప్పున పాట ఆపేసి తిరిగి చూశాను. ఆ పిల్లే చెన్ని మెట్ల మీంచి దిగి బిందెలో నీళ్ళు నింపుకుంటోంది. నేను తిరిగి చూసేసరికి ఆ అమ్మాయి తలెత్తి నా వేపు చూస్తోంది. ఆమెకు చాలా సిగ్గేసింది. నేను పట్నవాసపు నాగరికుడినని వాళ్ళు నుకుంటున్నందుకు, నేనేదో గొల్లపిల్లవాడిలా పిల్లనగ్రోవి వూదుతూ, నేటి కొచ్చినట్టు అరుస్తున్నందుకూ సరిపోయింది - అనుకున్నాను. నేను మెట్ల వేపు వీపు పెట్టి కూర్చోవడంతో ఆమె రాక నాకు తెలీలేదు. నా పాట సంబరంలో ఆమె గాజుల చప్పుడు గాని, అందెల చప్పుడుగాని వినిపించలేదు. మొత్తం మీద నా పరిస్థితికి చాలా మొహమాటపడ్డాను. ఓ క్షణం నాలో నేనే "ఏమైంది లేరా" అనుకున్నాను. అయినా మనసుకి సమాధానం కలుగలేదు. నవ్వొచ్చి న్నట్టయింది. మరళి కింద పెట్టి, కెమేరా చేతికి తీసుకుని దాన్ని చూస్తున్నట్టుగా నటిస్తున్నాను. ఆమె బిందెలో నీళ్ళు నింపుకుని ఒక్కొక్క మెట్టు ఎక్కి వస్తున్నట్టు లీలగా తెలుస్తోంది. మెట్లన్నీ ఎక్కాక ఆమె కాళ్ళ చప్పుడు వినిపించలేదు. కాళ్ళ చప్పుడికి బదులు చేతి గాజుల గలగల వినిపించింది. మళ్ళీ ఆమె మొహం చూడాలంటే సిగ్గేసింది. అయినా తిరిగి చూశాను. ఆమె శుభ్రంగా తోమిన రెండు ఇత్తడి బిందెల నిండా నీళ్ళు నింపుకుని, మెట్లన్నీ ఎక్కి వచ్చి వాటిని బావి గట్టు మీద పెట్టింది. అప్పుడామె మొహం చూశాను. నా చిత్రమైన సంగీతం వల్ల కలిగిన నవ్వు ఇంకా ఆమె మొహంలో తొంగి చూస్తూనే వుంది. నాకు చాలా సిగ్గుగా అనిపించింది. మొహం తిప్పుకుని కూర్చున్న వాడిని పైకి లేచాను. ఆమె ఏదో మాట్లాడినట్టయింది. నా మనసులో కలిగిన అలజడి వల్ల అదేమిటో తేలీలేదు నాకు. మళ్ళీ ఆమె వేపు తిరిగి ఏమిటమ్మా అని అడిగాను. ఆమె, "పదాలు చెప్పడం ఆపేశారెందుకు బాబుగారు" అంది. ఆమె ప్రశ్నతో నా మనసులో కలిగిన అవమానమూ, కలవరమూ దేవుడికే తెలియాలి. ఏం జవాబు చెప్పాలో తెలీక 'ఆ ( ఊ (" అంటూ పళ్ళికిలించి "అయిపోయిందమ్మా" అన్నాను. ఆమె అడిగిన ప్రశ్న నాకు అపహాస్యంగా

వినిపించినా దానివల్ల కోపం రాలేదు. కోపమెందుకు రావాలి? నేను చేసింది అలాంటి పని. నా అప్పటి మనఃస్థితిలో అది అపహాస్యంగా కనిపించిందే గాని, నిజంగా హసన్ముఖియైన ఆ పల్లెటూరి ముగ్ధకి నన్ను హాస్యం చేసే అభిప్రాయం వుండి వుండదు, అనిపించింది. ఏదో అయింది అయిపోయింది. ఇక ఈ చోటు వదిలి వెడదాం అనుకుంటూ మురళినీ, కెమేరాని చేతికి తీసుకుని రెండడుగులు వేసేసరికి ఆమె 'బాబుగారూ' అని పిలవడం వినిపించింది. మళ్ళీ బాబుగారేమిట్రా అనుకుంటూ వెనుదిరిగాను. ఆమె నిండు బిందెను తలమీద పెట్టుకుంది. ఇంకొకటి గట్టుమీద అలాగే వుంది. నా వేపు చూసి "బాబుగారూ, ఆ బిందె కాస్త అందిస్తారా?" అంది. సిగ్గు, మొహమాటంతో నేను, "ఓ! తప్పకుండా" అంటూ చేతిలోని కెమేరాని, మురళిని కిందపెట్టి ఆ బిందెను ఎత్తి ఆమె చంకలో పెట్టుకోడానికి సాయం చేశాను. నేనీ మాత్రం చెయ్యడమే ఆమెకి చాలా గొప్పగా అనిపించి వుండాలి. ఆమె మొహం సంతోషంతో విప్పారింది. నిండు బిందెల భారానికి అటూ- ఇటూ వూగుతూ వెళుతున్న ఆ నిండు యవ్వనం ఆ సాయంత్రపు సూర్యుడి బంగారు కాంతిలో అత్యంత మనోహరంగా కనిపించింది. వెంటనే నా మనసులో ఆమెను ఆ భంగిమలో ఒక ఫోటో తియ్యాలన్న ఆశ కలిగింది. క్యామెరా సిద్ధం చేసుకుని ఆ అమ్మాయి ఏమనుకుంటుందోనన్న మొహమాటమైనా లేకుండా "చెన్నమ్మా" అని పిలిచాను. ఆమె బరువు మోస్తూ మెల్లిగా వెనుదిరిగి "పిలిచారా బాబుగారూ" అంది. నేను "ఊ" అంటూ ఆమె దగ్గరగా వెళ్ళి "తల్లీ , ఒక క్షణం అలాగే వుండగలవా ?" అడిగాను. ఆమెకు కొంచెం ఆశ్చర్యం కలిగినట్టయింది. మొహంలో ఆ భావం ప్రతిబింబిస్తుండగా నీరెండకు ఎదురుగా ఒయ్యారంగా నుంచుంది. ఆమె మొహం మీద మాయని చిరునవ్వు, ఇంకాసేపట్లో మాయమవబోతున్న బంగారు కిరణాలలో కలసిపోతున్నటుగా వుంది. నేను ఫోటో తీసి " ఇక నువ్వు వెళ్ళమ్మా " అన్నాను. ఆమె కుతూహలంగా " అదేం చేశారు బాబుగారూ?" అంది. ఆమెకి తెలిసేలా చెప్పటమెలా ? "రేపు చెబుతాను" అన్నాను. ఆమె మెల్లిగా ఇంటివేపు నడిచి వెళ్ళింది.

ఆ రాత్రి భోజనం కాగానే వెళ్ళి పక్క మీద పడుకున్నాను. వెంటనే నిద్ర పట్టలేదు. సాయంకాలం తోటలో జరిగిన సంగతి ఇంకా నా మనసులో మెదులుతూ వుంది. నాలో నేను నవ్వుకుంటూ, లక్ష్మికి ఈ సంగతి చెబితే ఏమంటుందో, ఎంతగా నవ్వుకుంటుందో అనుకున్నా. మరింతగా నాలో నేనే నవ్వుకోసాగాను.

అలా నిద్రపట్టడానికి చాలా సేపయినట్టుంది. ఉదయం లేచేసరికి ఎనిమిది

గంటలయింది. తొందరగా మొహం కడుక్కుని, టిఫిన్ కానిచ్చి మరడి కొండకి బయలుదేరడానికి సిద్ధమయ్యాను. కరియప్పగారు ఒక నౌకర్ని తోడిచ్చారు. అతని చేతికి నాక్కావల్సిన సామాన్ల సంచి ఇచ్చి బయలుదేరాను. మరడికొండలో నా పనులన్నీ పూర్తి చేసుకుని వచ్చేసరికి పన్నెండు గంటలయింది. తిరిగి వస్తూ కాలి బాటకి కాస్త దూరంలో పశువులు పచ్చిక మేస్తుంటే రైతులు పొలం పనులు చేస్తుండడం కనిపించింది. అకస్మాత్తుగా కాస్త దూరంలో గొల్ల పిల్లవాడొక 'లావణి' పాడటం మొదలు పెట్టాడు. వాడికెవరి భయం లేదేమో. స్వేచ్ఛగా, గట్టిగా తారస్థాయిలో మొదలుపెట్టాడు. తమాషాగా అనిపించి కాసేపు నుంచుని వినాలనిపించింది. కాని నాతో బాటు నౌకరున్నాడు. నవ్వుకుంటాడని సంకోచ పడ్డాను. అదీ కాక వెనుకటి రోజు సాయంత్రం సంగతి గుర్తొచ్చింది. ఆగకుండా నడవసాగాను. చెన్నమ్మ గుర్తొచ్చింది. ఆపిల్ల సహజమైన చిరునవ్వు నా కళ్ళ ముందు కదలాడింది. తళ తళ మెరుస్తున్న నిండు బిందెల్ని తల మీద, చంకలోను పెట్టుకుని, ఆ బరువుకి వూగుతూ నుంచున్న ఆ ఒయ్యారపు విగ్రహం కళ్ళముందు కదలాడింది. చెన్నమ్మ ఇంటి యజమాని కూతురై వుండొచ్చని వూహించానే గాని నిజమైన సంగతి తెలియదు. తెలుసుకుందామన్న కుతూహలంతో నౌకరుతో....

"మీ యజమాని ఇంట్లో వున్న అమ్మాయి ఎవరయ్యా?" అనడిగాను.

నౌకరు ఆగి వెను దిరిగి నా వేపు చూస్తూ "ఏ అమ్మాయి అయ్యగారూ?" అనడిగాడు. నేనెవర్ని గురించి అడిగానో తెలియలేదతడికి. నేను, "అదే, చెన్నమ్మ అని లేదూ, ఆమె" అన్నా. నా వేపే చూస్తున్న నౌకరు నా ప్రశ్న విని నవ్వుకుంటూ "ఎందుకయ్యగారూ ?" అని మొహం తిప్పుకుంటూ అడిగాడు. నాకు చాలా అవమాన మనిపించింది. సిగ్గా వేసింది. నౌకరు నా ప్రశ్నలో ఏదో దురభిప్రాయాన్ని ఊహించేలా అయిందేమోనని నా మనసులో ఓ క్షణం కలవరం కలిగింది. లక్ష్మిని తప్ప నా జీవితంలో మరెవర్నీ కన్నెత్తి చూడనని ఈ మూర్ఖుడికి తెలిసేదెలా? వాడేమో నవ్వి, వ్యంగ్యంగా - "ఎందుకు అయ్యగారూ ?" అని అడిగేశాడు.

నేను, "ఏం లేదు. వూరికే అడిగాను. అడక్కూడదా?" అన్నాను.

మరో ప్రశ్న నా నాలుక చివరిదాకా వచ్చింది కాని ఆపుకున్నాను. ఎవరని అడిగితేనే నవ్వినవాడు, పెళ్ళయిందా అని అడిగితే మరేమనుకుంటాడోనని భయమేసి వూరుకున్నాను.

ఇంటికి రాగానే స్నానం చేసి, భోంచేసి ముందు రోజు సాయంత్రం తీసిన చెన్నమ్మ ఫోటోని నాలుగు కాపీలు తీశాను. బొమ్మ బాగా వచ్చింది. ఇంట్లో

వాళ్ళంతా దాన్ని చూసి చాలా సంతోషించారు. మధ్యాహ్నం అలస్యంగా భోంచెయ్యడంతో రాత్రి ఆకలిగా అనిపించలేదు. రాత్రికి భోంచెయ్యనని ఇంట్లో వాళ్ళతో చెప్పేశాను. తొందరగా నిద్రకూడా వచ్చేలా కనిపించలేదు. ఏం చెయ్యడానికీ తోచక అలా తిరిగి వద్దామని బయలుదేరాను. మళ్ళీ గదిలోకి వచ్చేసరికి తొమ్మిది గంటలయ్యింది. అప్పుడే నిద్ర వచ్చేలా కనిపించలేదు. దీపం వెలిగించి పక్క పరుచుకుని పడుకుని ఏదో నవల తీసి చదువుకోసాగాను. సుమారు పది నిమిషాలయ్యాక తలుపు చప్పుడయింది. గాలికి చప్పుడయిందేమోనని చదువుకుంటూ వుండిపోయాను. మళ్ళీ చప్పుడయింది. ఈసారి మెల్లిగా తలుపు తట్టినట్టయింది. "ఎవరు బాబూ?" అన్నాను. ఎవరూ మాట్లాడలేదు. ఓ క్షణం ఆగి మళ్ళీ చప్పుడు. నెమ్మదిగా తలుపు కొట్టినట్టయింది. లేచి కూర్చుని "ఎవరది?" అన్నాను. గాజుల గలగలలు వినిపించాయి. క్షీణస్వరంతో "నేను చెన్నిని" అని వినిపించింది. నాకు ఆశ్చర్యం వేసింది. 'ఇంత పొద్దుపోయాక ఈమెకేం పని' అనుకుని, ఏమైతే అయిందిలే, తెలుసుకుందామనుకుని, లేచి తలుపు తెరచి బయటికి మొహం పెట్టి "ఏమిటమ్మా" అనడిగాను. నా గదిలోని వెలుతురు కొద్దిగా ఆమె మొహం మీద పడుతోంది. ఆమె చేతిలో ఒక పళ్ళెం, అందులో నాలుగారు అరటి పళ్ళు, కాస్త పంచదారం, ఓ గ్లాసులో పాలు వున్నాయి. నేను "ఏమిటమ్మా ఇదంతా ?" అన్నాను. ఆమె "బాబుగారూ, మీరీ పూట భోంచెయ్యలేదు అందుకే ఇది తీసికొచ్చాను." అంది. నా కప్పటికే కొద్దిగా ఆకలి మొదలైంది. "చాలా సంతోషం" అంటూ ఆమె చేతిలోంచి పళ్ళెం అందుకుని పక్క దగ్గర పెట్టబోయాను. చెన్నమ్మ నా వెనకాలే గదిలోకి వచ్చింది. నా గుండె వడి వడిగా కొట్టుకుంది. ఆ సమయం అలాంటిది మరి! నేను పళ్ళాన్ని పరుపు దగ్గరపెట్టి, " ఇంకేం అక్కరలేదమ్మా నువ్వింక వెళ్ళొచ్చు" అన్నాను. ఆమె నవ్వుతూ, "నేను వుంటేనేం బాబూ మీరు తినకూడదూ?" అంది. నేను "ఓహో తినొచ్చు! అందుక్కాదు నేను చెప్పింది. కాని, ఇప్పుడు నాకింకేమీ అవసరం లేదు. అదీ కాక నువ్వీ వేళప్పుడు ఇక్కడ వుండ .... నా మాటలు పూర్తవకముందే ఆమె నా గది తలుపులు మూసి గడియ పెట్టేసింది. ఆమె నా గదిలోకి రాగానే నా మనసులో కలిగిన అస్పష్టభావన ఇప్పుడు స్పష్టంగా కనిపించసాగింది. ఆమె తులుపు వెయ్యగానే నా శరీరం వణికింది, వేడెక్కింది. మొహం నిండా చెమటలు పట్టాయి. గొంతు ఎండిపోయి గుటకలు మింగసాగాను. "ఎందుకమ్మా తలుపు వేశావు?" అంటూ తలుపు తెరవడానికి రెండడుగులు వేశాను. చెన్నమ్మ చప్పున తలుపుకి అడ్డంగా నుంచుని

చిరునవ్వు నవ్వింది. నా మోకాళ్ళల్లో పట్టు కోల్పోయినట్టుగా అయింది. సరే ఇక సంశయం ఏమీ లేదు. ఆమె అభిప్రాయం నా గుండెల మీద ఒత్తి వ్రాసినట్లయింది. మనసులోనే అనుకున్నా, "ఈ మేనా నేననుకున్న పల్లెటూరి ముగ్ధ?")

(ఇక నిలబడ లేకపోయాను. వెళ్ళి పక్క మీద కూర్చుని రెండు చేతులతో తల పట్టుకుని ఆలోచించసాగాను.)

ఇక తరువాత జరిగిన సంగతి చెప్పబోయే ముందు, రెండు మాటలు చెప్పాలి. ఏనండి, ఆ రోజు రాత్రి నన్ను పాపపంకిలంలోకి పడకుండా రక్షించినది నా లక్ష్మి. ఆమె ప్రేమ నన్ను సంపూర్ణంగా కట్టివేసి కోటలో సురక్షితంగా బంధించింది. నేనూ, ఆమె ఒకటయిన తరువాత నాకు ఆమెలో లేనిది మరెక్కడా కనిపించదు అన్నట్టుగా మసలుకొంది. రూపం, గుణం, ప్రేమ - వీటి కోసం, ఆమె వేపు కాకుండా మరెటూ చూడాల్సిన అవసరం లేకపోయింది. లక్ష్మి నా పక్కన లేని ఆ రోజున నేను రాత్రి వున్న సన్నివేశంలో అరక్షితమైన నా మనసు ఆ పల్లెటూరి పిల్ల పట్ల మరొక రకంగా ప్రవర్తించినట్లయితే ఆశ్చర్యమేమీ వుండేది కాదని నా కిప్పటికీ అనిపిస్తుంది. ఈ సంగతి జరిగినప్పుడు నేను యవ్వనంలో వున్నాను. దృఢకాయుడ్ని. నా రూపం గురించి నేను చెప్పుకోకూడదు గాని, కురూపిని కానని ఖచ్చితంగా చెప్పగలను. విషయం బాగా అర్థమవ్వాలంటే చెన్నమ్మని వర్ణించాలి. ఆమెకి ఇరవైయేళ్ళ కంటె ఎక్కువుండదు. మరీ పొడుగూ - పొట్టీ కాని ఆకారం. గౌరవర్ణం. లక్షణమైన ముఖం, యవ్వన శోభ నిండిన అవయవ సౌష్టవం. ఎప్పుడూ పెదవులపై సహజంగా నర్తించే చిరునవ్వు. కళ్ళల్లో ఇంకా పసితనపు మెరుపు, వెలుగు తొంగి చూస్తోంది. చిరునవ్వు, మెరుపు కలిసి ఒక అపూర్వమైన మాధుర్యంగా రూపొందింది. మనసుని అపహరించడానికి అవసరమైన సాధనాలన్నీ ఆమెలో వున్నాయని ఒక్క మాటలో చెప్పొచ్చు. అంతే కాకుండా ఆ రోజు రాత్రి ఆమె ప్రవర్తన పల్లెటూరి ముగ్ధలాగ కాకుండా మరోవిధంగా వుంది.) (నేను పడకమీద కూర్చోగానే, నా బుర్ర రకరకాల ఆలోచనలతో నిండిపోయి గానుగలో తల పెట్టినట్టయింది. నా మనసు చీకటి గుయ్యారంలో పడిపోయినట్లు అనిపించింది. గొంతు, నోరు ఎండిపోయి మాట రావడమే కష్టమయిపోయింది. నేను ఆ యువతిలో కామాన్ని రెచ్చగొట్టానని కలలో కూడా అనుకోలేదు. నా విషయంలో ఆమెకేదైనా ఆశ కలిగి వుంటే, దానికి నేను ఏ విధమయిన ప్రోత్సాహమూ ఇవ్వలేదని ఎక్కడైనా ఎప్పుడైనా సరే ప్రమాణ పూర్తిగా చెప్పగలను. ఆమె ఏమీ ఎరుగనిది కాదు. అది

కనిపిస్తూనే వుంది. తెలిసే ఇలాంటి పనికి ఇష్టపడుతోందే, ఏమిటీ పిచ్చి! ఇదీ ఒకరకమైన పిచ్చే అయ్యుండాలి. ఇంట్లో వాళ్ళకి తెలిస్తే ఏమిటి గతి? నేనేదో పెద్దమనిషిలా వీళ్ళింట్లో ఆతిథ్యం తీసుకోవడం, ఈ అర్థ రాత్రిలో మేమిద్దరం ఈ గదిలో ఏకాంతంగా వుండడం ... మర్యాద దక్కేలా కనిపించడం లేదు. ఆమె గదిలోకి వచ్చిన తీరు చూస్తే , దొంగతనంగా వచ్చినట్టు తెలుస్తూనే వుంది. ఈమెకు పెళ్ళి కాలేదేమో, నాకు జుగుప్స కలిగింది. ఇప్పుడొక్కొక్కటిగా ముందు రోజు సాయంకాలం ఆమె ప్రవర్తన అర్థం కాసాగింది. ఆమె ఆ సమయంలో నా వెంట తోటకి ఎందుకొచ్చింది? నీళ్ళ బిందె ఒక నెపం.... బిందె ఎత్తడానికి సాయం కోరడం .... నేను నీళ్ళ బిందెని ఆమె చంకలో పెట్టబోయినప్పుడు బిందె చుట్టూ చెయ్యి వేస్తూ తన చేతిని నా చేతికి తాకించింది. అప్పుడేదో యథాలాపంగా జరిగిందనుకున్నాను. ఆమె మొదట బిందె ఎత్తుకోవడానికి వంగినప్పుడు కొంగు జారింది. నేనామెను ఆ స్థితిలో చూసినప్పుడామె సిగ్గుపడిన లక్షణాలేమీ కనిపించలేదు. బిందె తలమీద పెట్టుకుని, మెల్లిగా కొంగు పైకి లాక్కుంది. అప్పుడు నేనామె అమాయకతని చూస్తున్నానని అనుకున్నానేగాని ఇదంతా నా కోసం విసురుతున్న ఉచ్చు తాలూకూ ఒక్కొక్క దారమని అనుకోలేకపోయాను.)

(ఈ ఆలోచనలతో అల్లకల్లోలమైన నా మనసుని సాధ్యమైనంత వరకు అదుపులో పెట్టుకుని ఈ ఇబ్బంది నుంచి ఎలా బయటపడ్డమా అని ఆలోచించ సాగాను. కోపం తెచ్చుకోవడం వల్ల ఫలితం వుండదు. ప్రమాదం జరగొచ్చు. వేరే ఏదైనా ఉపాయం ఆలోచించి మెల్లిగా ఆమెని బయటకి పంపాలి. ఎలా ముసుగేసుకుని పడుకోనా, అని ఆలోచించాను. కాని అది సాధ్య పడదు. ఈమె ఇక్కడున్నంత వరకు నాకు మనశ్శాంతి వుండదు. మరో ఆలోచన కలిగింది. అదే సరైనదని అనుకున్నా. ఎలాగైనా సరే ఆమె చేస్తున్న పని చాలా నీచమైనదని, పాపమని ఆమె మనసుకి నాటేలా చెప్పి ఉపాయంగా పంపించేద్దామనుకున్నా. దేవుడు, నగరవాసియైన నాకు ఈ పల్లెటూరి పిల్లకు పతివ్రతా ధర్మం గురించి ఉపన్యాసం ఇచ్చే పరిస్థితిలో కలిగించినందుకు లోలోపల నవ్వుకున్నాను. అలాగే తలెత్తి చెన్నమ్మ వేపు చూశాను. చెన్నమ్మ ఇంకా తలుపు నానుకుని అలాగే నుంచుని వుంది. నా మొహం మీది నవ్వును చూపి తనూ నవ్వింది. నా నవ్వులో ఆమెకేదైనా ప్రోత్సాహం కనిపిస్తుందేమోనని భయపడి వెంటనే నవ్వుని దిగమింగుకుని, మెల్లగా "చెన్నమ్మా" అన్నాను. ఆమె "ఏమిటి దొరా ?" అంటూ రెండడుగులు ముందుకి వేసి కాస్త నాకు దగ్గరగా నుంచుంది. నేను "కూర్చో" అన్నా. ఆమె నా పడకకి మరీ దగ్గరగా వచ్చి

కూర్చుంది. నేను కాస్త వెనక్కి జరిగి తడబడుతూ "చెన్నమ్మా" అన్నాను.

"ఏమిటి దొరా?" అంది మెల్లగా చెన్నమ్మా. ఆమె ప్రవర్తన ఇలా వున్నా ఆమె కంఠంలో ముగ్ధత అలాగే వుండడం నన్ను ఆశ్చర్యపరచింది.

"చెన్నమ్మా చూడు, నువ్విలా చేయచ్చా?" అంటూ ప్రారంభించాను .

"ఎలా దొరా?

"ఇలా అర్ధరాత్రి దొంగతనంగా వచ్చి...." నా మాట పూర్తి కాక మునుపే ఆమె,

"నేను దొంగతనంగా రాలేదు దొరా." అంది

"అంటే ?"

ఆమె పలుకలేదు. నేను చెప్పాను.

"చూడు, మీ ఇంటి వాళ్ళకి తెలిస్తే నీకూ మర్యాద కాదు, నాకు మర్యాద కాదు."

"వాళ్ళేమీ అనరు దొరా"

నా ఆశ్చర్యానికి అంతులేకపోయింది. అడిగాను,

"ఏమన్నావ్ ?"

"వాళ్ళు.... ఏమీ.... అనరు.... అంటున్నా"

"చూడు, వాళ్ళు అన్నా అనకపోయినా ఇది నాకు నచ్చని పని. నాకు పెళ్ళయింది. నేను మరొకరి భార్యని పాడు...."

" అయ్యో దొరా అట్టాగంటారేమిటి ? నాకు పెళ్ళి కాదు దొరా, నేను 'బస్వి' . ఏమిటి ? ఏమంటున్నావ్ ?"

"నన్ను ' బసవి ' గా వదిలేశారు బాబూ."

"బస్వి", బస్వి అంటే ?"

"దేవుడికి వదిలేశారు."

ఇది నాకు కొత్త సంగతి. దేవుడికి వదిలెయ్యడం 'బస్వి' వీటిని గురించి విన్నానే గాని దాని అర్థం తెలీదు నాకు. నా మనసులో భయం పోయి, తేలిక పడింది. ఆ స్థానంలో కుతూహలం ఏర్పడింది. విషయం స్వారస్యంగా వుందే, తెలుసుకుందామనిపించింది.

"దేవుడికి వదిలారా ఎవరు ?"

"మా అమ్మ - అయ్య."

"ఎందుకని ? "

"దొరా, నాకు ఎనిమిదేళ్ళ వయసప్పుడు జబ్బు పడ్డానట. మా అమ్మ - అయ్య మరడి దేవుడికి మొక్కుకున్నారట - నయమైతే దేవుడి పేర 'బసవి'

గా వదిలేస్తామని. అప్పుడు నాకు నయమైందట దొరా."

"అయితే నువ్వు పెళ్ళి చేసుకోవా ?"

"లేద్దొరా."

" ఇలాగే వుండిపోతావా? "

" అవున్దొరా."

" వేశ్యలాగ...."

నా మాటకి ఆమె గుండెలో బాకు గుచ్చినట్టు అయ్యుండాలి. ఒక్క క్షణం ఆమె కనుబొమలు ముడిపడ్డాయి. ముక్కుపుటాలు, పెదవులు వణకసాగాయి. కోపగించిన స్త్రీ ముఖంలో ఓ రకమైన తీక్షణత వుంటుంది. అలాంటి రౌద్రభావం ఆమె ముఖంలో ఆవరించింది. క్రూర దృష్టితో నన్ను గుచ్చేలా చూస్తూ.

" దొరా, తమరు ఆ మాట అనకూడదు." అంది.

"ఆమెలో కలిగిన మార్పు చూసి నాకు కొంత దిగ్భ్రమ కలిగింది. కొంచెం తడబడుతూ,

"ఏ మాట? " అన్నాను.

"మేము వేశ్యలం కాము, తెలుసుకోండి."

నాకు మరింత ఆశ్చర్యం కలిగింది. పెళ్ళి లేదు. ప్రవర్తన చూస్తే ఇలా వుంది. అయినా వేశ్యలం కాము, అంటోంది. నాకూ కొంచెం కోపం వచ్చింది. అడిగాను-

"కాకపోతే మరేమిటట? నువ్వూ అందరిలా పెళ్ళి చేసుకుని ఇల్లాలిలా వుండకుండా ఇలా అర్ధరాత్రి తెగించి వచ్చి ...."

"అయ్యో! మీ కింకా అర్థం కాలేదా ? బస్విలు పెళ్ళి చేసుకోవడానికి వీల్లేదు దొరా"

"ఎందుకని ?"

"మొక్కు చెల్లించాలి కదా ! లేకపోతే చెడు జరుగుతుంది. "

" పెళ్ళి చేసుకుంటే మొక్కు చెల్లించడానికి వీలుండదా ?"

"లేదు దొరా , ఒకళ్ళని పెళ్ళి చేసుకుంటే మీలాంటి వాళ్ళ సేవ చెయ్యడానికెలా కుదురుతుంది. మర్యాదగా వుంటుందా ?"

"సరే, మరొకరి సేవ ఎందుకు చెయ్యాలి ?"

"మరి దేవుడి మొక్కు తీర్చడం ఎలా ? '

"ఇలాగా మొక్కు తీర్చుకోడం దేవుడి పేరిట వ్యభిచారం చేస్తూ...."

ఆమె చప్పున కనుబొమలు ముడివేస్తూ,

"అయ్యో, ఆ మాట అనకండి... నన్నలా అనకండి" అంది ఒత్తి పలుకుతూ.

"నేను నీ మొగుడిని కాను. ఇంత రాత్రి వేళ నా దగ్గరికి వచ్చావే - ఇదెవరు చేసే పని? వేశ్యని కాదని మాత్రం అంటున్నావు."

"మేము వేశ్యలం కాదు దొరా, కాదు. వేశ్యలకి డబ్బు ఆశ వుంటుంది. వాళ్ళు మనుషులెవరైనదీ చూడరు. వాళ్ళకి మొక్కు - గిక్కు ఏమీ వుండదు. అది వాళ్ళ వృత్తి, బ్రతుకు తెరువు."

"మరి మీరు ?"

"మేము డబ్బు ముట్టుకోము దొరా. ఎవర్ని పడితే వాళ్ళని దగ్గరికి చేర్చము. తమలాంటి కులీనులెవరైనా వస్తే వాళ్ళ సేవ చేసి మొక్కు చెల్లిస్తాం. మమ్మల్ని 'వేశ్యలు' అనకండి దొరా...."

"అయితే నువ్విలా చేసే సేవ గురించి మీ అమ్మ - నాన్నలకి తెలుసా ? "

" తెలీకుండా ఎలా దొరా? మొక్కుకున్నది వాళ్ళేగా. తెలుసు."

"సరే, వాళ్ళేమో పంపించారు. కాని ఇలాంటి దానికి నేనిష్టపడతానని ఎలా అనుకున్నారు? ఏ ధైర్యంతో నిన్ను నా దగ్గరికి పంపించారు ?"

(ఈ ప్రశ్నకి వెంటనే బదులు రాలేదు. చిరునవ్వు నవ్వుతూ మెడ పక్కగా తిప్పి, ఓరచూపు చూస్తు,

"మీరు మా నౌకర్ని అడిగారటగా నా గురించి ?" అంది సిగ్గుపడుతూ)

నా కిప్పుడర్థమయింది - నేనామె గురించి అడిగినపుడు అతను వ్యంగ్యంగా నవ్వి, " ఎందుకయ్యా " అని అడగటం! " అయ్యో భగవంతుడా! " అనుకున్నాను.

"నిజమే చెన్నమ్మా, అడిగాను. ఊరికే తెలుసుకుందామని అడిగాను. చెన్నమ్మా, నిజంగా, ప్రమాణంగా నా లక్ష్మి మీద ఆన. నాకు మరో ఉద్దేశం లేదు."

"అయ్యో! ఆన - గీన అంటారెందుకు ? దొరా, ఫరవాలేదు."

"అలా కాదు చెన్నమ్మా, పోయిన ప్రాణం మళ్ళీ వస్తుందా చెప్పు"

చెన్నమ్మ మౌనంగా వుంది .

"చెప్పు"

"లేద్దొరా"

"అయితే విను, ఆడదానికి శీలమే ప్రాణం. శీలం పోగొట్టుకున్న స్త్రీ కుక్కకన్న హీనం. మీ కున్న విలువే శీలం. అలాంటప్పుడు మీరు దాన్ని అమ్ముకోకూడదు. శీలం కోల్పోయిన ఆడదానికి నరకంలో కూడా చోటు లేదంటారు పెద్దలు."

"దొరా మీరు చెప్పేది పెళ్ళి చేసుకుని భర్తతో కాపురం చేసే

ఆడవాళ్ళకయ్యో. వాళ్ళు మాలాగా వాళ్ళని జాతినుంచి వెలివేస్తారు. మా కలా కాదు. మమ్మల్ని దేవుడికి వదిలేశారు. మాకు మీ లాంటి కులీనుల సేవే...."

"అయ్యో చెన్నమ్మా ! నీకు తెలీదు. ఇటు వను దేవుడి పేరిట శీలం పోగొట్టుకుంటే దేవుడు మెచ్చుతాడా? దేవుడికి మొక్కు వుంటే ఆ దేవుడికి సేవ చెయ్యి. ఎవరొద్దన్నారు? అలా కాకుండా ఇదేం పని?"

"దొరా, మీ లాంటి కులీనులే మాకు దేవుళ్ళు. మీకు సేవ చేస్తే మాకు పుణ్యం వస్తుంది"

ఆమె మాటలు వింటుంటే, నా హృదయం అయ్యో దేవుడా నీ పేరుతో, నిన్ను మెప్పించడం కోసం ఎంత పాపం జరుగుతుందో చూశావా అని మొర పెట్టుకుంది. కాసేపు ఏమీ మాట్లాడకుండా నాలో నేనే ఆలోచించుకోసాగాను.

ఇదేమిటీ మనుషల మూర్ఖత్వం! ప్రపంచంలో ఇలాంటి జుగుప్సాకరమైన ఆచారం వుందా? దేవుడుకి వదలడం సరే, విన్నాను. అది వారి వారి భక్తి. కాని ఈ పని? ఇలా ఈ మనుషులు దేవుడికి మొక్కు తీర్చడం. భగవంతుడి దివ్య నామాన్ని మనుషులు ఇలాంటి హేయ కృత్యానికి వాడుకుంటున్నారే! వీళ్ళ గతి ఏమిటి? ఈ అమ్మాయి ఖచ్చితంగా పల్లెటూరి అమాయిక యువతి. జార స్త్రీల లక్షణమే వేరు. ఈ అమ్మాయి తీరే వేరు. ఈమె తన వాళ్ళ అసహ్యకరమైన సంప్రదాయానికి బలి అయిన ముగ్ధ. తను చేస్తున్న పనివల్ల దేవుడికి మొక్కు తీరుతుందని దృఢంగా నమ్ముకుంది. అయ్యో దేవుడా! కన్న తల్లిదండ్రులే చేతులారా తమ బిడ్డ జీవితాన్ని పాపకూపంలోకి తోస్తున్నారే! వాళ్ళ గతేమిటి? ఈమె గతేమిటి? వాళ్ళేమో తాము మొక్కు కోవడం వల్లనే కూతురు బ్రతికి బయట పడిందనుకున్నారు. కాని ఇప్పుడామె రోజు రోజూ చేస్తున్న పాప ఫలితంగా ఆమె బ్రతుక్కి ఆత్మరూపమైన స్త్రీత్వమే నశించిపోతుందే! ఈ సంగతి వాళ్ళ కెలా అర్థం అవుతుంది? అప్పుడు పసిబిడ్డగా వున్నప్పుడు ఒక్కరోజు ఒక్క క్షణంలో చనిపోవడానికి మారుగా, ఇప్పుడు రోజూ క్షణ క్షణమూ చచ్చిపోతోందే! ఆసంగతి ఈ అమ్మాయికి తెలుసునా ? ఊహుఁ. అదే ఆశ్చర్యం! తను చేస్తున్న పని సరియైనది - దేవుడు మెచ్చిన పని. అతడు తిరిగి ప్రసాదించిన జీవితాన్ని ఇలా గడిపితే అది అతనికి ఇష్టమైన సేవ. అది ఆమె దృఢమైన నమ్మకం. వివాహిత స్త్రీలలో ఏ కృత్యాన్నయితే ఆమె చెడ్డదిగా భావిస్తోందో ఆ కృత్యాన్ని తన జీవితాదర్శంగా అనుసరిస్తోంది. దీనికి ఆమె తల్లి-దండ్రులు ఆమోదం. పాపం వాళ్ళైన ఏమి చెయ్యగలరు? జాతి సంప్రదాయాన్ని వదల్లేరు...

దారుణమైన ఈ ఆలోచనలతో నా గుండెను చీల్చినట్లుగా బాధ కలిగి

నిట్టూర్పు వదిలాను. చెన్నమ్మ వూరికే కొంగు కొసని మెలిపెడుతూ కూర్చుంది. నేను నిట్టూర్పు వదలడం విని నా వేపు చూసింది. ఆమె మొహంపై అప్పుడే ఏదో కలవరం కనిపిస్తోంది. ఈపాటికి సుఖంగా పెళ్ళయ్యుంటే తనూ నలుగురిలా సుఖంగా కాపురం చేసుకుంటూ వుండేది కదా. అలా కాకుండా ఈ అమాయకురాలు ఏదో జుగుప్సాకరమైన మూఢాచారానికి బలై పోయింది కదా అన్న ఆలోచనతో నాకు అమితమైన బాధ కలిగి, గుండె నీరయి, కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"చెన్నమ్మా, నీ దేవుడే నిన్ను కాపాడాలి" అంటూ కళ్ళు తుడుచుకున్నాను. చెన్నమ్మ నా కన్నీరు చూసి కంగారు పడింది. నాకు దగ్గరగా జరిగింది. అలా జరిగినపుడు దూరంగా జరగాలనిపించలేదు నాకు. ఆమె మనసు చెడ్డది కాదు. అజ్ఞానపు పాపానికి ఆమె దేహం బలి అయింది. తామరాకు మధ్యన నుంచుని వజ్రంలా తళ తళ మెరిసే నిర్మలమైన మంచు బిందువులా ఆమె ఆత్మ పరిశుద్ధమైనది. ఆమె సున్నితత్వాన్ని చూసి నాకు అమితమైన జాలి కలిగింది. ఆమెని చూసే కొద్దీ, ఆమె గురించి ఆలోచించే కొద్దీ నా కళ్ళల్లో మళ్ళీ మళ్ళీ నీళ్ళు రసాగాయి. నా కన్నీటితో కలుషితమైన ఆమె దేహాన్ని కడగాలనిపించింది. నా శరీరం, ఆత్మ ఆమె పట్ల స్నేహభావంతో ఆర్ద్రమయాయి. నెమ్మదిగా ఆమె చేతిని పట్టుకున్నాను. నా శరీరం కంపించింది. చెయ్యి వదలకుండా అలాగే ఆమె వేళ్ళను నిమురుతూ "చెన్నమ్మా" అని మెల్లిగా పిలిచాను. స్నేహంతో, జాలిగా పిలిచిన ఆ పిలుపుతో ఆమె మరింత నా దగ్గరికి జరిగి మృదువుగా "ఏంటి దొరా" అంది, ఆమె మొహం మీద కూడా ఏదో కలవరం నిండిన ఆలోచనల మబ్బుతెర కమ్మింది.

"చూడు చెన్నమ్మా, నేను నీ దేవుడిని అన్నావు కదూ నువ్వు?"

"అవున్దొరా మీరే నా దేవుడు"

"అయితే, నేను చెప్పినట్టు వింటావా?"

"చెప్పండి."

"ఇక మీదట నువ్వీ పాపపు పని చెయ్యకూడదు. సరేనా ?"

"మరి మొక్కు .... దేవుడికి ...."

"అయ్యో ! ఆ మొక్కు పాడుగాను, చూడు, ఇవ్వాళ నేను నీ దేవుడి నన్నావు. అంతకుముందు నువ్వు ఇంకెవరి సేవా చేయలేదా?"

చెన్నమ్మ మౌనంగా తలొంచుకుంది .

"చూడు, ఇంతకు ముందు నువ్వు ఇంకా ఎవరెవరి సేవే చేశావు. ఇవాళ నన్ను దేవుడినంటూ నా సేవకు వచ్చావు. ఒకరు తిన్న ఎంగిలిని

మరొకరికివ్వొచ్చా? దేవుడికి ఈ ఎంగిలి మొక్కా? చెన్నా, ఇది చాలా పాపకృత్యమని తెలీదు నీకు. తెలిసుంటే ఈ పాపపు పని చేసే దానివి కాదు. కొంచెం ఆలోచించి చూడు. నీకు, వేశ్యకి ఏమిటి తేడా? ఆమెకదే బ్రతుకుతెరువు. నీకు బ్రతకడానికి లోటు లేకపోయినా పాపమంతా ఒకటే - దేవుడు పాపాన్ని ఎన్నటికీ మెచ్చడు...."

చెన్నమ్మ మౌనంగా అంతా వింది. మొదటి భ్రాంతి, కలవరపు ఛాయా ఆమె మొహం మీంచి జారిపోయాయి. కొద్ది కొద్దిగా మొహం వాడిపోసాగింది. దేహం కుంచించుకు పోయింది. నేల చూపులు చూడసాగింది. మెల్లిగా ఆమె చేతిని తాకుతూ "చెన్నా" అని పిలిచాను. తలెత్తి నా వేపు చూసింది. ఆమె చూపుల్లో దారి తప్పిన పసిపాప అమాయికత గోచరించింది. నామాటల్లో నిజాన్ని ఆమె గ్రహించినట్టుంది.

"చెన్నా, నేను చెప్పింది సరి కాదూ?"

చెన్నమ్మ నోరు విప్పలేదు. మళ్ళీ తలొంచుకుంది. నేను చూస్తుండగానే రెండు చుక్కల కన్నీళ్ళు ఆమె చెంపల మీదుగా జారి పడ్డాయి. అదే ఆమె నా కిచ్చిన మౌన ప్రత్యుత్తరం. ఆమె ఆత్మని ఆవరించిన అజ్ఞానపు తెర తొలగించే పని నా పాలబడింది. ఏదో ధ్యేయం పెట్టుకుని ఒక గమ్యం చేరుకోవాలనే ధ్యాసతో, ఓ దారి ఎంచుకుని అడుగులు వేస్తూ, అడుగులేస్తున్నకొద్దీ గమ్యం చేరుతున్నానని అనుకుంటూ, చాలా దూరం నడిచాక, ఆ దారిలో ఎవరో ఎదురై, ఆ గమ్యానికి దారి కాదనీ, ఆ దారిన నడిచినంతా గమ్యానికి దూరమవుతావని చెబితే ఎలా వుంటుంది? నేను నా మాటలతో చెన్నమ్మ హృదయంలో అలాటి భావమే రేపి వుంటాననిపించింది.

చెన్నమ్మ వెక్కి వెక్కి ఏడవసాగింది. నేను ఆమెని ఓదారుస్తూ .... చూడు, చెన్నా నిన్ను చూస్తే నాకు కోపంగాని, అసహ్యంగాని లేదు. చెప్పు, కోపం వుందంటావా?" అన్నాను.

చెన్నమ్మ నొచ్చుకుంటూ "లేదు దొరా" అంది.

"సరే, నీకు నా మీదేమైనా కోపమా? '

"అయ్యో! సామీ అట్లా అనకండి. మిమ్మల్ని చూస్తే మీ కాలి కింద పడి దొర్లాలనిపిస్తోంది." అంటూ నా కాళ్ళు పట్టుకుని తన నుదుటిని తాకించ బోయింది. నేను దానికి అవకాశం ఇవ్వకుండా ఆమెని లేపి, "సరే అయితే, ఏదీ .... నా చేతిలో చెయ్యి వేసి ప్రమాణం చేయి, ఇక మీదట ఈ పని చెయ్యనని" అన్నాను.

చెన్నమ్మ నా గుండెలమీద చెయ్యి వేసింది. ఆమె అమాయకమైన బాధ

నిండిన చూపు, నా కళ్ళల్లో దూరి గుండెల్లోకి దిగింది. చూపుల్లో .... కంఠంలో దుఃఖం పొంగి పొరలుతోంది. కంపిస్తున్న కంఠంతో మెల్లిగా,

"దేవుడూ, ఇక మీదట ఈ పని చెయ్యను" అంది.

నా గుండెలపై నుంచి పెద్ద బరువు దింపినట్టయింది. రాత్రి చాలా పొద్దుపోయింది. అయినా నిద్ర మాత్రం వచ్చేలా లేదు. మనసులో ప్రశాంతత నెలకొంది. చెన్నమ్మ ఒకసారి ఆవలించింది. నేను అదే నెపంగా "చెన్నా, ఇక వెళ్ళి పడుకో, అంటూ పైకి లేచాను. "ఆమె కూడా లేచింది. ఆమెతో బాటు తలుపుదాకా వెళ్ళి నేనే తలుపు తీశాను. గుమ్మం వద్ద మళ్ళీ ఆమె చెయ్యి పట్టు కుని, నా వేపు తిప్పుకుని " చెన్నా, చెన్నా ! దేవుడి తోడుగా నాకు నీ మీద కోపం లేదు. ఏది? " అంటూ నా రెండు చేతుల్లో ఆమె మొహాన్ని పట్టుకుని నుదుటి మీద ముద్దు పెట్టుకున్నాను. చెన్నమ్మ వెళ్ళిపోయింది.

3

ఉన్నట్టుండి మెలకువ వచ్చింది. చూస్తే కరియప్పగారు. ఆయనే పిలిచి లేపారు. ఆయన లోపలికి ఎలా వచ్చారో తెలియలేదు. బహుశః రాత్రి తలుపు వెయ్యడం మర్చిపోయాననుకుంటా.

"ఏమిటి కరియప్పగారూ ? " అంటూ కళ్ళు నులుముకుంటూ లేచాను.

"అయ్యో! ఏం చెప్పను స్వామీ ? అయ్యో! నా బిడ్డ.... నా చెన్న .... " అంటూ మాట పూర్తి కాకుండానే కిందపడి దొర్లసాగారు. ఏదో అవ్యక్తమయిన భయంతో నా గుండె పగిలి రక్తం చిమ్మిన భావన. ఆ లోపల మరెవరో వచ్చి,

"అయ్యో! చెన్నమ్మ తోటబావిలో పడి ...)"

వాళ్ళు మాటపూర్తి చేసేదాకా నా మనసు ఆగలేదు. పైకి లేచి పిచ్చివాడిలా తోటవేపు పరిగెత్తాను. నూతి దగ్గర పది పన్నెండు మంది మూగి వున్నారు. కొన వూపిరి వుందేమోనని భ్రమ పడ్డాను. భ్రమే మరి! ఆమె రాత్రే వెళ్ళి బావిలో దూకి వుండాలి. ఇంతవరకు ప్రాణంతో వుండడం జరిగేనా అని నిరాశ. దగ్గరగా వెళ్ళాను. అందరూ అడ్డు తప్పుకున్నారు. చూశాను. అయ్యో భగవంతుడా! ఏం దృశ్యమిది! గుండెల్లో నుంచి రక్తం కళ్ళల్లోకి వచ్చింది. కళ్ళు పేలిపోయి చీకట్లు కమ్మినట్లయింది.

నా కంతే జ్ఞాపకం మళ్ళీ తెలివి వచ్చేసరికి ఎవరో నా మొహానికి తలకు చల్లటి నీళ్ళు చల్లుతున్నారు. నా ముక్కు వెంట రక్తం కారుతోంది. నా కదేమీ పట్టలేదు. శవం దగ్గరగా వెళ్ళి ప్రాణమున్న జాడేమన్నా వుందేమోనని చూశాను. అయ్యో ! వట్టి భ్రాంతి. నా భ్రాంతికి నాకే "అయ్యో! పిచ్చివాడా" అనిపించింది. ఆమె దేహంలో దాక్కున్న నిర్మలమైన హిమకణం ఎప్పుడో ఇగిరిపోయింది.

పాపపుణ్యాల బంధంనుంచి విడిపోయింది. అమృతం ఇంకిపోయి హాలాహలం మిగిలింది.

ఇంక ఎక్కువసేపు అక్కడ వుండలేక ఇంటి వేపు అడుగులు వేశాను.

ఆ రోజు సాయంకాలమే నేను ఆ గ్రామం వదిలి బయలుదేరాను. వెళ్ళేముందు చెన్నమ్మ ఫోటోని వాళ్ళింట్లో వదిలి వెళ్ళాను. అలాంటి పిల్లని పోగొట్టుకున్న వాళ్ళకి ఆమె ఛాయ ఏమంత ఓదార్పు నివ్వగలదు ?

దారి పొడుగునా ఆలోచనలు.... పోలీసులు 'ఆత్మహత్య' అని రికార్డు చేసుకున్నారు. కాని వస్తుతః నేనే ఆమెను చంపినట్టు లెక్క. ఏం చేసినా ఆ భావం నన్నొదిలేలా లేదు. నేను చెప్పినదంతా ఆమె మనసులో నాటుకుంది. ఇక బ్రతుకు కన్న చావే నయం అనిపించి వుంటుంది. నేను ఆమెని గదిలోంచి పంపినపుడు ఆమె హృదయం 'చావు' కి సంబంధించిన ఆలోచనతో నిండివుం దనుకుంటా. ఈ ఆలోచనతో నాగుండెల్లో శూలం దింపినట్లయింది. నేనా సమయంలో ఆమెను బయటకి పంపకుండా వున్నట్లయితే చావాలన్న సంకల్పం దూరమై ఆమె బ్రతికుండేదేమో. ఆమెలో చనిపోవాలన్న కోర్కె కలిగించిన వాడిని నేను. అందులో సంశయం లేదు. కాని అలా చెయ్యడానికి నాకేమి హక్కుంది? వాళ్ళ ధర్మాధర్మాలని తూచి చూట్టానికి నేనెవర్ని? నా మాటలు ఒక్కొక్కటీ ఆమెను బావి దాకా తోసుకుని వెళ్ళుంటాయి. ఆ తరువాత ఆమెని నూతిలోకి తోసినది నా మాటలే - నేనే! అయ్యో! నేనే ఆమెని చేతులారా చంపినట్లయిందే. దేవుడికి ఏదో ఒక రోజు నేను దీనికి జవాబు చెప్పుకోవల్సి ఉంటుంది. ఏం చెప్పను?

ఆలోచనలకి అడ్డూ - అదుపూ లేదు

రేపు వూరు చేరుకుంటాను. ఈ సంగతి చెబితే నా లక్ష్మి ఏమంటుందో ఏమో.

# 5. అజ్ఞాత వీరుడు

కు. వెం. వు

ఆషాఢ మాసం. రాత్రి సుమారు ఎనిమిది గంటల సమయం. కన్ను పొడుచుకున్నా కానరాని కారుచీకటి. వాన హెూరుమని కురుస్తోంది. సుబ్బన్నగౌడుగారు అరుగుమీద కూర్చుని లాంతరు వెలుగులో లెక్కలు - పత్రాలు చూస్తున్నారు.

లింగడు బయటనుంచి చేతిలో ఒక లాంతరు పట్టుకుని వచ్చి "అయ్యో! ఏరు పొంగు ఏడవ మెట్టు మీదకి వచ్చింది." అన్నాడు.

సుబ్బన్నగౌడ గారు కంగారుగా చప్పున పైకి లేచి "పద చూద్దాం" అంటూ కంబళి భుజాలమీద వేసుకుని బయలుదేరారు. ఇద్దరూ ఏరు ప్రవహిస్తున్న చోటికి వెళ్ళి, ఐదారు మెట్లు దిగి నిలుచున్నారు, ఎర్రటి నురుగు తెరలు వాళ్ళ కాళ్ళకి కొట్టుకుంటున్నాయి. తుంగా నదీ ప్రవాహం ఉరకలు వేస్తోంది. లాంతరు వెలుగులో అలలు తళ తళ మెరుస్తున్నాయి. వర్షం భోరున కురుస్తోంది. వాళ్ళు అక్కడ నుంచుని చూస్తూ వుండగానే ఆరో మెట్టు నీళ్ళలో మునిగిపోయింది.

వాళ్ళు ఐదవ మెట్టు మీద నుంచున్నారు.

సుబ్బన్న గౌడు గారు లింగడి వేపు తిరిగి "నిన్న ఎక్కడి దాకా వచ్చాయిరా నీళ్ళు?" అని అడిగారు.

"నిన్న ఇంతగా లేదు. ఎనిమిదో మెట్టు మీద వున్నాయట నీళ్ళు. అయినా నిన్న కెరె గ్రామం అంతా కొట్టుకుపోయిందట. కెళమనె రంగప్ప గౌడు గారి కొడుకు రాము దొరకనే లేదట. చాల గోలగోలగా వుంది."

గౌడగారి మొహంలో భయపు ఛాయ తొంగి చూసింది. "ఇవాళ పై వేపు వర్షాలెలా వున్నాయిట, నీకేమైనా తెలుసా ? అంటూ కటిక చీకటి వేపు గుడ్డిగా చూడసాగారు."

" పైన వర్షం చాల జోరుగా వుందట. శృంగేరి వేపు సరే సరి. ఆగకుండా కురుస్తోందట." అంటూ లాంతరు వెలుగులో కిందకి చూసి "అయ్యో! ఇటు చూడండి. నీరు ఐదో మెట్టుకి ఎక్కుతోంది" అన్నారు. గౌడుగారు క్రిందకి చూశారు. ఆయన గుండె జారింది. మొహం నల్లబడింది.

ఇద్దరూ వెనుదిరిగి ఇంటి వేపు మళ్ళారు. గౌడుగారు కంబళి తీసివేసి వేడి నీళ్ళతో కాళ్ళు కడుక్కుని జంఖాన మీద కూర్చుని, చేతులు వెనక్కి ఆన్చి ఆలోచనలో పడ్డారు. లింగడు లాంతరు తగ్గించి, కంబళి దులిపి దండెం మీద వేసి వంటింట్లోకి వెళ్ళాడు.

గౌడుగారి భార్య నాగమ్మ "ఏమిటి లింగా, లాంతరు తీసుకుని బయట కెళ్ళారెందుకు? ఏరు బాగా పొంగిందా ఏం ?" అన్నారు. గౌడు గారి పన్నెండేళ్ళ కొడుకు తిమ్మ, కూతురు సీత భోజనానికి కూర్చున్నారు. ఏరు పొంగే విషయం రాగానే, భోజనం మానేసి తదేకంగా వాళ్ళ సంభాషణ వినసాగారు.

"అవునమ్మా ఏరు బాగా పొంగుతోంది. అందులోనూ పైనుంచి వర్షం ఎక్కువగా వుంది. నిన్న కెరె గ్రామం కొట్టుకు పోయిందట. పాపం ఆ కెళమనె రంగప్పగౌడు గారి రాము ఇంకా దొరకలేదట."

నాగమ్మ భోజనానికి కూర్చున్న పిల్లల వేపు చూశారు. ఎందుకు చూశారో ఎవరికి తెలుసు? వాళ్ళు అన్నం మానేసి కూర్చోడం చూసి తనే వాళ్ళ దగ్గరగా కూర్చుని తినిపించసాగారు.

సీత ముద్ద నోట్లో పెట్టుకోబోతూ, "అమ్మా రాము ఏమయ్యాడు?" అంది.

నాగమ్మ "ఏం కాలేదు. నువ్వు అన్నం తిను" అన్నారు.

తిమ్మ, "ఏమిటమ్మా లింగడు చెప్పేది ?" అన్నాడు.

"ఏం లేదు బాబూ, ఏరు పొంగుతోందట అంతే. నువ్వు అన్నం తిను" అనేసి "కదురా లింగా" అన్నారు.

లింగడు అవునన్నట్టుగా తలూపి. "అంతే మరి మీరు అన్నం తినండి తిమ్మయ్యా " అన్నాడు.

సుబ్బన్న గౌడుగారు అరుగు మీద నుంచి "లింగా" అని పిలిచారు. లింగడికి చెవి కొంచెం మందం, వినపళ్ళేదు. మళ్ళీ పిలిచారు. అప్పుడు నాగమ్మ "లింగా, పిలుస్తున్నారు వెళ్ళరా" అన్నారు. లింగడు తటాలున లేచి తన కుంటి కాలితో సొట్టగా అడుగులు వేస్తూ వెళ్ళాడు. పాపం! అతని కుడికాలు, ఎడంకాలి కంటె కొంచెం పొట్టి, సన్నమూను.

లింగడు అరుగు మీది కెళ్ళి "ఎందుకయ్యా పిలిచారు ?" అని అడిగాడు.

గౌడు గారు, వెళ్ళి చూసిరా నీళ్ళు ఎంతవరకూ వచ్చాయో" అన్నారు.

లింగడు లాంతరు వొత్తి పెద్దది చేసి, దీపం పెద్దది చేసి కంబళి కప్పుకుని ఏటి వేపు వెళ్ళాడు. వాళ్ళు వెళ్ళిన కాసేపటికి గౌడుగారు "నాగా" అని పిలిచారు. ఎనిమిదేళ్ళ కుర్రవాడు ఒకడు వక్కలు వుడికించే పొయ్యి వేపునుంచి పరిగెత్తుకు వచ్చి, స్థంబానికి వెనక నుంచుని "ఏంటయ్యగారూ" అన్నాడు.

గౌడుగారు, "పశువుల్ని కట్టేశార్రా ?" అని అడిగారు.

"కట్టేశామయ్యా. తుంగ అవు, బుజ్జి దూడ రెండు మాత్రం పాకకి తిరిగి రాలేదు."

"పోన్లే", అంటూ గౌడు గారు దిండు నానుకుని కూర్చున్నారు. నాగడు మెల్లిగా చలికాచుకోవడానికి పొయ్యి దగ్గర కెళ్ళి పోయాడు. అప్పటికి ఏటి దగ్గర కెళ్ళిన లింగడు తిరిగి వచ్చాడు. గౌడ గారు "నీళ్ళింకా పైకి వచ్చాయా?" అనడిగారు.

అతడు లాంతరు కింద పెట్టి కంబళి దులుపుతూ "నాలుగో మెట్టు వరకు వచ్చిందయ్యా" అన్నాడు.

"అయితే పశువుల పాకలోకి వెళ్ళి అన్ని పశువులవి మెడపలుపు వదిలేసిరా." అన్నారు గౌడగారు, మళ్ళీ తీవ్రంగా ఆలోచిస్తూ కూర్చున్నారు.

లింగడు తన కొడుకు నాగోణ్ణి కూడా తీసుకుని పాకలోకి వెళ్ళాడు. నాగమ్మ లోపల్నుంచి వచ్చి "విస్తరి వేశాను." అంటూ చెంబుతో తెచ్చిన నీళ్ళు అక్కడ పెట్టారు. సుబ్బణ్ణ గౌడుగారు లేచి చెంబు తీసుకుని నోరు పుక్కిలించి ఉమ్మేసి భోజనానికి వెళ్ళారు. తిమ్మ, సీత- ఇద్దరూ అరుగు మీద లాంతరు వెలుగులో కూర్చుని కబుర్లు చెప్పుకోసాగారు. లింగడూ, నాగ వచ్చి అరుగు కొసలో కూర్చున్నారు. వాళ్ళిద్దరిలో తిమ్మ, సీతలకి బాగా చనువు.

తిమ్మ "లింగా, ఏరు బాగా పొంగిందా?" అని అడిగాడు.

లింగడు "లేదయ్యా ఎప్పుడూ పొంగే లాగనే" అన్నాడు.

లింగడి దగ్గర కూర్చున్న సీత సంభాషణ పట్టించుకోలేదు. ఆమె మనసంతా మరెక్కడో వుంది. ఓ సారి లింగడి కాళ్ళ వేపు, మరోసారి చేతి వేపు చూస్తోంది. ఆమెకి చాలా ఆశ్చర్యంగా ఉంది.

ఆఖరికి కుతూహలం ఆపుకోలేక "లింగా ఇదేమిటి? నీ కాళ్ళకి, చేతులకి అలా మచ్చలు పడి వున్నాయెందుకు ?" అని అడిగింది.

ఆ మాట వినగానే లింగడి మొహం నల్లబడింది. నోట మాట రాలేదు. కంట నీరు నిండింది. పాత జ్ఞాపకాల వల్ల కలిగిన బాధని దిగమింగుకుంటూ దీనంగా "అవన్నీ మీకు ఎందకులే సీతమ్మా" అన్నాడు.

తిమ్మకి లింగడిని ఆ పరిస్థితిలో చూసి జాలితో పాటు ఆశ్చర్యమూ వేసింది. సీతకి మారుగా అతనే "లింగా, మా ముందు సంకోచమెందుకురా మాతో చెప్పకూడదూ ?" అన్నాడు.

"మీతో చెప్పడానికేం లేండి. ఇవి జైల్లో సంకెళ్ళు వేసిన గుర్తు". అన్నాడు.

అమాయకుడైన లింగడు జైల్లో వుండేవాడని విని తిమ్మ పసి హృదయానికి బలమైన గాయం తగిలి నట్లయింది. "ఏమిటి నీకు జైలా ? ఏ పుణ్యాత్ముడయ్యా నిన్ను జైలుకి పంపింది?" అన్నాడు.

ఇంతకు ముందు నేను మారినహళ్ళి రంగనాయక గారి దగ్గర పని

చేసేవాడిని. అక్కడ ఐదారు ఏళ్ళు జీతానికున్నానయ్యా. ఏదో ఎవరెవరిదో సావాసం. తాగుడు అలవాటయింది. ఓ రోజు సాయంత్రం సారా తాగాను. అందులో ఏటి కలిపారో ఏటో బాగా మత్తెక్కేసింది. తోవలో నడుస్తున్నాను. రంగనాయక గారి కొడుకు శేషనాయక అని వున్నాడు. ఆయనకీ బాగా తాగి మత్తెక్కి వుంది. ఎక్కడ్నుంచో వస్తున్నవాడు, నాకు దగ్గరగా వచ్చి నోటికొచ్చినట్టు తిట్టసాగాడు. నాకూ తాగిన మత్తులో యజమాని కొడుకని తెలీలేదు. నేనూ తిట్టాను. తరువాత కొట్టుకున్నాం. ఆయనకి దెబ్బలు బాగా తగిలాయి. నా మీద ఫిర్యాదు చేశారు. నేను పేదవాడిని కనుక, నాకు జైలు శిక్ష పడింది."

ఆఖరి మాటలు చెప్పేటప్పుడు అతడి కంఠం గద్గద మయింది. కళ్ళలో నీళ్ళు చిప్పిలాయి. పసివాడిలా వెక్కి వెక్కి ఏడ్చాడు. అది చూసి అతని కొడుకు నాగడూ ఏడవ సాగాడు. సీత కళ్ళల్లోనూ నీళ్ళు తిరిగాయి. తిమ్మి ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు. లింగడు తనని తాను సంభాళించుకున్నాక తిమ్మి పసిపిల్లాడిలాగ "లింగా నిన్ను జైల్లో చాలా కష్టపెట్టారా ?" అని అడిగాడు.

"తిమ్మయ్యా, ఇప్పుడవన్నీ తలచుకుని ఏడ్చి మాత్రం ఏం లాభం. నేను జైలు నుంచి వచ్చేసరికి నా పెళ్ళాం చచ్చిపోయింది. కొడుకు దిక్కులేని వాడై అడుక్కు తింటున్నాడు."

"అయితే ఎన్నేళ్ళున్నావు జైల్లో?"

"రెండెళ్ళు తిమ్మయ్యా రెండేళ్ళు. తరువాతైనా సుఖపడ్డా ననుకున్నారా? ఊహుఁ, లేదు. చుట్టాలు- పక్కాలు జైల్లో వుండొచ్చానని నన్ను దగ్గరికి చేరనియ్య లేదు. పిల్లాడితో నానా అగచాట్లు పడ్డాను. ఆఖరికి ఎవరో శివనూరు సుబ్బణ్ణగారి దగ్గరి కెళ్ళు అన్నారు. ఇటొచ్చాను. మారాజు మీ అయ్య. తిండి- గుడ్డ ఇచ్చి చచ్చిపోయిన వాడిని బతికించారు."

లింగడు కథ ముగించగానే తిమ్మి నిట్టూర్చి "లింగా, నువ్వు మా ఇల్లు వదిలి పెట్టి వెళ్ళకు, నాగడూ అంతే" అన్నాడు.

" అట్టాగే నయ్యా, అట్టాగే."

## 2

ఉరుములు, మెరుపులు, పిడుగులు, గాలి, వాన పిచ్చెక్కినట్టుగా వుంది వాతావరణం. ఇంట్లో అందరూ పడుకున్నారు. లింగడు, సుబ్బణ్ణ గౌడు ఇద్దరే మెలకువగా అరుగు మీద కూర్చున్నారు. ఇద్దరూ అప్పుడప్పుడు వెళ్ళి ఏరు చూసుకుని వస్తున్నారు. అక్కడ నీళ్ళు పై పైకి వస్తూనే వున్నాయి.

"లింగా, పడవ ఎక్కడ కట్టావురా ? ఇల్లు వదిలి వెళ్ళాల్సి రావొచ్చు."

లింగడు కాస్త కంగారుగా "ఆ పుల్ల మామిడి చెట్టు వేరుకి కట్టాను. నీరెక్కిందో ఏమో, ఇప్పుడక్కడకి వెళ్ళగలనే లేదో" అనుకుంటూ లాంతరు పట్టుకుని బయటకి పరిగెత్తాడు. సుబ్బణ్ణ గౌడుగారూ అతన్ననుసరించారు. అక్కడకి వెళ్ళి చూస్తే అనుమానం నిజమయింది. ప్రవాహం మామిడి చెట్టు మొదల్ని ముంచేసింది. ఇద్దరికీ కాసేపు దిక్కు తోచలేదు. వాగు వేపు చూస్తూ నుంచుండి పోయారు. సరిగ్గా అప్పుడే ఇంటి వెనుక ఏదో పడిపోయిన చప్పుడు అయింది. ఇద్దరూ అటు పరిగెత్తారు. పెరటివేపు గోడ పడిపోయి, నీళ్ళు లోగిట్లోకి చొచ్చుకు వొస్తున్నాయి. ఇక అలస్యం చేస్తే సర్వనాశనం తప్పదనిపించింది గౌడుగారికి.

అన్ని గదుల్లోకి వెళ్ళి పడుకున్న వాళ్ళందర్నీ లేపేశారు. వాళ్ళంతా సగం నిద్రలో కంగారుగా అరుగు వేపు పరిగెత్తారు. గౌడుగారు అందర్నీ స్థిమితంగా వుండమని చెప్పి, లింగడి కోసం చుట్టూ చూశారు. లింగడెక్కడా కనిపించలేదు. గట్టిగా "లింగా! లింగా!" అని కేక పెట్టారు. బదులు రాలేదు. అప్పటికి భయంకరంగా గాలి వీస్తోంది. పిచ్చిగా వర్షం కురుస్తోంది. ముంగిట్లో వున్న కొబ్బరి చెట్టు ఇంటికి కప్పిన రేకుల మీద పడి పెద్ద చప్పుడయింది. తిమ్మి, సీత, నాగ భయంతో గట్టిగా అరిచారు. నాగమ్మగారూ "దేవుడా" అంటూ దేవుణ్ణి తల్చుకున్నారు. గౌడుగారు అందరికీ ధైర్యం చెబుతూ, లింగడిని కేకేస్తూ పరిగెట్టారు. వెళ్ళి చూసేసరికి లింగడు మామిడి చెట్టు మొదట్లో చేరుకుని పడవ విప్పుతున్నాడు. ఇంటి కిటికీకి ఒక కొబ్బరితాడు కట్టి దాని సాయంతో మామిడి చెట్టు మొదట్లోకి చేరుకున్నాడతను. కాసేపట్లో పడవ విప్పి అందులో ఎక్కాడు. కిటికీకి కట్టిన తాడుని మాత్రం చేతిలో పట్టుకున్నాడు.

గాలి హోరులో లింగ గౌడుగారితో "అయ్యా తాడు పట్టుకుని లాగండి" అన్నాడు. ఆయన అలాగే చేశారు. పడవ వొడ్డు చేరింది. అంతలో లోపల్నుంచి ఏడెనిమిది మంది కెవ్వు కెవ్వు మని అరవడం వినిపించింది.

గౌడుగారు, "లింగా పడవ గుమ్మం దగ్గరగా తీసుకురా" అంటూ లోపలికి దూరారు. గుమ్మం దాటే లోపల పనిమనిషి సోమక్క రొప్పుతూ పరుగెత్తుకు వచ్చింది.

గౌడుగార్ని చూడగానే సోమక్క అరిచింది. "మేడ పడిపోయింది. అరుగుమీదకి నీళ్ళు వస్తున్నాయి." గౌడుగారు అరుగు మీదకి వచ్చి "అందరూ సింహద్వారం వేపు పరుగెత్తండి. లింగడు పడవ తెస్తాడు. ఒరేయ్ నాగా ఇటురారా" అన్నారు. నాగడు ఆయనతో వెళ్ళాడు.

నాగమ్మ, తిమ్మి, సీత, లోకమ్మ, సోమక్క కూతురు దాసమ్మ అందరూ

సింహాద్వారం వేపు పరుగెత్తారు. సోమక్క మాత్రం లోపలి గదిలో తను దాచుకున్న చిన్న మూట తెచ్చుకోవడాని కని వెళ్ళిన మనిషి తిరిగి రానే లేదు. గౌడుగారు అరుగుమీదున్న తమ బీరువా తెరచి, రెండు పెట్టెలు తీసి బీరువా తలుపు మూశారు. అక్కడే వున్న ఇనుప బీరువా తరచి, మళ్ళీ ఏమనుకున్నారో ఏమో గాని, తలుపు మూసి తాళం వేసేశారు.

"నాగా ఈ పెట్టె తీసుకోరా" అన్నారు. ఇద్దరూ చెరో పెట్టె మోసుకుంటూ బయలుదేరారు. లింగడు అందర్నీ పడవ ఎక్కించి కొసని పట్టుకుని నుంచున్నాడు. గౌడుగారు త్వరత్వరగా వచ్చి పెట్టెల్ని పడవలో పెట్టి, నాగడిని ఎత్తి లోపల కూర్చోపెట్టి, తామూ ఎక్కి, లింగడిని పడవ ఎక్కమని చెప్పి, తానొక కొసన కూర్చుని తెడ్డు చేతికి తీసుకున్నారు. సీత, నాగమ్మగారితో, " అమ్మా సోమక్కేదీ?" అనడిగింది. సరిగ్గా అదే సమయంలో ఇల్లు పడిపోయిన చప్పుడూ ఏదో కేక వినిపించాయి. సోమక్క కూతురు దాసమ్మ కూడా తల్లి ఆశ వదులుకుంది.

పడవ చాలా చిన్నది ఐదారుగురు మాత్రం కూర్చో గలిగినది. నిండు ప్రవాహంలో ఇద్దరైతే సరిపోయేది. ఇప్పుడందులో ఏడుగురున్నారు. దానితోబాటు రెండు పెట్టెలు కూడా. లింగడికి చోటు లేదనిపించి, ఏం చెయ్యడానికి తోచక నుంచునుండి పడవ సురక్షితంగా ఒడ్డు చేరుతుందా అని ఆలోచిస్తున్నాడు.

అతని ఆలస్యం చూసి గౌడుగారు, "లింగా ఎందుకురా ఆలస్యం? ఎక్కరా" అని కలవరం కూడిన కంఠంతో గద్దించారు.

లింగడు "అయ్యా చోటులేదే. ఇప్పటికే పడవకి బరువు ఎక్కువైంది. నేనూ కూర్చుంటే పడవ ఒడ్డు చేరేదెట్టా ?"

"అయితే ఇప్పుడేం చేద్దాంరా ? అయ్యేదేదో అవుతుంది ఎక్కు. దేవుడెలా దయదలిస్తే అలా అవుతుంది. అంటూ గౌడుగారు నది వేపు చూశారు. ఆయన ఒళ్ళు జలదరించింది."

లింగడు, "అయితే ఒక పని చేయండయ్యా. మీరంతా ఒడ్డు చేరాక పడవ ఎవరితో నేనా పంపండి. అంతవరకూ నేనిక్కడే వుంటాను. మీరేం భయపడద్దు." అన్నాడు.

గౌడుగారికి కోపం వచ్చింది. పడవ ఎక్కమని గట్టిగా అరచి ఆదేశించారు. లింగడు మరి మాట్లాడకుండా పడవ మరో కొసన కూర్చొని తెడ్డు పట్టుకున్నాడు. గౌడుగారు తమ బందూకు నుంచి పది పన్నెండు గుళ్ళు పేల్చారు.

పడవ బయలుదేరింది.

ఆ గాలి, వాన, చీకటి - వీటి మధ్యన 'ఢాం - ఢాం ' అన్న బందూకు చప్పుడు గంభీరంగా మ్రోగి మలెనాడు కొండలు గుట్టల మధ్య నుంచి గంభీరంగా ప్రతిధ్వనించింది. దూరపు పల్లెల్లోని జనం మేల్కొని గుళ్ళ చప్పుడు విని ఆశ్చర్య పోయారు.

శివనూరికి రెండు మైళ్ళ దూరాన వున్న నుగ్గేహళ్ళిలో ఇంటి అరుగు మీద పడుకున్న రామే గౌడు , అతని తమ్ముడు సిద్ధే గౌడు కూడా బందూకు పేలిన చప్పుడు విని ఆశ్చర్యంగా లేచి కూర్చున్నారు.

సిద్ధే గౌడు రామే గౌడుతో "అన్నయ్యా, అదేమిటి గుండు పేలిన చప్పుడు కదా ?" అన్నాడు.

రామే గౌడు "ఎటు వేపు నుంచి వినిపించిందిరా ?" అన్నాడు.

"కెమ్మణ్ణుచ్చి వేపు నుంచి అనిపిస్తోంది మరి"

"కాదనుకుంటా శివనూరి వేపు నుంచి వినిపించినట్టు అనుమానంగా వుంది."

"ఎక్కడైనా ఏరు-గీరు పొంగిందేమో."

"ఏదో వుండే వుంటుంది. ఏమైనా సరే, నలుగురైదుగుర్ని తీసుకుని వెళదాం పద".

సిద్ధేగౌడు హడావుడిగా లాంతరు వెలిగించాడు. రామేగౌడు గురక పెడుతూ నిద్రపోతున్న రంగడిని లేపి నలుగురైదుగురు పనివాళ్ళని తీసుకు రమ్మని పురమాయించాడు.

3

"రామ రామా" అంటూ స్త్రీలు పిల్లలు గోల పెడుతున్నారు. ఆ గోల ప్రవాహపు అలల తీవ్రత మధ్యన చిక్కు పడుతూ, లేస్తూ, పడుతూ, తేలుతూ పడవనుంచి బయటపడి గాలి హోరులో కలిసిపోతోంది. సుబ్బణ్ణగౌడుగారు, లింగడు ఇద్దరూ ధైర్యంగా తెడ్లు వేస్తున్నారు. పడవ మధ్యనున్న లాంతరు చీకటికి భయపడి మూల దాక్కున్నట్టుగా తన చుట్టూరా ఒక్క అడుగు మేర మాత్రం వెలుగు చూపెడుతోంది. బరువు వల్ల పడవ ఇప్పుడో అప్పుడో మునిగి పోతుందేమో నన్నట్టుగా వుంది.

గౌడుగారు పడవలో వున్న విలువైన పట్టెలు రెండింటినీ తీసి నీటిలో పారేశారు. అయినా బరువు తగ్గలేదు. ఎంత చెప్పినా వినకుండా స్త్రీలు, పిల్లలు రామ రామా అని గోల పెట్టడం మానలేదు. దిక్కు తెలియక పిచ్చిగా వూగుతోంది పడవ. ఓ సారి అది మునిగి పోతున్నట్టు వాలి, కొద్దిగా నీళ్ళు లోపలికి వచ్చాయి. మళ్ళీ అందులోని జనం 'రామా రామా ' అని అరవ సాగారు.

తెడ్డు వేస్తున్న లింగడు స్త్రీలు, పిల్లలు చేస్తున్న హాహాకారాల్ని వింటూనే

వున్నాడు. అతని గుండె కరిగి నీరయింది. పడవ భారంతో మునిగిపోవడం ఖాయమనే అనుకున్నాడు. బరువు తగ్గించడానికి ఏ వుపాయమూ కనిపించలేదతనికి. ఉన్నట్టుండి అతని మొహం గంభీరమయింది. తెడ్డు వెయ్యడం ఆపి వాన జోరులో చుట్టూ చూశాడు. ఒకరి మొహాలొకరికి కనిపించడమే లేదు. కనిపించినా ఎవరూ చూసే స్థితిలో లేరు. తను నీళ్ళలోకి దూకేస్తే బరువు తక్కువై పడవ సురక్షితంగా ఒడ్డు చేరవచ్చు. తనని లోకమంతా దొంగ అని ముద్రవేసి దూరం చేసినప్పుడు, తిండి- నీళ్ళు ఇచ్చి బ్రతుకు తెరువు చూపించిన వారిని ఎలాగైనా కాపాడాలనిపించింది. తెడ్డు లోపల పెట్టి దూకబోయాడు.

అంతలో కొడుకు గుర్తొచ్చాడు. కొంచెం తటపటాయించి ఒక క్షణం ఆగాడు.

అప్పుడే పడవ మునిగిపోయేలా పక్కకి వాలడంతో అందరూ "రామ రామ.... అయ్యో అయ్యో" అని అరవసాగారు.

లింగడు నిట్టూర్చాడు. అందరూ వుండగానే పడవ ఒడ్డు చేరకూడదా అనుకున్నాడు. కాని అది ఆత్మవంచన చేసుకునే ఆలోచన అనిపించింది.

మళ్ళీ "అయ్యో!" అన్న గోలతో పడవ దద్దరిల్లింది.

లింగడు వెనుకా ముందూ చూడకుండా 'రామ రామ' అంటూ నీళ్ళల్లోకి దూకేశాడు.

అతనలా దూకెయ్యడం ఆ కటిక చీకటిలో ఆ గాలి- వాన - హోరులో ఎవరికీ తెలీలేదు. పడవ బరువు తగ్గి మొదటి కన్నా సులువుగా ప్రయాణించసాగింది.

గౌడుగారు "లింగా, భగవంతుడి దయవల్ల పడవ కాస్త సులువుగా వెళుతోందిరా" అన్నారు. అందులో లింగడి దయ కూడా చేరిందని తెలీదాయనకు.

కాస్సేపట్లో స్త్రీలు, పిల్లలు "దీపం, దీపం" అని అరిచారు. సుబ్బణ్ణగౌడుగారు తిరిగి చూశారు. ఒడ్డున ఐదారు దీపాలు కనిపించాయి. ఆ వెలుగులో పది పదిహేను మంది మనుషులూ వున్నట్టు కనిపించింది. ఒడ్డు నుంచి బందూకు చప్పుళ్ళూ వినిపించాయి. మెల్లిగా తేలుతూ పడవ ఒడ్డుకు వెళ్ళింది.

నుగ్గేపల్లి రామే గౌడు, సిద్ధే గౌడు పరుగున వచ్చి స్త్రీలని, పిల్లల్ని పడవనుంచి జాగ్రత్తగా దింపుకున్నారు. సుబ్బణ్ణగౌడుగారు "ఉస్సప్పా" అంటూ దిగారు. అందరం ఒడ్డు చేరాము కదా, బ్రతికి బయట పడ్డాం కదా అన్న ఆనందం, ఆ సంబరంలో ఎవరికీ లింగడి గురించిన ఆలోచన రాకపోవడంలో ఆశ్చర్యం లేదు. కాని నాగడు మట్టుకు ఏడుస్తున్నాడు. అది

చూసి నుగ్గేపల్లి సిద్ధే గౌడు మట్టుకు "ఏంటిరా? ఏమయింది ? ఎందుకు ఏడుస్తావ్?" అని అడిగారు.

వాడు వెక్కి వెక్కి ఏడుస్తూ "అయ్యో" అన్నాడు.

సుబ్బణ్ణ గౌడుగారు "ఏమిటి సిద్ధేగౌడు గారు ?" అని అడిగారు.

"ఈ కుర్రాడు "అయ్యో" అని ఏడుస్తున్నాడు" అన్నారు. ఆ మాట వినగానే సుబ్బణ్ణ గౌడు గారి మొహం తెల్లగా పాలిపోయింది. చప్పున లేచి నుంచుని "లింగా, లింగా" అని కేకేశారు. అడవిలోంచి " లింగా లింగా " అని ప్రతిధ్వని వచ్చింది. లింగడెక్కడా కనిపించలేదు. పడవ దగ్గరకి పరిగెత్తారు. అక్కడా లేదు. భీకరమైన చీకటిని కప్పుకుని గంభీరంగా, భయంకరంగా విశాలంగా ప్రవహిస్తున్న నదిని తదేకంగా చూసి వణికిపోయారు. ఆయనకి దుఃఖం ఆగలేదు. "లింగా, లింగా" అని రోదించారు. నాగడు పడి పడి ఏడుస్తున్నాడు. తిమ్మి, సీతా, కూడా ఏడవసాగారు.

"మా ఇంట్లో ఓ దీపమే ఆరిపోయింది." అని చుట్టూ వున్న వాళ్ళతో చెప్పుకుని ఏడ్చారు. లింగడి ఆకస్మికమైన అనిరీక్షితమైన చావు కోసం అందరూ శోకించారు. గౌడుగారు నాగడిని ఓదారుస్తునే వున్నారు. అయినా వాడు ఏడవడం మానలేదు. "అయ్యో, అయ్యో" అని కేకెయ్యడం మానలేదు.

లింగడెలా నది పాలబడ్డాడో ఎవరికీ అర్థం కాలేదు. సుబ్బణ్ణగౌడు గారు. లింగడి జాడ ఎక్కడైనా కనిపిస్తుందేమోనన్న ఆశతో కొంతమందిని ఒడ్డు వెంబడే వెతకడానికి పంపించారు.

రామేగౌడుగారు అందర్నీ నుగ్గేహాళ్ళికి రమ్మని ప్రార్థించారు.

త్రోవ పొడుగునా అందరూ లింగడు హఠాత్తుగా కనుమరుగై పోవడం గురించే విస్మయంగా చెప్పుకుంటూ నుగ్గేహాళ్ళికి చేరుకున్నారు.

తెల్లవారింది. వర్షం ఇంకా తగ్గలేదు. రాత్రి హడావుడి వల్ల అలసిపోయిన సుబ్బణ్ణగౌడుగారు పక్కమీద పడుకునే రామేగౌడు, సిద్ధేగౌడులతో వెనకటి రాత్రి జరిగిన సంగతులు గురించే మాట్లాడుతున్నారు. వాళ్ళకి కాస్త దూరంలో ఏడుస్తున్న నాగడిని సీత, తిమ్మి ఓదారుస్తున్నారు.

సీత, "ఏడవకురా అయ్య తప్పకుండా వస్తాడు" అంటూ వాడి కన్నీరు తుడిచింది.

నాగడు వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. తిమ్మి "లింగడు వచ్చేస్తాడురా ఏడవమాకు" అని ఓదారుస్తున్నాడు.

అంతలో బయట ఏదో గోల "లింగడొచ్చాడు లింగడొచ్చాడు" అన్న అరుపూ వినపడ్డాయి.

సుబ్బణ్ణగౌడుగారు లేచి బయటకి పరుగెత్తారు. రామే గౌడూ, మిగతా వాళ్ళు ఆయన వెంటే వెళ్ళారు. తిమ్ము, సీత నాగణ్ణి లాక్కుని వెళ్ళి అక్కడకి చేరుకున్నారు. నిజంగానే లింగడు వచ్చేశాడు. నాగడు "అయ్యా" అంటూ వెళ్ళి అతడిని వాటేసుకున్నాడు. లింగడి గుడ్డలన్నీ తడిసి సొలిపోతూ, వణికిపోతున్న అతన్ని లోపలికి తీసికెళ్ళి బట్టలు మార్పించి, వేడిగా కాఫీ, ఫలహారం ఇచ్చి, వెచ్చగా పడుకోబెట్టారు.

తరువాత సుబ్బణ్ణగౌడుగారు అతని పక్కనే కూర్చుని "లింగా ఏమయింది రా ? అసలు సంగతేమిటి ?" అనడిగారు.

లింగడు క్షీణస్వరంతో "తెడ్డు వేస్తున్నా కదా! ఓ సారి పడవ తలకిందులయినట్లు ఒరిగిందే, అప్పుడు తూలి నదిలో పడ్డాను. పడవని పట్టుకోబోతే అది ముందుకి పోయింది. కాస్త దూరం ఈదుతూ, తేలుతూ వెళ్ళాను. అదృష్టం కొద్దీ కాలికి నేల తగిలింది. గట్టిగా నుంచున్నాను. నడుం వరకు నీళ్ళు వచ్చాయి.అలాగే నుంచుండిపోయాను. తెల్లవారాక పొంగు తగ్గింది. మీ ఉప్పు ఇంకా ఋణముంది కాబట్టి ఇలా రాగలిగాను".

గౌడుగారు, "కాదురా తెడ్డు వేస్తున్న వాడివి తూలిపడితే, తెడ్డు పడవలో కెలా వస్తుంది?" అన్నారు.

"ఏమోనయ్యా దేవుడికే తెలియాలి"

మధ్యాహ్నం భోజనాలయ్యాక తిమ్ము, సీత నేను మొదట చెప్పానంటే నేను మొదట చెప్పానని వాదించుకుంటున్నారు.

నాగమ్మ అక్కడికొచ్చి "ఏమిట్రా అది?" అని అడిగారు.

తిమ్ము "నేనమ్మా మొదట చెప్పింది లింగడొస్తాడని ' అన్నాడు.

సీత "కాదమ్మా తిమ్మన్నయ్య వుట్టి అబద్ధాలు చెపుతున్నాడు. నేనే ముందు చెప్పాను. కావాలంటే నాగడిని అడుగు" అంది.

"ఎవరైతేనేంరా ? మొత్తానికి లింగడు వచ్చేశాడు కదా! అంతే చాలు." అంటూ నాగమ్మ లోపలికి వెళ్ళారు.

# 6. ధర్మ కొండ కథ

అశ్వత్థ

ఆ రాత్రి అమావాశ్య చీకటి బయటంతా అలుముకుంది. అంతటా విపరీతమైన నిశ్శబ్దం. ఎక్కడో ఓ కుక్క మొరగడం అప్పుడప్పుడు వినిపిస్తోంది. పల్లె అంతా విశ్రాంతి తీసుకుంటున్నట్టుగా వుంది. వేళ పదకొండు గంటలయింది. ధర్మకొండ కరణం సూరప్ప గారింట్లో అతను తప్పించి, అందరూ పడుకున్నారు. కాని అతను తన గదిలో లాంతరు వెలుగులో లెక్కలు రాస్తున్నాడు. జమాబంది దగ్గర పడింది. లెక్కలన్నీ త్వరగా పూర్తి చెయ్యాలి. సూరప్ప శ్రద్ధగా పని చేసుకుంటున్నాడు. లెక్క అక్కడక్కడ కుంటు వడ్డప్పుడు చేతి వేళ్ళతో తల గోక్కునేవాడు. మళ్ళీ రాత కొనసాగించేవాడు. హాల్లో వున్న పెద్ద గడియారం "ఠంగు" మని అరగంట కొట్టింది. సూరప్ప దాన్ని లెక్క చేయకుండా తన పని ముగించాలన్న తాపత్రయంతో రాసుకు పోతున్నాడు. కాని అతని కళ్ళు మూతలు పడుతున్నాయి. నిద్ర ముంచుకొస్తోంది.

"తలుపూ" సూరప్పకి కలలో లాగ ఎవరో మెల్లిగా పిలిచినట్లయింది. సగం మూసిన కళ్ళని కొద్దిగా తెరచి విన్నాడు. ఏమీ వినిపించక పోవడంతో అదేదో తన భ్రమ అయ్యుంటదనుకుని వ్రాత పని వేపు దృష్టి మళ్ళించాడు.

"తలుపూ" ఈ సారి ఆ ధ్వని స్పష్టంగానే వినిపించింది. అందులో భ్రమేమీ లేదు. ఈ సారి అతను నిద్రమత్తులో లేడు కూడా. సూరప్ప దిగ్గున లేచి లాంతరు తీసుకుని చప్పుడు చెయ్యకుండాముని వేళ్ళమీద నడుస్తూ హాల్లోంచి వీధి గుమ్మం దగ్గరకి వచ్చాడు. గడియమీద చెయ్యి వెయ్యబోతుంటే బయట నుంచి చేతి గాజుల చప్పుడు వినిపించింది. సూరప్ప చకితుడై చప్పున గడియ తీసి తలుపు తెరిచాడు. లాంతరు మసక వెలుతురులో అతనికి, అక్కడే గడప దగ్గర ఒక స్త్రీ రూపం కనిపించింది. కాందహారి (బంజారి) స్త్రీ ఒకామె చీటీ లంగా కట్టుకుని పట్టు చొక్కా తొడుక్కుంది. తలకి ఎరుపు రంగు గుడ్డ కట్టుకుంది. 'కారబా' పూసలదండ రొమ్ముల మీద వేలాడుతోంది.

ఆ దృశ్యాన్ని చూసిన క్షణం సూరప్ప భ్రాంతితో రాతి ప్రతిమలా నుంచుండి పోయాడు. కాని అదే క్షణంలో ఆమె 'దేవుడూ' అంటూ స్పష్టంగా పలికి క్రింద కూలబడిపోయి అతని కాళ్ళని రెండు చేతులతో కౌగిలించుకుంది. ఆ మాట, కంఠం విని సూరప్ప ఆశ్చర్యానందాలతో, కొద్ది అనుమానంతో చటుక్కున లాంతరు ఆమె మొహం దగ్గరగా పెట్టి చూశాడు. ఆమె సగం పైకెత్తిన దీన

వదనం కనిపించింది.

"దేవూ" అంటూ సూరప్ప లాంతరు కింద వదిలేసి వొంగి ఆమెని రెండు చేతులతో పైకెత్తి కౌగిలించుకుని "దేవూ , దేవూ నా బంగారూ " అంటూ ఆమె తలమీద గడ్డ తీసేసి జుత్తు నిమిరాడు. ఆమె నోట్లోంచి మాట రాక కన్నీళ్ళతో అతని భుజం తడిపేసింది.

సూరప్ప ఆనందంతో ఉబ్బితబ్బిబ్బవుతూ ఆత్రంగా అక్కడ్నుంచే గట్టిగా "అమ్మా, దేవువచ్చింది, దొరికింది " అంటూ హాలు వేపు చూస్తూ అరిచాడు. లోపల దగ్గిన చప్పుడు వినిపించింది. భార్యాభర్తలు దూరంగా జరిగారు. ఆమె అడుగు వెనక్కి వేసేటప్పుడు కుంటుతూ 'హా' అని కింద కూలబడిపోయింది. అతను "ఏమయింది? ఏమిటి? " అంటూ ఆమె కాళ్ళ వేపు చూశాడు. రెండు పాదాలూ దుమ్ముతో నిండి వున్నాయి. లావుగా వాచి వున్నాయి. ఎడం కాలి నుంచి రక్తం కారుతోంది. తువ్వాలు చింపి, వరండాలో ఆవు కోసం పెట్టిన నీళ్ళతో ఆ ముక్కని తడిపి ఆమె పాదానికి కట్టాడు.

అంతలో వయసు మళ్ళుతున్న ఒక వితంతువు సూరప్ప తల్లి గంగమ్మగారు తడుముకుంటూ బయటకి వచ్చారు. ఆమె వేపు చూసి అనుమానంతో "ఇదేమిట్రా, దేవమ్మ...." అంటూండగానే "అవునమ్మా, తనే" అన్నాడు. ఆవిడ తొంగి చూసి, దేవమ్మ మొహాన్ని చూసి "ఇదేమిటి తల్లీ? ఎక్కడి కెళ్ళావు ఇన్ని రోజులు? ఏమిటీ వేషం?" అనడిగారు. సూరప్ప కూడా అప్పుడే వర్తమానంలోకి వచ్చినట్టుగా జవాబు కోసం నిరీక్షించాడు. కాని ఆ ప్రశ్నల్ని వినగానే దేవమ్మకి గాయం రేగినట్టయింది, మెడనరాలు ఉబ్బాయి. మాట పెగల్లేదు. మళ్ళీ ఏడుపు పొంగి వచ్చింది. జవాబుకి బదులుగా ఏడుపొచ్చింది. అంతలో లోపల్నుంచి చిన్న వయసులో వున్న మరొక వితంతువు సూరప్ప అక్క గుండమ్మ బయటకి వచ్చి చూసి "దేవమ్మ.... ఇలా వుందేమిటమ్మా .... ఏమయింది దీనికి ?" అనడిగింది. సూరప్ప, గంగమ్మ "కాస్త ఆగు" అన్నట్టు సైగ చేశారు. అంతలో లోపల్నుంచి, "అమ్మా .... బామ్మా" అన్న పిల్లాడి కంఠం వినిపించింది. అది వినగానే దేవమ్మ ఏడుపు ఆగింది. ఆమె చప్పున తలెత్తి "నాన్నా చందూ, రా తండ్రీ ఇక్కడున్నాను" అంటూ పైకి లేవబోయింది. ఆ లోపల రెండేళ్ళ పిల్లవాడు "అమ్మా, అమ్మా" అంటూ కళ్ళు నులుముకుంటూ, గడప తాకి పడిపోతాడేమో నన్నట్టుగా తప్పటడుగులు వేస్తూ వచ్చేశాడు. దేవమ్మని చూసి అనుమానంతో బామ్మ దగ్గరే వుండిపోయాడు. ఆమె, "చందూ, ఏరా నాన్నా? రారా నా దగ్గరికి" అనగానే పరుగున వెళ్ళి తన బుల్లి చేతులతో ఆమె మెడని వాటేసుకున్నాడు. ఆమె కూడా "నా బంగారు కొండా, నా తండ్రీ!"

అంటూ బిడ్డని ఒళ్ళోకి తీసుకుని తన చెంప బాబు చెంపకి చేర్చి, బిడ్డ వొళ్ళూ, చేతులూ, కళ్ళని అరచేత్తో తడిమింది.

తల్లీ బిడ్డల సమాగమపు ఆనందానికి అడ్డు రాకుండా అందరూ కాసేపు మౌనంగా వుండిపోయారు. తరువాత గంగమ్మగారే మొదట మాట్లాడారు.

"దేవమ్మా, నీ కోసం ఎంతగా వెతికించామని నీ మొగదు చుట్టుపక్కల పల్లెలన్నిటికీ మనుషుల్ని పంపించి వెతికించాడు. బావులు, చెరువుల్ని కూడా వెతికించాడు. పోలీసు రిపోర్టు కూడా ఇచ్చాడు. ఇంత చేసినా నీ జాడే తెలియలేదు. ఆ రోజు సాయంత్రం మంచి నీళ్ళ బావికి వెళ్ళిన దానివి అలాగే మాయమైపోయావు. నీళ్ళ బిందేమో నూతి గట్టు మీదే వుంది. నువ్వెక్కడకి వెళ్ళిపోయావమ్మా ఇన్ని రోజులూ....?"

"నా అంతట నేను ఎక్కడికయినా ఎందుకు వెళతాను? ఏం కారణం వుంది గనుక ?" ఆమె నిదానంగా అంది.

"మరి?" సూరప్ప ఆత్రంగా అడిగాడు.

"దొంగతనంగా ఎత్తుకు పోయారు దుండగులు."

"హాఁ .... ఎవరు?"

"కందారీలు"

"తోట దగ్గర గుడారాలు వేసుకున్నారే వాళ్ళా?"

"అవును.... " దేవమ్మ తల వూపింది.

"పాపాప్టి ముండా కొడుకులు, వాళ్ళకేమొచ్చింది పోయే కాలం?" అంటూ శపించారు గంగమ్మగారు.

"అదెలా వీలైంది? వాళ్ళ చేతికి అందేటంత దగ్గరగా ...." సూరప్ప అనుమానిస్తూ అడిగాడు.

"నేను వెళ్ళలేదు. ఆ రోజు మంచినీళ్ళకి వెళ్ళినపుడు మునిమాపు వేళయింది. నేను తొందరగా ఓ బిందెడు నీళ్ళు చేదుకుని తల మీద పెట్టుకుంటున్నాను. అంతలో అక్కడికో కందారీ వాడొచ్చాడు. చూడ్డానికి యముడిలా వున్నాడు. నాకు భయం వేసింది. బిందె అక్కడే వదిలిపెట్టి పారిపోయి వద్దామనుకున్నాను. కాని భయంతో కాళ్ళు - చేతులు ఆడలేదు. అతను తాగడానికి నీళ్ళు పొయ్యమని తన లావుపాటి తలపాగా విప్పి చంకలో పెట్టుకుని మోకాళ్ళ మీద కూర్చున్నాడు. నాకేం తోచలేదు. గట్టుమీదున్న బిందె లోంచి అతని దోసిట్లోకి నీళ్ళు వొంపాను. తాగాక అతను లేచి గుడ్డతో నోరు, మొహం తుడుచుకుంటూ, అటు - ఇటు చూసి చటుక్కున ముందుకొచ్చి, ఆ గుడ్డని నా నోట్లో కూరాడు. నేను అరవలేక విడిపించుకోవడానికి గింజుకుంటూ

వుండిపోయాను. గుడారానికి వెళ్ళిన కొద్ది నిమిషాల్లోనే వాళ్ళ గుంపు ప్రయాణానికి సిద్ధమై పల్లె వదిలి బయలుదేరిపోయారు.

"అరెరే, అంత తొందరగానే? మేము వెతకడానికి వెళ్ళేసరికి వాళ్ళెక్కడా కనిపించలేదు. వాళ్ళెప్పుడో మధ్యాహ్నమే వెళ్ళిపోయుంటారు నీకు, వాళ్ళకి సంబంధం వుండుండదేమోననుకున్నాం." సూరప్ప గుర్తు చేసుకుంటూ అన్నాడు.

"వాళ్ళు మామూలు దారుల్లో వెళ్ళనే లేదు. అడవుల్లోంచి, కొండల్లోంచి రాత్రంతా నడిచేవారు. "

"నువ్వా వాళ్ళతో బాటే అక్కడంతా నడిచావా ?"

"ఊఁ, పల్లెనుంచి ఓ రెండు మైళ్ళు అతను నన్నలాగే మోసుకెళ్ళాడు. అడవి మధ్యలో నన్ను దించి, కట్లు విప్పి, నలుగురైదుగురు నన్ను చుట్టుముట్టి కత్తులు చూపించి బెదిరించారు. గప్‌చుప్‌గా ముందుకు నడవమని సైగలు చేసారు. ప్రతిఘటించినా మొండికేసినా చంపడానిక్కూడా వెనుదియ్యరని అర్థమయింది. కాని నాకు చచ్చిపోవాలని లేదు. ఎలాగైనా ఇక్కడకి రావాలన్న ఆశ వుంది. ఏం చెయ్యను? నడిచాను."

" అయ్యో! ఎన్ని బాధలు పడ్డావమ్మా!" గంగమ్మ గారు కరిగి నీరయింది.

"దుర్మార్గులు! అక్కడ పోలీసులు అనుమానం మీద వాళ్ళని పట్టుకున్నపుడు నువ్వు వాళ్ళతో లేవే" సూరప్ప ఆవేశంగా, ఆశ్చర్యంగా అడిగాడు.

"వాళ్ళు చాలా జాగ్రత్తగా నన్ను కాళ్ళు, చేతులు కట్టేసి, నోట్లో గుడ్డలు కూరి ఏవన్నా పొదల చాటునే, బండరాళ్ళ సందులోనే దాచేసి తాము దూరంగా వుండేవారు. భయం తప్పి, రాత్రి ప్రయాణం మొదలైతేగాని నాకు బంధ విముక్తి అయ్యేది కాదు."

"తిండి - తిప్పలూ?"

"నాలుగు రోజులు ఏమీ లేకుండా గడిపాను. వాళ్ళు తెచ్చిపెట్టిన ఆహారాన్ని ముట్టుకోలేదు. కాని అయిదోరోజు ఆకలి- దప్పికలతో నిస్త్రాణ పడిపోయి...."

"తినేశావా, ఆ తురకవాళ్ళ అన్నం ?" గుండమ్మ ఆత్రంగా అడిగింది.

దేవమ్మ మౌనంగా తలవొంచుకుంది.

"పాపం! తినక ఏం చేస్తుందిలే " సూరప్ప భార్య పరంగా అన్నాడు.

"కాని జాతి, మతం...." గుండమ్మ ఏవో చెప్పబోయింది.

"నువ్వూరుకో అక్కా, అదేం మాట! " అని అక్కతో అని,సూరప్ప భార్యతో-

"తరువాత ఇక్కడి కెలా వచ్చావ్ ?" అన్నాడు.

"మేమైతే నీ ఆశ వదులుకున్నాం తల్లి." గంగమ్మగారన్నారు.

"ఐదవ రోజు సాయంత్రం పెద్దవూరు చేరుకున్నాం. బాగా చీకటి పడ్డాక వూళ్ళోకి వెళ్ళాం. అనుమానం కలక్కుండా గుంపులోని ఆడవాళ్ళంతా బురఖా వేసుకుని నాకూ ఒకటి వేశారు."

"అబ్బబ్బా ఏం మనుషులు! .... తర్వాత ?"

" ఆ వేళ రాత్రే చాలా సేపయ్యాక నన్ను ఓ మసీదుకి తీసికెళ్ళారు. అక్కడొక్క ముల్లా, నాకేదో మంత్రం లాంటిది చెప్పమన్నడు. చెప్పా. అది 'కల్మ' 'నమాన్' అట. నేను మొదట్లో చెప్పనని పట్టుబట్టాను.

"ఆఖరికి చెప్పేశావా ?" గుండమ్మ ప్రశ్నించింది.

"చెప్పకపోతే గోమాంసం నోట్లో కూరి జాతి పోగొడతామని బెదిరించారు. అదేం వుట్టుట్టి బెదిరింపు కాదు. అలా జాతి పోగొట్టుకోడం కన్నా, అది చెప్పడవే తక్కువ పాపమనుకుని చెప్పేశాను. వాళ్ళంతా సంతోషించి, "ఇక నువ్వు మాలో కలిసినట్టే" అన్నారు.

"అయితే జాతి పోయిందా ?" గుండమ్మ ఒత్తి పలికింది.

" అదేమిటో నాకు తెలీదు. వాళ్ళలా అన్నారు."

"ఇదెక్కడి అన్యాయం ?" గంగమ్మ గారి మొహం గంభీరమైంది.

"దీనకేం చెయ్యాలిరా భగవంతుడా?" సూరప్ప కూడా గంభీరంగా ఆలోచించ సాగాడు.

కాసేపు వాళ్ళ మధ్య మాటా - మంతీ లేకుండా గడిచింది. దేవమ్మ ఒకరి మొహం తరువాత మరొకరి మొహం దైన్యం నిండిన చూపులతో చూస్తూ బాబుని మరింత గట్టిగా గుండెలకి హత్తుకుంది.

"అయితే ఇంత పని జరిగిందన్నమాట!" సూరప్ప తనకు తానే గట్టిగా చెప్పుకున్నాడు.

"అంతటితో పూర్తి కాలేదు" ఆగిన కన్నీరు మళ్ళీ ప్రవహించసాగింది.

"ఆఁ, ఇంకా వుందా ?....ఎలా తప్పించుకుని వచ్చావు ?" సూరప్ప గొంతులో భయం, ఆవేశం.

మేమొక ముసల్మాను ఇంట్లో దిగాము. ఆ రాత్రి జరిగిన మాటల్ని బట్టి ఈ కందారీలు నన్ను ఆ ఇంటి యజమానికి పెళ్ళి చేసుకోవడానికి అమ్మారని తెలిసింది.

"ఆఁ .... ! "

"ఊఁ, అలాగే అనిపించింది. మర్నాడు ఖాజీ వచ్చాడు. నాకు నిఖా జరుగుతుందని కందారీలు చెప్పారు. నేను ఒద్దు వొద్దని అల్లాడాను, వేడు

కున్నాను. వాళ్ళు వినలేదు. గుండె పగిలేలా ఏడ్చాను. వాళ్ళ మనసులు మాత్రం కరగలేదు. ఆఖరికి కోపంతో మొండికెత్తాను. కాని వాళ్ళా వినేది ? మొదట వాళ్ళూ నయంగా చెప్పారు. నేను ఒప్పుకోలేదు. తరువాత బెదిరించారు. అబ్బ! ఎలాంటి బెదిరింపులో! అవన్నీ ఇప్పుడు చెప్పలేనుగాని, నేను చావడానికి సిద్ధపడి వాటన్నిటినీ నిర్లక్ష్యం చేశాను. ఆఖరికి వాళ్ళు బలత్కారంగా తాళి పని నెరవేర్చారు."

"పెళ్ళి జరిగిపోయిందా ?" గుండమ్మ గుచ్చి గుచ్చి అడిగింది.

"ఊఁ, పైపై ఆచారాలు జరిగాయి".

"రామ , రామ!" గంగమ్మ గారు నిట్టూర్చారు.

సూరప్ప నోరు కట్టుడిపోయింది. దేవమ్మ చెప్పసాగింది.

"నా మొండితనం చూపి ఆ ఇంటి యజమాని నేను దారి కొచ్చేదాకా వాళ్ళకి డబ్బివ్వనని, అంతదాకా వాళ్ళక్కడే వుండాలనీ అన్నాడు. వీళ్ళు మా పని అయిపోయింది, నువ్వే ఎలాగైనా సరి చేసుకోవాలనీ, వాళ్ళ డబ్బు వాళ్ళ కిచ్చెయ్యాలనీ వాదించారు. గొడవ మొదలైంది. అప్పుడు నేను, వీళ్ళక్కడే వుండిపోవాల్సొస్తే నాకు మరింత కష్టాలు కదా అని ఆలోచించుకుని, మొండితనం చేసే కంటే, ఉపాయంగా తప్పించుకోవాలని నిశ్చయించుకున్నాను. నా పరిస్థితికి తలొగ్గినట్టుగా నటించి, సరిగ్గా వుంటానని ఒప్పుకున్నాను. వాళ్ళు సంతోషంతో డబ్బు తీసుకుని వెళ్ళిపోయారు."

"ఊఁ,"

"అతని పట్ల ప్రేమ వున్నట్టు నటించాను. ఆనందపడ్డాడు. నాలో నమ్మకం పుట్టించాను. నా పట్ల ధైర్యం కలిగేటట్టు చేశాను."

"ఊఁ,'

"సాయంత్రం బయటున్నానని చెప్పాను. ఆ రోజు మర్నాడు గడిపాను. మూడవ రాత్రి అతను సందేహం లేకుండా పడుకోగానే తప్పించుకున్నాను. పగలంతా దాక్కుంటూ, రాత్రిళ్ళు బెంగుళూరు - హరిహర రోడ్డుకి దగ్గరగా వున్న పొలాల్లో నడచి నడచి దారి తెలుసుకుంటూ వచ్చాను."

"ఎంత సాహసం! " గంగమ్మగారు ఆశ్చర్యపడ్డారు.

"మొత్తానికి తిరిగొచ్చావు కదా" సూరప్ప తృప్తిగా అన్నాడు.

"వస్తే మాత్రమేం ? జాతి పోయిందిగా." గుండమ్మ ఆక్షేపించింది.

"అక్కా!" సూరప్ప గద్దించినట్టుగా అన్నాడు.

"వున్నమాటే అన్నానురా, అందులో తప్పేముంది? నేనన్నది అబద్ధం కాదుగా. పెళ్ళి కూడా అయింది." గుండమ్మ సాధింపుగా అంది.

"వదినా నేను కావాలని ఏ తప్పు చేయలేదుగా" దైన్యంగా అంది దేవమ్మ.

"కావచ్చు, నేను అదేమీ కాదనలేదుగా. కాని జరిగినదాన్ని మాత్రం కాదనగలమా ?" గంగమ్మ నిక్కచ్చిగా చెప్పేసింది.

దేవమ్మ భర్త వేపు, అత్తగారి వేపు చూసింది. వాళ్ళ మొహాలు పాలిపోయాయి. తనూ తలవంచుకుంది. భుజంమీద పడుకుని మళ్ళీ నిద్రలో పడ్డ బిడ్డని తొడమీద పడుకోబెట్టుకుని తట్టింది. కాసేపు ఎవరూ మాట్లాడలేదు.

"ఇప్పుడేం చెయ్యాలమ్మా?" సూరప్ప అడగలేక అడగలేక తల్లిని అడిగి, వగిలిపోతున్న తలని పట్టుకున్నట్టుగా రెండు చేతులతోనూ తల పట్టుకూర్చున్నాడు.

"నాకేమీ తోచడం లేదురా" ఆలోచిస్తూ అన్న గంగమ్మగారు మరోసారి నిట్టూర్చారు.

"ఎందుకలా అంటున్నారు ? ఆచారం తప్పాను. అంతే, మరేమీ చెయ్యలేదు. అదీ విధి లేని పరిస్థితిలో.... "

"ఊఁ ...... ఊఁ ...... తెలుసు. అధైర్యపడకు." సూరప్ప ధైర్యం చెప్పాడు.

"ప్రాయశ్చిత్తం...శుద్ధి చేయించండి...నన్ను..." ఆమె మాట పూర్తి చెయ్యలేదు.

"అలాగే, అలాగే " అతను ప్రోత్సహించాడు.

"ఏమిటోరా, నా కనుమానమే" గుండమ్మ దీర్ఘం తీసింది.

"అక్కా, నువ్వు కాస్త వూరుకుంటే...." సూరప్ప విసుగ్గా గద్దించాడు.

" అదేమిట్రా అలా గంటావు ? దాని మీద నా కేమన్నా ద్వేషమా ? అలాగని ఆచారం వదిలిపెట్టగలమా ? సర్లే."

సూరప్ప నిస్సహాయంగా హింసననుభవిస్తూ చెయ్యి విదిలించాడు. మళ్ళీ ఆలోచించుకుని, "అమ్మా శుద్ధే గిద్ధే చేయిద్దాం. ప్రస్తుతానికి తనింట్లోకి రావాలిగా, పదండ్రా లోపలికి" అంటూ లోపలికి అడుగు పెట్టాడు. దేవమ్మ బాబు నెత్తుకోబోయింది. ఆ క్షణంలో గుండమ్మ "ఇదేమిటిరా సిగ్గుచేటు. అడగా పెట్టకుండా అన్నీ నువ్వే చేస్తావా ? బాగానే వుంది" అంది. అతను "నువ్వూరుకో చాలు" అని అక్కతో చెప్పి, భార్యతో "ఊఁ .... లేచిరా" అన్నాడు. అప్పుడు తల్లి మధ్యలో అందుకుని "సూరా, కాస్తాగు. తొందరపడకు. నీకు నీ పెళ్ళాం మీద ప్రేమ ఎలాగో నాకూ నా కోడలి మీద ప్రేమ, అభిమానం అన్నీ వున్నాయి. కాని ఇలాంటి విషయాల్లో తెలిసిన వాళ్ళని అడక్కుండా మన ఇష్టప్రకారం ఏమీ చెయ్యకూడదు కదూ !" అంటూ ఆపారు. సూరప్పకి కోపము, విసుగు ఒకేసారి

ముంచుకొచ్చాయి. కనుబొమలు ముడివేసి "ఇంకా ఎవరు చెప్పాలమ్మా ? నువ్వు ఒప్పుకుంటే సరి" అన్నాడు.

"అలా కాదు నాయనా. ఈ విషయంలో మనకన్నా తెలిసిన వాళ్ళు లేరూ ? పక్కింటి...."

"ఊ (.... సరే కాళప్ప శాస్త్రి గారినే పిలుస్తాను....ఏమి అనుమానాలో" అంటూ అరుగు దిగాడు.

"నాయనా, ఇప్పుడెద్దు, ఉదయం .... అంటున్న తల్లి మాటలు అతని చెవిన పడనే లేదు. అతను చక చక వెళ్ళి శాస్త్రిగారింటి తలుపు గట్టిగా కొడుతూ "శాస్త్రి గారూ, శాస్త్రి గారూ " అని గట్టిగా పిలిచాడు.

కాళప్ప శాస్త్రి గారు లేచి రావడానికి కాస్త సమయం పట్టింది. అంతలో సూరప్ప మరో నాలుగుసార్లు తలుపు కొట్టి పిలిచాడు. శాస్త్రి గారు తలుపు తెరుస్తూ "ఎవరది ? ఏమిటి గొడవ ?" అంటూ గద్దించారు.

"శాస్త్రి గారూ, అది తిరిగి వచ్చింది."

"ఎవరది ? సూరప్పా ? ఏమన్నావ్ ? నీ పెళ్ళాం వచ్చిందా ?" శాస్త్రిగారు కళ్ళు నులుముకుంటూ అడిగారు.

"ఊ ( ...."

"పోనీయ్ , తిరిగొచ్చింది కదా, మంచిపిల్ల పాపం, నువ్వదృష్టవంతుడివి, నువ్వు, ఇన్ని రోజులుగా ...."

"అదే పెద్ద కథ. చెబుతాను ఇంటికి రండి."

"ఇప్పుడా ? "

"అవును మిమ్మల్ని అడగాల్సిన విషయం వుంది."

"పద" తలుపు ముందుకి లాగి బయలుదేరారాయన.

సూరప్ప ఇంటి మెట్లెక్కుతూ వుండగానే శాస్త్రిగారు, దూరంలో వున్న దేవమ్మని చూసి, "దేవమ్మా, వచ్చేశావా, అమ్మా, కులాసాగా వున్నావా అమ్మా ?" అని సంతోషంతో అడుగుతూ దగ్గరగా వచ్చి ఆమె వేసుకున్న దుస్తుల్ని చూసి గాబరాగా "ఏమిటిది? ఏమిటి సంగతి ?" అంటూ దూరంగా జరిగారు.

సూరప్ప విషయాన్ని సంక్షిప్తంగా చెప్పాడు. మధ్య మధ్య గంగమ్మగారు ఆమె పడ్డ కష్టాలు, బాధలు, చేసిన సాహసాల గురించి, సానుభూతి మెప్పుదల సూచిస్తూ ఒక్కోమాట చెబుతున్నారు. సూరప్ప దేవమ్మ మతభ్రష్టత గురించిన విషయాన్ని, తేలిగ్గా కొట్టి పారేసినట్టు చెబుతున్నపుడు శాస్త్రిగారు ఆపి ఆపి ప్రశ్నలు వేస్తున్నారు. అప్పుడు గుండమ్మ వాటన్నింటికీ వివరంగా, స్పష్టంగా జవాబు చెప్తోంది. దేవమ్మ న్యాయస్థానంలో ముద్దాయిలా తల వంచుకుని

కూర్చుంది. కథ వింటున్న కొద్దీ శాస్త్రిగారి మొహం బిగుసుకుని, కఠినంగా మారింది. కళ్ళు ఎర్రబడ్డాయి. నేల వేపే చూస్తూ వుండిపోయారు. కనుబొమలు ముడి పడ్డాయి. పెదవులు బిగుసుకున్నాయి. ఆయన కష్టంలో ఇరుకున్నవాడిలా తీక్షణంగా ఆలోచిస్తున్నారు.

కథ పూర్తయినా తరువాత విషయం చర్చకి రాలేదు. సూరప్ప, గంగమ్మగారు శాస్త్రిగారి తీరు చూసి ఆ మాటెత్తడానికే భయపడి పోయారు. గుండమ్మ ఆత్రంగా ఎదురుచూస్తోంది. కాని ఆమె తమ్ముడికి భయపడి వూరుకుంది. దేవమ్మ పరిస్థితి యజ్ఞంలో బలి పశువులాగా వుంది. మాట్లాడే అధికారాన్నే కోల్పోయింది. ఆఖరికి కొన్ని నిమిషాలయ్యాక శాస్త్రిగారే మాట్లాడారు.

"ఊఁ .... అయితే పూర్తిగా జాతి భ్రష్టురాలై పోయిందన్నమాట." దీర్ఘంగా నిట్టూర్చి తమ నిర్ణయం తెలిపారాయన.

"శాస్త్రిగారూ .... " సూరప్ప కంఠంలో గాబరా ఆక్షేపణా వుంది.

"అవునయ్యా, ఇలాంటి విషయాల్ని దాచడానికుందా ? అందులోనూ మత ధర్మాలకి సంబంధించిన విషయంలో."

"అలాక్కాదు. తనేం కావాలని ఇదంతా చెయ్యలేదు కదా! బెదిరింపుకి, బలాత్కారాలకి లొంగి నిస్సహాయ స్థితిలో, మరో దారి లేక తప్పించుకు రావాలనే ఉద్దేశంతో...."

"కానీ తప్పు ఎలా చేసినా తప్పే. దోషం లేదని ఎలా అనగలం ?"

"ఆమె వున్న పరిస్థితిలో ఎవరున్నా కూడా మరేమీ ...."

"నిజమే, ఒప్పుకుంటాను. కాని జరిగింది జరిగిపోయింది కదా, హిందూ ధర్మం పోయింది కదా!"

' అయితే లోపలికి తీసికెళ్ళే ముందు శుద్ధి శాస్త్రం చేసి తీరాలంటారు?"

"ఏమంటున్నావు ?" శాస్త్రిగారు ఆశ్చర్యంగా అడిగారు.

"అదే ప్రాయశ్చిత్తం గురించి ...." సూరప్ప వివరించ బోయాడు.

"ఇదేమిటయ్యా! ఇలాంటి శ్రోత్రియుల వంశంలో పుట్టి ఇలా గడుగుతున్నావు ?" శాస్త్రి గారు తమకే అవమానం జరిగినట్టుగా అన్నారు.

"ఏం ఎందుకలా అంటున్నారు ?"

"ఎందుకా ? ఇది మరీ బాగుంది. హిందూ మతంలో జాతి భ్రష్టులయిన వారిని మళ్ళీ జాతిలోకి రానిస్తారటయ్యా ? అందులోనూ మనది బ్రాహ్మణ కులం." శాస్త్రిగారు బాంబు పేల్చారు.

"ఆఁ ...." సూరప్ప గాబరా, దుఃఖాలతో పిచ్చివాడయ్యాడు.

దేవమ్మ అదిరి పడింది. దుఃఖం పొంగి పొరలింది. గంగమ్మ గారు

"అయ్యో...." అన్నారు. గుండమ్మ "ఇలాంటిది ఏదో వుంటుందని తెలుసు నాకు. అందుకే అప్పుడే హెచ్చరించాను. పిడన్నట్టే తొందరపడి వుంటే అనాహుతం జరిగిపోయేది." అంటూ తనని తాను సమర్థించుకుంది. బాబు గాఢంగా నిద్రపోతున్నారు.

"శాస్త్రిగారూ, అలాగంటే ఎలా? ఏదో వేరే దారి వుండాలి." సూరప్ప శాస్త్రిగారి మాట ఒప్పుకోలేదు.

"మరేం మార్గం లేదు, మళ్ళీ పుట్టాల్సిందే."

"అంత కఠినంగా మాట్లాడకండి. దయచూపండి" అతడు అంగలార్చాడు.

"అయ్యో! ఇలా చెప్పడం నాకు మాత్రం ఇష్టమనుకుంటున్నావా? దేవమ్మ విషయం నువ్వు నాకు చెప్పాలా? ఇందులో కాఠిన్యానికి గాని, దయకి గాని అవకాశం లేదు. ఉన్న సంగతది. నేనేం చెయ్యను? ఎవరు మాత్రం ఏం చెయ్యగలరు చెప్పు? మతానికి విరుద్ధంగా నడుచుకోవడం సంగతలా వుంచి మాట్లాడడమూ మహా పాపమే. ఎవరి అనుకూలం కోసమైనా నేను వేరుగా చెప్పలేను. నా కూతురే ఈ పరిస్థితిలో వున్నా అంతే. ఏం చెయ్యమంటావు చెప్పు? నాకూ బాధగానే వుంది. కాని ఇలాంటి బాధలు, కష్టాలు వచ్చినప్పుడే ఓర్చుకోవాలి. గుండె దిటవు పర్చుకోవాలి. వేరే దారి లేదు. అలా కాకుండా ధర్మాంధులై ప్రవర్తించి మతహాని జరగనివ్వగలమా? అలా చెయ్యడాన్ని ఎవరైనా ఒప్పుకుంటారా? దానికి అవకాశం ఇస్తారా? అంతా విధివిలాసం. అదృష్టం ఎలా వుంటే అలా జరుగుతుంది. నుదుటి రాత ఎవరు తప్పించగలరు?"

"శాస్త్రిగారూ, ఉపదేశం చాలించండి" సూరప్ప విసుగ్గా అన్నాడు.

"నాయనా, ఆయన్ని అవమానించద్దు, తప్పయిందను" గంగమ్మగారు బెదిరిపోతూ అన్నారు.

"నాకేం అవమానం లేదు తల్లీ. అది అన్న వాళ్ళకే అపకారం చేస్తుందంతే. సూరప్ప దుఃఖంలో వున్నాడు. ఇంకా కుర్రవాడు. తొందపాటుతో ఏదైనా అంటాడు. అంటే అననివ్వండి. వివేకం చెప్పవల్సింది నా కర్తవ్యం. అందుకే చెబుతున్నానంతే."

"నేనలా అన్నందుకు క్షమించండి శాస్త్రిగారూ. కాని మీ నిర్ణయాన్ని నేనొప్పుకోను. ఆమె నెలాగైనా ఇంట్లోకి చేర్చుకోవల్సిందే."

"దేవమ్మ నీరు నిండిన కళ్ళతో భర్త వేపు కృతజ్ఞతగా చూసింది. మునిగిపోతున్న వాడికి రెల్లు పరక దొరకినట్టయింది మాటలు వింటుంటే.

"అరె, అరెరే.... ఏం చెపుతున్నావేయ్ సూరప్పా! కాస్త జ్ఞానం తెచ్చుకుని

ఆలోచించి మాట్లాడు. ఆమెని దగ్గరకు తీస్తే మీరంతా జాతి భ్రష్టులయి పోతారు. జాగ్రత్త." శాస్త్రిగారు హెచ్చరించారు.

"అలా అనడానికుందట్రా నాయనా" గంగమ్మ గారు మేలుకుని అన్నారు.

"అలాగైతే నేను మాత్రం ఇక్కడుండను భిక్ష మెత్తుకుని తింటానికైనా సిద్ధమే." గుండమ్మ ఖచ్చితంగా అంది.

"నా కేమైనా సరే, నేను లక్ష్యపెట్టను." సూరప్ప తన పట్టు వదల్లేదు.

"సూరప్పా, నీ కేమో పిచ్చి పట్టింది. నెమ్మదిగా ఆలోచించు. అన్యాయంగా నాశనమైపోకు. నువ్వు దేవమ్మతో కలిసి బ్రతకదల్చుకుంటే ఏమవుతుందో ఆలోచించు. నిన్ను, మీ కుటుంబం వాళ్ళనీ, మతం వాళ్ళు జాతినుంచి బహిష్కరిస్తారు. మీ బ్రాహ్మణ్యం పోతుంది - ఈ బ్రాహ్మణ్యం అంటే మాటలా ? ఎన్నో వేల జన్మల పుణ్య ఫలంగా ఒకసారి బ్రాహ్మణుడై పుట్టడం, తెలుసా ? దాన్ని పోగొట్టుకుని ఛండాలుడవై పోతావు. ఇక్కడ నిన్నెవరూ వుండ నివ్వరు. ఇల్లు - వాకిలి, భూమి - పుట్రా, ఊరు - వాడ అన్నీ వదిలి పెట్టాలి. అంతే కాదు, ఇలాంటి సద్వంశానికి కళంకం తెచ్చి పెట్టి, నిర్మూలం చేసిన అపకీర్తి ఎప్పటికీ నీ తలకి చుట్టుకుంటుంది. పోనీ ఇక్కడి జనానికి తలపంపులు నా కెందుకు పోన్లే అనుకున్నా, మీ వంశాన్ని గుర్తు చేసుకో. ఎంతో పురాతనమైన వంశం మీ పూర్వులు ఎంతమంది! మహర్షి భరద్వాజుడి గోత్రంలో పుట్టిన బ్రాహ్మణ శ్రేష్ఠులు. ఆచారవంతులు, కీర్తివంతులు, వాళ్ళ ధర్మం ఇప్పటి వరకూ నిరాటంకంగా నడిచి వచ్చింది. వాళ్ళందరూ స్వర్గంలో సుఖంగా వున్నారు. ఇప్పుడు నువ్వా వంశాన్ని చెడగొట్టి నాశనం చేస్తావా ? అలా చేస్తే మహా యజ్ఞం చేస్తూ హవిస్సును కుక్క నేటికి అందించినట్టవుతుంది. అప్పుడు నీ యోగ్యత ఏమయినట్టు ? నీకు ఏమి శిక్ష కాచుకుని వుంటుందో ఆలోచించుకో. ఇదంతా దేని కోసం? కేవలం ఒక స్త్రీ కోసం. అలా అంటున్నాను కదా అని దాన్ని చిన్న చూపు చూస్తున్నాననుకోకు. మానవ మాత్రుడికి వీలయినంత వరకు ధర్మవిరుద్ధం కానంత వరకూ దాన్ని రక్షించాల్సిందే. కాని ఇలా విధి వ్యతిరేకించి నప్పుడు ఏం చెయ్యగలం ? దాని కోసం అంత పాపాన్ని మూట కట్టుకోడం కష్టాల్ని కోరి తెచ్చుకోడం సరియైన పనేనా ? న్యాయ సమ్మతమేనా ? ఏది ఎక్కువ అని ఆలోచించుకుని ప్రాముఖ్యత నివ్వాలి కదా! ఇలాంటి సందర్భాలలో పెళ్ళామన్న వ్యామోహం వదిలి పెట్టొద్దా ? ఆలోచించుకో. నీకే తెలుస్తుంది...." శాస్త్రిగారు దీర్ఘంగా ఉపదేశించారు.

దీని పరిణామం మొదట గంగమ్మగారి మీద పడింది. ఆమె, "నాయనా, శాస్త్రిగారు చెప్పినదాన్ని గురించి ఆలోచించుకో. పట్టుబట్టకు." అంటూ

శాస్త్రిగారికి వత్తాసు పలికారు. ఇంతవరకు తన మీద జాలి చూపిస్తూ తనలో ఆశ మేల్కొల్పిన అత్తగారిలో వచ్చిన మార్పు చూసి, తన ఊతకర్ర, పడిపోయినట్లుగా అనిపించి, దేవమ్మ "అయ్యో" అంటూ నోటికి అడ్డుగా చెయ్యి పెట్టుకుని పొంగివస్తున్న దుఃఖాన్ని ఆపుకుంది. తల్లి మాట విన్నాక కూడా కాసేపు సూరప్ప నిశ్చేష్టుడిలా, రాతిప్రతిమలా నుంచుండిపోయాడు. అఖరికి "మరేం చేద్దామమ్మా ?" అన్నాడు. క్షీణస్వరంతో "తను గట్టిగా నమ్ముకున్న భర్త కూడా ఇలా అనిశ్చితంగా మాట్లాడేసరికి ఆ దురదృష్టవంతురాలి తల మీద ఉరుములేని పిడుగు పడ్డట్టయింది. నీళ్ళలో వున్నా ఇంతవరకూ ఆ రెల్లు పరకని పట్టుకుని వేళ్ళాడుతోంది. ఇప్పుడదీ తప్పిపోయి, తను ప్రవాహం మధ్యలో కొట్టుకు పోతున్నట్టుగా అయింది. ఆ దుఃఖంలో దిక్కు తోచకుండా పిచ్చిదానిలా ఆర్తిగా, "నా చెయ్యి వదలకండి. రక్షించండి" అంటూ అతని వేపు చెయ్యి చాపింది. అతను తన చెయ్యి విదిలిస్తూ "ఛా! ఇదేం కష్టమొచ్చిపడింది" అంటూ విసుక్కున్నాడు.

"చెడిపోయిందెలాగూ చెడిపోయింది. అక్కడే ఎలాగో సరిపుచ్చుకుని వుండుంటే ఎవరికీ ఈ ఇబ్బందులు వుండేవి కాదు." గుండమ్మ నిర్దాక్షిణ్యంగా చెప్పింది.

"వదినా" దేవమ్మ శూలపు పోటు తిన్నదానిలా ఆర్తనాదం చేసింది.

"అవును, అప్పుడు నీకూ ఓ దారి దొరికేది. ఇప్పుడు చూడు - నేను నిష్ఠూరంగా చెబుతున్నానని నొచ్చుకోకు. మనలో జాతి తప్పిన వాళ్ళకి రెండే మార్గాలు. ఒకటి, ఆ కొత్త జాతిలో వుండటం ,లేదా చావటం."

"అయ్యో! నేను చచ్చి పోవల్సింది. అదే సుళువుగా వుండేది. నేను మోసపోయాను. ఇక్కడికి రావాలన్న ఆశతో బ్రతకాలనుకున్నాను. దాని కోసమే చెయ్యరాని పని చేశాను. ఒర్చుకున్నాను. అయ్యో ! " అని దేవమ్మ ఏడుస్తోంది.

"ఊరుకోలేవటే, అలాంటి మాటలాడి ఎందుకు నొప్పిస్తావు. ఆలోచించి ఏదైనా ఉభయ తారకంగా వుండేలాంటి నిర్ణయానికి వద్దాం." గంగమ్మగారు ఏదో ఆలోచిస్తూ అన్నారు.

"ఆహా , చంపేశాక ఇంక నెమ్మదేమిటి ?" సూరప్ప తిరస్కారంగా అన్నాడు.

"నాయనా అదృష్టం మనది కానప్పుడు, మన ఇష్టమొచ్చినట్లుగా చెయ్యగలమా ? ఏదో మాట్లాడవలసొస్తుంది. ఇష్టం లేని పని చెయ్యాల్సొస్తుంది. నా గుండె మండిపోతూ వుంది తెలుసా ? నీకు పెళ్ళామయితే నాకు కోడలు కాదా ? ఒక్కగానొక్క కోడలు మన వంశాన్ని నిలబెట్టిన కోడలు నా కూతురిలా చూసుకుంటున్నాను. ఆమెని వదిలిపెట్టి వుండడం నా కేమయినా తక్కువ

దుఃఖం కలుగ జేస్తుందనుకుంటున్నావా ? కాని ఏం చేద్దాం ? మతాన్ని, ధర్మాన్ని వదిలిపెట్టి మనమంతా సర్వనాశనం అవడానికుందా ? దానికి తలవొగ్గాలి తప్పదు. కావాలంటే తల ఇవ్వాలి కూడా అదే శ్రేయస్సు." గంగమ్మ ఖిన్నురాలై అన్నారు.

"న్యాయమయిన మాట" శాస్త్రిగారు తల వూపారు.

"ఏమి న్యాయమో, ఏమి ధర్మమో, ఏమి మతమో నాకేమీ అర్థం కాలేదు. నా బుర్ర చెడిపోయింది. ఏదైనా చేసుకోండి. నా చేత చేయించుకోండి. ధర్మం, కర్మం అంతా మీది. న్యాయాన్ని దేవుడే చూసుకుంటాడు. దేవుడే దయదల్చాలి మన మీద!" సూరప్ప నిస్పృహాయంగా అని వూరుకున్నాడు.

"శాస్త్రిగారూ మీకేదీ, దారి కనిపించటం లేదా ?" గంగమ్మగారడిగారు.

"కఠినంగా అన్నా గుండమ్మ ఒక దారేదో చూపించింది."

"ఏమిటి ? అక్కడ కెళ్ళి బ్రతకడమా ? శివ శివ! అలా చెప్పడానికైనా మీకు మనసెలా వొప్పింది ? ఎప్పటికేనా అలా వెళ్ళగలనా ?" దేవమ్మ సహనం కోల్పోయి అరిచింది.

"పిచ్చి మాటలు!" సూరప్ప రోషంతో అన్నాడు.

"వెళ్ళాలని కాదు నేను చెప్పింది. సాధ్యమైన దారొకటి చూపించాను అంతే. ఇంకా ఏం చెయ్యొచ్చో ఎవరైనా చెప్పండి మరి." శాస్త్రిగారు తమ మాటల్ని దిద్దుకుని కోపంగా అన్నారు.

"శాస్త్రిగారు, తనిక్కడే వేరుగా వుండే ఏర్పాటు చేస్తే ఎలా గుంటుంది ?" గంగమ్మగారు తన ఆలోచన చెప్పారు.

"ఊ (....అదీ ఒక మార్గమే." "మిమ్మల్ని వదిలి, ఈ పసివాడిని వదిలి పెట్టి ఈ పాడు బ్రతుకు బ్రతకనా ? వొద్దు. మళ్ళీ ఇంట్లోకి చేర్చుకోలేకపోతే మీ పనిమనిషిగా అన్నా పెట్టుకోండి. ఇక్కడే బయట వుంటాను." దేవమ్మ భర్తని దైన్యంగా వేడుకుంది.

జవాబు కోసం సూరప్ప గంగమ్మగారి, శాస్త్రిగారి మొహంలోకి చూశారు.

"అదెలా వీలు పడుతుంది గంగమ్మగారూ, ముసల్మానురాలు, మ్లేచ్ఛురాలు, ఇంటి చుట్టుపక్కల తిరుగుతుంటే ఇక ఆచారం ఏం మిగులుతుంది చెప్పండి. ఈ వీధి వాళ్ళు మటుకు ఒప్పుకుంటారా వొట్టిమాటలు!" శాస్త్రిగారు ఖచ్చితంగా చెప్పారు.

"అయ్యో, అలా అనకండి. నన్నన్యాయం చేయకండి నేనలా బ్రతకలేను. నాకు పుట్టిల్లూ లేదు. అందర్నీ పోగొట్టుకున్న అనాథని నేను. మీరే నాకు దిక్కు." అంటూ తొడమీద బిడ్డతో సహా ముందుకి జరుగుతూ చేతులు జోడించి

వేడుకుంది.

"ఏం చెయ్యమంటావు ? నీ కిక్కడ చోటు లేదని తెలిసిపోయింది కదా. నేనూ నీతో బాటు రానా ? పద వెళ్దాం. ఈ పాడు జాతి, మతం, ధర్మం, ఆచారం - మానవతకి అవకాశం లేని ఈ గొడవలన్నీ నాశనమై పోనీయ్. ఎవరిక్కావాలి ? ఏదేమైనా అవనీ, నేనన్నిటికి సిద్ధమే" సూరప్ప అరిచాడు.

"బాబూ, నాయనా, తండ్రీ, ఏమిటిది ? కొంచెం కూడా జ్ఞానం లేకుండా మాట్లాడుతున్నావు ?" గంగమ్మగారు గాభరగా అడిగారు.

"వాడికెక్కడో పిచ్చి పట్టింది. అందుకే అలా మాట్లాడుతున్నాడు." గుండమ్మ గట్టిగా అంది.

"ఇంక మీ పాట్లు మీరు పడండి. నేను చెప్పేదేదో చెప్పాను. అవివేకంతో నడుచుకుంటే మీరే అనుభవిస్తారు. జాగ్రత్త !" శాస్త్రిగారు కోపంగా, గంగమ్మ పిలుస్తున్నా వినకుండా వెళ్ళిపోయారు.

"వీడి అవివేకాన్ని సహిస్తూ ఆయనెందుకు ఇక్కడుంటారు ? వెళ్ళిపోయారు. వీడు సర్వనాశనం చేస్తాడు. దేవుడే కాపాడాలి." గుండమ్మ ఆక్రోశించింది.

కాసేపు అందరూ మౌనంగా వున్నారు. ఆలోచిస్తున్నారు. తరువాత గంగమ్మ కోడలివేపు తిరిగి :

"అమ్మా, నువ్వు ఇదివరకే ఒకసారి మా వంశాన్ని నిలిపావు. ఇప్పుడు అంతకన్న ఎక్కువగా మరో రకంగా రెండోసారి దాన్ని నువ్వే నిలపవల్సిన కాలం వచ్చింది. నా కొడుకు నువ్వు చెప్పినట్టే వింటాడు. అది న్యాయమే కావచ్చు.. కాని నీ వంశానికి ఏది యోగ్యమైనదో నువ్వే ఆలోచించుకోవాలి. పెద్ద దురదృష్టం నీ నెత్తిన పడింది, నిజమే. దాని నివారణ కోసం మనకు సాధ్యమైనదల్లా చెయ్యాలన్నదే నా వుద్దేశం. కాని నీకు సంతోషం కలిగేలా, నీ బ్రతుకు సుఖప్రదంగా అయ్యేలా చెయ్యడం మా పరిస్థితిలో సాధ్యం కానిదని మా కందరికీ దుఃఖంగా వుంది. కానీ ఏమీ చెయ్యలేకుండా వున్నాం. నిస్సహాయులం. నువ్వే చూస్తున్నావుగా పరిస్థితులు! నీ దురదృష్టాన్ని ఈ ఇంటి మీద కూడా వెయ్యడం సరి అయినదేనా ? నిన్ను పొగొట్టుకున్న దుఃఖం చాలదా ? నువ్వే సాయపడి మమ్మల్ని రక్షించాలిప్పుడు. నేను అడుగుతున్నది చాలా పెద్ద సాయమని తెలుసు నాకు. నేనూ భార్యగా,తల్లిగా బ్రతికినదాన్నే. కాని నీ మనసు కూడా పెద్దదే, నాకు తెలుసు. నా వేడికోలు మన్నించి పుణ్యం కట్టుకో. నా ఏర్పాటుకి ఒప్పుకో. వీలయినంత వరకూ నీకు అన్యాయం జరక్కుండా చూసుకుంటాం. మా ఇల్లు నిలిపిన దేవతవని నీ పేరిట దీపం వెలిగిస్తాం. నీ వంశాన్ని నువ్వే కాపాడు కోవాలి." అని బ్రతిమాలారు.

గంగమ్మగారి మాటల్ని విని అందరూ స్తబ్ధులయ్యారు. దేవమ్మ ఏడుపు ఆపేసి తీక్షణంగా ఆలోచించుకోసాగింది. కొన్ని నిమిషాలు గడిచాయి. గంగమ్మ "ఒప్పుకుంటావా తల్లీ!" అనడిగారు.

"ఆ ( ....?"

"ఒప్పుకుని మమ్మల్ని ఉద్ధరించు తల్లీ"

"అయ్యో! ఎలా ఒప్పుకోను ?"

"వొద్దు, ఒప్పుకోకు " సూరప్ప అన్నాడు.

"ఊహు....వొదు....ఈ ఇల్లు నాశనం కాకూడదు.... నా గతి ఏమయినా సరే" దేవమ్మ నిరాశతో ఒప్పేసుకుంది.

"అయ్యో పిచ్చిదానా, ఇదేమిటి నీ ఆత్మహత్య? నేను దీని కెలా ఒప్పుకోను?" సూరప్ప ఆశ్చర్యంగా, వ్యథతో అన్నాడు.

"నాకు వేరే దారి లేదు" దేవమ్మ దృఢంగా అంది.

"తల్లి నువ్వే మా ఇంటి దేవతవు. దేవుడు నీకు మంచి చెయ్యాలి." ఆ మాట అనేసి గంగమ్మ తన మనసును సమాధాన పరచుకున్నారు.

"పోనీయ్ ఎలాగోలా అనాచారం తప్పింది కదా .... అంతే చాలు" గుండమ్మ తృప్తి పడింది.

"ఊ ( ....చూద్దాం." సూరప్ప అనిశ్చితంగా వూరుకున్నాడు.

అప్పుడే రెండు గంటలు దాటింది. పడుకునే ప్రయత్నంలో పడ్డారు. బయటున్న వాళ్ళు పడుకునే గదిలో దేవమ్మ పడుకోవాలని నిశ్చయించారు. (ఆ గది ఇంటి బయట వుంటుంది.) గంగమ్మగారు "బాబుకి గుడ్డలు విప్పి ఇటివ్వు " అన్నారు. "ఊహు (, ఎలాగూ నా దగ్గర కొచ్చాడు. ఈ ఒక్క రాత్రికి నా దగ్గరే వుండనియ్యండి" అని బ్రతిమాలింది. అనుమతి లభించింది. గంగమ్మగారు చాప, పాతచీర, కంబళి ఇచ్చారు. దేవమ్మ బాబుని పడుకో పెట్టుకుని పడుకున్నాక మిగతా వాళ్ళు లోపల పడుకున్నారు.

దేవమ్మకెలా నిద్ర పడుతుంది ? ఆలోచనల సుడిలో చిక్కుకున్నా ఆమెకి తన వెనుకటి జీవితమంతా కళ్ళముందు నిలిచింది. అప్పుడే జరిగిన మాటలు మరోసారి మనసులో మెదిలాయి. ఆమె దీర్ఘంగా మరోసారి నిట్టూర్చింది. చలిగాలి వీచి, బాబు కొద్దిగా వణికాడు. ఆమె కంబళిని, దానికి జోడించిన చీరనీ సర్ది బాబుని దగ్గరగా లాక్కుంది. అలాగే ఆ చీర గురించిన పాత జ్ఞాపకాలు మనసులో కదలాడినయ్. ఆ చీర తన భర్త తనకి మొదటిసారి ఎన్నిక చేసి కొన్న చీర. ఆమె దాన్ని కట్టుకున్నప్పుడల్లా తృప్తిగా చూసి మెచ్చుకునే వాడు. ఊ... అతనెప్పుడూ అలాగే ఉండేవాడు. ఆమెను చూస్తే పిచ్చివాడయ్యేవాడు.

ఇప్పుడూ అలాగే కదూ? ఊహుఁ, ఆ పిచ్చికి ఇక తావివ్వకూడదు!... నిజం ....ఆ కంబళి ? శోభనం నాటికి తన తండ్రి ఇచ్చినది. అయ్యో! ఇప్పుడు తండ్రే వుండుంటే, తల్లే వుండుంటే వాళ్ళలాగ తనని దూరం చేసేవారా ? ఏమో ఎవరికి తెలుసు ? మత ప్రభావం ఎక్కడి దాకా వెళుతుందో! ఊఁ(....వాళ్ళే లేనప్పుడు ఈ ఆలోచన మాత్రం ఎందుకు? ఈ కంబళి ఎన్ని సుఖాలని చవి చూపింది ? ఓ సారి దొంగలు పడ్డప్పుడు చాలా వాటితో పాటు దీన్ని ఎత్తుకుపోయారు. కాని మళ్ళీ దొరికింది. ఉన్నికి దోషం లేదు అంటూ ఎండలో వేసి మళ్ళీ వాడుకున్నారు. ఆ కంబళి ఎంతో పుణ్యం చేసుకుంది. ఆహా ( ....తను ఆ కంబళి కంటే తీసిపోయింది కదా....ఇలా ఒకటి తరువాత ఒకటి ఆలోచనలు....

గడియారం మూడు కొట్టింది. ఆమె చప్పున లేచి కూర్చుని 'వేళయింది' అనుకుంది. ఎక్కడైనా చప్పుడవుతోందేమోనని వింది. అంతటా నిశ్శబ్దం. కప్పుకున్న దుప్పటి తీసి మరో మడత వేసి బాబుకి వెచ్చగా కప్పింది. వాడి తల నిమిరింది. మృదువుగా ముద్దాడింది. తలెత్తినప్పుడు ఒక వెచ్చటి కన్నీటి బొట్టు బాబు బుగ్గ మీద పడింది. మెల్లిగా దాన్ని తుడిచింది. "బాబూ, దేవుడు నిన్ను చల్లగా చూడాలి" అంటూ పైకి లేచి మళ్ళీ ఓ సారి బాబు తల నిమిరి, గది తలుపులు వేసుకుని బయటకి వచ్చింది. ఆమె మెట్లు దిగుతుంటే అక్కడే వరండాలో వున్న ఆవు శబ్దం చేసింది. ఆమె దాని దగ్గరగా వెళ్ళి నీళ్ళు దగ్గర పెట్టి, ఒళ్ళు నిమిరింది. తరువాత వెనుదిరిగి వచ్చి మళ్ళీ మెట్లు దిగి కుంటుకుంటూ వెళ్ళిపోయింది.

× × ×

మర్నాడు ఉదయం ధర్మకొండలో గోలగోలగా వుంది. పల్లె బయట మంచి నీళ్ళ బావిలో దేవమ్మ శవం దొరికింది. ఆమె సంగతి పల్లె కంతటికీ తెలిసిపోయింది. అందరి నోటా ఆమె మాటే సూరప్ప తల నేల కేసి కొట్టుకుంటూ పిచ్చివాడిలా దొర్లుతున్నాడు. నేను ప్రాణం తీసుకుంటానని పరుగులు పెడుతున్నాడు. కొంతమంది అతడిని పట్టుకుని ఆపుతున్నారు. గంగమ్మగారు కన్నీరు కారుస్తు కూర్చున్నారు. గుండమ్మ చుట్టూ పదిమంది ఆడవాళ్ళు గుమిగుడారు. ఆమె వాళ్ళకి విషయాన్ని వివరిస్తూ 'మొత్తం మీద ఈ గొడవ వదిలిపోయింది. ఈ పని ముందే చేసుంటే ఈ గోలంతా వుండేది కాదు అని చెబుతోంది. గుంపులో కొంతమంది "ఛ! ఎంత దురదృష్టం అని జాలిపడ్డారు." కాసేపయ్యాక మరెవరో "అదలా వుంచి, ఈ నీరు తీసి కొత్త నీళ్ళొచ్చే దాకా మంచినీళ్ళకి ఏం చేద్దాం చెప్పండి" అన్నారు. అందరూ

ఆలోచనలో పడ్డారు.

అది ఆత్మహత్య అని పోలీసులు నిర్ణయించాక కాళప్ప శాస్త్రిగారు శవ సంస్కారం గురించి చర్చిస్తూ, ఆమె అన్య మతస్థురాలైనందువల్ల ఆ మత ధర్మాని కనుగుణంగా తక్కువ జాతి వారెవరన్నా తీసికెళ్ళి పూడ్చాలనీ, కర్మలు చెయ్యడం అనాచారమనీ తీర్మానించారు. గంగమ్మగారు ఈ అపమృత్యువు గురించి భయాన్ని వ్యక్తపరచగా, శాస్త్రిగారు మధ్యాహ్నం వేళకు సూరప్ప ఇంట్లో శుద్ధి, పూజ, శాంతి మొదలుకుని అవసరమైన కార్యాలన్నీ జరిపించారు.

× × ×

కొన్ని సంవత్సరాలు గడిచాయి. సూరప్ప రెండో పెళ్ళి చేసుకున్నాడు. పుట్టిన మొదటి ఆడపిల్లకి దేవమ్మ అని పేరు పెట్టాడు. 'దేవూ' అని పిలుస్తాడు. గంగమ్మ గారిప్పటికీ దేవమ్మ పేరిట దీపం వెలిగిస్తారు. గుండమ్మ ఇప్పుడూ వీలు దొరికినప్పుడల్లా "ఈ కథ వాళ్ళకి వీళ్ళకి సవివరంగా తన వ్యాఖ్యానంతో బాటు చెబుతూ, దేవుడే ఆమెకు మంచి బుద్ధి పుట్టించి మమ్మల్ని ఆపదనుంచి రక్షించాడు." అని పూర్తి చేస్తుంది.

# 7. నాలుగు మూరల భూమి

చదురంగ

పోస్టుమేన్ "మనియార్డర్ సార్" అని పిలవడం అతనికి వినిపించలేదు. అతని మనసు విప్పిన కాగితం చుట్టలాగ వుంది. ఇంట్లో భార్యామణి లేదు. హృదయానికి ఆనందం లేదు. కేసు కాగితాల కట్టని బల్లమీద పర్చుకుని ఆలోచనల వ్యూహంలో పడిపోయాడతను. "పాడుపని, దీనికి అంతెప్పుడు?" అని చికాగ్గా వుంది. కేసులు....కేసులు....కేసులు.... వీటికి ముగింపనేది లేనే లేదా ? తెల్లవారితే కోర్టు -కచేరి ఈ వ్యవహారాల్లో మునిగి తేలుతుంటే బ్రతుకులో ఆనంద మెక్కడిది? ఈ ఆలోచనలతో విసిగి పోతోంది అతని మనసు.

"మనియార్డర్ సార్...."

నాలుగు మూరల భూమి....కేవలం నాలుగు మూరల భూమి కోసం .... ఎన్నెన్ని కలహాలు....ఎన్ని అకృత్యాలు జరుగుతుంటాయి. మానవుడిలో సుగుణాలన్నీ ఇంకిపోయి స్వార్థపు పిచ్చి మొక్కలు పెరిగి పోతాయి. స్వార్థం ! భూమి కోసం పోరాటం! న్యాయాలయాల్లో ఎక్కువ కేసులు భూమికి సంబంధించినవే అయ్యుంటాయి. భూమి....భూమి....భూమి....ఎంత పిచ్చి.

"మనియార్డర్ సార్"

ఇప్పుడిప్పుడే పోస్ట్‌మాన్ కంఠం అతని చెవిన పడింది. కూర్చున్న చోటనే వంగిన అతని వీపు నిటారుగా అయింది. మనియార్డర్!....ఎక్కడ్నుంచి వచ్చుంటుందీ మనియార్డర్....లేచి వెళ్ళి తలుపు తెరిచాడు. మొహం వంకరగా పెట్టుకున్న పోస్ట్‌మ్యాన్ మనియార్డర్ ఫారం ముందుకి జాపి "అమ్మగారున్నారా సార్?" అన్నాడు.

అతని ఆశ్చర్యానికి అంతు లేకుండా పోయింది. తన భార్యకి మనియార్డర్! ఎక్కడ్నుంచి వస్తుందసలు ?

"లేదా సార్ ?"

"లేదు పుట్టింటికి వెళ్ళారు"

"ఎప్పుడొస్తారు సార్ ?"

"రేపొస్తానని ఉత్తరం వచ్చింది మరి"

ఖచ్చితంగా వస్తారంటారా సార్ ?"

"బహుశః వచ్చేస్తారు."

"అయితే దీన్ని ఎల్లుండి తెస్తాను సార్."

"సరే" అన్నాడు. పోస్ట్‌మ్యాన్ వెళ్ళిపోతుంటే ఏదో ఆలోచన వచ్చి చప్పట్లు కొట్టి "పోస్ట్‌మ్యాన్" అని పిలిచాడు. అతను అయిష్టంగానే వెనక్కి వచ్చాడు. "ఏది, ఆ మనియార్డర్ ఫారం ఇటివ్వు. అదెక్కడ్నుంచి వచ్చిందో చూసిస్తాను." అన్నాడు. అతను విసుక్కుంటూనే ఫారం తీసి నా చేతికిచ్చాడు.

ఫారం మీది అక్షరాల్ని యథాలాపంగా గమనించాను. చిత్రంగా అనిపించింది. తన భార్యకి మనియార్డర్ అంటేనే ఆశ్చర్యంగా వుంటే, అదెక్కడ్నుంచి వచ్చిందో తెలిశాక ఆశ్చర్యపు తెర అతన్ని పై పైకి తీసికెళ్ళి ఎక్కడో శిఖరాగ్రం మీదకి విసిరేసినట్లయింది.

భార్యకి మనియార్డర్ వచ్చింది. రెండు వందల రూపాయలు! భారీ మొత్తమే అదీ ఆమె రాసిన ఒక కథ కోసం!

పోస్ట్‌మ్యాన్ వెళ్ళిపోయినా చాలాసేపటి వరకూ అతనలాగే స్థంబించిపోయి నిలబడ్డాడు. ఒక్క కథకు రెండు వందల రూపాయలు.... అదీ కన్నడ భాషలో. తను కోర్టులో ఐదు కేసుల్ని నడిపినా అంత డబ్బు సంపాదించలేడు....కాలం. సహజంగానే అతి తీవ్రంగా పరివర్తన చెందుతోంది. కొన్ని సంవత్సరాల క్రితం కన్నడం తల్లిలేని అనాథ. దాన్ని అడిగిన వాళ్ళెవరూ లేరు. ఒక వెయ్యి కాపీలు ఖర్చవ్వాలంటే ఏడెనిమిదేళ్ళు పట్టేది. కాని ఇప్పుడు? నాలుగైదు వేల కాపీలని అచ్చు వేసే సాహసం చేస్తున్నారట ప్రచురణ కర్తలు! అవన్నీ ఇంచుమించు రెండేళ్ళల్లో పూర్తిగా అమ్ముడు పోతాయట....ఇంతకు ముందు కూడా కథల పోటీలు వుండేవి. వాటికి ప్రథమ బహుమతి.... వెన్ను తట్టి ప్రోత్సహించడం ....కాని ఇప్పుడు నడుస్తున్న కథల పోటీలు వంద రూపాయల నగదును బహుమతిగా ఇవ్వగల స్థోమత గలవి!

ఎవరో కక్షదారులు వచ్చారు. వాళ్ళు చెప్పేది విని, తను చెప్పవలసినది చెప్పి వాళ్ళని పంపించి ఇంకా మిగిలి వున్న రికార్డ్ చూసి, భోజనానికి లేచాడు. హొటెల్ భోజనం సహించ లేదెందుకో. బహుశః మరుసటి రోజే రాబోతున్న భార్య గురించిన ఆలోచన. దానికి కారణ మయ్యుండొచ్చు. మొత్తం మీద ఎలాగో అలా రాత్రి భోజనం పూర్తయిందనిపించి ఇంటికి వచ్చాడు. ఆ రోజు కోర్టు సెలవు రోజు కావడం వల్ల విశ్రాంతికి తుది మొదలు లేకుండా వుంది. వెళ్ళి మంచం మీద పడుకున్నాడు. మళ్ళీ పని లేని మనసు ఆలోచనల సరోవరంలో ఈదులాడసాగింది......తన భార్యకి బహుమతి! కథల పోటీలో ప్రథమస్థానం! అతని హృదయం సంతోషంతో విచ్చుకున్న పువ్వులా అయింది. మనసు జ్ఞాపకాల గుర్రం మీద సవారీ చెయ్యసాగింది.... పెళ్ళయిన కొత్తలో వాళ్ళిద్దరి మధ్య జరిగిన సంగతి హఠాత్తుగా గుర్తొచ్చింది.

ఓ మధ్యాహ్నం ఇలాగే కోర్టుకి సెలవున్న మధ్యాహ్నం....భోజనం చేసి నిద్రపోయాడు. తన ప్రక్కనే పడుకున్న ఆమె కూడా నిద్రపోయిందనుకొన్నాడు. కాని మెలకువ వచ్చేసరికి పక్కలో ఆమె లేకపోవడం చూసి చకితుడయ్యాడు. నిశ్శబ్దంగా లేచి ఇల్లంతా వెతికాడు. ఆమె తన గదిలో కూర్చుని ఏదో రాసుకుంటోంది. నిద్రపోకుండా కూర్చుని ఏమి రాస్తోంది? తండ్రికో, అన్నయ్యకో ఉత్తరం రాస్తూ వుండి వుంటుంది.

అతని దగ్గు విని ఆమె తిరిగి చూసింది. భావ సమాధి నుంచి లేచినట్లుగా వున్నాయామె చూపులు. దగ్గరగా వెళ్ళి, "నువ్వెక్కడికైనా వెళ్ళిపోయా వేమోనని భయపడ్డాను." అన్నాడు నవ్వుతూ. ఆమె కళ్ళు నవ్వుతున్నాయి.

"మీరు మరీను. నేనెక్కడికి వెళతాను?"

"ఏం రాస్తున్నావు? ఉత్తరమా ?"

"అవును ప్రేమ పత్రం....అంది కళ్ళు చికిలించి కొంటెగా చూస్తూ."

"ప్రేమ పత్రమా! ఎవరికని తెలుసుకోవచ్చా ? " అతనూ కొంటెగా అడిగాడు. దానికి బదులుగా కుడిచేతి వేళ్ళని మోహకంగా తిప్పుతూ సాభినయంగా

"ఎ - వ - రి - కో " అంది. అలా అంటూ చిన్నగా నవ్వింది. అప్పుడామె శరీరం చిరుగాలికి అల్లాడే తామర తూడులా అనిపించింది.

ఆమె చెల్లాటం, సరసం అతని కెప్పుడూ ప్రియమైనవే. దానికి తగిన బహుమతి నిచ్చి ఏమి రాసి వుంటుందా అని బల్ల మీదకి వంగి చూశాడు.

"ఏమిటిది ? "....ప్రేమ పత్రం....చిన్న కథ ....ఓ! కథ రాస్తున్నావా? ఎప్పటినుంచి ఈ పిచ్చి నీకు ? "

"అదేమిటి? పిచ్చి-గిచ్చి అంటారు. కథ రాయడం పిచ్చి పనా?"

"ఓ రకంగా అంతే"

"ఎలాగా ? "

"కథ అంటే పుక్కిటి పురాణం .... దానివల్ల ఎవరికేం ప్రయోజనం ?"

"ప్రయోజనం లేని పని చెయ్యకూడదని తమ అభిప్రాయమా ?"

"అవును, నిష్ప్రయోజనమైన పనిలో నాకు అసక్తి లేదు."

"భేష్ , భేష్! వకీలు వృత్తికి తగినట్టు మాట్లాడుతున్నారు. ఫరవాలేదే !"

"చూడు, నా మాటల్ని నువ్వు సరిగ్గా అర్థం చేసుకోవడం లేదు. కథకూ మన బ్రతుకులకీ సహజమైన సంబంధం వుండాలా వద్దా చెప్పు ? ఇప్పుడు ఎక్కువగా ప్రచురిత మవుతున్న కథలు కొద్దిగానైనా కన్నడ ప్రజల జీవితాన్ని ప్రతిబింబిస్తున్నాయా ? లేదు. ఆ కారణం చేతనే నేనంత నిర్మొహమాటంగా అనాల్సివచ్చింది. నా రాణి కథలు రాస్తుందంటే నాకు మాత్రం సంతోషం కాదూ?

నీకు నిజం చెప్పాలంటే నేను గర్వపడుతున్నాను....”

ఆమె కూడా అతని మాటలతో పొంగిపోయింది.

“కాని, నా రాణి కూడా అందరిలా చెత్త రాస్తే నాకు సంతోషంగా వుండదు. బ్రతుకుని కళ్ళు తెరచి చూసి, విచక్షణతో అర్థం చేసుకుని రాయాలి. అప్పుడు కథ డొల్ల కాదు. నాదం లేని పిల్లనగ్రోవి కాదు. అదీ నా అభిప్రాయం.”

“నవాబుల ఆజ్ఞని పాటించడానికి ప్రయత్నిస్తాను ” నాటకీయంగా నవ్వుతూ అందామె.

ఆ సంగతి జరిగాక వకీలు వృత్తి అతని కాలాన్ని బుద్ధినీ పూర్తిగా ఆక్రమించుకుంది. భార్య రాస్తోందా ? దేని గురించి రాస్తోంది. ఆమె రాస్తున్న కథల్లో ఏదైనా నవ్యత, సత్యం వుందా లేదా అని చూడ్డానికతనికి తీరిక లేకపోయింది.

ఆలోచనల దాడితో అతను అటునుంచి ఇటు పత్తిగిలాడు. ఏం చేసినా నిద్ర పట్టటం లేదు. ఆఖరికి ఏదైనా పుస్తకం చదువుకుందామని లేచి వెళ్ళి పుస్తకాల బీరువా తెరచి తనకి ప్రియమైన జిన్‌క్రిన్‌టోన్స్ నవలని తీసుకుని దగ్గరగా వున్న ఈజీఛెయిర్‌లో కూర్చున్నాడు. పుస్తకం తెరుస్తుంటే లోపల మడత పెట్టిన కాయితాలు కనిపించాయి. కుతూహలంతో ఆ కాగితాల్ని తీసి చూశాడు. అది తన భార్య రాసిన కథ తాలూకు రఫ్ కాపీ. కథ పేరు ‘నాలుగు మూరల భూమి’.

ఈల వేస్తూ ఆ కథ చదవడానికి ఉపక్రమించాడు.

వైశాఖ మాసపు ముండుటెండ కథ కళి చేస్తోంది. దాని తీక్షణతకి చెట్ల ఆకులన్నీ పండు రంగుకి మారుతున్నాయి. అలాంటి వేళలో కాళింగయ్య తలవంచి పొలం దున్నుతున్నాడు. అతని పక్కగా అతనే అనుకరిస్తూ అడుగు లేస్తున్న అతని పెద్ద నీడ. ఆ వెలుతురులో కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి. శరీరమంతా చెమటతో కావేరీ స్నానం చేస్తోంధి.

నెమ్మదిగానే కాని, దృఢంగా భూమికి పాపిడి తీసినట్లుగా వరుసలు దిద్దుతూ పోతోంది. కాడికి కట్టిన తెల్లటి ఎద్దులు....అతని నల్లటి దేహం....ఆ దేహానికి కట్టిన తెల్లటి తుండు గుడ్డ. తలకు చుట్టిన గుడ్డ. వెనకాల వున్న గుట్టల వరుస, మబ్బు నీలం, ఆకుపచ్చటి నేపథ్యంలో ఆ దృశ్యం దూరం నుంచి చూసే వాళ్ళకి చిత్రపటంలా....పటంలోని చిత్రం కదులుతున్నట్టు కనిపిస్తోంది. కాని ఆ దృశ్యంలో ఒక భాగమైన కాళింగయ్యకు మాత్రం దాని సౌందర్యాన్ని అనుభవించే అదృష్టం లేదు. అతను కేవలం దున్నే యంత్రంలా వున్నాడు. సూర్యోదయానికి ముందే లేచి అరక చేత బట్టాడంటే, ఇక పొలం నుంచి తిరిగి రావడం సాయంత్రమే.

కాళింగయ్య దున్నుతూనే వున్నాడు. సామాన్యంగా అతని మనసు నీళ్ళు లేని కుండలాగ ఖాళీగానే వుండేది. కాని ఇవాళ మాత్రం ఆ కుండలో చిన్న రాయొకటి పడింది. అతన్ని బాధిస్తున్నదది. దానికి కారణం నాలుగు మూరల భూమి! నాలుగు మూరల భూమి!

కేవలం నాలుగే నాలుగు మూరల భూమి !

కాళింగయ్య ముసలి దృష్టి ఏదో అవ్యక్తమైన భీతికి లోనయింది.

అతని చిన్నతనంలో హరిదాసు ఒకతను పక్క వూరిలో కథ చెబుతూ అన్నాడు. "భూమి గురించి అత్యాశకి పోవద్దు. దాని వల్లనే కురు వంశం నామరూపాలు లేకుండా పోయింది."

నిజమే కదా! పాండవుల పరంగా శ్రీకృష్ణపరమాత్ముడు ఆఖరికి ఐదే ఐదు గ్రామాల్ని పాండవులకి వదిలి పెట్టినా చాలు. రాజీ కుదురుస్తానని చెప్పాడు కదా? అప్పుడు కూడా అవివేకి దుర్యోధనుడు గర్వంతో ఐదు గ్రామాల సంగతి అటుంచి ఐదడుగుల భూమి కూడా పాండవులకి ఇవ్వనని పట్టుబట్టి సర్వనాశనం తెచ్చిపెట్టుకో లేదూ ?

ఆ తరువాత తన ప్రవర్తన కూడా అవిచారపు జారుడు బండమీద అడుగుపెట్టింది. అవును కేవలం నాలుగు మూరల భూమి కోసం. నాలుగే నాలుగు మూరల భూమి కోసం!

కౌరవుల కథ ఎప్పుడో అయిపోయింది. కాని తన కథ! దీని ముగింపు ఎలా వుంటుందో తను చేసిన చిన్న పనికి ఏ విధమైన మూల్యం చెల్లించాల్సి వుంటుందో.

కాళింగయ్య దున్నుతూనే వున్నాడు. కాడి ముందు ముందుకి వెళుతున్న కొద్దీ ఎర్రటి మట్టి రాశులు రాశులుగా రెండు వేపులా పడుతోంది. దాన్ని చూస్తూనే అడుగు లేస్తున్నాడతను! ఓహో .... కుంకుమ లాంటి మట్టి. అతని కళ్ళకి ఎంతో అందంగా కనిపిస్తోంది. దాన్ని తదేకంగా చూస్తుంటే ఒక్కోసారి తన ఇంటిని ఆఖరికి ప్రపంచాన్నే మర్చిపోయేవాడతను.

నాలుగు మూరల భూమి - మరొకడికి చెందిన భూమి. దాన్ని తను ఆశించాడు. మరొకడి భార్య (అహల్య) ని ఆశించిన ఇంద్రుడిలా. పక్కభూమి కొబ్బరి కాయల పేట దేవప్పది. అందులో తను నాలుగు మూరల భూమిని అక్రమంగా దున్ని తన భూమిలోకి కలుపుకున్నాడు. దేవప్పకున్న భూమి అంతా కలిపితే మొత్తం మూడు ఎకరాలుంటాయేమో - కొంచెం అటూ ఇటూ తన జమీను వున్నంతే ( ఇది మైసూరు, కన్నడదేశం, ఇంకా చెప్పాలంటే అనేక మంది భారత రైతుల జమీనుల కథే ), ఈ కాస్త భూమిలోనూ జరిగిన ఈ అక్రమణవల్ల దేవప్పకి దిక్కు తోచకుండా పోయింది. తిట్ల వర్షం కురిపించాడు. ఆఖరికి

తట్టుకోలేక పల్లంలో బ్రేకు చెడిపోయిన మోటారులాగ దెబ్బలాటకే వచ్చాడు. భీమ - దుర్యోధనుల్లాగా యుద్ధం చేసుకున్నారు. కాళింగయ్యది భీమకాయం. అతనికే విజయం లభించింది. దేవప్ప గ్రామ పంచాయితీలో మొర పెట్టుకున్నాడు. మన పల్లెలో గ్రామ పంచాయితీ న్యాయమంటే బలవంతుడిదే పై చెయ్యి. న్యాయం కాళింగయ్య వేపే అయింది. అప్పటికీ దేవప్ప నిరాశ చెందకుండా తాసిల్దారుకి ఫిర్యాదు చేశాడు. కొలతల అధికార్లు కొలతలు తీయడానికి వచ్చారు. కొలతలకి వెళ్ళే ముందు కాళింగయ్య వాళ్ళకి తన ఇంట్లో కాఫీ ఫలహారాలు పట్టించి ఐదు రూపాయలు దక్షిణ ఇచ్చుకున్నాడు. ఆ పూజతో తృప్తి చెందిన అధికారులు కాళింగయ్య తన పొలంలో కలుపుకున్న నాలుగు మూరల ప్రదేశాన్ని పొడవునా కొలిచి అతని భూమిలో కలిపేసి గుర్తుగా రాతిని పాతేశారు.

కాళింగయ్య దున్నుతూనే వున్నాడు. పైన మండుతున్న సూర్యుడు. లోపల మరిగే విషాదపు లావా....

రాతిని పాతేశారు. దేవప్ప గుండెకి గురి చూసి కొట్టిన శిల. దేవప్ప దిగ్భ్రాంతుడయ్యాడు. సూర్య చంద్రుల్లాగ శాశ్వతమని అతను నమ్ముకున్న భూప్రదేశం ఇక అతనికి కాదు. దేశపు చట్టం అలా చెప్పింది. ఇంక ఏం చెయ్యాలి? అతను కుంగిపోయాడు. అతని ఎదుట విస్తారమైన శూన్య సముద్రం. దేవప్ప ఆ బెంగతోనే మంచం పట్టాడు.

కాళింగయ్య దున్నుతూనే వున్నాడు. అతని కాళ్ళు చిన్నగా వణుకుతున్నాయి....

మంచం పట్టిన దేవప్ప మళ్ళీ లేవనే లేదు.

కాళింగయ్య కాళ్ళు మేకులు కొట్టినట్టు ముందుకి పడనే లేదు. అతని కళ్ళకు మెరుపు కొట్టినట్లయింది. తల బొంగరంలా గిర్రున తిరుగసాగింది.

"నా నేల తీసుకున్నావు కదా ....నా రక్తం ఒడ్డానురా పాపీ, దేవుడు నిన్ను చూసుకుంటాడులే - నా సొమ్ము మీద కన్నేసి, నా జీవం బలి తీసుకున్నావు కదరా. ఉండు, నా కొడుకు ఇంతకింతా బలి తీసుకుంటాడు. గుర్తుంచుకో. రక్తానికి రక్తం బదులు తీసుకుని భూమి సంపాదించుకుంటాడు.... జాగ్రత్త! గెల్చినా ననుకోబోకు. నీ కత పూర్తయ్యే దాకా నా కతా పూర్తి కాదు తెలుసా ?"

చనిపోయిన దేవప్ప కంఠమే అది - నిస్సందేహంగా. ముసలి కాళింగయ్య గడ గడా వణికి పోసాగాడు. అతని కళ్ళు పక్క పొలంలో దున్నుతున్న దేవప్ప కొడుకు వజ్రకాయాన్ని చూడసాగాయి. "నేనూ ముసలివాడినయ్యాను. దేవప్ప కొడుకు వయసులో వున్నాడు. అతను ఖచ్చితంగా కసి తీర్చుకుంటాడు. ఆ

నేలని నేను చేసినట్లుగా బలవంతంగా దున్ని తన వశానికి తీసుకుంటాడు. తీసేసుకుంటాడు. బలం వున్నవాడిదే రాజ్యం. అయిపోయింది. అంతా అయిపోయింది. ఆ కొలతల అధికారికి అనవసరంగా ఐదారు రూపాయలు దండుగ పెట్టానే ....అయ్యో ఐదారు రూపాయలు. .... దండగయిందే! అయ్యో!.... అయ్యో...."

కాళింగయ్య తూలుతూ కింద పడిపోతుంటే చూసి దేవప్ప కొడుకు అరక వదిలేసి పరిగెత్తుకుంటూ వచ్చాడు. కాళింగయ్యకి స్పృహ తప్పినట్టు అయింది. వెంటనే చెరువు దగ్గరికి పరిగెత్తుకెళ్ళి నీళ్ళు తెచ్చి శుశ్రూష చేశాడు. కాస్సేపటికి కాళింగయ్య కళ్ళు తెరిచాడు. దేవప్ప కొడుకు మొహం చూడగానే మృత్యు దర్శనం చేసినట్టయింది. గరుత్మంతుడిని చూసిన పాములా బెదిరాడు. తెరచిన కళ్ళు మూసుకున్నాయి. నీరసంగా పలికాడు.... "నాలుగు మూరల భూమి, నాలుగే మూరల భూమి.... కోపం తెచ్చుకోక .... సంసారం సాకడానికి ఆ పని చేశాను." దేవప్ప కొడుకు ఇదేమి అర్థం కాక గుడ్లప్పగించి చూస్తున్నాడు. కాళింగయ్య మూసిన కళ్ళు తెరవనే లేదు.

కథ చదివి లాయర్ తలూపాడు. కాని అతనికింకో అనుమానం వచ్చింది. హస్త ప్రతి మగవాళ్ళ చేతివ్రాతలా వుంది. సూక్ష్మంగా పరిశీలిస్తే చివర్లో చిన్నగా 'సంజీవి ' అని రాసి వుంది. దాన్ని ఇంకుతో బాగా కొట్టేసినట్టుంది.

లాయర్ సంశయం ధృవపడింది..... సంజీవి తన భార్య మేనమామ. అతను ఇటీవల చనిపోయాడు. అతనికి లలితంటే చాలా ప్రేమ - అని తను చెబుతూ వుంటుంది. అయితే అతని కథల్నే తన పేరిట ప్రచురింప చేసుకుంటోందా ? నాలుగు మూరల భూమి! ఇది అతను రాసిన కథేనా ?

# 8. అజ్ఞాత వాసి

బసవరాజ కట్టీమని

మళ్ళీ వస్తున్నారు పోలీసులు!

ఎనిమిది రోజుల్నుంచి ఏక బిగిన హింసిస్తున్నా తృప్తిలేదు వాళ్ళకి.

మళ్ళీ వస్తున్నారు!

వాళ్ళ చిత్రహింసను ఎదుర్కోవడానికి సిద్ధంగా లేచి కూర్చుంది నాగమ్మ.

ఎనిమిది రోజులుగా వాళ్ళు ఆమెను విరామం లేకుండా కొట్టారు. లాఠి, కర్ర,బూటు, చెప్పులు.... చేతికేది దొరికితే దానితో కొట్టారు. ఆమె కోమల శరీరంపై క్రూర జంతువుల కన్న క్రూరమైన తీరులో పడి భయంకరంగా అత్యాచారం జరిపారు. ఆ లేత శరీరం నుండి కారుతున్న వేడి నెత్తురు చూసిన కొద్దీ వాళ్ళు మరింత రెచ్చిపోయారు.

ఆ దెబ్బలు, అత్యాచారం, రక్తపాతం - దాన్ని తట్టుకోలేక ఆ యువతి గిలగిల్లాడిపోవడం --- దేనివల్లా ఆ పోలీసుల రాతి హృదయాలు కరగలేదు. రోజూ కొట్టడమే. రోజూ అత్యాచారం చెయ్యడమే!

ఇంకా తృప్తిగాలేదు వాళ్ళకి.

మళ్ళీ వస్తున్నారు!

ఆ గుడిసెలో బందీగా, ఏకాకిగా మూలుగుతూ పడి వున్న నాగమ్మ వంద సార్లు ఆలోచించింది. " వీళ్ళని ఆపే వాళ్ళెవరూ లేరా ? ఎవరూ లేనే లేరా ? వెయ్యి సార్లయినా ఆమె సర్వ రక్షకుడైన భగవంతుణ్ణి ఆర్తితో కేకేసి పిల్చింది - 'కౌరవ సభలో ద్రౌపది మానాన్ని రక్షించిన కృష్ణా , వచ్చి నన్ను కాపాడు' అంటూ శ్రీహరిని ప్రార్థించింది. 'భక్తవత్సలా, శివశంకరా, త్వరగా వచ్చి నన్నీ కిరాతకుల్నుంచి రక్షించు " అని వేడుకుంది. ఆమెని విడుదల చెయ్యడానికి ఏ దేవుడూ రాలేదు. "యమధర్మరాజా, నువ్వయినా వచ్చి నన్ను ఈ నరకం నుంచి తప్పించు " అంటూ మృత్యువుతో మొర పెట్టుకుంది. మృత్యువుకి జాలి కలగలేదు. ప్రతి రోజూ ఆ భయంకరమైన హింసని సహిస్తూ కూడా ఆమె ప్రాణం పోకుండా ఇంకా జీవించే వుంది.

బూట్ల చప్పుడు దగ్గరయింది. అదే పరిచితమైన 'కడ్ కడ్' చప్పుడు. తాళం తీసేటప్పుడు ఖళ్ళు మన్న శబ్దం. తన శక్తి నంతా కూడదీసుకుని వాళ్ళ నెదుర్కోవడానికి సిద్ధమయింది నాగమ్మ.

తలుపు తెరుచుకుంది.

అవే క్రూరమైన మొహాలు. బొగ్గు రంగులో మొసలిలా భయంకరంగా వున్న దఫేదారు, అతనితో బాటు ఆ పోలీసు సిపాయి.... మూడు రోజులుగా వీళ్ళిద్దరే వస్తున్నారు. మళ్ళీ మళ్ళీ అదే ప్రశ్న. అదే అత్యాచారం. అన్నీ పూర్తి చేసుకుని తమతో బాటు తెచ్చిన చద్ది రొట్టెను ఆమె మీదకి విసిరేసి, మూలనున్న కుండలోకి మురికి నీరు నింపేసి, తలుపు వేసి, తాళం బిగించి వెళ్ళిపోతారు. ఉదయం-సాయంత్రం రెండు పూటలా ఇదే క్రమం తప్పకుండా జరుగుతోంది.

ఆమెని వేధించడానికి వాళ్ళుపయోగించిన హింసా కృత్యాలు, ఉపాయాలు అన్నీ వ్యర్థమయి పోయాయి. ఏదీ కూడా ఆమె నోరు విప్పించడానికి పనికి రాలేదు. "మాట్లాడు, మా ప్రశ్నలకి జవాబు చెప్పు. నిన్ను వదిలేస్తాం" అని వాళ్ళు గొంతు చించుకుని ఆక్రోశించినా, ఆమె నేటి మీద బూటు కాలితో తన్నినా ఆమె ఓడిపోలేదు. బూట్ల కున్న మేకులు గుచ్చుకుని ఆమె పెదవులు చిట్లి, పళ్ళు వూడి రక్తం కారుతున్నా చెక్కు చెదరలేదు.

ఆమె దృఢ నిర్ణయం వాళ్ళకి బాగా తెలిసొచ్చినా ఇంకా వాళ్ళు హింసా కృత్యాల్నుంచి వెనక్కి తిరగలేదు. నిరాశ చెందలేదు. రోజూ వస్తూనే వున్నారు. రోజూ ఆమెని కొట్టి, తిట్టి హింసిస్తూనే వున్నారు.

ఇప్పుడూ వచ్చారు.

దఫేదారు బూటు కాలు వేగంగా వచ్చి ఆమె నడుముని తాకింది. దాని తాకిడికి ఆమె దేహం ఎగిరి అంత దూరం వెళ్ళి పడింది. ఆ తన్ను వల్ల ఆమె కంత ఎక్కువ నొప్పేమీ అనిపించలేదు. వాళ్ళు కాళ్ళతో తన్ని తన్ని ఆమె ఎముకలు విరిగిపోయాయి. నూతిలో రాయిపడితే కొంత కాలం అలలు లేచి నట్టుగా ఆమె శరీరంలో ఓ రెండు క్షణాలు ఒక రకమైన విలక్షణమైన అలలు లేచి మాయమయ్యాయి అంతే.

ఓహ్! తన భర్త! తన ప్రియమైన భర్త! ఎక్కడున్నాడతను? ఏ అడవిలో వున్నాడు ? ఏం కష్టాలు పడుతున్నాడో! ఏ బాధలో వున్నాడో!

తను అలాంటి భీకరమైన పరిస్థితుల్లో వున్నా భర్త కష్టాలు తలుచుకుని విలవిల్లాడ సాగింది ఆమె హృదయం. అతని కష్టాలు తలుచుకుంటే తన నొప్పి గుర్తే రావడం లేదు. ఎనిమిది రోజులుగా రొట్టె నోట్లో పెట్టుకోవడం లేదామె. తన భర్త భోజనం గురించి ఆలోచిస్తోంది. అతను తిన్నాడో లేదోనని కన్నీరు పెట్టుకుంటోంది.

ఆ రోజు రాత్రి పల్లె వదిలి వెళ్ళిపోయే ముందు తన నెప్పటికీ వదల లేనట్లుగా గట్టిగా కౌగిలించుకుని చెంపకు చెంప చేర్చి జుట్టు నిమురుతూ, "భయపడకు నాగూ, ఈ గొడవలన్నీ సర్దుకున్నాక మళ్ళీ వస్తాను. నా కోసం

ధైర్యంగా కాచుకుని వుండు" అని భరోసా ఇచ్చాడు. వదల్లేక వదల్లేక బయలుదేరిన అతని ప్రేమ మూర్తి ఆమె కళ్ళ ఎదుట నిలిచింది.

ఈ పోలీసు రాజ్యానికి అంతమెప్పుడు వస్తుంది. ఎప్పుడు వీళ్లంతా ఇక్కడ్నుంచి వెళతారో, నా దొర ఎప్పటికి నా దగ్గరకొస్తాడో. ఎప్పటి కతన్ని చూస్తానో. లేదా ఇలా ఈ పోలీసుల హింసకి బలైపోయి ప్రాణం వదిలేస్తానో ఏమో. "అయ్యో! నా దొరా ఎక్కడున్నావయ్యా నువ్వు? ఓ సారైనా మొహం చూపించు. నీ ముద్దు మొహం చూసి, నీ తొడ మీద తలపెట్టుకుని ప్రాణం వదులుతాను. ఈ పశువుల వల్ల మలినమైన ఈ పాడు దేహాన్ని వదిలేస్తాను" అని మొర పెట్టుకుంటోంది నాగమ్మ.

గుడిసెకి దగ్గరగా వున్న మామిడి చెట్టు మీద కూర్చున్న పక్షి పాడుతోంది. ఆ పక్షి పాటలో తన ప్రియమైన భర్త ధైర్యం చెపుతున్న భావం స్ఫురించింది నాగమ్మకి. "భయపడకు నాగూ. నేను వస్తాను. వచ్చి నిన్ని నరకం నుంచి తప్పిస్తాను." అని అభయం ఇచ్చినట్లుగా అనిపించింది.

ఆ కల్పన వల్ల ఆమెకి కొంచెం మనశ్శాంతి కలిగింది. మూల వున్న రొట్టె ముక్క తీసుకుని నోట్లో పెట్టుకో బోయింది. ఎన్ని రోజులైందో ఏమో దాన్ని చేసి, ఎండి రాయిలా వుందది. శక్తి హీనమైన ఆమె పళ్ళతో కొరకటం సాధ్యం కాని పనే.

నోట్లో పెట్టుకో లేకపోయింది, తినలేకపోయింది. మళ్ళీ హఠాత్తుగా ఆమెకి అజ్ఞాత వాసి అయిన తన భర్త గుర్తు వచ్చాడు. పోలీసుల్నుంచి తప్పించు కోవడం కోసం, అజ్ఞాతంగా తల దాచుకుని, తిండి -తిప్పలు లేకుండా, చెట్లు-పుట్టలు పట్టుకుని తిరుగుతూ వుండి వుండాలి. ఇంతటి చిత్ర హింసని అనుభవిస్తున్నా ఎండిన రొట్టె అయినా దొరుకుతోంది తనకి. అతనికి ? ఎండిన రొట్టెకి కూడా నోచుకోడతను. ఎలా వుంటుంది అతని పరిస్థితి ?

రొట్టె విసిరేసి అలాగే పడుకుండి పోయింది.

ఆమె మనసులో ఒకటే ఆలోచన

భర్త! భర్త! భర్త!

## 2

అదే రోజు అదే సమయంలో అక్కడ్నుంచి ఇరవై మైళ్ళ దూరంలో వున్న అడవిలో ఆమె భర్త. ఒక అజ్ఞాత వాసి. ఆమె ఆలోచనతోనే ఓ చెట్టు నీడలో పడుకున్నాడు.

చుట్టూ ఏత్తుగా పెరిగిన పొదలతో ప్రకృతి సహజంగా నిర్మితమైన కోటలాంటి చోట పడుకున్నాడతను. ఎనిమిది రోజుల క్రితం పల్లె వదిలి నప్పట్నుంచి

అక్కడా ఇక్కడా తిరుగుతూ, అడవిలో దొరికిన కాయలు, పళ్ళూ తింటూ ప్రాణం నిలుపుకున్నాడు. ఎండా, వాన అని లేకుండా తిరగడంతో కలిగిన అలసట, ఉపవాసాల వల్ల కలిగిన నీరసం - వీటి ఛాయలు కనిపిస్తున్నాయతని మొహంలో. వస్తాదు దేహం లాగుండే అతని దేహం కృశించి వుంది. పెరిగిన గడ్డం మీసాల వల్ల విలక్షణంగా కళా హీనంగా కనిపించే మొహం. రాళ్ళు - రప్పలు, ముళ్ళూ తొక్కి ఛిద్రమైన కాళ్ళు, చినిగి పీలికలైన చొక్కా, పంచె, దానికి తోడు ఎప్పుడూ పీడిస్తున్న బంధనపు భయం....

ఎప్పుడు ఎలాంటి పరిస్థితుల్లో పోలీసు లతన్ని ముట్టడిస్తారో తెలీదు. జనం కళ్ళు గప్పి తిరగడమూ పెద్ద సాహసమైన పనే. ఎక్కడైనా కాస్త అజాగ్రత్తగా వుంటే చాలు అతను దొరికిపోవడం ఖాయం. ఆ తరువాత సంగతి తెలిసినదే. .... విచారణ ....ఉరి శిక్ష ....ఫాసీ ....'

'ఉరికంబం ఎక్కడానికి తనకేం భయం లేదు సరె,

కాని ఉరికంబం ఎక్కడం వల్ల ప్రయోజనం ఏమిటి ?

ఏ కారణం కోసం ఉరికంబం ఎక్కాలితను?

ఈ శిక్ష విధించడానికి వీళ్ళకున్న అధికారం ఏమిటి ?

ఆ రోజు తమ పల్లెలో జరిగిన దుర్ఘటన కళ్ళ ముందు మెదిలింది. ఆగస్టు ఉద్యమం ప్రారంభం అయింది. తమ పల్లెలో స్వతంత్రరాజ్య స్థాపన. కరణం, మునసబుల రాజీనామా.... స్వతంత్ర రాజ్యాన్ని కూల దోసేందుకు వచ్చిన పోలీసు అధికారులు. పల్లెని కాపలా కాస్తున్న కుర్రాళ్ళని వాళ్లు కొట్టడం.... దానితో పల్లె ప్రజలు వాళ్ళ నెదిరించడం....గొడవలు....కొట్లాట.... అందులో అధికారి ఒకడికి దెబ్బలు తగిలి చనిపోవడం --- ఆ సమయంలో పొలంలో పని చేస్తున్న తను ఈ అనాహుతం సంగతి విని పరిగెత్తుకుంటు అక్కడికి రావడం.... మర్నాడు మిలటరీ వాళ్ళు వచ్చి వూరంతా కొల్లగొడుతున్న సంగతి వినడం.... ఆ రాత్రే తామంతా వూరు వదిలిపెట్టి బయలుదేరడం.... అబ్బ! ఎంత భయంకర సంఘటనలు!

తన మనసుకి విరుద్ధంగా తనూ అక్కడ్నుంచి బయలుదేరాల్సొచ్చింది. ఊరి పెద్దలు బలవంతం చేశారు. " కాంగ్రెస్ ప్రియులకు నువ్వే నాయకుడివి. నిన్ను పోలీసు లొదిలిపెట్టరు. ఒక్క అధికారి ప్రాణం కోసం మనలో ఇరవైమంది ప్రాణాలైనా బలి తీసుకుంటారు. అందులో నిన్ను ఖచ్చితంగా పట్టుకుంటారు. ఉట్టినే ఉరికంబం ఎందుకు ఎక్కుతావ్. నడు.... నడు...." అన్నారు. తను బయలుదేరక తప్పలేదు.

'ఇప్పుడు తమ పల్లె గతి ఏమయిందో!'

ఆ పోలీసు రాజ్యం దాన్నేం చేసిందో? ఎంతమందిని పట్టుకున్నారో? ఎంతమందిని పీడిస్తున్నారో!

తాను?

తన ప్రియమైన నాగు?

తను వాళ్ళ చేతికి దొరికిపోయిందో ఏమో!

దొరికి వుంటే!

అధికారి చావుకి ఆమె కారణం కాదు. ఆమె ఏ అపరాధమూ చేసి ఎరుగదు. కాని కసితో ఉన్మత్తులైన ఆ పోలీసులు న్యాయాన్యాయాల గురించి ఆలోచించడం అంటూ వుంటుందా అసలు. చేతికి దొరికిన వాళ్ళందర్నీ పీడించ వచ్చు. చెప్పరాని అత్యాచారాలు జరుపవచ్చు.

నాగూని వాళ్ళు పట్టుకుని వుంటే?

ఈ ఆలోచనతో అతని ఒళ్ళు జలదరిస్తోంది.

పల్లెలో జరిగే విషయాలు అతనికి తెలిసే అవకాశం లేదిప్పుడు.

దాక్కున్న అడవి ప్రదేశాన్ని వదిలి జన సమూహం వుండే చోటికి వెళితే ఏదైనా తెలిసేది.

మొహం మీద గడ్డం బాగా పెరిగి వేషం మార్చుకోవడానికి వీలయ్యేదాకా అడవి వదలి వెళ్ళడం ప్రమాదం.

అంతదాకా అతని హృదయం ఆందోళనతో కూడిన విలక్షణమైన తుఫానులో చిక్కుకుని విలవిల్లాడక తప్పదు.

ఆ రోజూ అలాంటిదే కలవరం....

- పల్లె ఏమైందో ?

- నాగూ ఏమైందో ?

ఏదీ తెలియటం లేదు.

హఠాత్తుగా అజ్ఞాతవాసి ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు. దగ్గరగా ఎవరో చిన్నగా తనని పిలుస్తున్నారు.

'చెన్న బసప్పా....' అంటూ

అఖరికి పోలీసులు తన జాడ తెలుసుకున్నారేమో. తనని సులువుగా వలేసి పట్టుకోవడానికి ఇలా పిలుస్తున్నారేమో అనుకుంటూ చెన్నబసప్ప దగ్గరగా వున్న దుడ్డుకర్ర చేతికి తీసుకుని వాళ్ళ నెదుర్కోవడానికి సిద్ధంగా నుంచున్నాడు.

"చెన్నబసప్పా తోవ ఎటుందిరా" మళ్ళీ వినిపించింది అదే పిలుపు.

పోలీసుల కంఠం కాదది. అతనికి చిర పరిచితమైన కరియప్ప కంఠం అది. తమ పక్కింటి ముసలతను కిరియప్ప. ఇంత దూరం ఎలా వచ్చాడో

అనుకుంటూ చెన్నబసప్ప అమితానందంతో ముందుకు నడిచి పొద అవతల నుంచున్న ముసలతన్ని కలుసుకున్నాడు.

ఎండలో నడచి నడచి అయాసంతో రొప్పుతున్న కరియప్ప చెట్టునీడలో కూర్చుని గాలి ఎనురుకోసాగాడు.

"ఎక్కణ్ణుంచి వచ్చావురా కరియణ్ణా", ఆత్రంగా అడిగాడు చెన్నబసప్ప.

"ఊర్నుంచే వచ్చాను. మూడు నాలుగు రోజుల్నుంచి వెతుకుతున్నాను. ఇవాళ్టికి దొరికావు. తమ్ముడూ చెన్నా ఇప్పుడే బయలుదేరు....ఏమైనా చెయ్యి. కాని వూరికి వెళ్ళు --- అక్కడ నాగమ్మ ప్రాణాపాయ స్థితిలో వుంది....

చెన్నబసప్ప గుండె దడదడ లాడింది. "కరియణ్ణా ఏమైందామెకి ?" అనడిగాడు.

"ఏం చెప్పను తమ్ముడూ మీరంతా పరారయినప్పుడు మేం ముసలాళ్ళు, స్త్రీలు, పిల్లలు ఆ దిబ్బ వెనకాల తల దాచుకున్నాం. అక్కడికి వచ్చారు పోలీసులు. మమ్మల్నందర్నీ పట్టుకున్నారు. కొట్టారు. అందరి ఇళ్ళలో లూటి చేశారు. నాగమ్మ కూడా వాళ్ళ చేతికి దొరికింది. ఏం చెప్పనురా చెన్న బసప్పా. ఆమెని కొట్టి కొట్టి హింసిస్తున్నారట. ఆ దెయ్యాలు, ఇప్పుడామెని నువ్వు తప్ప ఎవరూ కాపాడలేరు. అందుకే నిన్ను వెతుక్కుంటూ వచ్చాను. ఆ పోలీసుల చేతుల్లో పడకుండా తప్పించుకుంటూ వచ్చాను. చెన్నణ్ణా, నాగమ్మని తలుచుకుంటే నా కడుపు తరుక్కుపోతోంది. ఇప్పుడే బయలుదేరయ్యా.... ఒక్క క్షణం కూడా ఆలస్యం చెయ్యకు...."

"ఆ పోలీసుల్ని తనేం చేసిందని హింసిస్తున్నారు కరియణ్ణా" చెన్నబసప్పా కలవరపాటుతో అడిగాడు.

"ఎందుకని చెప్పగలమయ్యా ? వాళ్ళని అడిగే వాళ్ళెవరు ? ఊళ్ళో వాళ్ళదే రాజ్యం. న్యాయం నీతి అంతా గాలి కొదిలేసారు. నీ మీద ఎప్పట్నుంచో కన్నేసి వున్నారు. నువ్వు పరారయ్యావని తెలిగానే వాళ్ళకి ముందుకొచ్చింది. అందుకే నీ పెళ్ళాన్ని పట్టుకు కొట్టి హింసిస్తున్నారు - నువ్వుండే చోటు చెప్పమని. కాని నువ్వెక్కడున్నావో ఆమెకేం తెలుసు ? తెలిసినా చెప్పగలదా ? ప్రాణం పోయినా చెప్పదు. ఇప్పుడు ఆ రాక్షసుల నుంచి ఆమెని రక్షించాలంటే నువ్వే వెళ్ళాలి....తొందరగా నడు...."

ఒక క్షణం తన దేహంలోని అంగాంగాల చలనం నిలిచి పోయినట్లుగా అనిపించింది చెన్న బసప్పకు. తన ప్రియమైన భార్యకి కలిగిన దుస్థితి తలుచుకుని నిశ్చేష్టుడయ్యాడు.

తను పారిపోవడం వల్లనే ఆమెకాస్థితి కలిగింది....తన కోసమే పోలీసు లామెను హింసిస్తున్నారు.... ఆమె నలా వాళ్ళ కప్పగించేసి తనిక్కడ అజ్ఞాత వాసిగా వుండి మాత్రం ఏం ప్రయోజనం? దేశమంతా అక్కడక్కడా నియమితులైన ప్రభుత్వపు గూఢచారుల వలలో చిక్కుకుని ఇవాళ కాకపోతే రేపయినా తను ఉరికంబం ఎక్కడం తథ్యం.... అలాంటప్పుడు ఇవ్వాళైతేనేం? రేపయితే నేం? ఎప్పుడైనా తన ప్రాణం పోవల్సిందే. తన ప్రాణం పోయినా ఫరవాలేదు. తన భార్యని దక్కించుకోవాలి. దక్కించుకోవాలి. ఆమె ప్రాణాల్ని కాపాడ్డం తన చేతిలోనే వుంది. అవును....తన చేతిలోనే వుంది.

అతని మనసు మూగగా నిర్ధారణ చేసింది. దాంతో అతని మనసులోని బరువు సగానికి సగం తగ్గింది.

ముసలతను చెబుతూనే వున్నాడు.

" ఒక్క క్షణం కూడా అలస్యం చేయ్యకు చెన్నప్పా. ఇప్పుడే బయల్దేరు. ఆమెని చంపేస్తున్నారా రాక్షసులు. వెళ్ళు ఇప్పుడే వెళ్ళి ఆమెని రక్షించు -"

"వెళతాను కరియణ్ణా. కాని ఇక్కడ నీ గతేమిటి ? తిరిగి తిరిగి అలసి వచ్చావు. ముసలి ప్రాణం కడుపుకేం చేస్తావు ?"

అంతటి అలసటలోనూ ఆ ముసలి రైతు నవ్వుతూ బదులు చెప్పాడు.

"నన్ను గురించి ఆలోచించకయ్యా. నా సంగతి నేను చూసుకుంటాను. ఇక్కడేమన్నా పళ్ళు-గిళ్ళు దొరుకుతాయి. ఇక్కడే దగ్గర పల్లెలో నాకు తెలిసిన వాళ్ళ ఇల్లుంది. అక్కడి కెళతాను. నా సంగతి వదిలి నువ్వు బయలుదేరి వెళ్ళు...."

దుడుకుగా కర్ర చేతికి తీసుకుని బయలుదేరుతూ చెన్న బసప్ప అడిగాడు.

"నాగూ నెక్కడ దాచారో నీకు తెలుసా ?"

"ఊరి బయట కరణం గారి తోటలోని గుడిసెలో వుంచి తాళం వేశారట. బావి దగ్గర వాళ్ళూ కావలి వున్నారట. జాగ్రత్తగా వెళ్ళు. ఆమెని విడిపించుకురా"

"నీ ఆశీస్సు ఫలించాలి తాతా" మనసులో అనుకుంటూ చెన్న బసప్ప అక్కడ్నుంచి బయలుదేరాడు.

అతని ఆకారం చెట్ల మధ్య కనుమరుగయింది. అంతవరకూ చూస్తు నుంచున్నాడు కరియప్ప. తరువాత నెమ్మదిగా నిట్టూర్చి -

"దేవుడా, భరమప్ప తండ్రీ. నా పని నేను చేశాను. అతని పని అతను చేసేలా చూడు. వాళ్ళిద్దరూ ఆ నరకం నుంచి బయటపడేలా చెయ్యి. ఆ మాత్రం కరుణించు నీకు నాలుగు కొబ్బరికాయలు కొడతాను...."

## 3

అడవి ప్రదేశాన్ని దాటి సందు గొందుల్లోంచి చెన్నబసప్ప వూరిని సమీపించేసరికి అర్ధరాత్రి దాటింది.

ఆకాశంలో మెరుస్తున్న నక్షత్రాల వెలుగులో కరణంగారి తోట అస్పష్టంగా కనిపిస్తోంది. తోటలో ఒక చెట్టు చాటున నుంచున్న చెన్నబసప్ప చుట్టూ పరికించి చూశాడు. బావి చుట్టూ డేరాలు వేశారు. దానికి నలభై గజాల దూరంలో గుడిసె. తన నాగూని బంధించి వుంచిన గుడిసె అదేనని వూహించడం కష్టం కాలేదతనికి. ఆ గుడిసె ఎదుట కొంత దూరంలో పోలీసు సిపాయి బందూకు చేతిలో పట్టుకుని సగం నిద్రలో మునిగి వున్నాడు.

డేరాల్లోని పోలీసులంతా నిద్రాదేవి ఒడిలో వున్నారు. ఎక్కడా అలికిడి లేదు.

చెట్ల చాటున నుంచున్న చెన్నబసప్ప కాసేపు అలా చూస్తూ వుండిపోయాడు. తరువాత ఏదో ఆలోచించుకున్నాడు. అప్పుడిక జాగ్రత్తగా అడుగులు వేస్తూ కాపలా కాస్తున్న పోలీసు వున్న చోటికి వచ్చాడు. ఒక్క క్షణం నిద్రామగ్నమైన అతన్ని సూక్ష్మంగా పరికించి, నిజమైన నిద్ర అని రూఢీ పరుచుకుని నెమ్మదిగా అతని పక్కన కూర్చున్నాడు. అతని చేతిలోని బందూకుని విడిపించి తన చేతికి తీసుకున్నాడు. నోరు పెద్దగా తెరుచుకుని వూపిరి తీస్తున్న అతని నోట్లో పక్కనే వున్న గడ్డిని కూరాడు.

తరువాత పసిపిల్లాణ్ణెత్తుకున్నట్టు అతన్ని ఎత్తి దగ్గర్లో వున్న మామిడి చెట్టు దగ్గర దింపాడు. అతని తలకి కట్టుకున్న పాగాని విప్పి దానితో అతన్ని చెట్టుకి కట్టేశాడు. మెలకువ వచ్చేలోపునే అతను బందీ అయిపోయాడు. అతను నోరు తెరిచి అరవడానికి, కాళ్లూ, చేతులూ ఆడించడానికి వీలులేకపోయింది.

అతని చొక్కా అంతా తడిమి చూసి అక్కడ వున్న గుళ్ళన్నీ తీసి నడుములో దోపుకున్నాడు. ఆ గుడిసె తాళం చెవి కూడా అతని జేబులో వుంది. దాన్నీ తీసుకున్నాడు. అదృష్టవశాత్తు ఒక అగ్గిపెట్టె కూడా వుందక్కడ. దాన్నీ తీసుకున్నాడు. తరువాత బందూకుని ఎడం చేతిలో పట్టుకుని చప్పుడు చెయ్యకుండా గుడిసె వేపు నడిచాడు.

తాళం తీసి తలుపు తోసి లోపలకి వెళ్ళి మూలన పెట్టి తలుపు వేసేశాడు. అగ్గిపుల్ల గీసి ఆ వెలుగులో గుడిసె అంతా ఒకసారి చూశాడు.

ఆ సన్నటి వెలుతురులో చావడానికి సిద్ధంగా వున్న అతని భార్య నగ్న శరీరం కనిపించింది. అక్కడక్కడ గాయాలు కొన్ని చోట్ల గడ్డలు కట్టిన రక్తం. కొన్ని చోట్ల చిల్లులు పడి, కమిలిపోయి, వికృతంగా వున్న ఆ దేహాన్ని చూశా డతను. ఆ శరీరం ప్రాణప్రదమైన తన భార్యది. తాను పెళ్ళి చేసుకుని

ఎనిమిదేళ్ళు అప్యాయంగా, ప్రేమగా చూసుకున్న ప్రియమైన తన నాగూ శరీరం అది.

ఆ హృదయ విదారకమైన దృశ్యం చూసి అతని దేహం అద్యంతం జలదరించింది.

ఆమె దగ్గరగా కూర్చుని చెన్నబసప్ప ప్రేమగా ఆమె చెంపలు నిమురుతూ "నాగూ, నాగూ" అని పిలిచాడు.

శవంలా నిశ్చలంగా పడి వున్న ఆ అభాగినికి మెలకువ వచ్చింది. చిరపరిచితమైన ఆ కంఠాన్ని గుర్తించింది. అతికష్టం మీద కళ్ళు తెరచి భర్తవేపు తదేకంగా చూసింది.

అతను అగ్గిపుల్లల్ని ఒక దాని వెంట ఒకటి వెలిగిస్తూ వెలుగు చేస్తున్నాడు.

"వచ్చారా ?....అఖరికి వచ్చేశారా ?" క్షీణంగా పలికిందామె కంఠం.

"అయ్యో! నా నాగూ, నీ కిలాంటి గతి పట్టిందే" ఏడుపు నిండిన గొంతుతో అంటూ ఆమె నెత్తి తన ఒళ్ళో పడుకో పెట్టుకున్నాడతను.

ఓ క్షణం భర్త తొడ మీద సర్దుకు పడుకుని ప్రశాంతంగా నెమ్మదిగా వూపిరి తీసింది నాగమ్మ. తరువాత అంది,

"మీ కోసమే ఈ ప్రాణాలు నిలుపుకుని ఎదురు చూస్తున్నాను - మీ ఒళ్ళో పడుకుని ప్రాణం వదలాలన్న అశతో.... మీ రొచ్చారు.... ఇక ఆనందంగా వెళ్ళిపోతాను.... కాని .... కాని.... "

"కాని ఏమిటి నా బంగారూ ...." ఆమెని పిచ్చిగా ముద్దాడుతూ అడిగాడు చెన్నబసప్ప.

"కాని....కాని....ఆ పిశాచాలు మిమ్మల్ని వదిలి పెట్టరు. మిమ్మల్ని పట్టుకోవాలనే ఎదురు చూస్తున్నారు. మిమ్మల్ని వదిలి పెట్టరండీ ....వదిలి పెట్టరు. ఉరికంబం ఎక్కించే దాకా వదలరు. అయ్యో....నా కోసం వచ్చారా మీరు ? నా కోసం వచ్చి వాళ్ళకి దొరికిపోతున్నారే!...." ఉద్వేగంగా లేచి కూర్చోబోయిందామె. "ఊహు ‹ .... మీరిక్కడ వుండొద్దు.... ఒక్క క్షణం కూడా వుండొద్దు. వాళ్ళ చేతుల్లో పడవద్దు. ఇది నా కోరిక...." అంటూ వుండగానే హఠాత్తుగా ఆమె శరీరం కింద పడిపోయింది.

ఆమె దేహాన్ని గుండెల కదుముకుంటూ చెన్నబసప్ప ఉద్వేగంగా, పిచ్చిగా మాట్లాడుతున్నాడు.

" వాళ్ళకి నేను దొరకను నాగూ. పోలీసులకి దొరకను. నీ కెందుకా భయం? వాళ్ళకి దొరికి పోడానికి రాలేదు ఇక్కడికి. వాళ్ళ చేతుల్లోంచి నిన్ను విడిపించుకుని పోవాలని వచ్చాను. లే ....నా బంగారూ, లే. ఇక ఒక్క క్షణం కూడా ఇక్కడ

వుండొద్దు మనం. ఈ నరకం నుంచి నిన్ను తీసుకుపోతాను లే...."

నాగమ్మ లేచే స్థితిలో లేదు.

ఎనిమిది రోజుల చిత్రహింసని కూడా ఎలాగో తట్టుకుని నిలబడ్డ ప్రాణం పతి దర్శనం కాగానే ఎలాగో దేహాన్ని వదిలిపెట్టి వెళ్ళిపోయింది.

చల్లబడుతున్న భార్య కళేబరాన్ని పట్టుకుని ఒక్క క్షణం అచేతనంగా వుండిపోయాడు చెన్న బసప్ప. అతని వ్యక్తిగత జీవితపు ఆశ- ఆకాంక్షలన్నీ ఆమెతో బాటే చనిపోయి ఆ శవంలో నిక్షిప్తమై పోయాయి. సంసారపు వ్యామోహానికి అతన్ని బంధించిన ఒకే ఒక్క మాయా తంత్రి కూడా ఇప్పుడు తెగిపోయింది.

ఇక అతను ఏకాకి!

ఇక అతను నిరంకుశుడు.

ఇక అతడిని ఆపే శక్తి ప్రపంచంలో ఏదీ లేదు.

ఇక ఒకే ఒక్క ఉద్దేశంతో, గమ్యాన్ని దృష్టిలో పెట్టుకుని పోరాటం సాగించడమే ధ్యేయ మతనికి. జంటని పోగొట్టుకున్న బెబ్బులి, కసిగా గర్జించేలా గర్జిస్తాడతను. తన ప్రియమైన భార్య ఇలా బలి తీసుకున్న ఈ పైశాచిక పోలీసు రాజ్యానికి విరుద్ధంగా ఆఖరి దాకా యుద్ధం చేస్తాడు.

శ్మశానంలో కట్టెలు పేర్చి శవాన్ని దాని మీద పెట్టినట్టుగా గుడిసెలోని గడ్డిమీద భార్య కళేబరాన్నుంచాడు. దాన్ని మోసుకెళ్ళి మట్టిలో కప్పెట్టడం ఇష్టం లేదతడికి. ఇక్కడే కాలి బూడిద కావాలి. పోలీసుల చేతికి శవం కూడా దొరక్కూడదు. అనుకుంటూ గుడిసె గోడకున్న గడ్డిని లాగి రాశి చేసి శవం మీద కప్పాడు. అంతా సిద్ధం చెయ్యగానే పుల్ల గీసి అంటించాడు. గుడిసె గోడలకే నిప్పు పెట్టాడు. కాసేపు అక్కడ నుంచుని విరజిమ్ముతున్న మంటలను శూన్య దృష్టితో చూశాడు. ఆ తరువాత బందూకు చేతిలోకి తీసుకుని బయటకి దూకి క్షణంలో చీకట్లో కలిసి పోయాడు.

గుడిసె అంటుకుని ధగధగమంటూ మంటలు లేచాక డేరాల్లో పడుకున్న పోలీసులకి మెలకువ వచ్చింది.

అనాహుతం జరిగిందని తెలయగానే వాళ్ళు లేచి బందూకుల్ని తీసుకుని పేలుస్తూ అక్కడికి చేరుకున్నారు.

నాగమ్మని విడిపించుకుని గుడిసెకి నిప్పు పెట్టి పల్లెవాసులు పారిపోయి వుంటారనే వూహించారు వాళ్ళు. బంధితుడైన కాపలా సిపాయిని విడిపించడాన్ని మరచి అన్ని దిక్కులకూ గుళ్ళు పేలుస్తూ పిచ్చిగా పరిగెడుతున్నారు వాళ్ళు.

నడుంలో దోపుకున్న గుళ్ళని బందూకులో నింపి సిద్ధంగా వుంచుకున్న చెన్న బసప్ప చీకట్లో మాయమయ్యాడు. ఇక అతను వీళ్ళకి దొరకడం కష్టం.

అఖరిదాకా అతను అజ్ఞాత వాసిగానే వుంటాడు.

పోలీసులు, గూఢచారులు - ఎవరికీ దొరకడు. వాళ్ళ కళ్ళల్లో కారం కొడుతూ పల్లె పల్లెకీ తిరుగుతూ జనాన్ని కూడ గట్టుకుని పోరాటం సాగిస్తాడు. తన పల్లెని లూటీ చేసి, తన భార్యని, అలాటి వందలాది మంది సాధ్వీమణుల్ని హింసించి చంపిన ఘాతకుల్ని అంతం చేస్తాడు.

అతని అజ్ఞాత వాసానికి అంతం లేదు.

అంతులేని పోరాటం సాగిస్తాడతడు.

రాజ్యాన్ని ఓడించే దాకా సాగుతుందది. స్వాతంత్ర్యం వచ్చేదాకా సాగుతుందది.

చెన్నబసప్ప అనే ఒక్క వ్యక్తి నిర్ణయం మాత్రమే కాదది. మొత్తం భారతదేశపు నిర్ణయమది. ఎలాంటి బాధల్ని అయినా తట్టుకుని జీవచ్ఛవాల్లా వున్న భారతదేశపు ప్రజల నిర్ణయ మది.

# 9. 0 - 0 = 0

త. రా. సు

ఎన్నోమార్లు ఇలా అవుతుంది.

చూసింది కనిపించదు.... కన్ను చూసినదాని ముద్ర మనసుమీద పడక .... దృష్టము అదృష్టము.... వ్యక్తము, అవ్యక్తము.... తర్కబద్ధతలోనే తర్కరాహిత్యము.

ఆ బావి ఇలాంటిదే.

....రోడ్డు పక్క మైదానంలో ....ప్రతిరోజూ అతను తిరగే దారి....ఉంది; ఉన్నా చూడలేదు. అదృష్టం లాగానే. సువ్యక్తమైనా అవ్యక్తమైన అదృష్టపు బావి....

మొదటి మారు చూసినప్పుడు ఆ పేరు పెట్టాడు.

....'మొదటి మారు చూసినపుడు చిన్నగా నవ్వాడు '.... ఉన్నట్టుండి ఓ రోజు బావి అతన్ని తన వద్దకు పిలిచింది.

2

సాయంకాలం, కనుచీకటి....మబ్బు కమ్మిన కళ్ళ లాంటి పగలు.... వెనక్కి వస్తున్నాడు.... ఆ త్రోవలో.... మైదానంలో పదిమందీ చేరారు, కేకలు పెడుతున్నారు, ఎందుకో ? తేరిపార చూశాడు .... కుతూహలం రేకెత్తగా వెళ్ళాడు.... బావి పరిచయం అయింది - అదృష్టపు బావి.

ఎప్పుడో వాడుక తప్పి వాడే వాళ్ళు లేక, వాడటానికి వీలు లేక, చుట్టూ గోడలు విరిగిన బావి.... చావు నిచ్చే బావి....ఉంది, చుట్టూ గడ్డి తినే పశువులకు నీళ్ళు ఇచ్చి,, నేల మట్టానికి నీరు.... పాచికట్టి, నల్లగా, చల్లగా, మందంగా వెలిగే నీరు.

వంగి నీళ్ళు తాగటానికి వంగిన దూడ జారి నీటి పాలయింది.... తల్లి ఆవు, నీటి వలలో చిక్కుకున్న దూడను చూసి, పిచ్చెక్కినట్టు తిరుగుతోంది, కేక పెడుతూ, కళ్ళు తిప్పుతూ, తోక ఎత్తి, నీటి అంచుకే పరిగెడుతుంది - తన దూడ బ్రతుకు, మెల్లిగా బెదరి వెనక్కి అడుగేస్తుంది.... తన బ్రతుకు.... 'జీవన్ భద్రాణి పశ్యతి'....

నల్లగా, చల్లగా మెరిసే నీటి వలలో జీవం, భయంకరం. గడ్డ కట్టిన శింజిని.... కన్ను చూస్తోంది. కాలం స్తబ్దమై, వణుకుతూ నిలుచుంది. నీటి అంచున, చీకటి కమ్ముకుంటోంది.

ఆఖరికి దూడ బయటకు వచ్చింది. తల్లి ఆవు, నేలమీద పడి, పక్కలెగరేస్తున్న, నీరు కారుతున్న కంపిస్తున్న దూడ వద్దకు చటుక్కున వచ్చి, వాసన చూసి, నాకింది. మృత్యువు తన ఆహారాన్ని వదిలిపెట్టింది.

అతనికి వణుకుతో కూడిన కోపం కట్టలు తెంచుకుని వచ్చింది .... కోపం.... అందరి మీద.... వెధవలు.... ఇలా ఎందుకు వదిలి పెట్టారు ఈ బావిని, మున్సిపాలిటీ వారికి చెప్పి ఎందుకు మూయించలేదు.... హంతకులు.... ఏమీ... ఎవరికీ అపాయం కాలేదు. గుండెల్లో మృత్యువును పెట్టుకుని.... చల్లగా, నల్లగా, మందంగా మెరిసే చావు.... చావే రావాలి. కన్ను తెరిపించటానికి.... చల్లటి చెయ్యి కన్ను తెరిపించటానికి.... ఎవరైనా చావాల్సింది.

ఎవరైనా చావాలి.... మనిషి కన్ను తెరవటానికి మనిషి చావాలి.... తుపాకి దెబ్బకు, శిలువ పైన, విషం తాగి, నీటిలో.... మనిషి కన్ను తెరిపించటానికి మనిషి చావాలి.... మనిషి కన్ను .... అనుకంపనము, సానుభూతి చచ్చి, స్వార్థం మెరిసే క్షుద్రమైన కన్ను .... తెరిపించటానికి చావాలి.

చల్లగా మెరిసే నీటి అంచున కంపిస్తూ నిలుచున్న కాలం.... జీవం.... కాలం....జీవం.... ప్రతిమ.... వ్యక్తం అవ్యక్తం.

3

మైదానంలో బావి.... మనస్సులో బావి.... ఆకర్షకం.... భయంకర ఆకర్షణ....జీవితం....

భీతుడై .... ఆకర్షితుడై బ్రతికాడు.... చల్లటి నీటి అంచున.... బ్రతుకుతున్నాడు, రోజూ పోరాటానికి పోతున్నాడు.... వస్తున్న పువ్వు నాశించి, ముళ్ళతో గుచ్చుకుని .... దినమూ వెళ్ళి వస్తున్నాడు.... దినమూ బావితో భేటి....

కొన్ని మార్లు క్రూరం .... కుళ్ళిన నీరు చల్లగా, ఆకుపచ్చ, నీలంగా మెరుస్తోంది. నిరాశతో కూడిన నవ్వు.... కొన్ని మార్లు రంగురంగుల మబ్బుల కాంతి నీడను... కురూపంలో. సౌందర్యం.... కురూపాన్ని సుందరంగా చేసే సౌందర్యం.... తన ప్రేమలా.... ప్రేమలాగా....

బ్రతుకుతున్నాడు, రోజూ పోరాటానికి వెడుతున్నాడు.... కురూపాన్ని సుందరంగా చేసే సౌందర్యం .... అతని ప్రేమ....

దారిలో బావి....

4

ప్రేమ దేవళం, ప్రేమ విగ్రహం మానవ పూజారి, స్త్రీ చిహ్నం.... ప్రేమే

సౌందర్యం.

బ్రతుకుతున్నాడు, రోజూ పోరాటానికి వెడుతున్నాడు.... పోరాటం.... జీవితంలో కమ్మిన చీకటిలో సౌందర్యపు కాగడా ఆరిపోకుండా వుండటానికి .... భీతుడై, ఆకర్షితుడై.... 'రా' .... 'వెళ్ళు'.

.... దారిలో బావి, మనస్సులో బావి.

వెడుతున్నాడు. వస్తున్నాడు.

జోడు పట్టాల మీద పరిగెడుతున్నది రైలు... నిర్దయ వాస్తవికత.... శాంతి, ప్రేమ, తృప్తి నిలయం వేపు.... ఛక, ఛగ్, ఛక్ ఛక్,ఛక్.... ఆశ.... నిరాశ.... వికర్షణ, ఆకర్షణ.... నిర్దయ వాస్తవికత జోడు పట్టాలు....

జీవించాడు, ప్రేమించాడు, ప్రేమించిన వారి చేత ప్రేమింపబడటానికి ప్రయత్నించాడు.... నిలయం.... ప్రేమకు ప్రేమే ప్రతిఫలం.... త్యాగం.... ప్రేమకు కన్నీళ్ళే ఆహారం.... సుఖానికి దుఃఖమే ఖరీదు.

బ్రతుకుతున్నాడు, ప్రేమిస్తున్నాడు, ప్రేమించిన వారిచేత ప్రేమింపబడటానికి బ్రతుకుతున్నాడు....

5

అందరిలాగా అతను.... గుంపులో గోవిందా.... కోరిక జీవితపు ఊపిరి.... సమాజం సగం వ్యవస్థ.... స్వంతం అనే చక్రానికి చిక్కుకుని తిరుగుతున్న ....తిరిగే చక్రం.... వేగం, ఉగ్రంగా, ఉన్నతంగా తిరగే చక్రం.... చక్రంలో చక్రం...

'ఆశా వరమం దుఃఖం'.... 'నమ్మి చెడినవారు లేరు' ....'అడుగు, లేదనేది లేదు' అడగు.... ఏమీ లేదనడం లేదు.... ఏమి ఇస్తావు....ఏమి.... ఏమి.... దృశ్యహీనం, అర్థం, శూన్యం, ఎంత జటిలమైన జీవితం.... ఆధునిక జీవితంలోని కేకలు.... తర్క శూన్యమైన, హింస పెట్టే కేకలు....

వలచినవారి వలపే బ్రతుకు .... బ్రతుకనే పోరాటానికి అర్థం....

'చెప్పకు పోరాడి ప్రయోజనం లేదని' ... 'బ్రతకాలి, బ్రతికి జయించాలి ' ... 'ప్రయత్నాని కెప్పుడూ ఫలముంది' .... 'సామెతలోనే వుంది వేదం '....! గతాన్ని ఉదహరించే వర్తమానం.... అనంతమైన గతాన్ని ఉదహరించే అనంతమైన వర్తమానం....

బ్రతుకుతున్నాడు.... కోరిక వెంట పడిన పశువు.... ఆహారం, నిద్ర, భయం, మైథునం.... కోరిక వెంటపడిన పశువు.... పేరు, కీర్తి....రహదారి పక్కన కంచె మీది పువ్వు.... కురూపాన్ని సుందరంగా చేసే సౌందర్యం....

కొన్నిమార్లు, వాడకుండా, వాడటానికి వీలు లేని, పాచి కట్టిన నీటి మీద రంగు రంగుల ఆకాశపు పిల్లలు....

6

చల్లగా మెరిసే మందమైన నీరు 'పగలు వెనకే సాయంత్రం వస్తున్నది'....

మెరుస్తున్న నవ్వుతున్న కళ్ళు.... మబ్బు కమ్మింది.... చీకటి చీకటయిన చీకటిని కనే చీకటి....

కఠోర వాస్తవికత జోడు పట్టాల మీద పరిగెడుతున్న రైలు.... నిలయం.... విఫలం....

మైదానంలో భావి....

'దేవుడున్నాడు స్వర్గంలో, బాగున్నది ప్రపంచమంతా'.... 'మామేకం శరణం ప్రజ'....?....?....!!!!....

మైదానంలోని బావి వాడకుండా, వాడటానికి వీల్లేకుండా.... వ్యక్తావ్యక్తం.... చావు నేరు....

'ఇలా ఎందుకు వదిలేశారు ఈ బావిని.... మూయించ లేదెందుకు ?.... హంతకులు.... ఒడిలోనే చావును పెట్టుకుని....

'చావు రావాలి కన్ను తెరిపించడానికి.... మనిషి కన్ను తెరిపించటానికి మనిషి చావాలి'....

'మనిషి చావాలి '.... ఎవరు?

'మృత్యువు ఎవర్ని పిలుస్తోందని ప్రశ్నించకు; నిన్నే పిలుస్తున్నది'...

వెచ్చగా వుందది చల్లటి నీరు.... ప్రేమ కాంతితో మెరిసే కంటి చూపు కన్నా వెచ్చగా వున్నాయి చన్నీళ్ళు.

'మనసిజుని మాయ విధి విలసనం సహాయముతో చంపి విద్యకు నరుడా'.... చన్నీళ్ళు.

....చావాలి; కన్ను తెరిపించాలి....

7

శూన్యం శూన్యాన్ని చేరి శూన్యమయింది.

# 10. ఆఖరి గిరాకి

నిరంజన

ఆ కూడలి వేపు ఎవ్వరూ వెళ్ళటం లేదు. విశాలమయిన బయలు ప్రదేశం మీద నుంచి వీస్తున్న శీతల వాయువు దుర్గంధాన్ని మోసుకొస్తోంది. జనం గుసగుసలు పోతున్నారు. అంతా అస్పష్టం, కలవరం ....

సూర్యుడు పైకొస్తున్న కొద్దీ వేడి ఎక్కువవుతోంది. కూడలిని దాటి వెళ్ళతీరవల్సిన వాళ్ళు భీతితో ఒక్క క్షణం ఎడం వేపు దృష్టి పోనిచ్చి మళ్ళీ తల వంచుకుని చక చక వెళ్ళిపోతున్నారు.

అందరూ చలిస్తూనే వున్నారు....నిలబడే వాళ్ళెవరూ లేరు. నెమ్మదిగా పురసభకి సంగతి తెలుపబడింది.

× × ×

అదొక రోజు ఉదయం కాణి నిద్ర లేచి చూసేసరికి రాత్రి తన పక్కన పడుకున్న తోడు.... ఆ కుర్రాడు కనిపించలేదు. పదహారేళ్ళ ఆ అమ్మాయి పది రోజుల క్రితం కర్నాటక రాజధానికి పారిపోయి వచ్చింది - తమిళనాడులోని ఒక వూరునుంచి. బిక్షమెత్తుకునే ముష్టివాడతను. ఒక చెయ్యి మొండి. కాని ఒక రోజు రాత్రి ఆ మరో చెత్తో ఆమెని దగ్గరికి లాక్కున్నాడు. కంపిస్తున్న హృదయంతో ఆమె అతన్ని చూసింది. బలిష్టమైన అతని చేతిని చూసింది. రెండు చేతుల బలమూ ఆ ఒక్క చేతిలోనే వుందనిపించింది.

అక్కడ్నుంచి ఆ రోజు రాత్రే లేచిపోయారు వాళ్ళు.

ఇల్లుండే దామెకి. చిన్న గుడిసె. పొలం వుండేది వాళ్ళ అమ్మా - నాన్నలకి. సాగుచేస్తున్న కొద్దిపాటి పొలం. ఆ సంవత్సరమే అన్నీ పోయాయి. దేశ ప్రేమికుడైన ఆ జమీందారు ఎక్కువ కౌలు అడిగాడు. ఇవ్వకపోతే కొత్తవాళ్ళకి కౌలు కిచ్చాడు. అలాగే జరిగింది. కాణి తల్లిదండ్రులు పొలం పోగొట్టుకున్నారు. కుండా- బుట్టా చేత బట్టుకుని ఆ సంసారం వలసపోయింది. పెద్దకొడుకు కూలి పని కోసం మద్రాసు వెళ్ళాడు. చిన్నవాడు తగువులాడి దేశాలు పట్టిపోయాడు. తల్లి-దండ్రి మూగ పిల్లని వెంటేసుకుని ఊరురా తిరిగారు.

ఎంత తిరిగినా పనీ-పాట దొరకలేదు. అడుకోవడం అలవాటయ్యాక అదే ఖాయమయిపోయింది.

తల్లిదండ్రుల్ని విడిచి వచ్చినప్పుడు ఆ మూగపిల్లకి కాస్త దుఃఖం కలిగిందని గట్టిగా చెప్పడం మంచిది. ఎందుకంటే ఏదో ఇంటి ముందు, వీధిలో కిటికీ చాటున ఆ రాత్రి తనతో పడుకున్న ఆ మొండి చేతి యువ భిక్షకుడు ఆమె

కిప్పుడాధారం.

నిమిష నిమిషానికీ కూలిపోయే ఆధారం అది. లేచిపోయి వచ్చాక ఆ మహానగరంలో గడిపింది పదే రోజులు. పదకొండో రోజున తెల్లవారేసరికి ఆమె ఒంటరి. ఆసరగా పట్టుకోవడానికి గడ్డిపోచ కూడా లేని లోతు ప్రదేశంలో చేతులు కాళ్ళు కొట్టుకుంటోంది.

ఆ రోజంతా మూగపిల్ల కళ్ళల్లోంచి జలజలా కన్నీరు కారుతూనే వుంది. ఆమె కడుపు పిసుక్కుంటూ కూర్చున్న చోటనే గోడకి తల కొట్టుకుని గొల్లున ఏడ్చింది. అటూ ఇటూ తిరిగింది. అతను దొరకలేదు. ఏ బండెక్కి ఏ వూరికి టికెట్ లేని ప్రయాణికుడై వెళ్ళిపోయాడో!

రైల్వేస్టేషన్ వెనకాల వున్న చెరువుకి వెళ్ళింది కాణి. నీళ్ళల్లో కాళ్ళు పెట్టుక్కూర్చుంది. జాకెట్‌లో దోపుకున్న దువ్వెన తీసి, తలకి చేత్తో నీళ్ళు తాకించి దువ్వుకుంది. అదే చెరువు నీళ్ళని కొద్దిగాతాగింది. అలాగే పాదవునా ఆ కాలి దారిలో నడుస్తూ వెళ్ళింది.

ఆమె అందగత్తె కాదు. పలుచటి ఆకారం కాని వయసు కన్న పుష్టిగా ఎదిగిన వొళ్ళు వొట్టి శరీరం - మాంసం కోరుకునే వాళ్ళకి ఆమె మంచి ఆహారం కాగలదు. నడిచి వెళూతూ వెళూతూ ఆమె ఓ సారి తిరిగి చూసింది. ఎవడో సిగరెట్ తాగుతూ ఆమెను వెంబడిస్తున్నాడు. వీధి దీపాలు వెలిగాయి. ఏదో కొత్త ప్రపంచపు తలుపులు తెరుచుకున్నట్లుగా ఆమె దీపాల వేపు కళ్ళప్పగించి చూసింది. ఓ సైకిల్ ఎదుట వేపు నుంచి ఆమెని దాటుకు పోయింది. ఎక్కడ్నుంచో పోలీస్ ఈల వినిపించింది. ఆమె మరో సారి తిరిగి చూసింది. అతను వస్తూనే వున్నాడు.

ఫుట్‌పాత్ మీదనే ఒక దేవదారు చెట్టు దగ్గర నుంచుందామె. అతనూ దగ్గరగా వచ్చాడు. టిఫెన్ పొట్లాన్ని ఆమె ముందుకి చూపాడతడు. 'ఆ... ఆ' అన్న శబ్దం వెలువడింది, కంఠం నుండి పొట్లం విప్పి అవురావురుమని తినసాగింది. అతను మరో సిగరెట్ వెలిగించాడు.

"ఉదయం నుంచే నిన్ను చూస్తున్నాను" అన్నాడు.

అతని పెదవుల కదలిక వల్లనే ఆమె చాలా మటుకు అర్థం చేసుకుంది. కర్ణభేరి మీద చప్పుడేదో అవుతోంది గాని అర్థం కావడం లేదు.

ఆ క కా క ... ఆఆ ఆ అంటూ ఏదో చెప్పబోయింది. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. చ్చ! చ్చ! అంటూ జాలిపడ్డాడతడు. 'రా' అంటూ సైగ చేశాడు. ఆమె తలవంచుకుని అతన్ని వెంబడించింది. కుక్క నమ్రతగా వెంబడించినట్టు వెంట నడిచింది.

ఏదో ఆశ్రయంలో ఆ రాత్రి తెల్లవారింది.

× × ×

అలాగే నాలుగు రోజులు గడిచాయి. ఆమె నతను సింగారించాడు.

సగం మాటలతో, సగం సైగలతో చెప్పాడు. నేను కొత్త వాళ్ళని తీసుకొస్తాను. నువ్వు వూరికే వుండాలి. నోరు విప్పకూడదు. మూగదానివని తెలియకూడదు వాళ్ళకి.

ఆమె కుంయ్ కుంయ్ మంటోంది. తనని మూగదని పిలుస్తూ అతను సైగలు చేసి చెబుతోంటే చాలా కోపం వస్తోంది. కాని కుంయ్ కుంయ్ మన్న శబ్దంలోనే ఆ కోపాన్ని ఇముడ్చుకొవలసివస్తోంది.

ఎవర్నో తీసుకొచ్చాడతను. సంభావితుల్లా కనిపిస్తున్నారు వాళ్ళు. వాళ్ళ ముందు పళ్ళికిలిస్తూ వినయం ప్రదర్శిస్తున్నాడతను. కుక్క కళ్ళన్నీ ఆహారం మీద వున్నట్టుగా అతని దృష్టి వాళ్ళ జేబుల మీదే వుంది.

వచ్చిన వాళ్ళల్లో ఒకడు ఆమె అంగాగాల్ని ముట్టి నొప్పించ సాగాడు.

ఆమె తట్టుకోలేక "వెవెవె వె" అంటూ ప్రతిఘటించింది. రెండు చేతులతో అతన్ని తోసి వేసింది. గొడవయింది. ఆమె యజమాని ఆమెని కుక్కని కొట్టినట్టు కొట్టాడు. ఆమె ముడుచుకుపోయి ఒక మూల పడింది. వచ్చిన వాళ్ళు మొహం మాడ్చుకుని వెళ్ళిపోయారు.

అర్ధరాత్రి వేళ పడున్నచోటు నుంచి ఆమె నెత్తి చాప మీద పడుకోపెట్టాడు. "నొప్పిగా వుందా ?" అన్నాడు. ఆమె బదులు చెప్పలేదు. కళ్ళు మాత్రం ఏవేవో చెబుతున్నాయి. కాని ఆ అల్పప్రాణికి దాని అర్థం తెలియలేదు.

ఆ రోజు నుంచి కాణీ బాగా మెత్త బడిపోయింది.

అతన్ని ఆమె ప్రేమించలేదు. మొదటిసారి మొండి చేతి మనిషిని ప్రేమించినట్టుగా ఆమె మరెవర్నీ ప్రేమించలేదు.

డబ్బు విలువ కాణీకి తెలియదు. ఎంత వచ్చేదో ఏమో. ఆమెకు మాత్రం రెండు చీరలు, జాకెట్, జంపర్.... రాత్రి బయట కెళ్ళినపుడు వేసుకోవడానికి, చిల్లున్నదైతేనేం గాక ఓ వులన్ కోటు వుండేది. తల్లోకి పూలు. తలకి వాసన నూనె.... కడుపు నిండా తిండి. అలాగే రోజులు గడిచాయి.

అదృష్టవశాత్తు ఆమెకి కడుపు రాలేదు.

కాని ఓ రోజు రాత్రి ఆమెకి గుండెల్లో నొప్పి వచ్చింది. కిందపడి దొర్లింది. విల విల్లాడింది. తన పల్లె గుర్తు వచ్చింది. తన భాష మాట్లాడే జనం గుర్తు వచ్చారు. మొండిచేతి మొదటి జతగాడు గుర్తు వచ్చాడు. ఓహెూ .... ఓ.... ఓ అంటూ గొంతెత్తి ఏడ్చింది. రెండు రాత్రిళ్ళూ అలాగే అయింది. గిరాకీలు

రావడానికి అవకాశమే లేకపోయింది.

మూడో రోజు తెల్లవారు తుండగానే అక్కడున్న తిండి పదార్థాల్ని గుడ్డల్ని మూటగట్టుకుని ఆమె పారిపోయింది. పట్నంలోని మరో మూలకి వెళ్ళింది. దాన్ని కూడా దాటి ముందుకి నడిచింది!

× × ×

అలా దాటి తరువాత ఒక పల్లెకి చేరుకుంది. పొలం దున్నతున్న ఓ జత ఎద్దులు.... రైతులు.... అన్నిటినీ మౌనంగా చూసింది. చెదిరిన జుట్టుని దువ్వుకోవాలనిపించలే దామెకు. అణా పెట్టి కొన్న బుల్లి అద్దంలో తన ప్రతిరూపాన్ని చూసుకోవాలన్న కోరిక కూడా కలుగలేదు. తిండి తినాలనిపించ లేదు కూడా.

వాన చినుకులు పడటం వల్ల చుట్టూ నేలంతా పచ్చగా వుంది. లేత పచ్చికమీద కాణి ఓ చోట కూర్చుంది.

తన బాల్యం నాటి సంగతులు గుర్తు వచ్చాయి. వాడిన మొహంతో అలాగే కూర్చుంది. కాసేపటికి అక్కడే పడి నిద్ర పోయింది.

సాయంత్రం ష్! ష్! ఏయ్, ఏయ్ అంటూ కొంతమంది రైతు స్త్రీలు లేపినప్పుడే ఆమె కళ్ళు తెరచింది.

చీకటవుతుంటే ఆ పల్లె ఆమెని భయపెట్టింది. రొప్పుతూ పట్నం వేపు నడిచింది.

ఓ చివర్న ఒక బడి వుందక్కడ. రాత్రిళ్ళు ఎవరూ వుండరక్కడ. అక్కడే అరుగుమీద ఓ మూల ముడుచుకు పడుకుంది.

× × ×

తెల్లవారుతుండగానే లేచి అక్కడ్నుంచి బయలుదేరిందామె. వెళ్తూ వొంటి మీద గుడ్డ సరి చేసుకుంది. కొద్దిగా సింగారించుకుంది.

అటూ ఇటూ తిరిగి ఆ స్థలం ఎలా వుందో చూసుకుంది. విశాలమైన ప్రదేశమది. చుట్టూరా పచ్చిక. అక్కడే ఆ కూడలి. దాని మధ్యలో ఫౌంటెన్. ఎవరిదో ప్రతిమ. దూరంగా ఒకే ఒక్క పెద్ద భవనం.

మూల కూర్చుని వేరుసెనక్కాయలు అమ్ముతున్న అతనికి తన దగ్గరున్న చిల్లర పైసలిచ్చి, పైసల విలువేమిటో తెలుసుకుందా మూగది.

ఆకలి తీరలేదు.

చీకటి పడ్డాక కూడలి దగ్గరికెళ్ళి ఒక మూల కూర్చుంది. అక్కడున్న ఒకే ఒక్క దీపపు వెలుతురు అక్కడ కొద్దిగా పడుతోంది. అటునుంచి వెళుతున్న వాళ్ళు ఆమె వేపు చూస్తూ వెళుతున్నారు. కొంతమంది ముందుకి వెళ్ళి మళ్ళీ

వెనక్కి తిరగి చూస్తున్నారు.

గంభీరంగా కనిపిస్తున్న ఒకతను కళ్ళజోడు సరిచేసుకుంటూ చుట్టుపక్కల రెండు మూడు సార్లు తిరగాడు. కాణీ లేచి నుంచుని సర్కిల్ నుంచి బయటికి వచ్చి బయలు ప్రదేశం వేపు నడిచింది - ఇక చెట్టు వేపుకి ఒక పొద పక్కకి. ఆ మనిషి వెనుకా ముందు చూస్తూ ఆమె వెంట నడిచాడు.

....మర్నాడు కాయితం ముక్క ఇస్తే భోజనం ,ఫలహారం మాత్రమే కాకుండా చిల్లర డబ్బులు కూడా వెనక్కి వస్తాయని తెలుసుకుంది కాణీ. ఎంత వెనక్కి వస్తుంది, ఏమిటి అన్న తెలివితేటలు లేవామెకి.

ఆవాల్టి నుంచి, పగలు తిరగడం, సాయంత్రం కూడలిలో ఒకటో రెండో పరిచయాలు, దగ్గరగా వున్న పచ్చిక మైదానపు పక్క మీద ఒకసారో రెండుసార్లో చావడం - చచ్చి బ్రతకడం.

బ్రతికి మర్నాడు మళ్ళీ చావడం ....

అలాగే రోజులు దొర్లిపోతున్నాయి.

ఎటువంటి వాళ్ళు తన దగ్గరికి వస్తున్నారో ఆమెకి తెలియదు. తాగుబోతులు,పోకిరీలు, వ్యభిచారులు, షోకిలాలు, జులాయిలు, ఇంట్లోని అసంతృప్తిని పోగొట్టుకోచూసేవారు.... ఆమెకేం తెలియదు. మాటంటూ వచ్చుంటే ఏవైనా అర్థమయ్యేదేమో. మొహం కనిపించినా కొంచెమైనా భావం అర్థమయ్యే అవకాశముండేది, రాత్రిపూట వాళ్ళ మొహాలెక్కడ కనిపిస్తాయి ?

ఇది మానవత్వమా? పాశవికతా ? అదేమీ తెలియదామెకి. ప్రేమ-కామం సంగతి కూడా తెలియదు. చిగురు మీసాలైనా, యువకుడైనా, ముసలివాడైనా ఆమెకంతా సమానమే. శారీరకంగా అలసట కలిగినపుడామె మూలిగేది. నొప్పి కలిగితే గొంతులోంచి వికృతమైన ధ్వనులు వచ్చేవి.

తను మూగది. మూగదాన్నుంచి తృప్తి కోరుకునే వారు మనసులో ఏమి అనుభవాలు కోరుకుంటారన్నది కాణీకి తెలియదు. జరుగుతున్నదంతా యాంత్రిక వ్యవహారం. ఆమె ఒక వూపిరి పీల్చే యంత్రం.

× × ×

వర్షాలెక్కువయ్యాయి. గిరాకీలు లేవు. సంపాదన తగ్గింది. తిండి తగ్గింది. కాణీ కృశించింది. తనే లేచి మనుషులున్న చోటికి వెళ్ళి వారి ఎదుట తిరిగింది.

బుగ్గలు పీక్కుపోయాయి. కళ్ళ కింద నల్లటి చారికలు ఏర్పడ్డాయి. జ్వరం రాసాగింది. తను మరింతగా సింగారించుకుంది.

ఆమె పూలు పెట్టుకుని, వులన్‌కోటు వేసుకుని దూరంగా వయ్యారంగా నడుస్తుంటే సుమారుగా కనిపించేది. కాని దగ్గరగా మొహంలోకి చూస్తే మాత్రం

రెండు కళ్ళలో రెండు పిశాచాలు నృత్యం చేస్తున్నట్టుగా కనిపించేది.

కొంతమంది పోకిరీ గుండాలు ఆమె పడుకున్న చోటికే వచ్చేవారు. కాని ఒక్క పైసా ఇచ్చేవారు కారు. ఆమె దెబ్బలాడేది. కాని ఏమీ ఫలితముండేది కాదు. వాళ్ళ నవ్వులో, వికటాట్టహాసాల్లో....కాణి ప్రతిఘటన విఫలమైనపుడు రొప్పుతూ రోజుతూ వాళ్ళకి లొంగిపోయేది.

జ్వరం ఎక్కువయింది. చెరువులో స్నానం చెయ్యొద్దని ఆమె మనసు చెప్పినట్టయింది.

చర్మానికేదో రోగం తగిలినట్టయింది. యువతి కాణి రోగంతో తీసుకోసాగింది. వొంట్లోంచి ఏదో చెడ్డవాసన వస్తోంది.

కాణి వున్న చోటు మార్చింది. ఒక ఫర్లాంగ్ దూరంలో వున్న పడిపోయిన ఇంటి దగ్గర కెళ్ళింది. అక్కడ ఒక నడివయసు ముష్టివాడు ఆ ప్రదేశాన్ని తన ఇంటిగా చేసుకున్నాడు.

అతనే మూడు రోజులు గంజి పోశాడు.

ఆమె విరిగిన చూరులోంచి ఆకాశం చూస్తూ పడుకుంది.

నాలుగో రోజుకి జ్వరం కాస్త తగ్గినట్టు అనిపించింది. ఆమె లేచి కూర్చుంది. ముష్టివాడు ఆమెకేసి ఆశగా చూడసాగాడు. ఆమె ముఖంలో ఏ రకమైన భావమూ లేదు. ఇలాంటి భావాలన్నిటికీ ఎప్పుడో దూరమైపోయింది. అతనా రోజు బిచ్చమెత్తడానికి వెళ్ళకుండా ఆమెతోనే వుండిపోయాడు. రోగ పీడితమైన అతని దేహం చాలా రోజలుగా లోపలే దాచి వుంచుకున్న కోరికను తీర్చుకో చూసిందా రోజు.

సాయంత్రం కాణి తన నల్లకోటు కప్పుకుని మెల్లిగా నడుస్తూ వెళ్ళి పచ్చిక మైదానాన్ని దాటి చీకటిగా వున్న ఆ మూల నిలబడింది. ఆమెకి కళ్ళు తిరుగుతున్నాయి. వూళ్ళోని పొలం.... తల్లి.... తండ్రి.... మొండి చేతి జతగాడు వీళ్ళంతా కళ్ళ ముందు మెదిలారు. కూలి పనికి మద్రాసు వెళ్ళిన అన్నయ్య, పొట్లాడి ఇల్లు వదిలిన తమ్ముడు - ఎదుట నిల్చి 'కాణీ' అని పల్చినట్టయింది.... హృదయం బాధతో మూలిగింది.

చాలాసేపు నుంచో లేక ఆమె అక్కడే కూలబడింది. దూరంగా వేరు సెనక్కాయలు అమ్ముకునే అతని దగ్గరున్న దీపం రారమ్మని పిలిచినట్లయింది. కాని చిల్లరా లేదు. వేరు సెనక్కాయలు తీసేసుకుని పారిపోడానికి ఒంట్లో శక్తీ లేదు.

ఒక గంట గడిచింది. మరో అరగంటా గడిచింది. ఫౌంటెన్ దగ్గర కూర్చున్న వాళ్ళంతా ఒక్కొక్కరిగా ఇంటివేపు బయలుదేరారు. కాణి ఒక్కొక్కరినే ఆశగా

చూస్తూ కూర్చుంది.

ఆఖరికొకడు దూరంగా నుంచున్నాడు దుక్కలా, రౌడీలా వున్నాడు. చెయ్యి వూపి పిలిచాడు. ఆమె లేచి నుంచుని అతి ప్రయాసతో అతని వేపు నడిచింది.

అతనెవరో కొత్తమనిషి. అక్కడే పొద వెనకాలా ఆమెని కిందకి తోశాడు. 'గొరక' అంది కాణీ.

చికాగ్గా అతను లేచి నుంచుని వేళ్ళు విరుచుకుని 'థూత్' అంటూ ఆమె మీద వుమ్మేశాడు. కాణీ లేచి కూర్చోవడానికి ప్రయత్నించింది. కాని ఆమె శక్తి క్షీణించింది.

అతను మరోసారి 'థూ' అని బయలుదేరాడు.

పైసలివ్వలేదు.

కాణీ ఆర్తనాదం చేస్తున్న దానిలా నోరు తెరిచింది. కాని కంఠం పెగల్లేదు. లేవడానిక మరోసారి ప్రయత్నించింది. సాధ్యం కాలేదు.

అతను త్వరత్వరగా అడుగులేస్తున్నాడు.

ఆఖరికి ఆమె దేహమంతా పైకి లేచింది.

కన్న పసిపాపని లాక్కుపోతున్న పాపిష్టివాడిని తరుముతున్నట్టు పరిగెట్టింది. లబోదిబోమని గోలెట్టింది. "య వ్వ త కా క అ అ" అని అరిచింది.

అతనేమో పైసలివ్వకుండా పారిపోతున్నాడు. ఆమె తన భాషలో అన్యాయం చెయ్యొద్దని వేడుకుంది. రేపటి కూటిని లాక్కోవద్దని మొర పెట్టుకుంటోంది.

అతను గాబరాగా నిలబడి చూశాడు. ఇంకా జనం తిరుగుతున్నారు. వాళ్ళకి వినిపించొచ్చు. ఎవరైనా తన వెంట పడొచ్చు.

ఆ ఆసామి చప్పున వెనక్కి తిరిగాడు. ఆమె మెడ పట్టుకు నులిమి కిందకి తోసి, "కుళ్ళు ముండా" అని తిట్టిపోశాడు. బూటు కాళ్ళతో ఆమె పొట్టమీద తన్నాడు.

కాణీ అలాగే కింద పడి వుంది. ....కంఠంలో ఏదో గుర గుర .... బయటకేమీ వినిపించడం లేదు.

ఊపిరాడుతోంది.... మెల్లిగా ... అతిమెల్లిగా ఆగి --- ఆగి --- నిదానంగా వూపిరి ఆడుతోంది .... ఆఖరిసారిగా ఒకటి .... రెండు సార్లు ....

× × ×

తెల్లవారింది.

....సూర్యుడు పైకి వచ్చే కొద్దీ వేడి ఎక్కువవుతోంది. కూడలిని దాటి తీరి వెళ్ళవలసిన జనం భీతితో ఎడం వేపొకసారి దృష్టి సారించి మళ్ళీ తలవొంచుకుని చక చక నడిచి వెళుతున్నారు. అందరు చలిస్తూనే వున్నారు. నిలబడే

వాళ్ళెవ్వరూ లేరు.

....పురసభ వ్యాన్ వచ్చి శవాన్ని తీసికెళుతుందని ఎవరో అంటున్నారు.

కాణీ దేహం పైన, ఎత్తుగా ఓ రాబందు గిరికీలు కొడుతోంది.

దాన్నే చూస్తున్నట్టుగా కళ్ళు తెరుచుకుని పడుకుంది కాణి.

ఆమె ఆఖరి గిరాకి....

# 11. ఆ ముగ్గురిలో అతనెవరు

వి. సి. రామచంద్రశర్మ

అది వాళ్ళ తప్పు కాదు....

ఆ సాయంత్రమే అలాంటి మోళీ చేస్తోంది. ఎలాంటి వారినైనా రెచ్చగొట్టి తట్టి లేపే మోళీ. శరీరానికి దూరంగా నుంచుని, వెడల్పాటి కళ్ళ కొసల్లో మెరుపు మెరిపిస్తూ లత లాంటి శరీరంతో వెయ్యారాలు ఒలకపోస్తూ వేధిస్తోంది ఆ సాయం సమయం. గద్దలాంటి కళ్ళు రెప్పలు మూసిన వేళ, ఒంట్లో దూరి, రక్తంతో కలిసిపోయి గంతు లేసిందా సాయంత్రం. కనిపించని వేలితో ఊహించలేని చోట్లల్లో కితకితలు పెట్టింది - సిగ్గు వదిలేసిన ఆ సాయంత్రం.

అది వాళ్ళ తప్పు కాదు.

వాళ్ళాడిన మాటలూ అంతే. సాయంత్రం పలికించిన మాటలవి :

"ప్యాంటు, షర్టు విప్పి పారేసి, అల్లాగే వెళదామనిపిస్తోంది!" స్నేహితులిద్దరూ నవ్వారు. ఏమీ అవలేదు. మనసు మాత్రం నెమరేస్తోంది. నగ్నంగా వీధి వెంట నడిచే అనుభవంలోని పులకరింతని....

రాళ్ళు నిండిన దారి అది. ఇరుపక్కలా చేలల్లోని కంకులు తలలూపుతూ అతని మాటల్ని పక్క పొలానికి చేరేశాయి. గట్టిగా నవ్వలేని పైరు 'కిసుక్కు' మంది. సాయంత్రానికీ అతని మాటలు వినిపించాయి. వాళ్ళ ముగ్గురి గుడ్డల్ని పీకేసి గోమరుల్లాగా నడిపించిన సాయంత్రం వెంటనే సిగ్గుపడింది. మొహం వసంతాన్ని పులుముకుంది.

వాళ్ళ అంచనా ప్రకారం వాళ్ళి పాటికి మేలుకోటే దగ్గర వుండాల్సింది. వాళ్ళున్నది బోగాదికి ఒక మైలు అవతల. బోగాది నుంచి మేలుకోటేకి నాలుగు మైళ్ళ నడక. వాళ్ళకది దృష్టిలోనే లేదు. ఆ సాయం సమయపు సౌందర్యం చేసిన ఇంద్రజాలంలో చిక్కుకుని పరవశులయ్యారు.... ఇరవయ్యేళ్ళ ప్రాయానికి మాత్రమే సాధ్యమయ్యే పరవశం అది.

మే నెల సూర్యుడు కాల్చేసిన ఆ నేలకి దాహం వేసింది. గుండెలోని దాహాన్ని మట్టివాసనగా మార్చి ఆకాశం వేపు విసిరింది. నీళ్ళకోసం, జాలి కోసం అంగలార్చింది.

అరవై అడుగుల శరీరాన్ని క్రమక్రమంగా సంకుచితం చేసి ఆకారాన్ని కోల్పోయి ఒట్టి రాతిలా కనిపిస్తున్నాడు గొమ్మటుడు. వీళ్ళు బోగాది వేపు తిరిగినప్పుడు కనిపించకుండా పోయాడు. తూర్పు వేపు నడుస్తున్న వాళ్ళెదుట లేచి నుంచుంది. మేలుకోటె కొండల వరుస. కొండ చరియలో వున్న హెచ్చు కెరె కొలను వెండిలా మెరుస్తోంది...."

"అదే మేలుకోటె. అదే కొండ మీది దేవస్థానం" ఒకడన్నాడు.

"ఇకనేం, వచ్చేసినట్టే" మరొకడన్నాడు. [సంత మైదానం అవతల కల్లంగడి యజమాని గుర్రమెక్కి సంత బజారు దగ్గర కొచ్చేసరికి వీళ్ళూ అక్కడ కొచ్చారు. అతని వ్యాపారం పూర్తయింది. మూడు మైళ్ళ అవతల ఖాళేన హళ్ళికి వెళుతున్నాడు.]

తోవ అడగాల్సిన అవసరమే లేదు. తిన్నగా కనిపిస్తూనే వుంది. అయినా ఒకడడిగాడు.

"మేలుకోటేకి వెళ్ళే దారి ఇదే కదూ గౌడూ ?"

"అవును తమ్ముడూ, మేలుకోటేకి వెళుతున్నారా మీరు ?"

"అవును"

"ఈ వేళలో ....అదీ వర్షమొకటి ముంచుకొచ్చేలా వుందే" ఆశ్చర్యంగా అన్నాడతను.

"మాకేమిటయ్యా భయం మగాళ్ళకి" ఒకతను నవ్వి అన్నాడు. "అయినాను...." గౌడు రాగం తీశాడు. తనకెందుకులే అనుకుంటూ గుర్రం వీపు మీద తట్టాడు.

మధ్యాహ్నం మూడింటికే బయలుదేరి, మే నెలలో పదిమైళ్ళ దూరం నడిచిన దేహాలకి అప్పుడు అలసట తెలుస్తోంది. సంత మైదానంలో పెద్ద పెద్ద వృక్షాలమీద గూళ్ళకి తిరిగి వచ్చిన చిలకలు కిచకిచమంటూ సాయంకాలపు సల్లాపాలు మొదలెట్టాయి. దూరమైన 'హుచ్చుకెరె' వెండిలా మెరవడం మానేసి, నల్లగా బద్ధకంగా పడుకుంది. కొండచాటు నుంచి, శాపంలా, నల్లని రూపంలా, చెప్పకుండా మీద పడ్డ వృద్ధాప్యంలా, లేచి వచ్చిన మబ్బు ఆకాశం పొడుగునా నల్లగా, విశాలంగా అలుముకుంది.

సంత బజారులో తెల్లటి రాతి బండ మీద విశ్రాంతి తీసుకుంటూ కూర్చున్న వాళ్ళకి రంగు మారటం తెలిసినా భయం అనిపించలేదు. మధ్యాహ్నం వాళ్ళు శ్రవణ బెళగొళ వదిలి బయలుదేరినప్పుడు ఆకాశం ముంగిట విచ్చుకున్న ఖాళీ పూల మబ్బులు ఇప్పుడు నల్లటి రంగుకి తిరిగినా బెంగ అనిపించడం లేదు. చుక్కలు మెరవకపోవడమే బాగుందని అనిపించింది. దూరపు మేలుకోటె దేవస్థానపు అగ్రం మణి దీపంలా, సాటిలేని గర్వంతో మెరుస్తోంది.

ఖాసా బంగళాకి మొదటిసారి వెళ్ళిన కుర్రవాడి మైమరుపు వాళ్ళది. మొదటిసారిగా మైసూరు వదిలిపెట్టి నగ్నంగా నుంచున్న ఆ ప్రకృతి అందచందాల్ని చూసి ముగ్ధులైన వాళ్ళ మీద ఆ సాయంత్రం వల విసిరింది. వాళ్ళు పరవశులయ్యారు.

ఇరవైయ్యేళ్ళ యవ్వనానికి మాత్రమే సాధ్యం అయ్యే పరవశం....

కొండ మీద ఆకాశపు టంచున మెరుపు కళ్ళు ఆర్పుతోంది.

"దేవతలు మన ఫోటో తీసుకుంటున్నార్రా! వెలుగు చాలదని ఫ్లాష్ బల్బ్...." ఒకడన్నాడు. మిగతా ఇద్దరూ నవ్వారు.

దుఃఖం నిండిన ఆకాశపు గుండె విచ్చుకుంది. తట్టుకోలేక ప్రేలిపోయిన ఆకాశం అగ్ని బద్దలయితే ఎలా వుంటుందో చూపించింది. తళతళ మెరుపు తెరలు కాళ్లో ముల్లు గుచ్చుకున్న సింహం చేసే గర్జన బండరాళ్ళు దొర్లినట్లు గుడు గుడు మంది.

"లేవండ్రా...." అన్నాడొకడు.

"అయ్యో....ఆడపిల్ల ...." గేలిచేశాడు మరొకడు.

అతని నవ్వు పైకి లేచి ఆకాశపు గుండెని పొడిచింది. కాలిన నేల దాహంతో మట్టి వాసనగా మారి పైకి లేచి నీళ్ళకోసం జాలికోసం అంగలార్చింది.

ఆ కుర్రాళ్ళ నవ్వులాటతో రెచ్చిపోయిన ఆకాశం బొరిపడ్డ సంచి లాగ కురిసింది. నేల తపస్సుకి మెచ్చిన ఉదార హృదయంతో హస్తం జాపి పుష్కలంగా కురిసింది.

× × ×

అది వాళ్ళ తప్పు కాదు....

అరగంట దాకా 'హోరు' న కురిసింది వాన. కురిసిన వాన ఆగింది - చాలా దూరం పరిగెత్తి అలసిపోయిన వాడు కాస్త ఆగి ఊపిరి పీల్చుకున్నట్టు, ఆయాసం తీర్చుకున్నట్టు వాళ్ళు సంత బజా రొదిలిపెట్టి నడువ సాగారు.

మళ్ళీ వచ్చింది వర్షం, వాళ్ళు బయటకి రావడం కోసమే కాచుకున్నట్లు. ఆగిన వర్షం మళ్ళీ మొదలయింది. ఒక్కసారిగా మెరుపు మెరిసి, మంత్రగాడి మంత్ర దండపు మెరుపు వెలుగులా ఫర్లాంగే దూరంలో వున్న పల్లెని వాళ్ళ కళ్ళకి చూపించింది.

సంత బజారులోని నిర్మానుష్యత కన్నా పల్లే నయం అనుకుని వాళ్ళు తడుస్తూనే వచ్చారు. ఉన్న ఒకే రోడ్డు కొసలో దేవాలయపు అరుగుమీద నుంచున్నారు.

"ఎవరయ్యా అక్కడ ?" మనిషి కనిపించకుండా కంఠం మాత్రం వినిపించింది, వీధి పక్కనున్న అరుగు మీంచి లేచి వస్తూ.

కళ్ళు చికిలించుకుని చూసినా మాట్లాడిన వ్యక్తి కనిపించలేదు. నల్లటి దేహం, కప్పుకున్న నల్లటి కంబళి....

"మైసూర్ నుంచి ట్రిప్ వచ్చాం. బెళ గొళ నుంచి మేలుకోటెకి వెళుతుంటే

వర్షం వచ్చింది."

-కంఠం వినిపించిన వేపు చూస్తూ ఒకడన్నాడు. "అక్కడెందుకు నుంచున్నారు? పురుగుపుట్రా.. లోపలికి రండి." వాళ్ళకంతే చాలనిపించింది. పిలిచిందే తడవుగా ఇంట్లోకి వెళ్ళారు.

"పదండి లోపలికి.... ఒసేవ్ మల్లీ!"

"ఫరవాలేదు లెండి. వాన తగ్గగానే వెళ్ళిపోతాం. మీ కెందుకు ఇబ్బంది?" ఒకడన్నాడు మొహమాటంగా. దానికి బదులుగా యజమాని నవ్వాడు. ఆ నవ్వు ఇంటి బయటకొచ్చి పైకి లేచి వురిమి ఆకాశం పొడవునా పాత్రంలా దొర్లింది. అతను నవ్వు ఆపినపుడు ఆవరించిన మౌనం చాకుతో కోసేలా గడ్డ కట్టింది.

ఆ మౌనంలో వాళ్ళకి వినిపించింది నీళ్ళు ప్రవహిస్తున్న హోరు. ప్రాయపు నెత్తుటి లాగా దూసుకొచ్చిన నీరు. ఆ మహా మౌనంలో కురుస్తున్న వాన చప్పుడుతో కలసి ఏకతారలా పల్లెకి జోల పాడుతోంది.

"ఏమిటది ?"

"ఏరు. మా వూరి పక్కనున్న ఏరు చెరువులో కలుస్తుంది. మీరు మేలుకోటకి వెళ్ళాల్సివస్తే దాన్ని దాటి వెళ్ళాలి...."

"మరి ?"

"ఉదయం వెళ్ళండి"

యజమాని నిశ్చయించాడు. వాళ్ళు ఒప్పుకోకతప్పిందీ కాదు.

× × ×

అది వాళ్ళ తప్పు కాదు....

"ఒసేవ్ మల్లీ...."

పద్దెనిమిదేళ్ళ పడుచుపిల్ల పశువుల పాకలోంచి నడవాలోకి వచ్చింది. ఆమె కళ్ళు ఇంకా నుంచునే వున్న ముగ్గుర్ని ఆపాదమస్తకం పరిశీలించాయి.

"దానితో చెప్పు, బియ్యం పడెయ్యమని....వీళ్ళ భోజనాలయ్యేసరికి పైన పడుకుందుకు బొంతలెయ్యి...."

పల్లెటూరి జనం ఔదార్యం వాళ్ళని, వాళ్ళ మనసుల్ని చూరగొంది. పల్లె జనాల మంచితనం పొగడడమంటే పట్నవాసుల్ని తిట్టడం తోనే....

భోజనాలయ్యాక ఇంటి యజమానితో వాళ్ళు కాసేపు లోకాభిరామాయణం మాట్లాడారు. తమ విషయాలన్నీ ఆయనకి తెలిపి, వాళ్ళూరి సంగతులు తెలుసుకున్నారు.

మల్లిని గురించేమీ మాట్లాడలేదు. మాట్లాడ్డం సాధ్యం కాని పని కూడా. మనసులో కుతూహలపు టాలోచనతోనే పైకి వెళ్ళి పడుకున్నారు.

యజమాని బ్రాహ్మణుడు. మల్లి రైతు పిల్ల. యజమానికి పెళ్ళాం వుంది, పిల్లల్లేరు. మల్లి పనిమనిషేమో! లేక....

ఆమె పద్దెనిమిదేళ్ల అందం, లతలా కదాలాడే శరీరం. కళ్ళ అగాధల్లో ఏదో దుఃఖం. అంచులో మాత్రం మెరుపు. నల్లటి మబ్బుల అంచున మెరిసే వెండి చార.

ఆమెకి పెళ్ళి కాలేదా ? లేదా మొగుడొదిలేశాడా ? మొగుడూ, ఇల్లు వుంటే ఇక్కడెందుకు పడుకుంటుంది ?

నడవా వెనక గదిలో యజమాని. నడవాలో ఓ మూలగా మల్లి. మరో మూల పైకి మెట్లు. తాము....

"బాగుంది కదుట్రా.... మల్లి" ఒకడడిగాడు. ముగ్గురి మనసులోనూ ఒకేసారి ఆ ప్రశ్న అడగాలన్న కోరిక....

"పట్నవాసపు అమ్మాయిలు ఈమె ముందు దిగదుడుపే... పడుకుందామా? టైమయింది"

పడుకున్నా చాలా సేపటిదాకా నిద్ర పట్టలేదు. వాన పడుతున్న చప్పుణ్ణి, ఏరు హెూరునీ వింటూ మల్లిని గురించి ఆలోచిస్తూ పడుకున్నారు.... ఇద్దరికి నిద్ర పట్టింది, మూడో అతను మెల్లిగా వాళ్ళని పేర్లు పెట్టి పిలిచాడు. బదులు రాలేదు... అతను మెట్లు దిగి మూల వేపు వెళ్ళాడు....

× × ×

ముగ్గురూ కాస్త అటూ ఇటూగా ఒక్క మాదిరిగానే వున్నారనిపించింది మల్లికి. ఎంత తలక్రిందులైనా వాళ్ళని వేరు వేరుగా గుర్తు పట్టడం అసాధ్యమయిందామెకు. ఎప్పటిలా పడుకోగానే నిద్ర రాలేదు. ఎప్పుడూ అనుభవం కాని దుఃఖం తన్నుకొస్తోంది. బ్రతుకు మట్టిలోంచి లేచిన పుట్టలా ఎత్తుగా పెరిగింది. తనకూ పెళ్ళయింది.... అయింది ఒకప్పుడు....మొగుడు వుండేవాడు. ప్రేమతో పెంచిన తండ్రి. బ్రతుకులో ప్రేమ నిచ్చిన మొగుడూ....

ఇద్దరూ వున్నారు ఆవాల్టి దాకా . ఆ వేళ ? కుడి మోకాలి దగ్గర గురిగింజంత తెల్లమచ్చ ఎవరికంటా పడకుండా చాలా రోజులుగా వున్న ఆ మచ్చ ఆ వేళ భర్త కంట పడింది....తన సుఖాన్ని గద్ద తన్నుకుపోయింది.

కుష్ఠు.... అని మొగుడు ఒదిలేశాడు. మరో పిల్లని మారు మనువు చేసుకుని పొలమూ ఇల్లు అమ్మేసి బెంగుళూర్లో కాపురం, కొట్టు పెట్టుకున్నాడు.

కుష్ఠు.... తండ్రి బెంగతో కృశించి కన్నుమూశాడు. కుష్ఠు .... అందరూ సానుభూతి చూపించేవారు.... కాని ప్రేమ ?

ఈ ఇంటి యజమాని పొలంలో ఏళ్ళ తరబడి పనిచేసిన తండ్రి

కన్నుమూశాడు. ఇంటి యజమాని మంచివాడు, దయగలవాడు. తనని ఇంట్లో వుండనిచ్చాడు. ఇంటి పనుల్లో కొన్ని చేయించారు. అప్యాయంగా చూసుకున్నాడు. కాని ప్రేమ ? మొగుడి వల్ల పెళ్ళానికి దొరికే ప్రేమ ?

ఆమె ఒంటరితనం ఆ వేళ ముల్లులా గుచ్చుతోంది ఆమెని. గుండె ఖాళీ. ఆ ఖాళీని నింపే వారెవరూ లేరు. ఒళ్ళు విచ్చుకుంటున్న దానిమ్మలా వుంది. కోరుకునే చెయ్యే లేదు. పండు ఎరుపు - నేల పాలయిన ప్రేమ. పైకి లేవనెత్తి ముద్దాడి ఆదరించేవారే లేరు.

వర్షంలో తడిసొచ్చిన కుర్రాళ్ళు ఒకే వయసులో వున్న ఒకే రకంగా వున్న ముగ్గురు కుర్రాళ్ళు. వీలయినంత పెరిగి నవ్వుతూ నుంచున్న వయసు. సరియైన ప్రాయం ప్రేమకి. సరియైన వయసు తన లాంటి దాని యవ్వనపు శోభని చవి చూడడానికి.

ఆమెకి నిద్ర రాలేదు. వాన కురుస్తున్న చప్పుడూ, ఏరు చేస్తున్న హెూరూ వింటూ వాళ్ళ గురించి ఆలోచిస్తూ పడుకుంది. మెట్లు దిగుతున్న చప్పుడు... ఎవరో లోపలి కొచ్చారు. కారు చీకటి మధ్య లోకి వెలుగు వెతుక్కుంటూ వచ్చింది.

× × ×

బాగా వర్షం కురిసిన మర్నాడు ఉదయం - అభ్యంగనం చేసి ఎండలో తలారుృకుంటూ నుంచున్న స్త్రీలా వుంది. ఆ ఉదయం అక్కడి నేల....

వాళ్ళకి మెలకువ వచ్చేసరికి తూర్పు బంగారు రంగుతో ప్రకాశిస్తోంది. మొహం కడుక్కుని టిఫిన్ తిన్నారు. ఇంటి యజమానురాలు చెప్పింది.

"ఏరు పక్క పొలంలో వున్నారాయన. మీరు వెళ్ళే త్రోవలోనే వుందా పొలం. అంటూ. "సరేనమ్మా అక్కడే చూస్తాం అయన్ని" అంటూ బయలుదేరారు. మళ్లీ ఇంటి వెనుక తోటలో పుందపుడు. ఏరు వేపు వెళ్ళే కాలిబాట తోట పక్కగానే వెళుతుంది.

అమె సిగ్గు విడిచి వాళ్ళ మొహాల వేపు చూసింది. క్షణంలో ఆమె కళ్ళలో భీతి నిండి కనుగుడ్లు అల్లల్లాడినాయి.

(చిరునవ్వు నవ్వి వాళ్ళు ముందుకి కదిలారు.

ఆమె కళ్ళ అంచున నిలిచిన నీరు, తూర్పు నుంచి ప్రసరించిన బంగారు కిరణాల స్పర్శతో బంగారు ముత్యంలా మెరవడం వాళ్ళు చూడలేదు.)

"ఆ ముగ్గురిలో అతనెవరు ? ఒ....ఎవరు ? ఆ దేవత ఎవరు వాళ్ళలో!" బీటలు వారిన భూమికి వర్షం కురిపించిన దేవుడు! గొడ్రాలి బ్రతుకు బంగారాన్ని పండించిన దేవత! సమాధానం దొరకని మళ్లి గడ్డివాము మీద మొహం వాల్చి ఏడ్చింది.

# 12. చెర

యశవంత చిత్తాల

హొన్నప్పాచారి ఇంటి కెళ్ళి ఓ సాయంత్రానికి మట్టుకు రంపం కావాలని అడిగి తీసుకుని, అలాగే ఏకనాథ శెట్టి కొట్లో ఓ పావు శేరు మేకుల్ని కొనుక్కుని ఇంటికి వచ్చేసరికి చీకటి పడుతోంది. ఇంట్లో ఆ రోజు పితృపక్షం. భోజనం ఆలస్యమయింది. భోజనం కాగానే పురోహితుల నుంచి మంత్రాక్షతలు, ఆశీర్వచనం పొంది, తలనొప్పిగా వుందని గదిలోకి వెళ్ళి మంచం మీద వాలాను. సరిగ్గా అప్పుడే అమ్మ భట్టు (శాస్త్రులు) గారితో నా పెళ్ళి పురాణం విప్పడంతో ఒళ్ళు మండిపోయింది. ఛూత్.... అమ్మకి బుద్ధి లేదు.... ఈ పురోహితులు భట్టుకి వేరే పని లేదు. అనుకుంటూ చప్పున పైకి లేచి బయటకి వెళ్ళే గుడ్డలు వేసుకో సాగాను. అమ్మ "ఎక్కడికి వెళుతున్నావురా" అంది. "పాత ఇంటికి వెళ్ళొస్తానమ్మా" అన్నాను.

"వంటింటి తలుపు తీసుకుని మొన్న ఆవు లోపలికి దూరిందట కదా. ఆ హొన్నప్పాచారికి చెప్పి ఏదో ఏర్పాటు చేస్తానన్నావుట గదా."

"అందుకే బయలుదేరాను. హొన్నప్పాచారికి తీరిక లేదట. నేనే వెళ్ళి ఏమైనా చెయ్యగలనేమో చూస్తాను."

"ఇంత పొద్దుపోయాక ఒక్కడివే వెళతావా ?" అనడాన్ని పూర్తిగా చెవిన వేసుకోకుండానే అరుగు దిగాను. కాని లోగిలి దాటక మునుపే "పోయిన వారం మా పాతింటి పెరట్లో వెదురు పొదల్లోకి పాము వెళుతూ కనిపించిందట భట్టుగారూ" అని అమ్మ కలవరంగా చెప్పటం వినిపించక పోలేదు.

పాతింటి పెరట్లోకి అడుగు పెట్టగానే నా ఎదురుగా కనిపించింది శంకర్రావుగారింటి పనిపిల్ల దేవి. కాంపౌండులో పడిన మామిడి చెట్టు చితుకుల్ని ఏరుతున్న దేవి ఇతని అడుగుల చప్పుడు విని చప్పున తలెత్తి చూసి, ఓ! బర్మ చారి దొర గారు ?" అంటూ కొంటెగా నవ్వింది. నగ్నంగా వున్న రొమ్ముల మీది నుంచి పక్కకి జరిగిన పైటని సర్దుకుంటూ, సిగ్గుపడుతూ, "ఏమిటంత పొద్దుపోయి వచ్చారు దొరా" అంది. వెద్దు వెద్దనుకుంటూనే నగ్నంగా వున్న దేవి రొమ్ములని చూసి కంగారుగా ఆమెని పలుకరించకుండానే గబగబ ఇంటి మెట్లు ఎక్కాడు. బయట అరుగు ఎక్కి, తలుపుకున్న తాళం తియ్యడం కోసం చొక్కా కుడి జేబులోంచి తాళాల గుత్తిని బయటకి తీస్తుంటే ఇంకా అక్కడే వున్న దేవి అరుగు దగ్గరగా వచ్చి "ఏమిటి, పాడు పెట్టిన ఇంట్లోకి అసుర సంజె వేళ ఒక్కరే వెళతారా ? అంది. తన మాట వినిపించుకోకుండా తాళం చెవితో తాళం తియ్యడానికి ప్రయత్నిస్తూ వుండటం చూసి, "శంకరం దొరగారి అమ్మకి ఒంట్లో

బాగో లేద్దిరా. నాలుగు రోజులు ఇంట్లో పడుకోవడానికి రమ్మన్నారు. అన్నానికి రమ్మన్నారు. వాళ్ళింట్లో చేపలు తినరు. మీ ఇంటి వెనకాల అరుగు మీద పొయ్యి వెలిగించుకున్నాను. శంకరం దొరగారే మీ అమ్మకి చెబుతానన్నారు. నేను చెబుదామని వెళ్ళాను నిన్న. మీరు లేరు ." అంది. అతనింకా తన వేపు చూడ్డానికే సందేహిస్తుంటే చూసి ఓ సారి చిన్నగా నవ్వింది. తాళం తీసినా కరుచుకున్న తలుపు గడియ వెంటనే రాలేదు. అతను గడియ తియ్యడానికి ప్రయత్నిస్తుంటే చేతి గాజులు గలగల్లాడిస్తూ "ఇంట్లో ఎంత దుమ్ము పేరుకుందో ఏమో నాకు చెబితే ముందుగా వచ్చి తుడిచి వెళ్ళేదాన్నిగా" అంది. అతను ఆమెని లక్ష్యపెట్టకుండా, లోపలికి వెళ్ళి తన వెనకాలే తలుపు మూసి గడియపెట్టి, మధ్య గదిలోకి వెళ్ళి లోపలి మసక చీకట్లో కనుమరుగయ్యాడు.

ఓ నెల రోజుల క్రిందట చనిపోయిన అతని మేనత్త చావు ఘడియలు చెడ్డవట. మూడు నెలలు ఇల్లు పాడు పెట్టాలని భట్టుగారు చెప్పడంతో ఆ ఇల్లు ఖాళీ చేసేశారు. మూడు నెలల తరువాత శాంతి, రాక్షస హోమం ఇంకా ఏదేదో చేశాకనే ఆ ఇల్లు నివాస యోగ్యమట. నాలుగు సంవత్సరాల క్రిందట అతని తండ్రి చనిపోయిన దినం మంచిది కాదు. కాని ఇల్లు వదిలి పెట్టాలనుకున్నా వీలు కాకపోడంతో శాంతి మాత్రమే చేసి అక్కడే వుండిపోయారు. తండ్రి చనిపోయాక అతని ఒక్కగానొక్క చెల్లెలు అమ్మవారు పోసి చనిపోయింది. ఇల్లు వదలక పోవడమే కారణమని జనం అనుకున్నారు.

అమ్మ, మేనత్త, అతను అందరూ భయపడ్డారు. ఆ కారణం చేతనే ఇప్పుడు మేనత్త చనిపోయిన దినం చెడ్డదని ఇల్లు వదిలి పెట్టాలని భట్టుగారు సలహా చెప్పినపుడు అడ్డు చెప్పలేదు. కొన్ని నెలల క్రిందటే పల్లెలో పోస్టాఫీసు నడపడానికిచ్చిన వాళ్ళ మరో ఇల్లు ఖాళీ అయింది. దాన్నింకా ఎవరికీ అద్దెకి ఇవ్వలేదు. మేనత్త చనిపోయి పన్నెండు రోజులు అవుతుండగానే మరో ఇంటికి మారిపోయారు. వదిలి పెట్టిన ఇల్లు చాలా పాతది కూడా కావడంతో సూతకం గడిచి మూడు నెల్లయినా మళ్ళీ వెంటనే అక్కడికి వెళ్ళ దల్చుకోలేదు. శాంతి, రాక్షస హోమాల తరువాత కూడా ఆ ఇంటిని కాస్త మరమ్మత్తు చేసి ఎవరికైనా అద్దె కివ్వాలనుకున్నారు.

మొన్నటికి మొన్న ఆ ఇంటి వెనకాల వూడిపోతున్నట్లున్న తలుపుని తోసి ఆవు లోపలికి వెళ్ళినట్టు తెలిసింది. మరమ్మత్తు కోసం హొన్నప్పాచారికి కబురు పెడితే ప్రస్తుతం బొత్తిగా ఖాళీ లేదు, ఓ వారం రోజులు తరువాత అయితే వస్తానన్నాడు. అతనలా అన్నా కూడా తనే వెళ్ళి మరమ్మత్తు చెయ్యాలని తనేమీ అనుకోలేదు. మంచం మీద వాలినపుడు అమ్మ, భట్టుగారు

తన పెళ్ళి గురించి చర్చ మొదలుపెట్టి నప్పుడు, ఒళ్ళు మండి అక్కడ్నుంచి లేచి ఎక్కడికైనా వెళ్ళిపోవాలని అనిపించిందే కాని ఫలానా చోటికి వెళ్ళాలను కోలేదు. కాని తల్లి 'ఎక్కడికి బయలుదేరావ్ ?' అన్న క్షణంలో పాత ఇంటికి వెళ్ళాలని అనిపించడం, మళ్ళీ తల్లి వంటింటి తలుపు గురించి గుర్తు చేసినపుడు తలుపు తనే మరమ్మత్తు చెయ్యాలన్న నిర్ణయం తనకి తెలయకుండానే జరిగిపోయింది. మరుక్షణం హొన్నప్పాచారి ఇంటికి వెళ్ళి రంపం తేవాలనీ తోచింది. రంపం తెస్తే నీళ్ళ గదిలో పేర్చిన రీపుల్లో ఒక రీపుని మూడు ముక్కలు చేసి తలుపు బయట నుంచి అడ్డంగా కొడితే హొన్నప్పాచారికి చెయ్యి ఖాళీ అయేదాకా నయినా మళ్ళీ పశువులు లోపలకి వెళ్ళకుండా ఆపచ్చుననిపించింది. కాని ఎక్కడికయినా వెళ్ళిపోవాలన్న ఆలోచన వచ్చాక ఆ పరిస్థితి ఎంత తొందరగా మారిపోయిందంటే, మునుపు ఒకసారి తను ఎప్పటికీ హొన్నప్పాచారి ఇంటికి వొంటరిగా వెళ్ళకూడదని ఒట్టు పెట్టుకున్న మాటే గుర్తు రాలేదు. హొన్నప్పాచారి ఇంటి ముంగిట నుంచున్న తనని అతని పెళ్ళాం వంకర నవ్వు నవ్వుతూ "దొరా, మీరా ?" అని అడిగినప్పుడే, హొన్నప్పాచారి ఈ సమయంలో ఇంట్లో వుండడు అని గుర్తువచ్చింది. అతని పెళ్ళాం "ఈయన రోజూ పొద్దుటే గంగావళికి బయలుదేరి పోతే, మళ్ళీ ఇంటికి రావడం రాత్రయ్యాకనే" అని మరోసారి ఒయ్యారం ఒలకబోసి నప్పుడే ఆ మాట మళ్ళీ గుర్తు వచ్చింది. ఇంటి ముందు కూర్చుని కూతురికి తల దువ్వుతున్న ఆమె "నువ్విప్పుడు ఆడుకోడానికి వెళ్ళవే" అంటూ దాన్ని తరిమేసి ఇతనివేపు తిరిగి "ఏం కావాలో అయ్యగారికి?" అని అడిగినపుడు, థూత్ దీని .... హొన్నప్పాచారి పెళ్ళాం బజారు రకంట. ఊళ్ళో ఒకళ్ళిద్దరు మగాళ్ళని.... థూ థూ థూ .... ఇదంతా తనెలా మర్చిపోయాడో, ఎందుకిక్కడి కొచ్చానో .... అని తిట్టుకుంటున్నాడు. ఒళ్ళు జలదరించింది. బుర్ర తిరిగినట్లు అయింది. తనక్కడకి ఎందుకొచ్చాడో కూడా మర్చిపోయాడు. మౌనంగా నుంచున్న అతన్ని రెట్టిస్తూ హొన్నప్పాచారి పెళ్ళాం "ఏమన్నా కావాలా ?" అని అడిగింది. అబ్బ! దాని కళ్ళు చూడాలి. ఏమీ వద్దు. అని బయలుదేరి వచ్చేసే వాడే, కాని అదృష్టవశాత్తు తను వచ్చిన వుద్దేశం గుర్తువచ్చింది. లేకపోతే హొన్నప్పాచారి పెళ్ళాం ఏమనుకునేదో ఏమో. "రంపం కావాలి, ఇవాళ కాస్త పనుంది" అన్నాడు తడబడుతూ! హొన్నప్పాచారి పెళ్ళాం లోపలికెళ్ళి రంపం తెచ్చిస్తూ, "ఈ మాత్రానికి రావడం ఎందుకు" అన్నట్టుగా చూస్తూ "మీ పాత ఇంటి అరుగు మీద దేవి పొయ్యి రాజేసుకుందటగా! ఏక నాథ శెట్టి కొట్టుకి సరుకులు తేవడానికి వెళితే కనిపించింది. దాని ధైర్యమే ధైర్యం. అలా పాడుపెట్టిన ఇంటి

అరుగుమీద ....” అంటూ చిన్నగా నవ్వింది!

హెూన్నప్పాచారి భార్య దేవిని గురించి మాట్లాడుతూ నవ్విన నవ్వు గుర్తువచ్చింది. పాత ఇంటి పెరట్లోకి వెళ్ళి పుల్లలు ఏరుకుంటున్న దేవిని చూసినప్పుడే నిన్న రాత్రి తను కొట్టునుంచి తిరిగి వచ్చాక అమ్మ చెప్పినట్టుంది. తనలా కొట్టుకి వెళ్ళగానే దేవి వచ్చిందట . వెనక అరుగుమీద పొయ్యి రాజేసుకోవడం, వంటింట్లో దూరిన పశువుని తరిమేసి.... తలుపు మూసి.... అరెరె.... పాడు మరుపు .... చెడ్డ మరుపు.... దేవిని చూడగానే అతనికి తెలియకుండానే అతనికి మొదట వచ్చిన ఆలోచన మారిపోయింది. ఇంటి వెనక్కి వెళ్ళి, నీళ్ళ గదిలోంచి రీపు తెచ్చి, బయటి నుంచి తలుపు కొడితే సరిపోతుందనుకున్నాడు మొదట. కాని ఈ ఆలోచన మారినట్టుగా అతనికి తెలిసింది. పాడుపెట్టిన ఆ ఇంట్లోకి ప్రవేశించి బయట తలుపుకి లోపల్నుంచి గడియపెట్టి, మధ్య గది తలుపు తెరవగానే లోపలి మసక వెలుతురు లోంచి ఫట్ ఫట్ మని రెక్కలు ఎదిలిస్తూ గబ్బిలం తన మీద నుంచి ఎగురుకుంటూ వెళ్ళినపుడూ, మేనత్త చనిపోయిన గది దాటేటప్పుడు గుప్పున కొట్టిన చిత్రమైన వాసనకి కడుపులో బొడ్డు చుట్టు వున్న భాగం గడగడ వణికింది. తొందర తొందరగా నడుస్తూ వంటింటివేపు వెళ్ళాడు. దేవుడి గది మరీ చీకటిగా వుంది. దాటి వెళ్తుంటే ఎలుకో, చిట్టెలుకో కిచ్ కిచ్ అంటూ కాళ్ళ కింద నుంచి పరుగెత్తింది. ఒక్క గెంతు గెంతాడు. వంటగది చేరుకోగానే మనసు కాస్త నిమ్మళించింది. వెనకాల పాతబడిన తలుపు చీలికల్లోంచి కొంత వెలుగు లోపలికి పడుతోంది. గబగబ పడమటి వేపున్న కిటికీ తెరిచాడు. ఇంకాస్త గాలి వెలుతురు లోపలి కొచ్చాయి. అక్కడెక్కడో మూల అటక మీద పెట్టె డబ్బాల్ని పెట్టడానికీ, తియ్యడానికి వాడే స్టూలు వున్నట్టు గుర్తువచ్చింది. మసక వెలుతురులోనే వెతికి తెచ్చి దాని మీద కూర్చున్నాడు.

మేనత్త చనిపోయిన సమయం మంచిది కాదని పాడుపెట్టిన పాత ఇల్లు. మూడు పొద్దుల వేళ కమ్ముకున్న చీకటి, రోజుల తరబడి తలుపులు మూసి వుండడంవల్ల లోపల నిలవ కంపు. అడుగు పెట్టిన చోటల్లా దుమ్ము. తన పరిస్థితి ఇప్పుడే అర్థమైనట్టుగా అయి, స్టూలు మీద, కూర్చున్న చోటనే వణికిపోయాడు. ఇదంతా ఆ పాడు దేవి వల్లనే. వెనకా ముందూ లేని పిల్ల. తటాల్న లోగిట్లో కనిపించి పలుకరించి, పై బట్ట లేకుండా రొమ్ముల్ని చూపించిన దేవికి భయపడే కదూ తనిక్కడ కొచ్చి చిక్కుకుపోయింది! ఆ వయ్యారపు అడది హెూన్నప్పాచారి పెళ్ళాం, దేవి గురించి మాట్లాడుతూ అలా చిరునవ్వు నవ్వకుండా వున్నట్లయితే ఇదంతా జరక్కపోయేదేమో. శ్రాద్ధపు భోజనం

అవగానే అమ్మ - భట్టుగారు తన పెళ్ళి గురించి మాట్లాడకుండా వుంటే తను బైటకి వెళ్ళాలనుకునే వాడు కూడా కాదు. లేదా, ఇవాళ ఇంట్లో పితృ పక్షం లేనట్టయితే తను హాయిగా కొట్లో కూర్చుని వుండే వాడేమో. అమ్మ మీద, భట్టుగారి మీద, ఆ రోజు మధ్యాహ్నమే పిండాలు స్వీకరించిన పితృదేవతల మీద అతనికి కోపం ముంచుకొచ్చింది. ఈ అమ్మకయితే తన పెళ్ళి గురించి మాట్లాడ్డానికి వేళా-పాళా లేదు. రోజంతా నల్ల నువ్వులు, దర్భలు, పిండం, సవ్యం, అపసవ్యం గొడవల మధ్యలో బుర్ర పగిలిపోతుంటే అప్పుడు మొదలెడుతుంది. వీడికేమన్నా వయసు తక్కువయిందా భట్టుగారూ, వీడి ఈడు వాళ్ళందరికీ పెళ్ళిళ్ళయి ఇద్దరిద్దరు పిల్లలు పుట్టుకొచ్చారు. అదిగో నప్పుడల్లా నేను బ్రహ్మచారిగానే వుంటాను, నాకు పెళ్ళే వద్దు అంటాడు. మొదట్లో ఏదో అంటున్నాడులే అని అనుకున్నాం. ఆ స్వామి ఈ స్వామి అంటూ ఎవరెవరి పుస్తకాలో చదువుతాడు. రోజూ సూర్య నమస్కారాలు చేస్తాడు. ఆసనాలు వేస్తాడు. వీడి పిచ్చిని పోగొట్టే పిల్ల ఎక్కడుందో గాని. ..కోడల్ని చూడాలి, మనవణ్ణి చూడాలి అని కలవరిస్తూనే ఆయన కన్ను మూశారు. అలాంటి కోరికే పెట్టుకున్న మేనత్తా పోయింది. వీడు పెళ్ళి చేసుకోకపోతే మా వంశం పెరిగేదెలా? మాకు వేరే పిల్లలున్నారా ఏమన్నానా ?" అమ్మ కంఠంలో ఏడుపు తొంగి చూస్తోంది. ఆ మాటలు వినే పైకి లేచాడు. అలా లేచినందువల్ల ఇదంతా జరుగుతుందని ఎవరు కలగన్నారు? చీకటి పడే వేళకు ఈ పాడుబడ్డ కొంపలో చిక్కడిపోయానే! ఇప్పటి కిప్పుడు ఇక్కణ్నుంచి వెళ్ళిపోతే ఎలా వుంటుంది ? రేపు హొన్నప్పాచారికి తీరిక దొరికినప్పుడే మరమ్మత్తు చేయిస్తే సరిపోతుంది. తను చెయ్యగలిగే పనేనా ఇది ? అనుకున్నాడు. మరుక్షణమే అంతకు ముందే అతనిలో మేలుకున్న స్వాభిమానం అడ్డు వచ్చింది. ఇంతవరకూ ఎలాగూ వచ్చాను. అంత కష్టపడి హొన్నప్పాచారి ఇంట్లో లేని వేళ అతని భార్యని పలుకరించి రంపం తేవడం అయింది. దేవి, పాడు పెట్టిన ఇల్లు అని గుర్తు చేస్తున్నా లక్ష్యపెట్టకుండా లోపలికి రావడమూ అయింది. తెచ్చిన రంపం పుట్టినే వెనక్కి తీసికెళుతున్నాడని దేవి చూస్తే తనకి భయపడే తిరిగి వెళ్ళానని అనుకోదూ? ఇంతకీ ఇంటి కెళ్ళాక అమ్మకేం చెప్పాలి ? రేపు రంపం ఎందుకు తీసికెళ్ళారని హొనప్పాచారి అడిగితే ఏం చెప్పాలి ? తలుపుకి చెక్క బిగిద్దామని వెళ్ళాను, కాని అక్కడున్న దేవికి భయపడి వచ్చేశానని చెప్పగలడా? ఊహు (, ఏమయినా సరే తలుపుకి అడ్డచెక్క బిగించి గాని వెళ్ళ కూడదు అంతే. మొదట బయట నుంచి బిగించాలనుకున్న చెక్క ఇప్పుడు లోపల్నుంచి కొడితే సరి. వెనకాల అరుగు మీద పొయ్యి రాజేసి కూర్చున్న దేవి

కళ్ళు బడదం కూడా తప్పుతుంది అనుకున్నాడు. అలా అనుకోగానే లోపలి భయం ఆ క్షణంలో కాస్త తగ్గినట్టయింది. వెనకాల అరుగు మీద అడుగుల చప్పుడు, గాజుల గలగల దేవి అక్కడికి వచ్చి ఉండాలని పించింది. మరుక్షణం కొత్త పేచీ ఒకటి వచ్చి పడింది. అరెరె! తన కేమిటయిందీ వేళ ? తలుపుకి పట్టీ కొట్టడానికి రీపు తేవాలంటే నీళ్ళ గదిలోకి వెళ్ళాలి. నీళ్ళ గది వున్నది వెనకాల అరుగు మీద కుడివేపుకి. మొత్తం మీద దేవి కళ్ళుపడక తప్పేలా లేదు. ఛత్, ఇక్కడికి రావాలని ఎందుకు అనుకున్నానే! హాయిగా రెండు గంటలు కొట్టు తెరచి కూర్చున్నా పోయేది. ఇప్పుడైనా వెళ్ళొచ్చు. తాళం చెవుల గుత్తి జేబులోనే వుంది. అయితే రంపాన్ని ఏం చెయ్యాలి ? దీన్ని మోసుకుని కొట్టు కెళ్ళడమా ? ఛత్, ఇంతకీ అదృష్టం బాగుంది. స్టూల్ మీద నుంచి లేచి, వంటింట్లో కట్టెలు పెట్టుకునే మూల వెతికాడు. అక్కడొక లావుగా వున్న చెక్కముక్క దొరికింది. 'ఆహా', అనుకున్నాడు. దీన్నే రంపంతో చీల్చి మూడు ముక్కలు చెయ్యవచ్చు అనిపించింది. ఆ ఆలోచన రావడమే ఆలస్యం, ఎక్కడ్లేని ఉత్సాహంతో పలకని రంపంతో కొయ్యసాగాడు. గదిలోని మసక వెలుతురులో పలక మందం, పొడుగు కొలతలు స్పర్శకి తెలిశాయి గాని కర్రజాతి తెలీలేదు. ఎప్పుడో ఓ సారి గణపతికి పీట చేయించాలని తెచ్చిన చెక్క అది. హెబ్బనప్పాచారి చాలా రోజులుగా వాడకుండా మొండి బారిన రంపానికి సులువుగా తెగటం లేదు. అయితేనేం? తలుపుకి అడ్డ పట్టీలు కొట్టి గాని కదలకూడదను కున్నాక పని జరగాలి కదా. ఈ విషయంలో అతని మనసులోని కసి, రంపపు మొండి పళ్ళచక్రాల కింద పలక చేస్తున్న కర్కశమైన ధ్వనిలో, ఒంటికి పడుతున్న చమటలో, అర చేతుల్లో లేస్తున్న బొబ్బల్లో వ్యక్తమవుతోంది. బయటనుంచి దేవి ఏదో అన్నట్టుంది. అయితే రంపపు మోతలో సరిగ్గా వినిపించలేదు. వినే ఓపికా లేదు. ఆఖరికి చెక్కని ముక్కలు చెయ్యడంలో సఫలీకృతుడై 'ఉస్సప్పా' అన్నాడు. అయితే ఆ మూలుగులో తనకి కలిగిన అలసట గురించిన ఆలోచనే వున్నట్టు లేదు. ఒంటి మీద ధారగా దిగుతున్న చమట గురించి కూడా అతనికి తెలిసేది కాదేమో. దాన్ని తుడుచుకునే ఓపిక కూడా లేనివాడిలాగ కోసి సిద్ధంగా వున్న చెక్క ముక్కల్లో ఒక దాన్ని తలుపు మీద అడ్డంగా వుంచి మేకు కొట్టడానికి ప్రయత్నించినపుడు, చెక్క పట్టుకోవడానికి ఎవరైనా వుంటే బాగుండు ననిపించింది. సరిగ్గా బయట దేవి దగ్గుతున్న చప్పుడు గాజుల గలగల వినిపించింది. పాడుపిల్ల ఇంకా ఇక్కడే వున్నట్టుంది. విరిగిన తలుపు సందులోంచి చూట్టం లేదు కదా! సిగ్గులేని పిల్ల! ఎవరైనా చూస్తే! ("దీపం పెట్టేవేళ, ఇలా పాడు పెట్టిన ఇంట్లో కూర్చుని ఏం చేస్తున్నారో,

ఈ బర్మచారి ధైర్యమే ధైర్యం" దేవి మాటలు వినిపించి అతనికి కోపం రావడానికి బదులు విలక్షణమైన భయంతో వణికిపోయాడు. తనింకా పాడుపెట్టిన ఇంట్లో వున్నానన్న సంగతి అప్పుడే గుర్తొచ్చినట్లయింది. మళ్ళీ బయట గాజుల గలగల. కాని ఇప్పుడు దేవి అక్కడే వుందన్న విషయం కాస్త ధైర్యాన్నిచ్చింది. తలుపు బయటే అవనీ గాక, మరో మానవప్రాణి దగ్గరగా వుందన్న భావన అతనికి నెమ్మది కలిగించింది. చెక్కని అడ్డంగా పట్టుకుని ఒక కొసన మేకు కొట్టసాగాడు. "ఏమిటో, హెూన్నప్పాచారి పని ఈ దొరే చేసేలా వున్నాడు. తలుపుకి మేకు కొట్టాలనుకుంటే బయట్నుంచి కొట్టకూడదూ ? ఇలా చీకటి పొద్దులో పాడుపెట్టిన ఇంట్లోకి వెళ్ళాలా ?" దేవి గొణుక్కుంటోంది. మేకు కొట్టే చప్పుడు విని, పక్కింటి శంకర్రావు గారి అరుగు మీద నుంచి వాళ్ళ వంటావిడ, మనిషెత్తు కంచె అవతల్నుంచి పెద్ద గొంతుతో "అదెవరే దేవీ, పాడుపెట్టిన ఇంట్లోంచి మేకు కొడుతున్న చప్పుడూ ?" అనడిగింది.

"బర్మచారి దొర వచ్చారు. మొన్న తలుపు విరిచి ఆవు లోపలికి దూరిందే, దాన్ని సరిచెయ్యడానికి వచ్చుండాలి" అంటూ దేవి నిష్కారణంగా "ఖోక్" అని నవ్వింది. దేవి అధిక ప్రసంగంతో అతనికి కోపం రాకపోలేదు. ఆమె కొంచెం కూడా మొహమాటం లేకుండా తనని 'బర్మచారిదొరా' అనడం అతనికి బొత్తిగా నచ్చలేదు. అలాగని ఆమెని ప్రతిఘటించే ధైర్యమూ ఇంతవరకూ అతనికి రాలేదు. ఏమైనా దేవి సిగ్గులేని పిల్ల. ఆమె వాచాలతకి అవకాశమిచ్చేలాంటి సిగ్గులేని పని అతనెందుకు చేస్తాడు ? మొన్న మొన్న జరిగిన సంగతి. ఈ ఇల్లు వదిలి పెట్టడానికి ఒకటి రెండు నెలల ముందు జరిగింది. నీళ్ళగదిలో గుండిగ నింపడం కోసం బావికి వెళ్ళాడు. దేవి బావి దగ్గర రాతి మీద నానబెట్టిన గుడ్డల్ని కాళ్ళతో తొక్కుతోంది. తడవకుండా వుండడానికని చీరెని మోకాళ్ళ మీదకి ఎగ గట్టి కచ్చబోసింది. దేవినా వేషంలో అంతకు మునుపెన్నడూ చూడలేదు. మృదువుగా , నిండుగా వున్న నగ్నమైన ఆమె తొడలని ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయాడు. ఏమిటలా చూస్తున్నారు ? అని దేవి అడిగినప్పుడే అతనికి తను చేస్తున్న పొరబాటు అర్థమయింది. దేవి ప్రశ్నకి శంకర్రావుగారి వంటింట్లోంచి ఎవరో గట్టిగా "దేవీ ఎవరితో మాట్లాడుతున్నావే ?" అని అడిగారు. "దేవి బర్మచారి దొర గారు" అని అంటూండగానే తను "చెప్పొద్దు సుమా" అనేలా తన పెదవుల మీద తనే చేతులుంచుకోగానే దేవి "ఖోక్" అని నవ్వింది. దేవి ఎప్పుడూ అంతే వెనుకా, ముందూ చూసుకోదు. ఇప్పుడే కాదు, చిన్నప్పట్నుంచీ ఆమె నతడెరుగును. శంకర్రావు గారింట్లోనే పెరిగి పెద్దదయింది కదూ తను. ఇప్పుడిక యవ్వనంతో మిసమిసలాడుతోంది.

శంకర్రావుగారే వెనుకోసారి తనని తిడుతూ అన్నారు కూడా, రెండేళ్ళ క్రితమే పెళ్ళయిందామెకి. కాని పెళ్ళయిన కొత్తలోనే మొగుడు ఒదిలి పారిపోయాడు. ఎక్కడికో, ఎందుకో ఎవరికీ తెలియలేదు. సైన్యంలో చేరాడని మొన్న ఎవరో కబురు తెచ్చారు. సైన్యంలో చేరినా శ్మశానానికి వెళ్ళినా తన కేంటి ? దీని మీద వచ్చిన కోపం మేకుల మీద పడుతున్న దెబ్బల్లో బాగా వ్యక్తమవుతోంది. "బాగానే వుంది. ఇలా మేకులు కొడితే రేపు తలుపు తియ్యడాని క్కూడా కుదరదు," అని దేవి అంటున్న మాటలు విన్నాక మరో రెండు మేకులు ఎక్కువగానే చెక్కకి చేరాయి.

తరువాత కాసేపు, ఒక్కొక్కటే చెక్కని అడ్డంగా పట్టుకుని మేకులు కొట్టి జాగర్తగా అమరుస్తుండగా తలుపు బయటనుంచి ఏదేదో గొణుగుతూ మాట్లాడుకుంటున్న దేవి మీద వచ్చిన కోపం, ఇలాంటి అపవేళలో ఇల్లు వదిలి వచ్చేలా చేసిన హెూన్నప్పాచారి పెళ్ళాం మీద వచ్చిన కోపం దీనికంతా మూల కారకులైన అమ్మ, పురోహితుడు భట్టు, చనిపోయిన పితృదేవతలు వీరి మీద వచ్చిన కోపం, ఇవన్నీ కలిసి ఏక నాథ శెట్టి కొట్లోంచి తెచ్చిన పావుసేరు మేకుల్ని తలుపుకి కొట్టిన చెక్కలలో చేర్చింది.

ఆఖరికి మేకులు కొట్టే పని పూర్తయి 'ఉస్సప్పా' అంటూ మేకులు కొట్టే పనికి తీసుకున్న రాతిని కింద పెడుతుంటే ఇంట్లో చీకటి ఒక్కసారిగా పెరిగిన సంగతి గుర్తించి, వెన్నెముకలోంచి చలి వచ్చినట్టయి వణికిపోయాడు. గడియ తీసుకుని లోపలికి వచ్చి, విరిగిన తలుపుల్ని సరిగ్గా పెట్టి చెక్క బిగించనప్పుడున్న ధైర్యం, పని పూర్తి చేసి తలుపుల్ని భద్రం చెయ్యగానే దిగిపోయింది. ఏదో ఆవేశంలో కలిగిన ధైర్యం, కోపం, తన ధ్యేయం నేరవేరాక అవ్యక్తమైన భీతికి చోటిచ్చింది. పాడుపెట్టిన ఇంట్లోకి వెళ్ళడానికి బెదరని మనిషి, లోపలి పని పూర్తయి, ఇక తను బయటకి వెళ్ళాలన్న ఆలోచనతో బెదిరిపోయాడు. చీకటి గుయ్యారంలా వున్న గది, మేనత్త మరణించిన గది, వీటన్నిటినీ దాటుకుని, లోపలి వసారా, బయట అరుగు, వీటన్నిటినీ దాటి ఎలా బయటకెళ్ళాలి ? ఏదో ఆవేశంతో వంటింటి దాకా వచ్చేశాడు గాని, ఇప్పుడు తను వెనక్కి వెళ్ళాల్సిన త్రోవ ఒక్కసారిగా దూరం పెరిగినట్టుగా అనిపించి ఆందోళన పడుతున్నాడు. దేవుడి గది దాటేటప్పుడు అప్పటిలాగ ఎలుకో, మరొకటో కాళ్ళ కింద నుంచి పరిగెడితే (పెరట్లో వెదురు పొదల్లో పాము దూరిందట భట్టుగారూ) ఆ తరువాత గది దాటితే మేనత్తే కళ్ళ ముందు కనిపిస్తే, పెళ్ళయిన రెండేళ్ళకే మొగుణ్ణి పోగొట్టుకుని బోడెమ్మగా మారిన మేనత్త పిల్లా-పాప లేకుండా తన జీవితమంతా తమ్ముడింట్లోనే గడిపి ముసలితనంలో సంధి వాత

రోగంతో నెలల తరబడి మంచం పట్టి తీసుకుతీసుకు చచ్చిపోయింది. ఆ అసంతృప్తురాలైన ముసలిప్రాణం, చనిపోయిన వేళ కూడా మంచిది కాదని వదిలిపెట్టిన ఇల్లు - వంటింట్లో వున్న చోటనే ముచ్చెమటలు పోస్తున్నాయి అతనికి.

"తలుపులు మేకులు కొట్టాక కూడా ఈ దొర లోపలొక్కడే ఏం చేస్తున్నాడబ్బా" మేకులు కొట్టి గట్టి చేసిన తలుపుని తోసి చూసినట్టుంది దేవి. పిడికిలితో టకటక మని కొట్టినట్టు వినిపించింది. ఒక్కసారిగా తేరుకుని చమట పట్టిన మెడని చొక్కా కొసతో తుడుచుకున్నాడు. రంపాన్ని గట్టిగా చేత్తో పట్టుకున్నాడు. మెల్లిగా అడుగులు వేస్తూ దేవుడి గది దాక చేరుకున్నారు. 'ఔక' అన్నాడు. భయంతో గట్టిగా అరవకుండా వుండడానికి కుడి చేత్తో గట్టిగా నోరు నొక్కుకున్నాడు. దేవుడి గది దాటి వెళ్ళే గడప మీద ఇతని వేపు వీపు పెట్టి కూర్చుంది. ఒక పెద్ద కోతి లాంటి ఆకారం. కోతేనా అది ? కాదు కాదు, చనిపోయిన మేనత్త. అతని మేనత్త మంచం మీద పడుకుని పడుకుని విసుగెత్తినపుడు బయటి ప్రపంచం చూడ్డం కోసం ఇలాగే అక్కడ గడప ముందు కూర్చుని ముడుచుకుని వుండేది. బోడి గుండు మీద ముసుగు వేసుకుని.... అవునవును మేనత్తే!

తన అడుగుల చప్పుడు వినడం వల్లనే ఏమో దారికడ్డంగా కూర్చున్న ఆ ప్రాణి ఒక్కసారిగా వెనక్కి తిరిగి ఇతని వేపు చూసి 'ఔక' అంది. ఓ! అవును, ఇది కొండముచ్చు. ఇంత సాయంత్రం వేళ ఈ పాడుబడ్డింట్లోకి కొండముచ్చు ఎలా వచ్చిందో. తనని ఎందుకిలా అడ్డగిస్తోందో. లేని ధైర్యం తెచ్చుకుంటూ భయపడుతూనే "హెత్" అన్నాడు. దాన్ని తరమడం కోసమన్నట్టుగా. అది కూర్చున్న చోటి నుంచి కదల్లేదు. మరో సారి 'ఖిన్' మని పళ్ళు కిలించిందంతే. అతని గుండె ఝల్లుమంది. చీకటి వేళ పాడుబడ్డ ఇల్లు. దేవుడి గది నుంచి ముందు కెళ్ళే దారిలో తనని అడ్డగిస్తూ ఎక్కడ్నుంచో వచ్చిన ఈ కొండ ముచ్చు కూర్చుంది. తనలాగే ఏదో ఎదురుచూడని కారణంతో ఈ ఇంట్లో కొచ్చి చిక్కుకుంది. ఇంకా భయపెట్టడానికి ప్రయత్నిస్తే మొదటే బెదిరిన కోతి మరింత కంగారుతో తన మీదకే దూకవచ్చు. కోతి గోరు తగిలితే పిచ్చి పడుతుందట. గోకర్ణం అప్పణ్ణ భట్టు గారబ్బాయికి అలాగేనట పిచ్చి పట్టింది. ఆత్రంగా వెనక్కి నడుస్తూ వంటిల్లు చేరుకున్నాడు. వెంటనే గబగబ దేవుడింటికీ వంటింటికీ మధ్యనున్న తలుపు మూశాడు. గడియ పెడదామని అనుకుంటే దానికి గడియ లేనే లేదు. ( పాత కొంప - పాడు తలుపులు) తన శరీరమంతా చమట పట్టిందని తెలుసుకోగానే అతను మరింతగా

బెదిరిపోయాడు. పొద్దు గడిచే కొద్దీ అక్కడ కూర్చున్న కొండ ముచ్చు బృహదాకారం దాలుస్తున్నట్టుగా అనిపించసాగింది. సరిగ్గా అప్పుడే కొండ ముచ్చు 'వెక' అని చప్పుడు చేసింది. గుండె గుభిల్లుమంది అతనికి. కిటికీ దగ్గరికి పరిగెత్తాడు. కిటికీ బయట పనస చెట్టు కింద ఇతని వేపు వీపు పెట్టుక్కూర్చుని దేవి ఏదో పని చేసుకుంటోంది. ఇతను వెనుక ముందు ఆలోచించకుండా 'దేవి' అని పిలిచాడు. అలా పిలిచాకనే ఆమె దేవి అన్న సంగతి గుర్తు వచ్చినట్లయి ఆమె దృష్టి నుంచి తప్పించుకోవడాని కన్నట్టుగా తల వంచుకున్నాడు. తను చేసిన ఈ పనికి సిగ్గేసింది. కాని దేవిని పిల్చి ఏం చెప్పాలి. ముందు గదిలో కొండముచ్చు కూర్చుంది. దానికి భయపడి నేనిక్కడ వుండిపోయాను." అని చెప్పగలడా! అనుకుని తన పనిని సమర్థించుకున్నాడు. కిటికీ దగ్గర్నుంచి పరిగెడుతూ వచ్చి తను మేకులు కొట్టి భద్రం చేసిన తలుపు దగ్గరున్న స్టూలు మీద కూర్చున్నాడు. తను పిలవడం దేవి నిజంగా విని వుంటే తను ఆమెని పిల్చి తల వంచుకోవడం చూసి వుంటే? లేదు, లేదు, విని వుండదు. అయినా స్టూలు మీంచి లేచి వెళ్ళి కిటికీ దగ్గర గోడ కడ్డుగా నుంచుని కిటికీ తలుపులు దగ్గరికి లాగాడు. గదిలో చీకటి ఒక్కసారిగా ఎక్కువయింది. అలాగే అతనిలో పెరిగిన భయం కూడా. ముందు గుమ్మం వేపు వెళదామంటే కొండముచ్చు అడ్డంగా వుంది. అది కాకపోతే ఇంక ఒకటే దారి. ఇప్పటి దాకా కష్టపడి చెమటలు కార్చి కొట్టి కొట్టి గట్టిగా భద్రపరిచిన తలుపుల్ని తెరవడం. కాని అప్పుడేదో కోపావేశంలో తలుపులకి బలంగా కొట్టేసిన మేకుల్ని తియ్యడం మాటలు కాదు. అలాగ తియ్యగలిగే సాధనమేదీ తన చేతిలో లేదు. మిగిలింది ఒకటే దారి. రెండు తలుపులూ ఒకటి కొకటి చేరుకున్న భాగంలో చెక్కని రంపంతో కొయ్యటమే. అలాగే కోయ్యసాగాడు. అలా కోస్తుంటే వెనక ఇంట్లోంచి శంకర్రావుగారు వాళ్ళావిడతో కాబోలు అంటున్నారు. "పాడు పెట్టిన ఇంట్లోకి కోతి వెళ్ళినట్లుంది. నేనటువస్తుంటే కటకటాలమీంచి ఎక్కి పై కప్పు సందులోంచి బయటకొస్తూ కనిపించింది." 'ఓహో అయితే నేను చూసింది కోతినే అన్నమాట. మేనత్త భూతం కాదన్నమాట. అవును నిజమే తను మేకులు కొడుతున్నప్పుడు "ఈ కోతుల కేమొచ్చిందో మాయరోగం ఇంటి కప్పు మీదెక్కి గొడవ చేస్తున్నాయి" అని దేవి అనడం ఇప్పుడు గుర్తొచ్చింది. ఇంట్లోకి వచ్చేటప్పుడు అరుగు పై కప్పు మీద కొబ్బరికాయో ఏదో పడి పెంకు తెగిరిపోయి కంత ఏర్పడ్డం చూసినదీ గుర్తొచ్చింది. ఇంటి మీద ఆడుతున్న కోతి పొరబాటున ఆ సందులోంచి లోపలికి పడిపోయివుండాలి. ఓహ్ వుట్టినే భయపడ్డానే, అనుకుంటూండగానే తలుపుకి

కొట్టిన మూడు చెక్కలూ ముక్కలయ్యాయి భద్రంగా మూసుకున్న తలుపులు మెల్లిగా తెరుచుకున్నాయి. చల్లటి స్వచ్ఛమైన గాలి తెర లోపలికి వచ్చింది. దాని వెనకాలే దేవి కూడా వచ్చింది. ''అప్పుడే మీరు కిటికీలోంచి పిలిచినప్పుడే నాకు తెలుసు దొరా'' అంటూ వెనకాలే తలుపులు మూసింది.

# 13. అణ్ణయ్య మానవ శాస్త్రం

డా. ఎ.కె. రామానుజన్

అతనికి ఆశ్చర్యంగా, చాలా ఆశ్చర్యంగా వుంది.

ఈ అమెరికా మానవశాస్త్రవేత్త ఈఫర్గూసన్ వున్నాడే, ఇతను మనుధర్మశాస్త్రం చదివాడు. ఇతనికి మన సూతకాల సంగతి ఎంత బాగా తెలుసు! తను బ్రాహ్మణుడై వుండి కూడా తనకివేమీ తెలియవు.

ఆత్మజ్ఞానం సంపాదించాలంటే అమెరికాకి రావాలన్నమాట. మహాత్ముడు జైల్లో కూర్చుని కటకటాలు లెక్కపెడుతూ ఆత్మచరిత్ర రాసినట్లుగా, నెహ్రూ ఇంగ్లండ్‌కి వెళ్ళి స్వదేశాన్ని గుర్తించినట్లుగా, దూరంగా వుంటేనే కొంత గొప్పదనం.

"మన దేహంలో పన్నెండు విసర్జక ద్రవ్యాలవల్ల మనకి మురికి-మైల. దేహంలోని జిడ్డు పదార్థాలు, వీర్యము, రక్తము, మెదడులోని మజ్జారసం, మూత్రం, మలం, చీమిడి, చెవిలోని గుల్మము, శ్లేష్మము, కన్నీరు, కంటి-పుసి, చమట." మను(5.135)

చికాగోలో వున్నా లెక్క పెట్టడం కన్నడంలోనే లెక్కపెట్టాడు. ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఐదు, ఆరు, ఏడు, ఎనిమిది, తొమ్మిది, పది, పదకొండు.... మొదటిసారి లెక్క పెట్టినప్పుడు పదకొండే మలాలు దొరికాయి. మళ్ళీ లెక్కపెట్టినప్పుడు పన్నెండు, సరిగ్గా పన్నెండు. ఈ పన్నెండింటిలో అతనికి తెలిసింది, ఉమ్మి, ఉచ్చ, దొడ్డి. చిన్నతనంలో చెప్పేవారు - ఎంగిలి చెయ్యకూడదు, దొడ్డి కెళితే శుభ్రంగా కడుక్కోవాలి. ఉచ్చపోస్తే కడుక్కోవాలి, అంటూ. వాళత్త కక్కసుకి వెళితే పిడికెడు మట్టి (మృత్తిక) కూడా తీసికెళ్ళేది. ఆవిడున్నంతకాలం పెరట్లో గొయ్యి ఒకటి వుండేదెప్పుడూ.

దక్షిణదేశంలో, నోట్లో పెట్టుకుని ఎంగిలి చేసి ఊదే బూరా, నాగస్వరం, ఇవన్నీ ముట్టకూడని వస్తువులు. ఎంగిలి వస్తువులు - అస్పృశ్యులు మాత్రమే ముట్టుకుని వాయించే వాయిద్యం. వీణ బ్రాహ్మణలకు. ముఖవీణ మాదిగ జాతికి.

కుండకన్నా వెండి, పత్తికన్నా పట్టు, ఉత్తమం. ఎందుకంటే దానికి ఈ పన్నెండు మలాలు అంత సులువుగా అంటుకోవు. పట్టు, పట్టుపురుగు వొంటినుంచి వెలువడే విసర్జక ద్రవం, నిజమే. కాని అది మనుషులకి మడి. చూడండి ఎలా వుంటుందో!

ఈ అమెరికన్లకి ఎన్ని విషయాలు తెలుసు! ఏవేవో లైబ్రరీలకి వెళ్ళి చూశారు.

కాశీలోని పాతకాలపు పండితుల్ని పట్టుకుని, వాళ్ళకి తెలిసినదంతా సంగ్రహించి పాండిత్యపు సారాన్ని పిండుకున్నారు. ఎక్కడెక్కడి తాళ పత్రాలు వెతికి, దుమ్ము దులిపి సేకరించారు. మహా ఆశ్చర్యం ఇతనికి.

భారతదేశపు విషయాలు తెలుసుకోవాలని వుంటే ఫిలడెల్ఫియా, బర్క్లీ, చికాగో - అలాంటి చోట్లకి వెళ్ళాలి. వీళ్ళకున్నంత ఆసక్తి మన కెక్కడుంది ? వివేకానందుడు చికాగోకి రాలేదూ ? ఆయన మన ధర్మం మీద ఇచ్చిన మొదటి ఉపన్యాసం ఇక్కడే కదా.

సూతకం తెప్పించే మూడు క్రియలలో ముట్టవడం మొదటిది. పుట్టుక దాని కన్న ఓ డిగ్రీ ఎక్కువది. అన్నిటికన్న ఎక్కువ సూతకం అంటే చావు సూతకం. చావు మైల తగిలినా చాలు. సూతకం తెప్పిస్తుంది. కాలుతున్న పాడె నుంచి వచ్చిన పొగ తగిలినా చాలు బ్రాహ్మణుడు స్నానం చెయ్యాలి. మాదిగ వాళ్ళు తప్పించి మరొకరెవరూ చచ్చిన వాడు కట్టుకున్న గుడ్డలు కట్టుకోరు.

(మను 10.39)

శుభంలో శుభ ప్రదమైన ఆవు చనిపోతే ఆ గోవు మాంసాన్ని తినేవాళ్ళు అందరికన్న తక్కువ జాతి వాళ్ళు. కాకి, గ్రద్ద కూడా ఈ కారణం చేతనే పక్షి జాతిలో నీచజాతిగా పరిగణింప బడతాయి. కొన్ని సార్లు చావుకి, అస్పృశ్యతకీ వున్న అంచు చాలా సూక్ష్మంగా అనిపిస్తుంది. బెంగాల్‌లో తెలికలవాళ్ళలో రెండు శాఖలున్నాయి. నూనె అమ్మేవాళ్ళు ఉత్తమ జాతివారు. కాని గానుగ ఆడించి గింజల్ని నూనెగా చేసేవాళ్ళు తక్కువరకం జాతి. ఎందుకంటే వాళ్ళు విత్తనాల్ని చంపుతారు గాబట్టి చావు - మైల వున్నవాళ్ళు.

(హటన్.1946 :77-78)

ఇవన్నీ అతనికి తెలియనే తెలీదు.

అతనేమీ చదువుకోని వాడు కాదు. మైసూరులో రోజూ యూనివర్సిటీకి, లైబ్రరీకి చెప్పులరిగేలా తిరిగిన వాడే. అక్కడున్న వాళ్ళలో ఐదారుగురు గుమాస్తాలతో పరిచయం వుంది. అందులో శెట్టి తనతో బాటే ఎకనమిక్స్ చదువుకుని పోయిన సంవత్సరం ఫెయిల్ కావడంతో లైబ్రరీలో పనిలో చేరాడు. అణ్ణయ్య వచ్చినపుడల్లా శెట్టి అతనికి లైబ్రరీ తాళం చెవుల గుత్తి నిచ్చేసి 'కావల్సిన పుస్తకం చూసుకుని తీసుకోండి' అనేవాడు.

బరువైన గుత్తి అది. బాగా వాడటం వల్ల చేతి నుంచి చేతికి మారి, అరిగి, నున్నగా మెరుస్తున్న ఇనుప తాళం చెవులు. వాటి మధ్య కలిసిపోయిన పసుపురంగు ఇత్తడి తాళం చెవులు. ఇత్తడి తాళానికి ఇత్తడి చెవులు, ఆడతాళానికి మగ తాళం చెవి, మగ తాళానికి ఆడతాళం చెవి. పెద్ద దానికి

పెద్దది, చిన్నదానికి చిన్నది. కొన్ని మాత్రం పెద్ద తాళానికి చిన్న తాళం చెవి, చిన్న తాళానికి పెద్ద చెవి. ఇలా విపర్యాసం, పర్యాయం, అనులోమం ఈ పుస్తకంలో చెప్పిన మనువు చెప్పిన పెళ్ళిళ్ళలాగ. కొన్ని బీరువా కన్న తాళం పెద్దదిగా వున్నా, తాళం వెయ్యడానికే కుదిరేది కాదు. ముట్టుకుంటే విడిపోయేది. కొన్ని మహా బిగువు. పగలగొట్టే తియ్యాలి. దాని వెనకాలే కళ్ళకి కనిపిస్తూ, చేతికి దొరకని పుస్తకం. ఏ కథ వుందో, సమాజ శాస్త్రపు నగ్న చిత్రం వుందో ఏమో ఆ పుస్తకంలో.

మైసూర్‌లో ఇతను చదివినదంతా పాశ్చాత్యుల గురించి. ఇంగ్లీషు, కన్నడం చదువుకున్నా అన్నాకెరీనా అనువాదం. మూర్తిరావు, షేక్స్‌పియర్ మీద రాసిన పుస్తకం. అమెరికా వెళ్ళొచ్చిన వాళ్ళు రాసిన స్థల పురాణాలు. సముద్రపు అవతల నుంచి, అపూర్వ పశ్చిమం, అమెరికాలో నేను - లాంటివి.

మల శుద్ధికి మనువు పదకొండు మార్గాలు చెప్పాడు. బ్రాహ్మణ్యపు విధులు, అగ్ని, ప్రసాదము, మట్టి, అంతఃకరణ సంయమము, నీరు, పేడ చేతిలో పట్టుకుని చేసే ప్రమాణం, గాలి, కర్మలు, సూర్యడు, కాలము - ఇవి దేహదారులని శుద్ధి చేసేవి.

(మను 5-105)

ఈ తెల్లవాళ్ళకి ఇవన్నీ ఎలా తెలిసిపోయాయి ? ఇంత దూరంలో, పదివేల మైళ్ళ దూరంలో, నీరు, సూర్యడు, గాలి, నేల, కాలాలని దాటివచ్చి ఇతను, ఈ గబ్బు కంపు కొట్టే చికాగోలో, అణ్ణయ్య - శ్రోత్రియుల జాతిలో మేకులా పుట్టిన అణ్ణయ్య, ఇక్కడికి వచ్చి ఇవన్నీ నేర్చుకోవల్సి వచ్చింది. ఈ చలిలో, ఈ తెల్ల మంచులో వుండి ఆ వేడి, ఆ ఎండల మధ్య బ్రతికే ఈ నల్లవాళ్ళ రహస్యాలన్నీ ఆ తెల్లవాళ్ళెలా తెలుసుకున్నారు? ఈ మంత్రం వీళ్ళ చెవుల్లో ఎవరు జపించారు? జర్మనీ మ్యాక్స్ ముల్లర్ సంస్కృతం నేర్చుకుని మోక్షముల్లా భట్టుగా మారి మాకే వేదాలు నేర్పుతున్నాడు కదా!

భారతదేశంలో అతను అమెరికా, ఇంగ్లండ్, యూరప్ అని జపించినట్లుగా ఇక్కడ ఈ అమెరికాలో అతను మళ్ళీ మళ్ళీ భారతదేశం గురించి చదివాడు, మాట్లాడాడు. కనపడ్డ వాళ్ళందరికీ కాఫీ ఇప్పించి, వాళ్ళిచ్చిన బీరు తాగి, తెల్ల పిల్లల చెయ్యి పట్టుకుని తనకి రాని హస్తసాముద్రికం చెప్పాడు.

ఇక్కడ అతనికి ఆంత్రపాలజీ గురించి జిజ్ఞాస. కామతురం లా, ఈ ఆత్మజ్ఞానాన్ని గురించిన ఆత్రం దీనిక్కూడా సిగ్గు, భయం, మొహమాటం లేవు. హిందూ సంప్రదాయం గురించి మానవశాస్త్రజ్ఞులు రాసినవి, దొరికినవన్నీ చదివాడు. రెండవ అటక (అర) లో ఆ పుస్తకాలు దొంతర్లుగా వున్నాయి. దాని

నంబరు PK321. నిచ్చెన ఎక్కి, కాలావధిలా చెక్కతో కట్టిన, చేతిపిడి వున్న అటక. ఈ పశ్చిమాన తూర్పు వచ్చి చేరుకుంది. దూరపు పచ్చదనం, ఇంటర్నేషనల్ హౌస్‌లో అలవాటైన తెల్ల అమ్మాయిలు.

"మీ దేశపు స్త్రీలు నుదుట ఎర్రటి బొట్టు పెట్టుకుంటా రెందుకు? అని కుతూహలంతో ఎవరైనా ప్రశ్నిస్తే జవాబు చెప్పడానికి సిద్ధంగా వుండాలి అన్న ఉద్దేశంతోనే ఏమో మైసూర్లో వున్నపుడు వాళ్ళ నాన్న ఎంత కోపగించుకున్నా చెయ్యని గీతాపారాయణం అమెరికాలో చేసి, బీరు, విస్కీ, గోమాంసం, దొడ్డికి వెళితే శౌచానికి నీళ్ళు లేక కాగితంతో తుడుచుకునే చండాలత, ప్లేబాయ్ మ్యాగజైన్‌లో బూతు బొమ్మలు చూడ్డం, వీటి మధ్యనుంచి ఎకనమిక్స్ చదువు మధ్య నుంచీ ఖాళీ చేసుకుని అతను ఈ రెండేళ్ళూ హిందూ సంప్రదాయం చదివాడు. స్టాటిస్టిక్స్ సంఖ్యల మధ్య రామకృష్ణాశ్రమపు పుస్తకాల జాబితా. హిందూ సంస్కృతి తెలుసుకోవాలంటే అమెరికా రావాలి అనేవాడు. మా చికాగో లైబ్రరీలో ప్రజావాణి కూడా వస్తుంది సుమండీ - హిందూ సంస్కృతిని దాచిపెట్టి మూసిన తలుపులకి వేసిన తాళాలెన్నింటికో అమెరికాలో తాళం చెవులు దొరికాయి. తాళాల గుత్తే దొరికింది ఇప్పుడు.

అతను ఆ రోజు పుస్తకాల అలమార్ల మధ్యలో తిరుగుతున్నపుడు హఠాత్తుగా ఒక కొత్త పుస్తకం కనిపించింది. నీలిరంగు గుడ్డ అట్ట. చేతినిండుగా వున్న పుస్తకం, బంగారు రంగులో ఆ నీలం రంగు అట్టమీద , Hinduism : Custom and Ritual అని రాసుంది. స్టీవన్ ఫర్గూసన్ రాసినది. 1968లో అచ్చయిన కొత్త పుస్తకం. వేడి వేడి విషయాలు. సీమంతం, నామకరణం, పుట్టు వెంట్రుకలు తీయించడం, అన్నప్రాశన, వడుగు, పెళ్ళి, సప్తపది, శోభనం రాత్రి ఇచ్చే పళ్ళు, బాదం పాలు....

"కొత్త పెళ్ళానికి ఏలకులు, బాదం పప్పు తినిపించి తనేమో తిన్నగా బాదంపాలు తాగేస్తాడురా ఈ రసికుడు" అంటూ హుణసూరులో ఎవరింట్లోనో శోభనం జరిగినపుడు బూతు జోక్ ఒకటి విన్నాడు.

భర్త భార్యకి చెప్పే సంస్కృత మైథున మంత్రం, షష్ట్యబ్ది పూర్తి శాంతులు, ప్రాయశ్చిత్తాలు, దానాలు, ఉత్తర క్రియలు ఇలాంటి సంస్కారాలన్నిటినీ విడివిడిగా వివరంగా రాశారు|

163 వ పేజి, బ్రాహ్మణుల ఉత్తర క్రియల వర్ణన, చిత్రాలతో సహా. ఎన్ని విషయాలు చెప్పాడు. ఈ ఫర్గూసన్ మహాశయుడు! మాటిమాటికి మనువు, పితృమేధ - సూత్రం అంటూ, సపిండం. ఎవరు నిజం, ఎవరు కాదు. సన్యాసికి, పళ్ళురాని పసిపాపకి సూతకం లేదు. పళ్ళు వచ్చాక బిడ్డ చనిపోతే ఒక రోజు

మైల. బేల కర్మ (పుట్టు వెంట్రుకలు) జరిగి వుంటే మూడు రోజులు. శ్రాద్ధానికి ఏడుగురు కావాలి. కొడుకు, మనవడు, వాడి కొడుకు - శ్రాద్ధం చేసేవాళ్ళు, తండ్రి, తాత, ముత్తాత చేయించుకునే వాళ్ళు. మూడు తరాలుపైన, మూడు తరాలు క్రింద. మధ్యలో తను. ఏడు పిండాల మధ్యన వున్న పిండం. ఇలాంటి వివరాలెన్నో. దానికి తోడు ఏ యే వర్ణాలలో ఎవరెవరికి ఎన్నెన్ని రోజుల సూతకం అన్నదంతా వరుస క్రమంలో రాసుంది. అంతేకాదు, పర దేశంలో సంబంధీకులు చచ్చిపోతే, సంగతి వినేవరకూ సూతకం లేదు. విషయం తెలిసిన వెంటనే సూతకం అంటుకుంటుంది. దానికి తగ్గట్టు రోజుల లెక్క, స్నానాల లెక్క అవ్వాలి. ఇతని శ్రద్ధ, కుతూహలం ఒక్కొక్క వాక్యానికి ఎక్కువ కాసాగింది.

పుస్తకాల మధ్యన అలాగే కూర్చుని చదివాను. శ్రాద్ధాలలో నాలుగు భాగాలనీ చెప్పింది పుస్తకం. అతను ఇంతవరకూ ఎవరి చావునీ చూసిన వాడు కాదు. మూడో వీధిలో చాకలి వాళ్ళు శవాన్ని అలంకరించి, వూరేగింపు తీసికెళుతుంటే రెండు సార్లు చూశాడు. పెద్దనాన్న చనిపోయినపుడు బొంబాయి వెళ్ళాడు. ఇంట్లో నాన్నకి మూత్రరోగం వున్నప్పటికీ, జిహ్వా చాపల్యాన్ని అదుపులో పెట్టుకుంటే ప్రాణభయం లేదని డాక్టర్లు చెప్పారు. ఒకటిన్నర సంవత్సరం క్రితం పక్షవాతం వచ్చి చెయ్యి పడిపోయింది. ముఖం ఎడం వేపు వంకర పోయింది. అయినా బాగానే వున్నారంటూ రెండు వారలకోసారి అమ్మ రాస్తూనే వుంది. నీరసమైన ఉత్తరాలు, దమయంతి పురుడు, అక్కడ ప్రతి శనివారం తలంటుకుని నీళ్ళు పోసుకో. లేకపోతే వేడి చేస్తుంది. సీకాయి పంపనా అంటూ వణికే అక్షరాలతో ఉత్తరం రాస్తుంది.

బ్రాహ్మణుడికి చావు దగ్గరయితే అతన్ని మంచం మీంచి కిందకి దింపేసి దర్భలు పరిచిన నేల మీద దక్షిణంగా కాళ్ళు పెట్టి పడుకోపెడతారు. దేహం నేలకీ ఆకాశానికి మధ్య ఇబ్బందిగా మంచం మీదుండకుండా నిరాటంకంగా నేల మీదుండాలి. దర్భ ఎలాగూ భూసారాన్ని పీల్చుకున్న రసమయమైన గడ్డి నిప్పుకి ప్రియమయినది. దక్షిణ దిక్కు యముడి స్వంతం. పితృ దేవతలకి అదే దిక్కు.

ఆ తరువాత కుడి చెవిలో వేద స్వరం నోటిలో పంచ గవ్యం. చనిపోయిన మనిషి దేహం మైల. సజీవమైన ఆవు మలం పవిత్రం. చూడండెలా వుందో. దశ దానాలు - నువ్వులు, ఆవు, భూమి, నెయ్యి, బంగారం, వెండి, ఉప్పు, బట్టలు, ధాన్యం, పంచదార. మనిషి చనిపోగానే మగ పిల్లలంతా స్నానం చేసి, పెద్దకొడుకు జందెం ఎడం వేపు చంక కిందికి మార్చుకుంటాడు. అశుభానికి సూచనగా. దేహానికి స్నానం చేయించి, విభూది రాసి, భూమి తల్లికి శ్లోకం చెబుతారు.

ఆ పేజీ ప్రక్కనే నున్నటి కాగితం మీద ఒక బొమ్మ వుంది. మైసూరు ఇళ్ళల్లో మాదిరిగా వున్నట్టు ఇంటి ముందు వరండా, వెనుక గోడకి కటకటాల కిటికి. వరండా నేల మీద స్నానం చేయించి అలంకరించి పడుకోబెట్టిన శవం.

చనిపోయిన వాడు దేవుడు. అతని దేహం విష్ణువు, స్త్రీ అయితే లక్ష్మి. దేవుడికి చేసినట్టు దానికి ప్రదక్షిణ, హారతి అన్నీ జరుగుతాయి.

ఇప్పుడిక యముడికి అగ్ని నర్పించి నేతి హవిస్సు వేస్తారు. శవానికి, అగ్నికి సంబంధం కోసం ఒక నూలు పోగు వుంచుతారు. శవం బొటన వేళ్ళని దగ్గరికి చేర్చి కట్టి, దాని మీద నూలు గుడ్డ కప్పుతారు.

దీని చిత్రం కూడా వుందక్కడ. అదే మైసూరులో మాదిరి ఇల్లు. అదే కటకటాల కిటికీ. కాని ఒకరిద్దరు విభూతి పట్టెలు పెట్టుకున్న బ్రాహ్మణులు చిత్రంలో వున్నారు. ఎక్కడో చూసినట్టుగా కూడా అనిపిస్తోంది. ఇంత దూరంలో వుండి చూస్తే మైసూరు విభూతి బ్రాహ్మణులందరి మొహాలు ఒక్కలాగే వుంటాయి అనిపించింది.

నలుగురు శవం మోసేవాళ్ళు. పాడె కట్టి ఇంటికి విముఖంగా శవం ముఖాన్ని తిప్పి, ఆఖరి వూరేగింపు బయలుదేరుతుంది.

ఇక్కడ మరొక చిత్రం. మైసూరు వీధే అది. సందేహం లేదు. నాలుగైదు ఇళ్ళు చిరపరిచితంగా అనిపించాయి. మూడు ప్రదేశాలలో వూరేగింపు ఆపి పాడె దింపుతారు. దానికి ప్రదక్షిణ చేసి క్షుద్ర దేవతలకి బియ్యపు గింజలు విసురుతారు.

వల్లకాటికి వచ్చాక దక్షిణ ముఖంగా చితి మీద దేహాన్ని వుంచి, బొటన వేళ్ళ ముడి విప్పి, కప్పిన తెల్ల గుడ్డ తీసి, దాన్ని శ్మశానంలో చండాలుడికి దానం చేస్తారు. కొడుకు, సంబంధీకులు శవం నోట్లో నీళ్ళు చిలకరించిన అక్షింతలు వేస్తారు. బంగారు నాణెంతో దాని నోరు మూస్తారు. నడుము కింద చిన్న అరటాకో, గుడ్డ పీలికో తప్ప పుట్టినప్పుడున్నట్టుగానే వుంటుంది అప్పుడూను.

బంగారం, ఈ కాలంలో ఎక్కడ దొరికిందో తెలీదు. పద్నాలుగు కారెట్లయితే ఫరవాలేదా ? వేదసమ్మతమేనా?

పెద్ద కొడుకు కొత్త కుండలో నీళ్ళు నింపి, దాని పక్కగా చిల్లు చేసి, భుజం మీద పెట్టుకుని, చితి చుట్టూ మూడు ప్రదక్షిణాలు చేసి, నీళ్ళు నేలమీద పోస్తాడు. మూడు సార్లయ్యాక భుజం వెనుకగా దాన్ని విసిరేసి పగలకొడతాడు.

వల్లకాటి చిత్రం కూడా ఒకటుంది అందులో. దాన్ని చూసి ఇతని మనసు కలిచి వేసినట్లయింది. ఎందుకో అంతా చిరపరిచితంగా వుంది. మంచి కేమేరాతో తీసిన చిత్రం. చితి, దేహం, తల బాదామి ఆకారపు క్రాపు మధ్యవయస్కుడి

భుజం మీద కారుతున్న కుండ .... దూరంగా చెట్లు .... ఇతరులు.

అరె, ఈ మధ్య వయస్కుడి మొహం బాగా తెలిసినట్లుందే! దాయాది సుందర్రావు మొహమే. హుణసూరులో స్టూడియో వుందాయనకి. ఇక్కడెందు కుంది ఆయన ఫోటో? ఈ ఛండాలుడు ఇక్కడకెక్కడ్నుంచి వచ్చాడు?

పక్క పేజీలో చితి మండుతున్న చిత్రం. దానికింద అగ్నికి చెప్పిన మంత్రాలు.

"అగ్ని దేవుడా ఇతని దేహాన్ని కాల్చకు, చర్మాన్ని కాల్చకు. ఇతన్ని పక్వం చేసి పితృ దేవతల దగ్గరికి చేర్చు. అగ్నిదేవుడా! నువ్వు ఈ యజమాని యజ్ఞంలో పుట్టావు. ఇప్పుడు నీ వల్ల మళ్ళీ ఇతను పుట్టుగాక!

మంత్రం సగంలో ఆపేసి మళ్ళీ అతను వెనుక పేజీ తిప్పి దాయాది సుందర్రావుగారి మొహం ఓసారి చూశాడు. తెలిసిన మొహమే. కళ్ళజోడు తీసేశాడు. సగం నెరిసిన పూర్తి క్రాపు బదులుగా, కొద్దిగా శాస్త్రానికి తీయించిన బాదామి క్రాపు. కొత్తగా సర్వాంగ క్షవరం చేయించుకున్నాడు. రొమ్ము మీద వెంట్రుకలు కూడా లేవు. బొడ్డు కిందకి మేలుకోటు మడి పంచె. ఇతడెందు కొచ్చాడిక్కడికి? ఈ పుస్తకంలోకి?

మున్నుడి చూశాడు. అందులో ఈ ఫెర్గూసన్ ఫోర్డ్ విద్యార్థి వేతనపు సాయంతో మైసూరికి 1966-68లో వెళ్ళినట్టుగా తెలిసింది. మైసూర్‌లో మ. సుందరరావుగారు, ఆయన కుటుంబము విషయ సంగ్రహణకి చాలా సహాయం చేసుకున్నట్లుగావుంది. అందుకే మైసూరు ఇళ్ళు కనిపించాయన్న మాట! మళ్ళీ బొమ్మలన్నీ పరిశీలనగా చూశాడు. ఆ కటకటాల కిటికీ ఇల్లు ఆ పక్కిళ్ళు గోపి ఇల్లు సంపంగి చెట్టున్న గంగమ్మ ఖాళీ ఇల్లు - తమ ఇంటి వీధి, ఆ వరండా తన ఇంటి వరండా శవం తండ్రిదయి వుండొచ్చు. మొహం సరిగ్గా కనిపించలేదు. వంకరబోయిన మొహం. పారే నీటిలో చూసే మొహంలా వుంది. వొంటి నిండా తెల్లటి గుడ్డ కప్పి వుంది. బ్రాహ్మణులూ తెలిసిన వారిలాగే వున్నారు.

మళ్ళీ మున్నుడి చదివాడు.

సుందర్రావుగారు చాలా సహాయం చేశారు. తమ సంబంధీకుల ఇంట్లో పెళ్ళి, ఒడుగు, సీమంతం, ఉత్తరక్రియలు అన్నిటికీ తీసికెళ్ళి, ఫోటోలు తియ్యడానికి సాయం చేసి, ప్రశ్నలడిగి సమాధానాలు రాసుకోడానికీ, మంత్రాలను టేప్‌రికార్డు చేసుకోడానికి వీలు కల్పించారు. ఇంట్లో భోజనం పెట్టారు. ఆయనకి ఈ మ్లేచ్ఛుడు చాలా కృతజ్ఞతలు వెలిబుచ్చాడు.

మళ్ళీ చితి చిత్రాన్ని చూశాడు. మండుతోంది. దాని క్రింద అగ్నికి చెప్పే

మాటలు. చెట్లు, చేమలు, మైసూరు శ్మశానంలో వున్నట్టే వుంది. క్రింద సన్నటి అక్షరాలతో కృతజ్ఞత : సుందర్రావుగారి స్టూడియో అని వ్రాసుంది. అతనే తీసిన చిత్రం.

అతని తండ్రి చనిపోవడంతో దాయాది సుందర్రావు కర్మ చేశాడు. కొడుకు పరదేశంలో వాళ్ళమ్మ తెలియజేయడానికి ఒప్పుకోలేదేమో. దూర దేశంలో వంటరిగా వున్నాడు. తండ్రి లేని నిస్సహాయుడు. దుర్వార్త తెలిపితే ఏమవుతాడో ఏమో. వెళ్ళిన పని పూర్తి చేసుకుని రానీలే అని వుండాలి. లేకపోతే, ఈ సుందర్రావే ఆ సలహా ఇచ్చి వుండాలి. అతని మాటంటే గురి అమ్మకి. పక్షవాతం వల్ల చెయ్యి స్వాధీనం లేక నాన్న వుత్తరాలు రాయడం లేదని సర్ది చెప్పింది అమ్మ రెండేళ్ళ క్రితం. ఇతను ఇక్కడి కొచ్చిన మూడు నెల్లకంతా జరిగిందన్నమాట. ఇక అమ్మనేం చేశారో! ఆచార వంతులంతా చేరి జుట్టు తీయించేశారా? సుందర్రావు మీద ఒళ్ళు మండుకొచ్చింది. నీచుడు, చంఢాలుడు మళ్ళీ మళ్ళీ చితి చిత్రాన్ని చూశాడు. కటకటాల కిటికీ, ఆ శవం, సుందర్రావు బాదామి క్రాపు, బొడ్డు చూశాడు. వర్ణన చదివాడు.

వెనక, ముందు పేజీలు తిప్పాడు. కంగారులో పుస్తకం లైబ్రరీ నేల మీద పడింది. తలక్రిందులుగా ఆ పేజీలు కలిసిపోయాయి.

కంగారుగా పుస్తకం పైకి తీసి సరిచేసి తిరగేశాడు. మళ్ళీ తిరగేశాడు. అంతవరకూ ఏమీ మరింకే ధ్యాస లేని అతనికి కారిడార్ కొసలో వున్న అమెరికన్ కక్కసులో ఎవరో ఫ్లష్ చేసిన నీరు జలపాతపు చప్పుడులా భోరుమని పైకి లేచి దిగిపోయి ఇంకిపోవడం వినిపించింది.

పేజీ తిప్పాడు. సీమంతపు అధ్యాయంలో సీతలాగా వేషం వేసుకుని, తలకి కిరీటం పెట్టుకుని చాలామంది ముత్తైదువుల మధ్య కొద్దిగా మూతి వంకరగా పెట్టుకుని కూర్చుంది దాయాది సుందర్రావు కూతురు దమయంతి. తొలి చూలు. ఏడు నెలల పొట్ట కనిపిస్తోంది. ఈ సుందర్రావు ఎలానూ ఒక అమెరికన్ వచ్చాడు కదా, ఇదే మంచి సమయం ఫోటో తీయిద్దాంలే అని కూతురికి కడుపు రావడం కోసమే కాచుకుని సీమంతం చేయించి వుండాలి. ఉత్తర క్రియలు చూపిద్దామని కాచుకున్నాడేమో పెద్దనాన్న ఇంట్లో వీలు దొరికింది. వాడుకున్నాడు. ఎంత డబ్బిచ్చాడో ఆ ఫెర్గూసన్ మానవుడు.

ఆ ముత్తైదువల మధ్య అమ్మ మొహం కోసం వెతికాడు. కనబడలేదు. సంపంగి చెట్టు గంగమ్మ, అవతలి ఇంటి లచ్చమ్మ వున్నారు.

అవే మొహాలు. ముక్కుపుడక, దుద్దులు, పైసా వెడల్పు బొట్టూనూ.

ఆత్రంగా అనుక్రమణిక పేజీ తిప్పాడు. వకారం, ఏకారం, వుకారం దాటి,

'వె' దాటి, వేదాలు వేష భూషణాలు దాటి, వెఖానస, వైదిక అనుక్రమణికలో వైధవ్యం దొరికింది. వైధవ్యం మీద మొత్తం ఒక అధ్యాయం వుంది. వుండదామరి. అందులో 233 వ పేజీ ఎదుట ఒక సొగసైన ఫోటో.

హిందూ విధవ. కొన్ని శైవ సంప్రదాయాల ప్రకారం తల మీద జుట్టు పూర్తిగా తీయబడి వుంది.

అంటూ వున్నదున్నట్టు శీర్షిక. కృతజ్ఞత : సుందర్రావుగారు, స్టూడియో - హుణసూరు. అమ్మ ఫోటో నా అది? తెలిసిన మొహమే. అయినా అపరిచితంగా వుంది. గుండు గీయించుకున్న తల. దాని మీద ముసుగు. అది నలుపు - తెలుపు చిత్రమే అయినా ఇతనికి తెలుసు అది ఎర్ర చీరని మాసిన చీరె....సుందర్రావుగారు పసిఫిక్ సాగారానికి అవతల, 10,000 మైళ్ళ దూరంలో వున్న హుణసూరు బెలువాంబా అగ్రహారం వెనకాల సందులో నివసిస్తున్నందువల్ల ఆ రోజు బ్రతికిపోయారు.

# 14. దిగంతం

శాంతినాథ దేశాయి

"బి" డెక్ మీద ఒంటరిగా నుంచున్న మందాకిని సముద్రపు అలల్ని, వున్న చోటనే వున్నట్టుగా కనిపించే దిగంతాన్ని, చాలా సేపటి నుంచి చూస్తూ నుంచుంది. చుట్టూ నీటి మయం. ఎటు చూసినా వురకలేసే నల్లటి నీళ్ళు, పైన ఆకాశం. అది కూడా మబ్బులు మునిరిన ఆకాశం. చూసి చూసి విసుగొచ్చింది. అదే డెక్ మీద ఓ పక్కగా వున్న అందమైన లైబ్రెరీలో మెత్తటి సోఫా మీద కూర్చుని ఏదైనా చదువుకుందామా, లేదా తన కేబిన్ లోకి వెళ్ళిపోయి మళ్ళీ సాయంకాలం ఏడింటి దాకా, "డిన్నర్" బెల్ అయ్యేదాకా పైపుల్నుంచి 'భుస్సు' మని వచ్చే చల్లగాలిలోని హాయిననుభవిస్తూ పడుకుండి పోదామా అని ఆలోచించ సాగింది./ నిన్న రాత్రి కూడా సరిగా నిద్ర లేదు - విపరీతమైన కుదుపులతో ఓడ కదులుతున్న కారణం వల్లనే కావొచ్చు. మధ్యాహ్నం భోజనం తరువాత కాసేపు పడుకుందామనుకుంటే, ఆమె కొత్త టేబుల్-మేట్ మిసెస్ మోహిత్‌తో మొదటి పరిచయపు సంభాషణ అడ్డొచ్చింది. మిసెస్ మోహిత్ కొడుకు లండన్‌లో ఏదో ఫ్యాక్టరీలో పనిలో వున్నాడు. బొంబాయిలో ఒంటరిగా ఎందుకుండాలి? భర్త పోయి పదేళ్ళు కావొస్తోంది. కొడుకు రా రమ్మని వుత్తరాలు రాస్తున్నాడు. వెళితే సరి. బొంబాయిలో వుంటేనేం, లండన్‌లో వుంటేనేం? అంతా ఒకటే. అక్కడా మహారాష్ట్రులున్నారు. అందుకని బయలుదేరింది ఈ తల్లి. ఆమె రెండు గంటలపాటు చెప్పిన పురాణం వల్ల పోగొట్టుకున్న విశ్రాంతిని ఇకనైనా తీసుకుందాం అనుకుంటూ వుండగా ఆమె కేబిన్ మేట్ మిస్ జోసెఫ్ వచ్చేసింది. "మందా, కమాన్ - 'సి' డెక్ మీద స్విమ్మింగ్ చూద్దాం" అంటూ లాక్కుపోయింది. ఆస్ట్రేలియన్ అమ్మాయిలూ, అబ్బాయిలూ అర్ధనగ్నంగా నీళ్ళలో నవ్వుతూ, కేరింతలు కొడుతూ ఆనందిస్తుంటే చూసి అసూయ పడ్డాక జోసెఫ్ అంది, "మిస్ భాటే, వాళ్ళ స్వేచ్ఛ - ఆ నవ్వులు, కేరింతలు, గంతులు చూస్తే మన బ్రతుకులు బ్రతుకులే కావని అనిపించడంలేదూ నీకు? మా క్రిస్టియన్స్‌కి కొంత కాకపోతే కొంతైనా మజా వుంటుంది జీవితంలో. మీకు ?.... నీకు డాన్స్ నేర్పించనా నేను ? ఇంగ్లండ్‌లో ఓ సంవత్సరం వుండాల్సిన దానివి. డాన్స్ రాకపోతే ఎలా ?" ఇలా మొదలవుతాయి ఆమె కబుర్లు. "ఇవాళ రాత్రి డాన్స్ వుంది కదూ. ఆ గడ్డపు సర్దార్జీ లేడూ ? ఉదయం నుంచీ రెండు సార్లడిగాడు నన్ను తనతో డాన్స్ చెయ్యమని. ఇష్టంలేకపోయినా 'సరే' అన్నాను. ఆ మొద్దు

ముఖర్జీకి డాన్స్ వచ్చుంటే బాగుండేది." "ముఖర్జీ ఎవరు?" అనడిగింది మందాకిని. "నిన్న సాయంత్రం నాతో రెండు గంటల పాటు కబుర్లతో కాలక్షేపం చేశాడే, చిన్న కళ్ళు, ఎత్తుగా స్మార్టుగా వుంటాడే ఆ కోతి. అతను కలకత్తాలో డాక్టర్ అట. ఎఫ్.ఆర్.సి.ఎస్. చెయ్యడానికి ఎడిన్‌బరోకి బయలుదేరాడు. I like him... భలే jolly మనిషి ...." "ఓహ్, అతనా, ఇవాళ వుదయం డా.. సరోజ లేదూ, ఆమెతో కలిసి బార్లో కూర్చుని ఏదో తాగుతున్నాడు కదూ."

"అలాగా....speak of devils.... ఆమే కదూ డా॥ సరోజ? ఎంత లావుగా ఏనుగులాగ వుంటుందో కదూ?... అయితే, మంచి మనిషిలాగే వుంది. నిన్న నువ్వు ముఖర్జీతో మాట్లాడుతున్నప్పుడు తనంతట తను వచ్చి నన్ను పరిచయం చేసుకుంది." అని మందాకిని అంటూండగానే డా.ముఖర్జీ, డా॥ సరోజ ఇద్దరూ వచ్చి "మిస్ జోసెఫ్, ఈమె డా.. సరోజ లండన్‌లో మెడిసిన్ పై చదువులకోసం వెళుతున్నారు - ఈమె మిస్ జోసెఫ్ - ఈమె కూడా లండన్ కే ఇండియా హౌస్‌లో ఏదో పని దొరికింది, lucky " అంటూ, ముఖర్జీ పరిచయం చేశారు. డా॥ ముఖర్జీ కళ్ళు మందాకినిని నఖశిఖ పర్యంతం పరీక్షించాయి. తరువాత అవి ఆమె గుండెల మీదనే నిలిచిపోయినప్పుడు మందాకిని చాలా ఇబ్బందిగా ఫీలయింది. అప్పటికే నాలుగు గంటల వేళ కావస్తూ వుండటంతో అందరూ టీ తీసుకోవడానికి బయలుదేరారు.

టీ తాగుతుండగా అంబోతులా కనపడుతున్న సర్దార్జీ కూడా వచ్చి కలిశాడు. టీ తాగిన తరువాత సర్దార్జీ మిస్ జోసెఫ్‌తోను (జోసెఫ్ నల్లగా వున్నా స్మార్ట్‌గా వుంది. సర్దార్జీ మనసులో ఆమె పట్ల ఎలాంటి భావం వుందో మరి!) డా॥ ముఖర్జీ (నిజంగానే స్మార్ట్‌గా అందంగా ఉన్నాడు. పెళ్ళి కాలేదేమో) డా॥ సరోజతోను కలిసి వెళ్ళిపోయారు. మందాకిని తిన్నగా తన కేబిన్‌లోకి వెళ్ళి అస్వస్థమైన మనసుతో పది నిమిషాలు అద్దంలో తన మొహం తను చూసుకుంటూ కూర్చుంది. అలా ఎక్కువసేపు కూర్చోలేక జడ విప్పి, జుట్టు శుభ్రంగా దువ్వి, తనకి చాలా ఇష్టమైన ఎత్తుముడి వేసుకుని, మొహం బాగా రుద్ది కడుక్కుని పౌడర్ అద్ది, చీరె, జాకెట్టు మార్చి తన ప్రతిబింబానికో చిరునవ్వు విసిరి, "ఫరవాలేదు, నువ్వు మరీ అన్యాయంగా లేవు.... నిజం చెప్పాలంటే ఈ నీలపు రంగు చీరలో మరీ అందంగా కనపడుతున్నావనే చెప్పవచ్చు అంది. మళ్ళీ వచ్చి "బి" డెక్ మీద నుంచుంది.

ఇక కేబిన్‌కి తిరిగి వెళ్ళిపోయి పడుకోవడమే మంచిదేమోనన్న నిర్ణయానికొస్తుండగానే ఆమె ఎడం వేపు నుంచి చుట్టూ వాసనతో బాటు ఓ మగధ్వని ఇంగ్లీషులో వినిపించింది.

"ఇవాళ సాయంత్రం వాతావరణం చాలా డల్‌గా వుంది కదూ?"

మందాకినికి అనుమానం వచ్చింది. ఈ ఎర్రటి యూరోపియన్ ముసలాయన ప్రశ్న అడిగింది తననేనా లేకసముద్రాన్నా అని "పార్డన్.... మీరడిగింది నన్నేనా ?"

"ఎస్, గుడ్ ఈవెనింగ్, నేను 'హ్యారీ మెకార్థిని' క్యాలిఫోర్నియా వాసిని. బిజినెస్ మీద సిడ్నీ వెళ్ళి, తిరుగు ప్రయాణం చేస్తున్నాను."

"సిడ్నీ నుంచి విమానంలో వెళితే బాగుండేదేమో కదా?" మందాకిని సూటిగా అడిగింది. ఆమెకి నవ్వుతూ మెరుస్తున్న అతని కళ్ళు, అనుకంపను ప్రతిఫలించే మొహమూ చాలా నచ్చింది.

"ఇది నా ప్లెజర్ ట్రిప్. నాకు ఓ నెల రోజుల శలవు దొరికింది. దాన్ని ఓడ ప్రయాణంలో సుఖంగా అనుభవిద్దామని ఒకటి, రెండోది, ప్రపంచాన్ని చూడాలని ....మీరు ఇండియన్ కదూ....?"

"అవును, మాది బొంబాయి. అంటే దానికి దగ్గరగా ఒక వూరుంది. అహ్మద్ నగరం. అది మా వూరు. నా పేరు భాటే."

"మిసెస్ భాటే, మీరు...."

"మిసెస్ కాదు, మిస్ భాటే!"

"ఓహ్, సారీ, నేనే స్టుపిడ్‌ని....! మిస్ భాటే, మీరెక్కడికి బయలుదేరారు? లండన్ కయ్యుంటుంది కదూ!"

"ఊఁ, .... అక్కడ దగ్గరగా బిజల్‌హర్ట్స్ అనే వూరొకటుంది. అక్కడ టి.డి. అంటే డిప్లొమా ఇన్ టీచింగ్ చెయ్యడానికి వచ్చాను."

"స్వంత ఖర్చులతోనా?"

"కాదు, నేను పని చేస్తున్న మిషన్ స్కూల్ వాళ్ళు స్కాలర్‌షిప్ ఇచ్చి పంపిస్తున్నారు."

"స్కాలర్ షిప్పా! హుఁ - మీరు చాలా బ్రిలియంట్ అన్నమాట!"

"అదేమో నాకు తెలియదు. నా సబ్జెక్ట్ చరిత్ర. బి.ఎ. ఫస్ట్ క్లాస్‌లో పాసయ్యాను. మళ్ళీ బి.టి.లో కూడా ఫస్ట్ క్లాస్ వచ్చింది."

"అలాగా, అయితే మీరు అమెరికాకు రావాలి. వచ్చి అక్కడేదైనా రిసెర్చ్ చెయ్యాలి. మా కుటుంబపు చరిత్ర గురించి రిసెర్చి చేసినా చాలు. మీకు పిహెచ్.డి.దొరకడం ఖాయం." అంటూ నవ్వాడు మెకార్థీ. "వెల్....ఈ ఓడలో ఎలా వుంది లైఫ్; ఇంటరెస్టింగ్‌గా వుంది కదూ?"

"నాట్ బ్యాడ్. మొదటి రెండు రోజులూ కాస్త బాగా వున్నట్టనిపించింది. ఇప్పుడిప్పుడే బోర్ కొట్టేస్తోంది. వేళకు తిండి తినడం.... తరువాత వుట్టినే

కూర్చోడం, ఎటు చూసినా నీళ్ళు... ఒట్టి నీటి మయ ప్రపంచం."

"నీరు! సముద్రం! ఈ సముద్రంలో మరొక ప్రపంచం వుంది చూడండి. చాలా ఇంటరెస్టింగ్. మొన్న ఓ పుస్తకం చదవడం మొదలెట్టాను - సముద్రం గురించి. సముద్రంలో వున్నన్ని ప్రాణులు, చేపలు....అక్కడున్నంత రంగురంగుల జీవితం పృథ్వి మీద కూడా వుండదనిపించింది. కాని సముద్రంలో మునిగే కళ తెలిసిన వాళ్ళకే ఆ జీవితంలోని రొమాన్స్ తెలుసు...."

"అలాగా, అయితే నేనూ చదవాలి ఆ పుస్తకం సముద్రపు జీవితం గురించి ఒకటి రెండు సినిమాలు మాత్రం చూశాను. నీటిలోని ఆ ప్రపంచం నాకైతే భయానకంగా అనిపించింది."

కాసేపు ఇద్దరూ సముద్రపు తెరలనే చూడసాగారు. దూరంగా దిగంతం ఎర్రబడుతోంది. మెకార్థీ ఆరిపోయిన తన చుట్టని వెలిగించుకున్నాడు.

"మిస్ భాటే, ఈ రెండు రోజులుగా చూస్తున్నాను. ఇండియన్స్‌కి జీవితాన్ని అనుభవించడం తెలీదని పిస్తోంది. సంకోచం, సిగ్గు, అధైర్యం తప్ప, హాయిగా మాట్లాడ్డం, నవ్వడం ఆనందించడం ఇవేమీ వాళ్ళకి లేనే లేవేమో అనిపిస్తోంది. ఉదాహరణకి మిమ్మల్నే తీసుకోండి. రెండు రోజులుగా చూస్తున్నాను. మీ గాంభీర్యం, ఒంటరితనం, ముడుచుకుపోయే స్వభావం, ఇవన్నీ చూసి ఎలాగో అనిపిస్తోంది. Why don't you enjoy yourself ? ఎందుకు?" ముసలాయన కంఠంలో ఆత్మీయత పుట్టిపడుతోంది.

"అంటే?" మందాకిని కాస్త బెదురుగా అడిగింది.

"అంటే - జీవితాన్ని అనుభవించాలి.... you should have a good time before it's late ....సమయం మించిపోక ముందే...."

"అంటే.... డాన్స్, డ్రింక్స్ మరి .... మరి.... లవ్....అంతేనా ?" అని నవ్వేసింది మందాకిని.

"అవును, అవి కొన్ని ముఖ్యసాధనాలు, నిజమే...."

"చూడండి, నేను భారత స్త్రీని. హిందూ యువతిని. మేమింకా ఇప్పుడిప్పుడే వంట గది వదిలిపెట్టి బయటికి వస్తున్నాం. మా కిదంతా కొత్త ప్రపంచం. వొట్టి పుస్తకాల్లో, సినిమాల్లో మాత్రం కల్పనా ప్రపంచం...."

"ఓహ్ అయితే, ఇంగ్లండ్ వెళ్ళాక ఎలా వుంటారు ?" రోమ్‌లో రోమన్స్‌లా వుండాలని తెలీదూ ?"

"ఏం? ఎక్కడున్నా ఇండియన్ ఇండియనే కదా ? రోమ్‌లో ఇండియన్లలాగా వుండలేమా ?"

"వెల్, వెల్, వెల్ - మీ ప్రయత్నం సఫలమవు గాక! If you don't mind,

మీ వయసెంత ? ఇలా అడగడం బ్యాడ్ మేనర్స్ అని తెలుసు. అయినా కుతూహలం... మీ ఇండియన్స్ వయసే అర్థం కావడం లేదు."

"ఇరవై అయిదు."

"ఓహ్ గ్రేట్ మజాగా వుండడానికి సరి అయిన వయసు. ఓకే, మళ్ళీ కలుద్దాం. బై బై...." అని చిరునవ్వు నవ్వుతూ వెళ్ళిపోయాడు.

వయసు 28-29 అయినా ఇరవై అయిదు అని చెప్పడమే అలవాటయిపోయింది మందాకినికి. తను నిజంగా ముసల్దాన్నయిపోయాననే ఆమెభావం. తన బ్రతుకంతా మొదట చదువుకోవడానికి, తరువాత వుద్యోగంలోను, తల్లిని, తమ్ముళ్ళని చూసుకోవడంలోనూ గడిచిపోయింది. బి.ఎ. అవగానే ప్రొ. కరందికర్‌గారు తమ ఇష్టాన్ని విన్నవించుకున్నారు. ఆ తరువాత ఆమె సహోద్యోగి దేశ్‌పాండే అప్పుడప్పుడు ఇంటికి వచ్చి తన ప్రేమను వ్యక్తం చేసి ఆమె చేత లేదనిపించుకున్నాడు. ఆమె ఉద్యోగ దీక్ష, పిల్లల మీద మమత, స్కూలు పట్ల భక్తి - అన్నీ చూసి మిషనరీలు స్కాలర్‌షిప్ ఏర్పాటు చేసి బిజల్ హార్ట్స్ పంపే ఆలోచన చేశారు - మూడేళ్ళ బాండు రాయించుకుని. ఇకనేం, సర్వీసునే పెళ్ళి చేసుకు న్నట్టయింది. తప్పేమిటి? ఒక విధంగా ఆమె చాలా లక్కీ - అదృష్టశాలి. అందరికీ ఇలా స్కాలర్‌షిప్ మీద ఇంగ్లండ్‌కి వెళ్ళే అవకాశం దొరుకుతుందా ? ఆమె అసాధారణమైన వ్యక్తి గనుకనే ఇదంతా కలిసి వచ్చింది మరి! ఆమె కిప్పుడు ఒక్కటే ఆలోచన. ఇంగ్లండ్ వెళ్ళాలి. అక్కడ టి.డి. లో ఫస్ట్ క్లాస్ తెచ్చుకుని మంచి పేరు గడించాలి. వచ్చి ఇప్పుడుండే స్కూల్లో 3-4 ఏళ్ళు పనిచేసి తరువాత ఏదైనా హైస్కూల్ ప్రిన్సిపాల్ అవ్వాలి. మంచి ఆదర్శప్రాయమైన ప్రిన్స్‌పాల్ అవడం కన్న బ్రతుకులో ఎక్కువగా కోరుకోవలసింది ఏముంది? ఎంతో మంది మిషనరీ స్త్రీలు పెళ్ళి కాకుండా వుండటం లేదూ ? వాళ్ళ స్కూల్ ప్రిన్సిపాల్ మిస్ టేలర్ లేదూ ? అలాగే నిస్వార్థమైన సేవకు తన జీవితాన్ని అంకితం చేయడంలో ఎంతో ఔన్నత్యం తో కూడిన ఆనందం లేదూ ?....ప్రస్తుతం మందాకినికి కొద్దిగా ఆకలి వేస్తున్నట్టు అనిపించింది. భోజనపు మెనూ కార్డులో వున్న కోప్సికమ్ కరీ, సిలోన్ స్పాంజ్, డ్యుచెఫ్ సలాడ్ లాంటి రోమాంటిక్ పేర్లు గుర్తు వచ్చి, ఇవాళ అలాంటి పేర్లేవయినా వస్తే తప్పకుండా నోట్ చేసుకుని రేపు తమ్ముడికి రాసే వుత్తరంలో మర్చిపోకుండా రాయాలని అనుకుంటూ మెట్లు దిగడం ప్రారంభించేసరికి దిగంతం నలుపు రంగుకి తిరిగింది.

2

విపరీతంగా ఉక్కబోస్తోంది. ఇంకొక్క రోజులో ఓడ ఎర్ర సముద్రం

చేరుకోబోతోంది. ఎంతోమంది బయట ఓపెన్ డెక్‌మీద క్యాంప్ కాట్‌ల్లో పడుకుని పున్నారు. కొందరు ఈజీ చెయిర్స్‌లో కూర్చుని బార్‌నుంచి ఏవో పానీయాలని తెప్పించి తాగుతున్నారు. మాట్లాడుకుంటూ గట్టిగా నవ్వుకుంటు న్నారు. వెదులుగా వున్న స్లీవ్‌లెస్ బ్లౌజ్ తొడుక్కుని నిండైన తొడలు కనిపించేలా చెడ్డీ వేసుకున్న పార్శీ అమ్మాయొకతి, మధ్య వయస్కుడైన ఆమె జతగాడితో కలిసి 'ఎ' డెక్‌కి, అంటే లవర్స్ డెక్‌కి పోతుంటే తాగుతూ కూర్చున్న మనుషులు ఆమె వేపే నిక్కి నిక్కి చూడసాగారు. కాసేపటికి తప్పట మొహంతో, చీరెతో వున్న ఒక థాయ్‌లాండ్ పొట్టిపిల్ల, గడకర్రలా ఎత్తుగా ఉన్న ఆస్ట్రేలియన్ కుర్రాడితో 'ఎ' డెక్ వేపు వెళ్ళినపుడు ఆజనం మళ్ళీ ఏవో గుసగుసలుపోతూ నవ్వుకోసాగారు. ఆ మనుషుల వేపు వీపు తిప్పి కూర్చున్న మందాకినికి తక్షణం లేచి తన కేబిన్‌లోకి వెళ్ళిపోవాలన్న కోర్కె కలిగింది. కాని ఆమె పక్కనే కుర్చీలో కూర్చున్న ముఖర్జీ ఆమెని వదిలితే కద!

"మందా, ఎందుకింత తొందరగా .... ఇది మరీ అన్యాయం"

"ఇప్పుడు పదకొండయింది. హౌసి హౌసి ఆట పూర్తయ్యే ఒక గంటయ్యింది. మీరు పదండి ఇప్పుడే వస్తాను అని "మిసెస్ మోహిత్‌కి చెప్పి వచ్చాను 'డి' లౌంజ్‌లో పాపం ఆవిడ నా కోసం ఎదురు చూసి, ఎదురుచూసి పడుకోవడానికి వెళ్ళిందో ఏమో...."

"నీ రూమ్ మేట్ జోసెఫ్ ఎలా వుంది ? సర్దార్జీకి భలే హాత్ ఇచ్చిందిలే. నిన్న ఆమెని ఒడలో సెకండ్ ఇంజనీయర్ గదిలో చూశాను....అవకాశం తలుపు తట్టినప్పుడు వదిలిపెట్టద్దని అంటారే....ఇంతకీ ఆవిడ రాత్రి ఎప్పుడు తిరిగి వచ్చింది ?"

"రాత్రి కేబిన్‌కి ఎప్పుడు తిరిగొచ్చిందో నాకు తెలియదుగాని, ఉదయం నుండి మాత్రం పత్తా లేదు. ఎక్కడన్నా కూర్చుని 8-10 వుత్తరాలు రాయాలని మాత్రం చెప్పింది. ఇంతవరకు కనిపించలేదు. ఈ మధ్యన నాతో మొదటిలా ఫ్రీగా మాట్లాడ్డమే లేదు."

"ఎందుకో తెలుసా ? ఏడన్‌లో షాపింగ్‌కి వెళ్ళినపుడు తనని వదిలేసి మిమ్మల్ని తీసికెళ్ళానని కోపం."

"అంటే ఆమె చేపని నేను వలలో వేసుకున్నానని ఊహించుకుంటోందా ఏమిటి ?"

"వేసుకోలేదా మరి ?"

మందాకిని తడబడింది. "మీతో షాపింగ్‌కి వెళ్ళినంత మాత్రాన అర్థాలు కల్పించాలా ? మీరు తప్పుగా అనుకోలేదు కదా "

"ఛ! అందులో తప్పుగా అనుకుందు కేముంది ? నేరు విప్పి చెప్పాల్సిన అవసరం లేదు కదా నేను మిమ్మల్ని లైక్ చేస్తున్నానని."

"మీకు మొదట సరోజ లైకింగ్ అయింది. తరువాత ఒక్క రోజులోనే నర్సింగ్‌కి వెళ్ళిన కేరళ అమ్మాయి లైకింగ్ అయింది."

"ఓహ్ ఆ కేరళ అమ్మాయి సంగతి చెప్పకండి చాలా చౌక బారు రకం. ఇంగ్లీష్ కాస్త బాగా మాట్లాడుతుంది. కొంచెం jolly టైప్ కదా అని అమెతో .... అమెతో 'ఏ' డెక్‌కి రాత్రివేళ వెళ్ళటమే తప్పయింది. అందువల్లనే ఏవేవో scandals – అపవాదులు పుట్టి వుంటాయి. ఇక డా॥ సరోజ అంటారా, రాక్షసి, దెయ్యం .... దాన్ని రెండు రోజులు భరించడమే గొప్ప సంగతి...."

"ఏం అలాంటి పనేం చేసింది ? నా మటుకు నాకు ఆవిడ స్వభావం నచ్చింది"

"తగలడ్డట్టే వుంది దాని స్వభావం. నిన్ను తీసికెళ్ళినందుకు దాని కెంత కోపమో తెలుసా ? తనేవన్నా నన్ను కట్టుకున్న పెళ్ళామా, కన్న తల్లా ? – ఎప్పుడూ కొంగునే, వేలినే పట్టుకుని తిరగడానికి ? నాకు కావలిసిన వాళ్ళని నాతో తీసికెళ్ళే అధికారం లేదా నాకు ? స్వంత భార్య అయినా సరే నా నుంచి ఈ అధికారాన్ని లాక్కోలేదు."

"అంటే....? కాదు.... ప్లీజ్....చాలా టైమయింది. నేను కేబిన్‌కి వెళ్ళాలిక."

"వాహ్....ఇవాళ నువ్వు చెప్పినట్టల్లా తు.చ తప్పకుండా నడుచుకున్నానా ? నువ్వు తాగొద్దన్నావా ? మానేశాను. నీకు సిగరెట్ వాసన పడదన్నావని ఇవ్వాళల్లా సిగరెట్ ముట్టుకోనే లేదసలు."

"నేను చెప్పినట్టుగా మీ రెందుకు వినాలసలు ?"

"ఎందుకంటే నేను చెప్పినట్టు నువ్వు వినాలని....హ .... హ....హ...." అని నవ్వాడు. "నీతో వుండటం అంటే మద్యం కన్న ఎక్సైటింగ్‌గా వుంటుంది మందా!" అక్కడ కూర్చున్న జనం అంతా వెళ్ళిపోయారు. "పద, మనం కూడా 'ఎ' డెక్ మీదికి వెళదాం....ఏం ? నువ్వు ఎంత నైన్‌గా వుంటావో తెలుసా ? ఐ లవ్ యు...."

" I am sorry మీరు నిజంగా నా విషయంలో పొరబడ్డారు. గుడ్ నైట్...." అంటూ మందా పైకి లేచింది. ముఖర్జీ చటుక్కున అమె చెయ్యి పట్టుకుని లాగాడు. పట్టు తప్పి అతని మీద పడబోయినా, తన శక్తినంతా కూడ తీసుకుని తమాయించుకుని, అతని చేతిని విదిలించి, చక చక దగ్గరున్న మెట్ల వేపుగా దిగి 'సి' డెక్‌కి వచ్చింది. అటు 'డి' డెక్ వేపు వెళ్ళే మెట్ల దగ్గర చీకట్లో ఓ జంట కౌగిట్లో మైమరిచి వున్నారు. కేబిన్ల మధ్యన సన్నగా చీలిన దారి గుండా అ

కొసకున్న మరో మెట్ల వేపు పరిగెత్త సాగింది. కాని మధ్యలో ఒక్ బార్ లౌంజ్ వుండడంతో వేగం తగ్గించి ఒక వారగా వెళ్ళిపోదా మనుకునేసరికి హ్యారీ మెకార్థి ఆమెని పిలిచాడు.

"మిస్ భాటే. మిస్ భాటే ఏమిటలా హడావుడిగా పరిగెడుతున్నారు ? ఎక్కడికి ?"

"నా కేబిన్‌కి"

"ఓ, ఐదు నిమిషాలు నాతో కూర్చోకూడదూ ? ప్లీజ్...."

మందా పక్కనున్న కుర్చీలో కూలబడింది. చేతిలో ఓ విస్కీగ్లాసుని తిప్పుతూ "మీ అనుమతి వుంటేనే" అని అడిగి ఆమె సమ్మతి తీసుకుని ఓ గుక్క తాగాడు. "ఎలా వుంది మీ జీవితం ?"

"అసహ్యం వేస్తోంది మగాళ్ళంటే తోడేళ్ళు."

"ఏం ? ఏం జరిగింది ? నిన్నట్నుంచి నీతో బాటు తిరుగుతున్న ఆ కలకత్తా డాన్‌వాన్ బాగానే వున్నాడే"

"ఆ తోడేలు నుంచే ఇప్పుడు తప్పించుకుని పారిపోయి వస్తున్నాను...."

"ఏం ? ఏం చేశాడతడు ?"

"నేనంటే చౌకబారు మనిషి ననుకున్నాడు. ఎంత ధైర్యం, సిగ్గు లేకుండా నన్నలా అడగడానికి. మా దేశం గనుక అయ్యుంటే చెప్పుచ్చుక్కొట్టేదాన్ని. పోలీసులకి అప్పచెప్పేదాన్ని."

"ఓరి దేవుడా! ఇలాటి వన్నీ అంత సీరియస్‌గా తీసుకుంటారా మీ దేశంలో? అయితే అక్కడి జీవితం భయంకరం అన్నమాట. పహారా కాసే బూట్లు, విజిల్ వేస్తూ తిరిగే పోలీసులూ...."

"అలాగేం వుండదు లేండి...."

"మిస్ భాటే, నువ్వు చాలా ఎక్సైట్ అయినట్టున్నావ్. ఓ డ్రింక్ తీసుకుంటే మంచిది. నరాలకి.... "

"నే. థాంక్స్ .... "

"ఓ గ్లాస్ బీరు తీసుకో కనీసం చైతన్యం వస్తుంది. నరాలు సర్దుకుంటాయి. ట్రై, నచ్చక పోతే వదిలెయ్.... వేటర్.... ఓ లాగర్...."

మందాకిని చెప్పసాగింది. "మా దేశంలో 17-18 ఏళ్ళ పడుచువాళ్ళు మాత్రమే ఇలా బిహేవ్ చేస్తారు. కాని ఇలా.... అందరూ...."

వెయిటర్ తెచ్చిన బీరుని మందాకిని (మందా, ఇంగ్లండ్‌లో బీరు, జింజర్ ఏల్, కొంచెంగా వైన్ తీసుకుందుకు అభ్యంతరం లేదు" - అని ప్రిన్సిపాల్ మిస్ టేలర్ చెప్పింది. 'జలుబు చేస్తే బ్రాంది కంటే ఉత్తమ ఔషధం ఇంకోటి లేదు' అనీ

చెప్పింది). బెదురుతూ మొహం చేదుగా పెట్టి కొద్దిగా తాగి, "మరీ అధ్వాన్నంగా లేదు" అంది.

"ఈ ఓడ మనుషుల్ని పిచ్చి వాళ్ళని చేస్తుంది కదూ!" మెకార్థీ నవ్వాడు. "మా దేశంలో ఇలాంటి చిన్న విషయాల్ని పట్టించుకోము అసలు...."

"కావచ్చు.... నేననేది ఎక్కడో యూరోపియన్స్ చేస్తారని మనం కూడా వాళ్ళ నడతని ఎందుకు కోతుల్లా అనుకరించాలి ?"

"అంటే ? నీ కలకత్తా స్నేహితుడు మా విధానాల్ని కోతిలా అనుకరించాడా లేక ఏ నిర్బంధమూ లేక ప్రకృతి సహజంగా ఉద్రిక్తుడయ్యాడా ?"

"అలా నిర్బంధం అనేది లేకుండా స్వైర విహారం చెయ్యడానికి అనుమతిస్తే జనం కుక్కల్లా ప్రవర్తిస్తారు తోదేళ్ళైపోతారు .... తరువాత .... బ్రతుకంటేనే...."

"వెయిటర్.... మరో బీర్...."

"ఊహూ .... వొద్దు....నిజంగా వొద్దు ...."

" ఏం ? నచ్చలేదా నీకు ? సైడర్ తీసుకోవల్సింది. తియ్యగా వుండేది.... లేదా తియ్యగా వుండే వైన్ ఏదైనా చెప్పనా ?"

"ప్లీజ్! ఇంకేమీ వద్దు. అసలు దీన్నే తీసుకోకుండా వుండవల్సింది."

" My dear girl, నువ్వు ఇంగ్లండ్‌కి బయలుదేరావ్. ఇలా అదివొద్దు, ఇదివొద్దు అంటూ పోతే అక్కడ వుండడమే కష్టమై పోతుంది. అటు, చూడు ఆ దిగంతం వేపు, ఒక ఓడ తూర్పు వేపు బయలుదేరుతోంది. ఇండియాకి తిరిగి వెళ్ళి పోతానంటే చెప్పు, నేను కాప్టన్‌తో చెప్పి నిన్ను ఆ ఓడలోకి ట్రాన్స్‌ఫర్ చేయిస్తాను." అంటూ నవ్వుతూ ఆమె వెన్ను తట్టాడు.

మందాకిని కూడా మనఃపూర్వకంగా నవ్వింది. మరోసారి కిటికీలోంచి తొంగి చూసింది. రాత్రివేళ దీపాలతో ధగధగ మెరుస్తున్న దూరపు ఓడ అందంగా కనిపించిందామెకు. "థాంక్స్, గుడ్‌నైట్" అంటూ పైకి లేచింది.

"స్లీప్ వెల్" అన్నాడు వృద్ధ హ్యారీ చిరునవ్వుతో.

3

మధ్య ధరా సముద్రపు నీలపు అలలనుంచి వీస్తున్న చల్లటి గాలి హాయి గొలుపుతోంది. ఉత్తర దిగంతాన ఎక్కడైనా గ్రీసు దేశపు నేల కొంచెమైనా కనిపిస్తుందేమోనని ఉత్కంఠతో ఎదురు చూస్తోంది మందాకిని. అక్కడక్కడ సముద్రపు బిడ్డల్లా కనిపించే చిన్నచిన్న ద్వీపాలు, పశ్చిమాద్రిన వున్న సూర్యుడి అందమైన వెలుగులో పసిపాప నవ్వుతూ పడుకున్నట్టు పడుకున్నాయి.

"క్రీట్ - గ్రీస్ ద్వీపాల మధ్యగా వెళుతుందట మన ఓడ." ఆమె రెండు

రోజుల స్నేహితుడు సప్రూ చెప్పాడు. "నేనైతే నవ్వరినే అఖాతం ఎప్పుడు వస్తుందా అని ఆత్రంగా ఎదురు చూస్తున్నాను. గ్రీసులోని ఓ ముక్క నేలని చూసినా, ధన్యుడినే. గ్రీకు సంస్కృతిలాంటి సంపన్నమైన, ఉన్నతమైన సంస్కృతి మరొకటి లేదు. బైరన్ గ్రీసు దేశం కోసం పుట్టేనే చావలేదు. అన్నట్టు నేను పిరమిడ్స్ మీద రాసిన కవిత ఎలా వుంది మీకు ? మీరు కైరో ట్రిప్ కొస్తే ఎంతో బాగుండేది."

ఎందుకోగాని మందాకిని కైరో ట్రిప్‌కి వెళ్ళలేదు. సూయజ్ నుంచి ఫోర్ట్‌సైట్ వరకు మిసెస్ మోహిత్‌తో ఆమె సురక్షిత సహవాసంతో గడిపివేసింది. "గలి గలి" గారడీ ఆటగాడు నిండు తొడల పార్శీ అమ్మాయి బ్లౌజ్‌లోంచి కోడిపిల్లని తీశాక, మందా చీరె కింద నుంచి ఆ కోడి పిల్లని తీసినప్పుడు మాత్రం ఆమెకు గాభరాతో ముచ్చెమటలు పోశాయి. ఆ భయంకర క్షణాలను తప్పిస్తే మరే విధమైన విపరీత సంఘటనలూ జరుగలేదు. 'గలి - గలి' ఆట తరువాత ప్రారంభమయిన డాన్స్ ప్రోగ్రాంకి ఆస్ట్రేలియన్ యువకు డొకడు (బహుశః తాగుంటాడు ) వచ్చి "మేడమ్, మీతో డాన్స్ చెయ్యొచ్చా ?" అంటూ ఆమె కళ్ళలోకి గుచ్చి చూసి అడిగాడు. నాకు డాన్స్ చెయ్యడం రాదని ఎంత చెప్పినా వినలేదు. అప్పుడామెను మిసెస్ మోహిత్ అతనిబారి నుంచి రక్షించింది. "రాదంటుంటే ఆమె నెందుకు ఇబ్బంది పెడతావ్ ? నడపతలకి" అని దబాయించింది - తన సగం సగం ఇంగ్లీషులో. ఫోర్టుసైడ్ వదిలాక ఒక ఇరవై - ఇరవై రెండేళ్ళ కుర్రాడు సప్రూ మందాకినితో పరిచయం చేసుకుని ఆమె నంటిపెట్టుకు తిరగసాగాడు. తండ్రి ఖర్చుతో కేంబ్రిడ్జ్‌లో ఫిలాసఫీ వ్యాసంగం కోసం బయలుదేరాడు. "తను కేవలం తత్వజ్ఞాని మాత్రమే కాకుండా కవిని కూడా" అని చెప్పుకుంటూ ఆమెతో కబుర్లాడుతూ ఆమె చుట్టూ తిరుగుతూ వుండేవాడు. ఏమైనా అతను ప్రమాదం లేని మనిషి. సాత్వికుడు. మిసెస్ మోహిత్‌లాగ అతనూ 'సేఫ్' అన్న నమ్మకం కలిగినందువల్ల అతన్నిఅలాగే వుండ నిచ్చింది. కాని ఇవాళ మాత్రం అతని మాటల్ని అలా వింటూ కూర్చోవడం ఆమెకు విసుగని పించింది.

"నాకా కవిత ఏమీ అర్థం కాలేదు....అసలు కవితలు నాకంతగా అర్థం కావు ....అయినా బాగానే వుంది వుంటుందిలే....అందిగాని పొద్దు పోవడానికేదో ఒకటి మాట్లాడుతూ వుండాలి గనుక, "మిస్టర్ సప్రూ (మిస్టర్ అని అదే పనిగా చేర్చింది) "నీకు సైకాలజీ తెలుసుకదా, నిన్న నాకు ఓ కల వచ్చింది. దాని అర్థం చెబుతావా ?" నేను అరబ్ స్థాన్‌లో ఎరుపు రంగు గుర్రం ఎక్కి వెడుతున్నానట...."

"తెలిసింది మందా బహెన్ గుర్రం అంటే ఫ్రాయిడ్ ప్రకారం సెక్స్...."

"పో అయితే, నేనిక నీ కేమీ చెప్పను. పోనీ నాకు అహ్మద్‌నగర్‌లో వున్నప్పుడు ఒక కల వచ్చింది. అందులో సెక్స్ ఎక్కడుందే చూద్దాం. ఆ కలలో ఒక పిచ్చిది నా వెంట బడింది. నేను తప్పించుకు పారిపోతున్నాను. పొరపాటున ఏదో ఇంట్లోకి దూరాను.

"చూడండి బహెన్, పిచ్చిది, లేదా పిచ్చి అంటే మీ అంతర్యంలోని కోరికలకి ప్రతీక - అంటే సెక్స్"

"నువ్వు భలే తెలివైన కుర్రాడివిలే"

"నిన్న నా క్కూడా ఒక రొమాంటిక్ కల వచ్చింది, మందా బహెన్.... అందులో మీరున్నారు."

"చుచ్....చుచ్....చుచ్....నా గురించి కలలు కనెచ్చా నువ్వు? నీ లాంటి కుర్రాళ్ళు నీ వయసు అమ్మాయిలతో వెళ్ళాలి, హాయిగా గడపాలి. కదూ? అదిగో అక్కడ కేరం ఆడుతోందే ఆ మలయాళీ అమ్మాయి.... అలాంటి అమ్మాయిని వెతక్కో పో, ఏం ?"

"నాకు తెలిసిన వాళ్ళంతా నన్నేడిపిస్తున్నారు నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నానని."

"నువ్వు! నన్ను....! అహా....జనానికున్న కల్పనా శక్తిని మెచ్చుకోవాల్సిందే. ఇక మీదట మనం కలిసి మాట్లాడు కోకపోవడమే మంచిది."

మందాకినికి తన చేతిలోని పుస్తకం చదువుకుందామనిపించింది. అంతలో, "May I Join you ? నేను మీతో కలిస్తే అభ్యంతరం లేదు కదా ?" అంటూ ఓ యూరోపియన్ తల వంచి, మొహంలో స్నిగ్ధమైన చిరునవ్వు నింపుకొని, "నా పేరు పాల్ లెగ్వి, అసలు పేరిస్ మాది. ఇప్పుడుండేది లండన్‌లో. లిమోజిన్‌కి బిజినెస్ మీద వెళ్ళాను. ఇప్పుడు లండన్‌కి తిరిగి వెళుతున్నాను. మీరు ఇండియన్స్ కదూ ? నాకు ఇండియన్స్ అంటే చాలా ఇష్టం. వండర్‌ఫుల్ దేశం. నెహ్రూ చాలా గొప్ప మనిషి. వండర్‌ఫుల్ మ్యాన్. మీ పేర్లు తెలుసుకోగలిగే ఆనందాన్ని కలుగజేస్తారా నాకు ప్లీజ్!"

సంజీవ్ సప్రూ, మందాకిని తమ పేరు చెప్పి తాము ఎక్కడికి, ఎందుకు వెళుతున్నారో చెప్పారు.

"వెరిగుడ్ మొస్సొర్ సప్రూ, మీరు ఫిలాసోఫర్ - అంటే దైవం మాకు, పాపం, పుణ్యం ఇలాంటివన్నీ మా తలమీదుగా వెళ్ళిపోతూ వుంటాయి. మడామ్‌బోట్యే, చరిత్ర - ఆహ్! నాకు ప్రియమయిన విషయం : ట్యాంబర్లేన్, అలెగ్జాండర్ ది గ్రేట్ , నెపోలియన్, ఫ్రెంచ్ విప్లవం, మొగల్ బాదుషాలు, క్లియోపాత్రా -

ఏంటొనీ, సీజర్ - వండర్‌ఫుల్! గిబ్బన్ రాసిన "Decline and Fall of the Roman Empire" పుస్తకం నేనొక ఏడాది పాటు చదివాను. దానిని చదవేటపుడే నా ఇంగ్లీషు భాష మెరుగుపడింది..మీకు ఏమి డ్రింక్స్ తెప్పించమంటారు?"

"మేము డ్రింక్స్ తీసుకోం" క్షమించమన్న కంఠంతో అంది మందా.

"నో డ్రింక్స్! వండర్‌ఫుల్! ఫ్రాన్స్‌లో వైన్ లేకుండా బ్రతకడమే అసాధ్యం. ఇది చాలా అన్యాయం. నేనొక్కడినే ఎలా తీసుకోను ? వెల్....వెల్....జింజర్ - ఏల్ అన్నా తీసుకోండి.... ఏం?"

"సరే" అనక తప్పలేదు మందాకినికి. అతని నవ్వుతున్న కళ్ళల్లో మీరేదైనా తీసుకు తీరాలన్న అభ్యర్థన కనిపిస్తోంది.

రెండు జింజర్లతో బాటు లెగ్వి తన కోసం ఏదో మాణిక్యం లా మెరుస్తున్న ఎర్రటి పానీయాన్ని తెప్పించాడు. "దీన్ని రుచి చూడాలి మీరు....కొన్యకా ప్రాంతపు ఒక కాక్‌టేల్ ఇది....మీ అనుమతితో....చీర్స్...." మాట్లాడే టప్పుడు అతని చూపులు ఒక్క క్షణం కూడా మందాకిని మీద నుంచి కదల్లేదు.

మందాకినిలో నెమ్మదిగా ఎక్కడలేని చైతన్యం పొంగి రాసాగింది. పాల్ లెగ్వి వేపు కళ్ళు తిప్పి కుతూహలంగా అతని అంగాంగాలనూ పరీక్షగా చూసింది.

"మీరు మార్సెల్స్‌లో దిగి ప్యారిస్ చూసుకునే కదూ లండన్‌కి వెళ్ళడం ?" లెగ్వి మందాకినిని అడిగాడు.

"ఊహు ((, జిబ్రాల్టర్ మీదుగా తిన్నగా లండన్‌కి"

లెగ్వి మొహంలో విషాద ఛాయలు తొంగి చూశాయి. "జిబ్రాల్టర్ మీదుగా లండన్‌కా ? ఓహ్! నాకు చాలా దుఃఖంగా వుంది. సెప్టెంబరులో ఫ్రాన్స్.... అందులోనూ ప్యారిస్, అంటే స్వర్గమే అనుకోండి. మదామ్ నాతో బాటు వచ్చుంటే, ప్యారిస్ అంతా చూపించి వుండేవాడిని.... ప్యారిస్‌లోని సౌందర్యాన్నంతటినీ పిండి మీ కప్పులో పోసేవాడిని. జాలి చూపులు చూస్తూ, హాస్యం మిళాయించి అంటూ రెండు గుక్కలు కాక్‌టేల్ తాగాడు.

"నా టికెట్ మార్చవచ్చా ఇప్పుడు ? " చిన్న పిల్లలా అడిగింది మందాకిని.

ఇద్దరి చేత నిర్లక్ష్యం చెయ్యబడి, తనపాటికి తను జింజర్ తాగి వూరికే కూర్చున్న సప్రూ చప్పున లేచి నిలబడి "మిస్టర్ లెగ్విథాంక్స్....నేనిక వెళ్ళాలి.... బైబై" అంటూ బయలుదేరాడు. లెగ్వి సగం లేచి "మెర్సి, మొస్యూర్, అరివాయర్" అని చెప్పి, మళ్ళీ మందాకిని వేపు తిరిగి మాటలు ప్రారంభించాడు. మందాకిని కూడా "మళ్ళీ కలుద్దాం" అనేసి వెంటనే లెగ్వి వేపు తన నవ్వుతూన్న ముఖాన్ని తిప్పేసింది. సప్రూ వెళ్ళడం కోసమే కాచుకు కూర్చున్నట్టు అతనలా వెళ్ళగానే ఆమె హృదయం ఝల్లుమని కంపించింది.

లెగ్వీ మందాకినిని ఆ రోజంతా వదలనే లేదు. డిన్నర్ అయ్యాక బార్‌లో ఓ మూలగా కూర్చుని ఆమెతో చెప్పని కబుర్లే లేవు. ముఖర్జీ - జోసెఫ్ ల జంట దూరం నుంచే వీళ్ళ వేపు చూసి కన్ను కొట్టి వెళ్ళింది. పరిచయం లేని వ్యక్తులు కూడా మందాకిని వేపు చూడగానే ఓ సారి కళ్ళు విశాలం చేసి చూసి మరీ వెళుతున్నారు. మందాకినికి మొహమాటంతో బాటు, ఆనందంగా కూడా వుంది. లెగ్వీ సహవాసంతో మాణిక్యంలా మెరిసే పానీయపు మత్తు వుంది. మందాకినికి లెగ్వీతో ఒకే సోఫాలో కూర్చుని స్నేహితుల్లాగా కబుర్లు చెప్పుకోవడంలో తప్పేమీ కనిపించలేదు.

కాస్త స్వేచ్ఛగా వుండే ఈ కొత్త రకపు ఫ్రెంచ్ నడివయస్కునితో కూర్చుని ఎందుకు మాట్లాడుకో కూడదూ! వేరు వేరు దేశాల, వేరు వేరు ప్రజలపరిచయానుభవం అవసరం కదా, పర దేశాలు వెళ్ళేవారికి . కాకపోతే ఇంత దూరం, ఏడు సముద్రాలు దాటి వెళ్ళడం ఎందుకు ? జనం ఏమన్నా అనుకోనీ, ఆ మొద్దు స్వరూప్ గురించి కూడా అనలేదూ ?....ఒకసారి లండన్ చేరుకుంటే ఇక వీళ్ళెక్కడో తనెక్కడో! అదీకాక ఎల్లుండి లెగ్వీ మార్సెల్స్‌లో దిగిపోయే వాడు. ఆమెతో -మిగతా వాళ్ళందర్నీ వదిలేసి, అరమరికలు లేకుండా - ఇంత ఆసక్తి చూపిస్తూ, రకరకాల కథలు చెబుతూ నవ్విస్తున్నాడంటే - ఈ అనుభవాన్ని సిగ్గుతో, మొహమాటంతో ముడుచు క్కూర్చుని పోగొట్టుకోవడ మెందుకు ?.... రాత్రి పదకొండయ్యాక మందా తన కేబిన్‌కి వెళ్ళడానికి పైకి లేచింది. లెగ్వీ తనూ లేచి ఆమె చేతిని ముద్దాడి, "ఏం ? బాగా అలసిపోయారా ? మిమ్మల్ని చాలాసేపు కూర్చోబెట్టి మీ నిద్రకి ఇబ్బంది కలిగించానేమో . క్షమించాలి .... ఆహ్.... ఈ చీరలో మీరెంత అందంగా కనిపిస్తున్నారో.... రాజకుమారిలాగ! గుడ్‌నైట్.... రేపు కలుసుకుందాం." అన్నాడు. అతని ఫ్రెంచ్ వినయం, కోమలమైన ఆత్మీయత , అతని పెదవుల మృదుస్పర్శ.... ఆమె హృదయంలో స్పందనని కలిగించాయి. కేబిన్ వేపు వెళ్ళేటప్పుడు ఆమెకు తానొక స్వప్న ప్రపంచంలో తేలిపోతున్నట్టు (బహుశః దానిక్కారణం లెగ్వీ తాగించిన పోర్ట్‌వైన్ పరిణామం కావచ్చు) అనిపించింది. కేబిన్‌లోకి వెళ్ళి, అందమైన ఎరుపురంగు పట్టుచీరెలోని రాకుమారిని అద్దంలో చాలా సేపు చూసి, చీర మార్చాలనిపించక, సగం తెరిచిన పోర్ట్‌హోల్‌లో తలపెట్టి, మధ్యధరా సముద్రపు సంగీతం వింటూ నుంచుంది, మిస్ జోసెఫ్ వచ్చి తలుపు తట్టేదాకా.

× × ×

మరుసటి రోజు వుదయం, మధ్యాహ్నం లెగ్వీ పత్తా లేదు. మందాకిని పిచ్చిదానిలా అటు నుంచి ఇటు, ఇటు నుంచి అటు అన్ని డెక్స్‌లో, లాంజుల్లో,

బార్‌ల్లో, లైబ్రరీలో, కారిడార్‌ల్లో తిరిగి చూసింది ఎక్కడా అతని జాడే లేదు. నాలుగు గంటలకి కాఫీ తీసుకున్నాక ఒక చోట మెట్ల మీద సప్రూ కలిశాడు. "ఏమిటి? నా కోసం చూస్తున్నారా?" అన్నాడు. ("లేదు, లేదు మిసెస్ మోహిత్ కోసం చూస్తున్నా" అంది.) ఆమె 'ఇ' డెక్ మీద కూర్చుందగా చూశాను. చిన్న పిల్లల ఫ్యాన్సీ డ్రెస్ కాంపిటీషన్ చూస్తున్నారు. ("ఓహ్, నేను మరిచే పోయాను." అంటూ పరుగున వెళ్ళింది.

అది 'గాలా డే'! ఆటల పోటీలు, ఫాన్సీ డ్రెస్ పోటీలు, సంగీత కచేరీలు .... ఓడంతా సంభ్రమంతో, పండుగ వాతావరణంతో, హడావుడితో నిండిపోయింది. ఎక్కడా మందాకిని మనసు నిలకడగా లేదు. డిన్నర్ టైమవుతోంది గనుక గాలా డిన్నర్‌కి తయారవుదామనుకుంది. పసుపురంగు పట్టుచీర కట్టుకుందామనుకుంది. తన కేబిన్‌కి వెళ్ళి ఆ ప్రయత్నంలో పడింది. ఏడు గంటలకి ఇంక ఐదు నిమిషాలు మాత్రమే వుంది, ఇక బయలుదేరాలి అనుకుంటూ తన కొత్త భర్జరి సాండల్స్ వేసుకుంటోంది. అంతలో కేబిన్ తలుపు కొట్టిన చప్పుడయింది. "ఎవరూ ?". "నేను లెగ్వి !" ఆమె గుండె వడి వడిగా కొట్టుకుంది - రెండో సాండల్ పూర్తిగా వేసుకోకుండానే వెళ్ళి తలుపు తీసింది.

" I am sorry, ఇవాల్టి గాలా డిన్నర్‌కి మా డైనింగ్ రూమ్‌కి రావాలి - నా గెస్ట్‌గా ---- మీకేం అభ్యంతరం లేదు కదా" - లెగ్వి కంఠంలో, కళ్ళల్లో, ఆహ్వానంలో ఏదో మాయ వుంది.

" I am sorry , కేబిన్‌లో అంతా అస్తవ్యస్తం...."

"మీరు మా కేబిన్ చూడాలి. అదిగో హడావుడిలో మీరు సాండల్స్ పూర్తిగా వేసుకోనే లేదు. కమాన్, నేను సాయం చేస్తాను." అంటూ వంగి కాళ్ళ స్యాండల్ వెయ్యబోయాడు.

"ఒద్దు ప్లీజ్ !" మందా అరిచింది.

"లవ్లీ సాండల్స్....మదామ్ మందా, అహ్, మీ పాదాల ఆకారం పెర్‌ఫెక్ట్‌గా వుంది. మీరు గనుక ఫ్రెంచ్ అమ్మాయి అయ్యుంటే నేను ఈ క్షణంలో వాటిని ముద్దాడేవాడిని కదా....అంటూ ఆమె చీర పక్కకి జరిపి స్యాండల్ బకిల్ బిగించాడు.

("థ్యాంక్స్...." మందాకి చమట పట్టేసింది.

లెగ్వి లేచి నుంచుని మందా నడుం మీద చెయ్యి వేసి "పదండి నా ఇండియన్ రాకుమారి" అన్నాడు.)

"నా కేబిన్ ఎలా కనుక్కున్నారు ?"

"అందులో కష్టమేముంది ? ఆఫీస్ కి వెళ్ళి మదామ్ బోతే నంబర్ అడిగా."

"మీరు రోజంతా ఎలా గడిపారు ? ప్రశ్న అడగడంలో ఇబ్బంది లేకుండా వుంటుందనిపించింది మందాకినికి.

"ఓహ్ .... పది గంటలకి లేచాను.... నిన్నటి కాక్‌టేల్స్ .... హేంగోవర్ ....నాది సింగిల్ సీట్ క్యాబిన్ గనుక ఏ ఇబ్బందీ లేకుండా గడిచిపోయింది. నా స్టీవర్ట్ బ్రేక్‌ఫాస్ట్ తెచ్చిచ్చాడు. తరువాత రెండు గంటలు పడుకునే గడిపాను. తరువాత లంచ్.... తరువాత రెస్ట్ - ఇవాల్టి గాలానైట్ కోసం. ప్యారిస్, లేదా లండన్‌లో కూడా అంతే. సాయంత్రం వరకూ రెస్ట్. తరువాత రాత్రి 12 -1-2 గంటల దాకా స్వేచ్ఛగా గడపడం డ్రింక్స్....డాన్స్.... ఇంకా 'అమూర్' .... హహహ...."

మందాకి ఫ్రెంచ్ తెలియదుగాని 'అమూర్' అంటే ఏమిటి అని అడిగే గొడవకి పోలేదు.

'సి' డెక్‌లోని డైనింగ్ హాలు అందంగా అలంకరించబడింది. రంగురంగుల కాగితాల తోరణాలు, బెలూన్లు. అందమైన దుస్తులు ధరించినవాళ్ళు కల -కల, కిల-కిల, కుహుకుహూ. హహ్హా హ - ఇలా రకరకాల నవ్వులు, కూర్చున్న వాళ్ళ తలల మీద పొడుగువి, వెడల్పువి, వంకరవి రకరకాల తమాషా టోపీలు, ఫట్ ఫట్, చిట్ చిట్ అంటూ చప్పట్లు, ఈలలు, కూతలు, 'భాం..' అంటూ వూదుతున్న రంగుల బాకాలు. టేబిల్ మీద రకరకాల చిన్న చిన్న బహుమతులు....వైన్ గ్లాసులు....మధ్యం నింపిన సీసాలు....ఆ మాయా నగర్‌లో 'పాతాళంలో పాపాయి' లాగా మందాకిని కంగారు పడిపోయింది గాని, ఆమె నడుం చుట్టూరా వున్న లెగ్వీ కుడిచేతి అసరా ఆమెకెంతో ధైర్యాన్ని ఇచ్చింది. కొంతమంది వీరి వేపు కుతూహలంగా చూశారు.... అభిమానంతో ఆమె హృదయం ఎగసిపడింది. జారిన కొంగు సరి చేసుకుంటూ ముందుకి నడిచింది.

"ఆహ్....ఇక్కడుంది మన టేబిల్."

టేబిల్ మేట్స్‌తో పరిచయం అయింది. కాని ఆ పరిచయాలు లెగ్వీ మందాకినిల ఏకాంతానికి అడ్డు రాలేదు. బఫూన్ టోపి ఆమె తల మీదపెట్టి ఆమె ఎలా కనిపిస్తుందోనని గడ్డం పట్టి పైకెత్తి చూస్తూ లెగ్వీ "నువ్వు మూర్ఖుల రాజ్యపు మహారాణిలా కనిపిస్తున్నావు" అంటూ ఆమె భుజం నొక్కాడు. అంతలో 8-10 టేబిల్స్ అవతల్నుంచి ఎవరో చెయ్యెత్తి పిలుస్తున్నట్టయింది, లెగ్వీ భుజం నొక్కినప్పుడు కుంచించుకున్న ఆమె చూపులకి వాళ్ళు ఎవరైనదీ వెంటనే తెలియలేదు. కాసేపట్లో ఆ మనిషి ఇటే రాసాగాడు. అంతలో ఆమె చూపులు మామూలుగా అయ్యాయి. "గుడీవెనింగ్ మిస్టర్ మెకార్థీ" అని గ్రీట్ చేసింది.

బాగా దగ్గరకొచ్చాక లెగ్గీకి పరిచయం చేసింది.

"మిస్ మందా, ఇవ్వాళ నువ్వు చాలా అందంగా కనిపిస్తున్నావు. అకస్మాత్‌గా మెడిటరేనియన్ గాలికి, పూవు వికసించినట్లు అనిపిస్తోంది....మి..లెగ్గీ మీరు నిజంగా లక్కీ అని చెప్పక తప్పదు....."

"మీకు అసూయగా వుంటే చెప్పండి, ఇక్కడే ద్వంద్వ యుద్ధం చేద్దాం. గెలిచిన వారికి ఈ రాకుమారి" లెగ్గీ నవ్వుతూ అన్నాడు. అందరూ నవ్వారు.

"ద్వంద్వ యుద్ధం చెయ్యడానికి నేను ముసలి వాడినై పోయాను. లేకపోతేనా? ....మంచిది, నా స్నేహితురాలు మిస్ జోన్స్ నా కోసం కాచుకుని కూర్చుంది. నేను వెళుతున్నాను. మీ డిన్నర్ బాగా జరగాలని ఆశిస్తున్నాను. ఆ.... చూడండి లెగ్గీ, మీరు కాస్త జాగ్రత్తగా వుండండి, లేకపోతే ఈ రాకుమారి చెప్పులు....హహ్హాహ్హా ....అంటూ నవ్వుతూ వెళ్ళిపోయాడు మెకార్థి.

"నేనే వాటిని గట్టిగా కట్టాను." అన్నాడు లెగ్గీ మెకార్థి మాటలకి అర్థం తెలియక.

మందాకిని ఆ సందర్భం గురించి వివరంగా చెప్పింది. ఆ కథ విని లెగ్గీ ఒకటే నవ్వడం. "నువ్వు నన్ను చెప్పులతో కొడితే ఎంత ఆనందంగా వుంటుందో తెలుసా?....వండర్‌ఫుల్! కాని ఏకాంతంలో మాత్రమే....ఏం ? .... పబ్లిక్‌లో కాదు. హహ !"

మందాకినికి షాంపేన్ వచ్చింది. కాని సరిగ్గా భోంచెయ్యలేక పోయింది. ఆమె నాజూకుతనం లెగ్గీకి నచ్చింది. "నాకు నాజూకుగా, సుకుమారంగా వుండే అమ్మాయిలంటే చాలా ఇష్టం.... So ethereal! So spiritual! వాళ్ళ కోమలమైన కొత్త చెప్పులూ ఇష్టమే...."

వాతావరణమంతా ఉత్సాహంతో నిండిపోయింది. కళ్ళల్లో వుల్లాసం... ఉరకలు వేసే వున్మాదం. ప్రతిచోటా నవ్వుల పువ్వులు, పిచ్చెక్కించే, మత్తెక్కించే నవ్వులు. మిల మిల మెరుస్తున్న ఎరుపు, పసుపు, తెలుపు రంగు గ్లాసులు. గిర్రున తిరగాలనిపించే, మైమరిపించే బ్యాండు వాయిద్యం. ఆడ -మగ, ఆడ -మగ, సూటు -ఫ్రాకు, సూటు -స్కర్టు, సూటు -చీరె. ఇంద్ర ధనుస్సులోని అన్ని రకాల రంగులు ఎగిరెగిరి గిర్రున తిరిగి కలిసిపోతున్నాయి. కొంతమంది యక్ష -యక్షిణులు, మెడకు మెడ ఆనించి చెంపకు చెంప చేర్చి, ఒంటికి - ఒంటిని దగ్గరగా చేసి కాళ్ళు మాత్రం కదుపుతున్నారు. కాసేపటికి డెక్ నిండా లయబద్ధంగా కదిలే కాళ్ళు, అడ్డదిడ్డంగా ఒకదాని మీదొకటి పడే కాళ్ళు .... హాయ్.... ఓవ్ ....హి హి హి ....హహహ.... హెహెహె బ్యాండ్‌కే మత్తెక్కినట్టుగా వుంది. బ్యాండు వాళ్ళు చేతులు, ఒళ్ళు, కాళ్ళు, ఊపుతూ

గెంతుతూ దిగంతాలు బద్దల్లయ్యేలా వూద సాగారు. డాన్స్ రాని వాళ్ళు కూడా ఆడుతున్నారు. ఆ సందడిలో ఒకర్ని మరొకరు పట్టించుకునే స్థితిలో లేరు.

"ప్లీజ్, మి..లెగ్వీ ప్లీజ్.... నా తల తిరుగుతోంది...."

"సారీ, నీ షూ నా కాళ్ళని తొక్కుతోంది..... నేను కాళ్ళని కదుపుతున్నట్టు కదుపు చాలు...."

"ఓహ్ నా చేతనయ్యే పని కాదిది ...."

"అంతలా బిగిసిపోకు. Relax, relax బిగువు సడలించు.... కాస్త దగ్గరగా రా.... ఇంకాస్త...."

"ఒద్దులెండి.... నిజంగా కళ్ళు తిరుగుతున్నాయి.... ఓహొహొ...." అని ఒక్కసారిగా మందా రెండు చేతులతో తల పట్టుకుంది.

లెగ్వీ మందాకిని చెయ్యి పట్టుకుని ఆ సందడిలోంచి మెల్లిగా దారి చేసుకుంటూ ఆమెని లాక్కుని వెళ్ళి కాస్త ప్రశాంతంగా వున్న మూలకి తీసికెళ్ళి ఓ కుర్చీలో కూర్చోపెట్టాడు.

"డార్లింగ్ నీకు కావల్సింది ఫ్రెష్ ఎయిర్.... ఇప్పుడెలా వుంది ?"

"తల గిర్రుమంటోంది....చెవిలో ఏదో జుం....మ్ మంటున్నట్టుగా వుంది" అంటూ చెవులు మూసుకుంది.

"కాస్త ఆగు, ఇప్పుడే కాఫీ తీసుకొస్తాను " అని పరిగెత్తాడు లెగ్వీ.

లెగ్వీ వచ్చేసరికి మందా వొంగి ఒకరిస్తూ వాంతి చేసుకుంటోంది.

"Its all right....Relax.... ఇప్పుడెలా వుంది ? ....రా, నీ కిప్పుడు విశ్రాంతి అవసరం.... ముందు ఈ కాఫీ తాగు" అంటూ కాఫీ తాగించాడు. తరువాత రెండు చేతులతో ఆమెను పొదివి పట్టుకుని మెట్లు దింపి తీసికెళ్ళాడు 'సి' డెక్ మీది తన కేబిన్‌లోకి.

4

మూడు రోజుల అనారోగ్యం .... తరువాత రెండు రోజుల విశ్రాంతి. ఇవ్వాళే లేచింది మందాకిని. మార్సెల్స్ ట్రిప్ తప్పిపోయింది. జిబ్రాల్టర్ ట్రిప్పు తప్పింది. మిసెస్ మోహిత్ వచ్చి మార్సెల్స్ గురించి చెప్పినంత మటుకే తెలుసామెకు. అదంతా వేరొక లోకం. ఎంత స్వచ్ఛమైన జీవితం అది ! మనుషులు పుష్టిగా ఎంత బాగున్నారనుకున్నావ్. అడ్డు -అపు లేకుండా తిరగడమే. క్యాసి పల్లెలో సముద్ర తీరం చూడాలి. ఆడ - మగ అర్ధనగ్నంగా ....ఛీ ....ఇసుకలో, నీళ్ళలో ఆ ఆటలాడుకోవటం చూస్తే నాకే ఒళ్ళు గగుర్పొడిచిందనుకో.... జిబ్రాల్టర్ మహా శిలని దూరం నుంచే పోర్ట్‌హోల్ లోంచి చూసి "అహ్ ఇలా వుండాలి బ్రతుకులో, ఒక శిలలాగా" అని తనలో తనే

అనుకుంది. 'ఓడలు వస్తాయి, పోతాయి కాని జిబ్రాల్టర్ మాత్రం ధీమగా కదలక మెదలక నిటారుగా తలెత్తి నిలుచుంటుంది - చుట్టూరా వున్న సముద్రాల్ని ఎదిరిస్తున్నట్టుగా' అనుకుని నిట్టూర్చింది.

ఆమె స్వెట్టర్ అల్లుతూ కూర్చున్న కుర్చీకి దగ్గరగా రెయిలింగ్‌కి అనుకుని ముఖర్జీ తన కేరళ అమ్మాయితో మొద్దులా నవ్వుతూ నుంచున్నాడు. అతని చూపులు మందాకిని మీద పడగానే నవ్వటం ఆపేసి అడిగాడు.

"హల్లో మిస్ భాటే....మార్సెల్స్ నుంచి నిన్ను చూడనే లేదే. అక్కడే దిగి ప్యారిస్ వేపు వెళ్ళావేమో అనుకున్నాను." మందాకినికి అతని మాటల్లో దాగిన వ్యంగ్యం అర్థమైంది, నవ్వుతూనే అంది.

"అలా వెళ్ళి వుంటేనే బాగుండేదేమో"

"నువ్వు కాస్త తెల్లబడినట్టు కనిపిస్తున్నావు, తెల్ల వాళ్ళ సహవాసం వల్లనే?" అంటూ గట్టిగా నవ్వాడు.

"కాని మీ మొహం నల్లబడిందే, అదెవరి సహవాసం వల్ల ? లేదా లోపలి రంగు బయటికొస్తోందా ?"

"నువ్వు ఈ కొద్ది రోజుల్లోనే Witty గా తయారయి పోయావే."

"థాంక్స్" అంది చేతిలోని స్వెట్టర్ అల్లుతూ.

నువ్వు అల్లుతున్నది బేబి సాక్స్ కాదు కదా, అని నవ్వుతూ, మరి నుంచోకుండా కేరళ అమ్మాయి చెయ్యి పట్టుకుని అక్కడ్నుంచి చకచక వెళ్ళిపోయాడు.

మందాకి అవమాన మయింది. లోపల ఏదో మండి నట్టయింది, మనసు ఎవరినో శపించింది. కళ్ళు శూన్యంగా అట్లాంటిక్ మహా సాగరాన్ని చూస్తున్నాయి. తన గురించి జనం ఏమనుకుంటున్నారోనని భీతి కలిగింది. లేస్తే - లేవనీ దానికేం చెయ్యగలం. వీళ్ళేమయినా దాన్ని పేపర్లో వేస్తారా ? లేక తన తల్లి -తమ్ముళ్ళకి రాస్తారా! లేక తన నుదుటి రాతలో లేని భర్తకి పితూరీ చెపుతారా ? ఆ మొద్దు సప్రూని కలిస్తే అంతా తెలుస్తుంది అనుకుంది. అతన్ని వెతికినట్టూ వుంటుంది, కాస్త గాలి పీల్చుకున్నట్టూ వుంటుంది. అనుకుంటూ, 'ఇ' నుంచి 'డి'కి 'డి' నుండి 'సి'కి ఒక రౌండు వేసి ఎక్కింది. 'బి' డెక్ లైబ్రరీలో సప్రూ కనిపించాడు. ఓ ముద్దుగా వున్న ఆస్ట్రేలియను అమ్మాయితో, మందాని చూడగానే సప్రూ లేచి పిలిచాడు. "మందా బహెన్, రండిటు. నాలుగైదు రోజులుగా మీ జాడ లేదేమిటి ? మిసెస్ మోహిత్ చెప్పారు, మీ కేదో అనారోగ్యంగా వుందని. చూడ్డానికి వద్దామని పదిసార్లనుకున్నాను....కాని.... అంటూ తన స్నేహితురాలివేపు ఒక ఓర చూపు విసిరాడు, చిరునవ్వు నవ్వుతూ. "ఈమె నా ఫ్రెండ్, మిస్ వేక్ ఫీల్డ్. మెల్బోర్న్ నుంచి ఆక్స్‌ఫర్డ్ బయలుదేరింది.

అక్కడ బి.ఎ. చేస్తుందట. ఆమె ఆంటీ వున్నారట ఆక్స్‌ఫర్డ్‌లో.... ఈమె మిస్ భాటే...." అంటూ పరిచయం చేశాడు. మిస్ వేక్ ఫీల్డ్ "హలో" అనేసి, మళ్ళీ తన చేతిలోని పుస్తకం చదవడంలో నిమగ్నమైంది.

"అయితే ఎందుకు రాలేదు మరి ? నాకు చాలా చికాగ్గా గడిచింది.... మార్సెల్స్‌లో మిస్ జోసెఫ్ దిగిపోవడం వల్ల నేను ఒక్కత్తిని అయిపోయాను. అందులో జ్వరం. ఫ్లూ అనుకుంటాను.... డాక్టర్‌కి తెలియలేదు.... " మూలనున్న సోఫాలో కూలబడుతూ అంది మందా!

"నిజం చెప్పాలంటే మీలోని Interest అంతా పోయింది - ఆ గాలా డే రోజున," తన ఎప్పటి ధోరణిలో చెప్పాడు స్వరూ - అదే సోఫా మీద కూర్చుంటూ. "లెగ్గీ మిమ్మల్ని Monopolise చేసేశాడు. ఆ రోజు రాత్రి డాన్స్ టైమ్‌కి ఈ అమ్మాయిని పట్టుకున్నాను. ....ఈమె చాలా ugly గా వుంది కదూ ....కనుకనే నాకు దొరికింది....ugly గా వుంటేనేం, మంచి చురుకైన అమ్మాయి...." అని గడగడ మాట్లాడసాగాడు!

అతని విచ్చలవిడితనం వల్ల ఉపయోగం పొందాలని మందా వెంటనే అంది, 'అవునూ, ఈ నాలుగైదు రోజుల్నుంచి జనం ఏమనుకుంటున్నారు నా గురించి?"

"ఓహ్ జనానికి మిమ్మల్ని గురించి మాట్లాడే తీరిక ఎక్కడుంది ? అందరూ తమ తమ బురదలో తాము దొర్లుతూ ఆనందిస్తున్నారు ."

"అది నాకు కనిపిస్తూనే వుందిలే...కాని ..."

" ముఖర్జీ మటుకు ఏదో అంటూ తిరుగుతున్నాడు. ఆ వేళ లెగ్గీ కేబిన్‌కి మీరు వెళ్ళారు. అదీ -ఇదీ అంటూ. నేను నమ్మలేదు అనుకోండి. ఆఖరికో సారి అతనితో పోట్లాట వేసుకున్నా కూడా. "నీ కెందుకంత అసూయ ? నీకు ఛాన్స్ దొరకలేదనా ?" అని అడిగేశాను. By the way మీరు నిజంగా వెళ్ళారా

"ఊఁ."

స్వరూ దీర్ఘంగా నిట్టూర్చాడు.

"ఆ వేళ భోజనం పడలేదు నాకు. పైత్యం చేసిందనుకుంటా. కళ్ళు తిరిగాయి....అమితమైన చలి....అందుకే లెగ్గీ తన కేబిన్‌కి తీసికెళ్ళి మందిచ్చాడు. కాస్త నిమ్మళించగానే నా కేబిన్‌కి తెచ్చి వదిలాడు....ఈ మాత్రానికే .... అబ్బా ...."

"ఇంగ్లండ్.....ఇంగ్లండ్....ఇంగ్లండ్ కనిపిస్తోంది." అంటూ ఎవరో అరిచారు. జనం అంతా గబగబ ఓడ రెండవ వూపు రెయిలింగ్ దగ్గరికి పరిగెత్తారు. మిస్ వేక్ ఫీల్డ్ , 'కమోన్' అంటూ స్వరూని లాక్కెళ్ళింది. మందాకినికి పైకి పైకి లేవాలని అనిపించలేదు. ఇంగ్లండ్ వెళ్ళి , అక్కడ

వుండడానికి తను అయోగ్యురాలన్న భావం ఆమెని ఆవరించింది. ఏం చెయ్యాలి అక్కడికి వెళ్ళి ? ఒట్టి టి.డి. నా ? జీవితపు రసాస్వాదన చేసే జిహ్వా లేదు, పెదవులు లేవు, చేతులు లేవు.... ఒట్టి కళ్లతో ఏం తినాలి ? గాలా రాత్రి ఆమెకు ఆమె వ్యక్తిత్వపు నగ్న సత్యాన్ని చూపించింది.

"ఆ వేళ లెగ్గీ ఆమెని ఆమె కేబిన్‌లో వదిలి వెళ్ళేటప్పుడు "మిన్ బోతే, మన సాయంత్రం ఇలా వొట్టిపోయినందుకు నాకు చాలా దుఃఖంగా వుంది. Doesn't matter మీ సుందర సహవాసానికి thanks. మీరు నిజంగా వండర్‌ఫుల్. నేను Farewell చెప్పడానికి ముందు ఓ ముద్దు ఇవ్వొచ్చా? అంటూ వినయంతోనూ మమతతోనూ అడిగాడు. కాని అతని మృదువైన పెదవులకి ఆమె ఇచ్చింది ఎండిన చెక్కిలి, అతని కౌగిట్లో మిగిలింది శిలాప్రతిమ.. పుట్టి మొహమాటం, భయం.... నెత్తిమీద తానెన్నడూ చూడని తండ్రి చేతిలో (తానెన్నడూ అనుభవించని) భయంకరమైన కొరడా.... లేకపోతే లెగ్గీ కేబిన్‌లో అతనంత ప్రేమగా ఆమె చేతిని పట్టుకున్నప్పుడు ఆమెకి మళ్ళీ వేకరింపు వచ్చి వాంతి అవ్వాలా ? అతను అక్కడే పడుకోమని ఎంతగా చెప్పినా వినకుండా "మీ కెందుకు ఇబ్బంది ? మీరు మళ్ళీ డాన్స్‌కి వెళ్ళండి. నేను నా కేబిన్‌కి వెళతాను. మిమ్మల్ని చాలా ఇబ్బంది పెట్టి మీ సాయంత్రాన్ని, రాత్రిని పాడు చేశాను. ప్లీజ్ మీరు డాన్స్‌కి వెళ్ళండి...." అని బ్రతిమాలు కునేదా ?

'హలో మిన్ భాటే, ఇక్కడున్నావేమిటి?' లైబ్రరీ తలుపు దగ్గర నుంచున్న మెకార్థి కంఠం విని ఉలిక్కిపడింది మందాకిని.

"మిన్ భాటే, ఎలా వున్నావు ? నీకు ఒంట్లో బాగా లేదని విన్నాను. ఇప్పుడు కులాసాగా వున్నావా ? అదిగో ఇంగ్లండ్ వచ్చింది. అందరూ ఇంగ్లండ్ తీరం చూసి ఆనందిస్తున్నారు. నువ్వు ఇక్కడ ఒక్కతెవూ ఎందుకు? పద చూద్దాం...."

"కమ్మాన్ .... పదండి...."

ఇద్దరూ రెయిలింగ్ మీద మోచేతులు ఆనించి దూరంగా దిగంతం వేపు చూస్తూ నుంచున్నారు. మంచు ముసుగు వేసుకుని ఇంగ్లండ్‌లో నల్లటి బండరాళ్ళు అస్పష్టంగా కనిపిస్తున్నాయి.

"ఎలా వుంది ఇంగ్లండ్ ?"

"ఎలాగంటే .... భూతంలా ...." అనేసి నాలుక కొరుక్కుంది మందాకిని.

"వెల్, మొత్తానికి ఇంగ్లండ్ వచ్చేశాం! ఆ ( , మొత్తం మీద ప్రయాణం ఎలా అనిపించింది ? బాగున్నట్టేనా ? మెకార్థి నోట్లో చుట్ట పెట్టుకుంటూ అడిగాడు."

"ఊ (, బాగానే వుంది ...."

"దేని పట్లా దుఃఖం, విషాదం లేదు కదా ?"

" దుఃఖం! విషాదం ! ఛ! .... అంతా ఇంటరెస్టింగ్‌గా గడిచిపోయింది." అంటూ నవ్వుతున్న మెకార్థి కళ్ళలోకి చూస్తూ మందా నవ్వింది.

"ఇంటరెస్టింగ్! ఆహ.... అదే సరైన పని తెలుసా ? అన్నింటినీ ఇంటరెస్టింగ్‌గా చూడాలి.... గుడ్, పద. ఇంగ్లండ్ చూసినందుకో ట్రీట్ తీసుకుందాం.... చిన్నగా ఒకో కొన్యాక్ కాక్‌టెల్ తాగి గుడ్ ఓల్డ్ ఇంగ్లండ్‌కి స్వాగతం పలుకుదాం...."

"ఒకే."

ఇంగ్లండ్ దిగంతంలో మంచు కరుగుతోంది.

# 15. క్లిప్ జాయింట్

యు. ఆర్. అనంతమూర్తి

భాగం : ఒకటి

"బ్రతుక్కి ఓ ధ్యేయం ఉండాలి" అంటూ పైపు పీల్చి, మాటల కోసం వెతుక్కుంటూ, "నా బ్రతుకులో అది లేదు" అంటున్నపుడు స్టూవర్ట్ నీలం కళ్ళు ఆలోచనతో తీక్షణమయ్యాయి. అందులో నటన ఎంత ? నిజం ఎంత? ఇతడూ నాలాగా మోసగాడా ?

కేశవ్ కిందికి చూశాడు. లైట్ల వెలుతుర్లో చల్లగా కనిపించే ట్యూబ్ స్టేషన్లోని రైలు పట్టాలు. దూకితేనే -

"దూకితే క్షణంలో చావు." అంటూ స్టూవర్ట్ గడ్డం గోక్కుంటూ ఆవలించి, "Excuse me" అన్నాడు.

ఎక్కడో చదివిన గుర్తు : అన్ని అనుభవాల పరాకాష్ట చావులా వుంటుందని.

"రెండో ట్రెయిన్ మనది."

ఆరిపోయిన పైపుని జేబులో పెట్టుకుంటూ అలా వేచి ఉండాల్సి వచ్చినందుకు విసుక్కున్నాడు స్టూవర్ట్. పబ్లిక్ స్కూల్లో చదువుకున్న అచ్చమైన అరిస్టోక్రాటిక్ లిబరల్ అతడు - అంచుకుట్టని ఉల్లన్ టై, మాసిపోయిన గ్రే ఫ్లానెల్ బ్యాగ్స్, హ్యారిన్ట్వీడ్ జాకెట్, పొడుగ్గా పెంచుకున్న నూనె రాయని జుత్తు, గడ్డం, పొడుగాటి శరీరం - కాని తనది కొంచెం లావుగా బండగా వున్న శరీరం, నగ్నంగా స్నానం చేసేటప్పుడు యూనివర్సిటీ జిమ్‌లో చూశాడు : భారతీయ యువకులందరికీ సాధారణంగా నడుం చుట్టూ కొంత బొజ్జ వుంటుంది.

కేశవ్ పాడింగ్టన్ స్టేషన్ ప్లాట్‌ఫారం మీద పచార్లు చేశాడు. ఏదో గేయం గుర్తువచ్చింది. ఎక్కడిదది ? ఫౌండ్ గేయమేనా ? రెండు పాదాల గేయమది- మంచుకప్పిన మసక వెలుతుర్లో ఈ మొహాలు ఎండిన కొమ్మకు అంటుకున్న పూల రేకుల్లాగా -స్టూవర్ట్‌ని అడిగితే నవ్వుకుంటాడేమో : కేశవ్, మీ భారతీయులు కావ్యాల్లో చదివిన దాన్ని ఇక్కడ స్వయంగా చూసి పోల్చి చూద్దామని వస్తారు ఇంగ్లాండుకు. కాని అది నిజమే. యూనివర్సిటీకి వెళ్ళి వచ్చేటప్పుడు రోజూ చూస్తున్న పూలు డాఫోడిల్స్ అని తెలిశాకనే వర్డ్స్‌వర్త్ అని మనసులో గంట కొట్టింది. చేతులు కట్టుకుని నడుస్తూ ప్లాట్‌ఫారమ్

చుట్టూతా కుతూహలంతో చూశాడు : బెంచి అడ్వర్టయిన్‌మెంటు పోస్టర్; సిగరెట్, చాక్లెట్, పాలు, పళ్ళరసాలు, వేడివేడి కాఫీల స్లాట్ మెషీన్ ; బెంచి, కార్పెట్‌లను అడ్వర్టయిజ్ చేసే అర్ధనగ్న స్త్రీ శరీరాల మీద పెన్సిల్ గీతల వ్యభిచారం, Interesting, ఇండియాలో కాలేజిల లెట్రిన్ గోడలు. భారతీయ కాలేజి విద్యార్థులంత అసంతృప్త తప్త కాముకులు ప్రపంచంలో ఎక్కడా ఉండరు. నాలాగా కాలేజిలో ఎవరైనా ఓ అబ్బాయి ఓ అమ్మాయి ఎదురుగా చెట్టుకింద కనిపిస్తే చాలు : అపరిపక్వమైన అబ్బాయిలే కాదు, ఎంతో పరిపక్వం చెందిన లెక్చరర్ల కళ్ళు కూడా వాళ్ళ మీదే. నా తమ్ముడు పక్కింటి అమ్మాయితో కిటికీలోంచి కళ్ళతో సరసమాడుతున్నాడని తెలిసి నేనే ఎంత గొడవ చేశాను.

త్రేనిస్తే 'క్షమించు' అనే ఇదే జనం అందరూ తిరిగే చోట్లలో, బెంచిల మీద - అటు వేపే నడిచాడు.

ఓ బెంచీ మీద బీటల్ క్రాపున్న కుర్రాడు ఎర్రటి దుస్తులు తొడుక్కున్న ఓ అమ్మాయిని గట్టిగా కావలించుకుని ఆమె చెవి కొరుకుతూ గుసగుసలాడుతున్నాడు. కేశవ్ నిలుచున్నాడు. ఆమె మూలుగుతూ అతని స్వెట్టర్లోకి చెయ్యి వేసి తడుముతోంది. కేశవ్ కళ్ళు తిప్పుకోలేకుండా నిలుచున్నాడక్కడే. కన్యా మాసంలో కుక్కలు మాత్రం ఇలా చేస్తాయి.... అమ్మాయి మూసుకున్న కళ్ళను వేళ్ళతో తీస్తూ నాలుక చివరలో .... కిలకిలా నవ్వుతూ తోసేసింది. కేశవ్ మొహం తిప్పుకున్నాడు. దొంగతనంగా చూశాడు. కత్తిరించబడిన ఒత్తి తోకలాగా ఏదో విలవిలలాడి నిశ్చలమయినట్టు లోపల తిప్పుతున్నట్టు.

"This is no country for old men ."

"నా వయసిప్పుడు ముప్పై రెండు. స్టూవర్ట్ తల వెంట్రుకలు పండి పోతున్నాయి. యౌవనంలో, బాల్యంలో వున్న చలాకీతనం, ఉత్సాహం మాయ మవుతున్నాయి. ఓ అమ్మాయి చేతిని కూడా తాకలేదు - ఇంకా. దీనికేమి టంటావ్?" - కేశవ్ ప్యాక్ నుండి సిగరెట్ అఫర్ చేశాడు స్టూవర్ట్‌కు.

"థ్యాంక్స్, అక్కర్లేదు. నేను పైపే కాలుస్తాను....నువ్వు చెప్పున్నది నాకు చాలా చిత్రంగా అనిపిస్తోంది...." అంటూ కేశవ్ సిగరెట్‌ను వెలిగించి, తన పైప్ వెలిగించుకుని పొగ పీల్చి,

"నువ్వు చాలా సిగరెట్లు కాలుస్తావ్ కేశవ్" అన్నాడు. అయిదారు నెలల వాళ్ళ స్నేహంలో ఇది స్టూవర్ట్ మొదటి వైయక్తికమైన ప్రతిక్రియ.

"నాలుకకు ఎప్పుడూ ఏదో రుచి తగులుతూనే వుండాలి. ఉట్టినే ఓ అరగంట కూడా గడపలేను. నేను ఎవరితోనైనా వుండాలి. వంటరిగా, ఏమీ చెయ్యకుండా,

కాల్చటానికి ఓ సిగరెట్ కూడా లేకుండా ఒక్క రోజు గడపాల్సి వస్తే బహుశ నేను ఆత్మహత్య చేసుకుంటాను."

ఎర్ర దుస్తుల అమ్మాయి తన ప్రియుడి మొహాన్ని రెండు చేతుల్లోకి తీసుకుని ఆరాధనగా చూస్తోంది.

"ఎందుకూ ?"

"తెలియదు.... భయం - ఓ రకమైన దిగులు."

అప్పుడే వచ్చిన ఓ రైలు ఎక్కడానికి వెడుతున్న కేశవ్‌ని ఆపి "మనది రెండో రైలు. ఇది కాదు" అన్నాడు స్టూవర్ట్. "ఇది నా మొదటి ట్యూబ్ ప్రయాణం" అన్నాడు కేశవ్.

"జీవితంలో ఓ ధ్యేయముంటూ ఉండాలని అందుకే అన్నాను. అదే లేకపోతే...."

"నాకు ధ్యేయంలో కాని ధ్యేయం కోసం నడచుకోవటంలో కాని నమ్మకం లేదు స్టూవర్ట్...."

ట్రెయిన్ తలుపులు అలీబాబా కథలోలాగా తెరుచుకున్నాయి. జనం లోనికి వెళ్ళగానే మూసుకున్నాయి. సిగరెట్ కాల్చటం మానేస్తే నెలకి పది పౌన్లు డబ్బు మిగల్చొచ్చు. పదిపౌన్లు ఆ బ్లాక్‌మార్కెట్ చేసే పంజాబికి ఇస్తే ఇండియాలో వున్న అమ్మకి నెలకు రెండువందల రూపాయలు అందేలా చూస్తాడు. వాళ్ళకి దానితో ఓ నెల గడిచిపోతుంది. పేదరికం, చికాకులు, గొడవలు, చెల్లెళ్ళ పెళ్ళిళ్ళ బెంగ తీరటానికి మొదటి మెట్టు - నేను సిగరెట్ మానేయటం. కాని మానేయలేను. 'నేను చచ్చానే, బ్రతికానే నీ కనవసరం. నేను ఈ ఇంటిని త్యజిస్తున్నాను' అని రాశాడు మాధూ. నా ఇన్నాళ్ళ జీవితం మీద ఇలాంటి తీర్పు ఇచ్చాడతడు. కాని ఈ రోజు ఆ గొడవంతా వద్దు. అన్నీ మర్చిపోవాలనే స్టూవర్ట్‌తో లండన్‌కి వచ్చాను.

"ఆఖరికి కాన్సర్ వస్తుందన్న భయంతోనైనా మానేస్తే..." తనలో తానే ఆలోచించుకుంటున్నట్టుగా అన్నాడు స్టూవర్ట్.

"అలాగ మేము దేన్నీ వదిలెయ్యం స్టూవర్ట్ - నువ్వు నీ చేతిలో పట్టుకున్నది పాము అని తెలిస్తే ఏం చేస్తావు చెప్పు ? రయ్యిమని దాన్ని విసిరేస్తావు కదూ? అప్పుడు ధర్మాధర్మాల గురించి తర్కవితర్కాలు, లోలోపల దిగులు, ఏది సరి, ఏది కాదన్న మీమాంస - తర్వాత ఓ నిర్ణయానికి రావు కదా ? అలా రావాలి జ్ఞానం... ఆత్మజ్ఞానం"

"ఆత్మజ్ఞానం, ఆత్మవిమర్శనా శక్తి తెలవితేటలవల్లా, సంస్కృతి వల్లా లభిస్తుందని నేననుకుంటున్నాను కేశవ్...."

"తప్పు. ఇదిగో నాకు ఆత్మజ్ఞానం, ఆత్మ విమర్శనా శక్తి ఉందనే అనుకుంటున్నాను. కాని ఈ ఆత్మజ్ఞానం కూడా నేను మొదటే నిర్ణయించుకున్న ఆత్మ యొక్క జ్ఞానం. ఇంట్లో వున్నప్పుడు ఒక్కోమారు మనస్సులోనే అనుకునేవాడ్ని. ఇలా నేను చికాకు పడటం, అమ్మ మీద, నా తమ్ముళ్ళ మీద అస్తమానం ఎగరటం, తిట్టటం, ఇవన్నీ నాకు చాలా Self love వుండటం వల్లనే, కాని ఇది తప్పు, నా బ్రతుకునిండా విషం నింపుకుంటున్నానని - మహా అంటే ఓ వారం అన్నీ సవ్యంగా నడిచేవి. కాని ఏ చిన్నదైనా అటూ ఇటూ అయితే నా స్వభావం బుస్సుమని పడగ ఎత్తేది. అందుకే చేతిలో వున్నది పాము అని తెలుసుకున్నవాడి ఉదాహరణ ఇచ్చాను. ఆత్మజ్ఞానం అన్నది హఠాత్తుగా రావాలి. ఆత్మపరివర్తనం చెంది కొత్తరూపం పొందాలి. లేకపోతే మనం అస్తమానం ముందే నిర్ణయమైన దాని చుట్టూరా తిరుగుతూవుంటాం. ఆత్మజ్ఞానమన్న భ్రమలో కొట్టుకులాడుతూ వుంటాం. అందుకే నేనన్నది ధ్యేయంలోకాని, ధ్యేయంకోసం బ్రతకటంలో కాని నమ్మకం లేదని. అన్ని ధ్యేయాలు పూర్వనిర్ణితాలే....నా ఉపన్యాసానికి నన్ను క్షమించు. ఇండియన్స్ అనర్గళంగా మాట్లాడటంలో ప్రవీణులు." హఠాత్తుగా చాలా వ్యక్తిగతమైన అనుభవం వేపు చర్చ మళ్ళించినందుకు - మొహమాటస్థుడైన ఇంగ్లీష్‌మన్ ఏమనుకున్నాడోనన్న కుతూహలంతో స్టువర్ట్ వేపు చూశాడు - కేశవ్.

" Thanks for the advice" అంటూ స్టువర్ట్ లిటర్‌బాక్స్ వద్దకు వెళ్ళి తన పైప్ పారేసి వచ్చి "నా నాటకీయతకు క్షమించు" అన్నాడు.

"ఇప్పుడు నీకు పైప్ గురించి అనిపిస్తున్నట్టుగా, నాకు అనిపిస్తున్న దాన్ని చేయగలిగితే - ఒకటి ఆ ఎర్ర డ్రస్ వేసుకున్న ఆ పిల్లను కావిలించుకుని ముద్దెట్టుకోవాలి; లేదా ఆ రైలు పట్టాల మీదికి దూకాలి అంటూ నవ్వాడు కేశవ్.

ఇంకో సిగరెట్ వెలిగించుకుని చాలా రోజులుగా తాను ఆలోచిస్తున్న దాన్ని మాటల్లో పెడుతూ,

"నాకో బాబాయి వున్నాడు. ఓ రోజు అతను ఇల్లూ వాకిలీ అంతా వదిలేసి బదరీ ఆశ్రమానికి తపస్సుకి వెళ్ళిపోయాడు.... నీ తీరే వేరు : నువ్వు ఇంగ్లండ్‌లోని ఉత్తమ నాగరకతకు చెందిన అత్యుత్తమ ఫలం - మా బాబాయి భారతీయ నాగరకతకు చెందిన అత్యుత్తమ ఫలమైనట్టే. ఒకరు యోగి. మరొకరు యోగ్యులు. యోగ్యుడు తన జీవితంలోని తప్పొప్పులను దిద్దుకుంటూ జీవితాన్ని ఓ పరిధిలో చాకచక్యంతో నడిపించుకుని పోతాడు.... నేను చెప్పుతున్నది నాకే ఇంకా స్పష్టంగా తెలియటం లేదు. అయినా యీ మాత్రం చెప్పగలను. నువ్వు యోగ్యుడివి, అతను యోగి నేను...."

"నువ్వు ?" అని స్టూవర్ట్ నవ్వుతూ "Oh, I miss my pipe" అన్నాడు.

"నేను జీవితంలో ఏ రకమైన ప్రత్యేకమైన కౌశల్యమూ లేని, పూర్తిగా నాస్వభావానికి లోబడిన, యోగ్యుడూ, యోగీ కాని దుఃఖితుడిని" అంటూ కేశవ్ సిగరెట్ పీల్చి పొగ వదులుతూ,

"ఓ సిగరెట్ తీసుకో" అంటూ సిగరెట్ ఇచ్చి వెలిగించాడు. స్టూవర్ట్ మౌనంగా ఉండదల్చుకున్నట్టుగా అతని మొహం చూస్తే అనిపించటంతో, కేశవ్ లోపల్నుంచి పొంగి పొరలి వస్తున్న మాటల్ని దిగమింగాడు.

× × ×

అమ్మ చెప్పినట్టు విని, అక్కకూతురు భాగీరథిని పెళ్ళి చేసుకుని, నలుగురు చెల్లెళ్ళకూ సంబంధాలు చూసి పెళ్ళి చేసి, ఆ అప్పుల్ని ట్యూషన్లు చెప్పి కాని, పేపర్లు దిద్ది కాని తీర్చి "ప్రజాయైగృహమేధినాం" అంటూ భాగీరథి వల్ల సుపుత్రుల్ని కంటూ – ఛీ! అది జీవితం కాదు – కానే కాదు. అంతే కాకుండా అమ్మ మీద ఎగురుతూ, తమ్ముళ్ళతో దెబ్బలాడుతూ, ఎదిగి నుంచున్న చెల్లెళ్ళు వీధిలోని వాళ్ళ కంట పడుతూ, ఇల్లు నాశనమవుతుంటే – అదీ కాదు. ఇప్పుడు మాధు బెదిరించినట్టుగా ఆత్మహత్య చేసుకుంటే, అమ్మ ఆ దుఃఖంలోనే చనిపోతే నేను ఊరికి తిరిగి వెళ్ళేసరికి చెల్లెళ్ళు రౌడీ కుర్రాళ్ళ పాలబడి ఇల్లు శూన్యంగా ఇంటి ముందు ముగ్గు లేకుండా, దేముడి గదిలో దీపం లేకుండా ఇల్లు చావు ఇల్లులా బావురుమంటూంటే...."

("ఏమిటి ఆలోచిస్తున్నారు కేశవ్ అంత గాఢంగా ? అదిగో మన ట్రెయిన్" అన్నాడు స్టూవర్ట్.) తలుపులు తెరుచుకున్నాయి. వాళ్ళ ఎదురుగా వున్న రైలుపెట్టె కిటికీ మీద ఎర్రటి అక్షరాలతో 'No Smoking' అన్న బోర్డు వుండటంతో, పరిగెడుతూ మరో పెట్టె ముందు ఆగి జనం అంతా దిగాక ఎక్కారు. తలుపు మూసుకుంది. రెండు క్షణాల్లో చీకటి గుహలోకి వెళ్ళారు. న్యూస్ పేపరు చదువుతూ కూర్చున్న ఆయాసంతో కళ్ళు మూసుకున్న, తమ ఉద్యోగాల నుంచి ఇళ్ళకి వెడుతున్న మొహాల్ని చూశాడు కేశవ్ – వీళ్ళంతా ఎలియట్ కావ్య వస్తువులు. బండి లోపలున్న అడ్వర్టయిన్మెంట్లన్నీ వరసగా చదువుతూ వచ్చాడు – ఈ పళ్ళ రసం తాగి సన్నబడు, వాల్స్ సాసేజులనే తిను, ఆకర్షణీయమైన పురుషులంతా బర్టన్‌లో తయారైన సూట్లనే వేసుకుంటారు....

"రష్యాలో ఈ రకమైన అడ్వర్టయిన్మెంట్లకు బదులుగా కమ్యూనిజం ప్రచారపు బోర్డులు ఉంటాయేమో కదూ స్టూవర్ట్ ? – పార్టీలో చేరు.... యువకులకు నాయకత్వం వహించు... చంద్రలోకానికి రా...."

"మనిషికి ధ్యేయం ముఖ్యమని అందుకే అన్నాను. కేశవ్.... అయితే నేను చెప్పినదాన్ని నువ్వు ఒప్పుకోవు. కమ్యూనిజం ఓ ధ్యేయం. కాథలిక్ మతం మరో ధ్యేయం. ఈ రెండింటినీ నేను నమ్మను. ఈ సాసేజు తిని, ఈ పళ్ళరసం తాగి, ఈ బర్టన్ సూటు వేసుకుని దాని కోసం శ్రమిస్తూ ఇలా పాతాళం నుంచి పైకి, పై నుంచి పాతాళానికి సంచరిస్తూండటానికన్నా ఏదైనా ధ్యేయం ఉండటం ముఖ్యం."

"ఇక్కడ కూర్చున్న ఈ జనం సుఖంగా లేరని నీకు ఎలా తెలుసు ? నువ్వు నీ దృష్టితో వాళ్ళ బ్రతుకు సఫలమో విఫలమో చెప్పగలవేమో కాని వారికి వాళ్ళ బ్రతుకునుంచి సుఖం దొరికిందో లేదో చెప్పలేవు. సుఖం , దుఃఖం అన్నది ఈ క్షణంలో అనిపించేది. సఫలమూ విఫలమూ అన్నది భూత భవిష్యత్తుల ననుసరించి తెలుసుకునేది. భూత భవిష్యత్తులను గురించి ఆలోచించని వాడికి సుఖం, అసుఖం అన్న ప్రశ్న మాత్రమే వుంటుంది. ఫలితం గురించిన ప్రశ్న ఉండదు. ఇక్కడ, ఇంతటి mess చేస్తున్నది నాలాంటి, నీలాంటి వారు మాత్రమే."

"జ్ఞాపకాలు, కల్పన ఈ రెండు ప్రవృత్తులూ మనసుకు వున్నంతవరకూ, జ్ఞాపకపు ఆధారం మీదనే ఊహాకల్పన జరిగేంత వరకూ, మనిషికి భూతభవిష్యత్తుల నుంచి విడుదల దొరికే ప్రశ్నే లేదు కేశవ్. భూత భవితవ్యాలు మనిషిని వెంటాడి తీరతాయి. ఓ సిగరెట్ ఇస్తావా ? దిగాక ఇస్తాను."

" Oh !Don't bother" అంటూ కేశవ్ అతనికి సిగరెట్ ఇచ్చి, "ధ్యేయమన్నది old age కోసం చేసే ఓ రకమైన savings అనుకో. నా మటుకు నేను చెప్పాలంటే, నీ కనిపించినట్టే నాకూ అనిపిస్తుంది. కాని నా కనిపిస్తున్నది సరి అన్న నమ్మకం నాకు లేదు అన్నాడు.

ట్రెయిన్ ఆగింది. "మనం ఇక్కడ కాదు దిగటం " అంటూ స్టూవర్ట్ కేశవ్‌ని ఆపాడు. బండిలో జనం నిండిపోయి, సీట్లు ఖాళీలేక కొంతమంది నిలుచోవలసి వచ్చింది. కేశవ్, స్టూవర్ట్ లేచి నిలుచుని ఇద్దరు ముసలమ్మలకు తమ సీట్లు ఇచ్చారు. తన ఎదుట నిలుచున్న అమ్మాయి కోడి జుత్తు లాంటి జుత్తుని చూస్తూ నిలుచున్నాడు కేశవ్.

ఈ అమ్మాయిల్ని మెచ్చుకోవాలి : నా చెల్లెళ్ళలాగా కాదు. ఒంటరిగా తిరుగుతారు. ఉద్యోగాలు చేస్తారు. తమకు కావాల్సినవాళ్ళని తామే ఎన్నుకుని పెళ్ళి చేసుకుంటారు. మన అమ్మాయిలో ? - వాళ్ళ సిగ్గో, గుండెల మీదకు కొంగు లాక్కునే వయ్యారమో చెప్పక్కర్లేదు. ఈ అమ్మాయిలు తమ గుండెల్ని జెండాల్లాగ పైకెత్తుకుని వాటి అందాల్ని ప్రదర్శిస్తూ నడుస్తారు.

దాచుకోవాల్సింది ఏమీ లేనట్టు, సూటిగా , నిర్భయంగా ఉంటారు. మన దేశంలో మధ్యమ శ్రీమంత వర్గపు అమ్మాయిలకు వాళ్ళ అంగాంగాలు దాచుకున్న బ్రహ్మాస్త్రం. చెల్లెళ్ళు ఇంట్లో వాళ్ళని ఎందుకలా వేధించాలి. తమకు కావాల్సిన వాళ్ళని తామే ఎన్నుకుని ఎందుకు పెళ్ళి చేసుకోకూడదు ? అనిపించేది. కాని అది కేవలం అనిపించటం మాత్రమే. అలా ఏదైనా జరిగితే మొదట విమర్శించే వాడు తనే. ప్రతీ భారతీయ యువకుడూ ఇంట్లో సనాతనుడూ బయట విప్లవకారుడు. ఇప్పుడు స్టూవర్ట్‌తో ఆడుతున్న మాటలు : ఒకటి కౌరవ నరకం మీద కట్టే తత్వ గృహం. భగీరథిని పెళ్ళి చేసుకుని నిష్కామంగా పిల్లల్ని పుట్టించనా ? అమ్మ తన మనవరాల్ని పొగుడుతూ చెప్పు కొస్తుంది: ఆ పిల్లకేమయిందిరా ? కన్ను ముక్కు తీరు బాగుంది. ఎర్రగా వుంది. ఎస్సెల్సి చదువుకుంది. అంతగా కావాలంటే ఇంకా పైకి చదివించు. నేనేమీ కాదన్ను. ఇంటి పని చక్కగా చేసుకుని పోతుంది. నాకూ పెద్దతనం మీద పడుతోంది. పెద్దన్నయ్య వరవడిలోనే చిన్నవాళ్ళు నడుస్తారు. నువ్వే ఇలా అయితే ఎలా రా ? భాగీరథి ఇంటికి వస్తే ఆరుగురు తమ్ముళ్ళు-చెల్లెళ్ళతో నాకు ఎడమొహం పెడమొహం తప్పదు. దీనికన్నా పెద్ద ప్రశ్న నాకు తమ్ముడు మధుది. అతని పట్ల నా ప్రవర్తన సరైనదేనా ? ఎస్సెల్సి పూర్తి చేసి చదువు మానేశాడు. చిన్నవాడు సుధీంద్రుడైనా పైకి వస్తాడేమో ననుకుంటే వాడు కూడా బి.ఎస్సి.లో గజనీ మహమ్మదు దండయాత్రలు మొదలెట్టాడు. సాయంత్రాలు ఇస్త్రీ చేసిన ప్యాంట్ వేసుకుని, ఎర్ర టై కట్టుకుని వాకింగ్ వెళ్ళటం; హొటల్లో బైటూ మసాల దోస, బైటూ ; పేకాటలో డబ్బులొస్తే సినిమా; రాత్రి పదింటికి తిరిగి రావటం, అమ్మ వంటిల్లు అలుక్కోకుండా, గిన్నెలు తోముకోకుండా కాచుకుని వుండాలి ...." పనికిమాలిన జులాయి వెధవలకోసం నువ్వెందుకు కాచుకుని వుండి వడ్డిస్తావమ్మా ? ఆ మాత్రం చెప్పలేవా వాళ్ళకి ? సాయంత్ర మయ్యేసరికి నేనింకో యాభై రూపాయ లొస్తాయని నాలుగు బ్యాచిలకు ట్యూషన్ చెప్పి ఎందుకు చావాలి ? ఈ వెధవల కడుపు నింపటానికా ?

అమ్మ గిన్నెల ముందు తల మీద చెయ్యి పట్టుకుని మౌనంగా కూర్చుంటుంది. ఇద్దరు తమ్ముళ్ళు ముద్ద ముట్టుకోకుండా కంచాల ముందు తలవంచుకుని కూర్చుంటారు : వాళ్ళకి తాము తప్పు చేశాము, నేరస్థులం అని అనిపించేవరకూ కేశవుడికి తృప్తిలేదు. కందిరీగ కాటు తిన్నట్టు వొళ్ళంతా కోపంతో మండిపోయి, వేడెత్తి, తట్టు తేలి, ఇంకంత మరింత కోపం తెచ్చుకోవాలన్న కోర్కె, ఆవేశం గంగ వెర్రు లెత్తిస్తూంటే, తల్లి ఏమైనా ఎదురు జవాబు చెప్పకూడదా అనిపిస్తుంది. వారిని రెచ్చగొట్టడం కోసం తన పదజాలం

నుంచి అవాచ్యమైన మాటల కోసం వెతుక్కుంటూ మాటలాడతాడు. అమ్మ బదులు చెప్పకుండా నిట్టూరిస్తే, మాధు కంట నీరు పెట్టుకుని కంచం ముందునుంచి లేస్తే అమితమైన సిగ్గుతో నిరాశ చెంది - చేతులు కడుక్కుంటున్న మాధవుడి దగ్గరకు వెళ్ళి - "ఏం భోంచెయ్యకూడదా? భోజనం మానేసి నా మీద కోపం తీర్చు కుంటావా?" అంటాడు. కోపం తన మీద తనకే జాలిగా మారి, సర్పం చీమిడి పురుగై గజ్జి చీముగా మారుతుంది. ఒక్కోమారు తల్లి "అశుభం పలకద్దురా. అన్ని వేళలు ఒక్కలా వుండవు. ఇది విష గడియ కావచ్చు. చెడు కోరి మాట్లాడవద్దు. శుభం పలకాలి." అంటుంది. దేవుడి ముందు ముడుపు కట్టి నేతి దీపం వెలిగిస్తుంది. లేకపోతే మాధవుడు, "ఆ పాడు ఫ్యాక్టరీలో శూద్ర కుర్రాళ్ళలాగా చాకిరీ చెయ్యలేను. నా చేత కాదది. తెలిసిందా? నీకేం, ఎం.ఏ. చదివి కాలేజీలో లెక్చరర్నయ్యానని గర్వం నీకు. నాన్న నీకు చేసినంత మాత్రం కూడా నాకు చెయ్యలేదు.... అన్నయ్యవు కదానని నీ ఇంట్లో అన్నం తింటున్నాను. ఇష్టం లేకపోతే చెప్పు - వెళ్ళిపోతాను" అంటాడు.

"నేను! నేను! నేను...." పిడికిలి బిగించి ముందుకురికి మాటల వర్షం కురిపిస్తాను. "మీ లాగా చిల్లర తిరుగుళ్ళు తిరగలేదు. నేను మీకు చేసినంతగా నాన్న నాకు చెయ్యలేదు....ఫ్రీ హాస్టల్లో వుండి పాకీ దొడ్లు తుడిచి, చెత్త తుడిచి కష్టపడి చదివి పైకొచ్చాను.." లోపలి విషాన్నంతా కక్కేస్తాను. ఇలా జరిగిన రోజు కేశవ్‌కు కోపపు దీపావళి; యక్షగానపు రావణుని రంగు వేషాలొక్కటే తక్కువ. లోపల దాక్కున్న ఓ కోరిక - కామం లాంటి ప్రబలమైన కోరిక - సఫలమైనట్టుగా అనిపించి, ఆఖరికి అలసట కలిగి, ఓ రకమైన సుఖం వల్లనే, శూన్యం వల్లనే మత్తు కలిగినట్టుగా కూర్చుండి పోతాడు. రోషమొక్కటే తనకి ఇటీవల కలుగుతున్న తీవ్రమైన భావన అని హఠాత్తుగా తోచటంతో బెంగ కలుగుతుంది.

"మనం బేకర్‌లూ లైన్‌లో పోతున్నాం. ఇది బేకర్ స్ట్రీట్ స్టేషన్" అన్నాడు స్టూవర్ట్. కొంచెం రద్దీ తగ్గటంతో ఇద్దరూ తమ సీట్లలోకి వెళ్ళి కూర్చున్నారు. స్టూవర్ట్ నిలుచుని ప్రయాణిస్తున్నప్పుడు, తాము అంతకు ముందు మాట్లాడిన విషయాల్ని గురించే ఆలోచిస్తున్నాడనిపించింది. అప్పుడు ఆపేసిన చోటునుంచి మళ్ళీ సంభాషణ మొదలుపెట్టాడు.

"నేను ధ్యేయం సంగతి ఎందుకు చెప్పానంటే, ఈ దేశంలో జనం తమది మాత్రమే అయిన చిన్న లోకాన్ని సృష్టించుకుని దానిలోనే వుండిపోతారు. ఉమ్మడి కుటుంబాలున్న మీ దేశంలాంటి దేశాల్లో ఇంకా వ్యక్తి, సమాజాల మధ్య రక్త సంబంధం మిగిలి వుంది. కాని మాలో చూడు ; పదహారేళ్ళకి అబ్బాయి

సంపాదన కోసం ఉద్యోగంలోకి దిగుతాడు; పద్ధెనిమిదేళ్ళకి పెళ్ళి చేసుకుంటాడు. ఉద్యోగం దొరక్కపోతే అతనికి నిరుద్యోగపు వేతనం దొరుకుతుంది. 'ముసలి తల్లిదండ్రుల్ని చూసుకోవాలి, యౌవనంలో వృద్ధాప్యపు అనుభవంతో బాంధవ్యం ఉంచుకోవాలి' అన్న వత్తిడి లేదు. ముసలి తల్లిదండ్రుల్ని చూసుకునే old people's homes ఉన్నాయి - మొత్తం మీద జీవితాన్ని పరిపక్వం చేసే ఆలోచన, వత్తిడి లేవు. అతని భార్య హైర్ పర్చేస్‌లో ఇంటికి కావాల్సిన టి.వి., హూవర్ మాటిక్ వాషింగ్-మెషీన్, ఫ్రిజిడైర్ కొంటుంది. ఇతనో కారు తీసుకుంటాడు. సాయంత్రాలు రోజు వెళ్ళే పబ్‌కి వెళ్ళి రెండు గంటలు తనలాగా బ్రతికే ఇంకా కొంతమందితో కాలక్షేపం చేసి, ఇంటికొచ్చి టి.వి. చూసి, ఏడాది కోసారి హాలీడేకి వెడుతూ, బీచిలో అర్ధనగ్నంగా వేలాదిమందితో బాటు తామూ పడుకుని దేహాన్ని ట్యాన్ చేసుకుని .... దీన్ని ఓ బ్రతుకే అంటావా ? వీళ్ళకీ మొత్తంమీద జీవితానికి ఏమిటి సంబంధం ? నా జీవితానికి వీరి జీవితానికీ తేడా ఏమీ లేదు కేశవ్! సుఖమూ కావాలి, దుఃఖమూ కావాలి. జీవితంలో ఘర్షణ వుండాలి. వేగమూ ఉండాలి. జీవితమంటే ఉత్తినే సాఫీగా దొర్లుకుపోవటం కాదు. Oh! I am bored, terribly bored! ఇంగ్లండులో జీవమే లేదు - ఈ సుఖ సమాజంలో జీవితానికో ధ్యేయం లేదు. నువ్వంటావు- నీ బ్రతుకంతా పేదరికంతో పోరడటంతోనే గడిచిపోయిందని. కామపు అనుభవం లేకుండా సడలి పోయిందని. కాని నన్నే తీసుకో కేశవ్ : నాకు పేదరికంతో పరిచయమే లేదు. ఆకలంటే ఏమిటో తెలియదు. పదహారో ఏటినుంచి ఇంతవరకూ ఆడది కావాలని పించినప్పుడు స్త్రీ సుఖం దొరకడం కష్టం అనిపించలేదు - సంతాన నిరోధం గురించి అందరికీ తెలిసిన ఈ దేశంలో అమ్మాయిలతో పడుకోవటం భయపడాల్సిన విషయం ఏమీ కాదు. అన్నీ అయ్యాయి - తిన్నాను, పడుకున్నాను, సంభోగించాను, మరింత తిన్నాను, పడుకున్నాను, సంభోగించాను. సరే తర్వాత ? జీవితంలో ఇంక thrill ఏం వుందంటావ్ ?

"నిన్ను చూస్తుంటే నాకు అసూయ కలుగుతోంది స్టూవర్ట్" కేశవ్ నవ్వుతూ అన్నాడు.

"ఈ బండిలో కూర్చున్న మనుషుల్ని చూడు. మా సమాజపు ఓ Cross section ఇక్కడుంది. బౌలర్ హ్యాట్ , పిన్‌స్ట్రైప్ నల్ల సూట్ వేసుకుని 'Times' చదువుతూ కూర్చున్నతను బ్యాంక్‌లోనో, గవర్నమెంటు వుద్యోగంలోనో వుండివుంటాడు. అతను Establishment కి చెందిన వాడు. క్రీమ్ రాసి, జుత్తు నున్నగా దువ్వి, కాలర్ లేని జాకెట్ వేసుకున్నతను working class లో పుట్టిన

పోకిల్లా - ఎక్కడో సేల్స్‌మన్ అయ్యుంటాడు. జుత్తుకి ఎర్ర రంగు రాసుకుని, చిరునవ్వు నవ్వుతున్న పిల్ల బహుశా wool worth లో సేల్స్ గర్ల్, బహుశా pick up girl. ఆ ఇంకో అమ్మాయి మొహం చూస్తేనే తెలుస్తుంది, ఆమె Steno typist. వాళ్ళు వాడే సెంటుని బట్టి చెప్పవచ్చును - వాళ్ళు ఏ వర్గపు వాళ్ళు వాళ్ళ అభిరుచి ఏమిటి అన్న సంగతి. రాబడి, హోదా చూసి పెళ్ళి చేసుకుంటుందామె. Slim గా వుండటానికి రోజూ వ్యాయామం చేస్తుంది. సాయంత్రాలు ఫ్రెంచ్ నేర్చుకుంటుంది. ఫోన్‌లో అపాయింట్‌మెంట్ ఫిక్స్ చేసి Hair-stylist దగ్గరకు వెళ్ళి తనజుత్తు trim చేయించుకుని వస్తుంది. బీటల్స్ స్టైల్‌లో పొడుగ్గా జుత్తు పెంచుకుని టైట్ ప్యాంట్ వేసుకుని చేతిలో ట్రాన్సిస్టర్ పట్టుకుని కూర్చున్న కుర్రాళ్ళు మరో రెండేళ్ళలో పెళ్ళి చేసుకుని, హైర్ పర్చేస్‌లో కొన్న సామాన్లకు ప్రతీ వారం డబ్బులు కట్టడానికి మొదలెడతారు. నేను కూడా ఇంకో సంవత్సరంలో యూనివర్సిటీ చదువు పూర్తిచేసి, ఆ బౌలర్ హ్యాట్ వేసుకున్నాడే అతని ఎస్టాబ్లిష్‌మెంట్‌లో ఒక సామాన్యమైన, ముఖ్యమైన పీల్ అవుతాను.... ఎలాంటి 'తీవ్రవాది అయినా ఇక్కడ peer పదవి దొరికి ఎస్టాబ్లిష్‌మెంట్‌లో ఓ భాగమై పోతాడు. Sartre ఇంగ్లీషులో వ్రాసి వుంటే అతను ఇక్కడ House of Lords లో మెంబరయ్యేవాడు...లేదు - ఇంగ్లండ్ క్రమంగా తన సున్నితమైన అంతఃకరణాన్ని పోగొట్టుకుంటోంది. All of us need slimming, suffering...... మన Angry young men ఏమయ్యారో చూడు : బి.బి.సి.; ఇంకా మన ప్రముఖ పత్రికలు వాళ్ళని శక్తివంతులుగా గుర్తించి, తమ విశాలమైన ఎస్టాబ్లిష్‌మెంటులో కలిపేసుకున్నారు. లేదు, మీకు భవిష్యత్తు లేదు; ఈ దేశంలో ఏ కొత్త అనుభవమూ లేదు. మాలో మంచి-మంచి రచయితలంతా అందుకే వేరే దేశాల గురించి రాస్తారు : ఫార్స్‌ట్‌రే, లారెన్స్, గ్రీన్,డరెల్ - ఇంగ్లండులో రాయటానికేముంది ? Nothing but our stupid sobbery.... ఈ ఉపన్యాసం పెద్దదయింది కదూ ? క్షమించు. అనర్గళమైన ఉపన్యాసాల్ని మీ భారతీయులు మా దగ్గరేగా నేర్చుకున్నది ? Tit for tat అంటూ స్టూవర్ట్ నవ్వి మాట పూర్తి చేశాడు. ఎర్రబడిన అతని మొహం చూసి కేశవుడికి అతను భావావేశానికి లోనై మాట్లాడుతున్నాడని తెలిసింది. సమిష్టి కుటుంబం గురించి అతను మాట్లాడాడు, కాని అతనికి ఆ విషయం అనుభవ పూర్వకంగా తెలియదని పించింది. తను ఆ అనుభవంతో పిచ్చెక్కిపోయున్నాడు. బహుశా ఏ సమాజ వ్యవస్థలోనూ మనిషికి సుఖం లేదు; ఇలా అశాంతిగా వుండటమే మనిషికి అనంతమైన అనాదినుంచి వస్తున్న అవశ్యకత అయివుండవచ్చును. నా జీవితం, క్రియాశక్తి వ్యర్థమై పోతుందని నేను అస్తమానం వాగి వాగి, అది ఇంట్లో

వాళ్ళకి అలవాటై పోవటంతో, ఇప్పుడెవరూ, దాన్ని పట్టించు కోవటమే లేదు. ్నా నలుగురు చెల్లెళ్ళు అర్ధాకలితో, కాటన్ చీరెలు కడుతూ, చెప్పుల్లేని కాళ్ళతో నడుస్తున్నా కూడా, బెంగతో కృశిస్తున్న అమ్మ కళ్ళకి, వసంతంలో చిగుర్చిన అరణ్య వృక్షాల్లాగా జీవం తొణికిసలాడుతూ, బాంబుల్లా కనిపిస్తున్నారు. గుండె లెత్తుగా కనిపించకుండా, గుడ్డతో కుట్టిన బ్రేసియర్స్‌తో బిగుతుగా కట్టి, కొంగు కప్పుకుని, గూనిగా, బుర్ర వంచుకుని పుస్తకాలు, జామిట్రీ బాక్స్ పట్టుకుని, వాళ్ళు కాలేజీల నుంచి నడచిరావటం చూస్తే కేశవ్‌కి కడుపులో దేవినట్టు వుతుంది. బ్రతుకు ఎంత బరువైంది అనిపిస్తుంది. కాని తమ క్షేమాన్ని ఆలోచించడం గురించి ఆడవాళ్ళకి ఎవరూ నేర్పాల్సిన అవసరం లేదు. రాత్రి పదకొండు గంటల వరకూ చదివి, మళ్ళీ తెల్లవారుజామున లేచి ఇంటి పనుల్లో తల్లికి సాయం జేసి, ఫస్ట్ క్లాసులో పాసై, ఫ్రీ షిప్ తెచ్చుకుని చదువుకుంటున్నారు – తమ్ముళ్ళు సిగ్గుపడేలా. మాధుకి అసలు తన బాగోగుల గురించిన ఆలోచన లేనే లేదు. బోనస్‌లాగా అతనికి ఒకసారి కొంత డబ్బు ఒక్కసారిగా వచ్చింది. నలుగురు చెల్లెళ్ళకి, తల్లికి చీరలు; తనకు, కేశవ్‌కి సుధీంద్రుడికి ప్యాంట్ గుడ్డలూ కొన్నాడు. ఓ వారం రోజులు నవ్వుతూ తుళ్ళుతూ , చెల్లెళ్ళకి సినిమాలు చూపిస్తూ వచ్చిన డబ్బంతా జల్సా చేశాడు. అలా చూడబోతే, మాధూ తన కన్నా చలాకైన యువకుడు. తన లాగా చెయ్యా నా వద్దా అని ఊగిసలాడే తత్వంలేని కుర్రాడు. బాధ్యతల బరువుకి కుంగిపోని, ఇంకా ఉరకలేసే ప్రేమ అతనిది. అందుకే అమ్మాయిలు అతన్ని ఇష్టపడినంతగా తనను ఇష్టపడరు. కుటుంబం కోసం ప్రాకులాడుతూ తను ఇలా వెట్టిపోయాడు. కర్తవ్యాని కోసం ప్రేమని పోగొట్టుకున్నాడు. కర్తవ్యపు నీతి నియమాల హద్దుల్లేని మాధు హృదయంలో నిరుపయోగమైన, అపేక్షలేని ప్రేమ వుంది. ఈ మధ్యలో చెల్లెళ్ళు భలే నెరజాణలు; బహుశా తమ స్వంత క్షేమం దృష్ట్యా – మోసగత్తెలు. ఈ ఇల్లు ఆఖరి దాకా తమది కాదని వాళ్ళకి తెలుసు. ఇంట్లో వున్నన్ని రోజులూ తనకు, మాధుకు, అమ్మకు అనుగుణంగా మసలడానికే ప్రయత్నిస్తారు. పెళ్ళి చేసుకుని మంచి ఇల్లు చేరగానే వాళ్ళకి బెడద తప్పిపోతుంది. అందుకనే మంచి మొగుళ్ళ కోసం వాళ్ళు కాచుక్కూర్చున్నారు. వాళ్ళకి మంచి మొగుడు దొరకటానికి తనొక సాధనం కావటం మూలాన్ని అన్నయ్యతో ఇష్టంగా వుంటారు. లెక్చరర్ చెల్లెళ్ళుగా వాళ్ళకి ఓ స్టేటస్ వుంది. అది వాళ్ళకూ తెలుసు. నాన్న చనిపోయాక, అప్పు ఖర్చులు పోగా, తోట అమ్మిన డబ్బులో ఇంకా అయిదు వేలు మిగిలి వున్నాయి – బ్యాంకులో ఇంకా అయిదు వేలయినా కావాలి, ఆ పిల్లలకు మొగుళ్ళను కొనుక్కోవటానికి. దానికోసం తాను కష్టపడాలి – ఇంటి

మర్యాదకు తగినట్టుగా ఆడంబరంగా పెళ్ళి చేయకపోతే అమ్మ ఊరుకుంటుందా - నా వళ్ళో ఆడుకోవటానికి ఇంట్లో మనుమలే లేరు. నువ్వైనా పెళ్ళి చేసుకోరా అంటుంది అమ్మ. మొదట చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు కాని అంటాను. ' నీ అక్క కూతురే వుంది కదా ' .... అలా మొదలవుతుంది మళ్ళీ పాత కథ. 'వాళ్ళది పెద్ద సంసారం. ఈ మాత్రం సాయం చేయరా . కన్నె చెర విడిపించు నాయనా....'' అంటుంది. నాకు వొళ్ళు తెలియని కోపం వస్తుంది. అరుస్తాను. నేటి కొచ్చినట్టల్లా మాట్లాడుతాను. చెప్పులు తొడుక్కుని బయటకు నడుస్తూ ఇవ్వాళ కుర్రాళ్ళు వస్తే ట్యూషన్ లేదని చెప్పు. ఈ ఇంటి కోసం చాకిరీ చేసి, చేసి సున్నమై పోతున్నాను అంటాను.

నాకూ తెలుసు, అమ్మకీ తెలుసు - భాగీరథి కాకుండా వేరే అమ్మాయిని చేసుకోవటం సాధ్యంకాని పని అని. నలుగురు పెళ్ళి కావాల్సిన చెల్లెళ్ళు, ఇద్దరు పనికిమాలిన , జులాయిగా తిరిగే తమ్ముళ్ళు గల ఈ ఇంటికి వేరే ఎవరైనా చదువుకున్న అమ్మాయి వస్తే ఖచ్చితంగా గొడవలు తప్పవు. మొగుడిని ఇంటి నుంచి వేరుచేసి, వేరే కాపురం పెట్టించటానికి ప్రయత్నిస్తుంది. భాగీరథి అయితే అమ్మ హక్కుగా గద్దించి అదుపులో వుంచటానికి అవకాశం వుంటుంది. నా చెల్లెళ్ళకుక్కూడా ఇది తెలుసు. నాకు ఇంత అనుగుణంగా నడుచుకునే వాళ్ళు, తమ క్షేమం దృష్ట్యా , తమకు మంచి సంబంధాలు దొరకాలన్న దృష్టితో, చాలా సున్నితంగా నేను భాగీరథి వేపు మొగ్గేలా చెయ్యటానికి ప్రయత్నిస్తారు. ఆ అమ్మాయి చేత నాకో స్వెటర్ అల్లించటం, ఏదో పని వంకతో ఆమెని నా గదిలో వదిలి వెళ్ళటం - ఇలాటివి. ఇదేదో స్వార్థపు సాలె గూట్లో చిక్కుకుంటున్నట్టుగా అనిపించి విడిపించు కోవటానికి శక్తి వంచన లేకుండా ప్రయత్నిస్తాను. కాని ఎలా ? .... ఎలాగా ? అందుకే ఇంగ్లండ్‌కి వచ్చాను.

భాగం : రెండు

చీకటిలోంచి మళ్ళీ వెలుతుర్లోకి తలుపులు జారాయి. జనాన్ని కక్కి, మింగి మళ్ళీ మూసుకున్నాయి. మొదట్లో ఈ భూత -నగరంలో ఇంట్లో వాళ్ళకి అయిదు వేల మైళ్ళ దూరంలో వుంటూ, నేను తెలుసుకోవాల్సింది ఏమిటంటే : నాలో అన్ని సున్నితత్వాలను మింగి రాక్షస రోషం లావాలా మరుగుతోందని. అది దుర్బలమైన రోషమని, ప్రేమని ఇవ్వలేని ఎవరినుంచి పొందలేని బలహీనత, చేతకానితనం లోపల దాగి వున్నాయి. కొన్ని పగటి కలల్ని కంటూ వుంటా నప్పుడప్పుడు : ఒకటి, నేను చాకిరీ చేసి, చేసి సున్నమై పెళ్ళి పెడాకులు లేకుండా ఎండి, వాడి, అమ్మా, మాధూ, చెల్లెళ్ళూ బలసి, కృతఘ్నులై, నా మీద కత్తి కట్టి, నేను అందరి అపార కరుణకు పాత్రుడిని కావటం; ఇంకోటి విధి

వశాత్తూ తల్లీ, తమ్ముళ్ళూ, చెల్లెళ్ళు చనిపోయి నేనొక్కడినే గాఢమైన దుఃఖ సముద్రంలో మునిగి పోవటం. రోషం నుంచి, నిస్సహాయత నుంచి మరింత రోషం. కామం, క్రోధం, సమ్మోహం,స్మృతి భ్రమ, బుద్ధి నాశం, బుద్ధి నాశాత్ ప్రణశ్యతి. రాతిని చెక్కాలి, మట్టి మొయ్యాలి. ఆహా, రంపంతో చెక్క దిమ్మల్ని కోయాలి.

ఎస్కలేటర్ మీద నిలుచుని లోకానికి వస్తూ, స్టూవర్ట్‌తో అన్నాడు.

"నాకు ఇవన్నీ ఎంత చిత్రమైన అనుభవాలో తెలుసా ? పదహారేళ్ళొచ్చే వరకూ నేను ట్రెయిన్ కాని, ఎలక్ట్రిక్ దీపాన్ని కాని చూడలేదు. పల్లెటూరి ఇంట్లోంచి ఇంకొంచెం పెద్ద పల్లెటూర్లో వున్న హైస్కూల్‌కి ఉత్తి కాళ్ళతో నడిచి వచ్చి చదువుకున్నాను...."

"నిన్ను చూస్తే నాకు అసూయ కలుగుతోంది."

రోషం. నాతో బాటు ఇలాగే ఇంకో పదిహేను రోజులు స్టూవర్ట్ వుంటే పరస్పరం జుగుప్సతో ఈ స్నేహం ఆఖరవుతుంది. నేను లోపలకు వెళ్ళి ముట్టిందల్లా మట్టే. నడిచిన చోటల్లా ఇసుక పర్రలు. లోపలి కోరిక : భయంకరంగా హింసించాలి, లేదా హింసింపబడాలి. విషకన్య నగ్నమైన జ్వాలలో పడాలి. ఆమె పెదాలు, నడుము, రొమ్ములూ వీటి మంటకు హావిస్సునై. మళ్ళీ ఆమె గర్భాన్ని ప్రవేశించి ఉడికి, బంగారు విగ్రహమై, ఆమె పొట్ట చీల్చుకుని బయటకు రావాలి. భారతదేశంలో యుద్ధం జరగాలి. అందులో మేమందరం సైనికుల మయి చంపాలి ; శత్రువుల నగరాన్ని ముట్టడించి, ఆ స్త్రీల మానభంగం చేసి, లూటీ చేసి, మీసాలు మెలేసి....

"పర్స్ జాగ్రత్తగా తీసుకురా" అన్నాడు స్టూవర్ట్.

ఆడా మగా దేహాల ఓ పెద్ద గుంపు పరస్పరం రుద్దుకుని, తాకి కౌగలించుకున్నా కాని, వేర్వేరు రోషాలు లోకాలుగానే మిగిలి, అడుగు మీద అడుగు వేసి, బయటికి రాగానే 'గాలికి ఎగిరే పూరేకుల్లా '...పౌండ్ పద్యాన్ని మళ్ళీ తలుచుకున్నాడు కేశవ్. ఇంగ్లండ్‌లో జూన్ నెల ఓ సాయంత్రపు అపురూపమైన ఎండ, నీలి కళ్ళ అందమైన పసిపాప నవ్వులా వుంది. రాత్రి తొమ్మిది గంటల దాకా ఎండలో వుండి, బియర్ తాగి, కాళ్ళు చాపుక్కూర్చుని టెలివిజన్ చూసి, కర్టెన్ లాక్కుని, గుడ్ నైట్ చెప్పి, పార్కుల్లో ప్రేమని ప్రదర్శిస్తూ గడిపే.... ఆహా, హాయి గొలిపే సాయంత్రం. స్టూవర్ట్ వెనకాలే నడుస్తూ, నారింజ రంగులో మిణుక్కుమంటున్న దీపాలున్న జిబ్రాల్టర్ క్రాసింగ్‌ని - "వచ్చిన కొత్తలో ఇది తెలియదు. రోడ్డు ఓ కొస నుంచి ఇంకో కొసకు అనాథ పక్షిలా ఎగిరేవాడ్ని " - దాటాడు. వాళ్ళు దాటి వెళ్ళటానికోసమే కారు నిలిపిన

డ్రైవర్‌కి స్టువర్ట్‌లా తనూ తొందర తొందరగా చెయ్యెత్తి నమస్కారం చేశాడు.

× × ×

ఇంగ్లండుకు వచ్చిన మూడ్నెల్లదాకా బోర్ కొట్టేలాంటి ఒంటరి జీవితం గడపాల్సి వచ్చేది. యూనివర్సిటీ నుంచి డిగ్స్‌కి, డిగ్స్ నుంచి యూనివర్సిటీకి, కొన్ని రోజులు ల్యాండ్ లేడీతో గుడ్‌మార్నింగ్, గుడీవినింగ్ తప్ప మరొక్క మాట మాట్లాడకుండా తనలోని నరకంలోనే బ్రతకాల్సి వచ్చింది. యూనివర్సిటీలోని కొంత మంది భారతీయ విద్యార్థులతో పరిచయమైనా, వాళ్ళతో కలవటం అసహనీయంగా అనిపించింది. ఏదో కొత్త జీవితాన్ని కొత్త విలువలనీ ఆశించి ఇంగ్లండ్‌కి వచ్చిన అతనికి అది వాళ్ళ వద్ద దొరకదని బాగా తెలిసిపోయింది. ఇన్ని రోజుల స్నేహం తరువాత కూడా స్టువర్ట్ తనని అడగని ప్రశ్న భారతీయ విద్యార్థి పరిచయం కాగానే అడుగుతాడు : "నీకు స్కాలర్‌షిప్ ఎంత దొరకుతుంది ?" "....ఇంత" "సగానికి సగం మిగల్చ వచ్చును." మిగిల్చి భార్యను వెంట తీసుకుని వచ్చిన ప్రతీ భారతీయుడికున్న ఆశ ఓ Pop-up toaster, ఒక washing-machine, ఒక refrigerator, ఒక transistor ని ఎలాగైనా export-duty లేకుండా తమతో తీసికెళ్ళటం. స్టువర్ట్ తమ దేశీయుల్లో చూసే మెటీరియలిసం కన్నా భయంకరమైన మెటీరియలిసాన్ని కేశవ్ భారతీయుల్లో చూశాడు. ఇక్కడ చదువుకున్న భారతీయులు స్వదేశం వెళ్ళాక ఎల్లా, ఎంతటి ఆశపోతుల్లాగా ప్రవర్తిస్తారో కేశవ్‌కి బాగా అనుభవమే. కాని ఇలాంటి భారతీయుల్ని తప్పిస్తే మరే ఇంగ్లీషువాడి స్నేహమూ లభించలేదు కేశవ్‌కి. విద్యార్థులలో ముప్పాతికమంది విరామ సమయాల్లో రెఫెక్టరీ బెంచీల మీద ప్రణయ కలాపాలలో మునిగి వుండేవారు. కనుక ఒక్కడితో కూడా స్నేహం చెయ్యలేక పోయేవాడు. సిటీలో, త్రోవలో కనిపించే తెల్లవాళ్ళంతా తనను నవర్ణీయుడన్న అనుమానంతో తక్కువ చూపు చూసేవారు.

ఇంగ్లండ్‌కి వచ్చిన మూడ్నెల్ల తరువాత యూనివర్సిటీ అంటీ - పార్థేడ్ గుంపువారి ఓ సభలో కేశవ్‌కి స్టువర్ట్ పరిచయమయింది. అందరు ఇంగ్లీషు వాళ్ళ లాగానే - ఈ వాతావరణం నచ్చిందా మీకు ? అంటూ వాతవరణం గురించిన సంభాషణ ప్రారంభమయింది. 'ఓహ్! నిరుడు నువ్వు ఉండాల్సింది ఇక్కడ. అలాంటి వింటర్‌ని నేను పుట్టినప్పటినుంచి చూసెరుగను." అంటూ నాటకీయంగా చేతులెత్తి తలాడించాడు స్టువర్ట్. దానికి బదులుగా కేశవ్ "నాకు మంచు వడుతూంటె చూడటం చాలా ఇష్టం. ఈ చూపు సారించినంత దూరం మంచు నిండి తెల్లగా వుంటే చూడాలని ఎదురుచూస్తున్నాను నేను." అన్నాడు. .... ఇలాగే మాట్లాడుకుంటూ వుండే అతను తన డైరీ తీసి 'వచ్చే గురువారం

సాయంత్రం నా డిగ్స్‌కి వస్తావా ? కలిసి భోంచెద్దాం' అన్నాడు. స్టూవర్ట్‌తో స్నేహం అతనికి వెన్నెల్లా హాయిగా వుంది. అతి అయిన ఆత్మీయతతో ఊపిరాడకుండా చేసి సెగ పుట్టించే స్నేహం కాదది. అసలు ఆత్మీయత అంటేనే భయపడతాడు కేశవ్ - గాఢమైన స్నేహం ఇంక తన వల్ల కాని పని అనిపిస్తోంది. (తన లోపలున్నది చాలా అప్రియమైన తన పట్లనే వున్న జాలితో కుళ్ళిన, పూడ్చిపెట్టకుండా వ్రేల్లాడ దీసిన భూతకాలపు శవాలు.( సౌజన్యమూ, సభ్యతల పై మెరుగుల బ్రతుకే నయం. కేశవుడితో బాగా పరిచయ మయ్యాక కూడా, అతడ్ని కలుసుకునే ముందు స్టూవర్ట్, 'రానా. ఖాళీయేనా ?' అనడుగుతాడు. వాళ్ళ సంభాషణ సాధారణంగా స్టూవర్ట్‌కి. ఇష్టమైన భారతీయ అధ్యాత్మం, యోగం, వెనుకబడిన దేశాలకు ఆర్థిక సహాయం వీటి గురించి అయి వుంటుంది. కేశవ్‌కి తెలుసు : స్టూవర్ట్ నిజమైన యూరోపియన్ - అతని ఆత్మ పురోగమనం సభ్యతా మార్గంలోనే జరగాలి. నాజూగ్గా, బుద్ధి పూర్వకంగా, ఆరోగ్యంగా జీవించడానికి ప్రయత్నించే అతని అంతిమ ధ్యేయం అత్యంత సభ్యమైన మానవ సంబంధాలలో అనివార్యమైన బాధ, మురికి, కుళ్ళు వీటిని పూర్తిగా తుడిచివేసిన అంటి -సెప్టిక్ సమాజం. భారతదేశంలో మానవ సంబంధం కుళ్ళులోనే పెరుగుతుంది.కాళ్ళుపూడుకునీ పోవచ్చు. పూలు వికసించ నూవచ్చు. అందువల్ల స్టూవర్ట్ ఎంత అనుభవపూర్వకమైన భారతదేశాన్ని ప్రేమించినా, అనుభవానికి ముందు, ఉచ్చ , బురద, కుళ్ళు వీటి వాసనలలో పెరిగిన జీవితపు తీవ్రతని అనుభవించ లేదు. కేశవుడికది తెలుసు. తాను కాళ్ళు బురదలో కూరుకుని పోయిన మనిషి. కాని భారతదేశపు నేలలో కూరుకుని పోకుండా పైకి గెంతిన వారూ వున్నారు. మండుతున్న బండరాతి మీద కూర్చుని, పురుగూపుట్రాతో సహితంగా సమస్త లోకాన్ని ప్రేమతో చూసి మూగవేయిన వారూ వున్నారు. అన్నింటినీ నియంత్రించిన నిర్మలమైన స్టూవర్ట్ పెరిగిన నేలలో యోగులు పుట్టుకురారు - సభ్యులైన వారూ మానవ హితం కోరేవారూ పుట్టుకొస్తారు.

స్టూవర్ట్ తాను ఎంత అసంతృప్తితో జీవిస్తున్నానని చెప్పినా, అతని జీవితానికో నియమం వుంది. అతను తన లాగా ఏమీ తోచక, ఒకదాని తర్వాత ఒకటి సిగరెట్ ఊదేస్తూ కిం కర్తవ్య మూఢుడై, శాపగ్రస్తుడి లాగా కూర్చుని వుండడాన్ని కేశవ్ చూడలేదు. తన బ్రతుకులోని ప్రతీ క్షణాన్ని డైరీలో ముందుగా రాసిపెట్టినట్లుగా వివేచనతో జీవిస్తాడు. ప్రతీ సంవత్సరం వేసవి శెలవుల్లో కొండ లెక్కటానికి యూరప్‌కి వెడతాడు. సభ్యుడి ముఖ్యమైన ధ్యేయం ఏమిటంటే తన వల్ల మరొకరికి బాధ కలగకూడదు; అన్యాయం జరక్కూడదు; తాను ఒకరి

చేతి కింద వుండకూడదు, వుంచకూడదు. మొదటి బియర్ కేశవ్ కొని తెస్తే, రెండోది స్టూవర్ట్ తెస్తాడు. భోజనానికి పిలిస్తే మళ్ళీ పిలుస్తాడు. ఎవరినైనా దాటుకుని వెళ్ళాల్సి వస్తే 'క్షమించండి' అంటాడు. త్రేన్పుడు. గట్టిగా మాట్లాడడు. మాట మధ్యలో దగ్గాల్సి వచ్చినా, తుమ్మాల్సి వచ్చినా 'క్షమించు' అంటాడు. రతి సమయంలో కూడా ఈ మనుష్యులు సభ్యత ఎల్లలు దాటుతారో లేదో తెలీదు. స్టూవర్ట్ దానిక్కారణం తమది వర్తకుల దేశమవటమే నంటారు. ఈ వినయం, సభ్యతా sales manship అంటూ తన దేశాన్ని తక్కువ జేసి మాట్లాడతాడు. వీళ్లు తమని తాము పొగుడు కోవటాన్ని తాను చూడనే లేదు. ఓ రోజు యూనివర్సిటీలోని 'మెర్‌మెయిడ్' బార్‌లో బియర్ త్రాగుతూ స్టూవర్ట్ అన్నాడు:

"ఆత్మజ్ఞానం, పరమార్థమని ప్రపంచానికి మొట్టమొదటిగా చెప్పిన దేశం భారతదేశం"....)

కేశవ్ దానికి "ఆత్మజ్ఞానం - నిజమే - జ్ఞానులకి అనుభావులకు మాత్రమే. కాని సభ్యతకు అవశ్యమైన ఆత్మవిమర్శ మనలో లేదు. సమాజపు హితదృష్టితో చూస్తే, ఆత్మజ్ఞానానికన్నా, ఆత్మవిమర్శ ముఖ్యం....ప్రాపంచిక విషయాల్లో మునిగిన వారికి ఒకటి సత్యమైతే, ప్రవేశం లేనివారికి మరొకటి...." అన్నాడు.

సంభాషణ తీవ్రమైన విషయాల చుట్టూ తిరిగినా, ఒక్క క్షణం డ్రాఫ్ట్ బియర్ వల్ల, హాయిగా, దాహాన్ని పోగొట్టే చల్లదనం వల్ల ప్రాణానికి సుఖంగా వుంది. కుంపట్లో రాక్షసి బొగ్గుల నిప్పు, ఎర్రపువ్వుల బొమ్మలున్న కర్టెన్లు మందంగా వెలుగుతున్న దీపాల చిన్న బారు. మూలగా వున్న సోఫాలో యువకుడి గుండెల్ని అనుకుని, సగం కళ్ళుమూసుకుని, సిగరెట్ పీలుస్తున్న అమ్మాయిని చూస్తే, ఆశకాని, అసూయ గాని కలగటం లేదు. బార్‌మన్ గుడ్డతో గ్లాసుల్ని తుడుస్తూ, రుద్దుతూ మృదువుగా ఈల వేస్తాడు. సీసాల్లో షెర్రి, వైన్‌లను నింపిన, విస్కీ, జిన్, బ్రాండీ సీసాల్ని తల్లక్రిందులుగా పెట్టిన బార్‌లో మత్స్య దేహపు కన్యబొమ్మ సన్నటి దారానికి వేల్లాడి తిరుగుతోంది. స్టూవర్ట్ రెండు గ్లాసుల్ని పట్టుకెళ్లాడు. బార్‌మన్ కన్నుకొట్టాడు. స్టూవర్ట్ రెండు బిట్టర్ అన్నాడు. బార్‌మన్ పంప్ చేసి బీయర్ నింపిస్తాడు.

బార్ నుంచి బయటకు వస్తూండగానే బ్రతుకు ఎండిపోతుంది. చలి, చీకటి, మంచు భారతదేశపు వీధుల్లో అడుక్కుంటూ, నుంచున్న భిక్షకుల్లా కనిపించే, నల్లగా ఎండిపోయిన దౌర్భాగ్యపు చెట్లు, వీధి దీపాల్లో తడి, చలి, ఫాగ్. కేశవ్ గ్లోవ్స్ వేసుకుని, కోటు జేబుల్లో చేతులుంచి వణుకుతాడు. "You arc catching a chill, Bye-see you" అని స్టూవర్ట్ తన డిగ్స్ వేపు వేగంగా అడుగులు వేస్తాడు. కేశవ్‌కి

తామిద్దరి జీవితాలలో వున్న తేడా మరోసారి గుర్తువచ్చి వ్యథ కలుగుతోంది. అసూయ కలుగుతుంది. ఇతని శక్తి స్వంత విషయాల్లో నిమగ్నమై గొడవల్లో వ్యర్థమైపోదు. ఇంట్లో తల్లిదండ్రులతో కూడా అతని ప్రవర్తన సభ్యసమాజపు మర్యాద నతిక్రమించకుండానే వుంటుందేమో, ఉదయం నిద్ర లేవగానే గుడ్‌మార్నింగ్, రాత్రి పడుకునేటప్పుడు గుడ్‌నైట్. తనది ఇంట్లో రోజూ గొడవే, రోజూ దెబ్బలాటే. లెక్చరర్స్ కూర్చునే చినిగిన సోఫా, మూడు కాళ్ల కుర్చీలు గల స్టాఫ్‌రూం మరో నరకం. అక్కడ వీరశైవులు, బ్రాహ్మణులు, శూద్రులు ఇంకా ఇతరులు అంటూ అసూయతో మండి పోయే నాలుగు నరకాలు. ఎంత వద్దనుకున్నా ప్రతీ వొక్కడు ఇందులో ఏదో ఒక నరకంలో పడి చావాల్సిందే. ఇద్దరు కలిస్తే మూడోవాడి మీద అప ప్రచారం తప్పదు. ఓ గుంపులో కాస్సేపు కూర్చుని లేచి అంత దూరం వెళ్లేలోగానే తన వెనకాల తనని గురించి ఆడిపోసుకుంటారని తెలుసు తనకి. అందుకే తనకి వెనక్కి తిరిగి చూస్తూ నడిచే అలవాటు. ఇంగ్లండ్‌కి వచ్చాక కూడా ఈ అలవాటు తప్పలేదు. గుంపు నుంచి లేచి వచ్చాక త్రోవలో నడిచేటప్పుడు. తనలాగా వెనక్కి తిరిగి చూస్తూ నడిచే వాళ్లెవర్నీ ఇక్కడ చూసి ఎరగడు తాను. ఇంట్లోనూ, కాలేజిలోనూ అతడు తనని చూసి తానే జాలిపడే, పరస్పరం అసూయతో రక్కుకునే పళ్ళునూరే నరకంలో బ్రతుకుతున్నానని: దాని నుంచి తప్పించుకోవటానికి తపస్సు చేసి, సతతంగా ప్రయత్నించి, ఇంట్లో వాళ్లని విపరీతమైన కష్టాలకు గురిచేసి, అపరిమితమైన స్వార్థంతో ఇంగ్లండ్‌కి వచ్చాడు. "పుట్టుకతో వచ్చిన బుద్ధి పుడకలతో కాని పోదు" అన్న తండ్రి మాట అప్పుడప్పుడూ గుర్తు వస్తూ ఉంటుంది.

× × ×

"మనం ఇప్పుడు ఆక్సఫర్డ్ స్ట్రీట్‌లో వున్నాం. ఫేమస్ షాపింగ్ సెంటర్ అన్నాడు స్టూవర్ట్. రోడ్డుకి రెండు వేపులా వరుసగా వున్న కొట్ల వైభవం కేశవుడిని అంతగా ఆకర్షించ లేదు. వెస్ట్ మినిస్టర్ అబ్బి, సెంట్ పాల్స్ కథెడ్రల్, హైడ్ పార్క్ బ్లూమ్స్ బరీ, చెల్సి - అలాంటి చోట్లకేమైనా వెడితే తన సాహిత్యపు గంట మోగి కంటికి విందు కలిగేది. తన కళ్లు పూర్వ నిశ్చితమైన దాన్ని మాత్రమే గ్రహిస్తుంది. కనిపించని తలుపులు తెరచి, కొత్త లోకాన్ని చూసి ఆశ్చర్యంతో మూగపోయే లాంటి అనుభవం లేదు. కొలంబస్ చూసి ఆశ్చర్యంతో మూగవేయేలాంటి అనుభవం లేదు. కొలంబస్ తను చూసిన కొత్త లోకాన్ని, తాను వెతుక్కుంటూ వెళ్లిన ఇండియా అనుకోలేదూ? స్టూవర్ట్‌కి చెప్పాలి - వెతికితే దొరికేది మనం వెతికినది. అంటే మన మనసుల్లో పూర్వ నిశ్చితమైనది. మనకు తెలియనిది, చూడనిది, మన అంతరంగపు లోకానికి వచ్చి, మూసిన తలుపుల్ని

తెరచి మరొక వుదయం, మరొక సాయంత్రాన్ని చూసి అచ్చెరువొంది, తన్మయం కావటం మరో రకం. అవ్యక్తమైనది. ఎదురైనప్పుడు, మనం మనకి ముందుగా తెలిసిన దానినే గ్రహిస్తాం. అవ్యక్తమైన దానిని చూద్దామని తాను ఇంగ్లండ్‌కి వచ్చాడు - కాని చూడలేక పోయాడు. క్లెసర్ ఇండియాకి వచ్చి, యోగి ఒకడిని కలుసుకున్నప్పుడు ముక్కు నులుముకుంటూ కూర్చున్న వాడిని చూసినట్టుగా, ఇక్కడ నాకు మైథునపు బొమ్మలు మాత్రమే కనిపిస్తాయి. తాబేలు తన చిప్పను మోసుకుని తిరిగే లాగా, నా భూతంతో పాటు నేను అక్స్‌ఫర్డ్ స్ట్రీట్‌లో తిరుగుతున్నాను. స్టూవర్ట్ ఇండియాకి వచ్చి యోగి వర్యులను కలుసుకున్నా తన సభ్యలోకపు గీత దాటలేదు. కెస్లర్ లాగా "ఈ భేటి ఎలా పూర్తవుతుంది? నేనే మొదట లేవాలా? లేక యోగి తనే ముందుగా లేచి ఇక వెళ్లవచ్చునని సూచిస్తాడా? ఇక్కడ ఆ ఆతిథ్యపు నియమాలేమిటి?" అనుకుంటూ మాటల మధ్య మౌనంలో ఆలోచిస్తూ కూర్చుంటాడు. ఇది ట్రాజడీ. నేను ఎక్కడకు వెళ్ళినా నా తమ్ముడి భవిష్యత్తు చావు కాని ఉద్ధారం కాని - నా జీవితమంతటి మీద తీర్పు లాగా బాధిస్తుంది.

నిన్న తమ్ముడి వద్దనుంచి ఉత్తరం వచ్చాక చేవిలో పురుగు దూరిన పశువులాగా విలవిల్లాడుతున్నాను. కళ్ళు తెరచి ఈ కొత్త సమస్యని లోతుగా చూడలేకుండా వున్నాను. దాన్నుంచి తప్పించుకోవాలనే స్టూవర్ట్ తో కలిసి లండన్‌కి వచ్చాను. ఇలాంటి విషయాలను చెప్పుకునేంతటి ఆత్మీయత నాకు స్టూవర్ట్‌తో లేదు. నేను ఇంగ్లండుకి బయలుదేరేముందు మాధు తన ఇష్టప్రకారమే. వెళ్లి షూ కంపెనీలో సేల్స్‌మన్‌గా చేరాడు నెలకు రెండు వందల రూపాయల జీతం మీద. "ఉత్తమ కులంలో పుట్టిన నా కొడుకు చెప్పుల కొట్లో చేరాల్సి వచ్చిందే, పరాయి వాళ్ళ కాళ్ళు పట్టుకుని చెప్పులు తొడగాల్సి వచ్చింది కదా" అంటూ అమ్మ బాధ పడసాగింది. నే నామెని కోప్పడ్డాను. పెద్ద చెల్లాయి మిడల్ స్కూల్లో టీచర్‌గా చేరటం నాకు సంతోషాన్నే కలగజేసింది. ఇన్ని రోజులూ అసలు వచ్చి మా మొహం చూడని శ్యాంబాబాయి వచ్చి రాద్ధాంత సిద్ధాంతం చేశాడు. వైదీకుల ఇంట్లో పుట్టిన కుర్రాడు జోళ్ళ షాపులో పనిచెయ్యకూడదంటాడు. నేను కోపాన్ని దిగమింగి ఊరుకున్నాను. నేను ఇంగ్లండుకి వెడతానని అన్నప్పుడు అమ్మ, శ్యాంబాబాయి నన్ను స్వార్థపరుడని అనుకుంటే అది వాళ్ళ తప్పు. నాది కాదు. ఇన్ని రోజులు నేను కష్టపడ్డాను. చాకిరీ చేశాను. ఇప్పుడు మాధు తనకు చేతనైన ఉద్యోగం చేసి ఇంట్లోవాళ్లని పోషించటంలో తప్పేమీ లేదనిపించింది నాకు. అమ్మ దేముడి గది చీకటి మూలలో కూర్చుని రోజూ ఏడ్చింది. దేవుడికి నందా దీపం వెలిగించి కొడుక్కు

మంచి బుద్ధి ఇమ్మని వేడుకుంది. వెళ్ళే ముందు పెళ్ళి చేసుకొమ్మని పోరసాగింది. నువ్వు వచ్చే వరకు నేను బ్రతికి వుంటానో లేదో నని ఏడ్చింది.

ఇంగ్లండ్‌కి వచ్చాక నెలకు పది పౌన్ల చొప్పున మిగిల్చి, ఓ నల్ల బజారు పంజాబిని పట్టుకుని ఇంటికి రెండు వందల రూపాయల చొప్పున పంపుతూ వచ్చాను. అమ్మకూ, చెల్లెళ్ళకు దీని వల్ల ఆనందమయ్యుండాలి. నాక్కూడా ఇలా డబ్బు పంపుతూ వుండటం వల్ల నా బాధ్యత నేరవేరుస్తున్నానన్న సంతృప్తి బాధ్యత వున్న నా లాంటి మనుష్యులుండే స్వార్థపు నరకంలో రౌడీలు, జులాయి వెధవలూ వుండరు మరి.

ఓ రోజు హఠాత్తుగా అమ్మ నుంచి వుత్తరం వచ్చింది. మాధూ ఉద్యోగం వదిలేశాడని. తర్వాత మాధు నుంచి వుత్తరం వచ్చింది. తన వల్ల ఇక ముందు ఇలాంటి పనులు చెయ్యటం కుదరదు. ఇన్ని రోజులూ గుప్తంగా వున్న తన ప్రతిభ వెలుగులోకి వచ్చే అవకాశం వచ్చింది అని. "అన్నయ్యా, నువ్వు నమ్మక పోవచ్చు. నేనే నవల రాశాను. ఓ పబ్లిషర్ దాన్ని చదివి చాలా బాగుందని మెచ్చుకున్నారు. అది పబ్లిష్ అయితే వచ్చే డబ్బు అమ్మ కిస్తాను. ఇక ముందు ఇలాగే రాసి సంపాయిస్తాను" ఉత్తరం చదివిన నాకు చిత్రమైన అనుభవం పిచ్చి కోపం.... కాని లోలోపల అసూయ తొంగి చూడక పోలేదు. నాలో లేనిదేదో, అవ్యక్తమైనది మాధూలో వుండొచ్చు. అతని జీవితం నా జీవితాన్ని కించపరచి లోకం ముందు ఎత్తి చూపించవచ్చు అనిపించింది. కొన్ని రోజుల తర్వాత చెల్లాయి విమల వుత్తరం రాసింది: "అన్నయ్యా మాధు అమ్మని ఏడిపించుకు తింటున్నాడు. తోట అమ్మిన డబ్బు అయిదువేలూ అమ్మ పేరిట బ్యాంకులో వుంది కదా, అది ఇమ్మని గొడవ చేస్తున్నాడు. అతని ఇద్దరు స్నేహితులు చెరో అయిదువేలు వేసుకుంటారట. ఆ పదిహేను వేలల్లో మాధు ఓ ప్రెస్ కొంటాడట. ప్రెస్ నడపగా వచ్చే డబ్బు ఇంటి కిస్తాను. మీ డబ్బు భద్రంగా వుంటుంది. బ్యాంక్ లో డబ్బు మూలగటం కన్నా ప్రెస్ పెడితే లాభమని పీడిస్తున్నాడు. అమ్మ ఏం చేయటానికి తోచక నీకు వ్రాయటానికి భయపడి వూరికే కూర్చుంది. మాధు ప్లాన్ ఏమిటంటే, తన నవలల్ని ఆ ప్రెస్‌లోనే అచ్చు వెయ్యచ్చు కదానని. ఇప్పుడు వాడిదో నవల అచ్చయింది. లాల్చీ పైజమా వేసుకున్న రచయితలు వాడి స్నేహితులు. వాళ్ళతో కలిసి తాగుతాడనీ వినికిడి...."

నేను మండిపడుతూ అమ్మకి రాశాను - మాధూకి డబ్బు ఇవ్వద్దు అని. మాధు దానికి జవాబు రాశాడు: "నువ్వు ఇంట్లో వున్నంత కాలం నాలో దాగి వున్న శక్తి, నీ విషపూరితమైన, దరిద్రపు వ్యక్తిత్వపు తొక్కిడి వల్ల వాడి, ఎండిపోయింది. ఓ

పురుగులా బ్రతికాను. నాకు నచ్చని పనులు చేసుకుంటూ బ్రతికాను. నువ్వు వెళ్ళిపోయాక నా జీవితం బాగుపడింది. చిగిర్చి మొగ్గ తొడిగింది. నా ఇద్దరు స్నేహితులు ముందుకొచ్చి, నేను బాగుపడి ఇంటికీ సాయపడగల దారి చూపారు. నా సృజనశక్తి వికసించి ఓ నవల రాశాను. నీ ఎండిపోయిన కార్పణ్య హృదయానికి దీని వల్ల చాలా అసూయ కలిగి వుండవచ్చు. జీవం వున్నది ఏదైనా సరే దాన్ని నువ్వు చంపుతావు. పక్కింటి అమ్మాయి నా పట్ల ప్రేమ పెంచుకున్నదని నువ్వు చేసిన గొడవ నేనింకా మర్చిపోలేదు. నువ్వు మహా నిస్వార్థపరుడివా ఏం? నాకేం తెలియదనుకోకు. ఇంట్లో వాళ్ళకి తెలీకుండా బ్యాంకులో నీ సొంతానికని నువ్వు అయిదువందల రూపాయలు దాచుకో లేదూ? నాకు నీకున్న తెలివి తేటల్లేవు. వచ్చినదంతా అందరూ కుర్రాళ్ళ లాగానే నేనూ జల్సాగానే ఖర్చు పెట్టాను. అందరి దృష్టిలో నేను దుష్టుడ్ని; నువ్వు సభ్యుడివి. కాని నీకో ఆత్మ అంటూ వుంటే నిన్ను నువ్వే ఒక ప్రశ్న వేసుకో - నువ్వు నీ తోబుట్టువుతో నడుచుకున్న తీరు సరైనదేనా అని? అంతా నాశనం కానీ లే. ఇదిగో ఈ వుత్తరం అందేసరికి నేను ఇల్లు వదిలి వెళ్ళిపోయి వుంటాను. నా చావు బ్రతుకుల గురించి నువ్వు ఆలోచించాల్సిన అవసరం లేదు. నువ్వు సుఖంగా వుండు. నీలాంటి పెద్దమనిషి పేరు ప్రతిష్టలకు మచ్చతెచ్చే తమ్ముడున్నాడన్న చెడ్డపేరు నీకు రాకుండా వుండనీలే....

దాంతో బాటే అమ్మ వుత్తరం ఒకటి: మొదట్నుండీ కొసదాకా ఏడుపు...కన్న కడుపు...వగైరా....

ఇప్పుడు సరైన సమయం వచ్చింది. వప్పుకో. నా తమ్ముడు మాధూ నా గురించి వ్రాసిందంతా నిజం. అయినా ఆ అయిదువందల రూపాయిల గురించి నా పట్ల నిర్దాక్షిణ్యంగా మాట్లాడా డనిపించింది. సొంత సుఖమన్నది చూసుకోకుండా ఇంటి కోసం ఇంత కష్టపడిన నేను కన్యాకుమారి నుంచి హిమాలయాల దాకా తిరిగి అన్ని దేవాలయాలనూ చూసి రావాలన్న ఈ కోరిక కోసం అయిదువందల రూపాయలు దాచుకున్నాను - కాని మాధు ఉద్ధారం కానీయ్ లేదా చావనీ, ఆ అయిదు వందలు నా అల్పత్వానికి క్షుద్రత్వానికి చిహ్నంగా భావిస్తాడు. నా వ్యక్తిత్వం భవితవ్యానికి వదిలేసే ఘోరమైన చిత్రాల్లో ఇదొకటి అతిహేయంగా మిగిలి పోతుంది ఏం చెయ్యను?....ఏం చెయ్యను?....

కేశవ్ చేతులు నొక్కుకున్నాడు. బాధా తప్తుడికి శాంతి లేదు. అతను మొదట తన సభ్యతను కోల్పోతాడు. ఆ తర్వాత సాధువయ్యే యోగ్యతను కోల్పోతాడు. గొడవలూ, పోట్లాటల్లో అతని జీవితం మొదట తన సున్నితత్వాన్ని కోల్పోయి మోటుగా అవుతుంది. ఆ తర్వాత మొద్దు బారుతుంది. స్వార్థ పరుడవుతాడతను.

లోభి అవుతాడు. ఇంట్లో వాళ్ళకు తెలియకుండా స్వంత సుఖపు కలలు కంటాడు. మాధుకి అది తెలిసిపోయి, నాకు వ్రాస్తే దాన్ని గురించి ఆలోచించేటప్పుడు కూడా ఘోరమైన సత్యం కనిపించదు - నా పట్ల నాకున్న కరుణ నా స్వభావం లోని లోటు పాట్లకు కూడా అందమైన చిత్రం వేసి సుందరంగా కనిపించేలా చేస్తుంది. మాధు ఇప్పుడు ఇల్లు వదిలి పెట్టి, ఉద్ధారం కానీ, చావనీ, నా స్వభావం నుంచి మాత్రం బహుశా నాకు విడుదల కాదు. అసూయ కలగచ్చు, దుఃఖం కలగచ్చు - కాని ఈ రెండు భావనల్లోనూ, నేను నా చుట్టూరా తిరుగుతూ మరింత చిక్కుముడి వేసుకుని, సుఖాన్ని నీచంగా చూసే యోగి సూక్ష్మమైన దివ్య దృష్టిని పోగొట్టుకుని, సుఖాన్ని కొనక ఎప్పుడూ దుఃఖాన్ని కోరుతూ ద్వైధీ భావాల్ని పెంచుకుని, దాన్ని జయించి నిలబడే శక్తిని పోగొట్టుకుని, తన మీద తనకీ కలిగే జాలితో విలవిలలాడే, అసూయ చెందే, తానూ సుఖపడలేక తన వారినీ సుఖపెట్టలేక తనకి దొరికిన ప్రేమని పోగొట్టుకుని స్వరతి నరకంలో బ్రతుకుతాడు. సభ్యుడూ, సాధువూ ఇద్దరూ ఆత్మరతులు, ఆత్మతృప్తులు, నాకు స్వరతి మాత్రమే సాధ్యం. నేను నాలోనే ఆఖరై, మొదలై, దారాలను చుట్టుకుంటూ విలవిల్లాడి, లోపలి దాన్ని కత్తిరించి, బయటకు తీసి, పరీక్షించి, లోపల వుంచి, మళ్లీ కత్తిరించి బయటకు తీసి పరీక్షించి, మళ్ళీ లోపల వుంచి, మొదట్లో పరీక్షించగలిగే నా ఆత్మ విమర్శనా శక్తిని మెచ్చుకుంటూ, తర్వాత పరీక్షించిన వస్తువునే ప్రేమిస్తూ, ఆఖరికి ఇలా పరీక్షించడమే అలవాటయి పోయి, పరీక్షించి, పరీక్షించి, తన మలాన్ని తానే మెచ్చుకునేలా అయిపోయి, పరీక్షించిన మలమే తానయి, అమ్మ చెప్పినట్టు భాగీరథిని పెళ్లి చేసుకుని, గొణుగుతూ కాపురం చేస్తూ, అస్తమానం ఆత్మ విమర్శ చేసుకుంటూ, పుట్టిన పిల్లల శ్రేయస్సు కోసం పాటుబడుతూ, వాళ్ళని తిట్టుకుంటూ, డబ్బు దాచుకుని, ఇల్లు కట్టి, ఉద్యోగంలోంచి రిటైర్డ్ అయ్యాక గవర్నమెంటుని బ్రతిమాలుకుని మరో రెండేళ్లు ఎక్స్‌టెన్షన్ కోసం పాట్లు బడుతూ....

స్టూవర్ట్ లేబర్ పార్టీలో చేరి, వెనకబడిన దేశాల అభివృద్ధి కోసం శ్రమిస్తూ, ఎం.పి. అయిపోయి, ఇండియాకి వచ్చి ఎయిర్ కండిషన్డ్ కార్లో చుడుతూ సాధు సన్యాసుల్ని చూసి, భారతీయ ఆధ్యాత్మికత తన ఆత్మ సంస్కారానికి అవశ్యమైన ఒ కొత్త అనుభవమని తెలుసుకుని, బుద్ధి పూర్వకంగా ఏ ఇబ్బందుల్లోనూ ఇరుక్కోకుండా దాన్ని గ్రహించి, దాన్ని గురించి ఒ అందమైన పుస్తకం వ్రాసి, బి.బి.సి.లో ఆ విషయం గురించి మాట్లాడి వృద్ధుడైనా బొజ్జ పెంచుకోకుండా పొడుగ్గా, సన్నగా నిటారుగా మిగిలి పోయి....

"ఇవాళ శనివారం కనుక ఆరు గంటల దాకా కొట్టు తెరిచే వుంటుంది.

ఎంతమంది షాపింగ్ చేస్తున్నారో చూడు...." అంటూ స్టూవర్ట్ తను స్లాట్ మెషీన్‌లో కొన్న ప్యాక్‌నుంచి మరవకుండా కేశవుడికో సిగరెట్ ఇచ్చాడు తనకన్నా చిన్నవాడైన స్టూవర్ట్ పట్ల కేశవుడికే ఒక్క క్షణం చాలా గౌరవం, మమతా కలిగాయి.

## భాగం : మూడు

పెద్ద, పెద్ద గాజు కిటికీల్లోంచి తమ విలువని తెలియపరచే చీటీలతో నిలుచున్న వస్తువులని అమర్చిన వైఖరిని చూస్తూ విండో షాపింగ్ చెయ్యటమంటే కేశవ్‌కి భలే ఖుషీ. ఇప్పుడు వేసవి కనుక గాజు మీద ఎర్రటి అక్షరాలతో "SALES" అంటూ ఎక్కడెక్కడో చీటీలు అంటించారు. 'GALA SALES' పదిహేను పౌన్ల సూట్‌కి కేవలం తొమ్మిది పౌన్లు మాత్రమే. స్త్రీల బట్టలమ్మే కొట్లో నగ్నంగా నిలుచోబెట్టిన బొమ్మలు వాటికి మరుసటి రోజు కోసం ఫ్యాషన్ దుస్తులు తొడుగుతూ ఒకమ్మాయి. అందులో బొమ్మ ఏది? నిజం ఏది? అని తెలియని భ్రమ ఓ క్షణం. ఆశ, నిరాశ. అది సెల్ఫ్ రిజస్. యూరోప్‌లోని పెద్ద స్టోర్స్‌లో ఒకటి. అన్నాడు స్టూవర్ట్ "బస్సెక్కు దామా, నడుద్దామా?" అన్న స్టూవర్ట్ ప్రశ్నకి "నడుద్దాం" అన్నాడు కేశవ్. జాకెట్ జేబులో చెయ్యి పెట్టి ఠీవిగా, నిటారుగా నడుస్తాడు స్టూవర్ట్. తన కాళ్ళ లాగా దొడ్డి కాళ్ళు కావతనివి. అతని వెనకాల ఆక్సఫర్డ్ స్ట్రీట్ వుంది. సెల్ఫ్ రిజస్ లాంటి షాపు వుంది. సూక్ష్మాతి సూక్ష్మాలు తెలుపగల ఇంగ్లీషు భాష వుంది. హారిస్ ట్వీడ్ జాకెట్ స్కాటిష్ టై, గ్రే ఫ్లానిల్ బ్యాగులో అచ్చమైన ఇంగ్లీషువాడిలా, వెనక్కి తిరిగి చూడకుండా, తిన్నగా భవిష్యత్తు వేపే చూస్తూ నడుస్తాడు. వంట కారంగా వుంటే కార మెక్కువయిందని, చప్పగా వుంటే ఇంకాస్త కారం వుండాల్సిందని అమ్మతో పోట్లాడటానికి, మాధూతో దెబ్బలాడటానికి నాకు కన్నడం; అందమైన, సునిశితమైన భావాలను చర్చించటానికి స్టూవర్ట్ చెవికి ఘోరంగా వినిపించే ఇంగ్లీష్. నేను గందర గోళంలో వున్న వ్యక్తిని - బయటి భట్రాజును, అప్పుల చెవిలో కర్ణపిశాచిని, వర్తమానపు బురదలో నిలుచుని, గత కాలపు వైభవాన్ని స్మరించే ద్విభాషా చతురుడిని. నాకు నన్ను సంపూర్ణంగా వ్యక్తం చేసుకోగల భాష లేదు. నేల వేపు వేళ్ళు వదిలి, ఆకాశం వేపు జటిలమైన ముడి అయ్యి అలమటించే మర్రి ఊడలు, తెల్ల వాడినీ కాను, నల్లవాడినీ కాను, తుప్పు పట్టిన తామ్రాన్ని.

"ఇదుగో ఈ ఎంపి బార్ వుంది చూశావూ, అది రాత్రంతా తెరిచే వుంటుంది. తెల్లవారు ఝామున రెండు గంటలకు ఇటు వచ్చావంటే, మన సభ్య సమాజపు అల్ప సంఖ్యాకులు ఇక్కడ దొరుకుతారు - Homo Sexuals and Lesbians".

సన్నగా వాన జల్లు మొదలయింది "లండన్ వాతావరణమే ఇంత" అన్నాడు స్టూవర్ట్.

"మా దేశపు మండుటెండలు, దుమ్మూ ధూళి కన్నా ఇక్కడ చలి బాగుంటుంది నాకు" అన్నాడు కేశవ్.

"ఓహ్ నాకు ఎండ, జీవితం, సూర్యుడూ కావాలి."

"అనుభవం లేక అలా మాట్లాడుతున్నావు స్టూవర్ట్. సూర్యుడు నెత్తి మీద మండుతూ వుండటమంటే ఏమిటో తెలీదు నీకు. నెత్తి మీద మండే సూర్యుడు నా చేత ఆడరాని మాటలు అడించాడు, చెయ్యి కూడని ఆలోచనలు చేయించాడు, ఎండల్లో ఓ రకమైన మౌఢ్యం ఆవరిస్తుంది. మాది విరాగులకు యోగ్యమైన వాతావరణం. అనురాగులకు కాదు. మా నాన్న చనిపోయిన రోజున ధహనం చేయటానికి తీసుకుని వెళ్ళినప్పుడు వేసంగి. పైగా మిటమిటలాడే మధ్యాహ్నం. నీరసమయిన ఆ సమయంలో అక్కడోటి, ఇక్కడొకటి కాకుల అరుపు అంతే, కాలుతున్న ఇసుకలో మూడు పాయలుగా ప్రవహిస్తున్న నది పేద్దున మా నాన్న శరీరాన్ని మంటలు చిటపటమని కాలుస్తున్నప్పుడు, నా నుదుటి మీద నుంచి ఓ వరం చెవి దాకా టకటకమని కొట్టుకుంటూ, చెమటలు కారుతూ, చెమటతో కళ్ళూ పెదవులూ, తడిసి, సుఖమో, దుఃఖమో, నాకు ఏ విధమైన మానవ సహజమైన భావాలూ కలుగలేదు. ఎండ చుట్టు ముట్టి, ఆవరించి అన్ని భావాల్ని మింగేస్తుంది. ఇక్కడ చలి దేశంలో వెచ్చగా,నిప్పు ముందు కూర్చుని ముద్దుగా, మానవీయతలో, సభ్యతా ప్రపంచాన్ని గురించి చర్చించవచ్చు."

"దాహంగా వుంది. కాస్త బీయర్ తాగుదామా? నాకు చావుని గురించి అంత తీవ్రమైన అనుభవమే లేదు. - అంటిసెప్టిక్, స్టెరిలైజ్‌డ్, సెంట్రల్లీ హీడెడ్ సమాజం మాది."

ఓ సందులో వున్న నలుపు తెలుపు చారలపైన 'గన్‌బ్యారెల్స్' అన్న బోర్డ్ వున్న పబ్ వేపు నడిచారు. తలుపు తెరుచుకుని లోపలకు వెళ్ళి కూర్చోవటానికి ఓ మూల కోసం వెతికాడు కేశవ్. సిగరెట్ పొగ నిండిన విశాలమైన హాల్లో జనం కిక్కిరిసి కూర్చున్నారు. ఆనుకుని కూర్చునే మామూలు బెంచీ మీద, గుండ్రటి టేబుల్స్ చూట్టూ వేసిన గుండ్రటి స్టూల్స్ మీద జనం కూర్చున్నారు. అయిదారుగురు యువకులు నిలుచుని పదునైన కొసలున్న చిన్న బాణాల్ని బోర్డు మీదకు విసురుతూ డార్ట్స్ ఆడుతున్నారు. ఓ ముసలతను చాక్‌పీస్‌తో స్కోర్ వ్రాసుకుంటూ నిలుచున్నాడు. ఓ మూలలో ఒక లావుపాటి మధ్య వయస్కురాలు బిగుతుగా వున్న, మెరుస్తున్న బట్టలు

తొడుక్కుని, పియానో వాయిస్తోంది. ఆమె చుట్టూరా పీక్సాప్ ధరించి కూర్చున్న, ముడతలు పడిన మొహాలు, ఎర్రబడిన పొట్టి ముక్కుల ముసలివాళ్ళు పాతకాలపు ట్యూన్స్‌కి గొంతెత్తి ఒకేసారి కలిసి పాడుతూ తల లూపుతున్నారు. పియానో ఆగింది. వాయిస్తున్న లావుపాటి ఆవిడ లేచి నిలుచుంది. అందరూ చప్పట్లు తట్టారు. ఆమె దాన్ని అందుకున్నట్టుగా వంగి, పళ్ళెం పట్టుకుని బయలుదేరింది. పళ్ళెంలో మూడు పెన్నీలు, ఆరు పెన్నీలు పడ్డాయి. కేశవ్ తన జేబులోంచి ఓ షిల్లింగ్ తీసి వేశాడు. "You are being over generous" అంటూ స్టూవర్ట్, "ఇక్కడ గొడవ, వేరే రూముకు వెళదాం" అని పిలిచాడు.

మరో గదికి వెళ్ళారు. చిన్న గది, యూనివర్సిటీలోని మెర్మెయిడ్ బార్ లాగా మెత్తటి కుర్చీలతో హాయిగా అనిపిస్తోంది. అక్కడ కూర్చున్న వారి సంఖ్యా తక్కువే.

భార్యాభర్తలు, టేబుల్ దగ్గర ఎదురెదురుగా కూర్చొని బియర్ తాగుతూ సాయంత్రపు పేపర్ చదవటంలో నిమగ్నులై వున్నారు.

"పేపర్ చదవటానికి ఇక్కడికి రావాలా - భార్యాభర్తలు" అన్నాడు కేశవ్.

"మధ్యతరగతి జనం ఇక్కడికి వస్తారు. ముందు చూసిన గదిలో వున్నవాళ్ళు working class. ఇక్కడ బియర్‌కి ఓ పెన్ను ఎక్కువ. వాళ్ళకు ఓ పెన్నీ ఎక్కు ఇచ్చి ఇక్కడకు వచ్చే తాహతు లేదని కాదు. బియర్‌లో మిగిలిన పెన్నీని వాళ్ళు పియానో వాయించే ఆమెకిచ్చి తాగిస్తారు. ఇక్కడికి వాళ్ళు రాకపోవటానికి కారణం - ఇక్కడ వాళ్ళకి ఉత్సాహంగా వుండదు. వర్గ భేదాన్ని మా వాళ్ళు సంతోషంగా, ఏ విధమైన ద్వేషభావం లేకుండా అంగీకరిస్తారు. కనుకనే ఈ దేశానికి మార్క్సిజం కూడా నిషేధం." అన్నాడు స్టూవర్ట్.

కేశవ్ కౌంటరుకు వెళ్ళి రెండు పైంట్ బిట్టర్ కొన్నాడు. "ఆ బార్‌లో బియర్ పంప్ చేసి ఇవ్వటానికి మాంచి భారీగా వున్న ఆడది వుందా, ఇక్కడ ఓ సన్నటి అమ్మాయి వుంది. ఆమె డబ్బు తీసుకునేటప్పుడు "Thankyou, love!" అంటే ఈమె "Thankyou, Sir" అంటుంది కదా?" అని నవ్వాడు స్టూవర్ట్.

నేను working class నే ఎక్కువ ఇష్ట పడతాను" అన్నాడు కేశవ్.

"నేనూ అంతే కాని వాళ్ళకి prejudice చాలా ఎక్కువ. నిన్ను చూస్తే వాళ్ళు "నల్లవాడ"ని దగ్గరకు రానీయరు. కాని చదువుకున్నవాళ్ళు..."

"వాళ్ళు నా జోలికే రారు. రెండూ ఒకటే. రెండింటిలో వర్కింగ్ క్లాసే మంచిది."

ఇద్దరూ మౌనంగా బియర్ తాగ సాగారు. గ్లాసులు ఖాళీ అయ్యాక. స్టూవర్ట్ లేచి వెళ్ళి గ్లాసుల్ని నింపుకుని వచ్చాడు. రెండో పైంట్ ఖాళీ అవుతూంటే డ్రాఫ్ట్

బిట్టర్ ప్రభావం అతని శరీరమంతా వెచ్చగా ఆవరించి, కేశవ్ మనస్సు విచ్చుకోసాగింది. స్టూవర్ట్‌తో ఆత్మీయంగా మాట్లాడాలనిపించింది.

"నీకో విషయం చెప్పాలి స్టూవర్ట్. మా నాన్న హఠాత్తుగా చనిపోయినప్పుడు నేను ఇంటర్ మీడియట్ చదువుకుంటున్నాను, పల్లెటూర్లో వున్న మా ఇంటికి రెండు వందల మైళ్ళ దూరంలో. ఇల్లు గడవటం కష్టం కావటంతో మా అమ్మ "నీ చదువు చాలు. ఏదైనా ఉద్యోగంలో చేరు" అంది. మా దేశంలో విద్యార్థులలో రెండు రకాలు: ఒకటి పుస్తకాల పురుగులు; చదువుకోవాలి, సంఘంలో పైకి రావాలి, పేదరికం నుంచి బయట పడాలి అన్న తీవ్రమైన కోరిక వారికి జీవిత సార సర్వస్వం. ఆటల జోలికి, స్నేహితుల జోలికి పోకుండా బాల్యం, యవ్వనాల సుఖాన్ని రుచి చూడకుండా ఈ వర్గం శ్రమిస్తుంది. మరో రకం విద్యార్థి - రికామీగా తిరిగే వాడు. సమ్మెలు, ఆటలు, తిరుగుళ్ళు అంటూ ఖుషీగా, జాలీగా రోజుల్ని గడపాలనుకునే వాళ్ళు - నా తమ్ముళ్ళలాగా. చదువుకునేటప్పుడు నేను మొదటి వర్గానికి చెందేవాడ్ని. First Class లో పాసవటమే నా అంతిమ ధ్యేయం. ఇంటి నుంచి డబ్బు రాదని తెలిసి కూడా, ఎలాగైనా సరే చదువుకుని పైకి రావాలన్న ఉద్దేశ్యంతో బెంగళూరు వెళ్ళి ఓ ఫ్రీ హాస్టల్‌లో చేరాను. దాన్ని నడుపుతున్న తను ఓ సంఘ సేవకుడు. అతని కీర్తి అన్ని వేపులా ప్రసరించింది. భుజానికో జోలి తగిలించుకుని, రోజూ ఇంటింటికీ తిరిగి డబ్బులూ, బియ్యమూ అడుక్కుని తెచ్చి హాస్టల్ నడిపేవాడు. నా కతని మీద అమితమైన గౌరవం. గాంధీజీ ఆదర్శాలను అనుదినమూ పాటించేవాడని భక్తి. హాస్టల్ కూడా చాలా సాత్వికమైన తీరులో నడిచేది. మాకు వంట చేసి పెట్టే వారు కూడా జీతం తీసుకునే వారు కాదు. రోజూ ఉదయం సాయంత్రం ప్రార్థన, ప్రార్థనలో సర్వ ధర్మ సమన్వయం గీత, బైబిల్, ఖురాన్ పఠనం వుండేవి. ప్రార్థనకి విద్యార్థులు వెళ్ళకపోతే ఆ రోజు వారికి భోజనం లేదు. రోజూ విద్యార్థులు వంతుల వారీగా హాస్టల్ శుభ్రపర్చటం, దొడ్లు కడగటం అన్నీ చెయ్యాలి. ప్రతీ రోజు వుదయం మా అన్నదాత తనే లేచి, రెండు ఆవుల పాలు పితికించి, కాచటానికి పెట్టి, పెరుగు చిలికేవాడు...."

"నువ్వు చెపుతున్నది Ideal గా అనిపిస్తోంది...."

కేశవ్ లేచి నిల్చుని "వస్తానుండు, తర్వాతది ఇంకా interesting గా వుంటుంది. ముందు బియర్ తెస్తాను" అంటూ వెళ్ళి ఇంకో రెండు పైంట్స్ నింపుకున్నాడు. కౌంటర్‌లోని అమ్మాయి అతని వేపే చూస్తూ నవ్వి పది షిల్లింగ్‌లకు చిల్లర ఇచ్చింది. కేశవ్ బియర్ తెచ్చి పెట్టి, చెప్పసాగాడు.

హాస్టల్లో చోటు తక్కువగా వున్నందువల్ల మేము ఒక్కో గదిలో ముగ్గురం,

నలుగురం పడుకునే వాళ్ళం. నేను చేరిన ఓ నెల రోజులకు మా అన్నదాత "నువ్వు నా గదిలో పడుకో చదువుకోవటానికి, రాసుకోవటానికి వీలుగా వుంటుంది" అన్నాడు.

"ఇంకేం చెప్పకు. నాకు తెలిసిపోయింది. అతను Homo-Sexual, అవునా?"

తను చెపుతున్న దాన్ని అంత యాధాలాపంగా స్టూవర్ట్ తీసుకోవటంలో కేశవ్‌కి చాలా నిరాశ కలిగింది. తన గతం పట్ల తనకి గల జుగుప్సని స్టూవర్ట్‌కు కలిగేలా చెయ్యాలనుకున్న అతని కోరిక భగ్నమయింది.

"నేను పబ్లిక్ స్కూల్లో చదివిన వాడ్ని కేశవ్. నీకు ఆశ్చర్యం కావచ్చు, అక్కడ చదువుతున్నప్పుడు నేను కూడా Homo-sexual, గా వుండేవాడ్ని. నాకు దానిపట్ల జుగుప్స లేదు. అక్కడ నేను అనుభవించిన స్నేహపు తీవ్రత నా ఉత్తమమైన అనుభవాల్లో ఒకటి అని నేననుకుంటాను. యూనివర్సిటీకి వెళ్ళాక అమ్మాయిల స్నేహంతో నా Homo-Sexuality తగ్గింది. ఇది కామ జీవితపు ఆరోగ్యం - అనారోగ్యాల ప్రశ్న. దీనికి సరయిన ప్రతిక్రియ - ఈ clinical attitude. రోగానికి సరయిన విరుగుడు వెతకాలి. నాకు క్రిశ్చియన్ల లాగా పాపంలో నమ్మకం లేదు. జీవితంలో రోగం, ఆరోగ్యం అన్న రెండు స్థితులున్నాయి. ముఖ్యమయిన ప్రశ్న జీవితం సఫలమయిందా, విఫలమయిందా అని. Homosexuality వల్ల ఒకడి జీవితం సఫలమయ్యేలా వుంటే అలాంటి కామ జీవనం రోగం కాదు. వుల్ఫెన్ డన్ రిపోర్టు విషయం వినే వుంటావు. నాకో ఆశ వుంది. యూనివర్సిటీలో ఓ విప్లవం లేవదియ్యాలి. ఇప్పుడు దేశంలో వున్న Homo-sexuality గురించిన చట్టం ఇకనైనా మార్పు చెందాలి అంటాను. దానికి నీ సహకారం కావాలి."

అంటూ నవ్వాడు స్టూవర్ట్. కేశవ్ ఓ క్షణం వూరుకుని, కుపితుడై అన్నాడు:

"నీ కిక్కడ అర్థం కాని విషయం, నేను ఎంతటి అవమానాన్ని సహిస్తూ చదువుకున్నాననేది. అతని వత్తిడికి నేను లొంగక పోతే హాస్టల్ వదిలి పెట్టాల్సి వచ్చేది. రెండేళ్ళు నరకం అక్కడ అనుభవించాను. దొడ్లో గోడల మీద నా పేరునీ, అతడి పేరునీ కలిపి రాశారు కుర్రాళ్ళు. వంట చేసే అతనూ Homo-sexual కావడంతో, అతనికీ నా అన్నదాత కీ మొదట్లో సంబంధం వుండటంతో అతను అసూయతో గొడవ పెట్టాడు. వెళ్ళిపోతానని బెదిరించాడు. రెండ్రోజులు వెళ్ళిపోయి, మళ్ళీ వచ్చి ఏడ్చాడు. నా స్వాభిమానం, మగతనం అక్కడ నాశనమై పోయాయి. నువ్వు మనశ్శాస్త్రం చదివి చెప్పేలాగా ఇది వొట్టి రోగ నిర్ణయం ప్రశ్న కాదు...."

"I am sorry కేశవ్.... బలవంతం అన్నది ఎక్కడున్నా దాన్ని నేను ద్వేషిస్తాను.

పాపం అంటూ ఏదయినా వుంటే అది మన సుఖం కోసం ఇంకొకరికి సుఖం లేకుండా చేయటం ఆ దృష్టితో నువ్వు అన్న మాటని ఒప్పుకుంటాను. కాని Homo-sexuality లోనే భయంకరమైన నరకం వుందంటే వొప్పుకోను."

అంటూ స్టూవర్ట్ సిగరెట్ ప్యాక్‌ని కేశవ్ వేపు జూపాడు. కేశవ్ ఓ సిగరెట్ తీసుకుని వెలిగించి, తన జీవితంలోని ఏ విషయం గురించి చెపితే స్టూవర్ట్‌కి 'షాక్ తగులుతుందానని ఆలోచిస్తూ కూర్చున్నాడు.

"కౌంటర్లోని అమ్మాయి బాగుంది" అన్నాడు కేశవ్. బియర్ ప్రభావం తలకెక్కి హాయిగా వుంది.

"ఓ మాదిరిగా వుంది. "But that is the right attitude" అని చిన్నగా నవ్వాడు స్టూవర్ట్.

"తెల్ల చర్మం సౌందర్యానికి ముఖ్యమైన అర్హత అనుకునే దేశం నుంచి వచ్చాను నేను అన్న విషయం మర్చిపోకు."

"You amaze me."

"శ్రీ కృష్ణుడి చిన్నతనంలో రాధ అతని ప్రియురాలు. రాధ ఛాయ పాలలాంటి తెలుపు. అతని పక్వమయిన వయస్సులో ద్రౌపది అతని ప్రియురాలవుతుంది. కామపు వాసనే లేని ప్లెటానిక్ సంబంధం అది. ద్రౌపది, కృష్ణ - నలుపు రంగు కలది. రంగుకీ, అనుభవపు పక్వతకీ సంబంధం వుండి వుండాలి. నేను ప్రస్తుతం తెల్ల చర్మం పట్ల వ్యామోహితుడినై వున్నాను. మా దేశంలో మనుష్యులకు యూరోపే కాశీ రామేశ్వరం; పవిత్ర యాత్రాస్థలాలు. వివేకానందుడికీ, టాగూర్‌కి మీరు సర్టిఫికేట్ ఇచ్చేవరకూ మా దేశంలో విలువే లేకపోయింది."

"నాకు చీర కట్టుకున్న భారతదేశపు రాగి రంగులో వున్న ఆడపిల్లలంటే ఇష్టం. కామం విషయంలో నీ కన్నా నేను పక్వం చెందినవాడ్ని అయితే...."

"ఖచ్చితంగానూ ఆదది నేనింకా చూడని ప్రపంచం. నా తల నెరిసింది. వయస్సు ముప్పై దాటింది మర్చిపోకు".

"ఇంకో డ్రింక్" అనడిగాడు స్టూవర్ట్.

"రైట్, కాని బియర్ వద్దు. నేనింకా వోడ్కా తాగలేదు. Two small vodkas కొత్త అనుభవాల కోసమే ఇంగ్లడ్‌కి వచ్చాను నేను." అని నవ్వుతూ టాయ్‌లెట్‌కి లేచాడు కేశవ్.

"Mix చెయ్యటం మంచిది కాదు. All right....Vodka అంటూ స్టూవర్ట్ లేచి కౌంటర్‌వేపు నడిచాడు.

టాయిలెట్‌లో నిలుచున్నప్పుడు కేశవ్‌కి అనిపించింది. నా జీవితంలోని ఏ సంగతి చెబితే స్టూవర్ట్ షాక్ తింటాడు? అన్నింటినీ జీర్ణించుకోగల అతని

చిత్తస్థైర్యపు రహస్యమేమిటి? తాను ఎవ్వరికీ చెప్పని ఆ ఒక్క కలని అతనికి చెప్పనా? కాని తనే మళ్లీ మరోసారి తలచుకోవటానికి ఇష్టపడని కలని ఎలా చెప్పటం? స్టూవర్ట్ నీకు మాత్రమే చెపుతున్నాను దీన్ని. అయిదారేళ్ళ క్రితం నాకు ఓ కల వచ్చింది:

ఆ కలలో నేను....

....కాని చెప్పలేను. చెబితే స్టూవర్ట్ మరో మనశ్శాస్త్రపు సిద్ధాంతంతో దాన్ని వివరించవచ్చు. చెప్పాక నాకు స్టూవర్ట్‌ని చూస్తే జగుప్స కలగవచ్చు. అది గర్భంలో నిద్రలో మునిగి వుండటమే క్షేమం.

వోడ్కా తాగాక "ఇక వెళదాం" అన్నాడు స్టూవర్ట్.

"ఎక్కడికి?" అన్నాడు కేశవ్.

"ఎక్కడికైనా సరే - ఈ సాయంత్రం నీది. నువ్వే చెప్పు."

అంటూ స్టూవర్ట్ తలుపు లాగి పట్టుకుని After you అన్నాడు. కేశవ్ Thanks అంటూ బయట చల్లటి గాలి లోకి అడుగుపెట్టి-

"ఓ నైట్ క్లబ్‌కి వెడదాం స్టూవర్ట్. నాకు అమ్మాయిల్ని చూడాలనుంది ....వీలయితే...." సూచన ఇచ్చేలాగా అన్నాడు.

"Right నేను వర్జిల్, నువ్వు డాంటె. లండన్‌లోని నరకాలను చూపిస్తాను రా."

అంటూ స్టూవర్ట్ నాటకీయంగా ఎయిర్ ఇండియా బొమ్మలాగా చేయి చాచి వంగాడు.

## భాగం:నాలుగు

"అనుభవాన్ని వెతుక్కుంటూ వెడితే దొరికేది పూర్వ నిశ్చితమయినది అని నువ్వే చెప్పావ్...."

స్టూవర్ట్ కేశవ్‌ని వేళాకోళం చేశాడు.

"ఆ మాటా నా అనుభవానికి రావాలి. నేను అననుభవిని. నా ఏ మాటకూ విలువ లేదు."

"పికడిలీలో ఏదో మూలలో రోరింగ్ ట్వెంటీస్ అన్న క్లబ్ వుందని విన్నాను- వెడదాంరా. లండన్ లోని పాతాళ లోకాన్ని చూద్దువు గాని."

"పాతాళంలోకి నా initiation కావాలి. Initiation అంటే మాలో ఉపనయనం ద్విజుడు కావటం అన్నమాట. చనిపోయి కొత్త అనుభవం కోసం పుట్టటం."

నియాన్ దీపాల ఉన్మాదంలో జ్వలిస్తున్న పికడిలి దగ్గరవుతూంటే కేశవుడి మనస్సు గంతులేయసాగింది. ఇది యక్షలోకం. ఇక్కడ ఏదైనా చెల్లుతుంది. నాట్యోత్సవంలో పద్యం గుర్తు వచ్చింది: "తేలివస్తున్న జాజ్ సంగీతం! మా నాట్యాని కోసమేనా?" బియర్ తాగి, పైగా ఓ వోడ్కా లాగి మత్తుగా వున్న కళ్ళు

పరవశించాయి. ఇంగ్లండ్‌లో యువకులు తమ స్నేహితుల చెయ్యి పట్టుకుని, భుజాల మీద చేతులు వేసి నడవరు. అన్న విషయం మర్చిపోయి స్టువర్ట్ భుజం మీద చెయ్యి వేసి నడవ సాగాడు. ధర్మజుడిని – ద్రౌపదిని నగ్నంగా చూసిన ధర్మజుడిని – ద్రౌపదిని నగ్నంగా చూసిన పాపశమనానికి పర్యటన చేయటానికి బయలుదేరిన అర్జునుడిలా నేను – దేవలో చిత్రాంగద .... ఇలా తన ఊహకు తానే పొంగిపోయాడు. పికడిలీలో ఒకతను ఓ పోస్టర్ పెట్టుకుని త్రోవలో వెడుతున్న వారినుద్దేశించి అరుస్తున్నాడు: "ఇదిగో, దేవుడి అంతిమ తీర్మానపు రోజులు దగ్గర పడుతున్నాయి. పాపుల్లారా, మేలుకొనండి. జీసస్‌ని నమ్మి విముక్తి పొందండి." 'A Crank' అని నవ్వాడు స్టువర్ట్. ముందుకు పోతూంటే మరో మిలటరీ దుస్తులు వేసుకున్న Salvation Army అతను చేతిలో చిల్లర వున్న డబ్బీ పుట్టుకుని గంభీరంగా డబ్బు అడుగుతున్నాడు. 'NO ENTRY' బోర్డ్ వేసిన అడ్డదారుల్లో హాట్‌డాగ్స్, హాంబర్గర్‌లను బిళ్ళల్లో తెచ్చి అమ్ముతున్నారు. కొట్లవాళ్ళు...కేశవ్ కి ఇండియన్, చైనీస్, ఇటాలయిన్, ఫ్రెంచ్ – రకరకాల రెస్టారెంటులు. ఏ దేశపు రుచి కావాలి, ఏ రకం గుడ్డలు కావాలి? ఎలాంటి అందం, వయ్యారం కావాలి? –అమరావతి. స్టువర్ట్ కిందు వేపు వెడుతూ అన్నాడు: "ఈ సందులోనే ఎక్కడో రోరింగ్ ట్వెంటీస్ వుందని గుర్తు నాకు – వెతుకుదాం రా."

ఒక విషయం మాత్రం ఖచ్చితం: అంగీరస ఋషిని మూలపురుషుడిగా పంది, అంగీరస, అంబరీష యౌవనాశ్వ త్రయార్షేయ ప్రవరాన్వితుడై ఆశ్వలాయన సూత్రుడై, ఋక్శాఖాధ్యాయియై, ఒక యోగిని చిన్నాన్నగా పొంది, భోజనంలోకి ఓ మిళ్ళెడు నూనె లేకపోయినా, దేవుడికి నేతి దీపాలు వెలిగించడం మర్చిపోని స్త్రీని తల్లిగా పొంది, నేను ఇప్పుడు తెల్లవాడితో కలసి కొత్త అనుభవాని కోసం రోరింగ్ ట్వెంటీస్‌ని వెతుకుతున్నదాని అంతరార్థం నాకు పేర్లు లేవని. భారతదేశంలోని అసంఖ్యాక యువకుల్లాగానే నాకూ బలమయిన పునాది లేదని....

సన్యాసి, తప్పుడు, నాగరకుడు – వీరి పట్ల అనుభవం, అననుభవం, పక్వతల గురించి ఆలోచించడం, స్టువర్ట్‌తో కలసి ధ్యేయం గురించి చర్చించడం గుర్తు వస్తోంది. మా నాన్న కూడా అననుభవిగా, తప్పుడిగానే చనిపోయాడా? సుబ్బణ్ణ బాబాయి కూడా అననుభవిగా, తప్పుడిగా బదరీ ఆశ్రమంలో తిరుగుతున్నాడేమో? స్టువర్ట్‌కి మొత్తం కథ చెప్పి, అతని సభ్య, లిబరల్ మనస్సుకు ఇదంతా ఎలా అనిపిస్తుందో అడగాలి.

మా నాన్న ఇంటికి పెద్దవాడై యుండి కూడా ఇంటి వ్యవహారమంతా శ్యాంబాబాయికి ఎందు కప్పజెప్పాడు? అమ్మ అంటూండేది: "తోటలో ఎంత

వక్క దిగుబడి అయింది, పోయిందెంత, మొత్తం ఎంత డబ్బు వచ్చింది, వొక్కటి కూడా ఈయన పట్టించుకోనే లేదు. పట్టించుకుని వుంటే మీరెందుకిలా ఇబ్బందుల పాలవుతారు? హాయిగా, కాళ్ళు జాపుకుని, దర్జాగా బ్రతికేవాళ్ళం." పూజలు, పునస్కారాలు, భారత, భాగవత పఠనం; రామనవమి రోజుల్లో కోవెల గట్టు మీద కూర్చుని వాల్మీకి రామాయణాన్ని చదివి కన్నడంలో వ్యాఖ్యానించేవారు; ఊళ్ళో పుట్టిన పిల్లలందరిదీ జాతక చక్రం వేసివ్వటం; ఉపాకర్మ రోజున వూళ్ళో వారందరికి ఉపాకర్మ చేయించడం; గౌరీ వ్రతం రోజున ఊళ్ళోని ఆడవాళ్ళనంతా ఇంటికి పిలిచి వ్రతం చేయించడం; ఇరుగూపొరుగూ ఇళ్ళలో పశువులు తప్పిపోతే చెక్క మంత్రించి ఇవ్వటం; వేర్లూ, లతలూ తెచ్చి జబ్బు చేసినవారికి మందులు చేయటం ఇంకా సమయం మిగిలిపోతే జంధ్యం చేస్తూ కూర్చోవటం, అమ్మకు చీరలు కొనవలసి వస్తే నాన్న తన తమ్ముడి దగ్గరకు వెళ్ళి, ఆ విషయం ఈ విషయం మాట్లాడి, చిన్నగా దగ్గి, గొంతు సవరించుకుని, "చూడయ్యా, దీనికేదో చీరకావాలట; చేతుల్లో డబ్బు లేకపోతే వేరే కొట్లో పద్దు రాయించైనా తీసుకు రా. మరీ ఖరీదయినదేం అక్కర్లేదులే". అంటూ తడబడుతూ అడగటం చూస్తే అమ్మకు మండి పోయేదట. నాన్నది ఇలాంటి వైదీక వృత్తి అయితే, శ్యాం బాబాయి దంతా లౌకికం. ఊళ్ళో ఏం గొడవ జరగనీ, ఎవరు ఆస్తులో పంచుకోనీ, పంచాయితీ పెట్టించనీ శ్యాంబాబాయి అక్కడ ఉండి తీరాల్సిందే. కోర్టు కచేరీలని సాగర, శివమొగ్గాలకు వెళుతూనే వుండేవాడు. మాకున్న ఆస్తి పాస్తులు తక్కువే అయినా, అస్తమానం నాలుగయిదు కేసులు సాగరలో కోర్టులో నడుస్తూనే వుండేవి. బయట ఆయన చేసినట్టే ఇంట్లో పిన్ని పెత్తనం చేసేది. పెద్దదయినా అమ్మ మాట చెల్లేది కాదు. "ఇంత నెయ్యి, అర గ్లాసుడు పాలక్కూడా దాన్ని అడగాల్సి వచ్చేదిరా నేను". ఇది ఎక్కువ రోజులు జరగలేదు. అమ్మ పిన్నమ్మల మధ్య పోరు పెద్దదయి ఇల్లు రెండు భాగాలై పోయింది. నాన్న దానికి ఊ అనలేదు, ఉహు అనలేదు. భాగాలైనప్పుడు కూడా బాబాయి పెత్తనం వల్ల మీద పడిన అప్పు నాన్న తలకే చుట్టుకుంది. వక్క, వ్యాపారం ఇలాంటి పనులకు సాగర లేక శివమొగ్గ వెళ్ళాల్సివస్తే 'పట్నంలో నాకు స్నానం, సంధ్యావందనానికి ఇబ్బందిరా. నీ పంటతో పాటు నాదీ అమ్మి పెట్టు' అని అదీ బాబాయికే అప్పజెప్పేవాడు.

కాని చిత్రం ఏమిటంటే, నాన్న చనిపోయే ముందు, ఆయన పెద్దతనంలో ఉన్నట్టుండి మారిపోయారు. సదా సౌమ్యంగా వుండే మనిషి నిప్పు మీద పడ్డ ఉప్పురాళ్ళలా పటపటలాడ సాగాడు. వైదీక వృత్తిలో నిరతమయిన మనస్సు, డబ్బు వేపు తిరిగింది. లావు పాటి అద్దాల కళ్ళజోడు పెట్టుకుని, పాత వస్త్రం

తీసి లెక్కలు వేయటానికి మొదలెట్టాడు. శ్యాంబాబాయిని ఓ నాడు పిలిచి నీ లాంటి మోసగాడు మరొకడు లేడని నేటికొచ్చి నట్టల్లా తిట్టాడు. ఎప్పుడో ఎవరెవరికో ఇచ్చిన ఒకణా, రెండణాల అప్పుని గుర్తుకు తెచ్చుకుని తగాదా పెట్టుకుని వసూలు చెయ్య సాగాడు. దేవుడి పూజలో వున్నప్పుడు కూడా, హఠాత్తుగా ఏదో గుర్తు వచ్చి, అమ్మని పిలిచి "వొసేవ్ వక్కలు వలిచే వాళ్ళు వచ్చారా, పందిరి మీద ఎండుతున్న వక్కల్ని వాళ్లు పట్టుకుని పోతే అంత బంగారం పోయినట్టే - అటు దృష్టి వుంచు" గొడవ పెట్టే వాడు. కంటి చూపు మందగించి, వినికిడి శక్తి తగ్గుతూ వుంటే లోకం మీద అసక్తి మరింత ఎక్కువ కాసాగింది. ఎవరి అడుగుల చప్పుళ్ళు విన్నా వెంటనే 'ఎవరది?' అంటూ తడుముకుంటూ వచ్చేసే వాడు. ఎవరు ఏం మాట్లాడుకున్నా అదేమిటో వెంటనే అయనకు తెలియాలి. పెళ్ళాం, పిల్లలు తాను గీచిన గీటు దాటకూడదు. తనను అడక్కుండా ఏమీ చెయ్యకూడదు. చనిపోయేటప్పటికి ఆయన అతి కరుణా జనకమయిన దృశ్యమయ్యాడు.

వైదిక ధర్మంలో పుట్టి పెరిగిన నాన్న ఎందుకిలా మారిపోయాడు? అతని జీవితాన్ని నడిపించిన నమ్మకంలో నిజానిజాల పాళ్ళు ఎంత? తన లాగా అతనూ అసంతృప్తుడా? అక్కా చెల్లెళ్ళ పళ్ళ చెట్టులాగా అతనూ లోలోపల డొల్లేనా?

నాన్న కథ ఇలా అయితే శ్యాం బాబాయిది మరో రకం. మోసం, దగా, వంచన చేసీ చేసి సంపాదించినదంతా ముండల మీద ఖర్చు పెట్టి కోర్టులకు తిరిగి ఖర్చు చేశాడు. అతని కామం పేద ఎత్తే మాదిగదాన్నీ వెదిలి పెట్టలేదు. దొరికి పోయి, గొడవ జరిగినా దులిపేసుకున్నాడు. చీర కనిపిస్తే చాలు వెంట పడే స్వభావం అతనిది. అతను ఎక్కడ బిచాణా వేస్తే అక్కడల్లా ముండలు - శివమొగ్గలో, సాగరలో, బసరూరిలో, పెరట్లో, గుట్టమీద, తోటలో, ఎక్కడ పడితే అక్కడే. కాని ఇప్పుడాయన దర్జా అంతా మాయమయింది; చేతిలో వున్న డబ్బు కాస్త ఖర్చయిపోయింది; డయాబిటిస్ పట్టుకు పీడిస్తోంది; పరువు ప్రతిష్ఠ అంటూ వుంటాడు; దుర్గపూజ, సత్యనారాయణ వ్రతం, తీర్థయాత్రలు అంటూ ఎలాగో కాలక్షేపం చేస్తున్నాడు.

వీళ్ళిద్దరికన్న కేశవ్‌కి అతి విచిత్రంగా అనిపించేది, నాన్న చిన్న తమ్ముడు సుబ్బణ్ణ బాబాయిది. అతను చిన్న వయస్సులోనే ఇల్లు వదిలి వూళ్ళో వున్న మఠంలో చేరాడు. నిష్ఠా పరాయణుడై బ్రాహ్మణుడై పోయాడు. రోజు కొకసారి మాత్రం భోజనం , సంవత్సరానికోసారి అడుక్కున్న రెండు కావి పంచలు. ఒకటి ఉతికి అరేసి ఇంకోటి కట్టుకోవటం. ఓసారి కేశవ్ చూస్తూ వుండగా ఎవరో పిచ్చివాడు వచ్చి సుబ్బణ్ణ బాబాయిని 'నాకు కట్టుకోటానికో గుడ్డ ఇవ్వు'

అన్నాడు. బాబాయి 'కట్టుకున్నది ఇవ్వకూడదు' అన్నాడు. 'పర్లేదు, ఇవ్వు' అని వెంటబడ్డాడు పిచ్చివాడు. కట్టుకున్న పంచ విప్పి ఇచ్చేసి, వట్టి కౌపీనంతో మిగిలాడు బాబాయి. ఆ సంవత్సరమంతా మరో పంచ అడుక్కోకుండానే గడిపాడు. అతని దినచర్య ఉదయం నాలుగింటికి మొదలయ్యేది. నదిలో స్నానంచేసి, మూడుగంటల సేపు నించుని జపం చేసి, తర్వాతా మరింత చదివి, మధ్యాహ్నం మళ్ళీ స్నానం చేసి, మండు టెండలో నించుని జపం చేసి, అందరు భోజనానికి కూర్చున్న వేళలో తన దొక బుల్లి గిన్నె పట్టుకుని 'భవతి భిక్షాందేహి' అని అందరిముందు వుంచుతూ, పిడికెడు పిడికెడు అన్నం వేయించుకుని, అది భోంచేసి మళ్ళీ నదిలో స్నానంచేపి జపం చేసేవాడు. జపం అయ్యాక, మఠంలో గూట్లో వెలిగించిన ప్రమిద ఎదురుగా నించుని అది ఆరిపోయే దాకా అధ్యయనం చేసేవాడు. దీపం చిన్నగా వెలుగుతుంటే దాన్ని పెద్దది చేసే వాడు కాదు. ఉన్న వెలుగులోనే, వెలుగుతున్నంత సేపే చదివి, అక్కడే నేలమీద పడుకొని నిద్రపోయేవాడు. డబ్బు చేతితో కుడా ముట్టుకునే వాడు కాదు. సంవత్సరంలో ఓ నెల పాటు ఒంటిపూట భోజనం కుడా మానేసి వెట్టి మందారపూలు తిని గడిపే వాడు. కడుపు వీపుకు అంటుకుని పోయి, శరీరం ఎముకల గూడై - యజ్ఞ కుండంలో కాలుతున్న అశ్వత్థ కాష్ఠంలా తపస్సులో మండుతున్న అతని శరీరంలో రెండు కళ్ళు మాత్రం ప్రశాంతమైన కాంతి పుంజాల్లా వుండేవి.

తన తల్లిదండ్రుల తద్దినానికి మాత్రం ఇంటి కొచ్చేవాడు సుబ్బణ్ణ బాబాయి. అలాంటి వాడు ఓ రోజు హఠాత్తుగా వచ్చి, నాన్న కాళ్ళకు సాష్టాంగ ప్రణామం చేశాడు. నాన్న 'దీర్ఘాయుష్మంతుడివికా' అని ఆశీర్వదించాడు. సుబ్బణ్ణ బాబాయి లేచి నించుని, చేతులు కట్టుకొని చెప్పాడు:

"ఇవాళ పొద్దున్నే జపాని కోసం లేచే ముందు దైవాజ్ఞ అయినట్టుగా తోచింది - నువ్వింక స్వతంత్రుడి వయ్యే కాలం వచ్చింది, ఆ అధికారాన్ని పొందావు నువ్వు అంటూను. జపం పూర్తయ్యాక చింత పట్టుకుంది. దైవాజ్ఞ అని నేననుకున్నది నిద్ర కళ్ళతో వున్న నా భ్రమేనేమో, నా శరీరంలో నాశనం కాకుండా మిగిలిన అహంకారపు మానమేనేమో అర్థం కాలేదు. బయటకు వచ్చి ఓ రావాకును గాలికి పట్టుకుని కళ్ళు మూసుకుని దేవుడిని ప్రార్థించి చెప్పాను: దైవాజ్ఞ అని నేను అనుకున్నది నిజమయితే వెల్లకిలా పడనీ, లేకపోతే బోర్లా పడనీ-గాలిలో అది పల్టీలు కొట్టి వెల్లకిలా పడింది. సరే, దైవాజ్ఞ తర్వాత పెద్దవాడివి నీ అనుజ్ఞ తీసుకుందామని వచ్చాను. నేను సన్యాసం తీసుకుంటే ఆత్మశ్రాద్ధం చేసుకొని అన్ని బంధాలు వదులుకోవాల్సి వుంటుంది. పితృ ఋణం, గురు ఋణం, దైవ

ఋణం ఇలాగ అన్ని ఋణభారాల్ని మీ ఒక్కరి మీదే మోపాల్సి వస్తుంది. నాకా అధికారం వుందా అనుకుని మీ అనుజ్ఞ కోసం వేచి వున్నాను."

చెప్పటం పూర్తి చేసి బాబాయి అలాగే చేతులు కట్టుకుని విగ్రహంలా నిలుచున్నాడు. నాన్న కన్నీరు కారుస్తున్నారు. కాస్సేపు ఎవరూ మాట్లాడలేదు. ఆఖరికి అర్ద్రమైన కంఠంతో నాన్న అన్నారు:

"నువ్వు మహాత్ముడివి. దైవాజ్ఞని కాదనే హక్కు నా కెక్కడిది ? నీ తపస్సు వల్ల పశు పక్షి సమేతంగా సమస్తానికి కల్యాణమవుగాక."

నాన్న మమ్మల్నందర్నీ పిలిచి సుబ్బణ్ణ బాబాయి కాళ్ళకి నమస్కరించమని చెప్పారు.

"బాబూ, నువ్వు సన్యాసివి అయ్యాక రా. అప్పుడు నేను కూడా నీ కాళ్ళకి నమస్కరించి, ఈ కర్మ నుంచి విముక్తుడి నవుతాను. ఇప్పుడు నేను నీకు నమస్కరిస్తే నీకు అయుః క్షీణం."

అంటూ నాన్న కళ్ళు తుడుచుకుని, అమ్మని పిలిచి "దేవుడికి మరో దీపం వెలిగించి రా" అన్నారు.

సుబ్బణ్ణ బాబాయి మళ్ళీ అన్నా వదినలకు నమస్కరించి మెట్లు దిగి, వెనుదిరిగి చూడకుండా వెళ్ళిపోతూ వుంటే నాన్న,

"నీ ప్రాణ వాయువుని కాపాడే భౌతిక శరీరాన్ని మరీ నిర్లక్ష్యం చెయ్యకు నాయనా" అన్నారు.

సుబ్బణ్ణ బాబాయి కాషయ బట్టలు ధరించి, చేతిలో దండ, కమండలాలు పట్టుకుని బదరీ ఆశ్రమం వేపు వెళ్ళిపోయాడు.

× × ×

స్టువర్ట్, కేశవ్ అంత బాగా లేని ఓ అయిదంతస్థుల ఇంటి ముందు నిలుచున్నారు. క్రింద రోరింగ్ ట్వెంటీస్ అన్న బోర్డయితే వుంది. కాని తలుపులింకా తెరవ లేదు. తెరిచే సమయం రాత్రి 10 .30 అని రాసి వుంది. 'ఇప్పుడింకా ఎనిమిదిన్నర' అని స్టువర్ట్ 'ఇప్పుడేం చేద్దాం ' అని కేశవ్‌ని అడిగాడు. 'నువ్వెలా చేద్దామంటే అలాగ. వేరే ఎక్కడి కయినా పోదాం ' అన్నాడు కేశవ్. దార్లో ఇంగ్లీషులో మాటలు కష్టంతో వెతుక్కుంటూ నాన్న కథ, సుబ్బణ్ణ బాబాయి కథ చెప్పాడు. పూర్తిగా చెప్పాక ఓ ప్రశ్న అతడ్ని భాధించ సాగింది. అమ్మ, చెల్లెళ్ళు, మాధు, నాన్న, శ్యాంబాబాయి, సుబ్బణ్ణ బాబాయి, స్టువర్ట్, తాను - తమ్ములు, సన్యాసులు, నాగరకులు, అనురాగులు, విరాగులు, అమ్మలాగా ఏ స్వార్ధమూ లేక పెళ్ళి, వడుగు, అంటూ బ్రతుకు వెళ్ళ దీసే వారు....గురి ఏమిటి, గమ్యం ఏది తోచదు. నాన్న, శ్యాంబాబాయి, తాను,

బహుశా మాధు - అదృశ్యంలో, అవ్యక్తంలో, ఆలోచించలేని దాన్లో వేళ్ళూనిందేదో మా స్వభావంలో లేకుండా ఉందేమో. మాలో సారం లేకుండా శూన్యమే వుందేమో: మా స్వభావాన్ని, మమ్మల్ని ఆవరించిన భౌతిక లోకంపై మాకున్న పట్టు వదులు కాగానే నలుపు -శూన్యం మమ్మల్ని ఆవరించ వచ్చును. దేన్నయినా పట్టుకుని వేళ్ళాడ వలసిందే మేము - భయంకరమైన డొల్లలాంటి శూన్యం లోపల, స్వభావపు ప్రళయంలో బ్రతకటానికి బయలుదేరిన మా జీవితంలో ధృఢత్వం లేదు. నేర్పు లేదు - కోలాహలం, వేడి, మంటలు, స్టూవర్ట్ లాగా కాని, సుబ్బణ్ణ బాబాయి లాగాకాని కొలిమిలో పెట్టి, కరగబెట్టి, అచ్చులో వేసి, దిద్ది, తీర్చి లోపల్నుంచి ఓ శిల్పాన్ని వెతికి తెచ్చే నైపుణ్యం లేదు. నాకు నా జీవితం అలా ఓ పూర్వ నిశ్చితమైన శిల్ప మవుతుందన్న నమ్మకం కూడా లేదు. కాలడం మొదలెట్టాక పూర్తిగా కాలి బూడిదై పోవాలి. లేకపోతే సగం కాలి పొగబారి మసి అవుతుంది.

భాగం : అయిదు

చిన్నగా, గుండ్రంగా చుట్టుకున్న, తుప్పు పట్టిన ఇనుప మెట్ల కింద గూడు లాంటి చోటు అక్కడొక ప్లెకార్డ్ పట్టుకున్న నీగ్రో.

STRIP TEASE

ON THE FLOOR SHOW.

పది పది షిల్లింగు లిచ్చి కేశవ్ రెండు టికెట్లు కొన్నాడు. తన వంతు పది షిల్లింగులు స్టూవర్ట్ ఇవ్వబోతే 'వేద్దు, ఇవాళ నువ్వునా గెస్ట్' అన్నాడు. ఆ చిన్న మెట్ల మీద కేశవ్ ముందు, స్టూవర్ట్ తర్వాత ఎక్కి, నల్లటి తెరవేసిన గదిలోకి అడుగు పెడుతుండగానే వెలుగుతున్న దీపాలు టక్కున ఆరిపోయి,మిణుకు మిణుకు మంటున్న ఓ ఎర్రటి దీపం మాత్రం వెలుగుతూండటంతో కేశవ్‌కి దిగ్భ్రమ కలిగింది.

"స్టూవర్ట్" అంటూ పిలిచి స్నేహితుడి కోసం చెయ్యి చాపుతూండగానే ఎక్కడినుండో ఓ అమ్మాయి ప్రత్యక్షమై అతన్ని చెయ్యిపట్టుకుని మృదువుగా లాగింది. మరోక్షణంలో కేశవ్ మెత్తటి సోఫామీద కూర్చుని వున్నాడు. అతడి పక్కలో అమ్మాయి కూర్చుని వుంది. ఎర్రటి దీపం మబ్బు వెలుతుర్లో 'స్టూవర్ట్ స్టూవర్ట్' అంటూ తడారిన గొంతుతో పిలుస్తూ వెతికాడు.

"నీ స్నేహితుడి కోసం వెతుక్కుంటున్నావు కదూ? ఇక్కడకు వచ్చిన వాళ్లంతా మొదట అలాగే చేస్తారు. తర్వాత సర్దుకుంటారు."

"అలాగా....అంటూ తేరుకున్నాడు కేశవ్."

"ఇది అన్ని స్ట్రీట్ టీన్ క్లబ్బుల్లా కాదు. ఇక్కడ నీకు విశేషమైన అనుభవం

దొరుకుతుంది .... అన్ని దేశాల, అన్ని జాతుల అమ్మాయిల్ని ఇక్కడ నువు నగ్నంగా చూడవచ్చు.... ఓ హెలో, మాటల్లో పడి నిన్ను పరిచయం చేసుకోవటం మరిచాను. నేను జెనెటీ.... నువు?"

నేను కేశవ్ ....

"కేశవ్-పేరు ముద్దుగా వుంది....ఇక్కడి వాతావరణం నీకు అలవాటయిందా?"

"ఈ మారు వింటర్ నిరుటి వింటర్ లాగా భయంకరంగా ఉండదంటున్నారు, నిజమేనా?"

"జీసస్-నిరుటి వింటర్‌ని గుర్తు చెయ్యకు."

కాస్సేపు మౌనం. కేశవ్ మాటలకోసం వెతుక్కుంటున్నాడు. అంతలో జెనెట్ తానే మాట్లాడటానికి మొదలెట్టింది:

"మాతో ఓ సిలోన్ అమ్మాయి వుంది. మాకు సిగ్గేసేలాగ ఇంగ్లీష్ కూడా చాలా బాగుంది!"

"నీ మొహం కనిపించటం లేదు నాకు ఇలా చీకట్లో మొహం చుడకుండా మాట్లాడటం కష్టం కదా? లైటు వెయ్యనా?"

కేశవ్ ధైర్యం తెచ్చుకుని అడిగాడు. అతడికి స్టూవర్ట్ ఎక్కడ కూర్చున్నాడోనన్న ఆత్రుత, కంగారు. ఇంకా ఓ ఇద్దరు లోపలకు వచ్చిన చప్పుడు, సోఫాపై కూర్చున్న చప్పుడు, గుసగుసలు.

"ఇక్కడి కొచ్చే వారంతా చీకటినే కోరుకుంటారు. నీ కోరిక చిత్రంగా వుంది. కాస్సేపాగు వెలుతురొస్తుంది."

జెనెట్ నగ్నంగా వుందేమోనని ఆశ కలిగింది కేశవ్‌కు. ఉందేమోనని భయమూ కలిగింది. మెల్లిగా తడిమి చుశాడు. లేదు బట్టలు తొడుక్కుని వుంది. భయం పోయి నిరాశ కలిగింది.

"ఇక్కడ తాగొచ్చు.... ఇంకో మారు నీ పేరు చెప్పు....Sorry...."

"కేశవ్"

తానే మొదట సూచించాల్సింది, పొరపాటు- అని కేశవ్ 'రెండు షెరి' అన్నాడు.

రెండు షెరిలను తెచ్చి పెట్టిన అమ్మాయి మొహం కూడా కనిపించలేదు. ఇంకిద్దరు లోపల కొచ్చిన చప్పుడు.... గుసగుసలు....ఎవరో ఇద్దరు పెద్ద పెట్టెను లోపలకు మోసుకెళ్ళి నట్టుగా చప్పుడు....అయాస పడుతున్న శబ్దం....గది నిండా అస్పష్టమైన రూపాలు.

కూర్చున్న అందరు షెరి ఆర్డర్ చేసి వుండాలి; పళ్ళెం పట్టుకుని Thanks

అంటూ షెరి ఇచ్చిన చప్పుడు. అందరూ తన లాగానే షెరి అర్డర్ చేశారు, స్టూవర్ట్ కుడా-అని తృప్తి. పుల్ల గీచిన వెల్తురు, అక్కడో మొహం, ఇక్కడో మోహం, మళ్ళీ చీకటి....చుట్టూరా ఎర్రటి కొసలున్న సిగరెట్లు. కేశవ్ తానే సిగరెట్ వెలిగించాడు. జెనెట్‌కొకటి ఇచ్చి మళ్ళా పుల్ల గీయబోయాడు. 'వద్దు నీ సిగరెట్ link ఇవ్వు' అంది. Thanks అంది.

మిణుకు మిణుకు మంటున్న ఎర్ర దీపము ఆరిపోయి చీకటి ఆవరించింది. ఎదుట ఒ తెర తీస్తున్న చప్పుడు అందులోంచి భగ్గుమని ఉజ్వలమైన వెలుగు. చిన్నగా పియానో వాద్యపు రికార్డ్ మొదలయింది. కాంతి వృత్తంలోకి ఓ అమ్మాయి నర్తిస్తూ ప్రవేశించింది-సంపూర్ణ వస్త్రా లంకృతురాలై.

"అమ్మాయి బాగుంది కదూ?"

జెనెట్ ప్రశ్నకి కేశవ్ "అవును" అన్నాడు. దీపం వెలిగినప్పుడు కేశవ్‌కి కలిగిన భయం, ఆశ, గుడ్డలు తొడుక్కున్న అమ్మాయిని చూసి మాయమయింది.

కాంతి వృత్తం నుంచి చీకట్లోకి, చీకటిలోంచి వెలుతుర్లోకి, ఆమె సంగీతాని కనుగుణంగా వొళ్ళు కదుపుతు, వొయారంగా ఊపుకుంటూ బెల్ట్ విప్పి తెర ఆవలనుంచి చాపిన చేతికి ఇచ్చింది. పియానోకి తోడుగా వయోలా ధ్వని కలిసింది. నోట్లో జెచుయింగ్ గమ్ నములుతూ, పెదవుల మీద నవ్వులు చిందిస్తు, తన డ్రస్‌జిప్ లాగింది. కొరుకుతున్నట్టు, చప్పరిస్తున్నట్టు, మింగుతున్నట్టు మూగాభి నయంతో మూతి కదుపుతు భుజం మీది డ్రస్‌ని జరిపి కిందికి జారే లాగా చేసి, చప్పున మళ్ళీ వెనక్కి లాక్కుని, తొడుక్కుని సిగ్గుతో మొహం దాచుకుంది. మళ్ళీ వీపు తిప్పి డ్రస్‌ని నడుము దాకా జరిపి పైకి తీసుకుంది.

"ఆమె పేరు రోసి-ప్యారిన్‌లో స్ట్రిప్ టీన్ నేర్చుకుని వచ్చింది. ఇక్కడున్న అమ్మాయి లందర్నీ మించిపోతుంది." అంటూ గుసగుసలాడింది, జెనెట్.

సంగీతపు వేగం ఎక్కువవుతోంది. కేశవ్‌కి తెలియని మరి రెండు వాయిద్యాలు తోడయ్యాయి. భయంతో కేశవ్ గుండె వేగంగా కొట్టుకోసాగింది. భుజాలు, చంకా నగ్నమయ్యాయి. కాంతి వృత్తంలోంచి కంగారు పడుతున్న దానిలాగా చీకట్లోకి తప్పుకుంది. సంగీతం పరాకాష్ట నందుకుంటూ వుండగా మళ్ళీ వెల్తుర్లోకి వచ్చింది-బ్రేసియర్స్, ప్యాంటీ మాత్రమే వేసుకుని వుంది. ఒక క్షణం....రెండు క్షణాలు....నల్లటి తెరపడింది.

గదిలో కళ్ళు మిరుమిట్లు గొలిపేలా దీపాలు వెలిగాయి. వెలుతుర్ని చూడలేని వాడిలా, నిద్ర లోంచి లేచిన వాడిలా కేశవ్ కళ్ళు నులుముకున్నాడు. చేత్తో దీపానికి అడ్డం పెట్టి స్టూవర్ట్ కోసం వెతికాడు. మరో మూలలో చీర

కట్టుకున్న సిలోన్ అమ్మాయితో కూర్చుని స్టూవర్ట్ షెరి తాగుతున్నాడు. మధ్య వయస్కుడొకడు, త్రీ పీస్ సూట్ ధరించి, తొడమీద హాట్ పెట్టుకుని నీగ్రో అమ్మాయితో మాట్లాడుతున్నాడు. మిగతా వాళ్ళు తన లాగానే వేర్వేరు రంగుల జుత్తు గల తెల్ల అమ్మాయిలతో మాట్లాడుతున్నారు. వాళ్ళలో ఇద్దరు నీగ్రో కుర్రాళ్ళున్నారు.

తాము కూర్చున్న చోటుచూసి కేశవ్ ఆశ్చర్యపోయాడు. రెండు నల్లటి తెరల్ని వదిలేస్తే గది ఎర్రటి ఇటుకల్ని అడ్డదిడ్డంగా పేర్చిన గుహరూపంలో వుంది. తొర్రల్లాంటి సందుల్లో సోఫాలు, ఓ మూలలో ఎర్రటి ఇటుకల గూట్లో సీసాలు. అక్కడే ఓ బల్ల, కుర్చీ; కుర్చీపైన ఆ క్లబ్ యజమానురాలిలా కనిపించే వెండి ఫ్రేము అద్దాలు వేసుకున్న, చూడటానికి ఉపాధ్యాయినిలా వున్న ఓ స్త్రీ. కేశవ్ మరోసారి తాను కూర్చున్న స్థలాన్ని చూశాడు: ఇప్పుడు దాని స్వరూపం గుహలా అనిపించలేదు. తటాలున తోచింది: మాంస ఖండాల్లా ఎర్రగా పొరలు పొరలుగా అమర్చిన ఇటుకల గది గర్భకోశంలా తనకు కనిపించటం లేదూ?

"ఈ గది నీకు నచ్చిందా?" అంది జెనెట్, కేశవ్ పరీక్షగా చూడటాన్ని గమనించి.

"అవును" అంటూ జెనెట్‌ని చూసి నవ్వాడు కేశవ్.

"దీని ఆకారం చూస్తూ నీకేమనిపిస్తుంది?"

"మొదట గుహలా అనిపించింది. ఇప్పుడు గర్భకోశంలా వుందని పిస్తోంది."

"ఒక్కొక్కరికి ఒక్కోలా అనిపిస్తుంది. నేను ఇక్కడ కలుసుకున్న ప్రతీ వొక్క స్నేహితుడూ దీన్ని ఒక్కోలా వర్ణించాడు."

మూలలో కూర్చుని వ్రాస్తున్న యజమానురాలు బుల్లి, బుల్లి పళ్ళాలలో బిల్స్ తీసుకొచ్చింది. కేశవ్ తన బిల్లు తీసుకుని, దాన్లో ముప్ఫయి షిల్లింగులని వుండటం చూసి కంగారు పడ్డాడు. అబ్బబ్బా అంటే తాము తాగిన షెరి ధర ఆరో, ఎనిమిదో షిల్లింగులు ఉంటుంది. 'స్టూవర్ట్' అని పిలిచాడు. బిల్ తెచ్చిన యజమానురాలు 'నీ స్నేహితుడి పేరు స్టూవర్ట్ అనా? అందమైన పేరు కదూ జెనెట్?" అంది.

స్టూవర్ట్‌కి కేశవ్ పిలుపు వినిపించలేదు. జెనెట్ అంది:

"ఇతడి పేరు కేశవ్ - ఇతనిదీ చాలా అందమైన పేరు. కదూ బాబరా?"

యజమానురాలు బాబరా అంది:

"చిల్లర లేకపోతే రెండు పౌండ్ లివ్వు. నేను చిల్లర ఇస్తాను."

కేశవ్ 'ఫర్వాలేదు' అంటూ జేబులోంచి ముఫ్ఫై షిల్లింగులు తీసి పళ్ళెంలో పెట్టాడు. 'సర్వింగ్ చార్జన్ రెండున్నర షిల్లింగ్' అంది బాబరా. ఇంకో

రెండున్నర షిల్లింగులు తీసి పెట్టాడు. బాబరా Thanks అంటూ ముందుకు సాగింది. జెనెట్ కేశవ్ చెయ్యి పట్టుకుని.

"ఇక్కడికొచ్చే వారంతా నీ లాగానే బిల్ చూసి కంగారు పడతారు. నే నిక్కడ హెూస్టెస్‌ని. నాకు షెరి తాగించటాని కోసం ప్రత్యేకంగా ఎక్కువ చార్జ్ చెయ్యబడింది. అంతే "Cheer up darling" అంది.

"All right ఇంకో సిగరెట్?" అంటూ కేశవ్ చెమట తుడుచుకుని జెనెట్‌కి సిగరెట్ ఆఫర్ చేశాడు. జెనెట్ రెండు తీసుకుని

"నా స్నేహితురాలి కొకటి, ఫర్వాలేదు కదా?" అంది.

"ఆహా" అన్నాడు కేశవ్.

....దీపాలారి చీకటయింది. తెర పక్కకు జరిగింది. లోపలి దీపం వెలిగింది. స్టూవర్ట్ చీకట్లోనే కేశవ్ వద్దకు వచ్చి చెవిలో ఏదో చెపుతుండగానే వెలుగులోకి అర్ధనగ్నంగా వున్న రోసీ వచ్చింది. 'ఏమిటి' అని కంగారుగా అడిగాడు కేశవ్. పియానో సంగీతం మొదలయింది.

"ఇది క్లిప్ జాయింట్ కేశవ్. ఇక్కడున్న ఆడవాళ్ళు జేబులు ఖాళీ చేయించి పంపుతారు. అనుభవం లేక ఇక్కడికి నిన్ను తీసుకుని వచ్చాను - క్షమించు. ఇక్కడ మరో క్షణం కూడా వుండొద్దు. మనం వెళ్ళిపోదాం రా" అంటూ స్టూవర్ట్ కేశవ్‌ని లాగాడు.

కేశవ్ తడబడ్డాడు. రోసీ పై నుంచి కళ్ళు తిప్పుకోలేక పోతున్నాడు.

"స్టూవర్ట్ డార్లింగ్ - ఇక మీ నుంచి డబ్బులేమీ తీసుకోం. డ్రింక్స్ ఆర్డర్ చెయ్యకపోతే ఆ డబ్బు కూడా ఇవ్వాల్సి వచ్చేది కాదు. నీ స్నేహితుడిని వుండనీ" అంది మృదువుగా జెనెట్.

వేడుకుంటున్న ధ్వనిలో కేశవ్-

"కాస్సేపు వుండి వెడదాం స్టూవర్ట్, తొందరేముంది?" అన్నాడు. 'Oh I am Sorry" అని స్టూవర్ట్ మళ్ళీ తాను కూర్చున్న చోటికి వెళ్ళాడు. సగం నగ్నంగా వున్న రోసీ ఒక్కొక్కటిగా బ్రేసియర్ తగిలించిన పలచటి మస్లిన్ గుడ్డల్ని పక్కకు తొలగిస్తూ తిరిగింది. తరువాత ఒక్కొక్కటిగా విప్పిన దానిని చాపిన చేతికి అందిస్తూ, వెలుగు లోంచి చీకట్లోకి చీకటిలోంచి వెలుగులోకి ప్రత్యక్షమవుతూ, మాయమవుతూ ఆఖరికి విప్పిన బ్రేసియర్‌ని గుండెల కదుముకుని సిగ్గుతో నిలబడింది. స్నానం చేసి మడి కట్టుకుని వచ్చిన బ్రాహ్మణ స్త్రీల, పశువుల పాకలో పేడ ఎత్తే ఆడవాళ్ళ నగ్నమైన రొమ్ముల్ని చూసినప్పుడు ఎలాంటి భావమూ కలగక పోయినా, ఇప్పుడు మాత్రం కేశవ్‌కి వేడెక్కి భయం వేసింది. సిగ్గు నభినయిస్తూ మొహం పైకెత్తి ధైర్యం తెచ్చుకుని బ్రేసియర్‌ని చాపిన

చేతికిచ్చి నిల్చుంది. తర్వాత గడ్డాన్ని ఏదో రుచి చూస్తున్నట్లు ఊపుతూ ప్యాంటీకి చిక్కించిన మస్లిన్ గుడ్డ ఒక్కొక్కటిగా తీసి చాపిన చేతికి విసిరేసింది. ఆఖరికి వెట్టి ప్యాంటీ తోటి నిలబడి, అక్కడే వున్న పట్టుపరుపుమీద పడుకుని, కూర్చున్న వాళ్ళవేపు వీపు తిప్పి, ప్యాంటీని జరిపి విప్పింది. మళ్ళీ మెల్లిగా ఒత్తిగిలి తిరిగేలా నటిస్తూ, మొహం మాత్రం తిప్పి సిగ్గుతో కళ్ళుమూసుకుంది.

కేశవ్ కళ్ళు చూసే కామంతో జ్వలించాయి; శరీరం ముట్టుకునే కామంతో జ్వలించింది; చెవులు ఆమె మూలుగును వినే కామంతో జ్వలించాయి; నాలుక ఆమె ముద్దుల రుచిని చూసే కామంతో జ్వలించింది. ఇంక పూర్తిగా ఇటు తిరుగుతుంది అనిపించి భయం వేసింది. అగ్ని జ్వాలల మధ్య నిలుచుని చూసిన విద్యుచ్ఛక్తి నింపుకున్న పాతాళపు పట్టాల్లాగా, చేతిలో పైకెత్తిన నిటారుగా నిలుచున్న సర్పంలాగా, అన్ని తలుపులూ దఢాలున తెర్చుకున్నట్టు - ఉహు, చప్పున సిగ్గుతో వద్దన్నట్టుగా వీపు తిప్పింది -

తెర పడింది.

మళ్ళీ అన్ని దీపాలు వెలిగి అసహ్యమయిన వెలుతురు వచ్చింది.

కళ్ళు మూసుకుని కేశవ్ "నేను లోపలకు వెళ్ళొచ్చా" అన్నాడు. జెనెట్ 'బాబరా' అని యజమానురాల్ని పిలిచి కేశవ్ లోపలకు వెళ్ళాలిట' అంది. అంతలో స్టూవర్ట్ లేచి వచ్చి "రా కేశవ్" అన్నాడు "ఉహూ - నేను లోపలికి వెళ్ళి తీరాలి". అన్నాడు. వెద్దు కేశవ్ దాని రొమ్ములు వేలాడుతున్నాయి. ఇంకా అందమయిన వాటిని చూద్దువు గాని, మరో చోటికి పోదాం అంటూ స్టూవర్ట్ బ్రతిమాలుకుంటున్న ధోరణిలో బలవంతం చేశాడు.

"వీల్లేదు - నేను వెళ్ళి తీరాలి" అని కేశవ్ స్టూవర్ట్ నుంచి తన చెయ్యి లాక్కున్నాడు. బాబరా మెల్లిగా కేశవ్‌ని లోపలికి లాక్కుని వెళ్ళింది.

లోపల మూడు గదులున్నాయి. ఒక దాని మీద MYSTERY BY YOUR SIDE అని రాసి వుంది. ఇంకొక దాని మీద MYSTERY REVEALED IN DARKNESS అని వుంది. మూడో గది మీద మాసిపోయిన అక్షరాలతో MYSTERY FULLY REVEALED అని రాసి వుంది.

"మొదటి గదికి రెండు పౌండ్‌లు. రెండో దానికి మూడు పౌండ్ల పది షిల్లింగ్‌లు. మూడో దానికి అయిదు పౌండ్‌లు. మొదటి గదిలో రోసి సగం నగ్నంగా పక్కలో కూర్చుని షెరి తాగుతుంది, బ్రేసియర్ మాత్రం విప్పుతుంది. రెండో గదిలో చీకట్లో పూర్తి నగ్నంగా నీ పక్కన నిలుచుంటుంది. మూడో దానిలో వెలుగులో పూర్ణనగ్నంగా నిల్చుంటుంది."

"నాలుగో గది లేదా ? "

ఎండిపోయిన గొంతుతో కేశవ్ అడిగినప్పుడు, బాబరా తప్పు జవాబు చెప్పిన విద్యార్థి వేపు చూసే ఉపాధ్యాయిని లాగా చూసి MYSTERY FULLY POSSESSED అని ప్రశ్నార్థకంగా అడిగి....

"ఇక్కడి కొచ్చే వ్యక్తులు ఇంతకే తృప్తి చెంది కృతార్థులై, కృతజ్ఞులై వెడతారు. అదీ కాక ఆ తరువాతి అనుభవాన్ని నీ కివ్వటానికి మాకు లైసెన్స్ లేదు." అంది.

"నేను అయిదు పౌండ్ల గదికే వెడతాను." అంటూ కేశవ్ అయిదు పౌండ్లను బాబరా కిచ్చాడు.

"తీసుకొచ్చిన దానికి చార్జ్ పది షిల్లింగులు - ప్లీజ్" అంటూ బాబరా చెయ్యి జాపింది.

ఇంకో పది షిల్లింగులు తీసి ఆమె చేతిలో పెట్టాడు. బాబరా Thanks అంటూ గదిలో కేశవ్‌ని వదిలి, తలుపు మూసుకుని వెళ్ళిపోయింది.

గదిలోని వాల్‌పేపర్ చినిగిపోయి క్షుద్రంగా కనిపిస్తోంది. కుంపట్లో వింటర్లో కాలిన బొగ్గుల బూడిద అలాగే వుంది. గది మధ్యలో చూరు నుంచి షేడ్ లేని బల్బొకటి వెలుగుతోంది. ఓ మూలలో గోడకి ఆనించి మూడు కాళ్ళ కుర్చీ, ఇంకో మూలలో ఖాళీ బియర్ సీసాలు. మట్టినేల మీద కార్పెట్ కాదు కదా - లినోలియం కూడా లేదు. కాని గదిలోని క్షుద్రత కన్నా వేచి వుండటం అసహ్యకరంగా వుంది. ఆఖరికి Knock చేసి తలుపులు తెరిచి రోసి బ్రేసియర్ ప్యాంటీలతో నిలబడింది. తలుపు మూసింది.

కేశవ్‌కి భయం వేసి కళ్ళు మూసుకున్నాడు. తను చూసిన దాన్నంతా తలచుకుని, ధైర్యం తెచ్చుకుని కళ్ళు తెరచి, తన జాకెట్ విప్పబోయాడు.

రోసీ "నువ్వు స్ట్రిప్ చేసుకోనక్కర్లేదు" అంది.

కేశవ్ నోట మాట రాక నిలుచుండి పోయాడు. రోసి బ్రేసియర్ విప్పి అవతలించింది. కేశవ్ ఆమె వద్దకు వెళ్లి ముద్దు పెట్టుకోవటానికి ప్రయత్నించాడు.

"Sorry, నేను ముద్దుల్ని తీసుకోను" అంటూ రోసీ మొహం తిప్పుకుంది.

కేశవ్ ఆమె మొహాన్ని తడిమి మెల్లిగా ఆమె రొమ్ముల్ని తాకాడు.

"నేను రొమ్ముల్ని ముట్టనివ్వను. క్షమించు." అంది రోసీ గంభీరంగా. కేశవ్‌కి కాళ్ళలో శక్తి ఉడిగిపోయి నట్టయి నేల మీద కూర్చుండి పోయాడు. మ్యూజియంలో తాకరాని నగ్న విగ్రహాన్ని దొంగతనంగా తాకే వాడిలాగా మెల్లిగా కాళ్ళనీ, తొడల్ని నిమురుతూ ధైర్యం తెచ్చుకుని చేతుల్ని పైకి పోనిచ్చాడు. ఆమె అతని వేపు వీపు పెట్టి ప్యాంటి విప్పి ఇటు తిరిగింది. కేశవ్ కళ్ళు

నెమ్మదిగా మూసుకున్నాయి. శరీరం వణికింది. చాలా అలసటగా అనిపించి నేల మీద మొద్దులా కూర్చుండి పోయాడు. కళ్ళు తెరిచేసరికి ఆమె మళ్ళీ ప్యాంటి ధరించి ఆవలిస్తూ 'sorry' అంది. నిటారుగా పడగ ఎత్తిన సర్పం అలసి సొలసి చిమిడి పురుగయింది.

పెద్ద బానలో చిన్న ఎలుకలా నూనెలా నున్నగా వున్న గిన్నెలోకి పాకుతూ, గోకుతూ విలవిల లాడినట్టుగా. దీనిని కలలో చూసినట్టుగా చూసే కన్నయి, జారిపోయే ఎలుకయి, ముందుకు చాచలేని చెయ్యి అయి, దెయ్యం పట్టిన వాడిలాగా –

కల అయిపోయి నిరాకారమైన అశాంతి మాత్రం మిగిలి, అశాంతికి కారణాన్ని వెదుకుతూ కన్న కలని మళ్ళీ గుర్తు తెచ్చుకోవటానికి తవ్వి తవ్వి లోపలకు వెళ్ళినట్లు–

తవ్వేటప్పుడు మొదట – మట్టి, ఇసుక, మన్ను, వానపాము, చిలుం పట్టిన నాణెం ముక్క, పకటి, కుండ ముక్క, తుప్పు పట్టిన ఇనుప పార....

ఇంకా కిందికి తన అశాంతికి కారణమైన కల కోసమని తవ్వినట్లు, అక్కడ ఉత్తి శూన్యమే వున్నట్టు–

శూన్యంలో ఓ గది, గదిలో నగ్నంగా నిలుచున్న అమ్మాయి.... చీకటి....శూన్యం....చీమిడి పురుగు....

సుబ్బణ్ణ బాబాయికి కూడా బహుశా ఆఖర్లో ఈ శూన్యపు అనుభవ మయి వుంటుందా? ఉపవాసంతో కృశించి దేవుణ్ని వెతికి గుహల్లో తిరిగి, తిరిగి ఆఖరికి తన లాగానే కృశమైన, క్షుద్రమైన పరమార్థాన్ని చూశాడా? ఈ క్లివ్ జాయింట్ నుంచి చప్పున లేచి స్టువర్ట్ వద్దకు వెళ్ళాలి....తెల్లబోయాను.

"నా ఫ్లాటులో నువ్వు రాత్రి గడప దల్చుకుంటే పది పౌండ్‌లు. బాబరాకి మాత్రం చెప్పవద్దు. హ్యావ్‌స్టెడ్‌తో ఇస్లింగ్‌టన్ వీధిలో పదో నంబరు ఇల్లు. ఇప్పుడు అయిదు పౌండ్లు ఇవ్వు. అక్కడకు వచ్చాక మిగిలింది...." అని రోసి చెప్పింది.

"వద్దు" అని తల అడ్డంగా తిప్పాడు కేశవ్.

బహుశా, ఆఖర్లో అత్యున్నతమైన ఉద్దేశాల కమిటీ మీద కమిటీ యొక్క అనంత అపారమైన, శుభ్ర, స్వచ్ఛమైన గదులపైన గదుల అంతం లేని సెంట్రల్లీ హీటెడ్ ప్రపంచమై, స్టువర్ట్‌కి ఈ శూన్యమే అనుభవంలోకి రావచ్చును.

మొదట ఈ క్లివ్ జాయింటు నుంచి లేచి బయట పడాలి.

"ఇక్కడి లాగా నే నక్కడ నీతో ప్రవర్తించను. ఇప్పుడు డబ్బు లేక పోయినా ఫర్వాలేదు. వచ్చేటప్పుడు తెద్దువుగానీ లే. నాకు ఇక్కడ ఎక్కువ స్వాతంత్ర్యం

లేదు. బాబరాకి చెప్పకు. ఓ ముద్దు ఇస్తాను లే."

తొందర తొందరగా మాట్లాడుతూ రోసీ వంగింది. వద్దు, ఏమీ వద్దు, పూజ, జపతపాలు, వ్రతాలలో మునిగి తేలుతున్న నాన్నని గ్రద్ద కళ్ళతో ఈ శూన్యం మొదటి నుంచి వేధించిందా? వద్దన్నాక ముద్దు పెట్టుకునే, ఆ ముద్దుని కూడా మరింత గుంజుకుందామని ఇచ్చే ఈ క్లిప్ జాయింటు నుండి తొందరగా తప్పించుకుని పోవాలి....

బాబరా వచ్చి తలుపు తట్టి 'రోసీ' అంది. 'వస్తున్నా' అని రోసీ కేశవ్‌ని చుంబించి "మళ్ళీ కలుసుకుందాం Bye" అని కన్ను కొట్టి వెళ్ళిపోయింది.

కేశవ్ మట్టి అయిన చేతుల్ని దులుపుకున్నాడు. భుజంతో నోరు తుడుచుకున్నాడు. విపరీతమైన అలసటతో లేచి వెళ్ళి మూడు కాళ్ళ కుర్చీ మీద కూర్చుని సిగరెట్ వెలిగించాడు....

ఈ అయిదు పౌండ్లు పది షిల్లింగులు, మళ్ళీ రెండూ పది షిల్లింగ్‌లు, ముప్ఫయి ప్లస్ రెండున్నర షిల్లింగ్‌లు, బియర్ వగైరా పది షిల్లింగ్, లండన్‌కి రావటానికి పోవటానికి ప్రయాణం ఖర్చు నాలుగు పౌండ్లు, దిగిన లాడ్జ్‌కి రెండు పౌండ్లు, మిగతా ఖర్చు రెండు పౌండ్లు మొత్తం పదహారు పౌండ్ల పైనే దిమ్మ తిరిగి నట్టయింది. అమ్మకి పంపి వుంటే రెండ్నెల్లు ఇంటి ఖర్చుకి సరిపోయ్యేది. మళ్ళీ అవే పాత ఆలోచనలు. ఈ క్లిప్ జాయింటు నుంచి ముందు బయటపడాలి....

మాధూ ఆత్మహత్య చేసుకుంటే....

స్టూవర్ట్ పిలుపు విని కేశవ్ మూడు కాళ్ళ కుర్చీ పై నుంచి లేచాడు.

# 16. నిరాశ్రయులు

రాఘవేంద్ర ఖాసనీస

అబ్బబ్బా! అంటే పాదం మొత్తం మునిగేటంత నీరుంది ఆ ఏటిలో. పల్లంలో కొంచెం ముందుకి ప్రవహించి నదిలో కలిసినందువల్ల దానికి కొంత వేగమూ వుంది. కాని నీటి మధ్యలో బస్సు చక్రాలు కూరుకు పోయేటంత ఊబి వున్నట్లు స్వతః డ్రయివరే ఊహించ లేకపోయాడు. యంత్రాన్ని పూర్తి వేగంతో మరీ మరీ నడపడానికి ప్రయత్నించి, 'స్టీరింగ్ వీల్'ని తిప్పి తిప్పి డ్రైవర్‌కి విసుగొచ్చినా బస్సు ముందుకి వెళ్ళలేదు. వెనక్కి కదల్లేదు. బయట నీరు నిమిష నిమిషానికీ పొంగు కొస్తుంది. డ్రైవర్ హతాశుడై కోపంతో 'స్టీరింగ్ వీల్'ని ఓ సారి తిప్పి వదిలేశాడు. బస్సు ఒక్కసారిగా ముందుకి దూకి ఠక్కుమని ఆగిపోయింది.

చెల్లాయి కెవ్వుమని అరిచింది. తల, వెనకాల సీటు కమ్మీకి కొట్టుకుంది. సగం తెరిచిన తలుపులోంచి నీరు లోపలికి తోసుకొచ్చింది. లోపల నుంచున్న వాళ్ళంతా తూలి ఒకరి మీద ఒకరు పడిపోయారు. చెల్లాయికి ఈ గొడవేమీ అర్థం కాలేదు. కిటికీ లోంచి దూరంగా పెద్ద పెద్ద బండరాళ్ళు కనిపిస్తున్నాయి. చూస్తూండగానే నీళ్ళన్నీ పొంగి వచ్చి బస్సులో అంతా ఆవరించినట్టు ఊహ కలిగింది చెల్లాయికి. మొహానికి చేతులు అడ్డుపెట్టుకుని మరోసారి గట్టిగా అరిచింది.

తండ్రి వెనుక వరుసలో జోగుతూ కూర్చున్నారు. ఒక్కసారిగా బస్సు ఆగిన కుదుపుకి మేలుకున్నారు. మేలుకుని చుట్టూ ఓ సారి చూసి మళ్ళీ పడుకున్నారు. చెల్లాయి రెండోసారి అరవడం విని గాభరా పడి లేచి కూర్చున్నారు. చుట్టూ ఏదో ప్రమాదమున్నట్లు ఆయనకి మెల్లిగా అర్థమవ సాగింది.

తల్లి అంతగా కంగారు పడలేదు. చెల్లాయి పక్కన కూర్చున్నామె తన భుజాల్ని గట్టిగా పట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. ఆమె కడుపులో చన్నీళ్ళు పోసినట్లయింది. ఆమె కనిపించింది, చెల్లాయి పిచ్చి తిరగబెట్టింది. లేకపోతే ఎందుకలా గట్టిగా అరిచింది?

కావాలనే వీళ్ళందరికీ దూరంగా ముందు వేపు సీట్లో కూర్చున్న తమ్ముడికి చెల్లాయి అరిచింది వినిపించనే లేదు. అతని ప్రక్కన మొహమాటం కూడా లేకుండా కూర్చున్న స్త్రీ అతని మీద పడిపోయింది. ఆమె తల్లోని మల్లెపూల వాసన అతనికి ఆ ప్రమాదం సంగతి తెలియనే లేదు. ఎన్నో రోజుల తరువాత స్త్రీ శరీరం, అతని ఒంటికి ఆవేశంతో, కోరికతో తాకింది – స్పర్శ, వాసన రెండింటి

అనుభవం ఒక దానిలో ఒకటి కలసిపోయి ఆమె స్పర్శకే మల్లెల పరిమళం వున్నట్టుగా అతనికనిపించింది. మరుక్షణమే తల్లి, వెనుక సీట్లోంచి గుడ్లురిమి చూస్తోందేమోనన్న భయం కలిగింది. విధిలేక దూరంగా జరిగి కూర్చున్నాడు.

బస్సు నుంచున్న చోటనే వుంది. డ్రైవర్ విసిగిపోయి బీడి నేట్లో పెట్టుకుని వెలిగించి మొహం పైకెత్తి 'వుఫ్....' మని పొగ వదిలాడు. ముందు వేపు తలుపు దగ్గర నుంచున్న కండక్టర్ ఇదంతా మామూలే అన్న ధోరణిలో బస్సులో వున్న వాళ్ళ వేపు చూసి నవ్వాడు.

"బస్సుని నీళ్ళల్లో పడేసి మమల్నందరినీ ఇక్కడే అర్పణ చేద్దామనుకుంటున్నావా మహానుభావా ?" దగ్గరగా కూర్చున్న వృద్ధ విధవ కండక్టర్ వేపు చూసి గదమాయించింది. చేతిలోని చిన్న మూటని అదేదో పసిపిల్లా దన్నట్టు భద్రంగా అదిమి పట్టుకుంది. పై మూటని అటూ-ఇటూ చూసింది. తన మాటని ఎవరేనా ఆమోదిస్తారేమోనని. కాని అందరూ వూరుకోవడం చూసి ఆఖరికి తనే మొదలెట్టింది. "కాశీ నుంచి రామేశ్వరం వరకు అన్ని తీర్థయాత్రలు పూర్తి చేశాను. తిరుపతి కొండకి బస్సులో వెళ్ళాను. బదరీకి కూడా బస్సులో వెళ్ళాను, వచ్చాను. కాని ఇలాంటి అనాహుతం ఎక్కడా జరగలేదు. ఈ ప్రైవేటు బస్సు సర్వీసుల తల రాతే ఇంత. జట్కా తోలే పోకిరీలని బస్సు నడపడానికి నియమిస్తారు." అంటూ తనన్న మాటని సమర్థించు కోడానికన్నట్టుగా ఆమె చేతి సంచీ లోని జపమాలని తీసి లెక్కపెట్టసాగింది. సమాధానం చెప్పటం మాట అలా వుంచి ఆమె మాట పూర్తయ్యేదాకా కూడా కండక్టర్ ఆగలేదు. ఎప్పుడో దూరంగా వెళ్ళిపోయాడు. డ్రైవర్ వెనుక సీట్లోని వైశ్యుడొకాయన పెద్ద గొంతుకతో వృథా కంఠ శోష చేసుకుంటున్నాడు.

ఆఖరి ప్రయత్నం చేద్దామని కండక్టర్ కిందకి దిగి బస్సులో వాళ్ళ సాయంతో బస్సుని తోస్తూ తీరానికి చేరటానికి ప్రయత్నించాడు. బురదలో కూరుకు పోయిన చక్రాలు పైకి లేచాయి. నీళ్ళు చక్రాల దగ్గర రెండుగా చీలుతుంటే ఇంతెత్తున నురుగు లేవడాన్ని చూస్తూ కిటికీ దగ్గర కూర్చుంది చెల్లాయి. నీళ్ళలో తేలుతూ బయలుదేరిన బస్సు సుడిలో చిక్కుకున్న నావలా గిర గిర తిరిగినట్లనిపించింది తనకి.

బస్సుని గట్టు మీదకి తెచ్చి కండక్టర్‌తో పాటు అందరూ బస్సెక్కేసరికి చాలా పొద్దుపోయింది. బస్సు వేగంగా ముందుకి దూసుకు పోయింది.

"ఎన్నెన్నో తీర్థయాత్రలు పూర్తి చేసుకొచ్చారు. మీరు పుణ్యాత్ములు తల్లీ. ఇప్పుడు మీరూ మంత్రాలయానికేనా బయలుదేరడం ?" జపమాల తిప్పటంలో

నిమగ్నమైన వృద్ధ విధవరాల్ని చూస్తూ కౌతుకంతో అడిగింది ఓ ఆవిడ. ఆవిడ మొహం నిస్తేజంగా వుంది. నుదుటమీద చాలా పెద్ద బొట్టుంది. ఆమెకేదో జబ్బు వుండి వుండాలి. దేహం ఎండిపోయి చేతి మీద నరాలన్నీ పొంగి వున్నాయి. కళ్ళు గుంటలు పడి కింద వలయా లేర్పడ్డాయి. ఆమెని అనుకుని శక్తి హీనంగా కనిపిస్తున్న ఇద్దరు పిల్లలు కూర్చున్నారు.

(విధవావిడ చెప్పింది : "రెండేళ్ళ నుంచి ఇంటి మొహమే చూడలేదు. తీర్థయాత్రలలోనే వున్నాను. కాని చూడాల్సినవింకా వున్నాయి.) మీరిపుడు...." అంతలోనే రోడ్డు మధ్యలో నిరంకుశంగా వెళుతున్న బండిని పక్కకి తప్పుకోమంటూ డ్రైవర్ కర్కశంగా ఏకబిగిన హార్న్ కొట్టడంతో హార్న్ చప్పుడులో ఆమె మాటలు కలిసిపోయాయి. హార్న్ చప్పుడు ఆగినపుడు ఆ స్త్రీ విధవావిడతో అంటోంది : "ఎంతో మంచి మంచి డాక్టర్లకి చూపించాం. వధ్యం చేశాం. దేవుళ్ళకి మొక్కుకున్నాం. మొక్కులు చెల్లించుకున్నాం. ఏమీ ప్రయోజనం లేదు. ఎవరో పుణ్యాత్ములు చెప్పారు, మంత్రాలయానికి వెళ్ళి రాయుల వారిని సేవించండి తప్పకుండా తగ్గుతుందన్నారు. అందుకే మంత్రాయలానికి బయలుదేరాం. ఏం తగ్గుతుందో ఏమో. నాకేమీ భయం లేదింక. కాని పిల్లలు పసివాళ్ళు. రేపు నేను పోతే వీళ్ళ గతేమిటి ? " అంటూ ఆ తల్లి పిల్లలిద్దరివేపు చూసింది. ఆ కుర్రాళిద్దరూ అజ్ఞాధారకుల్లా తల్లి మొహం వేపు చూస్తున్నారు.

"శ్రద్ధతో సేవించండి. రాయులవారు మహిమాన్వితులు. అంతా సవ్యంగా జరుగుతుంది. ఇలాంటి ఎన్నో సంఘటనల్ని నేను కళ్ళారా చూశాను." అలా అన్నవారెవరా అని ఆ స్త్రీ వెనక్కి తిరగింది. మధ్య వయస్కురాలైన ముత్తైదువ ఒకావిడ కూర్చుందక్కడ. ఆమె చెంపలకు నిండుగా పసుపు రాసుకుంది. ఆమె చిన్ని ముక్కుకి పెట్టుకున్న ముక్కు పుడక పెద్దగా కనిపిస్తోంది. ఆ ముత్తైదువు ఆ ముందరి స్త్రీని చూసి నవ్వింది : ఆ స్త్రీ ఏదో మాట్లాడాలని ఆలోచించి మొదలు పెట్టే లోపల ముత్తైదువ తనే మొదలు పెట్టింది.)

"మంత్రాలయం మహా పుణ్యక్షేత్రం తల్లీ. ఎలాంటి అద్భుతాలు జరిగాయో ఇక్కడ. మఠంలో రాయులవారికి మంగళహారతి చేశాక భక్తులకి హారతివ్వ డానికి ఒక కుర్రాడున్నాడు. మీరక్కడికివెళ్ళాక అతన్ని చూడనే చూస్తారు. నాలుగేళ్ళ క్రిందట ఆ కుర్రాడిక్కడి కొచ్చినపుడు అతని నాలుక అసలు కదిలేది కాదు. పుట్టు మూగ. కాని ఇక్కడ సేవ చేశాక, ముద్దు ముద్దుగా మాట్లాడగలుగుతున్నాడు. ఒకటి, రెండా ఇలాంటి ఎన్నో సంఘటనల్ని నా కళ్ళతో నేను చూశాను. ఒక నెల్లాళ్ళ క్రిందట అద్భుతమైన సంఘటన

జరిగింది. ఖర్ర చెడిపోయిందని ఒకాయన్ని ఇక్కడకి సేవకి తీసుకొచ్చారు. అతను రోజూ రాయులవారి ముందు జలజల కన్నీరు కారుస్తూ వుండి పోయేవాడు. ఓ రోజు అతనికి ఏమనిపించిందో ఏమో ఎవరికి తెలుసు ? రాత్రి నదికి వెళ్ళాడు బహుశః ప్రాణం తీసుకోవడానికి అయ్యుంటుంది. నీళ్ళల్లో దిగుతుంటే అతని నెవరో పిలిచినట్లయింది. వెనుతిరిగి చూశాడు. ఒక తేజో మయమైన ఆచార్యులవారు నుంచుని వున్నారు. "స్నానం పూర్తయింది. శుచిగా వున్నావు. పైకి రా ఇక" అంటూ పైకి పిలిచి చెప్పారు. "ఇదిగో ఈ గోపీ చందనం రాసుకో. లోపల మారుతి దర్శనం చేసుకుని ఇంటికి వెళ్ళు." మంత్రం వేసినట్టుగా పైకి వచ్చి గోపీ చందనం తీసుకుని గుడి వేపు బయలుదేరాడు. అప్పుడతని కేమీ అనిపించనే లేదు. ఎవరో ఆచార్యులవార నుకున్నాడంతే. కాని ముందుకు వెళ్ళి ఎందుకనో వున్నట్టుండి వెనక్కి తిరిగి చూశాడు. ఆయన అక్కడ లేరు. అప్పుడూ అతని కేమీ అనిపించలేదు. మధ్యరాత్రిలో తిన్నగా దేవాలయంలోకి వెళ్ళి మారుతి దర్శనం చేసుకుని రాయులవారి బృందావనం దర్శనానికి వెళ్ళినవాడు అక్కడే స్పృహ కోల్పోయాడు. అలాగే గడప దగ్గర పడిపోయాడు. అతనికి స్పృహ వచ్చేసరికి తెల్లవారింది. మఠంలోని పూజారులంతా దిగ్భ్రమతో నుంచుండి పోయారు. ఎందుకంటే రాత్రి పదింటికి దేవాలయం తలుపులన్నీ వేసేసి భద్రంగా తాళాలు వేసేస్తారు. లోపలికి వెళ్ళటానికి మరో దారే లేదు. చూస్తే తలుపులన్నీ భద్రంగా అలాగే వున్నాయి. అతన్నడిగితే ఏమీ చెప్పగల స్థితిలో లేడు. తరువాత మూడు నాలుగు రోజులు అతను అదేపనిగా రాత్రి కలుసుకున్న ఆచార్యుల కోసం వూరంతా వెతికాడు. ఆయనెందు కృనిపిస్తారు ? స్వయంగా రాయులవారు ప్రత్యక్ష ఫలం ఇచ్చి వెళ్ళారు. అతనిప్పుడు అన్నీ వదిలి దాసుడుగా వున్నాడక్కడ."

మంత్రాలయం దగ్గర కొచ్చింది. బస్సు కిటికీ లోంచి చూస్తే పక్కగా తుంగభద్రా నది మౌనంగా పాయలు పాయలుగా ప్రవహించడం కనిపిస్తోంది. సున్నం రాసిన పెద్ద పెద్ద మఠం గోడలు దగ్గరగా వస్తున్నట్ట నిపిస్తోంది.

ఆ రోగిష్టి స్త్రీ మొహం కొద్దిగా విచ్చుకుంది. కంపిస్తున్న కంఠంతో అందామె. "అయితే నాక్కూడా తగ్గుతుందంటారా ? మీరెవరు తల్లీ ఇంతంతా కళ్ళతో చూసిన పుణ్యాత్ములు. మీరూ ఇక్కడ సేవ కోసం వచ్చారా ?"

ముత్తైదువ నవ్వింది. నిష్కారణంగా క్రింద పెట్టిన సంచీ చేతిలోకి తీసుకుంటూ చెప్పింది. " నేను బయటిదాన్ని కాదు. మా ఆయన ఇక్కడే వైదీకం చేస్తారు. మీ రిక్కడకి రావడం ఇదే మొదటి సారనుకుంటా అదిగో మంత్రాలయం

వచ్చేసింది. మీరు మరెక్కడికీ వెళ్ళకుండా మఠం సత్రంలోనే దిగండి. వేరే చోట్లకి వెళితే అనవసరంగా డబ్బు లిచ్చుకోవలసి వుంటుంది." బస్సు గిరుక్కున తిరిగింది. లేస్తున్న ఆ ముత్తైదువ మళ్ళీ సీట్లో కూలబడింది. "వస్తానమ్మా, రేపు మిమ్మల్ని నది దగ్గర కలుస్తాను. చేటల వాయినం ఇచ్చేలా అయితే నాకే ఇవ్వండి. ఇంకెవరికీ ఇవ్వకండి. నా పేరు కలావతి. ఇక్కడందరూ నన్ను 'కలవ్వ' అంటారు. ఎవరైనా అడిగితే కలవ్వ కిస్తానని చెప్పెయ్యండి". ఆమెకి ఆలోచించడానికి కూడా అవకాశం ఇవ్వకుండా కలవ్వ ఆమె నుంచి వాగ్దానం తీసేసుకుంది.

(బయట దూరంగా నదిలో నీళ్ళు చిన్న పిల్లలు ఎండలో అద్దం పట్టుకున్నట్టు, వెలుగు పడి, ధగ ధగా మెరుస్తోంది. ప్రవాసపు అలసటతో నిండిన ప్రయాణీకుల మొహాలు బయట దృశ్యాల్ని చూడ్డానికి ఆత్రపడుతూ కిటికీల దగ్గర మూగాయి.

బస్సు స్టాండ్ దగ్గరకి చేరుకునేసరికి తమ్ముడు మల్లెల వాసనతో తప్పుదారి తొక్కి, గత జీవితపు జ్ఞాపకాల ఘోరారణ్యంలో చిక్కుకుని దారి తప్పాడు. చెల్లెలు చక్రాల కింద నురుగు నురుగ్గా పై పైకి వస్తున్న నీళ్ళని తలుచుకుంటూ గడగడ వణికిపోతోంది. తల్లి ఆమెని గట్టిగా పట్టుకుని శూన్యమనస్కురాలై కూర్చునుంది. తండ్రి ఇంకా నిద్ర తీరక జోగుతున్నారు.)

× × ×

తెల్లవారడానికింకా గంట సమయమున్నా జనం నదీ తీరంలో కిక్కిరిసి వున్నారు. అలా చూడబోతే తెల్లవారక మునుపే స్నానాలు పూర్తి చేసుకుని సేవ మొదలెట్టాలి.

బండరాళ్ళ మీద జాగ్రత్తగా నడుస్తూ ఆ నలుగురూ నీళ్ళని సమీపించారు. తండ్రికి నిజంగా మహా కోపంగా వుంది. ఇంత చలిలో వెళ్ళి నదిలో మునిగి,వూరికే ముందు దేవుడెదుట నుంచోవాల నెక్కడుంది ? ఎండెక్కాక వెళ్ళి స్నానం చెయ్యొచ్చు కదా ! లేవగానే తమ్ముడితో ఖచ్చితంగా చెప్పేశారు. " మీ రందరూ ముందుగా వెళ్ళండి. నేను తరువాత వస్తాను" అని. ఇది తల్లి చెవిలో పడింది. ఆమెకది నచ్చలేదని ఆమె మొహం చూస్తూనే తండ్రికి తెలిసిపోయింది. ఎప్పుడూ ఈయనింతే. ఏదో నా కోసం ఇక్కడి కొచ్చినట్టుగా అనుకుంటున్నారేమో కూతురి జబ్బు నయమవ్వాలని కదా...." ఇంకా ఏమనేదో ఆమె, అంతలో చెల్లాయి పరిగెడుతూ రావడం వల్ల మాట లాగిపోయాయి.)

"ఓ స్వామీ అటు వెళ్ళద్దండి. అక్కడ నీటి వడి ఎక్కువగా వుంది. నీళ్ళు లాగేస్తాయక్కడ. ఆ ( కాస్త ఇటు రండి. అవును, అక్కడ ఈత కొట్టకండి మరి.

నీళ్ళలో ఎక్కడెక్కడా రాళ్ళున్నాయి. అలా అరుస్తూ చెపుతున్న దెవరో, ఎవరికి చెపుతున్నారో కూడా తండ్రికి తెలియలేదు. నది ఒడ్డు మీదంతా జాతరలా వుంది. గొడవలో ఒకరి మాటొకరికి వినపడ్డం లేదు. చెల్లాయికి స్నానం చేయించి తల్లి వచ్చేదాకా వాళ్ళక్కడే బండ రాతి మీద కూర్చున్నారు. "కాస్త దారి వదిలి కూర్చోండయ్యా, స్త్రీలు, పిల్లలు వచ్చి వెళ్ళేదారది. మడి స్త్రీ వచ్చేపోయే దారిలో కూర్చుంటే ఎలా ?" తండ్రి తిరగి చూశారు. ఆవిడే, ఇంకా అలాగే గూనిగా విల్లులా వొంగి నడుస్తోంది. ఇన్నేళ్ళయినా ఏమీ మారలేదు. అప్పటికన్నా కొంచెం చిక్కింది. నల్లబడింది, అంతే. చేతిలో అరిగిపోయిన చెంబుంది. బహుశః అదే చెంబు అయ్యుంటుంది. పన్నెండేళ్ళ క్రితంది.

....అప్పుడు తమ్ముడు హైస్కూలికి వెళ్ళేవాడు. చెల్లాయి అప్పుడే స్కూలు వదిలిపెట్టింది. భార్య పోట్లాడి పుట్టింటికి వెళ్ళిపోయిందని, అప్పుడు ఇద్దరు పిల్లల్నీ తీసుకుని ఆయన మంత్రాలయానికి వచ్చారు. వాళ్ళప్పుడు అలా రావడానికి కారణం ముఖ్యంగా రైల్వేపాసు వుందని. అనుకోకుండా పిల్లలకీ సెలవు లొచ్చాయప్పుడే. కాని భార్య తిరిగి రావాలని మొక్కు కోవడానికి మాత్రం కాదు. ఆమె స్వభావమే అలాంటిది. వాళ్ళు ఆమెకి దేనికీ కొదవ చెయ్యలేదు. అయినా ఎలాగో దొంగతనంగా ఎక్కడ్నుంచో డబ్బు దాచుకుని ఓ వంద రూపాయలు మూట కట్టింది. ఊరికి వెళ్ళేటప్పుడు చీరెల మధ్యలో దాచి ట్రంకు పెట్టెలో పెట్టింది. వాళ్ళు దాన్ని గమనించి మొగుడికి తెలియకుండా డబ్బు తీసికెళ్ళడం మంచిది కాదని చెప్పినందుకామె పోట్లాడి, కోపం తెచ్చుకుని పుట్టింటికి వెళ్ళిపోయింది.

....అప్పుడు వాళ్ళు మంత్రాలయాని కొచ్చారు. ఆ గూని స్త్రీ అప్పట్నుంచీ ఇక్కడే వుంది. "చెల్లాయ్ అప్పుడావిణ్ణి చూసినపుడు భయంతో కూడిన తిరస్కారంతో ఆమె నుంచి దూరంగా వెళ్ళి నుంచుంది. తమ్ముడు ఆమె చేతిలో ఎప్పుడూ చెంబు వుండటాన్ని చూసి "చెంబు గూనవ్వా" అని పిలిచేవాడు.

....చెల్లాయికి ఇప్పుడది గుర్తుండటం అసాధ్యం.

....కాని తమ్ముడూ ఆ విషయం మర్చిపోయాడంటే .... కాని ఎక్కడున్నాడు తమ్ముడు ? అటు నీలాకాశం. ఇటు అస్తవ్యస్తంగా పడున్న నల్లటి బండరాళ్ళు. తమ్ముడెక్కడా కనిపించలేదు. దూరంగా మరో బండచాటున ఆడవాళ్ళు స్నానాలు చేస్తున్నారు. బండమీద గుడ్డలారేశారు.

తండ్రి మళ్ళీ చుట్టూ చూశారు. కాని తమ్ముడెక్కడా కనిపించలేదు. తమ్ముడి పట్ల ఆయనకి అపారమైన జాలి పుట్టుకొచ్చింది. అతన్ని పిలిచి పక్కన కూర్చోబెట్టుకుని వీపు నిమిరి ఓదార్చాలని పించింది. అతడి వయసులో

తమకింకా పెళ్ళి కూడా కాలేదు. కాని తమ్ముడు ఇప్పుడు పెళ్ళాన్ని పోగొట్టుకుని ఎదురుదయ్యాడు.

తండ్రికి తమ్ముడి భార్య గుర్తు వచ్చింది. తామున్న స్టేషన్ గుర్తు వచ్చింది. రైలు పట్టాలు గుర్తు వచ్చాయి. మొన్న మొన్నటి దాకా తమ కళ్ళ ముందు పెరిగిన పిల్ల, పెళ్ళామై, ఇప్పుడు ఒట్టి కథగా మిగిలిపోయింది. చావుకి అర్థం కూడా తెలియని పసిది. వయసులో ప్రాణాలు పోగొట్టుకుంది. చనిపోయిన రోజే మళ్ళి ఎవరైనా లేపి వుంటే కళ్ళు నులుముకుంటూ లేచి తిన్నగా ఇంటికి నడిచి వచ్చేసేదేమో.

క్రమంగా తండ్రికి అనిపించ సాగింది, ఎండకి తమ తల కాలిపోతుందేమోనని. క్రింద వుంచిన తడి పంచను తల మీద పెట్టుకున్నారు.

నల్లటి పెద్ద పెద్ద బండరాళ్ళు ఇనుప ముక్కల్లా పడి వున్నాయి. నది నుంచి మఠానికెళ్ళే త్రోవ ఆ బండల మీద నుంచే పోతుంది. దారి ఆఖరయ్యే చోట ఎత్తుగా భవ్యమైన గోడ వుంది. గోడ దాటితే చాలు మఠం వస్తుంది. గోడకంతా సున్నం రాసి ఎర్ర మన్ను పట్టెలు పెట్టారు.

తల్లి, చెల్లాయి స్నానం పూర్తి చేసి ఒడ్డుకి నడిచి వస్తున్నారు. తల్లికి అలా నడిచి రావడానికి బిడియంగా వుంది. నీళ్ళల్లోంచి ఒక్కసారిగా అలా లేచి నడిచి రావడమంటే ఎంత సంకోచంగా వుంటుంది! గుడ్డలు తప తపమని ఒంటికి అంటుకు పోయాయి. పెద్దవాళ్ళు తమకే సిగ్గేస్తే .... కాని చెల్లాయికి ఆ ధ్యాసె క్కడుంది. స్నానం చేసి నీళ్ళ గదిలోంచి బయటకి పరిగెడుతూ వచ్చే చిన్న పిల్లలాగా దుడుదుడుమని ఒడ్డుకి వస్తోంది.

(నది దగ్గర రాను రాను సందడి తగ్గింది. జనం హడావుడిగా మఠం వేపు వెళ్ళే ప్రయత్నాలు చేస్తున్నారు. ఆరేసిన గుడ్డలన్నీ క్రమేణా తగ్గిపోతున్నాయి) అక్కడే గుడ్డలుతుకుతూ కూర్చున్న కోమటావిడ అంది, "నెమ్మదిగా రమ్మా, రాళ్ళ మీద పాచి పట్టి వుంటుంది. కాలు జారేను. మొన్న ఎవరికో ఇలా చెప్పినందుకే ఎంత కోపగించుకుందో. నేనేం తప్పు చెప్పానా ? ఆఖరికి నేను చెప్పినట్టే అయింది. గొణుక్కుంటూ ముందు కెళ్ళిందో లేదో జారి పడనే పడింది."

(తల్లికి కోపం వచ్చింది. ఇంకొరి సంగతి నీ కెందుకు ? నీ పనేదో నువ్వు చూసుకో అనాలనిపించింది. కాని పొద్దున్నే లేచి లేని పోని గొడవెందుకని వూరుకున్నారు. మెల్లిగా అడుగు లేసుకుంటూ వచ్చి చెల్లాయిని ఒడ్డు చేర్చి దీర్ఘంగా నిట్టూర్చారు.)

చెల్లాయి ఇక్కడి కొచ్చాక కొంచెం ప్రశాంతంగా వుంది. మొహం మ్లానంగా

వుంది. ఎప్పుడూ ఏదో ధ్యానలో, మత్తులో వున్నట్టుంటుంది. అదే స్టేషన్‌లో వున్నపుడెంత గొడవ చేసేది ! రైలు చప్పుడయితే చాలు మతిలేని దానిలా రైలు పట్టాల వేపు పరిగెత్తేది. అప్పుడామెని పట్టుకోవడమే అందరికీ ఒక పెద్ద పనయ్యేది. పట్టాల మీదెప్పుడూ బండి రాకపోతేనేం. పట్టాల మీది కెళ్ళి అటు దిగితే చాలు. అక్కడే వుంది పాడుబడిన నుయ్యి.

తల్లి చీర కట్టుకుంటూ ఓసారి చుట్టూరా చూశారు. తమ వేపెవరన్నా చూస్తున్నారేమోనని. అదే వేళకి గాలి బలంగా వీచింది. చేతిలో గట్టిగా పట్టుకున్న కొంగులో గాలి దూరి పడవ తెరచాపలా ఉబ్బి టపటప కొట్టుకుంది. తల్లి ఒక్కసారి తికమకపడి చీరని వుండగా చేసి పట్టుకున్నారు. కాని చెల్లాయి కూర్చున్న చోట మరెవరైనా వుండి వుంటే గట్టిగా, తెల్లగా, హంసలా వున్న ఆమె కాళ్ళ వెనుక భాగం కనిపించేది.

దూరంగా తండ్రి ఎవరో ఇద్దరితో మాట్లాడుతున్నారు. చేత్తో చూపిస్తూ ఏదో చెపుతున్నట్టుంది. ఎవరి మొహమూ అక్కడ్నుంచి స్పష్టంగా కనిపించడం లేదు. తల్లికి ఒక్కసారిగా గుర్తువచ్చింది. చెల్లాయింత వరకూ ఇక్కడే కూర్చుంది, ఇంతలో ఎక్కడి కెళ్ళింది?

నిజంగా తండ్రికి అయన్ని చూసిన గుర్తు ఎక్కడా లేదు. ఆ గృహస్థు నల్లగా పొట్టిగా వున్నారు. ఏభయ్యైదేళ్ళకి పైనే వుంటుంది వయను. అయన నవ్వగానే యవ్వనంలో వున్న అయన పళ్ళు మెరిసాయి. బహుశః అయన పళ్ళు స్వంతమై వుండవు. అయనతో బాటు వచ్చిన మరొకరి పరిచయం. అయన కసలే లేవు. ఆ నల్లటి ముసలాయన అన్నారు కదా, "ఏమిటి, రావుగార్ని గుర్తే పట్ట లేక పోయాను. చాలా మార్పొచ్చింది మీలో." తండ్రికి అయన మాటల తీరే నిగూఢంగా అనిపించింది. గుర్తుపట్టలేదు అంటూనే గుర్తు పట్టినట్టుగా మాట్లాడుతున్నారు. నాలో మార్పేంవుందసలు? జీవితం అంతా గడిచినా ఇలాగే వుండేవాడతను. ఏ మార్పు లేదు. ఇక మీదట ఏదైనా మార్పు వస్తుందేమో. నా పరిచయాన్ని నేనే మర్చిపోవాలి. అందరూ మర్చిపోయేలా చెయ్యాలి. ఎవరూ గుర్తించని చోటు వెతుక్కుని ఒంటరిగా మౌనంగా వుండడాన్ని గమనించి ముసలాయన ఒత్తి పలికారు.

" మీరు పొల్లాపురంలో గూడ్స్ క్లర్క్‌గా వున్నపుడు నేను అక్కడికి సిగ్నలర్‌గా వచ్చాను. ఇప్పటికి ముప్పయ్యేళ్ళయి వుంటుంది. మొన్న మొన్న తకారి స్టేషన్ మాస్టర్‌గా రిటైర్ అయ్యాను. ఇప్పుడు మీరు చాలా చిక్కిపోయారు."

"పెద్దతనం మీద పడలేదూ మరి? మనిషి అలాగే వుండిపోలేడు కదా. ఇప్పుడు గుర్తు పట్టాను మిమ్మల్ని. మీరూ అప్పటిలా లేరు."

తండ్రికి వాళ్ళెవరో గుర్తు రాలేదు. వచ్చేలా లేదు. ఏదో బాగుండదని అలా అన్నారంతే.

ముసలాయన అడిగారు, "ఇప్పుడేం ఒక్కరే వచ్చారా లేక...."

"అందరం కలిసే వచ్చాం. మా అమ్మాయి ఆరోగ్యం బాగా లేదు....రాయుల సేవ కోసం...."

"ఏమిటి? ఏమయింది?".

" పెద్దగా ఏం లేదుగాని అప్పుడప్పుడు విస్మృతి కలిగినట్లవుతుంది, అంతే."

తల్లి నీళ్ళ వేపు పరుగు పెడుతున్న చెల్లాయిని తీసుకొచ్చి, ఇబ్బందిగా తండ్రి కోసం ఎదురు చూస్తున్నారు.

"సరయితే మళ్ళీ కలుద్దాం. ఉత్సవం దాకా వుంటారా, లేదా తొందరగా సేవ ముగించుకుని వెళ్ళిపోతారా?"

"రాయులు ఏ విధంగా పిలు కల్పిస్తారో చూడాలి. ఉండాలన్న సంకల్పం చేసుకున్నాం. సిద్ధించాలంతే."

(మఠంలోంచి గంట వినిపిస్తోంది. నది ఒడ్డు మీద పసుపు, కుంకం, గోపీ, చందనపు వాసన అలుముకుంది.

ఓ లక్ష ఆస్తి గల ఆసామి ఆయన. గుడ్స్ మాస్టర్‌గా రిటైర్ అయ్యాడు. బాగా డబ్బు గడించాడు. అయితేనేం, డబ్బు వల్ల సుఖం వుండాలని లేదు కదా. ఈయన పెళ్ళాం బ్రహ్మరాక్షసి. వాళ్ళిద్దరిదీ అఖరిదాకా అలాంటి దాంపత్యమే అయింది. మాస్టర్ గారి మనసుకి విరుద్ధంగా పుట్టింటి వేపునుంచి ఓ పిల్లని తెచ్చి కొడుక్కి కట్టబెట్టింది. కాని ఆ పిల్లని కూడా సరిగ్గా చూసుకో లేకపోయింది. ఈవిడ పెట్టే బాధలు భరించలేక ఆ పిల్ల రైలు కింద పడి చచ్చిపోయింది. మొన్న మొన్నటి సంగతి అది. తరువాత మూడు నెల్లకల్లా కూతురికి పిచ్చి పట్టింది. కోడలే కూతుర్ని పట్టిందని అనుకుంటూరు. విస్మృతి - గిస్మృతి అంతా అబద్ధం. ఆ పిల్లకి పిచ్చే పట్టింది.)

తండ్రి నెత్తిమీద తడి పంచె వుంది. తల్లి చీరని బాగా పైకి కచ్చపోసి కట్టుకుంది. తడిసిన జుట్టుని మాటి మాటికి తడుముకుంటూ చెల్లాయి పెద్ద పెద్ద అంగలేస్తూ పరుగులాంటి నడకతో నడుస్తోంది.

మఠంలోని గంటల చప్పుడు వినిపిస్తోంది.

× × ×

తండ్రి కూర్చున్న చోటునుంచి ఉత్తరం వేపు తెల్లటి గోడ కనిపిస్తోంది. గోడ లోపల కిటికీ ఆకారంలో ఒక చిన్న తలుపుంది. నదిలో స్నానం చేసి ఒక్కొక్కరూ ఆ తలుపు గుండా లోపలికి వస్తున్నారు. తలుపు బయట పెద్ద వేప చెట్టు ఒకటి

వుంది. చిన్నప్పుడే తండ్రి ఒక కథ విన్నారు. ఆ వేప చెట్టు మీద బ్రహ్మరాక్షసులున్నారని, గోడని చీల్చుకు వచ్చిన ఆ చెట్టు కొమ్మని తదేకంగా చూస్తున్నారాయన. ఒక రాత్రి భక్తుడు ఒకడు ఆ తలుపులోంచి బయటికి వెళుతుంటే బ్రహ్మరాక్షసి అతణ్ణి పట్టుకుందట. భయం వేసినా, అతను ధైర్యం తెచ్చుకొని రాయులవారి స్తోత్రం పఠం చేసరికి ఆ బ్రహ్మరాక్షసి వదిలి పెట్టేసిందట.

ఎదుట తల్లి, చెల్లాయి కనిపించారు. ఇద్దరూ ప్రదక్షిణలు చేస్తున్నారు. చెల్లాయి నుదుటి మీద ఇసుక అంటుకుంది. ఆమె కనురెప్పలు తడిగా వున్నాయి. తల్లి ఏకబిగిన రొప్పుతోంది. వాళ్ళని చూసి నప్పుడాయనకి ఎప్పుడూ లేని విచిత్ర భావ మొకటి కలిగింది. వాళ్ళిద్దరూ తనకి పూర్తిగా అపరిచితుల్లా కనిపించారు. ఎవరు వాళ్ళు? ఇన్ని రోజులూ కలిసి బ్రతకనట్లయితే, వాళ్ళిద్దరికి, నాకూ ఏ సంబంధం లేదనవచ్చు కదా! ఇన్ని రోజులు మే మెందుకు కలిసి వున్నాం? ఎలా వున్నాం? తండ్రికి ఏ ప్రశ్నకీ జవాబు దొరకలేదు.

మఠంలో భోజనాలు చాలా ఆలస్యంగా మొదలవుతాయి. భోజనాల వేళ దగ్గర పడే కొద్దీ మఠంలో జనం సందడి ఎక్కువ వుతుంది. తండ్రికి అప్పుడే ఆకలేస్తోంది. మొదట్నుంచీ కూడా ఆయన ఆకలికి తట్టుకోలేరు. ఆకలేస్తే మనసు ఉద్విగ్న మవుతుందాయనకి. ఏమీ తోచదింక. కోడలు చనిపోయి నప్పుడు ఇలాగే అయింది. తమకి విరోధంగా ఎవరో చేసిన ఫిర్యాదు వల్ల ఆ రోజు అకస్మాత్తుగా స్టేషన్ ఇన్‌స్పెక్షన్ జరిగింది. హడావుడిగా నాలుగు మెతుకులు శాస్త్రానికి తిని గుడ్స్ షెడ్‌కి పరిగెత్తారు. మళ్ళీ రాత్రి భోజనానికి కూర్చునే సరికి ఇది జరిగింది. భయానకమైన చావు, ఇంత సహజంగా కోడల్ని ఎత్తుకు పోతుందన్న విషయం ఊహించడానికికూడా సాధ్యం కానిది. కోడలు కత్తిపీట ముందువేసుకుని ఉల్లిపాయలు తరుగుతోంది. ఆమె ఎదుట పొయ్యి మీదున్న పాలు పొంగుతున్నాయి. ఆ విషయం గమనించనందుకు తల్లి తిట్టారు. వెంటనే తను లేచి బయటికి వెళ్ళిపోయింది. మళ్ళీ రానే లేదు. పరుగెత్తుకుంటూ వెళ్ళి సాయంత్రం ఎక్స్‌ప్రెస్ ధడధడ శబ్దంతో చూస్తుండగానే కనుమరుగైంది. ఆ గొడవ పూర్తయి ఇల్లు చేరేసరికి రాత్రి నాలుగు గంటలయింది. ఆవేళ కూడా ఆయనకి ఇలాగే ఆకలి వేసింది.

తండ్రికి తమ్ముణ్ణి చూసి ఆశ్చర్యంగా వుంది ఒక్కసారి దేవుడి మీద భక్తి ఎక్కడ్నుంచి పుట్టుకొచ్చిందో. పెళ్ళాం చావు అతనికి దేవుడి మీద శ్రద్ధ కలిగించిందేమో. తమ్ముడు కళ్ళు మూసుకుని భక్తి పూర్వకంగా ప్రదక్షిణ చేస్తున్నాడు. అసంపూర్ణమైన ఏ ఆకాంక్షకోసం అతను ప్రార్థిస్తున్నాడో.

ప్రదక్షిణ చేస్తున్న తమ్ముడికి విసుగొచ్చింది. ఈ మాత్రానికే కాళ్ళు నొప్పెడుతున్నాయి. పెళ్ళాం వుండుంటే ఇప్పుడామె తిట్టేసేది. "ఊళ్ళో వుంటే కాళ్ళకి చక్రాలు కట్టుకుని తిరుగుతారు కాదా, ప్రదక్షిణ చెయ్యడానికి కాళ్ళు నెప్పెడతాయా మీకు, దేవుడి సేవ అంటే అలా విసుక్కోకూడదు". అది గుర్తువచ్చి మళ్ళీ ప్రదక్షిణ మొదలెడదామని అనుకున్నాడు. తనకి స్వతహాగా దేవుడిమీదెప్పుడూ విశ్వాసం లేదు. ఇప్పుడూ లేదు. అయినా తను ప్రదక్షిణ చేస్తున్నాడు. దీనివల్ల ఆమెకి సంతోషం కలుగుతుందనా? బ్రతికున్నపుడు ఆమెని సుఖంగా వుంచాలని, చూసుకోవాలనే ధ్యాసే లేకపోయింది తనకి. ఇప్పుడామె కోసం ఏంచేసి సంతోష పరచగలడు? బ్రతికున్నపుడు ఆమె కనీసపు కోర్కెలని కూడా తీర్చలేకపోయాడు. పెళ్ళయిన కొత్తలో మంత్రాలయాని కోసారి వెళ్ళి రావాలని వుండేది ఆమెకి. అమ్మే దానికి అడ్డు పడింది. "ఇప్పుడేమన్నా అంత వయసు ముదిరి పోయింది ఏమిటి? ఇవాళ కాకపోతే రేపు వెళ్ళనే వెళుతుంది. పెళ్ళి ఖర్చే బోలెడయింది. మళ్ళీ ఇప్పుడిదో ఖర్చా?" సరే, అదలాగే అయిపోయింది. ఇప్పుడామె చనిపోయి అర్నెల్లు కూడా కాలేదు. తామందరూ మంత్రాలయం యాత్రకి వచ్చారు.

నడిచేటప్పుడు తమ్ముడి పంచ కాళ్ళ కడ్డు పడింది. తూలి కింద పడాల్సిందే. కాని కాంపౌండు గోడ పట్టుకుని ఆగాడు. దూరంలో తల్లి ఎవరితోనే మాట్లాడుతూ కనిపించింది. ప్రదక్షిణ సగంలో ఆపి చేతిలో దేనినో చూపిస్తూ వాళ్ళకేదో చెబుతోంది. ఆమె ఏం చెపుతోందో తమ్ముడికి బాగా తెలుసు. భార్య దుర్మరణం పాలయిందనీ, దెయ్యమై చెల్లాయిని పట్టుకు పీడిస్తోందనీ అందరితో చెప్పుకుంటూ తిరుగుతుంది. "బ్రతికున్నపుడు కోడలికి ఎంతో చేశాను. అయినా నాకు చెడ్డ పేరు తెచ్చిపోయింది." అని అందరితో వివరాలు చెప్పుకుంటూ గోడుగోడుమని ఏడుస్తుంది.

అమ్మ విక్షిప్త స్వభావంతో అందరికీ విసుగు పుట్టిపోయిందింట్లో. తండ్రి సంసారిక జీవితాని కెప్పుడో తిలోదకాలు వదులుకున్నారని తమ్ముడికి వయసొచ్చే సరికే తెలిసొచ్చింది. మొదట్నుంచీ అమ్మ ప్రవర్తన చిత్రంగానే వుండేది. తండ్రి కడుపు నిండా భోంచేస్తే అనుమానం, చెయ్యక పోయినా అనుమానం. అందులో ఆయన పొరబాటున స్త్రీ లెవరితోనన్నా నవ్వుతూ మాట్లాడారో ఇక ఆమె అవతారం చూడాల్సిందే. ఇవన్నీ తమ్ముడు పెరిగి పెద్దయ్యాక తెలిసాయి. దేనికయినా తండ్రి కాదంటే చాలు, అమ్మ ఎగిరి పడేది. అస్తమానం కోపాలు, పోట్లాటలు, గొడవ. నానా రగడా చేసేది. తను చిన్నవాడుగా వున్నపుడు, ఏదో అతి చిన్న కారణానికి తండ్రితో పోట్లాడి రోజంతా హఠమప్ప

గుడి గట్టుమీద కూర్చుని సాయంత్రం ఇంటికొచ్చింది. ఇంకోసారి మరెందుకో, బావి గట్టుమీద కూర్చొని ప్రాణం తీసుకుంటానని బెదిరించింది.

అమ్మ నోటి వెంట చావు మాట రోజుకెన్ని సారులో వచ్చేది. కోపం వచ్చినప్పుడల్లా చచ్చిపోతానని ఇంట్లోంచి వెళ్ళిపోయి కోపం తగ్గగానే ఇంటికొచ్చేసేది.

తమ్ముడికి కాళ్ళు నొప్పెట్ట సాగాయి. ఆ గట్టునుంచి రాయుల వారి బృందావనం కనిపిస్తోంది. క్రింద స్తంభానికి ఆనుకుని ఎరుపు రంగు పీతాంబరం కట్టుకున్న ముసలాయ నొకరు కూర్చున్నారు. ఆయన శరీరంలో సగం భాగం చలనం లేకుండా వుంది. ఆయన భుజం పట్టుకుని పక్కన కూర్చున్న స్త్రీ ఆయన భార్య అయి వుండొచ్చు. వాళ్ళ దగ్గరగా ఇద్దరమ్మాయిలు మల్లెపూలు మాలకడుతూ కూర్చున్నారు. ఒకమ్మాయి నుదురు 'పచ్చగా' వుంది. ఒంటిమీదేమీ అలంకారాలు లేవు. శుభ్రమైన తెల్ల చీర కట్టుకుంది. మరొకామె నుదుట ఎర్రటి కుంకుమ వుంది. ఇంకా పెళ్లికాలేదు. తమ్ముడి కామె మీద దృష్టి మళ్ళలేదు.

పచ్చటి నుదురు వున్న అమ్మాయి వేపే చూస్తున్నాడు. చాలాసేపటి తరువాత అతని కనిపించింది. 'ఎందుకు ఆ అమ్మాయి వేపే చూస్తున్నానా' అని. ఒక వేపు నుంచి చూస్తే ఆమె అచ్చు తన భార్య లాగే వుంది. ఎంత సేపట్నుంచో చూస్తున్నాడు. ఆమె నవ్వే తీరు కూడా అలానే వుంది. కాసేపటికి అతను తననే గమనించడం చూసి ఆమె మొహం అటు తిప్పుకుంది. తమ్ముడొక్కసారిగా వులిక్కిపడి అటు-ఇటు చూసి ఆఖరికి దగ్గర వున్న అశ్వత్థ వృక్షం క్రిందకి దృష్టి సారించి నిలపడానికి ప్రయత్నించాడు.

అతని ఒళ్ళు జలదరించింది. అమ్మ ఎంత సేపట్నుంచి అక్కడ నుంచుని వుందో తెలీదు. భావ రహితంగా వుందనిపించే నిశ్చల దృష్టితో ఆవిడ తనవేపే చూస్తూ నుంచున్నారు. తమ్ముడికి భయం వేసింది. ఆలోచించాడు. అమ్మంటే ఎందుకంత భయం వెయ్యాలి ? ఆ అమ్మాయిని తను చూస్తే తప్పేమిటి ? అమ్మ అసలు ఏ పురుషుడి వైపు చూడనే చూడదా ? కాని....కాని.... అమ్మని చూస్తే మే మందరం ఎందుకు భయపడతాం? వస్తుతః తండ్రే భయపడతారు. చెల్లాయి మాట చెప్పక్కర్లేదు. అమ్మంటే భయంతో అదిరిపోతూ, క్రుంగిపోతూ వుంటుంది. ఆ వేడికి తట్టుకోలేక పెరుగుదలే ఆగిపోయి, రాను రాను కాలిపోవచ్చు కూడా. తనక్కూడా అమ్మంటే భయమే. కాని ఈ భయాన్ని కొద్దిగానైనా లెక్కచెయ్యని ఒక వ్యక్తి నాలుగు రోజులు బ్రతికి వెళ్ళిపోయింది. తమ్ముడికి తన భార్యంటే అభిమానం పొంగు కొచ్చింది. అమ్మ పెట్టే బాధలతో

ఏనిగి పోయింది, ఏడ్చింది. బ్రతికినంత కాలం అన్నీ మూగగా భరించింది. కాని ఆమె ఎప్పుడూ అమ్మకి భయపడలేదు. పెళ్ళయిన కొత్తలో అమ్మకి తెలీకుండా స్నేహితుడింటికి వెళ్ళొస్తామని అబద్ధం చెప్పి వాళ్ళిద్దరూ సర్కస్‌కి వెళ్ళారు. అదెలాగో మర్నాడే అమ్మకి తెలిసిపోయింది. కోపంతో మండిపడింది. చెల్లాయిని వదిలి పెట్టి వెళ్ళడానికే ఇలా చేశారని అరిచింది. పట్టుబట్టి ఆ రోజునే పక్కింటి పిల్లని తోడిచ్చి చెల్లాయిని సర్కస్‌కి పంపింది. అప్పుడు కూడా తన భార్య ఒక్క మాట కూడా మాట్లాడకుండా శాంతంగా తన పాటికి తను వుండిపోయింది. మరోసారి అమ్మకి చెప్పకుండా తాము ఇద్దరూ కలిసి ఫోటో తీయించుకుని వచ్చినపుడు అమ్మ చేసిన గొడవకి అంతూ పంతూ లేదు. మాటకి మాట పెరిగి అమ్మ అందర్నీ నోటి కొచ్చినట్టు తిట్టి, నూతిలో పడతానని బయలుదేరింది. తన భార్య అంతే కోపంతో, ధైర్యంగా అంది, "ధైర్యముంటే వెళ్ళి దూకండి చూద్దాం. చచ్చేవాళ్ళేమీ చస్తానని వూరంతా దండోరా వేసి మరీ చావరు.... " అఖరికి తన భార్య ఆ మాటే నిజం చేసి వెళ్ళి పోయింది.... తల్లి చావు అనేది ఒక హాస్యాస్పదమైన వాడుక మాటైపోయింది. బ్రతికి నన్నాళ్ళు చావు మాటల్ని పట్టుకు వేళ్ళాడిన ఆమెకి అటు బ్రతుకులోని సుఖమూ దక్కలేదు. చావులో ప్రశాంతతా దొరకలేదు. బ్రతికి నన్నాళ్ళు 'చావు' 'చావు' అని గొడవ చేసే అమ్మ చనిపోయే రోజున బ్రతుక్కోసరం ఏడుస్తుంది.

తమ్మొడక్కడే కూర్చుని అంచనా కట్టాడు. స్టేషన్‌లోని తను ఇంటి నుంచి పట్టాల దాకా వెళ్ళడానికెంత సమయం పడుతుంది ? అవాళ ఆమె వెళ్ళడానికి బండి రావడానికి సమయమెలా కుదిరింది ? అమ్మ తిట్టినప్పు డామె కళ్ళల్లో నీళ్ళు నిండి వుండాలి. కళ్ళు మసకబారి ఆ రోజు దారెందుకు తప్పలేదు. ? పగటి వేళ కూడా ఎన్నో సార్లు తను పట్టాలు దాటబోయి సిగ్నల్ తంతి అడ్డుపడి తూలిపోలేదా ? ఆ తీగ ఆమె నడక వేగాన్ని ఎందుకు తగ్గించలేదు ? చీకటంటే భయపడే ఆమె ఆ రోజు ఎలా ధైర్యంగా వెళ్ళింది ? ఏ ప్రశ్నకీ జవాబే లేదు. కాని జరగాల్సిందేదో జరిగిపోయింది.

భార్య జ్ఞాపకాలతో తమ్మొడి మనసంతా కెలికినట్టు అయింది. కానీ ఏడుపు రాలేదు. కాలిపోయిన భార్య చితిలో అతని ఏడుపూ బూడిదైపోయినట్లుగా అనిపించింది. తండ్రి, తల్లి, చెల్లాయి, తను వీళ్ళల్లో ఎవరికీ కూడా పరస్పరం సంబంధం లేదు. అనివార్యంగా ఒకరు మరొకర్ని నమ్ముకుని అలవాటు చేసుకుని ఒక చోట కలిసివున్నాం. అతనికి సర్కస్‌లో పైన వేలాడే ఉయ్యాలల్లోంచి ఒకదానిమీద నుంచి మరొకదాని మీదకి గెంతే ఆటగాళ్ళ గుంపు గుర్తువచ్చింది. వాళ్ళల్లాగ తామూ ఒకర్నొకరు నమ్ముకుని వుండాల్సిన

అవసరం ఏర్పడింది. ఒకరి బ్రతుకు మరొకరి మీద, అందరి బ్రతుకు ఒకరి మీద ఆధారపడింది. ఈ సూక్ష్మాన్ని అలక్ష్యం చేసి ఒక్క క్షణం స్వాతంత్ర్యాన్ని కోరుకున్న భార్య నిలదొక్కుకో లేక తూలి క్రింద పడిపోయింది. ఇప్పుడు చెల్లాయి వేలాడుతోంది. తనూ చెయ్యి వదిలేస్తే ఒక్కరొక్కరుగా అందరం నేల మీద పడిపోతాం. కాని, చెల్లాయికి తన మీదే మేమందరం ఆధార పడివున్న సంగతి తెలియనే తెలీదు. ఆమె కిప్పుడు ఆలోచించే శక్తి అసలు లేదు కదా. తనకి నయమై మాములు మనిషైతే అందరం ఎవరిదారిన వాళ్ళం! వెళ్ళిపోయేవారమే. తండ్రి ఇంకెన్నో రోజులు ఇంటిని నమ్ముకుని వుండబోరు. తనకైనా ఆ ఇంట్లో ఏమి ఆకర్షణ వుంది గనుక! చెల్లాయి జబ్బు నయం కాకపోవడంలోనే ఇంటి మర్యాద నిలిచే అవకాశం వుంది. ఆమెకి నయమైతే ఇంటి మర్యాద మంట కలిసిపోతుంది. అందరూ, ఒకరికొకరు దూరమైపోతారు.

ఎండ వేడిమి విపరీతంగా వుంది. ఒంటి మీద చెమట కారిపోతోంది. ఆకలితో నిస్త్రాణగా వున్న తమ్ముడికి నిద్ర పట్టినట్టుగా అయింది. కాని అది నిద్ర కాదు. కూర్చున్నవాడలాగే గోడకి ఆనుకుని కూర్చున్నాడు. ఆ పక్కగా కూర్చున్న వాళ్ళు తమలో తామే మాట్లాడుకుంటున్నారు. " అయ్యా మీరేమైనా అనండి, మఠంలో మునుపటి వైభవం ఇప్పుడేమీ మిగల్లేదు. మఠం ప్రతిష్ఠ రాను రాను తగ్గిపోతోంది."

"అదేమిటలాగ సెలవిస్తున్నారు? రాయుల వారి మహిమ ఇప్పుడు సర్వ వ్యాప్తంగా వుందికదా! నానా ప్రాంతాల నుంచి విభిన్న భాషల వారంతా కూడా అసంఖ్యాకంగా వస్తున్నారే".

"రాయుల మహిమ గురించి చెప్పలేదు నేను మఠం మహిమ గురించి చెపుతున్నాను. స్వాముల వారు ఇక్కడున్నపుడు బహుశ మీరు వచ్చి వుండరు. ఏమి అన్న సంతర్పణ చేసే వారనుకున్నారప్పుడు! నెల రోజులు మఠంలో భోంచేసినా ఎవరికీ అడిగే ధైర్యం వుండేది కాదప్పుడు. ఇప్పుడుంటారా, నాలుగు రోజులు వరుసగా భోంచేస్తే చాలు, వడ్డన చేసే వాళ్ళు కూడా మన వేపు అదోలా చూట్టం మొదలెడతారు. అప్పటి వంటకాల రుచి ఎలా వుండేదని! 'రాయులవారి మఠం సాంబారు' లాగ అనే నానుడి మా వేపు బాగా ప్రసిద్ధి. పొద్దున్న భోంచేస్తే సాయంత్రం దాకా మసాలా ఘాటు పోయేది కాదు. అలా చూస్తే ఇప్పుడు మఠం వ్యవస్థ చెడిపోయింది. ముఖ్యంగా సాంబారే మొదటిలా కుదరటం లేదు."

"అయితే మఠం మహిమకూ భోజనానికి ఏమి సంబంధం?"

"నేను చెప్పేది మీకు బాగా అర్థమైనట్లుగా లేదు. జనం ఒక మఠపు

యోగ్యతకి వెల కట్టేది ఆ మఠం నిర్వహించే అన్న సంతర్పణ చూసే కదా! ఉడిపి శ్రీకృష్ణుని సన్నిధానంలో రెండు పూటలా భోజనం వుంటుందట. ఎంతటి పుణ్యాత్ములు వాళ్ళు! ముఖ్యంగా కలికాలం వచ్చింది అన్నివేపులా అన్న సంతర్పణ తగ్గిపోయింది."

మంగళ హారతి పిలుపు అందర్ని తట్టి లేపింది. తమ్ముడు అక్కడే లేచి నుంచున్నాడు. దూరంలో తండ్రి పరుగున వచ్చి అక్కడున్న జన సముదాయంలో కలవటం అతనికి కనిపించింది. ఆచార్యుల వారి మంత్ర ఘోష దేవాలయంలో ప్రతి ధ్వనిస్తోంది. మంగళ హారతి వెలుగులో మెరుస్తున్న అనంత జ్యోతుల దీప్తిలో కళ్ళు క్షణమాత్రం మసక బారినట్లయి, ఆ తీవ్రత నుంచి వెలువడ్డ వేడికి తమ్ముడి వొళ్ళు చమట పట్టేసింది. భార్య చితి దగ్గర నుంచున్నప్పుడు గాలి తీవ్రతకి చితి వేడిమి ఇతని శరీరానికి తాకి ఇలాగే అయింది. మంగళహారతి చేసిన వత్తులన్నీ కాలి మసి వాసన వస్తోంది. నిప్పులో దర్భలు, నెయ్యి, అన్నం వేస్తే ఇలాంటి వాసనే వస్తుంది. తమ్ముడు కళ్ళు పెద్దవి చేసి బృందావనం ఎదుట వర్తులాకారంలో చలిస్తున్న జ్యోతుల్ని నిశ్చలంగా చూస్తున్నాడు. జేగంటలు కర్కశంగా చప్పుడు చేస్తున్నాయి. (జనం ముందుకి తోసుకు వస్తున్నారు. బృందావనం వేపుకి జరుగుతున్నారు, తమ్ముడు నిశ్చలంగా అలాగే నుంచున్నాడు.)

× × ×

మంగళ హారతి వేళకు స్త్రీల గుంపులో తల్లి చిక్కుకు పోయారు. విపరీతమైన సందడి, తోక్కిసలాట ఎవరో కాలు తొక్కారు. కోమటి స్త్రీ ఒకామె దూసుకొచ్చి ఆమెని తాకింది. ఇంతవరకూ మడిగా వుండి తీర్థం ఇచ్చే వేళకి మైలబడ్డాం ఎంతటి ప్రారబ్ధం! తలకి తల తగిలేటంత ఇరుగ్గా వున్నారు జనం. మెడవిరిగేలా తలలు పైకెత్తి చూశారు. కాని రాయుల దర్శనం కాలేదు. నల్లటి తలలు కళ్ళెదుట నిలచి కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి. గంటల చప్పుడు వినిపించినట్లవుతోంది. కాని బృందావనం అసలు కనిపించటం లేదు.

ఈ గొడవలో చెల్లాయి అమ్మ చేతిని విడిపించుకు వెళ్ళిపోయింది. బయట కొచ్చి వేప చెట్టు క్రింద రాశిగా పడ్డ ఎండుటాకుల్ని కెలుకుతూ కూర్చుంది. కొంచెం కూడా మబ్బులేని ఆకాశం ఎండ వేడిని విరజిమ్ముతోంది. ఆ ధ్యాసే లేని చెల్లాయి ఆకాశం వేపు నిర్వికారంగా చూస్తూ కూర్చుంది. ఎదురుగా ఎండకి వేడెక్కిన బండరాళ్ళతో ఎగుడుదిగుడుగా వున్న దారి తిన్నగా నది వేపుకి వెళుతుంది. గాలి తెర కూడా లేకుండా ఎండకి కాగుతున్న నది పొగలొస్తుట్టుగా వుంది. చెల్లాయి తటాలున పైకి లేచింది. అక్కడ పడి వున్న అరటి పళ్ళ

తొక్కల్ని తీసుకుని కాస్త దూరంలో నీడలో పడుకుని వున్న కుక్కకి తినిపించబోయింది. అప్పుడామెకి హఠాత్తుగా గుర్తువచ్చింది తనకే ఆకలేస్తోందని. ఆ తొక్కల్ని తీసుకుని తినాలనుకునే లోపలే ఆ సంగతి మర్చిపోయింది.

చెల్లాయికి ఈమధ్యన ఏమీ గుర్తు వుండటం లేదు. ఒకసారి రెండు ప్రపంచాలలో వ్యవహరిస్తున్నట్టుగా వుంటుంది. తన చుట్టూ వున్న వాస్తవిక ప్రపంచపు వ్యవహారాలు ఒకసారి నీరసంగా అనిపిస్తే, మరోసారి విలక్షణంగా అనిపిస్తాయి. ఈ ప్రపంచంలో వుండి మరో ప్రపంచంలోకి ఎగిరిపోయి, అంతరాళాల్లో విలవిల్లాడుతున్నట్టు భయానకమైన వూహ కలుగుతుంది. చీకట్లో చుక్కలు వ్రేలాడినట్లు, కళ్ళెదుట చీకటి ప్రవహించి అందులో వెలుగు అణువులుగా రకరకాల ఆకారాల్ని పొందినట్టుగా వరుసగా కనిపించి మాయమవుతున్నై. వెయ్యి మొహాలు తొక్కిసలాటలో తూలుతూ, పడుతూ అస్తవ్యస్తంగా కనిపిస్తూ ఆమె మనస్థిమితాన్ని అస్తవ్యస్తం చేస్తున్నాయి. ఒక్కసారిగా ఇలా ఎందుకయిందో, ఏమిటో ఆమెకేం తెలియదు. ఆలోచించే శక్తి ఏమీ లేదామెకిపుడు. కళ్ళెదుట కనిపించిన దాన్ని, మనో ఫలకం మీద గోచరించిన దాన్ని చిన్న పిల్లలు సినిమా చూస్తూ కూర్చున్నట్టు - అర్థం కాకున్నా నిస్సహాయురాలిలా చూస్తూ కూర్చునేది.

వదిన చనిపోయినపుడు అమ్మ, నాన్న, అన్నయ్య అందరూ ఏడ్చారు. ఆ సంగతి గుర్తువస్తే ఇప్పటికీ నవ్వొస్తుంది. పెద్దవాళ్ళేడిస్తే ఇంత విచిత్రంగా వుంటుందన్న విషయం అనుభవానికి రావడం ఇదే మొదటి సారి. తల్లికి కంఠం పెగలక రొప్పుతో కూర్చుంది. తండ్రి కంఠం ఏడుపుకి నప్పదు. ఏడ్చినప్పుడు మొహం వికారంగా కనిపిస్తుంది కూడా. ఆ రోజు నాన్నని ఏడవకు అని ఖచ్చితంగా చెప్పెయ్యాలని పించింది. కాని ముక్కలు ముక్కలుగా పడున్న వదిన దేహం దగ్గరికి వెళ్ళే ధైర్యం లేకపోయింది. గార్డు చేతిలోని దీపపు వెలుగులో వదిన దేహాన్ని ఛిన్నం చేసిన ఇంజన్ చక్రం మెరిసింది. చనిపోయే నిస్సహాయ క్షణాల్లో వదినకి వేగంగా తిరిగే ఆ చక్రాన్ని గట్టిగా కౌగలించుకోవాలని అనిపించిందేమో.

తీగ మీద అంతరాళంలో తిరిగే పెద్ద ఒంటి చక్రం సైకిలు చెల్లాయి కళ్ళెదుట కనిపించింది. తను చూసిన సర్కస్ గుర్తువచ్చింది. ఆ ఒంటి చక్రం సైకిల్ నడిపే స్త్రీ ఏ కొంచెం తూలినా తీగ మీద నుంచి నేల మీద పడిపోతుంది. రంగురంగుల దీపాల వెలుగులో ఉన్మాదకరమైన బ్యాండ్ సంగీతపు లయకి తగ్గట్టుగా గుర్రాలు వర్తులంగా విసుగు - విరామం లేకుండా తిరుగుతుండేవి. సర్కస్‌లో సింహాన్ని

చూసినపుడు చెల్లాయికి భయం వెయ్యలేదు. ఆటాడించే నెపంతో దాన్ని పెట్టి చిత్రహింసలకి సింహం రెచ్చిపోయేది. కాని కొరడా దెబ్బలతో తల్లడిల్లి, పంజరం వేపు వెళ్ళిన సింహం హఠాత్తుగా వెనుదిరిగి ప్రేక్షకుల మధ్యకి వచ్చినపుడు మాత్రం చెల్లాయి భయంతో బిగుసుకుపోయింది.

ఇలాగ జరిగిన సంఘటనలు కొన్ని ఆమెని ముట్టడించి, దొంగాటలో పిల్లలంతా దొంగ చుట్టూ చేరి తమని ముట్టుకోమని పిలిచినట్టుగా, ఆమెని నాలుగు వేపుల్నుంచి ఆహ్వానించాయి. మఠం దూరంగా ఎక్కడో వెనకాల వుంది. మంత్రించిన విభూతి పెట్టి వెళ్ళే సన్యాసిని వెంబడించినట్టుగా చెల్లాయి జరిగిన సంఘటనల వెంటబడి నడిచి వెళ్ళిపోయింది. సగం దారి నడిచి వచ్చి నదిని సమీపించింది. బండరాళ్ళు పెనంలా కాలివున్నాయి. చెల్లాయి అడుగు వెయ్యలేక తకతక గెంతి ఫక్కుమని నవ్వింది. కాని కాళ్ళు కాలడంతో నొప్పి భరించలేక గొంతెత్తి చిన్న పిల్లలా ఏడవసాగింది. తనెక్కడికి వెళ్ళాలన్నదీ తెలియ లేదామెకి. ఎదుట నది అడ్డంగా నుంచుంది. వెనుక దూరంగా మఠం గోడలే ఎత్తుగా, భవ్యంగా నుంచుని ఆమెని వెనక్కి పోనివ్వటం లేదు. ఆ నీరదతలో అస్తవ్యస్తంగా పడున్న కరాళమైన రాళ్ళు అన్నీ ఒక్కసారిగా ఆమె మీదకి దూకుతున్నట్లుగా అనిపించింది. కెవ్వుమని అరుస్తూ నీళ్ళ వేపు పరుగు పెట్టింది. వెనకాల నాలుగు వేపులా బండరాళ్ళు చేతులు కట్టుకుని ఆమెని చుట్టుముట్టే ప్రయత్నంలో వున్నాయి. వాటిని తప్పించుకుని ముందుకి వెళ్ళాలంటే నీళ్ళు. చెల్లాయి బెదిరిపోయింది. రెండు చేతులతో తలని గట్టిగా పట్టుకుని ఆకాశం వేపు తిరిగి ఆక్రందనం చేసింది.

మఠంలో తీర్థ ప్రసాదాల వినియోగం అయింది. భోజనాల ఏర్పాట్లు జరుగుతున్నాయి. స్త్రీలు, పిల్లలు తమతమ ఆకుల ముందు కూర్చోడానికి హడావుడి పడుతున్నారు. కమ్మటి సాంబారు వాసన ఆ ప్రదేశాన్ని ఆవరించింది. వరుసగా ఆకులు వేశారు. ఆకుల్లో పాయసం, గుమ్మడి కాయ కూర, అన్నం, సాంబారు వడ్డించడం అయింది. తండ్రి, తమ్ముడు పురుషుల వరుసలో కూర్చున్నారు. తండ్రి గంధం రాసుకోవడం అయింది. ఇక భోజనాలు ప్రారంభించడానికి ఆచార్యులవారు కృష్ణార్పణమస్తు అనటం ఒకటే బాకీ వుంది. అక్షత రాసుకోవడానికి తండ్రి మొహం పైకెత్తినపుడు, తన ఎదుట వచ్చి నిలుచున్న తల్లి కనిపించారు. మొహం తెల్లగా పాలిపోయింది. ఆవిడ రొప్పుతూ మెల్లిగా అంది, "చెల్లాయి మఠంలో లేదు ఎక్కడికో వెళ్ళి పోయింది."

తండ్రి భోజనం ముందు నుంచి లేచిపోయారు. తల్లి, తమ్ముడు ఇద్దరూ ఆయన్ని వెంబడించారు. అందరూ కలసి అటు - ఇటు వెతికి నదివేపు

పరిగెత్తారు. అక్కడ చూస్తే చెల్లాయి బండ రాతికి తల కొట్టుకుని నిశ్చేతనంగా పడివుంది.

ఎండ మండిపోతోంది.
గాలికి వూపి రాట్టం లేదు.
కాని చెల్లాయికి ఇంకా వూపిరాడుతోంది.

× × ×

"చెయ్యి గట్టిగా పట్టుకో వదలకు. గొడవలో తప్పిపోతావు అంటూ కూతురి చేతి పట్టుకుని మరింత బిగించింది తల్లి. చెల్లాయి ఉత్సవం కోసం అక్కడ చేరిన జనసమూహాన్ని ఆశ్చర్యంతో చూస్తోంది. మఠం ఎదుట మైదానంలో వరుసగా అంగళ్ళు తెరిచారు. ఏదీ కొనాలనుకోక పోయినా వుట్టినే ఏదో ఒక కొట్టు ముందు కెళ్ళి నుంచోవాలనిపించింది తనకి. చెల్లాయి ఇవ్వాళ మంచి ఉత్సాహంగా వుంది. వెనుకటి మ్లానత తగ్గి శరీరమంతా ఉత్సాహంతో నిండిపోయింది. తండ్రి, తమ్ముడు వీళ్ళు వెనకాలే వస్తున్నారు. తండ్రికి తామందరూ బయలుదేరిన తీరు కొత్తగా అనిపించింది. కొంచెం సంకోచంగా కూడా వుంది. అలాగ అందరూ కలిసి ఒకర్నొకరు తాకుతూ కుటుంబం అంతా బయట కెళ్ళడం చాలా అరుదు. ఒక్క క్షణం ఆయనకి అభిమానంగా అనిపించింది. తృప్తిగా అనిపించింది. తామందరూ బ్రతుకులో ఇలా కలిసి వుండుంటే తమ జీవితం ఎలా వుండి వుండేది! అని కలలు కంటూ ఆయన ముందుకి నడిచారు. తమ్ముడు ఆ సందడిలో వెనుక పడుతున్నాడు. అతను వచ్చే దాకా ఆగి అతడి చెయ్యి....పట్టుకుని ముందుకి సాగారు తండ్రి. కాని ఆయనకి చాలా నీరసంగా వుంది. ఆ జనం మధ్య జాగ్రత్తగా నడిచే శక్తి తనకి లేదని ఆయనకి అర్థమైంది. ఎందుకంటే జనం ప్రవాహం అలా ముందు కొచ్చి ఆయన్ని తోసుకు వెళ్ళిపోతున్నారు. తల్లి మొహం కోపంతోనే తాత్సారంతోనే ముడుచుకుంది. జనం తోసుకోడం, వచ్చి మీద పడడం వీటి నుంచి తప్పించుకోటం ఎలాగో బోధ పడలేదామెకు. కూతుర్ని దగ్గరకి తీసుకొని ఎంత ముడుచుకు పోయి నడుద్దామన్నా జనం వచ్చి కుమ్మేస్తున్నారు.

ఆకాశంలో మబ్బులు కమ్మాయి. వేల మంది భోజనం చేసి ఆకులు తీసే వాళ్ళు లేక అలాగే నది వొడ్డున పడివున్నాయి. రథోత్సవపు దర్శనం కోసం జనం మఠం ఆవరణలో క్రిక్కిరిసి వున్నారు.

ఆ నలుగురు ఆ తొక్కిసలాటలోంచి ఎలాగో దారి చేసుకుని గుడి మహా ద్వారం దాకా వచ్చి చేరారు. తమ్ముడికి రెండు రోజులుగా ఈ గొడవ భరించి విసుగొచ్చింది. మరొకరి చమట కంపు వాంతి తెప్పిస్తోంది. సింహద్వారపు మెట్ల మీంచి చూస్తే తమ్ముడికి చుట్టూరా తలలే కనిపిస్తున్నాయి. ఆ కోలాహలంలో

చెయ్యి విడిపించుకుని తండ్రిని అతని పాటికి అతన్ని వదిలేసి బయటకి పారిపోవాలన్న కోరిక కలిగింది. ముందుకి వెళ్ళిన కొద్దీ ఆ గుంపులో దారి సన్న బడుతోంది. ఇంకా ముందుకి వెళితే ఆ ఇరుకు దారిలో జనం, గలాభాలో చిక్కుకుని తనూ పచ్చడై పోతానేమో అని భయం వేసిందతనికి. వెనుతిరిగి చూస్తే అక్కడ్నుంచి అంగళ్ళ వరుస కనిపిస్తోం దతనికి. జనం అంగళ్ళ ముందు నుంచి ఈ జన సముద్రంలోంచి వచ్చి చేరుకుంటున్నారు. తమ్ముడికి ఈ ఉత్సవంలో ఏమీ ఆసక్తి లేదు. అతనికిప్పుడు తన భార్య గుర్తువచ్చింది. ఆమెకి మాములు పండుగలన్నా, పబ్బాలన్నా అమిత సంభ్రమం. ఆ సంభ్రమంలో ఆమెకి మరో ధ్యాస వుండేది కాదు. ఓసారి నవ రాత్రిలో వెంకటేశ్వరుడి గుడికి వెళ్ళినపుడు ఆ గలాభాలో చెవి దుద్దు పోగొట్టుకుని వచ్చింది. ఆ సంగతి అమ్మకి తెలియడానికి ఆలస్యం కాలేదు. దాని పరిణామం, ఆమె ఒంటిమీద నగలన్నీ మాయమయ్యాయి. కాని ఆమె చేతిలోని ఉంగరం మాత్రం ఆఖరి దాకా ఆమె చేతికే వుంది. ఆమె చనిపోయిన రోజు అమ్మ కోడలి చెయ్యి పట్టుకుని ఒకే సమంగా రాగాలు పెట్టి ఏడ్చింది. ఆమె చిన్న వేలి వుంగరాన్ని పెద్దవేలికి పెట్టుకోవడంతో అమ్మ చాతుర్యం ఏమి పనికిరాలేదు. ఆఖరికి చుట్టూ జనం చూస్తుండగానే అవుంగరాన్ని లాగి తీసేసుకుంది.

మబ్బులు కమ్మిన ఆకాశం నుంచి ఎక్కడో ఒక సూర్య కిరణం తప్పించుకొచ్చింది. దాని వెలుగులో మొదటే అలంకరించు క్కూర్చున్న రథం మరింత తళతళ మెరుస్తోంది. రథం ఎదుట కాగడా వెలుగుతోంది. ఎరుపు రంగు గొడుగుకి ఆకుపచ్చ దండ అలంకరించారు.

అక్కడ చేరిన వేలాది కంఠాలు నేల అదిరేలా జయజయధ్వానం చేశారు. రథం వూరేగింపు బయలుదేరింది. రథం లాగిన పుణ్యం సంపాదించటం కోసం జనం పడుతూ లేస్తూ ఒకర్నొకరు తోసుకుని రథం వేపు వెళ్ళారు. మరొక్కసారి జయజయనాదం.

ఆ లోపల తమ్ముడి చెయ్యి తండ్రి చేతి నుంచి విడుదల పొందింది. జన సందోహం ఒక్కసారిగా అస్తవ్యస్తం అయిపోయింది. తొక్కిసలాటలో క్రమంగా తండ్రీ, తమ్ముడు దూరంగా తోయబడి ఆఖరికి ఒకర్నుంచి మరొకరు కనుమరుగయ్యారు. తల్లి, చెల్లాయి ఎప్పుడో ఆ ప్రక్షుబ్ధ జన ప్రవాహంలో కలసి పోయారు. తండ్రి నిస్సహాయ స్థితిలో తమ్ముడిని వెతక సాగారు. కాని తమ్ముడిని జన ప్రవాహపు కెరటం ఎత్తి దూరంగా విసిరేసింది. తండ్రి బెదిరి పోయారు. ఆయనకి చేతులు కాళ్ళు ఆడలేదు. దేహం మీద అదుపు కోల్పోయి, తమని తాము ఆ జన ప్రవాహపు వడికి అప్పజెప్పి హతాశులై నిలబడి

పోయారు. తమ్ముడు బహుశః ఇక తమని వెతుక్కుంటూ రాకపోవచ్చు. ఈ చక్రవ్యూహం నుంచి బయటపడే దారి తమకి తెలియదు. తమ్ముడికి ఆ రహస్యం తెలిసిందేమో. కాని అతను ఇంతవరకూ తనతో కలసి వున్నా కూడా ఆ సంగతి అడగాలనే తోచలేదు. ఈ గలాభాలో వాళ్ళిద్దరూ ఎక్కడ కరిగి పోయారో ఎవరికి తెలుసు? చెల్లాయి ఆవేశం ఇవాళ మరీ ఎక్కువగా వుంది. చెయ్యి విడిపించుకు వెళ్ళిందంటే తిరిగి వచ్చే ఆశ ఇక ఎంత మాత్రం లేదు. ఆ రోజు లాగ ఆమె మళ్ళీ నది వేపు పరిగెడితే?

ఢమఢమ ఢమ నగారా చప్పుడు వినిపిస్తోంది. రథం ముందుకి సాగుతోంది. తమ్ముడు జన ప్రవాహానికి ఎదురీది, బయటకి రావల్సి వుంది. బయట పడ్డం అసాధ్యం అని అతనికి తెలుసు. తల్లి - చెల్లాయి సుడిలో చిక్కుకు పోయారు. తండ్రి నది ప్రవాహంలో ఇక ముందుకి వెళ్ళలేక దుర్బలులై దైవం మీద భారం మోపి అక్కడే వుండిపోయారు. వీళ్ళందర్నీ ఈ స్థితిలో వదలిపెట్టి తను బయటపడ్డం మంచిదేనా అన్న సంశయంలో పడ్డాడు తమ్ముడు. జనం వదహతి ప్రబలం కాసాగింది. ఈ ప్రవాహంలోంచి ఎవరూ ఎవర్నీ బయటికి లాగలేరన్న నిర్ణయానికి వచ్చి తమ్ముడు అందర్నీ వదిలేసి తను అక్కడ్నుంచి బయట పడ్డాడు.

దట్టంగా మబ్బులు కమ్మాయి. ఎక్కడ్నుంచో సుడిగాలి చుట్టిచుట్టి వచ్చి మైదానంలో దుమ్ము నంతటినీ మఠం వేపు విసురుతోంది. రథాన్ని అందరూ కలిసి బలంగా లాగుతున్నారు. జనం దిక్కు తెలియక కళ్ళు నలుముకుంటూ అటు ఇటు వెళ్ళిపోవడానికి ప్రయత్నిస్తున్నారు.

రథం దగ్గరికి రాగానే తల్లి చెల్లాయిని లాక్కుంటూ ముందు కెళ్ళారు. చెల్లాయి నుదుటి మీద చెమట బిందువులు పేర్చినట్టుగా కనిపిస్తున్నాయి. ఆమె పెద్ద పెద్ద కళ్ళు మంత్రించినట్టు రథం వేపే చూస్తున్నాయి. ఒళ్ళు గడగడ వణుకుతోంది. ఏదో మత్తులో అన్నింటిని మర్చిపోయి భయంతో రథం వేపే చూస్తూ నుంచుండి పోయింది. రథం ప్రదక్షిణ పూర్తవుతుంది. జనం నుంచున్న చోటి నుంచే తల వంచి నమస్కరిస్తున్నారు. అలంకరించి వున్న వుత్సవ విగ్రహాలు రథం లాగేటప్పుడు వూగుతున్నాయి.

చెల్లాయి రథం వేపు చూస్తూ కెవ్వుమని అరిచింది. "అయ్యో మంటలు, మంటలు! అమ్మా, రథం అంటుకుంది. అటు చూడు! రథం ఎలా భగభగమని మండుతోందో." అమ్మా మంటలు, చెల్లాయి తల్లి చేతిని విదిలించి రథం వేపు పరుగుతీసింది. ఆమె కళ్ళ నరాలన్నీ పటపటమని తెగి నిర్జీవమైనట్టుగా అనిపించింది. రథం లాగ తనూ ఏకశిఖిలా, తప్తంగా, అఖండంగా

మండుతున్నట్టు ఆమెకి వేదన కలిగింది. నుంచున్న నేల ఆమె చుట్టూరా ధిమిధిమి అంటూ తిరుగుతున్నట్టు వుంది. నుంచో లేక తూలిపోతూ ముందు కెళుతోంది. ఆమె ఎదుట రథం జ్వలిస్తున్నట్టుంది. ఆ వెలుగు కళ్ళల్లో పొడుస్తోంది. ఆ వేడికి ఒళ్ళంతా కరిగిపోయి క్రమంగా తన ఉనికే అంతర్ధాన మవుతున్న భావన. గాలి లాగ ఆకారం లేనట్టుగా కనిపించకుండా అయిపోతోంది. నిర్లిప్తంగా అందర్నీ తోసుకుంటూ రథం వేపు పరుగు తీసింది.

తల్లి ఏమీ తోచకుండా నుంచుండి పోయింది. దగ్గరున్న స్త్రీలంతా ఆమెని నోటికొచ్చినట్టు తిట్టారు. పిచ్చికూతురు అశుభం పలుకుతూ రథాన్ని ముట్టుకుని మైలపరుస్తుంటే తల్లిగా వున్న మనిషి అదుపులో పెట్టొద్దా? పిచ్చి కూతుర్ని తీసుకుని ఇక్కడి కెందుకు రావాలి....? మరం ఆచార్యుల వారికి కూడా చాలా అసమాధానం కలిగింది. రథోత్సవపు సమయంలో ఈ అశుభపు మాటలేమిటి? పిచ్చిదయితేనేం? ఇలాంటి శుభ సందర్భంలో రథానికి నిప్పంటుకుందని అరవడ మేమిటి? ఆ పిచ్చిదాన్ని ఆపమని ఆయన కేకేసి చెప్పే లోపల చెల్లెలు రథం చక్రాన్ని గట్టిగా కౌగలించుకుని నుంచుండిపోయింది. చుట్టూ దుమ్ము దుమ్ముగా వుంది. ఒకరి మొహాలొకరికి కనిపించడం లేదు. ఆకాశానికి చిల్లుపడ్డట్టుగా వర్షం కురుస్తోంది. జనం చిందరవందరగా పారిపోతున్నారు. ఇంకాస్త దూరం పోతే రథం తన గమ్యం చేరుతుంది. చెల్లాయి చక్రాన్ని గట్టిగా పట్టుకుని స్మృతి తప్పినట్టుగా వుంది. కళ్ళల్లో ఏకబిగిన నీళ్ళు కారుతున్నాయి. మిగతా జనం జయజయ ధ్వానాలు చేశారు. మళ్ళీ రథం లాగడానికి సిద్ధపడ్డారు.

తల్లి చెల్లాయి కోసం వెతుకుతోంది. తమ్ముడు, తండ్రి ఎవరు కనిపించినా ఇప్పుడామెకి అపరిమితానందం కలిగేది. కాని అందరూ ఎక్కడెక్కడో తప్పించుకున్నారు. ఇక ఎవరికోసం ఎక్కడెక్కడని వెతకడం.... రథపు చక్రం కింద పడితే చెల్లాయి ముక్కలు ముక్కలయి పోతుంది. వర్షంలో, ఈ దుమ్ములో ఆమె కనిపించడాని క్కూడా అవకాశం వుండదు.

తండ్రి ఆవరణ గోడని గట్టిగా పట్టుకుని నుంచున్నారు. హోరున కురుస్తున్న వర్షం నెత్తి మీద నుంచి దిగుతున్నా ఆయన అక్కడ్నుంచి కదిలే ఆలోచన చెయ్యి లేదు. గోడకి తలని, ముఖాన్ని ఆనించి గోడవేపు నుండే ఆకాశం కేసి చూశారు. భవ్యమైన గోడ ఎత్తుగా, కోసుగా ఆకాశంలోకి చొచ్చుకు పోయినట్టుగా కనిపిస్తోంది. గోడనుంచి కిందకి దిగుతున్న వర్షపు నీటితో, ఎర్రమట్టి పట్టీలు కలసిపోయి రక్తపు చారికల్లా మెరుస్తున్నాయి. గోడంతా తడిసి మట్టివాసన వేస్తోంది. తండ్రి మళ్ళీమళ్లీ నాలుకతో గోడని నాకసాగారు.

ఆకలేస్తోంది, నీరెండి పోయింది. వర్షపు నీరు ధారాపాతంగా నెత్తి మీద పడుతోంది. గోడవతల సగం తిని వదిలేసిన వేలాది ఎంగిలాకులు, తినేవాళ్ళు లేక పడున్నాయి. తండ్రికి ఆయాసంతోనే, విసుగుతోనే కనురెప్పలు మెల్లిగా మూత బడసాగాయి. నెమ్మదిగా ఆనుకుని నుంచున్న గోడ నుంచి జారి, క్రింద కూలబడి పోయారు.

రథం లాగుతున్న వాళ్ళ చేతులు పీక్కు పోతున్నాయి. బయలు దేరిన రథం ఒక్కసారిగా బురదలో కూరుకుపోయినట్టుగా ఆగిపోయింది. అందరూ జయజయధ్వానాలు చేసి మళ్ళీ సన్నద్ధులయ్యారు. ఎదురు వర్షం ఆ వేగంతో మొహానికి, కళ్ళకి కొడుతుంది. పుట్టుగుడ్డి వాళ్ళలా జనం రథాన్ని తిన్నగా లాగుతున్నారు. జంతువుల్లా సర్వ శక్తిని పణంగా పెట్టి శ్రమిస్తున్నారు. రథం కొంచెం కూడా కదలటం లేదు. చక్రం కింద ఏదైనా పడుండచ్చు. లేదా చక్రం నేలలో కూరకుపోయి వుండాలి.

తల్లి వొళ్ళంతా తడిసి ముద్దయింది. చాలాసేపు ఆమె చుట్టూరా పరికించి చూశారు. కాని చెల్లాయి ఎక్కడా కనిపించలేదు. రథం ఎప్పుడో ఆగిపోయింది. ఆగకుండా కురుస్తున్న వర్షం వల్ల నది నిండుగా ప్రవహిస్తోంది. తల్లి నదివేపు పరుగులు తీశారు.

కట్టకున్న చీర ఒంటికి అతుక్కుపోయి తపతప కొట్టుకుంటుంది. నిర్జనమైన వీధిలో బహుశః అది ఎవరి దృష్టిలోనూ పడదు. తొందరగా నడుద్దామంటే మాటిమాటికి కాళ్ళు తడబడుతున్నాయి. వీధిలో పడిన నీరు నదివేపు ప్రవహిస్తోంది. ఎంగిలాకులు అస్తవ్యస్తంగా పడి వున్నాయి. అరటి దొప్పలు పడవల్లా తేలుతూ నది వేపు సాగిపోతున్నాయి.

ఎంగిలి, అంట్లు తొక్కుకుంటూ తల్లి నదివేపు పరిగెడుతున్నారు.

# 17. రాముడి సవారి సంతకెళ్ళింది

**కే. సదాశివ**

"వినిపించిందా పార్వతీ, తొందరగా కాస్త కాఫీ కషాయం పెట్టు చూద్దాం. సంత అనైనా అబుబ్యారి (సేటు) వస్తాడేమో, డబ్బు ఇవ్వాలన్న ధ్యాస లేకపోయినా పనికి మాలిన కబుర్లు చెప్పడానికేం! ఈ బ్యారి, పర్బుల సావాసం నీకు వద్దయ్యా అని చెప్పాను నేను. కాని ఆ అచ్యుతయ్య వదిలిపెడితే కదా, మధ్యవర్తిగా వుండి డబ్బులిప్పించాడు. ఇప్పుడదే అచ్యుతయ్య....

తాతయ్య సంత పేరెత్తగానే రాముడు థకథక గెంత సాగాడు అప్పుడే వాడి ఒత్తిడి మొదలైంది. పార్వతి కొంగు పట్టుకునే తిరిగాడు. "అమ్మా, అమ్మా అని నాలుగుసార్లు మెడ నిక్కించి అడిగాడు. "ఏమిటి బాబు నువ్వు, తెల్లారగానే గొడవ...." అంటూ విసుక్కుంటూనే కుంపటి మీద కాఫీకి నీళ్ళు పడేసింది.

లోపలి గదిలోంచి పార్వతి తల్లి కల్యాణికి కుతూహలంగా "ఏమిటి పార్వతీ, ఏమిటట బాబు గొడవ? ఎందుకు తిడుతున్నావు? ఇవాళ సంతకదా పంపించరాదా? ఆ శణయ్ పిల్లలెలాగూ కొట్టు పెట్టడానికి వెళతారు కదా - వాళ్ళతో వెళ్ళొచ్చు కదా. ఈయనా అటే వెళతారు. వచ్చేటప్పుడు బాబుని తీసుకు రమ్మంటే కాదనరు కదా అంది.

రాముడు సంతోషపడ్డాడు. ఒక్క గంతులో మామ్మ గదిలోకి పరుగు తీశాడు. ఆమె అతన్ని ఓదారుస్తూ "సరె,సరె, అలాగే నాన్నా, వూరుకో మరి! మీ అమ్మకి చెబుతాగా, నీకు నీళ్ళుపోసి పంపమని." అనడం పార్వతికి వినిపించింది. అక్కడ్నించి మళ్ళీ అమ్మ కాళ్ళ దగ్గరకే పరుగెత్తు కొచ్చాడు. "అమ్మా అమ్మా" అంటూ గునిశాడు. "సరే, బాబూ, కాని నన్ను కాఫీ అయినా కాచనిస్తావా లేదా? మళ్ళీ నాన్న పొద్దయిందని కోపగిస్తారు". అంది విసుగ్గా. రాముడు పడగ్గదిలోకి దూసుకు పోయాడు. కుర్చీ పీట గోడ వేపు తోసి దాని మీద నుంచుని, నిక్కి పైనున్న తన గుడ్డలు లాగడానికి ప్రయత్నించాడు. పీట జారి వెల్లికిలా పడ్డాడు. పై నుంచి గుడ్డలన్నీ వాడి మీద పడ్డాయి. 'హెూ' అన్న అరుపుకి పార్వతి, మంజయ్య పరిగెత్తుకుంటూ వచ్చారు. కల్యాణి పడుకున్న చోటినుంచే నాలుగు సార్లు నీరసపు గొంతుతో అడిగింది. ఏమయిందని, "నాకు చావైనా రాదు. వీడితో పడలేను" అని విసుక్కుంటూనే పార్వతి రాముణ్ణి పైకి లేవనెత్తింది. లేసి ముడ్డి మీదొకటి ఇచ్చుకొంది. "ఎందుకమ్మా, పార్వతీ వాణ్ణలా కొడతావ్? చిన్న పిల్లలకేం తెలుస్తుంది. చెప్పు!" అని తాతయ్య అమ్మతో అనేసరికి రాముడు మళ్ళీ పుంజుకుని రాగం తియ్యసాగాడు. గదిలోంచి కల్యాణి ఏమయిందని అడుగుతూనే వుంది. "ఏం లేదుగాని నువ్వూరికే పడుకో

కూడదూ" అన్నారు మంజయ్య గారు.

రాముడి స్నానం అయిందనిపించారు. ఆకలి అన్న రాగమాలిక ప్రారంభం అయింది. ముందు రోజు చేసిన అన్నం కెరడు కొద్దిగా మిగలటం తన అదృష్టం అనుకుంది. రెండు మూడు కడులు వాడి చేతిలో పెట్టింది. పూర్తిగా తినేటంత తీరికెక్కడ, నోట్లో కొంత పెడితే, మొహానికి కాస్త పూసుకుని అమ్మ చేత తిట్టించుకోవడమూ అయింది.

ఊళ్ళో దిబ్బమీద వున్న బడికి వారానికొక్క రోజే శెలవు. అదీ ఆదివారం కనుక బడికెళదాం రమ్మని పీడించే పాండు మొహం సీతు గొడవలేదు. మరి ఆ రోజే సంత మైదానంలో సంత పెడతారు. బడిలో బల్లల మీద కూర్చుని అ, ఆ, ఇ, ఈ, లు దిద్దడం కన్న సంత కెళ్ళడం సరదాగా వుండదా మరి!

మంజయ్య పార్వతి ఇచ్చిన కషాయం తాగి చెప్పులు తొడుక్కుని బయలుదేరారు.

పార్వతి మళ్ళీ రాముడి డ్రెస్సు సరిగ్గా వేసింది . రాముడికేదో గుర్తు వచ్చి ఆమె నుంచి విడిపించుకుని అమ్మమ్మ గదిలోకి పరిగెత్తాడు. "ఏమిటి, బాబూ, ఏం కావాలి? దేనికోసం దిండు కింద చెయ్యి పెడుతున్నావు?" అనడం వినిపిస్తోంది. "వస్తావా, రావా నువ్వు? ఇంకా, అవుకి కుడితి పెట్టాలి. నువ్వు ఆ సంతకో పంతకో వెళితే గాని నాకు పని తెమలదు" అంటూ, పిలిచింది పార్వతి. మొహం ఇంత వెడల్పు చేసుకు వచ్చాడు బయటికి. లాగు జేబు ఇంత లావుగా వుంది - చిన్న కప్పను మింగిన పెద్ద కప్పలా. "ఏమిట్రా, జేబులో" అంటూ చెయ్యి పెట్టింది. నవ్వొచ్చింది, ఒకటో రెండో గోలీలు, తాతయ్య ఖాళీ నశ్యం డబ్బీ. అందులో టణటణమంటూ కణికి ముక్కలు. మేకులేని బొంగరం. రేకు బూరా, ఇదెక్కడిది?" అంది. "అప్పూ ఇచ్చాడు అన్నాడు. అహా, అప్పూ ఇచ్చాడా నువ్వే ఎత్తుకొచ్చావా?" అని తిట్టింది. "లేదమ్మా, వాడే ఇచ్చాడు" అంటూ ఒకసారి వూది జేబులో వేసుకున్నాడు. "ఏం, పాడో" అని గొణుగుతూ నుదుటి మీద పడుతున్న జుట్టు సర్దుతుంటే శబై ఇంటి అప్పూ రానే వచ్చాడు. సంతకి తీసికెళతావు కదూ, అనడిగింది. "అందుకేగా వచ్చింది" అన్నాడు అప్పు.

ఇద్దరూ బయలుదేర బోతుంటే, పార్వతి రొంటిన వున్న పైసలు తీసి ఒక్కొక్కరి చేతికి రెండు రెండు కాణీ లిచ్చింది. "నూనె, వస్తువు లేమీ కొనిపెట్టకు రాముడికి". అంది "సర్సరె" అన్నాడు అప్పు. రాముడి చెయ్యి పట్టుకుని అరుగు మీదికి వచ్చాడు.

మొత్తం మీద సుమారు పది గంటలకి రాముడి సవారి తన కన్నా పెద్దవాడైన

జతగాడు అప్పూతో కలసి సంతకి బయలు దేరింది. ఈ మధ్యనే పెరదూరి నుంచి వచ్చిన మంజయ్యగారి అక్క కావేరమ్మ కొనిచ్చిన పంప్ షూ వేసుకున్నాడు కాళ్ళకి. మైసూర్ చక్స్ చడ్డీ, మఖమల్ కోటు, కోటు కాలర్ మూసేలా చొక్కా కాలర్ జరీ పని చేసిన టోపీ తల మీద జేబులో కాణీలు రాముడి ఆనందాని కంత కన్న ఎక్కువేం కావాలి?

సంత బజారు దగ్గరపడిన కొద్దీ వాళ్ళిద్దరి ఉత్సాహానికీ మేర లేకపోయింది. "రామూ సంతలో నీకేమేం కావాలో ముందుగా చెప్పు. మళ్ళీ అక్కడికెళ్ళాక గొడవ చెయ్యొద్దు పోయిన సారిలా". అంటూ అప్పూ హెచ్చరించాడు. రాముకి అక్కర్లేని దేది? మిఠాయి, జిళ్ళు, కడ్డీలు - ఇవి కానే కావాలి. వీలైతే కామత్ గారి కొట్లో తీపి గోరీలు - అమ్మకి తెలిస్తే, అయితేనేం అప్పూ ఇప్పిస్తాడు. పోయినసారి కూడా ఇప్పించాడు. కామత్ కొట్లో మరో ఆకర్షణ కూడా వుంది. పెద్ద పాత్రలో కొణకొణ చప్పుడొస్తుంది. అది వినడానికెంతో బాగుంటుంది. కాని ఆ గిన్నె ఎందుకలా చప్పుడు చేస్తుందో తెలియక ఆశ్చర్యం కూడా. ఒకసారి అప్పూని అడిగాడు. గిన్నెలో నీళ్ళుంటాయి కదా, అందులో బిళ్ళ వేసుంటారు అన్నాడతను. "ఎందుకు వేస్తారు?" అంటాడు రాము. ఎందుకో అప్పూకీ తెలీదు. కాని రాముడి ముందు తన అజ్ఞానాన్ని బయట పెట్టుకోలేదు కదా! "నువ్వింకా చిన్నవాడివి కదా!" పెద్దవాడయ్యాక నీకే అర్థమవుతుంది లే అని, రాముడు తన కన్న చిన్న వాడన్న సంగతి గుర్తు చేసి వాడి నోరు మూయించడానికి ప్రయత్నించాడు. "పెద్ద వాడంటే నీ అంత అవ్వాలా?" అంటే, "అవును, నువ్వు నోరు మూసుకో" అంటూ పెద్దవాడిలా ప్రవర్తించాడు అప్పూ. "నోరు మూసుకుంటేనేం మనసు మూతపడదు కదా!" సంతలో దొరకబోయే యావత్తు పదార్థాల గురించి రాముడు ఆలోచిస్తున్నాడు. దానితో బాటే అదేమిటి? ఇదేమిటి? ఎందుకు? ఎలా? ఎక్కడ్నుంచి, ఇలాంటి ప్రశ్నలు అడుగుతాడు. అప్పూ రాముడి కన్న ఏమంత పెద్దవాడు గనుక రాముడి ప్రశ్నలన్నింటికి జవాబివ్వడానికి? మరోసారి గద్దించాడు కూడా. దానికి కూడా కారణం లేకపోలేదు. రాము వాళ్ళమ్మ రెండేసి కాణీలు ఇచ్చింది కదా! రాముడి కంటే పెద్దవాడైన తనకి ఆ రెండు కాణీలు ఏ మూలకి? ఇంటి నుంచి వెళ్ళేటప్పుడే వాళ్ళమ్మని ఉబ్బేసి అర్థణా బిళ్ళలు రెండు తీసుకున్నాడు. తల్లి నడిగి మరో రెండు అర్థణాలు తీసుకుంటో అడక్కుండానే పోపుల డబ్బాలోంచి మరో రెండు నాణాలు కొట్టేశాడు. మొత్తం ఎంతుందో కూడా చూసుకోలేదు. మొత్తం అన్ని నాణాలూ వాడి లాగు జేబులో గలగల్లాడుతున్నాయి. దీనికెంత ఖర్చు పెడితే సరిపోతుందన్నదే అతని సమస్య. ఒక కాణీతో కామత్ హొటల్లో రవ కేసరి

వస్తుంది. మరీ అడిగితే ఒక పకోడీనే మరొకటో నంచుకోవడాని కిస్తారు. ఇవ్వకేం చేస్తాడు? తమ కొట్లో బెల్లం, సబ్బు అన్నీ అప్పు తీసికెళ్ళడూ! సుగారీ వాళ్ళు ఈసారి కూడా అంగడి పెట్టుంటే చిన్న రాగమాలిక ఒకటి తీసుకోవాలి. ఇలా ఆలోచనల్లో తేలిపోతున్న అతన్ని ఈ పాడు రాముడు అదేమిటి, ఇదేమిటి అని అడిగితే అతనికి కోపం రాదూ?

ఎలాగో మొత్తానికి సంత మైదానానికొచ్చి పడ్డారు. ఎండ ఎక్కువగా వుంది. రాముడికి దాహం వేస్తోందప్పుడే. ఆ మాటే అప్పుతో చెప్పాడు. "అయితే ఓ షరబత్తు తాగుదాం" అని షరబత్తు బండి దగ్గరకి రాముణ్ణి తీసికెళ్ళాడు. అక్కడ చూస్తే ఏముంది? రకరకాల రంగు రంగుల షరబత్ సీసాలు బారులు తీర్చి వున్నాయి. పైన నిమ్మ కాయలు. అటు పక్కన కొయ్, చున్ అని చప్పుడు చేస్తూ సోడా ఇస్తున్న వాడు. "ఏది కావాలి?" అన్నాడు అప్పు. ఏ రంగుది ఇమ్మనాలో తెలియడం లేదు రాముడికి. ఇచ్చేటట్టయితే అన్నీ బాగానే వున్నాయి. "ఏది కావాలో తొరగా చెప్పండి" అంది కొట్టు యజమానురాలు. నేరేడు రంగువే చూపించాడు. ఆమె గాజు గ్లాసొకటి తీసుకుని బానలో నీళ్ళల్లో అద్ది, దానిలో కాస్త బెల్లం పాకం పోసింది. నేరేడు కన్న ఎరుపు రంగు బాగుంది "అది కావాలి" అన్నాడు. "ఏయ్ పిల్లలూ! ఏమిటి మీరు?" అని గొణుక్కుంటూ ఎరుపురంగు నీళ్ళు పాకంలో పోసింది. ఓ చమ్చా సబ్జా గింజలు వేసింది. గ్లాసులో దాన్ని టొణటొణమని చప్పుడు చేసి ముందుకు చాపింది. అటువేపు లావు పాటి అతను ఒకడు రొమ్ము మీద సోడా బాటిల్ పెట్టుకుని బొటన వేలితో నొక్కి టూంయ్‌మని చప్పుడు చేసినపుడు రాముడి దృష్టి అటు మళ్ళాలా? బాటిల్లోంచి నురుగు పొంగి వస్తుంటే "ఇదేదీ వద్దు, అదే కావాలి అనిపించి మొండికేశాడు. "తాగరా బాబూ తీసుకు రావడమే పొరపాటయి పోయింది" అంటూ అప్పూ౨గదమాయించే సరికి విధిలేక ఆమె ఇచ్చిన దాన్ని తాగేశాడు. తాగాడంటే ఏమిటి? సగానికి సగం కోటు మీదే పడింది. కొంత మాత్రమే కడుపులోకి పోయింది. నోరు, గడ్డం, కోటు ముందు వేపంతా ఎరుపు రంగయి పోయింది. కాణీ ఇవ్వండి" అందామె. "ఇవ్వు" అన్నాడప్పూ౨. రాముడికి ఏడుపొచ్చింది. అప్పూ౨కి కోపం రాకుండా వుంటుందా మరి? నువ్వొకడివి అని గొణుక్కుంటూ తన జేబులోంచి డబ్బిచ్చుకుని, రాముణ్ణి బర బర లాక్కెళుతుంటే "బాటిల్లో గోలీ ఎలా వేస్తారు?" అని అడగాలా పాడు రాముడు? నోరుమూసుకుని నడు. అన్నాడప్పూ౨

తరువాత మరో కొత్త ప్రపంచం ఎదురవాలా వీళ్ళకి? "కాశీ పట్నం చూడర బాబూ, కాళహస్తి చూడర బాబూ" అంటూ, గజ్జెల తాళానికి రాగం కలిపి

పాడుతున్న వాడి చుట్టూరా కొంతమంది పిల్లలు నుంచున్నారు. మరి అంత సందడిగా వున్నప్పుడు రాముడి ధ్యాస అటు మళ్ళకుండా వుంటుందా? పిల్లలే కాక కొందరు పెద్ద కాపులు కూడా వాడు చెప్పే పదాలకి నవ్వుకుంటూ నుంచుని వున్నారు. ఆ హడావుడిని చూస్తానని రాముడు హఠం చెయ్యడం ఎంత సేపు? వినకపోతే ఆఖరి అస్త్రం ఏడుపు వుండనే వుంది. అప్పూ రాముడినే కాక, రాముడి సంతానాన్ని కూడా శపించాడు. అలా చూడబోతే అతనికీ దాన్ని చూడాలని వుంది. వెనకోసారి చూశాడు కూడా. అయితేనేం, మరోసారి చూడకూడదని లేదుగా. "సరే నాయనా చూడు", అన్నాడు రాముడితో. రాము రెండు కళ్ళకి చెయ్యి ఓరగా అడ్డు పెట్టుకుని భూతద్దంలోకి తొంగి చూసేసరికి ఆ చిన్న డబ్బాలో ఎంత ప్రపంచాన్ని చూశాడు. ఓహొూహొూ అని నవ్వాడు. అయిపోయింది, ఇక రమ్మంటే వస్తేగా. "ఇంకాస్త, ఇంకొంచెం" అని గెంతడమే. "నడు నడు' అంటూ వాణ్ణి బయటకి లాగి తనూ ఓసారి చూశాడు.

ఇక దాన్ని చూసి వచ్చాక ప్రశ్నల వర్షం కురిపించాడు. డబ్బాలోకి ఆ అమ్మాయెలా వచ్చింది. బొంబాయంటే ఏమిటి? ఇలా అప్పూ ప్రాణం తీశాడు.

మిఠాయి కొట్టు దూరం నుంచే చూశాడు అప్పూ. "రామూ ఈసారి నా మాట విని తీరాలి నువ్వు. మీ అమ్మ ఇచ్చిన కాణీ వుందిగా. దాన్నిటివ్వు. నీకేం కావాలి? బిళ్ళలో, కడ్డీలో, మిఠాయో ఏది కావాలంటే అదిప్పిస్తాను. నువ్వు కాణీ ఇవ్వకపోతే నీకేదీ లేదు. అర్థమైందా?" అని బెదిరించాడు. "సరే" అన్నాడు రాముడు. అని జేబులో చెయ్యి పెట్టాడు. అక్కడ మొత్తం ప్రపంచమే వుంది కదా! గోలీలు గచ్చకాయలు, వగైరా....అందులోంచి కాణీ సులభంగా దొరుకుతుందా? రోడ్డు వారగా నుంచున్నారు. రాము శత ప్రయత్నం చేశాడు, కాణీ తియ్యడానికి. అది దొరక్కపోవడంతో బిళ్ళ లేదని ఘోషించాడు. "ఏమయిందిరా బాబూ? ఇంత తొందరగా అదెక్కడికి పోతుంది" అని తల మీద చెయ్యి పెట్టుక్కూర్చున్న అప్పు ఆఖరికి ఓ ఉపాయం చెప్పాడు. "జేబులో ఏదేదో వుంది కదా, అవన్నీ వరుసగా తీస్తే కాణీ దొరుకుతుంది". రాముడికి సరేనని పించింది. ఒక్కొక్కటిగా జేబులోని సరుకు బయటకి తీసి రాతిమీద పెట్టాడు. మేకులేని బొంగరాన్ని బయటకి తియ్యడం చాలా కష్టమయింది. తరువాత వచ్చింది నశ్యం డబ్బీ టొణటొణమంటూ- తరువాతొచ్చింది....

ఇక్కడే మోసం జరిగింది. క్షణంలో రహస్యం బయట పడిపోయింది. "హొూ....నాదిది. దొంగతనం చేశావు కదూ" అంటూ అప్పు చటుక్కున బూరా లాక్కున్నాడు రాముడి దగ్గర్నుంచి. "అయ్యో! అది నాది" అని అరిచాడు రాముడు. (నీ దెలా అవుతుంది? (నిన్న మా ఇంటికొచ్చిన వాడివి ఓ సారి

వూదిస్తానని తీసుకుని మళ్ళీ ఇచ్చావా అసలు? అని నిలదీశాడు అప్పూ.) "అయ్యో అది నాది, అమ్మ కొనిచ్చింది." అని ఏడుస్తూ బదులు చెప్పాడు రాముడు. "ఏం కాదు, నాదేను" అని అప్పు బూరా తీసి జేబులో పెట్టుకున్నాడు. రాముడు చేతులు, కాళ్ళు కొట్టుకుంటూ బూరా కోసం ఏడవ సాగాడు. వీళ్ళ గొడవకి నలుగురు పిల్లలు, మరిద్దరు పెద్దవాళ్ళూ వీళ్ళ చుట్టూ చేరారు. పెద్దవాడు కదా అని అప్పూని తిట్టారు కొంతమంది. చిన్నవాడిని బెదిరించారు కొంతమంది. రామూ అప్పూ చెయ్యి పట్టి లాగాడు. అప్పు చెయ్యి పట్టి విదిలించాడు. ఈ గొడవలో అప్పుకెలాగో ఓ దెబ్బ పడింది. వాడు కోపంతో రాము వీపు మీద గుద్దాడు. రాము పెద్ద రాయొకటి చేతికి తీసుకున్నాడు. ఆ లోపల ఎవరో ఆ రాయి లాగి పారేశారు. దెబ్బలాటకి కారణ మడిగారు. అప్పు సవివరంగా కథంతా చెప్పాడు. "కానే కాదు, అది నాది" అని రాము మధ్య మధ్యలో చెబుతూనే వున్నాడు. ఏడుస్తూనే వున్నాడు. పిల్లల దెబ్బలాటకి సాక్ష్యాలెక్కడ్నుంచితేవడం? ఏడ్చే వాళ్ళదే కదా గెలుపు? పెద్ద, చిన్న కుర్రాళ్ళు దెబ్బలాడుకున్నప్పుడు చిన్నవాళ్ళకే కదా సానుభూతి లభించేది. ఆడ-మగ దెబ్బలాడుకుంటే ఆడవాళ్ళకి కాకుండా మగవాడి పరంగా న్యాయం చెప్పరు కదా. అప్పూ మాటే అబద్ధమని తీర్మానించారు పెద్దలు. రాముడికి బూరా దొరికింది. అప్పూకి నాలుగు తిట్లూ తగిలాయి. ఉన్నదే అబద్ధమంటే ఇక అతనేం చెయ్యగలడు? పెద్దవాళ్ళు కేసు ఫైనల్ చేసి వెళ్ళిపోయారు. రాము అప్పూ మొహం మీదకే పీపీ వూదాడు. మళ్ళీ దెబ్బలాట ప్రారంభమైంది. "ఇంటికి రా, నాన్నతో చెబుతాను" అన్నాడు అప్పు. రాముడు వూరుకుంటాడా? వెక్కిరిస్తూ "నేనూ, చెబుతాను నాన్నతో" అన్నాడు అప్పుకి తమాషాగా అనిపించింది. "నీకు, నాన్న ఎక్కడున్నాడురా?" అని నవ్వాడు.

"మీ నాన్నగారు పిలుస్తున్నారు దొరా" అంటూ ఒక ఆడమనిషి వాడి భుజం మీద చెయ్యి వేసింది. రాముడు తిరిగి చూశాడు. అపరిచితమైన స్త్రీని చూసి కంగారు పడ్డాడు. "మీ పేరు రాము కదూ?" ధృవ పరుచుకుంది. "ఏరి?" అన్నాడు రాముడు. "అదిగో, అక్కడ, బట్టల కొట్లో" అంది. "ఎటు వేపు?" అనడిగాడు. "దగ్గరే రండి పోదాం" అంది. బట్టల కొట్టు అంటే తనకి లాభమే కదా, అప్పుతో దెబ్బలాటని మర్చిపోయాడు. వాడక్కడ నుంచున్నాడన్న సంగతే మర్చిపోయినట్లున్నాడు. ఆమె కొంగు పట్టుకునే బయలుదేరాడు. అబ్బ, శని వదిలింది. ఇక వాడు, వాడి తాత ఏమైనా చేసుకోనీ అనుకుంటూ అప్పూ వాళ్ళ నాన్న కొట్టువేపు పరుగు తీశాడు.

నాన్న ఏడి అసలు? ఎక్కడున్నాడు? అని పదేపదే అడుగుతున్నాడు

రాముడు. "ఇక్కడే, దగ్గరే దొరా", అంటూ ఆమె వాడి చెయ్యి పట్టుకుని నడుస్తోంది. ఆమె ఇక్కడే ఇక్కడే అంటూన్న కొట్టు దొరికింది. కొట్లోకి వెళ్ళగానే వాళ్ళ నాన్న కోసం బేరాల మధ్య రాముడి కళ్ళు వెతికాయి. ఆయనెక్కడ కనిపిస్తాడు? కొట్లో ఒక విరిగిన కుర్చీ మీద కూర్చున్న ఒక మనిషిని చూపించి "అదిగో మీ నాన్న" అంది ఆ ఆడమనిషి. ఆయన నాన్నెందుకు అవుతాడు? ఒక క్షణం అంతా అయోమయంగా అనిపించింది. ఓ రకంగా భయమూ వేసింది. "అయ్యో ఈయన మా నాన్న కాదు ఛా!" అన్నాడు ముద్దుగా నవ్వుతూ, ఆమెకేం తెలీదు అన్న ధోరణిలో. వాడలా అనడం వినగానే కుర్చీలో కూర్చున్న అసామీ చటుక్కున పైకి లేచాడు. తల మీద ఒక మాసిన టోపీ. దానికి వెనకాల కనిపిస్తున్న జుట్టు ముడి. చెవికి పోగులు, చెవి సందున పువ్వు. చేతిలో ఒక గొడుగు మోకాళ్ళ దాకా గోచీ పోసి బిగించి కట్టిన ధోవతి, ఒక కాలికి వెండి కడియం. కాళ్ళకి లావుపాటి చడావులు. "రా, బాబూ" అని పిలిచాడు అతను. రాముడతని పక్కనే వున్న కొత్త బట్టల రాశిని చూశాడు. "ఇవి నీకే" అన్నాడతను. రా రమ్మని మరీ మరీ పిలిచాడు. "వెళ్ళండి దొరా" అని ఆ స్త్రీ వెనుక నుంచి మెల్లిగా తోసింది. మంత్ర ముగ్ధుడిలా తాబేలు నడకతో మెల్లిగా ముందు ముందుకి అడుగు లేశాడు. రాము. కళ్ళు మిటకరిస్తూ అతని ముందు నుంచున్నాడు. అతనే ముందుకొచ్చి రాముణ్ణి తీసికెళ్ళి కుర్చీలో కూర్చో పెట్టాడు. "ఈ గుడ్డలన్నీ నీకే తెలుసా?" అన్నాడు. బాగున్నాయా అని అడిగాడు. "ఊఁ" అన్నట్టు తలాడించాడు రాము. "నా చిన్ని తండ్రీ" అంటూ రాముణ్ణి కౌగలించు కున్నాడతడు. మొహం పైకెత్తి అపేక్షగా చూశాడు. మొరటు చెయ్యి అనిపించినా రాముడి కెందుకో సంతోషంగా వుంది. కాని ఎందుకంత పెద్దాయన కళ్ళల్లో నీళ్ళొస్తున్నాయి? అన్న ఆశ్చర్యమూ కలిగింది. ఏడుపూ వచ్చింది. దూరంగా నుంచున్న ఆ స్త్రీ కళ్ళల్లోనూ నీళ్ళు రావాలా?

ఇదంతా పది నిమిషాల్లో జరిగిపోయింది. ఆవిడ కొన్న బట్టలన్నీ మూట కట్టి తీసుకోవడం, ఆ కొత్తమనిషి రాముడిని భుజం మీద కెత్తుకుని కొట్టు నుంచి బయటకి రావడం జరిగిపోయింది. అటు వేపున్న మిఠాయి కొట్లో నాలుగురకాల మిఠాయిలు పొట్లం కట్టించు కోవడమూ జరిగింది. రాముడి పసి మొహం ఇంత వెడల్పయింది. "నాకు" అంటూ భుజం మీద నుంచే ఆయన మొహం మీదకి చెయ్యి జాపాడు. "ఇవన్నీ నీకు కాకుండా మరెవరికి బాబూ", అంటూ పొట్లానికి ఒక పక్క చిల్లు చేసి ఓ రెండు పంచదార పుల్లలు లాగిచ్చాడు. ఓ కాలు రొమ్ము వేపు ఒక కాలు వీపు వేపు వేసి పెద్దాయన తల పట్టుకున్న రాముడికి గుర్రపు స్వారీ చేస్తున్నట్టుగా అనిపించకుండా వుంటుందా? అలాగని చెప్పనూ చెప్పాడు.

"నువ్వు గుర్రమట, నేను పైన కూర్చున్నానట" అని "హైహై" అంటూ కాళ్ళతో రొమ్ము మీద, వీపు మీద తన్న సాగాడు. సన్నటి లేత కాళ్ళ స్పర్శ అయనకెంతో అహ్లాదంగా వున్నట్టుంది. కాస్త దూరం వెళ్ళాక అతను ఆమెతో ఏదో చెప్పాడు. ఆమె అలాగే అంటూ చక చక అడుగులేసింది. తమ ఇల్లు అటువేపు, ఇటెక్కడికి వెళుతున్నాం? అనిపించింది రాముడికి. "ఇంటికి వెళదాం" అన్నాడతను. సంత బజారు కొసకి వెళ్ళి ఓ చెట్టు క్రింద రాముణ్ని దింపేసరికి వాళ్ళున్న చోటికి జోడెద్దుల కమాను బండి వచ్చింది. అయన రాముణ్ణి ఎత్తి బండి వెనక నుంచి లోపలకి అందించాడు. రాముడి కిప్పుడు నిజంగా ఏడుపు వచ్చేసింది. అతనూ బండెక్కి "తొందరగా" అన్నాడు. ఎద్దుల మెడలో మువ్వలు గల గలమంటూ ముసురె ఏరు మీదుగా సీతూరు వేపు పరుగుతీసింది - ఎర్రటి దుమ్ము రేపుతూ.

బండిలో కూర్చోడం సరదాగా వున్నా పరాయి వాళ్ళతో ఎక్కడకి పోతున్నానే అన్న ఆలోచనతోనే రాముడు వెక్కి వెక్కి ఏడవసాగాడు. "అమ్మా! నాన్నా!" అంటూ. ఆవిడ వాడిని ఒళ్ళో కూర్చోపెట్టుకుని "ఏడవకండి దొరా" అంటూ పొట్లాల్లోంచి మిఠాయి తీసిచ్చింది. మిఠాయి చూడగానే ఏడుపు ఆగినా వెక్కిళ్ళు ఆగలేదు. వాడి చొక్కా మీద ఎరుపు రంగు చూసి అదేమిటని అడిగింది ఆవిడ, "అక్కడ షరబత్ తాగాను, పడింది". అన్నాడు రాముడు. "ఎంత బాగుంటుందో తెలుసా? నువ్వు తాగావా ఎప్పుడైనా?" అన్నాడు. ఆవిడ నవ్వింది. అతనూ నవ్వాడు. బండి కుదుపుకి వీపు కమాను తగిలి నొప్పెట్టింది. క్షణంలో నవ్వు ఎగిరి పోయి "బాబోయ్ నొప్పి...." అని ఏడవ సాగాడు. "ఎక్కడి కెళుతున్నాం? అని గోల చేశాడు. మా ఇల్లు ఇటు కాదన్నాడు. "మీ ఇంటికే వెళుతున్నాం. దొరా, ఈయనెవరో తెలుసా? మీ నాన్న". అంది. అయన మొహం వేపు చూశాడు. "ఊహు" మా నాన్న కాదు. అన్నాడు. "నేనే మీ నాన్నని" అన్నాడతను. "ఊహు, ఇంట్లో వున్నాడు మా నాన్న, ఇంటికి పోదాం" అని మొండికేశాడు. "ఎందుకేడస్తావ్ బాబూ, నేనే మీ నాన్నని. ఇంటి దగ్గరున్నది మీ అమ్మా వాళ్ళ నాన్న" అన్నాడతను. రాముడికి మళ్ళీ అయోమయంగా అనిపించింది. "మరి నాకు నాన్న లేడటగా అప్పూ చెప్పాడు." అన్నాడు. అయన, ఆవిడ మొహం మొహం చూసుకున్నారు. "వాడిని కొడదాంలే ఊరుకో" అన్నారు. రాముడికి సంతోషమయింది. ఆవిడ, అయనా ఏదేదో మాట్లాడుకున్నారు. వాళ్ళ మాటల మధ్యలో పార్వతి, మంజయ్య, మామ్మ మొదలైన పదాలన్నీ వచ్చాయి. కనుక తన ఇంటి వాళ్ళని గురించే అనిపించినా మొత్తం మాటల తల -తోక వాడికి అర్థం అయితేనా? గుడ్లు

మిటకరిస్తూ ఓసారి ఆయన వేపు, మరోసారి ఆవిడ వేపు చూస్తూ కూర్చున్నాడు. మధ్య మధ్య మిఠాయి పొట్లాన్ని చూసుకుంటున్నాడు.

బాళ్గడి దాటి బండి ఎడ్డం వేపు మలుపు తిరిగింది. బండి వూగుతుంటే రాముడికి నిద్రొచ్చింది. ఆవిడ తొడమీద పడుకున్నాడు. మిఠాయి ముక్క నోట్లోనే వుండటంతో ఒక పక్క నుంచి బంకబంకగా చొల్లు కారుతోంది. వాడి కెక్కడ మెలకువ వస్తుందోనని ఆవిడ దాన్ని తుడవకుండా అలాగే వదిలింది. చొంగతో ఆమె చీర కూడా తడిసింది. "ఎంత ముద్దొస్తున్నాడు పిల్లాడు" అంది ఆయనతో, రాముడి తలని మృదువుగా నిమురుతూ. బండి అటూ ఇటూ వూగుతూ వెళుతుంటే ఎడ్ల మెడ మువ్వలు గలగల్లాడుతూ వున్నాయి.

లావాటి రాతి మీదకి చక్రం ఎక్కడంతో బండి అల్లాడి రాముడికి మెలకువ వచ్చింది. చటుక్కున కళ్ళు తెరచి "అమ్మా" అని కేక పెట్టి ఆవిడ మొహం చూశాడు, ఆయన మొహం చూశాడు. ఏదో కొత్త లోకంలో వున్నట్టనిపించి "అమ్మా, అమ్మేది?" అని ఏడవ సాగాడు. వాడికి మరింత మిఠాయి పెట్టి ఏడుపు మాన్పించే సరికి తలప్రాణం తోక కొచ్చింది. "నాకు భయంగా వుంది దొరా!" అందావిడ.

రాముడికి మెలకువ వచ్చాక ఒకటి రెండు ఫర్లాంగులు వెళ్ళుండవచ్చు బండి. వెనుక నుంచి 'పాంపాం' అంటూ కారొకటి వచ్చింది. రాముడు దాని వేపే చూస్తున్నాడు. కారు బండిని దాటి వెళ్ళి రోడ్డుకి అడ్డంగా నుంచుంది. బండి ఆగిపోయింది. ఎద్దులు ఒగరుస్తున్నాయి. వాటి మెడలో మువ్వలు కొణకొణమని అంటున్నాయి. రాముడికి తాతయ్య మొహం కనిపించింది. చటుక్కున లేచి నుంచుని "నాన్నా, నేనిక్కడ వున్నాను" అని అరిచాడు గొప్పగా. "ఇప్పుడేం చేస్తారు దొరా" అంది ఆవిడ. ఆయనకి కోపం రాకుండా వుంటుందా? "నువ్వు కాస్సేపు నోరు మూసుకో మహాతల్లీ" అని కోపంతో కదలకుండా కూర్చున్నాడు. రాముడు, "నేను దిగుతాను" అని బండి కొసకి పరిగెత్తాడు. 'ఆవిడ వాడిని లోపలకి లాక్కుంది'.

మంజయ్యగారు, సీతారాముడు, కొట్టు సదానంద భట్టుగారు, కారు యజమాని, శీనప్ప భట్టు గారి నౌకరు శంభు అన్నీ పరిచయమున్న మొహాలే. రాముడికి భలే ఆనందంగా వుంది. "నాన్నా, నేనిక్కడున్నాను" అని అరిచాడు జీడి కొరుకుతూ.

"దింపు వాడిని" గర్జించాడు మంజయ్యగారు.

"అదేం కుదరదు" బండిలోంచి ఆయన జవాబు.

"అబ్బో పొగరుకేం తక్కువ లేదు. నీ మెడ పిసికేస్తాను ఏమనుకున్నావే.

దింపు వాడిని ముందు"

"చూద్దాం వాడినెలా తీసికెళతారో" అంటూ ఆయన ఝుమ్మని కిందకి దూకాడు.

"ఏమిటీ? నన్ను కొడతావా? నన్ను తాకావే ఇక్కడే నీ పీనుగు పడటం ఖాయం" అన్నారు మంజయ్య.

ఇద్దరూ ఒకరికొకరు ఎదరు పడ్డారు. వెంటనే సదానంద భట్టు గారొచ్చి ఇద్దరి మధ్య నుంచున్నారు.

"నాన్నా, నేనొస్తున్నాను అంటూ రాముడావిడ దగ్గర్నుంచి విడిపించు కోవడానికి ప్రయత్నించాడు. ఆవిడకేం చెయ్యాలో తోస్తే కదా. కనిపించని దేవుళ్ళని స్మరిస్తూ వాడిని గట్టిగా పట్టుకుంది. రాముడు విలవిల్లాడాడు. "వదులు నన్ను, వదులు. నేను వెళ్ళిపోతాను" అని అరిచాడు. ఆమె ఓదార్చటానికి చూస్తోంది. పొట్లం లోంచి రకరకాల మిఠాయిలు తీసి వాడి నోటి ముందు పెడుతోంది. వాటిని లాక్కున్నాడు రాముడు. "నన్ను వదులు, నేను వెళ్ళి పోతా"నన్న రాగం మాత్రం మానలేదు.

"నడి వీధిలో నుంచుని మీ పంచాయితీ వొద్దు. ఎంతైనా మీ మామ కదా ఆయన, నీకే చెప్పేది శివరామూ అన్నారూ సదానంద భట్టుగారు.

"ఎవరూ?" ఈయానా? నాకు మామా? ఛ!" అంటూ పళ్ళు నూరాడు శివరాము. "ఈయన ఆ బేవార్సి పార్వతి తండ్రి. అందుకే కదూ కూతుర్ని ఇంట్లో పెట్టుకున్నాడు. సరే, మీ కూతుర్ని మీరు పెట్టుకున్నారు. వీడు నా కొడుకు. వీడి మీద మీకేం హక్కుంది? నా రక్తం ధారపోసైనా సరే వాడు మీతో వెళ్ళకుండా చూస్తాను".

రాముడికి ఈ పెద్దవాళ్ళ దెబ్బలాటలకి తల - తోక అర్థం కాలేదు. జేబులో బొంగరం ఇబ్బంది పెట్టడంతో దాన్ని బయటికి తియ్యబోయాడు. బూరా చేతికి తగలటంతో మొహం విప్పారింది. "ఇదిగో పీపీ. నాదిది తెల్సా?" అంటూ ఆవిడ మూతి దగ్గరకి చాపాడు. "ఊదు" అంటూ బలవంతం చేశాడు. అంత భయంలోనూ ఆవిడకి నవ్వొచ్చింది. "నా చేత కాదు. మీరే వూదండి దొరా" అంది.

"అయ్యో నీకేం చేతకాదు. నేను వూదుతాను చూడు" అంటూ మెడ నరం ఉబ్బించి గట్టిగా వూదాడు. పీపీపీ అంటూ. సరిగ్గా అప్పుడే జింకల గుంపు ఒకటి గుట్టదిగి, రోడ్డు మీద చెవులు నిక్కించి, శిలల్లా నుంచుని వుండడం రాముడి కంట పడింది. "అయ్యో! అటు చూడు అటు చూడు" అంటూ ఆవిడ మూతి మీద చేత్తో పొడుస్తూ చూపించాడు. ఒక క్షణమే ఆ దృశ్యం. మరుక్షణం అవి మాయమయ్యాయి. అవతల వేపున అడివిలో దూరాయి. "మీ ఇంట్లో జింక

వుందా." అన్నాడు. ఆమె గుండెల్లో అటుకులు దంపుతున్నట్టుగా వుంది. ఏడి ముగ్ధమైన ప్రశ్నలకి ఏమని జవాబు చెప్పగలదు?

ఒక్కసారిగా గొంతు పెంచి అరిచాడు. శివరాము, "నా పీనుగు ఇక్కడ పడ్డాకనే మీరు వాడిని తీసికెళ్ళడం" మళ్ళీ సదానంద భట్టు, శినప్ప అందరూ ముందు ముందు కొచ్చారు. మంజయ్యగారు, హడావుడి గా బండి వెనకొచ్చి, "వాణ్ణి ఇటియ్యి " అన్నారు అధికార స్వరంతో. "ఇచ్చావంటే చచ్చావన్న మాటే " శివరాము గర్జించాడు. పాపం ఆమేం చెయ్యగలదు. ఇద్దరి మధ్య గొడవల్లో. రాము ఛంగున దూకాడు. ఆమె చటుక్కున వాడి చెయ్యి పట్టుకుంది. కింద మంజయ్యగారు మరో చెయ్యి పట్టి లాగారు. ఇప్పుడు నిజంగానే వాడికి నొపెట్టింది. "నాన్నా నొప్పెడుతుంది " అని ఏడ్చాడు. శివరాము పరిగెత్తుకుంటూ వచ్చి మామ చెయ్యి పట్టి లాగాడు. మిగతావాళ్ళు పరిగెత్తుకుంటూ వచ్చారు. ఎవరు దింపారో ఏమయిందో ఒక్కటీ అర్థం కాలేదు రాముడికి. మొత్తంమీద ఆ పెద్దవాళ్ళ కాళ్ళ సందుల్లో చిక్కుకున్నాడు. తలెత్తి చూస్తే పెద్ద పెద్ద తొడలు, గడ్డాలు కనిపిస్తున్నాయి వాడికి. అమ్మ చెప్పే రాక్షసులు గుర్తు వచ్చి భయమేసింది. "అమ్మా, అమ్మా' అని మూలిగాడు. "నాన్నా" అంటూ వణికిపోయాడు. శంభూ వాణ్ణి దూరంగా తీసికెళ్ళి ఓదార్చడానికి ప్రయత్నించాడు. రాముడు నిజంగానే గడగడ వణకసాగాడు. ఎందుకు వాళ్ళలా చేస్తున్నారని అడిగాడు.

పది పదిహేను నిమిషాలలాగే గొడవ కొనసాగింది. అప్పుడు మంజయ్య శంభు దగ్గరికొచ్చి రాముణ్ణి లాక్కుని కారు వేపు నడిచారు. వాడిని లోపల కూర్చో బెట్టారు. బండి దగ్గర నుంచుని శివరాము ఏదేదో అరిచాడు. స్థాన భ్రంశం చెందటంతో రాము కంగారు పడ్డాడు.

అందరూ కార్లో కూర్చున్నారు. కారు వూరి వేపు మళ్ళింది. కార్లోని మెత్తటి సీటు, బండిలోని గడ్డి పరుపు కంటే హాయిగా అనిపించింది. రాముడు వెనక్కి తిరిగి గ్లాసులోంచి చూశాడు. బండి, ఆవిడ, అయన అంతా దూరమైపోతూ చిన్నగా కనిపించారు. ఒక మలుపులో అందరూ మాయమయ్యారు. బండి కనుమరుగవగానే రాముడికి మిఠాయి పొట్లాం గుర్తు రావాలా ? "అయ్యో! మిఠాయి పొట్లాం అక్కడే వుండిపోయిందే!" అన్నాడు. "ఊరికే కూర్చో" అన్నారు తాతయ్య. సంతలో ఇప్పిస్తావా ? అనడిగాడు. "అలాగేలే, మంచివాడివి కదూ, వూరుకో మరి " అన్నారు సదానందభట్టుగారు. "మనం ఎక్కడకి వెళుతున్నాం?" అడిగాడు. "ఇంటికి" అన్నారెవరో. "నాన్నా, నాన్నా వాళ్ళింట్లో జింక వుందట. నాకూ తెచ్చిపెడతావా?" అన్నాడు. తాతయ్య

మొహం తన వేపు తిప్పుకుంటూ. "ఊరికే కూర్చో బాబూ" అని గద్దించారు మంజయ్యగారు. రాము మొహం చిన్నబోయింది. అయినా వూరుకోలేదు కదా. "బండి కన్నా ఇదే బాగుంది" అన్నాడు. ఇంకా ఏదేదో చెబుతున్నాడు. కాని ఎవరి మనసు స్థిమితంగా వుంది గనుక వాడి మాటలన్నీ వినిపించుకోడానికి!

"అది సరే కాని మంజయ్యా! ఈ సారికేమో గట్టెక్కామనుకో. తరువాత ఎలాగా?" అన్నారు భట్టుగారు. ఉదయం నుంచి జరిగిన సంఘటనలు, దాని వెనకాలే ఇంత ముందు జరిగిన గొడవ, ఇక ముందు జరగబోయేవి - వీటితో మంజయ్యగారి మనసు నెమ్మది కోల్పోయింది. ఆలోచనలతో క్రుంగిపోయింది ఆయన మనసు. దానితోబాటు పెళ్ళి చేసిన కూతుర్ని ఇంట్లో పెట్టుకోవడం మీకు సబబుగా అనిపిస్తోందా ? ఆ అదదానికెంత పొగరో అన్న మాటలు- "నాన్నా, నాన్నా" అంటూ ఏదో కొత్త విషయం చెప్పబోయాడు రాముడు. కాని ఆయన దాన్ని వినిపించుకొనే స్థితిలో వుంటేగా. ఆయన మనసు అస్తవ్యస్తంగా వుంది. అటూ-ఇటూ చూశాడు రాముడు. బూరా గుర్తు వచ్చింది. జేబులోంచి తీసి 'పీపీ' అని గట్టిగా వూదాడు. "ఏమిట్రా బాబూ నీ గొడవ అని చికాకు పడ్డారు మంజయ్యగారు." బిక్కమొహం వేశాడు వాడు. కాని చెప్పిన మాట వినే వయసు కాదు కదా వాడిది. చిన్నగా వూదుతోనే వున్నాడు. శివరాము తమ కొట్టుకి రావడం, రాముణ్ణి తీసికెళ్ళడం, తాము వాళ్ళ వెనకాలే వెళ్ళడం అన్నీ వివరంగా చెప్పారు సదానందభట్టుగారు. "ఆ మాత్రం ఉపకారం చేశావుకదా నా అదృష్టం" అన్నారు మంజయ్య. కారు సంతబజారు దాటిపోతుంటే "నాన్నా, నాన్నా" అని గునిసాడు రాముడు, సంత దాటి పోతుందే అన్న బాధతో.

కారు 'పాంపాం' అంటూ ఇంటి ముందు ఆగింది. రాముడు చూశాడు. ఇంటి ముందు జాతర కొచ్చినట్టు జనం నిండిపోయారు. అందరూ ఒకేసారి "వచ్చారు, వచ్చారు" అన్నారు. కార్లోంచి ఒక్కరొక్కరే దిగారు. "దిగుబాబూ" అన్నారు మంజయ్యగారు. అంత బాగున్న కారుని వదలబుద్ధి కాలేదు రాముడికి. కొంచెం గర్వంగా అనిపించింది వాడికి. నెమ్మదిగా దిగాడు. పార్వతి గుంపులోంచి దూరి పరిగెత్తుకుంటూ వచ్చి వాడి నెత్తుకుని ముద్దు చేస్తూ, నలిపేస్తూ ఏడవసాగింది, "నా బంగారు కొండ, ఎక్కడికెళ్ళావమ్మా, నేను చచ్చిపోయాను కదరా నాన్నా " అంటూ, తల్లిని చూసి సంతోషమైనా, ఆమె నలిపెయ్యడంతో దేహానికి కలిగిన నెప్పి వల్ల 'వదలమ్మా' అంటూ విడిపించుకుందుకి ప్రయత్నించాడు. తల్లీ బిడ్డలు ముందు, వాళ్ళ వెనకాలే మిగతా వాళ్ళు ఇంట్లోకి వెళ్ళారు. లోపలి గదిలోంచి కల్యాణి "వచ్చాడా? పిల్లాడొచ్చాడా? ఆయనొచ్చారా? " అంటూ ఏదో గొణుగుతోంది. జనం మధ్య నుంచున్న అప్పా

రాముణ్ణి రమ్మని పలిచాడు. వాడితో వెళ్ళాలనిపించినా బూరా ప్రకరణం గుర్తు వచ్చి "పోరా, నువ్వెకడివి" అన్నాడు మొహం ఇంతలావు చేసుకుని, తల్లి చంక దిగకుండా.

(గోడ కానుకుని కూర్చుంటూ పార్వతి "నాన్నా వీడెక్కడ దొరికాడు నీకు ? అసలు నువ్వెక్కడి కెళ్ళావ్ ?" అని పది ప్రశ్నలు వేసింది.

"పల్లకాటి కెళ్ళాను" అంటూ మంజయ్య పై పంచె విసిరేసి ఉయ్యాల బల్ల మీద కూర్చున్నాడు.)

నుంచున్న వాళొక్కరొక్కరే తమ పనులు గుర్తు రావడంతో అక్కడ్నుంచి వెళ్ళిపోయారు. ఆఖరికి మిగిలింది సదానంద భట్టుగారొక్కరే. జరిగిన సంగతంతా రెండు ముక్కల్లో చెప్పారు. తన తొడ మీద పడుకున్న కొడుకు మొహంలోకి చూసి వాడెంత కంగారు పడ్డాడోనని "అయ్యో బిడ్డా " అంటూ ఏడ్చింది. రాముడూ ఏడ్చాడు.

తల్లీ బిడ్డల ఏడుపు ఉధృతం తగ్గాక సదానంద భట్టుగారు చెప్పారు. "ఒక్కసారి ఇలా చేసినవాడు మరోసారి ఏదైనా చెయ్యగలడు నీ అల్లుడు. అందుకే చెపుతున్నా మీరు మీరు దెబ్బలాడుకుని మొండి పట్టు పట్టుకుని...." మంజయ్య మధ్యలోనే అన్నాడు "అవును, ఆ బేవర్సు ఆడమనిషి కూడా అమాటేగా అన్నది. ఇప్పుడు నువ్వు అదే ధోరణిలోనే మాట్లాడుతున్నావు. పోనీ ఇప్పుడు నేనేం చెయ్యాలో అదైనా చెప్పు." అన్నారు. ఆయన కంఠంలో విసుగు వుంది. కోపమూ వుంది. కాని భట్టుగారు కోపగించుకోనూ లేదు, విసుక్కోనూ లేదు. ఎలాగూ పార్వతి ఎదుటే వుంది. పడగ్గదిలో వాళ్ళమ్మా వుంది. తన మాట అవిడకీ వినిపించొచ్చు. వినిపిస్తేనే మంచిది అనుకున్నారు.

"నీదే తప్పని అనను గాని, మంజయ్యా నీ సంసారం గురించి నేనెప్పుడూ పార్వతి ఎదుట మాట్లాడిన వాడినీ కాదు. ఇప్పుడిక అన్ని అవాంతరాలు వచ్చిపడ్డాయి కదా, అందుకని నాలుగు ముక్కలు చెబుదా మనుకుంటున్నాను. పార్వతి నన్ను తప్పుగా అనుకోదనే ఆశిద్దాం. ఎంతైనా నా చేతులతో ఎత్తుకుని ఆడించిన పిల్ల కదా, నిజం చెప్పాలంటే పెళ్ళయ్యాక పార్వతిని సరిగ్గా చూస్తున్నది ఇవాళే. ఎంత బాగా పుష్టిగా వుండేది, ఇలా అయిపోయిందేమా అని బాధగా వుంది" అంటుంటే మళ్ళీ పార్వతి వెక్కి వెక్కి ఏడవసాగింది. 'నా ఖర్మ, నా ఖర్మ' అంటూ, "ఎందుకమ్మా ?" అంటూ గాబరాతో రాముడూ ఏడ్చాడు.

"ఇటు రారా, నాయనా నిన్ను ఒకసారి చూస్తాను" అంటూ లోపల్నుంచి అమ్మమ్మ పిలుస్తూనే వుంది. కాని రాముడికి ఇప్పుడెందుకో ఆ చీకటి గదంటే భయంగా అనిపించి లేచి వెళ్ళకుండా 'ఊహూ' అంటూ తల్లి తొడ మీద

ముడుచుక్కూర్చున్నాడు. సదానంద భట్టుగారు తమ మాటల ధోరణి మార్చకుండా చెప్పారు. "మంజయ్యా, ఈ ఇంట్లో ఇవాళెవరు సుఖంగా వున్నారు చెప్పు? నీ పెళ్ళాం మంచం పట్టింది. పార్వతి గతి ఇలాగుంది. ఇవన్నీ చూస్తూ నీకూ సుఖం లేదు కదా. పోనీ మనమాట వదిలేద్దాం. నాకు, నీకు ప్రాయం మళ్ళీ రాదు. యమధర్మరాజు పిలవగానే వెళ్ళడానికి సిద్ధంగా వుండాలి. తరువాత సంగతి ఆలోచించు. పార్వతి గతి ఏమిటి ? రాముడి భవిష్యత్తు ఎలాగ ? రేపు వాడు పెద్దవాడై మిమ్మల్నీ తల్లిని శపించకూడదు కదా ! అంటూ రాముణ్ణి చూపించి మాట్లాడుతుంటే వాళ్ళంతా తన గురించే మాట్లాడుతున్నారనిపించి గంభీరంగా భట్టుగారి వేపు ఒకసారి, నాన్న వేపొకసారి, అమ్మ వేపొకసారి చూశాడు.

లోపల్నుంచి అమ్మమ్మ దగ్గుతూనే మధ్యలో అందుకొని "ఎవరది ? సదానందుడా ? గొంతు విని అలాగే అనుకున్నానులే. అవునూ సదానందూ, నీ తమ్ముడు వెంకటేశ్ కూతురు, ఆ హోటల్ సర్వర్‌తో ఘట్టం కిందకి లేచిపోయిందటనే ? అని అడగాలా ?

బాగా అడిగిందమ్మ అనుకుంటూ పళ్ళు నూరింది పార్వతి.

మంజయ్యగారి బుర్ర వేడెక్కింది. "నువ్వూరికే పడుండకూడదా అక్కడ ? నీ మాట వినే ఇదంతా జరిగింది." అన్నారు.

కల్యాణి కోపంగా, "నా మాట విని ఏమయింది ?" అనడిగింది.

"నోరు పారేసుకోకు" గర్జించారు మంజయ్యగారు.

"అమ్మమ్మా, ఊరుకో....ఒహెూ!" అన్నాడు. రాముడు పెద్ద మగాడిలా నటిస్తూ, తల్లివేపు చూసి నవ్వుతూ.

అమ్మమ్మ లోపల్నుంచి మరేమో అంది. మంజయ్య గద్దించారు. వాళ్ళిద్దరూ దెబ్బలాడు కుంటుంటే ఇక తల్లి ఒక్కతే ఆసరా రాముడికి. ఎందుకో భయం వేసింది మరింతగా ముడుచు క్కూర్చున్నాడు అమ్మ వొళ్ళో. జేబులో వున్న పంచదార బిళ్ళ ఒత్తుకోడంతో గబుక్కున లేచి జేబులోంచి తీసి "అమ్మా, ఇదెవరు కొనిచ్చారో తెలుసా నీకు ?" అంటూ పార్వతికి చూపించాడు. "నీకూ కావాలా ?" అనడిగాడు. వద్దన్నా బలవంతంగా ఓ ముక్క నోట్లో కూరాడు. "ఏమిట్రా నీ గోల ?" అంటూ దారి లేక తప్పని సరిగా దాన్ని మింగింది పార్వతి.

మంజయ్యగారు గట్టిగా)

"ఇదిగో సదానందూ, ఇవన్నీ, నా ఇష్టప్రకారం జరిగాయంటావా ? ఇవన్నీ నాకు తెలీనివని అనుకున్నావా ? ఇది, ఈ బేవర్సి, పెళ్ళయిన మూడు రోజులకే, నేనుండలేనని మొగుణ్ణొ దిలిపెట్టొచ్చింది. నేను వెయ్యిసార్లు చెప్పాను, "ఇది

తప్పు ఇలా చెయ్యకూడదని. నా మాటలు వినే దెవరిక్కడ ? 'అమ్మ, అమ్మ' అంటూ ఏడ్చింది. అది - అక్కడ పడుకుందే దీనమ్మ - ఇది ఆడిన వాటికంతా సరే నంటూ తాళం వేసింది. ఒకసారి అలా జరిగాక ఇంక అదే అలవాటయింది. ఈ రాముణ్ణి కడుపుతో వున్నపుడు ఏకంగా వచ్చేసింది, ఇకనే వెళ్ళనంటూ. 'నా బిడ్డ నాకు బరువు కాదండి అది'. వీధిలో నేను తలెత్తుకు తిరగాలా అసలు? ఈ అణాకానీ ఆడవాళ్ళ కేం ?"

రాముణ్ణి తటాలున పక్కకి తోసేసి పైకి లేచింది పార్వతి. "నాన్నా, ఎందుకిలా మాట్లాడతారు ? ఆయనతో వుండనని చెప్పి వచ్చేశానా నేను ? ఆయన పెట్టిన బాధలు ఒకటా రెండా ? నేనే కాదు, అలాంటి బాధలు పడుతూ ఏ ఆడదైనా ఆయనతో వుండ గలదా అసలు ? ఇప్పుడెందుకులే, ఆ కాలమూ వస్తుంది. వాళ్ళ తప్పులు వాళ్ళకే తెలుస్తాయి" అని వలవల ఏడవసాగింది. ఇక అక్కడ వుండ లేకపోయింది. "రారా రాక్షసుడా" అంటూ రాముణ్ణి బరబర లాక్కుని తల్లి వున్న గదిలోకి వెళ్ళింది. "మన మెవరికీ బరువుగా వుండక్కర్లేదు. ఎక్కడైనా నాశనమైపోదాం" అంది. "అయ్యో! నన్ను ఒదులమ్మా, వదులు" అంటూనే వున్నాడు రాముడు. తల్లీ కూతుళ్ళేదో మాట్లాడుకుంటున్నారు లోపలి గదిలో. పార్వతి ఒకసారి పెద్ద గొంతుతో కల్యాణి నేదో అంది. కల్యాణి ఏడుస్తోంది. రాముడు గాబరాగా బయటకి పరిగెత్తి వచ్చి తాత ఒళ్ళో దూరాడు.

"నువ్వేమయినా అను, మంజయ్యా, నీ అల్లుడు మీరందరూ అనుకుంటున్నంత చెడ్డవాడు, క్రూరుడు అని అనుకోను. ఇవాళ నేనూ చూశాను కదా! ఏం నువ్వు మాత్రం చూడలేదూ. కొడుకు మీద వ్యామోహం లేకపోతే అలా చేసేవాడా ? రాముణ్ణి మళ్ళీ ఇవ్వాలని వస్తే నా పీనుగ పడాలన్నాడు కదా! భార్యా పిల్లలన్న మోహం లేకపోతే అతని నోటి వెంట ఆ మాట వచ్చేదా ? ఏం ? అతని కున్న డబ్బు- దస్కం చూసి ఎవరో మరో పిల్లని ఇవ్వకూడదని లేదుగా ?"

ఏది గుర్తు రాకపోయినా తన కోసం ఆ కొత్తాయన, తాతయ్య, తన చేతులు పట్టుకుని రా రమ్మని లాగడం రాముడి కళ్ళకి కనిపిస్తోందింకా. ఆయన, తన నెత్తుకున్న ఆవిడ, జింక, బండి అన్నీ ఒక్కసారిగా గుర్తొచ్చాయి. "అవును, నాన్నా, ఆ బండి ఎంత భాగుందో. నాన్నా, నాన్నా ఇటు చూడు. మరేమో వాళ్ళింట్లో జింక వుందట. నాన్నా, నాకు జింక తెచ్చి పెడతావా ?" అని గడ్డం పట్టుకుని అడిగాడు. అదే వేళకు పార్వతి బయటకి వచ్చి "బిడ్డ మాత్రం కావాలా ఆయనకి, నేను అక్కర్లేకపోయాను, కదూ" అంది రోషంతో.

"ఇప్పుడేమో అలా అంటున్నావుగాని, నాలుగు సార్లు వచ్చి మీ నాన్న నడిగితే

ఏం జవాబు చెప్పాడే చెప్పు, చూద్దాం. నీ మటుకు నువ్వేం చేశావ్? గుమ్మంలో కొచ్చిన భర్తని, 'ఏ వూర్నుంచొచ్చావు' అనేనా పలకరించావా? మీ అమ్మ వాడి మొహం మీదనే ఎలాంటి మాటలందో గుర్తుందా? శివరాజు నాతో అన్నీ చెప్పాడు." అన్నారు భట్టుగారు. పార్వతికి అవమానమయింది.

"ఏమండోయ్ చూడండి, మీరు నన్నేమైనా అంటే వూరుకుంటానుగాని, మంచం పట్టిన మా అమ్మనే మన్నా అంటే ఒప్పుకోను." అంటూ తండ్రి వెళ్ళించి కొడుకుని లాక్కుని చంక నేసుకుని అమ్మ గది వేపు బయలుదేరింది. అటునుంచిటు, ఇటునుంచటు బంతిలా తన నాడిస్తున్న పెద్దవాళ్ళ పట్ల భయం కలిగింది రాముడికి. "నేర్చుకుకో పార్వతీ పెద్దవాళ్ళతో మర్యాదగా మాట్లాడ్డం నేర్చుకో." అని గర్జించారు మంజయ్య. "పెద్దవాళ్ళు పెద్దవాళ్ళలా వుంటే ఇచ్చే గౌరవం ఇస్తాం" అంది పార్వతి తండ్రి మొహం మీదే. "ఎంత పొగరే నీకు?" అరిచారు మంజయ్యగారు. పార్వతికి ఏడు పొచ్చింది. "అయ్యో, ఏంబతుకైపోయింది, నాది ఏ సుఖం కోసం ఇంకా బతికుండాలి?" అంటూ రాముణ్ణి క్రింద కూలేసి తలుపుకేసి తల బాదుకోసాగింది. భట్టుగారు పరుగున వెళ్ళి ఆమెని ఆపటానికి ప్రయత్నించారు. "నన్ను ముట్టుకోకండి నేను చస్తేనే మంచిది. నా వల్లనే కదా ఈ గొడవలన్నీ" అంటూ గింజాకుంది. రాముడు గడగడా వణికిపోయాడు. "అమ్మ, అమ్మ" అని ఏడ్చాడు కాని ఆవిడ దగ్గరకి వెళ్ళడానికి ధైర్యం చాలదు. మంజయ్యగారికి మొత్తం వాతావరణమే అసహ్యం కలిగించింది. బుర్ర వేడెక్కించింది. "చస్తావా.... లంజా.... చస్తావా...." అంటూ ఫట్ మని చెంప మీద ఒకటుచ్చుకున్నారు. "అయ్యో! చచ్చాను" అంటూ పార్వతి గోలగా అరిచింది. భట్టుగారు, "ఏమిటీ పని మంజయ్యా, నీకు మతి లేదా?" అంటూ కోప్పడ్డారు. అందరూ రాక్షసుల్లా కనిపిస్తున్నారు రాముడి కళ్ళకి. "నాన్నా" అంటున్నాడు గాని ఎవరి దగ్గరకైనా వెళ్ళే దారే లేదనిపిస్తోంది. "చాలని దానికి నువ్వొకడివి నా మెడకి. పద, బావిలోనే, చెరువులోనే పడి చద్దాం. ఈ నరకం ఎవరిక్కావాలి?" అంటూ రాముణ్ణి పట్టుకోడానికి వెళ్ళింది. రాముడికి పరిస్థితంతా భయంకరంగా కనిపిస్తోంది. కొత్త లోకంలో వున్నట్టుంది. అమ్మ అచ్చంగా కథల్లో వచ్చే రాక్షసిలా కనిపించింది, తల విరబోసుకుని, కొంగు లేకుండా.... వెనక్కి వెనక్కి జరిగాడు. ఏడుస్తూ తలుపుదాకా వచ్చాడు. గడప దాటాడు. జేబులో చెయ్యి పెట్టాడు. పీపీ దొరకాలా అక్కడ? అప్పు గుర్తువచ్చాడు "దొంగతనం చేస్తే రాక్షసులొచ్చి.... అమ్మ చెప్పిన కథ గుర్తువచ్చింది. అతనికి పీపీ ఇవ్వడమే మంచిదనిపించి అక్కడ నుంచోకుండా అప్పు ఇంటి వేపు పరుగు తీశాడు.

# 18. శ్రాద్ధం

**బి.జి. రాఘవ**

నిన్న శనివారం, ఆఫీసులో శ్రీనివాసు రేపు వుదయం సినిమాకి వెళదామా అని అడిగినప్పుడు, "రేపు కుదరదండీ, మా అమ్మ మా నాన్న తిథి అని అన్నట్లు జ్ఞాపకం" అన్నాను. (అదేమిటండీ అలా మాట్లాడుతున్నారు? అంటూ అతని కళ్ళల్లో ఆశ్చర్యం, అనుమానం, తిరస్కారం, వ్యంగ్యం ప్రకటిస్తూ నా మొహంలోకి చూసినప్పుడు, నేను చెప్పిన తీరు తప్పని తోచి, చప్పున " లేదండి, తమాషాకి అన్నాను" అని సర్దుకున్నాను. "ఇలా అంటున్నారేమిటని ఆశ్చర్యం వేసింది నాకు." అంటూ తేలిగ్గా నిట్టూర్చి "మా నాన్నగారి అబ్ధికం కార్తీక శుద్ధ నవమి రోజున వస్తుంది. కార్తీకం మొదట్లోనే వెళ్ళి పురోహితుణ్ని తేదీ కనుక్కుని వచ్చేస్తాను. శ్రద్ధతో చేసేది కదా, శ్రాద్ధమంటే" అన్నాడు. "అవును" అన్నాను. (అయితే రేపు రావడం లేదా? "లేదు" అన్నాను)

ఉదయం స్నానానికి వెళ్ళినప్పుడు అమ్మ ముందు రోజు రాత్రి ఆరేసిన మడి పంచ ఇవ్వనా అంది. "ఒద్దు" అన్నాను మొరటుగా, మాట్లాడకుండా వెళ్ళిపోయింది. స్నానం చేసి ఉతికిన గుడ్డలు తొడుక్కుని వచ్చాను. తల దువ్వు కొన్నాక బయటకి వెళ్ళాలనిపించింది. గుడ్డలు తొడుక్కుంటూ వుండగానే అమ్మ వచ్చి పదకొండింటికల్లా వచ్చేయమంది. నేనా పొగ ముందు కూర్చోను. నా కిష్టం లేదు. అని గొణిగి వెంటనే అనిపించింది- నమ్మకం లేదని చెప్పాల్సింది. ఇష్టానికి నమ్మకానికి హస్తమశకాంతరం. నాకు నమ్మకం లేదా? లేక ఇష్టం లేదా? ఏది నిజం? అయితే, అన్నమాటని వెనక్కి తీసుకోవడం అసాధ్యం. అమ్మ తమ్ముడితో "కాస్త కాఫీ తాగరా దోషం లేదు" అంటే వాడు ఎగిరాడు.

ఇంటి నుంచి బయలుదేరాను. ఇష్టం లేదని ఎందుకన్నానా అని అనుకున్నా అదే సరియైన దనిపించింది. ఆమె జవాబు కోసం ఎదురు చూడకుండా బూట్లు వేసుకోసాగాను. నిజంగా నాకు ఇష్టం లేని, నేను ప్రేమించని పితృదేవతలు. నాన్న పట్ల నా మనసులో మిగిలి వున్నవన్నీ చేదు జ్ఞాపకాలే. తాను నింపి పెట్టిన నీళ్ళు ఇవ్వనని అరిస్తే కక్కసుకి వెళ్ళి కాయితంతో తుడిచెయ్యడం; పక్క మీంచి త్వరగా లేవలేదని తన్నులు తినడం, నుదుట బొట్టు లేకుండా భోజనానికి కూర్చున్నానని మొహం మీద ఉమ్మేయడం, అప్పుడు తను భోజనం ముందు నుంచి లేచి పోవడం; కాని నాన్న థర్మాన్ ఫ్లాస్కు పగల గొట్టినప్పుడు నాన్న ఏమీ అనకపోవడం; మర్చిపోవాలి అనుకున్నా భూతంలా వేధించే నాన్న జ్ఞాపకాలు నా మనసులో అమరత్వం పొందినా ఈ పితృ భూతం నుంచి నాకు విముక్తి లేదా అనిపించి నా నిస్సహాయత పట్ల నుదుటి మీద ముడత పడి మాయమయింది.

నిట్టూర్చాను. హోటల్లో టిఫెన్ తినాలనిపించినా తినకుండా కాఫీ తాగి రెండు సిగరెట్లు కాల్చాను.

ఇంటి కొచ్చేసరికి "చనిపోయిన వాళ్ళ మీద కూడా ఎందుకో అంతంత ద్వేషాలు" అంటున్న అమ్మ నన్ను చూడగానే వూరుకుంది. ఇంకా పురోహితులు రాలేదు. తమ్ముడు స్నానం చేసి మడి పంచ కట్టుకుని కూర్చున్నాడు. వంటకి వచ్చిన బ్రాహ్మడు వాడికి మంత్రం చెప్పి కొత్త జంధ్యం వేశాడు. నేను జంధ్యం వేసుకున్నది ఒకే ఒక్క రోజు. వదులైన మర్నాడే ఒత్తుకుంటోందని చెప్పి చిలక్కొయ్యకి తగిలించేశాక మళ్ళీ క్రిందటేడు నాన్న తద్దినం నాడు వేసుకున్నాను.

మనిషి చచ్చిపోగానే జనం ఎందుకతన్ని క్షమిస్తారు? ఎందుకు? ఇంతగా మన మీద ద్వేషం చూపించే ఈయనకి పోయేటప్పుడు ఒక్క చుక్క నీళ్ళు కూడా పోసే వాళ్ళుండరు చూస్తూ వుండు అని అన్న అమ్మ ఇప్పుడు మూడు రోజుల ముందు నుంచి శ్రాద్ధం గురించెందుకు శ్రద్ధగా మాట్లాడుతుందో నా కర్థం కాలేదు. చనిపోయిన వాడు దయ్యమై హింసిస్తాడనా? నరకంలో పడతాడనా? లేదా తను నరకానికి పోతానని భయమా? ఎందుకు? ఎప్పటేని పొడుపు కథలా అనిపించింది నాకు మనిషి స్వభావం.

నా కైతే నాన్న చనిపోయిన సంగతి తెలిసినప్పుడు దుఃఖం లాంటి వేవీ కలగలేదు. కళ్ళల్లో నీళ్ళు వస్తాయేమోననుకున్నాను. రాలేదు. అయితే శవం ఎత్తేటప్పుడు అందరూ ఏడుస్తుంటే నేను ఏడుపు ఆపుకోవడానికి ప్రయత్నిస్తుంటే ఎవరో నా వేపు చూసి ఈ అనాథ పిల్లల్నిక చూడలేమమ్మా అన్నప్పుడు నా కళ్ళల్లో నీరు రావడం మొదలెట్టింది. ఇది స్వంత దుఃఖం కాదు. ఇంకో ళ్ళేడుస్తుంటే ఎవరికైనా చూడలేక కళ్ళల్లో నీళ్ళొస్తాయి. నేను భావావేశానికి లోను కాకూడదు, అంటూ మనసులోనే అనుకున్నాను. నాన్నని దహనం చేసి వచ్చిన రోజు రాత్రి కళ్ళు మూసుకుంటే కళ్ళ ఎదుట మండుతున్న కాష్టం కనిపించింది....

పన్నెండింటికి పురోహితులు వచ్చారు. అక్క కొడుకుతో ఆడుకుంటున్న నేను గదిలోకి వెళ్ళి తలుపులు వేసుకున్నాను. కిటికీ లోంచి కనిపిస్తున్న ఆకాశాన్ని చూస్తూ అక్కడే కూర్చున్నాను. లాల్చీ పైజమా వేసుకుని వాళ్ళ ముందు తిరగడానికి సిగ్గు, మొహమాటం. దానితో బాటు ఏదో తప్పు చేస్తున్న భావన. కాని పురోహితుల 'ఎందుకు?' 'ఏమిటి' ప్రశ్నలకి మొరటుగా జవాబు చెప్పి ఇంట్లో వాళ్ళని నొప్పించడం ఇష్టం లేక గదిలో దూరి తలుపు వేసుకున్నానని నన్ను నేను సమర్థించుకున్నాను.

అప్పుడే ఒంటి గంటయింది. పొద్దున్నుంచి రెండు గ్లాసుల కాఫీ మాత్రం తాగి కూర్చున్నాను. తమ్ముడు అదీ తాగలేదు. వాడికి తలనెప్పి రావడం ఖాయం. శ్రద్ధగా పెట్టేదే శ్రాద్ధం. పురోహితుల మంత్రం, రాగం నెమ్మదిగా వినిపిస్తోంది. భోజనం చేసివచ్చారేమోనని అనుమానం. ద్వాదశి కూడా బ్రాహ్మణార్థానికి వచ్చిన వాళ్ళు కనీసం టిఫెనయినా తిని వచ్చి వుండాలి అని అనిపించినప్పుడు, మనుషుల మీద నా కెందు కింత అపనమ్మకం, ఆచారం, నియమ నిష్ఠ ప్రకారం నడుచుకునే వాళ్ళు కొందరైనా వుండకపోతారా అనుకుంటే, అలాంటి వాళ్ళు కొంతమందైనా వుండబట్టే భూమ్మీద ఈ మాత్రం వానలైనా పడుతున్నాయి, ఈ మాత్రం పంటలైనా పండుతున్నాయని చెప్పే ముసలాళ్ళ మాటలు గుర్తొచ్చాయి.

(కింద పొట్ట దురద పెట్టి గోక్కున్నాను. అక్కయ్య కొడుకుని ముద్దు పెట్టుకునేటప్పుడు వచ్చే వాసనెచ్చింది. పొద్దున్న అక్కయ్య లోపల న్యాప్‌కిన్ లేక పిల్లాడి మొలతాడుకి చిన్న తుండు గుడ్డ కట్టింది, "ఛా! అసహ్యం" అంటూనే.) (మొన్న సాయంత్రం ఇంట్లో వాళ్ళంతా కూర్చున్నప్పుడు పక్కింటి కుర్రాడు "పిల్లల్ని ఎవరు చేస్తారని అడిగితే, అక్కయ్య "దేవుడు" అంది. "వాళ్ళు ఎక్కడ్నించి వస్తారు?" అని అడిగాడు. "నేను చెబుతాను రారా" అని పిలిచాను. అక్కయ్య, చెల్లాయి, అమ్మ - అందరూ "వూరుకోరా" అని అరిచారు. అయినా వూరు కోకుండా చెప్పాను - "పొట్టలోంచి" అని, "గర్భకోశం" అన్న పదం వాడికి అర్థం కాదు గనుక. "మరి మా అమ్మ అడవిలోంచి వస్తారని చెప్పింది" అన్నాడు. "అబద్ధాలు" అన్నాను. "మీరే అబద్ధాలు చెబుతున్నారు" అన్నాడు. "పోరా" అన్నాను. అమ్మ నన్ను తిట్టడం మొదలెట్టింది. ఏం తిట్టిందో గుర్తులేదు కాని, నువ్వు పోకిరీ వయిపోడమే కాకుండా పిల్లల్ని కూడా పాడు చేస్తున్నావనడం గుర్తుంది.

ఉమ్మి మింగి చుట్టూ చూశాను. పుస్తకం, టేబుల్, కుర్చీ, గొడుగు, నల్లటి షూస్, గుడ్డలు, వులన్ ప్యాంటు, కోటు, పరుపు, 'ఏం చెయ్యాలిప్పుడు' అనుకుంటూండగానే నగ్నంగా అవ్వాలని పించింది. లేచి కిటికీ వేసి వచ్చి, నగ్నంగా నిలుచోవాలన్న నా చాలా రోజుల కోరికను తీర్చుకుందామని వొంటిమీద గుడ్డల్ని ఒక్కటొక్కటిగా విప్పసాగాను. నన్ను నేనే చూసుకున్నాను. విప్పి పడేసిన గుడ్డల వంక చూశాను. ఒక్క క్షణం కళ్ళు మూసుకుని నుంచున్నాను. నగ్నంగా వుంటే అన్నింటికీ కొత్త అర్థం కనిపిస్తుందన్న భావానికి దీనికి సంబంధం లేదనిపించి మళ్ళీ గుడ్డలు తొడుక్కున్నాను. గుడ్డలు వేసుకుంటుంటే అవి కొంచెం చల్లగా వున్నట్టనిపించాయి. కిటికీ తీశాను. మొహానికి చల్లటి గాలి

తగిలింది. ఆకాశంలో తెల్లటి మబ్బొకటి మెల్లిగా వెళుతోంది. పరుపు మీద కూర్చున్నాను.

మంత్రాల శబ్దం ఆగిపోయింది. నిప్పుల చిటపటలు కూడా. ఏం చేస్తున్నారో అన్న కుతూహలంతో చెవులు దోరగించాను. బ్రాహ్మణులు భోజనాని క్కూర్చున్నట్టుంది. వాళ్ళ భోజనం ఒక అరగంట అనుకున్నా పూర్తయ్యేసరికి రెండు గంటల సమయం అవుతుంది. ఆ తరువాత శాస్త్రాలన్నీ అయి వాళ్ళని బయటకి పంపించడాని కింకో అరగంట. సరి, నాకు భోజనానికి పిలుపు రావడానికి మూడవవచ్చు. విజృంభించిన ఆకలి మెల్లిగా తగ్గసాగింది. బయట కెళ్ళినప్పుడు టిఫెనయినా తిని రావల్సింది అనుకున్నాను. కాని అప్పుడు గుర్తు వచ్చినా తినాలని పించలేదు.

అలాగే పరీక్షగా విన్నాను. ఏమీ తెలీలేదు మెల్లిగా మాట్లాడు కుంటున్నట్టున్నారు. మాటలు కలిసిపోయి ఏమీ అర్థం కాలేదు. గారెల వాసనతో బాటు వంటాయన 'చారు', అనడం వినిపించి, భోం చేస్తున్నారు కాబోలనుకున్నాను. ఎవరో తలుపు తీసి ముక్కు చీదిన చప్పుడు. పురోహితులే అయి వుండవచ్చు. అసహ్యం! ఇంటి ముందే ముక్కు చీది, ధోవతి కొంగుతో తుడుచుకునే కుళ్ళు రకాలు! స్థిమితంగా అక్కడ పితృ దేవతలకు తృప్తిగా అవాలని అనుకున్న వంట బ్రాహ్మడు....

ఆకలి వల్ల నీరసం ఆవరించింది. పరుపు వేసుకని వెల్లికిలా పడుకున్నాను. తల వెనక్కి చేతులు కట్టుకుని ఎక్కడో గుడ్లలుతుకుతున్న చప్పుడు. 'బత్తాయిలూ' అన్న అరుపు. కళ్ళు తెరుచుకుని అనుభవిస్తున్న మధ్యాహ్నపు ప్రశాంతతలో పాయసం జుర్రుతున్న చప్పుడు. కచకచ నమిలి నమిలి తింటున్న శబ్దం శతాబ్దాల్నుంచి ఆకలితో అలమటిస్తున్నా రేమో ననిపించింది. నోట్లో వూరిన వూటని మింగాను. నరసింహుడు ఈ పాటికి భోం చేసి ఓ నిద్ర లాగించేసి వుంటాడు. మూడేళ్ళ క్రితం తండ్రిని పోగొట్టుకున్న నరసింహుడు ఇప్పుడు మొదటిసారి తండ్రికి తద్దినం పెడుతున్నాడని తెలిసినప్పుడు అందరూ నవ్వారు. దేవుడు బాగా బుద్ధి చెప్పాడు వాడికి అంది అక్క. పోయిన సంవత్సరం తండ్రి అబ్దికం రోజున వాడి పరుపు మీద పిల్లి దొడ్డి కెళ్లిందట. అది తండ్రి కోపం ప్రభావమే అయ్యుండాలని తప్పు ఒప్పుకుని వచ్చే సంవత్సరం నుంచి శ్రద్ధగా శ్రాద్ధం పెడతానని మొక్కుకున్నాడట.

ఆకలితో నిట్టూర్పి పక్కకి ఒత్తిగిలాను. జబ్బ ఎముక కలుక్కుమంది. కళ్ళు మూసుకుని గుండెల మీదున్న జుట్టులో వేళ్ళాడించాను. తొడల్లో దురద పెట్టింది. గోక్కున్నాను. జుట్టు పిరపిర శబ్దం వింటూ ఏమీ చెయ్యలేక పడి వున్న

నా మీద నాకే కోపం వచ్చింది. తొడ సందులో చెయ్యి వేసి కూర్చున్న ఖొజ్జా రాజులం మనం. కొజ్జాల కెందుకు మహాప్రాణం? కొజ్జా అల్ప ప్రాణి కదా! పురోహితుడు గారు కొజ్జా అయ్యుండొచ్చా? మా నాన్న కొజ్జా అయ్యుంటే శ్రాద్ధమూ లేదు. నేనూ లేను. దురద పెట్టింది. మరోసారి గజ్జల్లో గోక్కున్నాను. హాయిగా వుంది. సుఖంగా సంతోషాన్ని కలిగిస్తూ, గోకుడు, చిరునవ్వు. ఏం చేయలేక కళ్ళు మూతలు పడుతున్నాయి. నుదుటి మీద రుద్దుకున్నాను. మేలుకుని వుండాలన్న ప్రయత్నంలో కళ్ళు పెద్దగా తెరిచాను. కనుబొమ్మల్ని పైకెత్తి నుదురు చిట్లించాను. నిట్టూర్చాను. లేవడానికి, దొర్లడానికి విసుగ్గా వుంది. ఒకటికి పోసుకోవడానికి చాలా తొందరనిపించింది. వాళ్ళందరూ వెళ్ళిపోయే దాకా ఇలాగే అవస్థ పడాలి. మెడకి గొలుసు కట్టించుకున్న కుక్కలాగ. నాకు పెళ్ళయి వుంటే, నా పెళ్ళాం ఈ గదిలో వుండుంటే నా శ్రాద్ధానికి ప్రయత్నం చేసే అవకాశం దొరికుండేది. ఇప్పుడు నేను చస్తే నాకు శ్రాద్ధం లేదు. పురోహితులకి, బ్రాహ్మణులకి, రెండు రూపాయలు దక్షిణ, భోజనం, అన్నీ.... కళ్ళు మూసుకుని పడుకున్న నాకు గది తలుపు దగ్గర నుంచుని సరిగ్గా అగ్ని లోకి వుచ్చపోసినట్టు, తమ్ముడు ఆవేశంతో 'నిర్వంశుడైపో' అని శపించినట్టు అనిపించి బెదిరి కళ్ళు తెరిచాను.

మళ్ళీ మంత్రాలు వినిపిస్తున్నాయి. అన్నం బ్రహ్మ.... అంటూ ముందు వేపు తలుపు తెరచిన చప్పుడు. "వెనక వేపుకి రండీ" అన్న అమ్మ కంఠం కాకి పిండం పెడుతున్నారు. వెనుక వేపుకి వచ్చి పెట్టమంటోంది అమ్మ. బహుశః వాళ్ళు కాంపౌండ్ మీద ఎక్కితే నన్ను చూస్తారనే ఏమో. నేను ఆ కారణానికే పరుపు ఒక కొసకి లాక్కుని పడుకున్నది. ముందు వేపు తలుపు వేసిన చప్పుడు. అడుగుల చప్పుడు కరిగిపోయి పెరటి వేపు నుంచి హాయ్ హాయ్ హాయ్ అన్న అరుపు. కాకి రాకపోతే నాన్నకి తృప్తి కాలేదు. కోపం వచ్చింది అంటారు. అంటే అంటారు. కాకి వచ్చిందో లేదో నన్న ఆలోచన రావడమే మూర్ఖత్వం అనిపించింది. బ్రాహ్మణార్థానికి వచ్చిన వాళ్ళల్లో ఒకడంటున్నాడు. పితృదేవతలకి తృప్తి కలిగిందయ్యా. ఒకటా, రెండా, నాలుగైదు రాకపోవడ మేమిటి? అనుకున్నాను.

మంత్రం, మళ్ళీ మంత్రం, ప్రాచీనా....మంత్రం ఉపవీల మంత్రం, ప్రాచీనా.... మంత్రం, ఉపవీల మంత్రం, ఇక ఇది అవడమంటూ వుండదా అనుకుంటుండగా నమస్కారం చేసే వాళ్ళంతా చేసెయ్యండి అన్నారు పురోహితులు. ఒకరి తరువాత కళ్ళు నమస్కారం చేస్తుండవచ్చు. పితృ పితామహ (జలగ) లకి నమస్కారం భో అభివాదయే, అహం రాఘవ శర్మం భో

అభివాదయే, పురోహితుల వారు చెబుతున్నారు. పితృ పితామహ ఉత్తి తరువాతింకా ఏదేదో చెప్పి ఉత్తిష్ఠ అన్నారు. సరిగ్గా వినిపించలేదు. స్నేహితులు అప్పుడప్పుడు నీకు చెవుడేమిట్రా? అనేవారు 'ఏమిటి?' అని మళ్ళీ అడిగితే కాయేన వాచా, మనసేంద్రియైనం- మంత్రం, మంత్రం....

సర్వం శ్రీకృష్ణార్పణమస్తు అన్నారు పురోహితులు. హమ్మయ్య పూర్తయిందనుకున్నా. ఊహు మంత్రం వినిపిస్తోంది. శతమానం భవతి, శతాయుః పురుషేంద్రియో అంటూ మంత్రాలు అలాగయితే నమస్కారం చేస్తున్నారన్నమాట. మంత్రం ఆగిపోయింది.

నిశ్శబ్దం కళ్ళు మూసుకున్నాను. ఓ రకమైన ఖాళీ మంచం క్రింద వెలిగించిన ప్రమిద కోసం కళ్ళు తెరిచాను. నిశ్చలంగా వెలిగే ప్రమిద అప్పుడప్పుడు కళ్ళ ముందు కనిపిస్తూ వుంటుంది. ఎవరినైన మనశ్శాస్త్రజ్ఞుడి నడిగితే నాన్నతో కలిపి సంబంధం చెప్పవచ్చు.

తమ్ముడు, చెల్లాయి మాట్లాడుతున్నారు. పురోహితులు వెళ్లిపోయి వుండొచ్చు. పితృ పితామహులూ వెళ్ళిపోయారు. వెళ్ళారా? గచ్ఛ గచ్ఛ పితృ పితామహ తృప్తోస్మి భావేవే. పదకొండో రోజునో పన్నెండో రోజునో గుర్తు లేదు. ప్రేత స్థానంలో కూర్చున్న వాడితో భోజన మయ్యాక "హే ప్రేత గచ్ఛ గచ్ఛ గచ్ఛని గచ్ఛ" అని గట్టిగా అరవాలనిపించింది. అడుగుల చప్పుడు వినిపించింది. బహుశః అమ్మ ఇప్పుడొచ్చి తలుపు తడుతుంది. ఎవరో తలపు తడుతున్నారు. శ్రద్ధగా విన్నాను. ఎవరూ లేరు. నా భ్రమ అంతే. ఎవరో ఏదో తింటున్న చప్పుడు. తమ్ముడేమో, గుమ్మం ముందు నీళ్ళు చల్లి ముగ్గు పెట్టమంటోంది అమ్మ.

అర్ధరాత్రి హఠాత్తుగా మెలకువా నిద్ర కాని. స్థితిలో దేనికోసమో ఒళ్ళు, మనసు తడుముకున్నట్లయి, మళ్ళీ నిద్రలో పడ్డాను. తరువాతెప్పుడో తెలీదు. కిటికీలోంచి ధడాల్న పొడుగాటి పెద్ద ఎర్రమూతితో మూలం లాంటి, రోకలి లాంటి, నదీ స్థంభం లాంటి శిశ్నం లాంటిదేదో దూసుకొచ్చి గుండెల్ని గుద్దినట్టయితే అరుస్తూ మేలుకున్నాను. అమ్మ ఏదో అంటున్నారు. సిగ్గుతో నేనేమీ మాట్లాడ్డం లేదు. మెలకువగా వున్నానని తెలపటానికి గొంతు సర్దుకుని దగ్గాను. ఛూ ఎప్పుడూ లేనిది ఇవాళే అరవాలా నేను అన్న వ్యధ కలిగింది, చెల్లాయి ఏమిటమ్మా అంది. ఏదో దుస్వప్నం, అరిచాడు అని వూరుకుంది అమ్మ.

# 19. నివృత్తులు

**పి.లంకేశ్**

అచ్చు మొహం చూడకుండా చచ్చిపోయిన నా మొదటి నవల రాస్తున్నప్పుడు నేను లాల్ బాగ్ మూల రాతి బెంచీ మీద కూర్చుని నా అనుభవాలు నెమరేసుకుంటున్న రోజులు. రచయిత ఒక విచిత్రమైన జంతువు. దానికి కొన్ని సార్లు తన తోక నీడను పట్టుకోవడానికి ప్రయత్నించి అలసట కలుగుతుంది. దట్టమైన అడవి దారి పట్టి, దారి తెన్ను లేకుండా వూరికే అడుగులేస్తూ వెళుతుంది. ఒంట్లో కొవ్వు పెంచుకుని ఈ ప్రాణి మాంసం, సస్యం, పాప పుణ్యాలని దిక్కించుకుని పొదుగు తేలిక పడిన గేదెలా బురద నీటిలో పడి, చక్కర్ కొడుతుంది.

నిజం చెప్పాలంటే చట్టం, కట్టుబాట్లు, ఇరుకైన నిజాయితీ వీటిలో నాకు నమ్మకం తక్కువ. డబ్బు చాలా సుఖాల్ని తేగలదని తెలిసినా శ్రీమంతుల పట్ల గౌరవం తక్కువ. అధికారం పట్ల విసుగు. నా పై అధికారుల్ని దూరం నుంచే గుర్తించి మరో దారి వెంట సాగిపోవడం నా అలవాటు. నన్ను ఎరిగిన అనేక మంది దీన్ని గర్వం అంటారు. కొంతమంది చేతకానితనం అంటారు. నా తప్పుల్ని గేలి చేస్తూ, నన్ను క్షమించి ప్రేమని చూపించగల స్నేహితులే నా ఆస్తి. నేను మరీ మొరటుగా మొండిగా ప్రవర్తించినా సహిస్తూ నన్ను కోరుకునే నా భార్య, కూతురూ నా ప్రాణం.

రచయిత కొన్ని గుణాలని పెంపొందించు కోవాలట. అన్నిటి కన్న ఎక్కువగా భావాలని. అది అతను తన ప్రాణాల్ని నిలుపుకునే మార్గం. ముప్పయ్యేళ్ళకే "రాక్షసుడొచ్చి" మన రొమ్ము తట్టి కొరలే మెలేస్తాడు. జీవం తొణికసలాడే వ్యక్తి యొక్క చమట వాసన తగిలినా చాలు. తన ఓటమిని ఒప్పుకుని పారిపోతాడు. లేకపోతే ఆ 'రాక్షసుడు' మనలో జీవాన్ని తీసికెళ్ళిపోతే ఆ తరువాత మనం ఒట్టి తోలు తిత్తుల్లో తిరగాల్సి వుంటుంది. ఆ రాక్షసుణ్ణి తరిమి కొడుతూ ఏట్స్ విని తన వయసుని చాలా కాలం సొంపుగా వుంచుకోవడానికి ప్రయత్నించి సార్థకత పొందాడు.

లాల్ బాగ్‌లో గడ్డి మీద, బుర్ర నిండా కోతుల్ని నింపుకుని వూరికే కూర్చున్నాను. సంతోషం నింపుకుని పదేళ్ళ అమ్మాయిలు లంగాలు కట్టుకుని, నడవలేక గెంతుతూ తిరుగుతారు. కుర్రాళ్ళు, కోమట్లు, సింధీలు, బెంగళూరు చూడ్డానికి వచ్చిన ధారవాడ వేపు పిల్లలు, మాస్టర్లు, ఏకాంతం కోరుకునే ప్రేమికులు. నాలుగేళ్ళ పిల్లా చేతితో వేలు పట్టించుకుని, చంకలో ఏడాది పాపనెత్తుకుని తిరిగే గుమాస్తాలు; తోడెవరూ లేకుండా ఒక్కణ్ణే కూర్చున్న నన్ను

చూసి, నవ్వి, వ్యాఖ్యానిస్తూ వెళ్ళే కొంటె అమ్మాయిలు, జాలిపడే వాళ్ళు.... మనిషి ఒక్కడే వుంటే నిజంగా కళ్ళు తెరచే వుంటాడు.

ఓ ఆదివారం ఇద్దరు ముసలి వాళ్ళు నేను కూర్చున్న చోటికి వచ్చారు. అందులో ఒకతను కొంచెం లావుగా, ఎత్తుగా వున్నాడు. గుండ్రటి మొహం, శుభ్రంగా క్షౌరం చేసుకుని, నామం పెట్టుకున్నాడు. బనీను వేసుకోకుండా శుభ్రమైన తెల్లటి వదులు చొక్కా వేసుకున్నాడు. అందువల్ల అతని రొమ్ము మీదున్న తెల్లటి వెంట్రుకలు పొట్ట, శరీరం అతని వొంట్లో ఎక్కువ జీవం మిగల్లేదని తెలుపుతున్నాయి. మరొకతనికి అదే వయసు సన్నగా కుక్కని కొట్టే కర్రలాగ వున్నాడు. అతని తల్లో అక్కడక్కడ ఒక్కో వెంట్రుక కనిపిస్తోంది. కొన్ని నల్లవి కూడా. అతని మొహంలోని అసంఖ్యాకమైన ముడతలు చూస్తుంటే అతని మొత్తం రూపమే మర్చిపోయేటంత ముడతలు పడ్డ మొహం అది. అతని కళ్ళల్లో కొంచెం వెలుగు వుంది. నాకు ఎవరితోనన్నా మాట్లాడాలన్న కోరిక గాని, మాట్లాడకూడదన్న పట్టుదల గాని లేవు.

లావుపాటి ముసలాడు బొత్తిగా మొహమాటం లేకుండా ఇంగ్లీషులో మే మిక్కడ కూర్చోవచ్చా? అని అడిగాడు. "ఓహో" అన్నాను. ఆయన సంతోషంగా వాకింగ్ స్టిక్ కింద పెట్టి కూర్చుంటూ "రండి, ప్రహ్లాదరావుగారూ, కూర్చోండి" అన్నాడు. సన్నగా వున్నాయన మొహమాటంతో తటపటాయిస్తుంటే నేను, "రండిసార్, కూర్చోండి" అన్నాక వచ్చి కూర్చున్నాడు. అంతవరకు వాళ్ళిద్దరి మధ్య చాలా సంభాషణ జరిగి వుండాలి. ఇద్దరే వున్నప్పుడు ఎక్కువ సేపు సంభాషణ సాగదు. మూడో మనిషితో కబుర్లు చెప్పడానికి ఇద్దరూ సిద్ధంగా వున్నారు. లావుపాటి ముసలాయన కాసేపు మామూలు విషయాలు మాట్లాడాడు. లాల్ బాగ్ చాలా బాగుంది అన్నాడు. గాలి చల్లగా వుందన్నాడు. పొడుగాటి చెట్లని కళ్ళతో కొలిచాక నా వేపు చూసి, "స్వామీ, మీ పేరు అడగొచ్చా?"

అతన్నుంచి మరికొన్ని ప్రశ్నలు రాకుండా "లంకేశప్ప, అని నాపేరు. ఇక్కడే సెంట్రల్ కాలేజీలో పనిచేస్తున్నాను. పెళ్ళయింది" అని నవ్వాను.

ముసలాయన కహకహ నవ్వాడు (పాచిపళ్ళు) "హహ్హహ్హా! మీ జవాబు భలేగా వుంది. నేనేమీ పిల్ల నివ్వడానికి రాలేదనుకోండి. చూడండి, ప్రహ్లాదరావుగారూ, చూశారా ఈ కాలం పిల్లల జవాబులు ఎలా వుంటాయో. మీరు మా అమ్మాయికి వరుడు దొరకలేదన్నప్పుడు సీరియస్‌గా తీసుకోనే లేదు. మీ అమ్మాయికేం, బంగారు బొమ్మలా వుందనుకోండి. ఆమెకి వరుణ్ణి వెతికే పని నాకు వదిలెయ్యండన్నా వినలేదు మీరు." అంటూ ఆ లావుపాటాయన

అన్నప్పుడు, ప్రహ్లాదరావుగారన్న మనిషి తన స్వంత విషయం గురించి సంభాషణ పెంచడం ఇష్టం లేక నాతో, "మేమిద్దరం ఇక్కడే రెవిన్యూ ఆఫీసులో పని చేసే వాళ్ళం. ఇప్పుడు రిటైరయ్యాం. ఈయన మా బాస్ నరసింగరావు గారని" అన్నాడు.

"బాస్‌గా వుండేవారు అనండి ప్రహ్లాదరావుగారూ. ఇప్పుడు రిటైరయ్యాక స్నేహితులం మాత్రమే. అన్నీ ఆ సర్వేశ్వరుడి లీల". అంటూ నరసింగరావు గారు నశ్యపు డబ్బీ తీశారు.

సంభాషణ పొడిగించే సూచన.

నేను వయసుని గౌరవిస్తాను. ఆ గౌరవంలో కొంచెం భయం కూడా వుందేమో. నేనూ వృద్ధాప్యాన్ని ఎదిరించాలి అన్న భయం. అందుకే వాళ్ళ కథలో ఆసక్తి పెంచుకున్నాను. నరసింగరావు గారు తమ దర్పం, దర్బారు గురించి మాట్లాడారు. ఆయన 'షికారిపురా'లో తాసిల్దారుగా వున్నప్పుడు, పోకిరీ వాడిగా పేరు మోసిన 'ఉగ్ర' అనేవాడి ఇంటిని జప్తు చేసి, అరవై బస్తాల ధాన్యం బయటకి తీయించడం, తమ ఆఫీసులో ఎవర్నీ లెక్క చెయ్యని గోవిందరాజు అన్న గుమాస్తాని సస్పెండ్ చేసి, కాళ్ళు పట్టుకునే పరిస్థితికి తేవడం, ఏ అధికారినీ లెక్క చెయ్యని టైపిస్ట్ మీరాని రిమార్క్ రాస్తానని బెదిరించి తమ ఇంటి చుట్టూ తిరిగేలా చేసుకోడం....ఇలా తన కథ చెప్పుకుంటూ ఆయన ప్రహ్లాదరావు గారి వేపు తిరగడం, ఆయనేమో సందర్భోచితంగా "కాదు, మరీ!" "ఆహాఁ" "అవును మరి", "వాడి కామాత్రం బుద్ధుండొద్దూ?" అంటూ అనడం నేనేమో ఈ ఇద్దరి ముసలాళ్ళ నాటకాన్ని ఉచితంగా చూసేవాడిని. ఈ నాటకపు నేపథ్యం చాలా సరళం. నరసింగరావు తన ఆఫీసు బ్రతుకుని సమాధి నుంచి బయటకి తీసి ప్రహ్లాదరావుకి తన గొప్పతనాన్ని గుర్తు చేసేవాడు. ప్రహ్లాదరావు యంత్రంలా "కాదు, మరీ!" "ఆహా!" అంటూ చేర్చేవాడు.

ఒకరికి ఇప్పుడు అధికారం లేదు. మరొకరికి విధేయత లేదు. స్నేహితులవ్వాలని ప్రయత్నిస్తున్నారు, ఓడి పోతున్నారు.

ప్రపంచానికి తన అస్తిత్వాన్ని చూపించాలన్నా నరసింగరావు కోరికని అతని మాటలు వింటూ నేను నెరవేరుస్తూ వున్నట్టుంది. వినటంలో నేను గట్టివాడిని. నరసింగరావు చెప్పవల్సింది చాలా వున్నట్టుంది. చాలానే మాట్లాడాడు. ఈ కాలపు ఆఫీసర్లని తిట్టాడు. ఈ కాలపు ఆఫీసర్ల మాట కుక్కలు కూడా వినవని, తన తరువాత అధికారుల్ని ఉదాహరణగా చెప్పి రుజువు చెయ్యడానికి ప్రయత్నించాడు. ఇప్పుడిప్పుడు లంచాలు వగైరా తల - తోక లేకుండా పెరిగిపోయాయి. అప్పుడూ లేవనుకోకండి, వుండేవి. పై అధికారులు కాస్త

హద్దుల్లో వుంచే వారు. ఇప్పట్లా బరితెగించి పోలేదు. కదూ రావుగారు? అప్పుడు మీరు కట్టించారే ఆ ఇంటికి అద్దె ఎంత వస్తుందేమిటి? గృహ ప్రవేశపు సమారంభం జోరు ఇంకా గుర్తుంది. గుమాస్తాగా వుండి అంత పనిచేశారు కదా, గట్టివారు మీరు- అన్నాడు.

ముసలాయన చౌకబారు అభిరుచిని గమనించి నా రక్తం వేడెక్కింది. అందుకే అడిగాను, "మీరేమీ సంపాయించ లేదనుకుంటా. లేదా అవకాశం దొరకలేదా....?

"స్వామీ, కాస్త వినండి....నేనే తల్చుకుంటే లక్షల్లక్షలు సంపాయించే వాడిని. అలాంటి ఎంగిలి మెతుకులికి ఆశపడే వాడిని కాను. అలా సంపాదించి వుంటే ఇవాళ అద్దె కొంపలో ఎందుకు పడుండాల్సొచ్చేది? కొంతమంది వున్నారు - బురదలో పడ్డ నయా పైసని నాలుకతో తీసుకునే వాళ్ళు! వాళ్ళని దేవుడూరికే వదిలి పెడతాడా? ఒట్టి ఆడపిల్లల్నే ఇచ్చి, పెళ్ళాన్ని మరొకరి పాలు చేసి రోగిష్టుల్ని చేసి పీడిస్తాడు. దేవుడు తనే అన్నీ చూసుకుంటాడుగా మరి...."

ముసలాయన బుర్ర నిండా బయటికి రావాలని కాచుక్కూర్చున్న విషపు టాలోచనలు. అతనికి తెలిసో, తెలియకో ప్రహ్లాదరావుని తిడుతున్నాడు. అప్పుడు ప్రహ్లాదరావు వేపు చూసే ధైర్యం కలుగలేదు నాకు. ఇద్దరూ సప్త సముద్రాలకి అటు -ఇటు నీడల రూపంలో పిచ్చిగా తిరిగే జీవులు. స్నేహం పెంచుకోవల్సిన సమయంలోనే 'దెయ్యం', చిగుళ్ళని కత్తిరించి వేస్తోంది. మొగ్గలు కమిలిపోతున్నాయి. నా పక్కన కూర్చున్న ఆ రెండు దేహాల చుట్టూరా పుట్టలు పెరిగి ప్రాణం ఎక్కడో లోతున మూలుగుతోంది. వాళ్ళ నోటి నుంచి వెలువడ్డ మాటలకి తుప్పు పట్టి 'చలామణీ' ని పోగొట్టుకున్నాయి.

× × ×

నేను చిన్నప్పుడు పంచదార కోసం ఏడ్చేవాడిని, పెద్దయితే అటక మీది పంచదారంతా తినవచ్చు కదా అన్న ఆశతో రోజూ ఎంత పెద్ద వాడి నయ్యానా అని చూసుకునే వాడిని.

కాని నిజంగా పెద్దవాడయ్యే సరికి పంచదార మీద ప్రీతి పోయింది. పెరగడం గురించిన ఆసక్తి తక్కువయింది. కొత్తరకం ఆసక్తి, కుతూహలం బ్రతుకుని పండించ సాగాయి.

కుతూహలం చాలా మంచి గుణం అయ్యుండాలి. మర్నాడు లాల్‌బాగ్‌కి మొదటగా వచ్చిన వ్యక్తి ప్రహ్లాదరావు, నేను నిదానంగా గోళ్ళు కత్తిరించుకుంటూ కూర్చున్నాను. ఆయన ఇవాళ నిన్నటి కంటె లావుగా కనిపిస్తున్నాడు. నరసింగరావు పక్కన లేక పోవడం వల్ల అయ్యుండచ్చు. ఠీవిగా "గుడ్

ఈవెనింగ్" అంటూ వచ్చి కూర్చుని "నరసింగరావు ఇంకా రాలేదా? రావల్సింది కదా!" అన్నాడు.

నేను సరదాగా "తమ నిజాయితీ, హెూదాల గురించి ఎవరికో లెక్చరిస్తూ వుండవచ్చు" అన్నాను.

ఆయనన్నాడు, "అయ్యో రామ, ఆయన నిజాయితీ ఎవరికి తెలియదు గనుక!".

"అంటే ఆయన చెప్పినదంతా అబద్ధమా?".

"అయ్యో, చాల్లెండి, వెట్టి తిరుగుబోతు. సంపాదించిందంతా ఆడాళ్ళ మీద పోశాడు. ముగ్గురు పెళ్ళాల్ని పొట్టన బెట్టుకున్నాడు. ఆఫీసులో మీరా అన్న టైపిస్ట్ వుండేది. ఆమెని శనిలాగ పీడించుకు తిన్నాడు. ఆఖరికామె చెప్పు చేతిలోకి తీసుకోవల్సివచ్చింది."

"అహ! తరువాత!"

"అయ్యో రామ! ఎందుకడుగుతారు? ఆయనదీ ఓ బతుకేనా? ఇప్పుడు మళ్ళీ పెళ్ళి చేసుకుంటాడట. దుర్మార్గుడు!"

ప్రహ్లాదరావు నిన్న పడిన అవమానానికి ప్రతీకారం తీర్చుకుంటున్నాడు. దూరాన నరసింగరావు కనపడగానే ఇతను తొందర తొందరగా కథ చెప్పి పూర్తి చేస్తూ గట్టిగా నవ్వేసరికి నరసింగరావు వచ్చి చేరాడు. అతను మొదటే అనుమానం మనిషి. "ఎందుకో నవ్వారే" అన్నాడు. ప్రహ్లాదరావు అబద్ధం చెప్పి నేరు మూయించడానికి ప్రయత్నించాడు. నరసింగరావు నమ్మినట్టు నటిస్తూ కోపాన్ని దిగమింగాడు. తల-తోక లేకుండా మాట్లాడ సాగాడు. అమ్మాయిలకి వరుళ్ళ దగ్గర్నుంచి, లంచగొండి తనం వరకూ మాట్లాడాడు. ప్రహ్లాదరావుని ఉదాహరణగా తీసుకున్నాడు. నాకు విసుగొచ్చింది. ఇక ముందు ఇక్కడ కూర్చోకూడదని తీర్మానించుకున్నాను. నరసింగరావు నేరు మూయించాలని కొంచెం గడుసుగా "స్వామీ మీ కెందరు పిల్లలు?" అని అడిగాను.

"లేరు"

"ఉండుంటే అతనికి నా వయసుండేది. ఏమీ అనుకోకండి. స్నేహం చాలా గొప్పది. తమరు ఇలా మాట్లాడ కూడదు. ప్రహ్లాదరావుగారు నొచ్చుకుంటారు." అన్నాను. (ఆయన గట్టిగా నవ్వాడు. పొట్ట ఎగిరెగిరి పడింది)

"హ హ హ! నాకు తెలియని వాడా ప్రహ్లాదరావు? నా ఎదుటే కళ్ళు మూసుకుని పాలు తాగినవాడు." అంటూ చనువు చూపించడం కోసం ఆయన భుజాన్ని తడుతూ, కళ్ళల్లో కొంటెతనం చూపిస్తూ, (ప్రహ్లాదరావు నవతలికి పంపి నాతో మాట్లాడాలన్న కోరికతో కాబోలు) "రావుగారూ, అక్కడ వేరుసెనక్కాయ

లమ్మేవాదున్నాడు. వెళ్ళి రెండణాల కాయలు పట్రండి. ఇదిగో డబ్బులు, తొందరగా రండి." అన్నాడు.

ప్రహ్లాదరావు లేవలేదు. తను లేసెపుడు ఇంకా అసహ్యాంగా మాట్లాడవచ్చని ఆయన భయం. అంతకంటే, తన బ్రతుకులో మొదటిసారిగా తన పై అధికారిగా వున్నవాడి మాటని ఎదురించే ధైర్యం చేసి కూర్చుండి పోవడం ఇంకా ఎక్కువ. మొహం గంటుపెట్టుకుని "మీరే వెళ్ళిరండి" అన్నాడు.

నా ఎదుట తన ప్రతాపాన్ని గొప్పలు చెప్పుకున్న నరసింగరావుకి తన చేతి క్రింద పని చేసిన మనిషి అడిన తిరస్కారపు మాట ముద్ద మింగుడు పడనట్లుగా అయింది. అనిరీక్షితమైన అతని సమాధానం విని తెల్లబోయినా, అంతలో ధైర్యం కూడగట్టుకుని, పాతదర్పాన్ని ప్రతి మాటలోనూ నింపుతూ "వెళ్ళండి రావుగారూ, ఎంత పొగరండి మీకూ" అన్నారు.

"మీరే వెళ్ళండి రావుగారూ, మీకెంతండి పొగరూ?" అన్నాడు ప్రహ్లాదరావ్, అతని మర్ది మొహంలో హాస్యం పోయి కోపం తొంగి చూస్తోంది. "స్వామీ, నరసింగరావు గారూ, మీకోరిక చెల్లదు. ఏమిటో పెద్ద గొప్పలు పోతావు. ఎవరికి తెలీదు నీ అసలు నంగతి. మీరు చెప్పుతో కొట్టడం, గోవిందరాజు ఫైలుతో నెత్తిమద కొట్టడం...." అన్నాడు. నరసింగరావు కోపంతో కఱ్ఱ తీసుకుని పైకి లేచాడు. "ఒరీ భడవా.... నోరు మూస్తావా, పూజ కావాలా?"

ఇద్దరు ముసలాళ్ళూ లేచి నుంచుని పిచ్చి కుక్కల్లా అరుస్తున్నారు. దాక్షిణ్యానికో, మొహమాటానికో ఇంతవరకు అణచుకున్న భూతాలు లేచి గెంతుతున్నాయి. నాకు భయమేస్తోంది. బ్రతుకు లోతుల్లోకి ఈ ఇద్దరూ నన్ను ఏసిరేస్తున్నారు. ఏదో నెపంతో నరసింగరావు ప్రహ్లాదరావు ఇంటికి వెళ్ళి అతని కూతురి మీద కన్నేసి వుండాలి. ప్రహ్లాదరావు రావద్దని ఖచ్చితంగా చెప్పడానికి ఇంతవరకూ మొహమాట పడుతూ వుండివుండాలి. ఇంతవరకూ బ్రతికిన బ్రతుకు వాళ్ళకి బరువుగా వుండివుండాలి....అదే తెలుస్తోంది.

చేతులూ చేతులూ కలుస్తాయేమోనని నేను ప్రహ్లాదరావుని(సన్నగా వున్నందు వల్లననుకుంటా) దూరంగా తీసికెళ్ళాను. "సార్, నరసింగరావుగారూ. ఈ వయసులో ఇలా పోట్లాడు కోవడం ఏమీ బాగోలేదు. వెళ్ళండి, ఇంటికి వెళ్ళండి". అన్నాను.

ప్రహ్లాదరావు: "ఇల్లు కూడా వుందనుకుంటున్నారా ఆ వూర కుక్కకి?" అన్నాడు.

నరసింగరావు: "అందుకేగా నీ ఇంటి కొచ్చేది, నీ కూతురు, పెళ్ళాము వున్నంతవరకూ నా కెందుకు పెళ్ళి?".

ఆ వయసులో వున్న మనిషి ఆడది, పెళ్ళాము అని మాట్లాడ్డం చూసి నాకు నవ్వొచ్చేందుకు బదులు తీవ్రమైన బాధ కలిగింది. స్త్రీ అతనిలో చాలా రకాల కల్పనలని రేకెత్తించి వుండొచ్చు. కాని అతను ఏ సంబంధానికైనా అయోగ్యుడిగా పెరిగి ఎప్పుడో 'రాక్షసుడి'కి తన ప్రాణాల్ని అమ్ముకున్నాడు. గుంపు వదిలిన పక్షిలా రాను రాను నాశన మవుతున్నాడు. ఒట్టి రక్తమాంసాలున్న బొందిలా తిరుగుతున్నాడు.

× × ×

ఆఫీసులో తమ వ్యక్తిత్వాలని నిర్ధారించుకొని ఆ ఇద్దరు మనుషులూ గడచి పోయిన సంవత్సరాల బరువు క్రింద పడి మూలుగుతూ వుండడాన్ని చూసినమీదట విశాలంగా గగన చుంబితంగా పెరిగిన వృక్షాల స్వచ్ఛందతని ఎంతో మెచ్చుకున్నాను.

చలి కాలంలో ఆకులు రాలి, బోసిపోయిన చెట్లు వసంతంలో పచ్చగా చిగురించి తమ ఔదార్యాన్ని చాటుకుంటాయి. హర్ష ధ్వానాలు చేస్తాయి. తగిన ఋతువుల్లో ఉత్సాహంతో గెంతే ఆడ-మగ జింకలు, మిగితా వేళల్లో తమ తమ కర్తవ్యాలను పాటిస్తూ ప్రశాంతంగా వుంటాయి. అన్నానికి, ఆనందానికి అడ్డు లేనప్పుడు ఎంతటి సత్సంకల్పం సద్బుద్ధి వాటికి!

ఇవన్నీ వెట్టి నా భావాడంబరం కావొచ్చు. కాలం మించి పోయాక పువ్వుని కాయగా చెయ్యలేని, నీడ కూడా ఇవ్వని, పొయ్యిలోకి పుల్లల్ని కూడా ఇవ్వలేని నిష్ప్రయోజకమైన చెట్లు లేవా? పిల్లల్ని కనని, ఎవరికీ ఉపయోగంలేని ప్రాణులు లేవా?

పోలికని మించిన నొప్పి, కాంక్ష నన్ను ముసురుకుంటున్నాయి.

చుట్టూ చిన్న పిల్లలు పరికిణీలని గిర్రున తిప్పి చేతుల్ని ఎసిరి గెంతుతున్నారు. ఆనందంతో కేకలు పెడుతున్నారు.

(అటు వేపు కొత్తగా పెళ్ళయిన వాళ్ళు చేయి-చేయి పట్టుకుని దగ్గరగా నడుస్తున్నారు. నేను కూర్చున్న వేపే వస్తున్న నా విద్యార్థి-విద్యార్థినులు నన్ను చూసి మరో వేపు వెళ్ళిపోతున్నారు.

అమితమైన బాధ.)

బాధకు మారుగా ఔదార్యం కలుగకూడదా? సంతోషం నాలో నిండి హర్షోద్గారం వెలువడ కూడదా? రోజులు నన్ను రహస్యంగా చంపటంతో బాటు, ఒకింత జీవరసాన్ని నాలో చిలికించ కూడదా? వృక్షంలా విస్తరించి, పక్షపాతం లేకుండా, సంకుచితత్వం లేకుండా నీడనిస్తూ, పూలు పుష్పిస్తూ వుండే అవకాశం దొరక్కూడదా?

# 20. అబచూరు పోస్టాఫీసు

కె.వి.పూర్ణ చంద్ర తేజస్వి

కొత్తగా మొదలైన అబచూరు పోస్టాఫీసులో తాత్కాలికంగా పోస్టుమాస్టరు గా వున్న బోబణ్ణ ఈ రోజు మహా అసంతృప్తిగా, ఏదో ఇబ్బందిలో పడ్డట్టుగా వున్నాడు. మొదట అతను అబచూరులో షాహుకారైన అల్లిజాగ్ సాయిబుగారి తోటలో రైటర్‌గా పనిచేసేవాడు. అబచూరులో కొత్తగా పోస్టాఫీసు తెరచినప్పుడు బోబణ్ణ సాయంత్రం ఓ గంటా, పొద్దున్న ఓ గంటా తాత్కాలికంగా పోస్ట్‌మాస్టర్‌గా పనిచెయ్యడానికి ఒప్పుకున్నాడు. బోబణ్ణ అలా ఒప్పుకోకపోతే అబచూరికి పోస్టాఫీస్ వచ్చేదే కాదు. ఎందుకంటే, ఆ వూళ్ళో ఇంగ్లీష్ అక్షరాలంటూ తెలిసిన వాడెవడూ లేడు. ఇంగ్లీషు తెలిసిన మరొకడెవరైనా సరే ఆ మారుమూల పల్లెకి అతి తక్కువ జీతానికి రావడమంటూ వుండదు. బోబణ్ణ ఒప్పుకున్నాక వాళ్ళ అత్తగారిల్లే తాత్కాలికంగా పోస్టాఫీసుగా రూపాంతరం చెందింది. అంచేత పోస్టాఫీసు తెరిచిన కొద్ది రోజుల్లోనే బోబణ్ణా, పోస్టాఫీసు విడదీయలేని బంధంగా మారింది.

పోస్టాఫీసు ఆరంభమయింది. అందరూ బోబణ్ణని పోస్టుమాస్టారూ అని గౌరవంతో పిలిచేవారు. బోబణ్ణకి తను ఢిల్లీతో సంపర్కం పెట్టుకున్న భారతీయుణ్ణి అన్న గర్వం కలిగింది. బోబణ్ణ చదువుకున్న ఎస్సెసెల్సీ ఇంగ్లీషు ఎన్నో సార్లు అతని పోస్టాఫీసు పనులకి చాలదని అనిపించేది. దాని కోసరం ఓ పాత ఇంగ్లీషు - కన్నడం డిక్షనరీ దగ్గర పెట్టుకున్నాడు. బోబణ్ణ అత్తగారింట్లోనే వుంటున్నాడు. అతని అత్త, భార్య కూడా సాయిబు గారి తోటలోనే చాలాకాలం నుంచి పనిచేస్తున్నారు. బోబణ్ణది సకిలేశపురం దగ్గర కొడలి పేట అన్న పల్లెటూరు. అక్కడ తను వ్యాపకం లేక పోకిరీగా తిరుగుతున్నప్పుడు బోబణ్ణ అత్త మాచమ్మ అతన్ని తీసుకొచ్చి కూతుర్ని ఇచ్చి పెళ్ళి చేసి ఇంట్లో వుంచుకుంది. చదువుకున్న కుర్రాడు గనుక అల్లి జాన్ సాయిబ్ గారితో చెప్పి ఒక ఉద్యోగం ఇప్పించింది. బోబణ్ణకి తల్లి - తండ్రి ఎవరూ లేరు. ఇద్దరు అన్నయ్యలు మాత్రం వున్నారు. బోబణ్ణ అత్తగారింటికి వెళతానంటే సంతోషంగా మారు మాట్లాడకుండా ఒప్పుకున్నారు. స్వభావతః మంచి వాడైన బోబణ్ణ పనీ-పాట లేకపోవడంతో కొడలిపేటలో పోకిరీగా తిరుగుతుండే వాడు. పెళ్ళయి, ఉద్యోగం దొరకడంతో ఆ తిరుగుళ్ళు పూర్తిగా తగ్గిపోయాయి. అలా సుమారు మూడు నాలుగేళ్ళు సుఖంగా గడిపిన బోబణ్ణ ఆవేళ అసంతృప్తితోను, దుఃఖంతోను వ్యాకులంగా వున్నాడు.

తాను ఎందుకు వ్యాకుల గ్రస్తుడై వున్నాడో అతనికే అర్థం కాకుండా పోయింది. బాధలకి కారణం అలా వుంచి బాధల స్వరూపమే అతనికి అర్థం కాలేదు.

బోబణ్ణ ఉద్వేగం మొదలు పెట్టినపుడు అల్లిజాన్ సాయిబు గారి కొడుక్కి వచ్చిన ఒక ఉత్తరాన్ని దొంగిలించాడు. ఒక్కోసారి తను చేసిన ఈ పనికి పోస్టాఫీసుకి సంబంధించిన ఏ దేవుళ్ళో, దయ్యాలో కోపగించారేమోనని ఆలోచనలో పడేవాడు.

మంగళూరులో చదువుతున్న అల్లిజాన్ కొడుకు అజీజ్ సెలవులకి వూరికి వచ్చినప్పుడు అతని స్నేహితులు ఎవరో ఒక కవరు పంపారు. అదేమై వుంటుందో నన్న కుతూహలం మొదలైంది. బోబణ్ణ మనసులో. మొదట డబ్బుందేమో అనుకున్నాడు. కాని ఆఖరికి అది ప్రేమలేఖ అయ్యుండొచ్చు అనుకున్నాడు. అతను అంతవరకు ఒక ప్రేమ సల్లాపాన్ని కూడా విని ఎరుగడు. అంతే కాక పెళ్ళయ్యాక పెళ్ళాంతో కూడా ఒక్క రోజైనా అలా వ్యవహరించలేదు. అత్తగారు కూడా వుండే ఆ యింట్లో బోబణ్ణకి అలాంటి అవకాశాలు బొత్తిగా తక్కువ. బోబణ్ణకి అతని భార్య యొక్క నగ్నత్వం స్పర్శ ద్వారా తెలుసునే గాని, ఎప్పుడూ వెలుగులో చూసినవాడు కాడు. అజీజ్‌కి వచ్చిన ఉత్తరం ప్రేమ లేఖన్న అనుమానం రాగానే అతని కుతూహలం ఎక్కువయింది. గుండె ధడధడమని కొట్టుకుంది. ఆ ఉత్తరాన్ని దొంగతనంగా జేబులో పెట్టుకున్నాడు. ఆ రోజంతా బోబణ్ణ తీరే వేరుగా వుంది. ఎన్నోసార్లు ఉత్తరాన్ని అతనికిచ్చేద్దామనుకున్నాడు. దాన్ని చింపి చదవటానికి ధైర్యం చాలలేదు. వెనక్కి ఇవ్వనూ లేకపోయాడు.

బోబణ్ణ పెళ్ళాం పేరు కావేరి. వాళ్ళకి ఒక ఆడపిల్ల. ఒక మగ పిల్లాడూను. రెండో కాన్పు అయ్యాక కావేరి తీరిక దొరికిన రోజు మాత్రం పనిలోకి వెళ్ళేది. లేకపోతే అత్త ఒక్కతే పనిలోకి వెళ్ళేది. బోబణ్ణలో వచ్చిన ఈ మార్పు చూసి ఆమెకు ఏదో అనుమానం మొదలై మనియార్డర్ డబ్బేదయినా వాడేసుకున్నాడా అని గాబరా పడింది. ఓసారి బోబణ్ణ మనియార్డర్ డబ్బు ఓ రూపాయి సొంతానికి వాడుకుని పెద్ద రాద్ధాంతం జరిగింది. బోబణ్ణ తన జీవితంలోంచి దాన్ని కట్టి అందరి ఎదుట అవమానం అనుభవించాడు. అంచేత బోబణ్ణ తోట పనిలోకి వెళ్ళినప్పుడు పోస్టాఫీసు వేపు ఎవరు వచ్చినా మీది మనియార్డరేదైనా రావలసి వుందా అని అడిగేది కావేరి.

బోబణ్ణ నాలుగు రోజులు గడిచాక 'దీన్ని' క ఇస్తే అనుమానం వస్తుందనిపించి, దాన్ని విప్పి చదవాలని నిశ్చయించాడు. ఆ రోజు తోటకి వెళ్ళినప్పుడేదో పనున్న వాడిలా పనివాళ్ళు చూడని చాటు ప్రదేశానికి వెళ్ళి దాన్ని చింపి చూశాడు. ఆ

కవర్లో ఒక కార్డు మాత్రమే వుంది. అందులో ఉర్దూ లిపిలో ఏదో రాసి వుంది. బోబణ్ణ హతాశుడయ్యాడు. దీన్ని గురించి లేనిపోని కలలు కన్నందుకు తన మీద తనకే కోపం వచ్చింది. అలాగే ఆ కార్డుని తిప్పి చూశాడు. చూసి తెల్లబోయాడు. అక్కడ నడుం దాకా నగ్నంగా వున్న స్త్రీ బొమ్మ వుంది. ఆమె ఎర్రటి శరీరం, గుండ్రటి స్థనాలు, దొరసాని లాంటి మొహం అన్నీ చూసి బోబణ్ణ ఆశ్చర్యంతో మూగవాడిలా అయిపోయాడు. కాసేపు దాన్ని చూడ్డంలో లీనమై పోయాడు. తరువాత తేరుకుని చప్పున దాన్ని జేబులో పెట్టుకుని పనిలోకి మళ్ళాడు. పని చేసే చోటికి వెళ్ళగానే, సిగ్గుతో ఎర్రగా కందిన అతని మొహాన్ని చూసి పనివాళ్ళు ఆశ్చర్యపోయారు. కాని బోబణ్ణ ఆ కవర్లోని రహస్యం బయట పడినందుకో ఏమో గాని, మెల్లిగా తన ఉద్వేగాన్ని అదుపులో పెట్టుకుని పనిలో లీనమయాడు; (పోస్టాఫీసుకి తగినంత పని లేదు. అంచేత తగినంత ఉత్తర ప్రత్యుత్తరాల రాకపోకలు లేకపోయినట్లయితే పోస్టాఫీసు మూసివెయ్యాల్సి వుంటుందని హెడ్ పోస్టాఫీసు వారు బోబణ్ణని హెచ్చరించారు. బోబణ్ణ దాని కోసం ప్రత్యేకమైన శ్రద్ధ వహించి ఇరుగు పొరుగు గ్రామాలకి వెళ్ళి, తన పోస్టాఫీసు ముఖాంతరంగానే వ్యవహరించాలని మనవి చేసుకున్నాడు. ఈ ప్రచారం వల్ల అతను చుట్టు పక్కల చాలామంది, నిరక్షరాస్యుల కోసం వుత్తరాలు రాసి పెట్టడం, వాళ్ళకి వచ్చే వుత్తరాలు చదివి పెట్టడం చెయ్యాల్సి వచ్చింది. దీని వల్ల అతనికి వాళ్ళ వ్యవహారాలు, సమస్యల గురించిన వివరాలు కూడా తెలిసేవి. ఉత్తరాలు రాసేటప్పుడు, దాన్ని చదివి చెప్పేటప్పుడు ఎన్నో మార్లు అతను వాళ్ళ వ్యవహారాలని నియంత్రించే వాడు కూడా. ఈ రకంగా పోస్టాఫీసు వ్యవహారాలు ఎక్కువయ్యే కొద్దీ బోబణ్ణ మనశ్శాంతి నశిస్తూ వచ్చింది.

బోబణ్ణ తన మనసులోని అశాంతికి, చీకాకులకి కారణమేమిటని ఎన్నో సార్లు ఆలోచించాడు. ఈ పాడు పోస్టాఫీసు దానికి కారణమా లేక అజీజ్‌కి వచ్చిన ఆ నగ్న చిత్రమా అని ఆలోచించాడు. అదొక అరిష్టమని దాన్ని చింపి పారెయ్యాలనీ అనుకున్నాడు. దాన్ని తన దగ్గర ఉంచుకున్నప్పట్నుంచి అప్పుడప్పుడు తెరచి చూస్తూనే వున్నాడు. ఆ నగ్న సుందరి స్థనాలు, మనోహరమైన నయనాలు మొదలైన వాటిని చూసిన వెంటనే దాన్ని చింపెయ్యాలన్న అతని ఆలోచన మారిపోయేది. దీనికీ నా చీకాకులకి ఏమిటి సంబంధం అని తర్కించి మళ్ళీ దాచుకునే వాడు.

బోబణ్ణ చెడ్డవాడేమీ కాదు. అతను ఆ చిత్రం చూసి ఉద్రేకం చెంది వ్యభిచార కొంపలకేమీ పోలేదు. లేదా మరెవరైనా స్త్రీల పట్ల వ్యామోహితుడూ కాలేదు. కాని తన భార్య కావేరిని చూసినప్పుడల్లా అతనికి నిజంగానే వేడెక్కేది. స్త్రీ నగ్న

రూపంలో సందర్శించ గలిగే అనంతమైన అనుభూతుల్ని ఆమెలో దర్శించ గలిగేవాడు.

ఇద్దరు పిల్లల తల్లి కావేరికి బోబణ్ణ చేష్టలు సిగ్గు కలిగించేవి. కూతురు కాస్త బుద్ధెరిగిన పిల్ల కావడంతో సిగ్గుతో బాటు గాబరా కలిగేది. ఓ సారి బోబణ్ణ ఆమెని ముద్దు పెట్టుకోవడం కోసం పట్టుకున్నప్పుడు ఆమె కంగారుగా అటూ ఇటూ తలుపుల వేపు చూస్తూ అతని చేతుల్లోంచి విడిపించు కోవడానికి పెనుగలాడింది. బోబణ్ణ ఆమెని వదిలేసినపుడు ఆమె కొంచం కోపంతో ఎందుకిలా పీడిస్తున్నారు అని విసుక్కుంది. ఏమని చెప్పగలడు బోబణ్ణ? మొత్తం మీద గతకాలపు పోకిరీ బుద్ధులు బోబణ్ణలో మళ్ళీ తలెత్తు తున్నాయని కావేరి నిజంగా అనుమానించ సాగింది.

మాచమ్మ కూడా ఒకటి రెండు సార్లు సూక్ష్మంగా బోబణ్ణ ఈ చర్యలను గమనించింది. ఆమెకి వయసులో పెద్దదైన తనను అల్లుడు గౌరవించాలని కోరిక, ఆమె తన భర్త మరణానంతరం ఒంటరిగా వుండి, చాకిరీ చేసి బ్రతుకుతూ కావేరిని పెంచి పెద్ద జేసింది. అంతేకాక, పెళ్ళయి కావేరి భర్తతో కలిసి వెళ్ళిపోతే ఈ పెద్దతనంలో తన గతేమిటి అన్న భయమూ వుండేదామెకి. ఆ కారణం చేతనే కావేరికి పెళ్ళి చెయ్యడానికి ఇష్టపడేది కాదు. కాని చుట్టూరా జనం వూరుకోరు కదా! వాళ్ళ మాటలకి భయపడి, కావేరి అడ్డుదారి తొక్కితే గతేమిటి అన్న భయమూ దానికి తోడై కావేరికి వరుణ్ణి వెతకసాగింది. బోబణ్ణకి తల్లి దండ్రి ఎవరూ లేకపోవడం చేతనూ, అతను మాచమ్మ ఇంటికే వచ్చి వుండడానికి ఒప్పుకోవడంతోను, అతను కావేరికి అనువైన వరుడిగా అనిపించాడు. కాని ఆమె సూక్ష్మంగా కావేరి మీద ప్రేమ, తన మీద గౌరవం రెండూ ఒకదానితో బాటొకటి సమంగా వృద్ధి అయేలా చూసుకుంది. తన ఇల్లు ఎప్పుడూ ఓ హద్దులో గంభీరంగా వుండేలా చూసుకుంటూ పూజా - పునస్కారాలతో గడుపుతూ, హాస్యాలు, కొంటె చేష్టలు లేకుండా చూసుకుంది. ఇలాంటి పరిస్థితిలో బోబణ్ణ ప్రవర్తన కాముకత మాచమ్మకు భయంకరమైన అధిక ప్రసంగంలా కనిపించింది. ఇదిలాగే జరగడం మొదలు పెడితే బోబణ్ణ తన ఇంట్లోనే వున్నా కూడా తన పెద్దరికాన్ని గుర్తించడని అనిపించింది. లేదా బోబణ్ణ కావేరిని తీసికెళ్ళి వేరు కాపరం పెట్టి తనని అనాథని చేస్తాడని అనిపించింది. ఈ రెండింటిలోను ఒకటి జరగడం ఖాయమను కుందామె. కావేరికి ఒక మగపిల్లాడు కలిగే దాకా బోబణ్ణ కావేరిని వదిలి పెడితేనే అన్న భయం వుండేదామెకు. కాని ఇప్పుడు వదిలిపెట్టినా ఫరవాలేదన్న ధైర్యం వచ్చిందామెకు. తను భర్త లేకుండా కావేరిని పెంచి పెద్ద చెయ్యలేదూ! తనూ

అలాగే బ్రతుకుతుంది లెమ్మనుకుంది. అందుకే ఓ రోజున.

'కావేరీ, నీకు చాలా రోజులుగా చెప్పాలని అనుకుంటున్నాను. బోబణ్ణ ఈ మధ్య ఎందుకో వెకిలిగా ప్రవర్తిస్తున్నాడు. పిల్లలెదుట, దేవుడెదుట అంతటా ఒక్కలాగే ప్రవర్తించడమా? నేన్నీకు చెప్పక్కర్లేదు. కష్ట సుఖాలు తెలిసిన దానివి నువ్వు. ఆయన పోయాక నేనెలాంటి కష్టాలు పడ్డానే, నిన్నెలా పెంచి పెద్ద చేశానే నీకు తెలుసు. అలాగే నీ పిల్లల్ని నువ్వు చూసుకోవాలి".

'అవునమ్మా, నన్ను పెంచి పెద్ద చేసింది నువ్వే. పెళ్ళి కూడా నువ్వే చేశావు. నువ్వే ఒక మాట చెప్పేసేయ్. నాకు చెప్పడానికి అదోలా వుంటుంది' అంది కావేరి.

"అలా ఒళ్ళు పొగరెక్కినప్పుడు, మేం ఎదుట వున్నామని కూడా ఒళ్ళెరక్కపోతే ఎలా' అంది మాచమ్మ.

కావేరికి చాలా సిగ్గేసింది. మాచమ్మ ఏం చూసిందోనని బోబణ్ణ మీద కోపమూ వచ్చింది. మగజాతే ఇంత అని ఒళ్ళు మండింది. పిల్లలు ఏడ్చినా లేచి వెళ్ళడానికి వదలని బోబణ్ణ శృంగార చేష్టలు గుర్తు వచ్చి కోపం మరింత పెరిగింది.

"నాకు మనింటిని పోస్టాఫీసు చెయ్యడమే అసలిష్టం లేదు. ఈయనకి తనే పెద్ద ఆఫీసరన్న గర్వం తలకెక్కినట్టుంది. ఈ నెల జీతంలో చలువ కళ్ళద్దాలు తెస్తానని అన్నారు...." అంటూ బోబణ్ణని తిట్టింది.

బోబణ్ణకి ఈ రకంగా ఇతరుల కార్డుల్ని చదవడం, ఎవరికైనా ఏదైనా పుస్తకం వస్తే దాన్ని చదివి మళ్ళీ వాళ్ళకి చేర్చడం వీటి వల్ల, యాంత్రికంగా వున్న పోస్టాఫీసు పనుల్లో కాస్త ఉల్లాసం కలిగించేవి. అజీజ్‌కి వచ్చిన నగ్న చిత్రం చూశాక అతని కవరులో వచ్చిన కార్డులన్నీ అవేనేమో అనిపించేవి. మాస పత్రికలు, వార పత్రికలూ ఎవరికేనా వస్తే అందులో నగ్న చిత్రాలున్నాయేమోనని వెతికేవాడు.

ఈ సమయంలో బేలాయుధం అనే అతని చిరునామాకి ఓ పోస్టుకార్డు వచ్చింది. అతను కల్లంగడి మారప్పగారి దగ్గర పనిచేస్తాడు. బేలాయుధం పని పొద్దున్నే లేచి మారప్ప కాంట్రాక్టు తీసుకున్న ఈత చెట్ల కుండల్ని దింపి, కొత్త కుండల్ని కట్టడం, అతను ముసలి వాడైనందు వల్ల చెట్లెక్కే పని మానమని అందరూ చెప్పేవారు. అతను తన కుల వృత్తి అదేనని, తన ప్రాణం పోయినా అందులోనే పోవాలనీ చెప్పేవాడు. అతని భార్య, కూతురు పద్మి అబచూరు దగ్గరున్న మరో వూరు మూగురు షావుకారు దగ్గర పని చేసేవారు. మూగూరు అబచూరికి మూడే మైళ్ళ దూరంలో వుండడంతో బేలాయుధం తీరిక దొరగ్గానే

పెళ్ళాం పిల్లల దగ్గరకి వెళ్ళేవాడు. వెళుతూ ఓ కుండ కల్లు కూడా తీసికెళ్ళేవాడు. అక్కడ వొంటికి నూనె పూయించుకుని, స్నానం చేసి, విశ్రాంతిగా గడిపి మళ్ళీ వచ్చేవాడు.)

బేలాయుధానికి వచ్చిన పుత్తరాన్ని బోబణ్ణ యధాలాపంగా చదివాడు. (బేలాయుధం కూతురు పద్మి అర్ధదారి పడుతోందని, వెంటనే వచ్చి పద్మిని అదుపులో పెట్టుకోమని బేలాయుధం చాలా రోజుల బట్టీ వూరికి రాకపోవడంతో ఈ ఉత్తరం రాయాల్సి వచ్చిందని, మూగూరు షావుకారు దగ్గరున్న మేస్త్రి, పద్మిని ఓ నెల రోజుల పాటు తనింట్లో వుంచుకునే వుద్దేశంతో పద్మి తల్లికి వంద రూపాయలిచ్చాడని రాసి వుంది.) బోబణ్ణ నిర్వికార చిత్తంతో దాన్ని చదివి, ఒక పెద్ద దేవదారు పెట్టెలో వేశాడు. వచ్చిన వుత్తరాలన్నీ అందులో వెయ్యడం అతని పద్ధతి. ఉత్తరాల స్వంత దారులు తమకి వీలున్నప్పుడు వెతికి అందులో వారి వారి పుత్తరాలని తీసికెళ్ళేవారు. ఆ సందర్భంలోనే చిరునామా చూసే నెపంతో ఇతరుల వుత్తరాలనీ చదివేవారు. కొంతమంది తమకి వచ్చిన వుత్తరాలలో తమకి గర్వకారణమైన విషయాలేమన్న వుంటే, అది ప్రచారమవాలనే వుద్దేశంతో అక్కడే వదిలి పెట్టి వెళ్ళేవారు. ఇటుకలు చేసే జింబణ్ణకి మూడిగెరెలో రాజ్యోత్సవ సందర్భంగా పాడడానికి పిలుపు వచ్చింది. జింబణ్ణ దాన్ని చదివాక, అందరికీ తెలియాలనే వుద్దేశంతో అక్కడే వదిలాడు. ఎవరో ఆ వుత్తరాన్ని మర్నాడు వాళ్ళింటికి తీసికెళ్ళి ఇచ్చినప్పుడు అతనికి చిరాకేసింది. మళ్ళీ పోస్టాఫీసుకి వెళ్ళి వుత్తరాలేమన్నా వున్నాయేమోనని చూసే నెపంతో దాన్ని అక్కడే వదేశాడు. ఎవరైనా వచ్చి మీకో ఉత్తరం వుంది అంటే నిరాటంకంగా ఎవరిది? ఏమిటి? అంటూ పుత్తరంలోని సారాంశాలన్నీ అడిగి తెలుసుకునే వారు.

అలాంటి దేవదారు పెట్టెలోనే బేలాయుధం వుత్తరం కూడా వేశాడు. అందులో ఇంకే వుత్తరాలూ లేవు. తోట పనుల్లో వెళ్ళడానికి టైమవుతోందని పంపించాల్సిన వుత్తరాలు అన్నిటికి ముద్ర వేసి టపా సంచిలో వేశాడు. బస్సుకి పంపమని భార్యతో చెప్పి చకచక బయలుదేరి పోయాడు. అతని బుర్రలో పద్మి తల్లికి వంద రూపాయ లిచ్చిన మేస్త్రి ఎంత రసికుడై వుంటాడన్న ఆలోచనతో నిండి పోయింది. అతను బ్రహ్మచారా, పెళ్ళయినవాడా' అని ఆలోచనలో పడ్డాడు.

తోటకి వెళ్ళగానే సాయిబుగారి కుళువ మేస్త్రిని మూగూరు షావుకారు దగ్గరున్న మేస్త్రి ఎవరు, ఏమిటి అని అడిగాడు. కుళువ తనకి తెలియదని, కావాలంటే సంత రోజు కనుక్కుని చెబుతాననీ అన్నాడు. "ఎందుకు అడుగుతున్నారు? ఏమిటి సంగతి?" అన్నాడు దానితో బోబణ్ణ విషయమంతా

పూర్తిగా చెప్పాడు. కాని బోబణ్ణ ఈ విషయం బహిరంగ పరచేటందుకు ముందే జనం దేవదారు పెట్టె సమక్షంలో విషయం కనుక్కుని పులకితు లయ్యారు. మొత్తంమ్మీద ఆ పోస్టాఫీసు పట్నంలో క్యాబరే హొటల్ చేసేటంత సందడి కలిగించింది.

బేలాయుధం వూళ్ళోనే లేడు. ఉత్తరం తీసుకోవడానికి అతను రానే లేదు. పెళ్ళాం దగ్గరే వున్నాడని కొందరు, ఏదో వూరు వెళ్ళాడని కొందరూ, అతని ఆరోగ్యం అసలే బాగోలేదు, కాబట్టి చచ్చిపోయాడో ఏమోనని కొందరూ శంకించారు. అతని వుత్తరం వారసులు లేకుండా పోస్టాఫీసు వారి దేవదారు పెట్టెలాంటి అపాయకరమైన బహిరంగ స్థలంలో వుంది.

రోజూ సాయంత్రాలు బోబణ్ణ ఎవరికైనా వుత్తరాలు రాసే పని గాని, చదివి పెట్టే పనిగాని చేసేవాడు. నలుగురైదుగురు కూర్చుని తలో రకం అభిప్రాయం వెలిబుచ్చాక ఆ అభిప్రాయాలు కలిసొచ్చేలా కుదించి 'అయితే ఇలా రాయనా' అనడిగి అందరూ 'సరే'నని తలూపితే ఆ తరువాత రాసిచ్చేవాడు. రాయించుకునే వారి దగ్గర దానికి కావల్సిన వెనుకటి వుత్తరాలు వగైరా దాఖలాలన్నీ వుండేవి బోబణ్ణ అవసరమనుకున్నప్పుడు వాటిని పరిశీలించుకుని చూసుకునే వాడు.

ఓ రోజు ఇలాంటి సమాలోచన గోష్ఠి జరుగుతూ వుండగా మూగూరు ప్రైమరీ స్కూలు మాస్టారు దాసణ్ణగారు వచ్చారు.

"పోస్టుమాస్టర్‌గారూ, మా వూరి కేదైనా వుత్తర ముందా" అని అడిగారు బోబణ్ణని.

'లేదండి బాబూ మీ వూరి ఉత్తరమే ఒకటుంది".

"ఏమిటి సంగతి?"

"ఏమని చెప్పేదిలే వెళ్ళి మీరే చూడండి, తరువాత చెబుతాను."

"అయ్యో దేవుడా, ఏ మొచ్చి పడిందో గ్రహచారం" అనుకుంటూ హడావుడిగా దేవదారు పెట్టెలో చెయ్యి పెట్టారు దాసణ్ణగారు.

"అదికాదు.... వ్వూ.... అదే అదే...." అంటూ నిర్దేశించాడు బోబణ్ణ. దాసణ్ణ బ్రహ్మచారి. మూగూర్లో అతను పనిచేసే స్కూలు ప్రైమరీ స్కూలే అయినా కాస్త పెద్ద ఆడ పిల్లలూ వచ్చేవారు. దాసణ్ణ మరేమీ కాకున్నా వాళ్ళ అంగాంగాల మీద చెయ్యాడించి తన చాపల్యం తీర్చుకుంటాడని అపకీర్తి తెచ్చుకున్నాడు. అతను నక్క మొహం వేసుకుని రోడ్డు మీద నడుస్తుంటే ఆడవాళ్ళు మొహం తిప్పుకునే వారు.

దాసణ్ణ ఉత్తరం చదివి "ఆహా....భలే పసందుగా వుందే ఈ పద్మి పని"

అంటూ వుత్తరాన్ని మళ్ళీ దేవదారు పెట్టెలో పెట్టేశాడు. మళ్ళీ బోబణ్ణ వాళ్ళ సమావేశంలోకి వెళ్ళి కూర్చున్నాడు.

"ఏమండీ, దాసణ్ణగారూ, మూగురులో వుత్తరం రాయడానికి మీరు కాక ఎవరున్నారు? మీరే రాసి తెలియనట్టు నటిస్తారేం? అన్నాడు.

"ఛ! ఛ! నేను ఉత్తరం రాస్తే ఇక్కడే పోస్టు చెయ్యాలి కదా! మొన్న మా వూర్లోకి వచ్చినప్పుడు మీరే అలా చెప్పారు కదా! నేనామాట అందరితోనూ చెప్పాను. ఆ సంగతలా వుంచండి. ఉత్తరం తీసుకుని ముద్ర చూడండి, ఎక్కడ్నుంచి వచ్చి వుంటుందో తెలుస్తుంది." అన్నాడు. బోబణ్ణకి ఇంతవరకూ ఆ ఆలోచనే రాలేదు. వెంటనే పెట్లోంచి తీసి ఎక్కడ్నుంచి వచ్చిందోనని పరీక్షించాడు. పోస్టాఫీసు ముద్రలో తేదీ తప్పించి మరేమీ తెలియటం లేదు.

ముద్ర పరీక్షించే నెపంతో గోష్ఠిలో అందరూ ఆ వుత్తరాన్ని మరోసారి చదివి ఆనందించారు. అదులో కొందరు, బేలాయుధం పెళ్ళానికి ఈ పాడు బుద్ధులు వున్నాయట. అందుకే బేలాయుధం పెళ్ళాన్ని వదలి పెట్టి వుంటున్నా డంటారు" అంటూ గొణిగాడు.

దాసణ్ణ "ఛ ఛ! పెద్దతనం మీద పడ్డ ముసలిది. దాని కెలా వుంటా యింకా ఇలాంటివి? ఎవరూ ఒప్పుకోని మాటది," అన్నాడు.

దానికి మొదటి వాడు "ఊఁ....వూఁ మీకు తెలీదు ముసలాళ్ళకుండే...." అంటూ ముసి ముసి నవ్వులు నవ్వాడు. ఆ గుంపులో వున్న కొంచెం వయసు మళ్ళిన వ్యక్తి ఈ మాట తనకే అన్వయిస్తుందన్నట్లుగా, దాన్ని పొగడ్తగా భావించి గర్వంతో నవ్వాడు.

మొదట మాట్లాడిన వ్యక్తి "అలా క్కాదు, పోస్ట్ మాస్టర్ గారూ, ముసలాళ్ళకి ముసలాళ్ళమీదే చాపల్యం వుంటే ఫరవాలేదు. ముసలాళ్ళకి పడుచు వాళ్లని చూస్తేనే తెగులెక్కువ" అన్నాడు.

"అయితే ముసలాళ్ళ సాహసం కష్టమేనే. వీళ్ళ మీద ఓ కన్నేసి వుంచాలి." అన్నాడు బోబణ్ణ. అతని మాటల కందరూ ముసిముసి నవ్వులు నవ్వారు.

వాళ్ళ గోష్ఠి సమాప్తమై అందరూ కదిలారు. కాని ఆ రోజు బోబణ్ణ ఇంట్లో పెద్ద గొడవే జరిగింది. ముసలి వాళ్ళ గురించి యథాలాపంగా అన్న మాట బోబణ్ణ అత్తకి తగిలింది.

ఇంటిని పోస్టాఫీస్ చేశాక ఉత్తరం రాయించుకోవడానికో, మరో దానికో, వచ్చే జనం. క్రమేణ క్లబ్బులో మానసోల్లాసం కోసం చేరే గుంపుల్లా తయారవడం మాచమ్మ గమనించింది. మొదట ఉత్తరాలు మాత్రమే రాసిపెడుతున్న బోబణ్ణ రానురాను వుత్తరం రాయించుకోవడానికి వచ్చిన వాళ్ళతో వుత్తరాల్లోని విషయాల

గురించి కబుర్లలో పడ్డం, ఆ తరువాత ఇద్దరే చర్చించి వుత్తరం రాయించడం పోయి, అనేక మంది సమాలోచించి వుత్తరం రాయడం పరిపాటయింది. మాచమ్మ, కావేరి ఎన్నెసార్లు ఇలా గుంపు చేర్చి, పనికిమాలిన కబుర్లలో పెట్టడం బాగా లేదని హెచ్చరించినప్పుడు, పోస్టాఫీసు వ్యవహారాలు తక్కువయిపోతే పోస్టాఫీస్ మూసేస్తారని అందుకే తను ఉత్తరాలు పత్రాలు రాయించటం కోసం ప్రోత్సహిస్తున్నానని బోబణ్ణ బదులు చెప్పాడు. కాని ఇప్పుడదింకా ముందుకు పోయి, ఇతరుల వుత్తరాల గురించి పొచికోలు కబుర్లు చెప్పుకునే స్థితికి దిగజారింది. మాచమ్మ దీన్ని సహించ లేకపోయింది. కావేరిని పిలిచి "చూడు, ఆ పోకిరి దానప్పని కూర్చోబెట్టుకుని ఆ కబుర్లు చూడు. మన ఇంటి కెలాంటి గతి పట్టిందో చూడు" అంటూ పళ్ళు నూరింది. కావేరికి మితిమీరిన కోపం వచ్చింది.

బోబణ్ణ ఇంట్లోకి వచ్చాడు. ఎవరూ మాట్లాడ లేదు. గత కొద్దిరోజులుగా ఇంట్లో ఈ రకమైన బిగువైన వాతావరణమే వుంటోంది. అయినా కూడా బోబణ్ణ కొంచెం ఎదిగిన తన కూతురితో మాట్లాడ్డమో, ఆడుకోవడమో చేసేవాడు. తల్లి ఎదురుగా వుంటే కావేరి మరింతగా బిగుసుకు పోయేది. తన తల్లిని సంతోష పెట్టడం కోసం అలా వుంటోందని తెలిసి బోబణ్ణకి మరింత దుఃఖం కలిగేది. ఇంట్లో అశాంతిగా వున్న వాతావరణం కొంచెమయినా తగ్గిద్దామని ప్రయత్నిస్తే అది మరింత ఇబ్బందులకి దారి తీసేది.

బోబణ్ణ ఇంట్లోకి వచ్చేసరికి ఇంట్లో అంతా తమ పనుల్ని తాము చేసుకుంటూ మౌనంగా వున్నారు. బోబణ్ణ కూతురు సీత వచ్చి "నాన్న, ఇక్కడ చూడు అంటూ లంగా పైకెత్తి పొట్టమీదున్న పోస్టాఫీసు ముద్ర చూపించింది." "నువ్వూ పోస్టాఫీసు పనుల్లోకి దిగావా అమ్మాయ్" అన్నాడు బోబణ్ణ నవ్వుతూ.

అంతలో మాచమ్మ ఆడపిల్లలు అలాగ లంగా పైకెత్తడం అసభ్య మన్నట్లుగా 'థత్' అంటూ లంగాని కిందకి లాగి ఝాడించింది. "చాల్లే" అంటూ లోపలికి వెళ్ళింది.

బోబణ్ణకి భోజనానికి కూర్చోడానిక్కూడా సిగ్గేసింది. ఇప్పటి దాకా తన తోటపని జీతం, పోస్టాఫీసు పని జీతం అన్నిటినీ ఇంటికే ఖర్చు పెట్టినా ఆ రోజు అది అతనికి తను సంపాదించిన అన్నంలా అనిపించలేదు.

కాని బోబణ్ణ పోకిరీ వాడు గాని, ముక్కోపి గాని, దూకుడు స్వభావం వున్నవాడు గాని కాదు. తన బ్రతుకులో విప్లవ పూరితమైన మార్పుని అతను చూడనూ లేదు. కోరుకోనూ లేదు. ఆ కారణం చేతనే అయ్యుండవచ్చు గంభీరంగా భోంచేశాడు.

కావేరికి, బోబణ్ణ తల్లికి చికాకు కలిగిస్తున్నాడన్న బాధ. బోబణ్ణ మీద ఒక రకపు బలవంతమైన కసిని పెంచుకోసాగింది. బోబణ్ణని ప్రేమగా కౌగలించుకుంటే అమ్మకి ద్రోహం చేసినట్టనిపించే దామెకు. రోజూ రాత్రుళ్ళు ఏదో ఒక నెపంతో పొట్లాట వేసుకుని అటు తిరిగి పడుకునేది. బోబణ్ణ ఎలాగో అలాగ తన కామ తృష్ణ తీర్చుకుంటే చాలనుకునే మృగం కాదు. అందుకే కావేరితో ప్రేమగా వుండడానికి, ప్రియమైన వాతావరణాన్ని సృష్టించడానికి ప్రయత్నించేవాడు. ఓ రోజు కావేరి నిద్ర కళ్ళతో బోబణ్ణని కౌగలించుకుని పడుకుంది. చటుక్కున మెలకువ వచ్చి బోబణ్ణని తోసేసి దూరంగా పడుకుంది.

కావేరి ఆ రోజు, "ఆ జులాయి దాసణ్ణతో మీరంత సరదాగా మాట్లాడ్డానికి ఏమిటుందసలు?" అంటూ పోట్లాడి అటు తిరిగి పడుకుంది. బోబణ్ణ దుఃఖంతో చూరు వేపే చూస్తూ పడుకుని నిద్ర పోడానికి ప్రయత్నించాడు. అజీజ్‌కి వచ్చిన నగ్న స్త్రీ చిత్రం ఒక దేవతలాగ, ఏదో తీరని కోరికల సంకేతంలా బోబణ్ణ ఊహల్లో మెరిసింది. తాను ఇంతగా దుఃఖితుడవడానికి కారణం మాత్రం అతనికి స్ఫురించనే లేదు.

బేలాయుధం మాత్రం ఉత్తరం తీసుకోవడానికి రానే లేదు. ఎవరో అతను. 'ఉజిరె' కి వెళ్ళాడని చెప్పారు. ఇటు వేపు వూళ్ళోని జనమంతా బేలాయుధం కూతురి విషయాన్ని భోజనంలోకి వూరగాయల్లా నంజుకున్నారు. భోజనానంతరం తాంబూలంలా సేవించారు. బోబణ్ణ పోస్టాఫీసు గోష్ఠిలో రోజూ పద్మ సంగతి రానే వచ్చేది. విన్న వాళ్ళంతా ఆ ఉత్తరాన్ని పెట్లోంచి తీసి చదివి పర్యాలోచించే వారు. దానితో ఉత్తరం మురికి పట్టి, జీర్ణించిపోయే స్థితికి వచ్చింది. అక్షరాలన్నీ చెడిపోయే పరిస్థితిలో వున్నాయి. ఓ రోజు సాయంత్రం బోబణ్ణ పోస్టాఫీసులో నలుగురూ కూర్చుని ఆ వుత్తరపు దుస్థితిని గురించి చర్చించారు.

ఒకరన్నారు: "ఆ వుత్తరం చింపి పారేస్తే ఈ బాధ తప్పుతుంది. బేలాయుధం వచ్చాక మనమే ఫలానా రకంగా వుత్తరం వచ్చిందని చెపితే సరి...." అన్నారు. (దీనికి ఆ గుంపులో వాళ్ళంతా ఒక్కుమ్మడిగా తమ అనంగీకారాన్ని అసంతృప్తినీ తెలియ పరచారు.

"ఏమిటి? పోస్టాఫీసులో పని అంటే బీడీ కొట్లో పని అనుకుంటున్నట్లున్నావు. పోస్టాఫీసు మొదలు పెట్టిన్నాడు నువ్వు రాలేదనుకుంటాను. ఇది గవర్నమెంటు పని, కాస్త అటు - ఇటు అయిందంటే ఢిల్లీ నుంచి సిపాయిలు వస్తారు. వూళ్ళో వాళ్ళందరికీ బేడీలేసి తీసుకు పోతారు. ప్రభుత్వం అంత నమ్మకం పెట్టినపుడు బోబణ్ణ అలాంటి పని చేయకూడదు." అన్నారొకరు. ఆ మాటతో బోబణ్ణకి

మంచి హుషారు వచ్చింది. దొంగసారా, దొంగ బట్టీలు పట్టుకున్నప్పుడు పోలీసు వాళ్ళు విచారణ జరిపేటప్పుడు బోబణ్ణనే పిలిచేవారు. ఈ కారణాల వల్ల బోబణ్ణకి అప్పుడే పోస్ట్‌మాస్టర్ ఉద్యోగం పట్ల ఒక రకమైన గౌరవం, గర్వం కలిగాయి. అంచేత,

"మరి కనిపించడం లేదూ? వేలకు వేల రూపాయల సరుకుని నాకు అప్ప జెప్పారే, ఎవరిస్తారలాగ?" అన్నాడు.

"మరే! కాదు మరీ! ఆహా! లాంటి శబ్దాలు, వ్యాఖ్యానాలు గుంపులోంచి వెలువడ్డాయి.

"ఎవరు, ఎవరికి ఏదేనా రాసుకోనీ, పోస్టుమాస్టర్ డ్యూటీ అతను చేసి తీరాలి. డ్యూటీ అంటే డ్యూటీయే మరి. పోస్టు మాస్టరంటే స్కూలు మాస్టరు అనుకున్నారా ఏమిటి?" అన్నారు మరొకరు.

ఇలా ఒక్కొక్కళ్ళు ఒక్కో రకంగా పోస్టుమాస్టరు ఉద్యోగాన్ని పొగిడారు. కాని బేలాయుధం ఉత్తరాన్ని ఏం చెయ్యాలన్న విషయంలో ఎవరికీ సరియైన అభిప్రాయం ఉన్నట్టు కనిపించలేదు.

బోబణ్ణకి ఏం చెయ్యాలో తోచలేదు. కాని ఆ వుత్తరాన్ని చింపి పారేసి గతంలోకి సమాధి చెయ్యడాని కతను సిద్ధంగా లేడు. నగ్న చిత్రం, పద్మి ఇవన్నీ ఏదో అసంతృప్తి సాగరంలోంచి విరజిమ్మిన బిందువుల్లా మెరిసాయి.

ఆ రోజు బోబణ్ణ బేలాయుధం వుత్తరాన్ని మరో కార్డు మీదకి నకలు రాసి బేలాయుధం ఉజిరె చిరునామా తెచ్చి దాన్ని పోస్ట్ చేశాడు. ఏదో ఒక అధ్యాయాన్ని పూర్తి చేసినట్టుగా వ్యాకుల గ్రస్తుడై వున్న బోబణ్ణ ఒక్క క్షణం కర్తవ్యం నెరవేర్చిన వాడిలా తేలిగ్గా వూపిరి పీల్చుకున్నాడు. అత్త మాచమ్మ ఏదో అంటే 'డూటీ, డూటీ' నా డూటీ నాకు, నీ డూటీ నీకు. నా డూటీకి నువ్వడ్డు రాకు. నీ డూటీకి నేనడ్డురాను. అని కోపంగా అన్నాడు. కావేరికి మితిమీరిన కోపం వచ్చింది ఆ రోజు. కాని బోబణ్ణ ఆ మాట లెప్పుడో మర్చి పోయాడు. రాత్రి పడుకున్నప్పుడు అలావాటు వల్లనే, ఆశవల్లనే, చాపల్యం వల్లనో బోబణ్ణ చెయ్యి కావేరి మీదకి పోయింది. కావేరి బోబణ్ణ చేతిని విసిరి కొట్టింది.

ఎన్నో రోజులుగా తట్టుకుంటున్న బోబణ్ణ కోపం బయట పడింది. తనని అనవసరంగా ఏడిపిస్తూ పీడిస్తున్న శని అని కసిగా అనుకున్నాడు. అందరి ఇళ్ళల్లోనూ ఆడవాళ్ళూ ఇలాగే వుంటారా అని ప్రశ్నించుకున్నాడు. ప్రేమతో కాకున్నా రోషం చేతనయినా ఆమె మీద అత్యాచారం చెయ్యాలని ఆలోచించాడు. ఒకప్పుడు ప్రేమతో కౌగలించుకుని ముద్దాడిన ఆ శరీరాన్ని ఎలాగ శిక్షించడం అని మనసు వెనకాడింది.

"థూత్, దరిద్ర మొహమా! నీకు తెగులెక్కువైతే ముసలిదానికి కనపడకుండా దొంగతనంగా వచ్చే దానివి. ఇప్పుడిలా చేస్తావా? భోగం వాళ్ళు నయం నీ కన్నా. గడిబిడి చెయ్యకుండా డబ్బులుచ్చుకుని రవికలు విప్పుతారు." అని ఎగిరాడు. బోబణ్ణ ఎప్పుడూ భోగం కొంపలకి వెళ్ళిన వాడేం కాదు. కావేరిని నొప్పించడానికి అలా ఊహించుకుని అన్నాడు. కావేరికి ఈ సంగతి తెలుసు.

కావేరికి కోపం ఎక్కువయింది. "అదీ, పది చోట్లలో తిరిగొస్తేనే ఇంట్లో ఇలా పీడించుకు తినేది" అంది.

బోబణ్ణ కోపంతో ఇంకేదో అన్నాడు. అస్త్ర ప్రత్యస్త్రాల వర్షం కురిసింది. కావేరి మౌనంగా ఏడవసాగింది.

ఆ తరువాత పరిస్థితి రోజు రోజుకీ విషమించసాగింది. కావేరి బోబణ్ణతో ఎక్కువ మాట్లాడేది కాదు. పోస్టాఫీసు ఒక రకమైన విషాద గృహంగా మారిపోయింది. అందరూ ఇంట్లో ఎవరో చచ్చిపోయినట్లు విషణ్ణులై మసల సాగారు.

బోబణ్ణ పట్ల కావేరికి వున్న ప్రీతి విశ్వాసాలు నశించాక ఇక అతనితో కలిసి మెలిసి వుండడం, సరస సల్లాపాలు, సంభోగం దేనికీ అర్థమే లేకుండా అసంబద్ధమై పోయింది. బోబణ్ణ కామ చేష్టలు, అతనెక్క డెక్కడో చేతులు పెడితే కితకితలు పెట్టినట్టయ్యేది. కౌగలించుకుంటే ఒంటి మీద పురుగులు పాకినట్లయేది. అదే ఒకప్పుడు కామపు జ్వాలాముఖిగా చేసేవి. బోబణ్ణ నిస్సహాయు డయ్యాడు. తను ఆమెకి చైతన్యాన్ని స్ఫూర్తిని కలగజెయ్య లేక పోతున్నానని పించినప్పుడు, పిచ్చెక్కినట్లు అయ్యేది.

సంవత్సరపు ఆఖరి రోజులు. తోటకి కొత్త కూలీలని తీసుకోవడం; పాత కూలీలకు లెక్క చూసి మిగిలిన డబ్బులు ఇవ్వడం మొదలైంది.

ఇదే సందర్భంలో మాచమ్మ బోబణ్ణ పెళ్ళికి చేసిన అప్పుని అతనే తీర్చాలనీ తోట సాయిబు గారి తో విన్నవించుకుంది. ఆమె వాదం ఇంతే: ఆమె ఆ డబ్బుని బోబణ్ణ పెళ్ళికి ఖర్చు పెట్టిందే గాని, స్వంతానికి కాదు. పెళ్ళయినప్పట్నుంచీ కావేరి పన్లోకి సరిగ్గా రావడం లేదు. గనుక తన సంపాదన తగ్గింది. బోబణ్ణకి పోస్టాఫీసు జీతం, తోట పని జీతం రెండూ వస్తాయి వగైరా...." అంటూ.

బోబణ్ణ ఎంత వాదించినా దాన్ని బోబణ్ణ లెక్కలోనే మినహాయించాలని తీర్మానించారు. బోబణ్ణ, ఆమె కూతురి పెళ్ళికి చేసిన అప్పుకి నేనెలా బాధ్యుడిని?" అనడిగితే సాయిబు గారు ఆమె కూతురు ఎవర్రా? నీ పెళ్ళాం కాదు? అనడిగారు.

బోబణ్ణ కోపం తట్టుకోలేక, అయితే నేను వేరు కాపురం పెడతానని ఎగిరాడు

యజమాని ఎదుట.

అప్పుడు మాచమ్మ ఇన్ని రోజులు పెంచింది నీ వెనకాల పంపి వీధి పాలు చెయ్యడానికే కదూ, అంది వెక్కిరింతగా. కావేరి అక్కడే వుంది. మాచమ్మ అలా అన్నప్పుడు బోబణ్ణ కావేరి వేపు చూశాడు. కావేరి బోబణ్ణ ఎవరో అన్నట్టుగా అతని వేపు శూన్యదృష్టితో చూస్తోంది.

తను ఇల్లు వదిలిపెట్టి వెళితే దానిక్కూడా వాళ్ళు సిద్ధంగా వున్నారనిపించి బోబణ్ణ హతాశుడయ్యాడు. తన బాబుని, పాపని తల్చుకున్నాడు. తన పోస్టుమాస్టర్ పదవిని తల్చుకున్నాడు. "సార్, నేనే తీరుస్తా!" అన్నాడు. అలా అంటున్నప్పుడు అతని కంఠం గద్గదమయింది.

ఆ రోజు సాయంత్రం దాకా అతను వూరికే కూర్చున్నాడు. బ్రతుకులో తను ఏ రకమైన ధోరణిని అనుసరించాలో అర్థం కావడం లేదతనికి. అన్నిటికీ "ఊ, ఉహూఁ" అన్న రెండే సమాధానాలిచ్చే వాడు. ఎవరో వుత్తరం రాసి పెట్టమంటే యాంత్రికంగా రాసి ఇచ్చాడు. సాయంత్రం కరిగిపోయి చీకటి పడుతోంది. ఇంట్లోకి వెళ్దామా, వొద్దా అనుకుంటూ పైకి లేచాడు.

ఆ సమయానికి సరిగ్గా దూరంగా ఎవరో మాట్లాడుకుంటూ వస్తున్నట్లు కనిపించింది. పది పదిహేను మంది వున్న గుంపు ఒకటి రోడ్డు మలుపులో కనిపించింది. ఎవరా అని చూస్తూ నుంచున్నాడు బోబణ్ణ. గుంపు మెల్లిగా పోస్టాఫీసు వేపే వస్తోంది. బోబణ్ణ చూస్తూనే వున్నాడు. చీకటి పడుతూ వున్నందువల్ల ఎవరయినదీ స్పష్టంగా తెలియటం లేదు. ఎవరో ఆడమనిషి ఏడుస్తున్నట్లు వినిపిస్తోంది. బోబణ్ణ కనిపించగానే అందులో ఒకడు "ఈ తార్చుడు ముండా కొడుకులకి పోస్టుమాస్టర్ పని ఇస్తే ఇంకేటవుతుంది?" అని అరుస్తూ వచ్చాడు. అసలే బాధలో వున్న బోబణ్ణ మనసు మీద మరిగే నీళ్ళు పోసినట్లయింది. గుంపు దగ్గర వుతుండగా మూగూరు తోట మేస్త్రి "ఎవడ్రా లంజకొడుకు నా మీద లేని పోనివన్నీ కూసిన వాడు? మగాడైతే మాట్లాడరా ఇప్పుడు" అని అరిచాడు. బోబణ్ణ కళ్ళకి ఆ గుంపులో వున్న బేలాయుధం, అతని భార్య, కూతురు ఒక్కొక్కరుగా కనిపించసాగారు. అందరూ కల్లు తాగి ఘుమ ఘుమలాడుతున్నారు. రాగానే బోబణ్ణ మీద అనుమానంతో తిట్టసాగారు. బోబణ్ణ మూగూరు తోట మేస్త్రీతో "ఒళ్ళు దగ్గర పెట్టుకుని మాట్లాడరా కొడకా, నీ లాటి వాళ్ళు పదిమంది నా దగ్గర పని చేస్తారు తెలుసా?" అని తిట్టాడు.

"నువ్వు నిజాయితీ వున్న వాడివయితే ఆ వుత్తరం రాసి ఒక ఆడపిల్ల మర్యాద తీసేసే పని ఎందుకు చేశావు?" అంది ఓ గొంతు.

"ఎవడు చేశాడో వాడినే అడగరా నా దగ్గరెందుకు చూపిస్తారు మీ పొగరు?" గుంపులోంచి వచ్చిన అశరీరవాణికి జవాబు చెప్పాడు.

బోబణ్ణ అలా అనగానే, "మరెవర్రా రాసింది? మీ బాబా? అబద్ధాలాడతావ్రా?" బేలాయుధం కార్డు తీసి బోబణ్ణకి చూపించాడు. బోబణ్ణ చూశాడు. అది తను బేలాయుధానికి వచ్చిన ఉత్తరాన్ని కాపీ చేసి పంపించిన కార్డు. బోబణ్ణ తనా కార్డు రాసింది నిజమేనని, కాని అది బేలాయుధానికి వచ్చిన కార్డుని కాపీ చేసి పంపించిందనీ చెప్పాడు. కాని గుంపులో ఆ మాట వినడాని కెవరూ సిద్ధంగా లేరు.

వాళ్ళు ఆ విషయం అబద్ధమని రుజువు చెయ్యడమనేది, ఆ ఉత్తరం రాసిన వాణ్ణి ఎలా శిక్షిస్తారన్న దానిపైన ఆధారపడింది. అంతేకాక, మూగూరు మేస్త్రి, మరి కొందరు ఈ సందర్భాన్ని పద్మ ముందు తమ గొప్పదనం ప్రదర్శించడానికి వాడుకో దలచుకున్నారు.

ఈ గొడవ విని మాచమ్మ, కావేరి బయటకొచ్చి నుంచున్నారు. బేలాయుధం జరిగినదంతా వివరించ సాగాడు. బోబణ్ణ తన కూతుర్ని మూగూరు మేస్త్రి వుంచుకున్నాడని వూరంతా పుకారు లేవదియ్యడమే కాకుండా 'ఉజిరె'కి అలాంటి వుత్తరం రాశాడని, తను 'ఉజిరె'లో లేకపోవడంతో దాన్ని బెళ్తంగడికి పంపారని, కాని అదక్కడకి వచ్చేసరికి తను అక్కడా లేకపోవడంతో తన కోసం దాన్ని 'బంటవాళ' పంపించారు. ఆ ఉత్తరం వెళ్ళిన చోటల్లా అందరూ ఆ కార్డు చదివి పంపడంతో తన బంధు వర్గంలో తన మర్యాద పూర్తిగా పోయిందని బేలాయుధం మాచమ్మకు వివరించాడు.

అతను తన కూతురికి సంబంధాలు చూడ్డానికి వెళ్ళాడని, కాని ప్రస్తుత పరిస్థితుల్లో ఇక తన కూతురికి పెళ్ళవడం అసాధ్యమనీ, వరుడు దొరక్క తమ జాతిలో ఎంతోమంది అడ్డదారి పట్టారనీ భోరుమని ఏడ్చాడు.

దానికి తోడు మూగూరు మేస్త్రి, బేలాయుధం తన కూతుర్ని కొట్టి చంపెయ్యబోతుంటే ఆ సంగతి తనకి తెలిసి, పరిగెత్తుకు వెళ్ళి ఓ ఆడపిల్ల ప్రాణం రక్షించానని తన గొప్ప చెప్పుకున్నాడు.

మాచమ్మ కూడా అతనికి వత్తాసుగా "ఊరి వ్యవహారాలకి ఇతనెందుకు వెళ్ళాలి, నా ఇల్లు పోస్టాఫీసు చేసి నా మర్యాద మంట గలుపుతున్నాడు. ఈ పాడు పోస్టాఫీసు వచ్చి, ఈ ఊరికే అరిష్టం దాపురించిందని వాపోయింది.

బోబణ్ణ పరంగా మాట్లాడే వాళ్ళెవరూ కనిపించలేదు. ఒకరిద్దరు బేలాయుధానికి వచ్చిన అసలు ఉత్తరాన్ని చూసిన వాళ్ళూ అక్కడ వున్నారు. వాళ్ళ కూడా బోబణ్ణే ఆ వుత్తరాన్ని రాసుండాలనిపించిందో ఏమో, మాట్లాడకుండా

వాళ్ళు కూడా బోబజ్జే ఆ వుత్తరాన్ని రాసుండాలనిపించిందో ఏమో, మాట్లాడకుండా వూరుకున్నారు. దానితో అక్కడ కొచ్చిన వాళ్ళంతా బోబజ్జని ఎడాపెడా తిట్టి పొయ్యసాగారు.

బోబజ్జకి తన తప్పేమిటో అర్థం కాక మూగ గొడ్డులా నుంచున్నాడు. అందరూ తిట్టి తిట్టి వాళ్ళే వూరుకుంటారని. అన్నిటికీ అఖరంటూ ఒకటుంటుందని. అన్నిటి కంటే దుఃఖం కలిగించిన విషయం ఏమిటంటే కావేరి మౌనం. ఆమె ఒక్క మాట కూడా అడకుండా వూరికే నుంచుంది. ఈ అవమానాన్ని సహించడం కన్న మహానరకం మరొకటి లేదనిపించింది.

"చూడు బేలాయుధం, నా డూటీ నేను చేశాను. నీ వుత్తరం ఇక్కడ పడి పాడైపోతోంది. దాన్ని కాపీ తీసి పంపించాను. నీ కూతురెలాటిదో, నువ్వేలాంటి వాడివో నాకేం తెలుసు?" అన్నాడు.

"అవునవును, నువ్వు చాలా నిజాయితీ కలవాడివి, వూళ్ళో వాళ్ళంతా పోకిరీ మనుషులూను. నీ ఇంటినీ, నీ పెళ్ళాన్ని ముందే జాగ్రత్త చేసుకుని, తరువాత వూళ్ళో వాళ్ళని గురించి మాట్లాడు. నిన్ను చేసుకున్న మనిషి ఎందరిళ్ళల్లో వుండి వచ్చిందో ఏమో చూసుకో." అన్నాడు. మూగూరు మేస్త్రి బోబజ్జని నొప్పించాలని.

అంతదాకా ఓర్పుతో మాట్లాడుతున్న బోబజ్జకి రవీమని కోపం వచ్చింది.

మూగూరు మేస్త్రి మాటలకి అక్కడున్న వాళ్ళంతా అప్రతిభులయ్యారు. ఒక్క క్షణం అక్కడ మౌనం ఆవరించింది. బోబజ్జ ఏ తప్పు చేశాడని వాళ్ళంతా ఆరోపించడానికి అక్కడికి వచ్చారో, అలాంటి నీచమైన పని చేశాడు మూగూరు మేస్త్రి. కాని దానికి విరుద్ధంగా ఎవరూ ఏమీ మాట్లాడలేదు. ఎందుకంటే మూగురు మేస్త్రి ఎవర్ని వుద్దేశించి ఆ మాట అన్నాడో వాళ్ళ నుంచి మొదటి ప్రతిఘటనని అపేక్షించారు. బోబజ్జ కావేరి వేపు చూశాడు. కావేరి కళ్ళల్లో 'ఇదీ' అని చెప్పడానికి వీల్లేని దిగ్భ్రాంతత. ఆమె ఏమీ మాట్లాడకుండా తన తల్లి వేపు చూసింది. మాచమ్మ బోబజ్జ మీద పగతో మౌనంగా వుండిపోయింది.

వీళ్ళంతా తన మీద తిరస్కారంతో తమ మీది నిందని మొయ్యడానికి సిద్ధపడడం చూసి బోబజ్జకి మండిపోయింది. "ఏమిటన్నావురా లంజకొడకా?" అంటూ పిడికిలి బిగించి బలంగా మూగూరి మేస్త్రీ మొహం మీద గుద్దాడు. మేస్త్రి వికారంగా అరుస్తూ దబ్బున కింద పడ్డాడు. అతను పడిపోయిన తీరు చూసి బోబజ్జ ఇంక వాడి పని అయిపోయిందనే అనుకున్నాడు. గుంపులో వున్న వాడెవడూ మూగురు మేస్త్రీకి ఉపచారం చెయ్యడానికి ముందుకి రాలేదు. అతని పరంగా ఇంకెవరొస్తారో రానిమ్మని, బోబజ్జ పిడికిలి బిగించి సిద్ధంగా

నుంచున్నాడు.

మాచమ్మ చూసింది. బోబణ్ణదే పైచెయ్యి అయ్యేలా వుంది. గుంపులో వీరుడిగా బోబణ్ణ పెరిగి పోతున్నాడనిపించింది. కావేరి మనసు భర్త వేపు తిరిగి పోతుందేమోనని భయమేసింది. మౌనంగా నుంచున్న గుంపులోకి చొరబడి. మేస్త్రి దగ్గరకి పరుగెత్తి, "అయ్యయ్యో....చంపేశావే. నీ ఇల్లు పాడుగాను.... నీ లాంటి వాడికి పిల్ల నిచ్చి దాని నేట్లో మట్టి పోశాను రోయ్...." అంటూ శోకాలు పెట్టసాగింది. ఆమెతో బాటు మరికొందరు ముందుకొచ్చి తాము మేస్త్రికి ఆప్తులన్నట్టుగా "అయ్యయ్యో చచ్చిపోయాడా ఏం కర్మ! రేపు పోలీసులొస్తారే" అంటూ అరవ సాగారు.)

బోబణ్ణ చూశాడు. పరిస్థితి విషమిస్తోందని పించింది. మూగూరు మేస్త్రికి శ్వాస ఆడటం లేదని అనుమానం వేసింది. అవాంచనీయంగా, అనుకోకుండా వచ్చిన పరిస్థితుల వల్ల కలిగిన అఘాతంలో విజృంభించిన బోబణ్ణ పిడికిలి బిగి సడల సాగింది.

కావేరి నీళ్ళు తేవడానికి లోపలకి వెళ్ళింది. "చావండి, లంజ కొడుకుల్లారా" అంటూ గుంపుని తోసుకుని బయటకి వెళ్ళాడు బోబణ్ణ.

"అరే ఎక్కడి కండీ వెళుతున్నారు?"

"అరే, ఆగండీ కాస్త!"

"నుంచోవయ్యో"

"ఓయ్! ఆపండాయన్ని...."

(వగైరా మాటలు గుంపులోంచి వస్తుంటే బొబణ్ణ అందర్నీ వెనక్కి నెట్టేసి వేగంగా వెళ్ళిపోయాడు.

"ఓయ్, ఓయ్, ఓయ్....ఆపండాయన్ని....అని అరిచి చెప్పారెవరో. ఎవరో త్రోవలో వస్తున్న మనిషి బోబణ్ణని ఆపడానికి ప్రయత్నించాడు. బోబణ్ణ ఈడ్చి అతని పొట్టలో తన్ని, పిడికిలితో మొహం మీద గుద్దాడు. అతను మరో మాట లేకుండా కింద పడిపోయాడు. అతని వెనకాల వస్తున్న మరొకతను మొదటి వాడికి పట్టిన గతి చూసి కాళ్ళకి బుద్ధి చెప్పాడు. ఇద్దరు ముగ్గురు మనుషులు రోడ్డు మీద అడ్డదిడ్డంగా పరిగెడుతుంటే ఎవర్ని పట్టుకోవాలో ఏమో తెలీక జనం కంగారు పడిపోయి, వూరికే నుంచుండి పోయారు. కోపావేశాలలో వుడికి పోతున్న బోబణ్ణ అడ్డుగా వచ్చిన కాడెద్దుల్లో ఒకదాని పొట్టలోకి, కడుపులో వున్నదంతా కక్కుకునేలా తన్నాడు. వాటికి పిచ్చెక్కి, కాడితో సహా గుంపు మీద కొచ్చి పడ్డాయి. నలుగురైదుగురు టపటపమని కింద పడిపోయారు. బోబణ్ణ వెనుదిరిగి చూడకుండా పరిగెట్టి చీకట్లో కలసి పోయాడు.

మర్నాడు పోస్టాఫీసు విధిగా మూతబడింది. కావేరి మాచమ్మతో కలిసి తోట పనిలోకి వెళ్ళసాగింది.

# 21 హ్యాంగోవర్

జి.ఎన్.సదాశివ

శృంగార్ షాపింగ్ సెంటర్ ఎదురుగా సర్వస్వం కోల్పోయినవాడిలా నుంచున్నాడు సోము. మహాత్మా గాంధీ రోడ్డులో నడిచి వస్తున్న సోము దర్శనం అయింది నాకు. బుస్....బుస్ మని సిగరెట్ పొగ వదులుతూ, వెదులుగా వున్న ప్యాంట్ జేబులో ఓ చెయ్యి దోపుకుని నుంచున్న అతని తీరు జాలి గొలిపేలా వుంది. 'హలో' అన్నా. 'ఓ!' అన్నాడు ఉలిక్కిపడుతూ. నన్ను చూసి అతని మొహం చాటంత అయింది.

"ఎవరయినా అమ్మాయి కోసం చూస్తున్నావా ?" అన్నాను. తన చిన్న నుదుటి మీద చమటను తుడుచుకుంటూ "ఛ, ఛ" అన్నాడు.

"చూడరా, కిట్టూ " అంటూ ఏదో చెప్పబోయి "ఈ మధ్యన నువ్వు కనిపించనే లేదే " అని మరేదో చెబుతూ, "నాకు ఏరోనాటిక్స్‌లో పని దొరికింది. చేతికి ఆరు వందలు వస్తాయి." అంటూ బుస్ ....బుస్ మని సిగరెట్ పొగ వదలసాగాడు.

కాని ఆ ప్రాణిని చూస్తే అలా కనిపించడం లేదు. ఉన్న ఓ చిన్న వుద్యోగాన్ని కూడా పోగొట్టుకున్న, చిమిడి ముక్కులతో వున్న తొమ్మండుగురు పిల్లల తిండికి ఏం చెయ్యాలన్న సమస్యతో కొట్టుమిట్టాడుతున్న గుమాస్తాలా కనిపిస్తున్నాడు. నాటకో పన్యాసంలా అదే సంగతి చెప్పానతనికి.

"అది కాదురా....నాకు....పోనియ్, నువ్వు దొరకడం మంచిదే అయింది. నేను కాస్త గుడ్డలు కొనుక్కోవాలి, సూట్ కోనాలి, కాని ఎంపిక చెయ్యలేక పోతున్నాను. ఒక కొట్టు కెళ్ళి చూశాను. అంతా బాగున్నట్టే అనిపిస్తోంది గాని ఏది తీసుకోవాలన్నదే తేల్చుకోలేక పోయాను. అరగంట నా అవస్త గమనించి కొట్టువాడు విసుగుదల చూపించాడు. సరె, బయటికి వచ్చేశాను." అంటూ తన గొడవ చెప్పుకొచ్చాడు.

గుడ్డల ఎన్నికలో నాకు మంచి టేస్ట్ వుందని సోము అభిప్రాయం. దాన్ని సమర్థించేలాగ వాడికోసం రెండు రంగురంగుల బోంబే డైయింగ్ గుడ్డలు షర్టుల కోసం తీయించాను. గ్వాలియర్ టెరీవుల్ సూట్ పీస్ తీసుకొమ్మని సూచించాను. మరీ రంగు గుడ్డల్ని అతను ఇష్టపడకపోయినా పోగ్గా తిరిగే నా ఎదుట చెబితే హాస్యం చేస్తానన్న మొహమాటంతో మారు మాట్లడకుండా ప్యాకెట్స్ తీసుకుని వంద రూపాయల నోట్లని కౌంటర్లో పడేశాడు. గుడ్డల్ని చంకలో ఇరికించుకుని డబ్బులిస్తున్నప్పుడు అతని మొహంలో ఒక రకమైన విజయ గర్వం కనిపించింది.

"చూడయ్యా కిట్టూ. ఇంత డబ్బులు ఒకేసారి ఖర్చు పెట్టడం నాకుఇదే మొదటిసారి". అన్నాడు పొంగిపోతూ. అతని మొహంలో కనిపించిన విజయగర్వానికి అర్థం. మరోసారి స్ఫురించింది.

"అది సరే, ఇంత డబ్బెక్కడిది?"

"నవ్వే మొద్దువి. పని దొరికిందని చెప్పలేదూ?" అన్నాడు.

దద్దమ్మలా మొహం పెట్టుకున్న సోము కంఠంలో ఇప్పుడు చైతన్యం కనిపిస్తోంది. ఇలాంటి సోముని ఇంతకు ముందెప్పుడూ చూడలేదు నేను.

"అదేమిటి? పని ఇవ్వగానే జీతం ఇచ్చేశారా?"

"ఒహో , నీకు చెప్పనే లేదు కదూ. నాకు పనిదొరికి అప్పుడే రెండు నెలలయింది. ఇప్పుడో రెండు వందల ఏభై పోయింది. మరో రెండు వందల ఏభై వుంది. నెల ఖర్చుకి విడిగా పెట్టాను. ఇప్పుడు చేతిలో వుండే ఈ డబ్బు ఎందుకో తెలుసా?" వాడి కంఠంలో వినవస్తున్న సున్నితమైన తేడాని గమనించ గలిగిన నాకు ఇది కేవలం పని దొరకడం వల్ల వచ్చిన హుషారుఅని అనిపించలేదు. కళ్ళు చికిలించి, సిగరెట్ తన శక్తికి మించి పీలుస్తూ, దగ్గుతూ, కంపిస్తున్న కంఠంతో మాట్లాడుతున్న సోముని చూస్తుంటే, అతని తీరు నన్ను కాస్త ఇబ్బందిలో పడేసింది.

"ఒరేయి కిట్టూ, ఈ డబ్బులు నా స్వార్జితం. నువ్వేమీ ఆలోచించకు. అది మా నాన్న సొమ్మేమీ కాదు. పద మందు కొడదాం." అన్నాడు.

వాడి మాటల జోరు సాయంత్రం విహారానికి బయలుదేరిన వాళ్ళందర్నీ మా వేపు చూసేలా చెయ్యడంతో నేను మరింత ఇబ్బందిగా ఫీలయ్యాను. ఇన్ని రోజులుగా నేను చూస్తున్న సోము వేరు. అతను ఎక్కువ మాట్లాడే వాడు కాదు. తన పనేమో తనేమో అన్నట్లుండే వాడు. నత్తలాగా తనలో తనే ముడుచుకుపోయే స్వభావం అతనిది. నాకు తెలిసినంత వరకు నన్ను తప్పించి మరెవరితోను అతనికి ఎక్కువ స్నేహ సంపర్కాలు లేవు. నేను మందు వెయ్యడం తెలుసు అతనికి. కాని అతని సంగతే నాకు తెలీదు. ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేసి చూశాను. "నాక్కూడా కొద్దిగా అలవాటు వుందిరా." అన్నాడు సిగ్గుపడుతూ.

మందు కొట్టడానికి నా అభ్యంతరం ఏమీ లేదు.

కాంటి నెంటల్‌లో ఓ మూలగా కూర్చుని రెండు 'బీరు' చెబుతుంటే సోము మెరుస్తున్న కళ్ళతో "నా కివాళ మాంసం - మద్యం రెండూ కావాలి." అన్నాడు. "సరేనయ్యా" అన్నాను. గుడ్డలు ఎన్నిక చేసేటప్పుడు వేడికోలుగా మాట్లాడిన సోము ఇప్పుడు ఆర్డర్ చేస్తున్నట్టు మాట్లాడుతున్నాడు.

"ఏం తీసుకుంటావ్?" అన్నాను. "నా కవన్నీ తెలియదు, నువ్వే చెప్పాలి" అన్నాడు. బేరర్‌ని పిలిచి, "ఒక ప్లేట్...." అని చెప్పబోయేటంతలో "నువ్వూ తినాలి" అన్నాడు. ఇదేదో పరిస్థితి చెయ్యిదాటి పోతోంది అనిపించింది.

"నేను తిననని నీకు తెలుసు. ఎందుకు మొండికేస్తావ్?" అన్నాను గదమాయిస్తూ. సోము మొహం చిన్నబోయింది. "O.K. రెండు ప్లేట్ మటన్ పలావ్" అన్నాను.

కాలి బూడిద వుతున్న సిగరెట్ కొసకి మరో సిగరెట్ తీసి వెలిగిస్తున్న వాడిని చూసి పిడొక న్యూరోటిక్ అనిపించింది. ఒకటి రెండు గుక్కలు బీరు తాగి మొహం చేదుగా పెట్టి కూర్చుండి పోయిన అతన్ని చూసి, "ఏం మద్యం రుచించలేదా?" అని అడిగాను. "నీకు హాస్యంగా వుంది కదూ, మాంసం కూడా రానీయ్ చెబుతాను" అన్నాడు. నా మాటలకి తనేం బాధ పట్టం లేదన్నట్టుగా.

అరగంట గడిచింది. సోము గ్లాస్‌లో బీరు సగం అలాగే వుంది. అతని ప్లేటులోని మాంసం కూడా చల్లారి పోతోంది. ఇంకాసేపుఆగి తింటే వాంతి రావొచ్చు. సోముకి బీరు తాగడంలో గాని, మాంసం తినడంలో గాని ఆసక్తి లేదని అర్థమైంది నాకు. సాయంత్రం నేనతడిని చూసినప్పట్నుంచి ఇప్పటి వరకు అతను అశాంతితో వేగుతున్నాడు. ఉద్వేగాన్ని అణచుకుంటున్నాడు, బలవంతంగా సంతోషాన్ని తెచ్చిపెట్టుకుంటున్నాడు. సుఖం కొనుక్కోవడం కోసం, బార్‌కి వచ్చాడు. అతనికి సుఖాన్ని అందించే దలారీ పని చెయ్యడాని కొచ్చినందుకు నాకేం బాధగా లేదు. అమాయకంగా కనిపిస్తూ పక్కలో బాంబు వేసేలా కూర్చున్న సోముని చూసి నాకు ఏడిపించా లనిపించింది.

"Shoot" అన్నాను. అమెరికాలో పేరు మోసిన ప్లేబాయ్ నవలల్లో హీరో లాగ. కాని ఇంజనీరింగ్ బుక్స్ మాత్రమే చదివిన సోము కంగారు పడిపోయాడు. "ఏమిటది? చెప్పు?" అన్నాను.

"ఏం చెప్పను?"

"అదే ఏదో ఆలోచిస్తున్నావు."

కోపం వచ్చిన వాడిలా గ్లాసులోని బీరు పైకెత్తి గటగట తాగేశాడు. ఒక ముక్క మాంసాన్ని గుటుక్కున మింగేశాడు. దానికి ప్రాయశ్చిత్తం చేసుకుంటున్న వాడిలా రెండు దమ్ముల పొగ పీల్చి మళ్ళీ ఐదు నిమిషాలు వుట్టినే కూర్చుని వచ్చేపోయే వాళ్ళని చూడసాగాడు. ఒంటరిగా, జంటగా - నవ్వుతూ కొంతమంది, మొహం నిండా వ్యథా భారంతో కొంతమంది, మాట్లాడుతూ కొంతమంది, మాట్లాడకుండా వట్టి సైగలు చేస్తూ కొంతమంది వచ్చి నిండిపోతున్న జనాన్ని చూసి ఆశ్చర్యపోతున్నాడతను.

"నా డబ్బుతో నేను సుఖపడ్డం తప్పా?"

"తప్పేం కాదుగాని నువ్విప్పుడు సుఖ పడుతున్నావా?" అని అడిగాను.

"అదే కష్టం రా కిట్టూ. సుఖం అన్నది నాకు తెలియనే తెలియదు. ఇప్పుడు మంచి పని దొరికింది. చేతిలో నాలుగు డబ్బులున్నాయి. పోయిన నెల పూర్తిగా గదిలోనే కూర్చుని డబ్బు కూడ బెట్టాను. ఆరు వందలు చేతికొచ్చే సరికి ఖర్చు చేయడానికి మనసే రాలేదు. అంతే కాకుండా నానా రకాల కలలు గన్న నాకు ఏ కల మొదట తీర్చుకోవాలో తెలియలేదు. ఇవాళ సాయంత్రం హఠాత్తుగా నాకు దాన్నంతా నా సుఖానికి ఖర్చు పెట్టుకోవా లనిపించింది. తక్షణం నాకు తోచినవి రెండే, ఒకటి గుడ్డలు కొనడం, రెండోది మందు కొట్టడం. కాని సుఖపడ్డం ఎలా? ....బహుశః నువ్వు నాకు కనపడక పోయుంటే నేను ఓ రెండు సిగరెట్ ప్యాకెట్స్ కొనుక్కుని గదికి వెళ్ళిపోయుండే వాడిని. అలాగని ఇప్పుడేం బాధ పడ్డం లేదనుకో. అయినా మనసుకి ఓ రకంగా...."

సోము ఎప్పుడూ తన గురించి ఏమీ చెప్పుకున్న మనిషి కాదు. నేను మరీ గుచ్చి గుచ్చి అడిగేలాంటి కుతూహలాన్ని కలిగించలేదు. ఇంజనీరింగ్‌లో ఓ రెండు సార్లు ఫెయిల్ అయ్యాడు. ఆ తరువాత ర్యాంకులే సంపాదించాడు - అంతే తెలుసు ఇంజనీరింగ్ చదివేటప్పుడు అతని పక్క గదిలోనే నేనువుండేవాణ్ణి, అప్పటి పరిచయం తరువాత స్నేహంగా మారింది. కాని అతని మనసు మూలలో ఏదన్నా దాచుకుని బాధపడు తున్నాడన్న సంగతి నాకు కొత్త.

"ఇంకో బీరు చెబుదాం" అన్నాను.

"విస్కీ కావాల" న్నాడు - హొటెల్లో అన్ని రకాల ఫల హారాలనూ ఒకేసారి రుచి చూడాలనుకునే తిండిపోతులాగ.

"నేను విస్కీ తాగను" అన్నాను.

అతనికి తిక్క రేగింది. "ధూత్ రాస్కెల్! నువ్వు బీరు తాగితే ఫరవాలేదు. విస్కీ తాగితే నీ జందెం మైలపడి పోతుందా?" అన్నాడు. "Shut up!" అన్నాను.

చప్పున ఓ ముక్క మాంసం నోట్లో కుక్కుకున్నాడు. అది గొంతులో చిక్కుకుంది. బీరు తాగి దాన్ని లోపలికి తోశాడు. నేను తిట్టడం మర్చిపోయిన వాడిలా నవ్వాను.

"పల్లెలో మా నాన్న దేవస్థానపు తీర్థాన్ని పంచి పెడతాడు. వాళ్ళిచ్చిన దక్షిణ తీసుకుని రొంటిన దోపుకుంటాడు. ఇక్కడా, ఆ కుర్చీలో కూర్చున్న ఎర్రమూతి ఆసామి మనకి ఈ తీర్థాన్ని పంచి పెడుతున్నాడు. అతన్ని 'ఫాదర్ ఇమేజ్' అనొచ్చు కదా?" అన్నాడు.

"ఒర్నీ, తాగుతుంటే నీ బుద్ధి చిగురిస్తోందా!" అన్నాను.

" నేను సైకాలజీ చదువుకున్నాను అబ్బాయ్ నీలాగ చీప్ ఫిక్షన్ కాదు. నాది సైంటిఫిక్ మైండే. నేను రెండు సార్లు ఫెయిల్ అయ్యేసరికి నన్ను మొద్దు అని అనుకుంటున్నావా?....నా పూజారి నాన్న కూడా అలాగే అనుకున్నాడు. ఇందులో ఇంకొక తమాషా ఏమిటంటే నేనూ అలాగే అనుకున్నాను. నాన్నలాగే ఎగగోచి పోసిన పంచె కట్టుకుని, పిలక పెట్టుకుని పూజ చేసుకుంటూ, ఉదయం లేచి పేడ ఎత్తుతూ, నాన్న చెప్పినట్టూ, నాన్న పెళ్ళాం చెప్పినట్టూ వింటూ వుండాలి, అదే మంచిదనిపించే దప్పుడు. అలాగే చేసే వాడినో ఏమో, కాని ఓ రోజు మా సవతి తల్లి ఎదుట నన్ను తన్నాడు. నేను బెంగళూర్లో చదువుతున్న మాటే అబద్ధమన్నాడు. ఊళ్ళో అందరూ ఈ మాటలే నమ్మి నన్ను ఆడిపోసుకున్నారు. డబ్బు లివ్వనన్నాడు. పొలంలో నీకు జానెడు స్థలం కూడా దొరకదన్నాడు. ఆ రోజే ఇక నీ మూతి చూడనని ఇల్లు వదిలి వచ్చేశాను."

ఎవరిదైనా జీవిత చరిత్ర వినాలంటే విసుగు నాకు. ఏదో ఒక ఏడుపు. లేదా అధిక్యత. ఇలా నా మటుకు నాకు మరొక అర్థహీనమైన బ్రతుకు గురించి వినడంలో బొత్తిగా ఆసక్తి లేదు. మరింత బీరు తాగాను. సోము మాటలు వింటున్న కొద్దీ సవతి తల్లి ఏంగిల్ పాత కథ చదివినట్టనిపిస్తోంది. అందులోనూ బీరు తాగి నాలుక తడబడుతోంది. ఒక్కో సారి కంఠం హెచ్చిస్తూ తగ్గిస్తూ తన కథని మంచి మెలో డ్రామా చేస్తున్నా డనిపించింది. దానితోబాటే ఈ సాయంత్రపు అతని ప్రవర్తనకి దీనికి ఏదో సంబంధం వుందని అనిపించింది. శ్రద్ధగా వినసాగాను.

("కిట్టూ నువ్వు అదృష్టవంతుడివి." అన్నాడు. "ఎలాగ?" అనడగాలని పించినా అడగలేదు. కాని ప్లేటులో పులావ్ ఇంకా అలాగే వుండటం నచ్చలేదు నాకు. "అయ్యా సోమశేఖరా, నీ ఆత్మ వృత్తాంతం పక్కన పెట్టి ప్లేటులో దాని సంగతి చూడు" అన్నాను.

మరో ముక్కని ఫోర్కుతో గుచ్చి నోట్లో వేసుకున్నాడు. మొదట్నుంచీ అతను మాంసం ముక్కల్ని నమలకుండానే మింగుతున్నాడు - మాత్రల్ని మింగినట్టు. బ్రాహ్మణ పూజారి కొడుకు మాంసం తింటున్నాడన్న ఆలోచన వచ్చేసరికి ఈ దృశ్యం మజాగా అనిపించింది. నైఫ్,ఫోర్క్ వాడకం తెలీదు అతనికి. బీరు కూడా చప్పుడు చేస్తూ తాగుతాడు...)

"నువ్వు హాస్యం చేసినా సరే, నువ్వొక్కడివే నాకు నిజమైన స్నేహితుడివి. అదలా వుండనీ, తమాషా ఏమిటంటే, నేను మా మేనమామ ఇంట్లో, స్కూల్లో జీతం మీద పనిచేశాను, పేడ ఎత్తాను. ఏదేదో చేసి కాలేజీ ఫీజు కట్టాను. ఆ తరువాత ఎక్కడా ఫెయిల్ కాలేదు. మా నాన్నని గురించి ఆలోచనా రాలేదు." అన్నాడు.

"అది సరే, ఇప్పుడెందుకు మీ నాన్నని గురించి ఆలోచన? This is the time to forget every thing."

ఇవాళ సాయంత్రం నుంచి నన్ను దొలుస్తున్న ప్రశ్న అదే. ఇన్ని రోజులుగా అక్కర్లేకుండా పోయిన నాన్న ఇవ్వాళెందుకొచ్చాడా అని, మనసంతా భగభగ మండుతున్నట్టు అవడంతో గదిలో నుంచి పరుగు తీశాను. నేను ఉద్యోగంలో చేరిన వారాని కల్లా మా నాన్న నుంచి ఓ ఉత్తరం వచ్చింది. మొదట ఆశ్చర్యం వేసింది. "ఉద్యోగంలో చేరావట కదా! నెలనెలా కొంత డబ్బు పంపుతూ వుండు" అంతే వుందందులో ఓ రకంగా అసహ్యం వేసింది నాకు. ఒళ్ళు మండింది. "ఒక్క పైసా పంపను." అని రాసేశాను. ఆ తరువాత నాకు ఉద్యోగం దొరికిన సంతోషమంతా మాయమయిపోయింది...." అన్నాడు. మళ్ళీ, "అమ్మ వుసురు పోసుకుని నూతిలో దూకేలా చేశాడు. ఆరేళ్ళ వయస్సులో నా చేత పేడ బుట్టలు మోయించాడు. మంత్రం నేర్పేటపుడు చింతబరికెలతో బాదాడు." అంటూ తొందరతొందరగా గ్లాసులోని మద్యాన్ని తాగుతూ చెప్పాడు. "నేను డబ్బు పంపక పోవడం సరియైన దేనా? అని అడిగాడు.

"నువ్వే నిర్ణయించుకోవాలది" అన్నాను. వాడికి నిరాశ కలిగింది. నిజంగా సందిగ్ధంలో వున్నాడతను. తండ్రిని ఎదిరించి బ్రతకడం పెద్ద సమస్య అవడం చూసి ఆశ్చర్యమేసింది నాకు. నైతికంగా అతనిలాంటి సందిగ్ధంలో పడడమెందుకో అర్థం కాలేదు నాకు."నువ్వు చేప్పేదాన్ని బట్టి చూస్తే మీ నాన్నకి నిన్ను డబ్బు అడిగే హక్కు లేనే లేదు" అన్నాను. అతనికి కాస్త ఓదార్పు కలగాలని.

అయినా అతని మనసు శాంతించినట్టు లేదు.

"కిట్టూ, ఓ పని చేద్దాం."

"ఏమిటది?"

"ఓ బాటిల్ విస్కీ కొనుక్కుని మీ ఇంటికి వెళదాం ఎలాగూ ఒక్కడివే వుండి సుఖ పడుతున్నావు. ఓ రోజు నేనూ అక్కడే వుంటాను. స్పృహ కోల్పోయేదాకా తాగుదాం" అన్నాడు. మళ్ళీ వెంటనే "ఎందుకు ఒక్కడివే వుంటున్నావ్?" అడిగాడు.

"అప్పుడప్పుడు అమ్మాయిల్ని తీసికెళ్ళడానికి వీలుగా వుంటుందని" అన్నాను.

సోము నమ్మాడు. "మొత్తం మీద నువ్వు ఏ బాదర బందీ లేని అదృష్టవంతుడివి." అన్నాడు. ఎంత అమాయకుడీ ఇంజనీర్ అనుకున్నాను.

విస్కీ బాటిల్ ప్యాక్ చేయించుకుని కాంటినెంటల్ వదిలి పెట్టేసరికి పదకొండయింది.

హాల్లో టి పాయ్ మీద రెండు గ్లాసులు తెచ్చి పెట్టాను. ఇల్లంతా పరీక్షగా చూసి సోము, "నీకు నిజంగా గర్ల్‌ఫ్రెండ్స్ వున్నారా?" అని అడిగాడు. శబ్దాలు కొంచెం విచిత్రమైన ధాటిలో కష్టంగా దొర్లుతున్నాయి.

గ్లాసులోకి విస్కీ వంపుతూ, "చాలా మంది వున్నారు. అనూరాధ, అనుపమ, అనార్కలీ, అలకనంద, రీటా, జోసఫీన్, స్వప్న, స్వయంప్రభ...."

అని చెబుతూనే వున్నాను.

"అంతంత మంది లేకపోయినా, వున్నారని అనుకోవడం egoకి మంచిది కదూ." అన్నాడు.

మందుకొట్టిన మత్తులో కూడా సోము ఆశ్చర్యం గొలిపేలా చక్కగా మాట్లాడతాడనిపించింది.

"పోనియ్, మీ నాన్న సంగతి చెప్పు."

"ఆ సంగతి అయిపోయిందిగా, వదిలెయ్, ఇప్పుడు నాకు స్పృహ తప్పాలి." అంటూ రెండు మూడు స్మాల్ విస్కీ గటగట తాగేశాడు.

ఎవరో తలుపు కొట్టిన చప్పుడయింది. సోము కంగారు పడ్డాడు. నేను మెల్లిగా గ్లాసు కింద పెట్టాను.

తలుపు తెరిచేసరికి ఎదురింటి చంద్రయ్య నుంచున్నాడు. బీరు, విస్కీ వాసన ముక్కుకి తగలగానే కాస్త తడబడి ఒక అడుగు వెనక్కి వేసి "సారీ సర్, డిస్టర్బ్ చేశానేమో మిమ్మల్ని. ఏమిటో నిద్రే రాలేదు చూడండి, మా ఆవిడ వూళ్ళో లేదు. మీకా అనుభవం తెలిదనుకోండి, ఉన్నప్పుడే రకం, లేనప్పుడోరకం. ఆ లోపల మీ ఇంట్లో దీపం కనిపించింది. ఈ వారం బ్లిట్జ్ ఏదన్నా తెచ్చారేమోనని వచ్చాను. ఎవరో ఫ్రెండ్స్ వచ్చినట్లున్నారే...." ఏదో చెబుతూనే వున్నాడాయన.

నాబుర్ర నిమిషానికి పదిసార్లు గిరగిర తిరుగుతున్నట్టుగా వుంది. కాళ్ళు కాస్త బలాన్ని కోల్పోయాయి. అతని మాటలు ఇప్పట్లో పూర్తి కావనిపించింది. వెంటనే అక్కడున్న ఓ పాత పేపర్ని అతని చేతిలో పెట్టేసి, "ఇదే లేటెస్ట్, ఢిల్లీలో కూడా రిలీజ్ కాలా." అంటూ అతని మొహం మీదనే తలుపులు మూసేసి లోపలికి వచ్చాను.

చూస్తే అక్కడ సోము లేడు. నాకు నిజంగా మందు ప్రభావంతో ఏమీ తేలీలేదు అనిపించింది. లేకపోతే సోము ఇక్కడకి రాలేదేమో లేదా సోము నా ఆలోచనల్లో మాత్రమే వున్నాడేమో లేకపోతే తలుపు కొట్టింది వాళ్ళ నాన్నను కుని ఎక్కడన్నా దాక్కున్నాడేమో అననిపించింది. ఆఖరిదే రైటనుకుని. తూలుతూ టేబుల్ కింద, మంచం కింద, తలుపుతెర వెనకాల, వంటింట్లో మూల మూలా వెతికాను, బాత్‌రూంలో చూశాను, సోము కనిపించనే లేదు. టీపాయ్ మీద ఒక్క గ్లాసే వుంది,

నిజంగా మందు బాగా తలకెక్కిందను కున్నాను. సోము ఎక్కడికైనా పారిపోయాడా? వీధి గుమ్మంలో నేను నుంచునే వున్నాను. అనుమానం వచ్చి పెరటి తలుపు తీశాను.

మురికి కాలవ అంచున గొంతుక కూర్చుని, ఎడం చేత్తో విస్కీగ్లాసు పట్టుకుని, కుడి చేత్తో పొట్ట పట్టుకుని సోము వ్యాక్ వ్యాక్....వ్యాక్ మంటూ వాంతి చేసుకుంటున్నాడు. వాంతిలో వుండలుండలుగా మాంసం ముక్కలు పడుతున్నాయి....

సోము ఉదయం పది గంటలకి నిద్రలేచాడు. తెచ్చి పెట్టుకున్న వుత్సాహంతో చురుగ్గా బాత్‌రూంకి వెళ్ళి మొహం కడుక్కున్నాడు.

"నిన్న చాలా బాగా గడిచిందయ్యో" అన్నాడు నెస్ కెఫే చేసిచ్చాను. తాగుతూ-

"కాస్త తలనొప్పిగా వుంది, నోరు చప్పగా వుంది". అన్నాడు.

"మీ నాన్న విషయం ఏం తీర్మానించు కున్నావ్?" అన్నాను. "ఓహో! అన్నాడు. ఓ క్షణం మౌనంగా నా వేపు చూశాడు. "నిజం ఏమిటో తెలుసా? నిన్న వూరికి 150 రూపాయలు మనియార్డర్ చేశాను. ప్యాంట్ లో దాని రసీదు వుంది చూడు. అలా పంపిన తరువాత మనసు అదోలా అయింది. నెలన్నర డబ్బు పంపకూడదని విలవిల బాధపడ్డాను. పంపాక అది తగ్గుతుందనుకుంటే అదీ అబద్ధమే అయింది. చూడు, డబ్బు పంపడం తప్పని నీకు అనిపించడం లేదా?".

నా నోటి వెంట మాట లేదు.

నేను కేవలం దిగ్భ్రమలో వున్నాను.

# 22. కట్టుబాట్ల కోట బయట

*రాజశేఖర వీరమాన్ని*

నెప్పి బాగా ఎక్కువవడంతో అలాగే కళ్ళు మూసిన నాకు హఠాత్తుగా మెలకువ వచ్చింది. కళ్ళు తెరచి చూశాను. దగ్గర ఎవరూ లేరు. పక్కకు ఒత్తిగిలి కళ్ళు మూశాను. నాన్నగారు బయట ఎవరితోనే చిన్న గొంతుతో మాట్లాడ్డం వినిపిస్తోంది.

వింటున్న వ్యక్తి అంటున్నాడు. "మీరేమైనా అనండి. ఈ జబ్బు ఇంత ముదిరే దాకా ఊరుకోకుండా వుండవలసింది".

"నేనేం చెయ్యగలను చెప్పండి. తన జబ్బు తనకే తెలియకపోతే మిగతా వాళ్ళు మాత్రం ఏం చెయ్యగలరు? చదువుకున్నాం. అన్నీ మాకే తెలుసు అని గట్టిగా అనుకునే వాళ్ళకి మనం చెప్పగలమా? ఈ ఆలోచనలతో నిద్రాహారాలు లేవు నాకు...."

నాన్నగారి మాటలు విని ఆయన మీది జాలి ఇంకా ఎక్కువయింది. "నాన్నా, నన్ను ఈ పరిస్థితికి తెచ్చిందే నువ్వు." అని గట్టిగా అరవాలనిపించింది. ఎప్పుడూ తన గొప్పదనాన్నే చాటుకునే నాన్న, నేను జబ్బు పడ్డ ఈ సమయంలో కూడా అదే పని చేస్తున్నాడు. పుట్టినప్పట్నుంచి ఇవాల్టి దాకా నన్ను దుమ్ము కణం కంటే తక్కువగానే చూస్తూ వచ్చిన నాన్న ఈ ఆఖరి అంకంలో కూడా తన పాత్రని బాగా నటించి అందరి దగ్గరా శబాష్‌గిరీ కొట్టేస్తున్నాడు. ఎందుకో గాని మొదట్నుంచీ నాకూ నాన్న కూ పొత్తు కుదిరేది కాదు. చిన్న వాడిగా వున్నప్పుడు బెత్తంతో కొట్టి, చెవి నులిమి, గోడకుర్చీ వేయించి, ఓనమాలు దిద్దించిన అయ్యవారి చిత్రం నా కళ్ళ ముందు మారినా నాన్న చిత్రం మారనే లేదు. అకారణమైన కోపం. ఏది చేస్తే తప్పు, ఏది చేస్తే ఒప్పు అని ప్రతి పని గురించీ ఆలోచించి చేశాక కూడా అతని పై దాని పరిణామం ఇలాగే వుంటుంది. అని చెప్పడానికి వీలు లేదు. కొన్ని సార్లు పొగిడి కొండెక్కిస్తే చాలా సార్లు తిట్టి తిరస్కారంగా మాట్లాడేవాడు. కొత్తగా వచ్చిన మార్పంటూ వుంటే, ఇంతకు మునుపు చిన్న వాడిని గనుక కొట్టేవాడు. ఇప్పుడు తిట్లతో సరిపెడతాడు అంతే.

నాన్నని గురించి ఇలా ఆలోచించడం నీచం అనిపిస్తుంది. ఇప్పుడు కాదు. నాకు జ్ఞానం వచ్చినప్పట్నుంచీ ఈ క్షుద్రభావంతో పోరాడుతునే వున్నాను. నేను గెలవ లేదు. అది నేడిపోలేదు. "నాన్నా, నిన్న కలలో నీ శవం చూశాను" అని ఎవరో రాసిన కవిత చదివినప్పుడు, ఇలా పోరాటం జరిపిన వాడిని నేనొక్కడినే

కాదని తేలిగ్గా వూపిరి పీల్చుకున్నాను కూడా. నేను పెరిగే కొద్దీ, నా లోని నేను పెరిగే కొద్దీ ఏదైనా గొప్పదనాన్ని చూపించి, నా లోని నన్ను చిన్న బుచ్చుతాడు నాన్న. ఏదీ దొరకనప్పుడేదో ఒక తప్పు వెతికి, చదువుకుని మా కన్న గొప్ప వాళ్ళయిపోయిన వాళ్ళు కదూ మీరు? అని వ్యంగ్య బాణం విసురుతాడు. ఆయన కన్న నేనెక్కువ చదువుకోవడం తప్పా? ఉన్న దాన్ని చూసి సంతోషపడ్డం కన్న, లేని దాన్ని తలచుకుని వాపోవడం ఎక్కువైపోయింది....జనరల్ వార్డ్‌లో వున్న రోగి ఎవరో నెప్పి ఎక్కువై అరుస్తున్నాడు. నర్స్ వచ్చి టెంపరేచర్ చూసి చార్ట్‌లో రాసి చిరునవ్వు నవ్వి వెళ్ళింది. ఆ చిరునవ్వు కూడా వాళ్ళ డ్యూటీలో ఒక భాగంలా వుంది.

ఆమె నవ్వు ఏదో భావాన్ని తట్టి లేపినట్టు అయింది. అంతా ఒక వ్యాపారం. ఎందుకో గాని జ్ఞానం వచ్చినప్పట్నుంచి రోజు రోజుకి పిరికితనం ఎక్కువవుతోంది.

నేను ఇంకా ఒకటి రెండు శతాబ్దాలు ఆగి పుట్టాల్సిందేమో! స్వాతంత్ర్యం లేని బ్రతుకు బ్రతికితే ఎంత చస్తే ఎంత? ఒక వ్యక్తి చుట్టూ ఎందుకిన్ని బంధనాలు? తను, తనది తన వాళ్ళు, తన వాళ్ళనుకునే వాళ్ళు ఒకటా ....రెండా....?

బయట మనుషుల సందడి, గొడవ ఎక్కువయింది. నాలుగు గంటలయ్యుండవచ్చు. ఇక రెండు గంటలు రోజువారి మామూలు జాతర. వచ్చిన జనం తమ యోగ్యతలకు తగ్గట్టు కన్నీళ్ళు కార్చి స్పందన చూపించి, తమ మంచితనానికి తామే భూతద్దం పట్టుకుని సంతోషించే శుభ యోగం....

అమ్మ తమ్ముడితో కలిసి వచ్చింది. తమ్ముడు ఫ్లాస్కు, నీళ్ళు ర్యాక్‌లో వుంచి, చార్ట్ చూసి "అంతా నార్మల్‌గా వుంది కదన్నయ్యా" అన్నాడు మెప్పుదలగా. అతను ఫైనల్ ఎం.బి.బి.యస్.

అమ్మ మామూలుగా ఒక బాల్చీడు కన్నీళ్ళు కార్చింది. నాన్న అదే నెపంతో రోజులాగ లోపలికి వచ్చి

"ఆపరేషన్ అంటే అంతగా భయపడాలేమిటి? ఇప్పుడు గుండె ఆపరేషన్లే జరుగుతున్నాయట. ఇదేముంది మహా" అని ఓదార్చసాగాడు. ఆయనలో తన కొడుకు చనిపోడన్న భావం వున్నట్టుంది.

"రేపు ఉదయం ఎనిమిది గంటలకి కదన్నయ్యా ఆపరేషన్?" అన్నాడు తమ్ముడు.

అవునన్నట్టుగా తలూపాను.

అమ్మ కళ్ళల్లో నీళ్ళు కారుతూనే వున్నాయి.

డాక్టర్ రోజువారీ విజిట్ కోసం లోపలికి రాగానే పాలపొంగు మీద నీళ్ళు

చిలకరించినట్టు అమ్మ ఏడుపు తగ్గిపోయింది.

డాక్టర్ చార్ట్ చూశారు. గుండె, పొట్ట, వెన్ను అన్ని చోట్ల స్టెతస్కోపుతో చూసి తమ స్టెతస్కోపు బాగా పని చేస్తోందని ఖచ్చిత పరుచుకున్నారు.

"Tomorrow by this time you will be alright Mr...." అంటూ అమ్మకి ధైర్యం చెప్పి వెళ్ళిపోయారు.

అమ్మ ఏడుపు ఎక్కువవడంతోనే చాలా సేపు ఆస్పత్రిలో వున్నందువల్ల కలిగిన విసుగుదలతోనే కాని, నాన్న అమ్మని తీసుకుని ఇంటికి వెళతానని చెప్పి, తమ్ముడితో కాసేపు ఇక్కడే వుండమని సూచించి వెళ్ళిపోయాడు.

"అన్నయ్యా, వదిన వచ్చింది". కొత్త కబురు చెప్పినట్టుగా అన్నాడు తమ్ముడు.

"ఇప్పుడెందుకొచ్చింది?"

"అదేమిటన్నయ్యా అలాగంటావు? ఈ సమయంలో కాకపోతే మరెప్పుడు రావాలంటావు?"

"పెళ్ళాం చుట్టాలు - పక్కాలు అంటే చచ్చేటప్పుడు చూసిపోదం కోసమేనా ఏమిటి? నేను చచ్చిపోయానని రూఢి పరచుకుని వెళ్ళాలని...."

తమ్ముడు నోటి మీద చెయ్యి పెట్టి మాటకి అడ్డొచ్చాడు. అతనికి వెనుకటిదంతా గుర్తు వచ్చి వుండాలి. బయటకి వెళ్ళిపోయాడు.

ఎందుకోగాని ఓ రకమైన ఆనంద వీచిక మనసులో దూరి వెళ్ళినట్టయింది. తమ్ముడి మనసు నొప్పించినా "చూశావా ఎలా కసి తీర్చుకున్నానో" అన్న ఒక వికటమైన సంతోషం కలిగిందనుకుంటాను. ఆమె మీద కోపంతో తమ్ముణ్ణి నొప్పించానే అన్న బాధా కలిగింది.

అవునూ, ఇందులో నా తప్పేమిటి? నా కనిపించిన దాన్ని ఇలా మొహం మీద కొట్టినట్టు చెప్పకూడదని ఎంతగా ప్రయత్నించినా, ఎలాగో నాలో కలిగిన భావం మాటల రూపంలో బయటకి వచ్చేస్తుంది. నేను జీవిస్తున్న పరిసరాలలో నాకు ఇష్టం వచ్చినట్లు మాట్లాడ్డానికి గాని, నడుచుకోవడానికి గాని, బ్రతకడానికి గాని వీల్లేదని తెలుసుకున్నాకే నేనీ ప్రపంచంలో బ్రతకడానికి అనర్హుడినని నిర్ణయానికి వచ్చాను.

మనసులో, హృదయంలో కలిగిన ఇష్టానిష్టాల్ని పట్టించుకోకుండా ఎవరిదో బంధనానికి లోనై ఏదో సంకోచానికి లోనై, తన వ్యక్తిత్వాన్ని కట్టుబాట్లలో బంధించి ఎవరిదో నాలుక, ఎవరివో కళ్ళు, ఏవో చెవులు. మనిషి తన స్వంత వ్యక్తిత్వాన్ని ఎంచుకు బ్రతికేవారిచే నిర్మింపబడ్డ ఈ సమాజం నా పాలిటికి ఎప్పుడో చచ్చిపోయి నట్టయింది. అందుకే చచ్చిపోయిన ఈ సమాజంలో బ్రతకడం కన్న

తరువాతైనా సజీవమైన సమాజాన్ని నిర్మించాలంటే చనిపోవడమే మంచిది....
"వదిన వస్తుందిట. మరీ నాతో అన్నట్టు దురుసుగా తనతో అనేయ కన్నయ్యా" తమ్ముడు లోపలికి వచ్చి నాతో అన్నాడు. చిరునవ్వు నవ్వుతూ అతని వేపు చూశాను. తన అన్నయ్య ఎట్టి పరిస్థితిలోనూ అలా చెయ్యడు అన్న భరోసా ఆ చూపులో కనిపించి వుండాలి. ఏదో మందు తెస్తానని బయటకి వెళ్ళాడు.

2

నన్ను నిర్జీవం చేస్తున్న కుట్రలో ఈ పెళ్ళాం కూడా ఒక ముఖ్య పాత్ర ధారిణి. ప్రేమించిన మనిషిని పెళ్ళి చేసుకోలేక పోయినా, పెళ్లి చేసుకున్న మనిషిని ప్రేమిద్దామన్న ఉద్దేశంతో, పెళ్ళయ్యాక కొత్తలోనే నా పాత కథ ఆమె కి చెప్పాను. ఎప్పటికైనా ఆ విషయం మా ఇద్దరి మధ్య అగాధం కాకూడదన్న ఉద్దేశంతో. కానీ అది నేను అనుకున్నట్టు కాకుండా ప్రతికూల పరిణామానికి దారి తీసింది. అప్పుడు వెంట్రుక వాసి కన్న తక్కువగా ప్రారంభమైన చీలిక రాను రాను పెద్దదై ప్రపాతమై ఆమె ఆ వొడ్డునా, నేను ఈ వొడ్డునా వుండేటట్టు చేసింది. నేను ఇప్పుడు ఆస్పత్రిలో వున్నాను గనుక నా చావు నీడ వంతెనగా మారి ఆమెని మళ్లీ ఇక్కడకి రప్పించింది. చూడాలి, ఆమె పాత్రని ఎలా నటిస్తుందో!

ఇప్పుడు ఆమెకి ఆఖరి సారిగా చెప్పేస్తాను. మొదట చెప్పకూడని దానినే చెప్పినప్పుడు, ఇప్పుడు చెప్పి తీరాల్సిన దాన్ని చెప్పకుండా, వదలి పెడితే ఎలా? ఆఖరికైనా సత్య సంగతి తెలిసి, తన యోగ్యత ఎంత అన్న విషయం కూడా ఆమెకి తెలియాలి.

ఓసీ, అడదానా. నిన్ను పెళ్ళి చేసుకున్నది నీ ముఖం, అంతస్థు చూసి కాదు. నీ మీద ప్రేమ చేతా కాదు. నువ్వు ఈ ఇంటిలోకి అడుగు పెట్టింది. ఇంటి పెద్ద కోడలిగానే లేక నా భార్యగానే మీ మామగారినే అడిగి చూడు. భర్తగా నా కర్తవ్యాలన్నీ నిర్వహించాను. 'వెనుకెప్పుడో ఎవరినో ప్రేమించాడు' అనుకుంటూ గంట శబ్దం విని చొంగ కార్చే ఫావ్లో కుక్కలాగ 'కుయ్' మంటూ నీ అంతట నువ్వే ఒళ్ళు పిండుకుంటూంటే నేనేం చెయ్యగలను?

ఆమె వచ్చింది. ఒక్కతే వస్తే ఏమవుతుందోనన్న భయంతో ననుకుంటా, స్నేహితురాళ్ళతో కలసి వచ్చింది. వాళ్ళలో కొంతమంది నా క్లాస్‌మేట్స్ కూడా వున్నారు. సరే, ఇక మామూలు వ్యవహార మన్నట్లుగా అందరూ తమ తమ శక్త్యానుసారం అనుకంప, దుఃఖాలను ప్రదర్శించి ఆమె వొక్కతినే వదిలి వెళ్ళిపోయారు. ఆమె కూడా తన కర్తవ్యం అన్నట్లుగా పక్కలో కూర్చుని, నుదుటి మీద చెయ్యేసి జ్వరం వుందేమో చూసింది. పొట్టమీద చెయ్యి వేసి "నొప్పి చాలా ఎక్కువగా వుందా?" అంది గర్భిణీ స్త్రీలను అడిగినట్లుగా.

("అంతగా లేదు" వెంటనే చెప్పాను.

పడుకున్న నా తల నిమురుతూ కూర్చున్న మనిషి హఠాత్తుగా నా గుండెల మీద తల పెట్టి ఏడవ సాగింది. నాకు నవ్వొచ్చింది.)

"ఎక్కువగా ఏడవకు. మళ్ళీ ఇంటికి వెళ్ళవలసి వస్తే స్నో, పౌడర్ రాసుకోవలసివస్తుంది." అని చెప్పాలని పించింది. మొహం నిండా రంగు పూసుకుని సినిమాలో ఏడ్చే మీనాకుమారి గుర్తు వచ్చింది నాకు.

ఈ ఏడు పన్నదుండే ఇదే దైవ దత్తమైన కళ. కొంతమందికి అదో ఫేషన్. మిగతా వాళ్ళకదే రోగం.

అమ్మ రెండో జాతికి చెందినది. ఏడ్చి ఏడ్చి అంతా కన్నీళ్ళతో కరగించి వేస్తుంది. కొన్ని సార్లు నాన్న కూడా అమ్మ ఏడుపుకి కరిగిపోయి నన్ను శిక్షించకుండా వదిలెయ్యడం జరిగింది. ఈ అమ్మతో భలే గొడవ. అన్నింటిలోనూ అంతే, ఆమె నన్ను అంత ప్రేమగా చూసి, ముద్దు చేసి పెంచకుండా వుంటే నాలో ఇంత మొండితనం వచ్చేదే కాదేమో. నాన్న ప్రేమని, అమ్మ ప్రేమని కలిపి సరాసరి తీస్తే ఒక మనిషిలో ఎంత వుండాలో అంతకంటే ఎక్కువే వస్తుందీ ఇద్దరికీను. కాని అమ్మ ఈ విషయంలో కాపిటలిస్టు. ఆమె అన్నింటినీ తనమీద వేసుకున్నందు వల్లనే ఏమో, నాన్న ఎప్పుడూ కమ్యూనిస్టులా ఇంట్లో అందరికీ విరుద్ధంగా ఏదో గొడవ లేవదీస్తూనే వుంటాడు.

గుండెల మీద నుంచి తన మొహం పైకెత్తి నా గుండె భారాన్ని తగ్గించింది. ఏడుపు స్టాకు అయిపోయి వుండాలి. ఆలోచనల ప్రవాహంలో ఆమె అస్తిత్వమే కొట్టుకు పోయింది. ఈమెలో ప్రేమ - ఆకర్షణ, నా అంచనాకి తక్కువగానే వున్నట్టు లెక్క. మొహానికి తగిలించుకున్న ఈ ఏడుపు ముసుగు ఆమె వ్యక్తిత్వానికి ఎంత కళ తెచ్చిపెట్టిందే కదా అనిపించింది. ఆమె తల నిమిరి కన్నీళ్ళు తుడిచాను.

"ఇవ్వాలొక్క రోజే, రేపు వుదయం ఆపరేషన్ అయితే అంతా సర్దుకుంటుంది. దీనికంతటికీ నేనే కారణం. నేను మిమ్మల్ని విడిచిపెట్టి వెళ్ళకపోతే మీకీ పరిస్థితి వచ్చేదే కాదు..." అంది ఏడుస్తూ.

వాహ్‌రే పిల్లా నిన్ను అంతగా ప్రేమిస్తున్నా అన్న భ్రమ ఎలా కలిగింది నీలో? అంతగా ప్రేమకు పాత్రురాలినన్న అహంభావమైనా వుంది కదా నీలో. ఇప్పుడు నీలో కలుగుతున్న భావాలన్నీ గుండెల్లోంచి వచ్చినవని అనుకుంటున్నావా? అది నిజమే అయితే, 'చావు' అన్న శబ్దం అందర్నీ కాకపోయినా కొందర్నయినా దారికి తెస్తుందన్న మాట. ఒక వేళ ఆపరేషన్ సక్సెస్ అయి నేను బ్రతికి బట్టకట్టి, ఈ ప్రీతి విశ్వాసాలలో ఆ తరువాత కూడా మిగిలి వుంటాయంటే నేను

బ్రతకడానికి సిద్ధమే. ఈ ఆలోచనలన్నీ నిర్వికారమైన, నిర్మలమైన మనసుతో అనుకుంటున్నదే లేక 'బ్రతకాలి' అన్న ఆశ గల నేను, నేనే ద్వేషిస్తున్న ఈ ప్రపంచపు గూఢచారిగా పని చేస్తున్న నా మనసు యొక్క మరొక ముఖమో అన్న ఆలోచన నా బుర్రని చెడగొట్టసాగింది.

"మిమ్మల్ని వదిలిపెట్టి ఈ రెండేళ్ళూ ఎలా గడిపానో దేవుడికే తెలియాలి. మీరు తీసికెళ్ళడానికి వస్తారని ఎదురు చూడని రోజే లేదు. నా కష్టం ఏ శత్రువుకీ వద్దు" అంది ఏడుస్తూ.

ఈ స్త్రీ జాతే ఇంత. అందులో ఈ మనిషికి తన కన్నీటి విలువ బాగా తెలుసు. పిసిని గొట్టు కోమటిలాగ తన కన్నీటిని ఖర్చు చేస్తుంది. సందర్భానుసారంగా అభినయం. ఆ అభినయంలో వచ్చే మాటలన్నీ తన గుండెల్లోంచే వస్తున్నట్లు చెప్పగల నేర్పు ఇవన్నీ నాకు తెలుసు.

అయినా దీనికంతా విరుద్ధంగా ఒక మనిషి వుండేది. ఏడ్చే పరిస్థితి వచ్చినప్పుడు నవ్వేది! అందరూ నవ్వేటప్పుడు గంభీరంగా వుండేది. బ్రతుకులో ఓ ఘట్టంలో కలుసుకుని, కొంతకాలం నా అడుగులో అడుగు వేసిన ఒక మనిషి. అప్పుడు నా వారి కోసం, మా గౌరవం, అంతస్తు కాపాడు కోవాలనుకునే వారి ఒత్తిడికి లొంగిపోయి ఆమెని నడివీధిలో వదిలేసి తల దాచుకున్న వాడిని నేను. లోకం ఈ ఒక్క విషయంలోనూ నాకు సడలింపు చూపించి వుంటే, నేను దాని బానిసగా పడి వుండడానికి సిద్ధంగా వుండే వాడిని.

తమ్ముడు లోపలికి వచ్చాడు. ఇంతవరకు చేసిన అభినయంలో చెడిపోయిన తన మేకప్పుని కొద్దిగా సరి చేసుకుని వాళ్ళ వదిన సర్దుకు కూర్చుంది.

"వదినా, మీ ఫ్రెండ్స్ పిలుస్తున్నారు. విజిటింగ్ టైమూ అయిపోయింది. మీరు ఇంటికి వెళ్ళండి. నేను తరువాత వస్తాను" అన్నాడు. ఆమె లేచి.

"ఉదయం వస్తాను" అని వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిపోయాక ఈ రెండేళ్ళూ తనని వదిలి పెట్టిన సంగతి ఎత్తి ఆమెని తిట్టాడు.

అతనెప్పుడూ తన అన్నకి ఎవరి వల్ల అన్యాయం జరిగినా సహించడు. తనూ వాళ్ళ స్థానంలో నుంచుని ఆలోచించి తనే అయితే వాళ్ళు చేసినట్టు చేసేవాడే కాదే అని విమర్శించుకునే గొడవకి పోయేవాడు కాదు. ఎన్నో సార్లు దీన్ని గురించి చెప్పినప్పుడు.

"నీ కేమిటన్నయ్యా, సముద్రం లాగ వుంటావు. ఏమి ఎంత వేసినా, కనిపించకుండా మునిగి పోతుందే గాని, దాని గుర్తు కూడా బయటకి తెలియదు. తట్టుకోవడానికైనా ఓ మితి అంటూ వుండాలి. ఇవన్నీ చూస్తూ నేను మాత్రం

వూరుకోలేను మరి" అనేవాడు.

నాలో ఏం చూశాడే గాని, ఇంట్లో నాన్న మొదలుకుని అందరి మీద అధికారం చెలాయించే వీడు నాతో మాత్రం చాలా మృదువుగా నడచుకుంటాడు. తమ్ముడు మాట్లాడుతూనే వున్నాడు. (విషయం మారుద్దామని "రవి ఎప్పుడొస్తాడుట? ఇవాళ ఆలస్యం అయిందేం? అనడిగాను)

"అవును, అన్నట్టు మరిచే పోయాను. వాళ్ళింటికి ఎవరో వచ్చారట. రావడం ఆలస్య మవుతుందని చెప్పమన్నాడు. బజార్లో కనిపించాడు."

రాత్రి నా దగ్గర రవిగాని, తమ్ముడు గాని వుండేవారు.

"అన్నయ్యా కాస్త పనుంది. వెళ్ళి, ఎనిమిదీ ఎనిమిదిన్నర కల్లా వచ్చేస్తాను" అనుమతి తీసుకుని తమ్ముడు వెళ్ళిపోయాడు.

3

నా ఇన్ని సంవత్సరాల బ్రతుకులో ఎవరైనా నన్ను అర్థం చేసుకుని నా అంతరంగిక మిత్రులుగా వున్నారంటే వాళ్ళలో ఒకడు రవి, మరొకరు నేను ప్రపంచానికి భయపడి దూరం చేసుకున్న ఆ ఇంకో అమ్మాయి.

ఈ రవి కూడా నాలాగే జీవితంలో చాలా కష్టాలనుభవించిన మనిషి. ఏదో మాట పట్టింపుతో ఇంట్లో వాళ్ళతో వైమనస్యం కలిగి నిండు ఇంటిని వదిలేసి వచ్చి నాతో వుండి, తన స్వంత కృషితో చదువు పూర్తి చేసుకున్నాడు. ఇప్పుడతను కాలేజీలో లెక్చరర్.

అతని దుఃఖాలని, కష్ట సుఖాల్ని చూస్తే నా కష్టాలు తృణప్రాయంగా వుంటాయి. కాని అతను దేనినీ పట్టించుకోడు. ఎప్పుడూ ప్రతి దాంట్లోను మంచి చూస్తాడు. చెడు అతని మనసులోకి రాదు. జీవితంలోని చేదుని కూడా తీపి లాగ నిండు మనసుతో స్వీకరిస్తాడు.

ఓ రకంగా అతను సుఖపురుషుడు. అతని ఉద్దేశం ప్రకారం ఇక్కడ సంభవించే అన్ని సంఘటనలూ సంభవించి తీరాలి గనుక వాటి నుంచి మనకి విడుదలే లేదు. ఇక్కడే వస్తుంది మా ఇద్దరి మధ్య భిన్నాభిప్రాయం.

మనం చేసే మంచి పనులు, చెడ్డపనులు అన్నింటికీ మనమే బాధ్యులం. మనకు సంబంధం లేని విషయాల్లో పై వాళ్ళేదో చేసి మనకి బాధ్యత అంటకట్టడ మెందుకు? అన్నది నా ప్రశ్న. దానికి ఏదేదో పురాణం చెప్పి ఒప్పుకునేందుకు నా కిష్టం లేకపోయినా తన తర్కంతో ఒప్పిస్తాడు.

బ్రతుకులోని సంఘటనల్లో మా ఇద్దరికీ సామ్యం వున్నా, మానసికంగా మేమిద్దరం ఒక్కో ధృవం. అయినా ఏదో ఆకర్షణ శక్తి మా ఇద్దర్నీ బంధించి వేసింది. అతని దారే వేరు అని ఎన్నో సార్లు అనిపించినా, డాక్టర్ మందులాగ

నా కణకణాల్లోనూ తన ప్రభావం నింపి నా లోపలి కోటను నాకు తెలియకుండానే వశపరుచుకున్నాడు. ఆఖరికి ఒక రోజున అతని తర్కాల సుడిలో పడి కొట్టుకు పోతానేమో అనిపించి భయం వేసింది.

అయినా ఎందుకో గాని ఒక్కోసారి, అతనిలోనూ నిర్వీణ్ణత తొంగి చూస్తూ వుంటుంది. అప్పుడు నేనే ఇతనూ నాలా అయిపోతే ఈ జారుడు బండ మీంచి నన్ను రక్షించే వాళ్ళెవరు అన్న అవ్యక్తమైన భయం చేత అనుకుంటా. అతనిలో ధైర్యం నింపి, అనివార్యమైన ఈ బ్రతుకుని వున్నన్ని రోజులు బాగా అభినయించి వెళ్ళిపోదామని చెప్పేవాడిని. ఏమయినా....

బయట సందడి ఎక్కువయింది. నా గది ముందు నుంచి వెళుతున్న నర్సు పిలిచి ఏమిటని అడిగాను. ఎవరో అమ్మాయి టిక్-20 తీసుకుందని చెప్పింది.

"ఎవరా అమ్మాయి?"

"శ్రీ....గారి అమ్మాయి. కాలేజీలో చదువుతూందట."

"అలాంటి శ్రీమంతుల అమ్మాయికి ఏమయిందో చావడానికి?"

"ఏమిటయ్యేది సార్, ఈ కాలంలో చనిపోవడానికి కారణాలెందు కండి? అందులో కాలేజీలో...."

"సిస్టర్....డాక్టర్ పిలుస్తున్నారు" అన్న. చప్రాసి పిలుపుతో నర్సు వెళ్ళిపోయింది.

కాలేజీ అమ్మాయిలంటే మరేమిటయ్యుంటుంది? పరీక్షలో ఫెయిలయ్యుం డవచ్చు. ఫెయిలయి చనిపోయే కుర్రాళ్ళ సంఖ్య ఎక్కువయిందని విశ్వవిద్యాలయం వారు కొద్దిగా వ్రాసినా, చాలు పాస్ చేసేసి చనిపోయే వారి సంఖ్య తగ్గించడానికి ప్రయత్నిస్తున్న ఈ కాలంలోనూ చనిపోయే వాళ్ళున్నారే! ఫెయిలయితే మాత్రం ఏమిటట! ధనవంతుల అమ్మాయి కదా! అదేం రోగం! ఫెయిలవడమే అలవాటయి పోయిన వాళ్ళే చనిపోతే ఎలా?

లేకపోతే ఓ పనై వుండవచ్చు. ఆమె శ్రీమంతుల అమ్మాయి. పొరబాటున అందంగా కూడా వుండి వుండవచ్చు. ఓ కుర్రాడు, బీదవాడు, బుద్ధిమంతుడు. చురుగ్గా వుండి డిబేటింగ్, నాటకాలు, చదువు అన్నింటిలోనూ మొదటి వాడు. ఈమె మూర్ఖపు బుద్ధికి అతను నచ్చి వుంటాడు. సరే, ఇంకా ఏమి జరిగి వుంటుందో చెప్పనే అఖర్లేదు.

ప్రేమించు కోవడం.

వాళ్ళ నాన్నే ప్రతి నాయకుడు.

ఎవరితోనో ఆ అమ్మాయి పెళ్ళి నిశ్చయం కావడం....ఆత్మహత్యకి అంతకన్న ఏం కావాలి? లేకపోతే ఈ అమ్మాయి తల్లి కాబోతోందో ఏమో. ఛ....

అలా జరిగుండదు.)

ఎందుకంటే అలాంటి పరిస్థితి ధనవంతుల కుర్రాడు, పేదపిల్ల అయినప్పుడే జరుగుతుంది. ఇద్దరూ, ప్రేమించుకుని ఆ పిల్ల తల్లి అవుతుంది. పెళ్ళి జరగదు. అప్పుడు ఆత్మహత్య....అదే సరి.

అయితే మా ఇద్దరిలో ఒక్కరం కూడా అలాంటి ఆలోచనలకి తావివ్వలేదే! నేనా అమ్మాయిని అలాగా వదిలేస్తే ఆత్మహత్య చేసుకుంటుందేమో నన్న ఆలోచనే నాకు రాలేదు ఎందుకని? కాని ఆ అమ్మాయి ఆత్మహత్య చేసుకునేటంత పిరికిది కాదు. అది వేరే సంగతి.

నాకు బుద్ధి వచ్చినప్పట్నుంచి ఇలాంటి బోలెడు సంఘటనలు నా ఎదుట జరిగి ఈ ప్రపంచానికి విరుద్ధంగా, ఈ జనానికి విరుద్ధంగా విప్లవం లేవదీసేలా నన్ను ప్రేరేపించాయి. ఇంత ఆధునికమైన జగత్తులో కూడా శిలాయుగంలో లాగ, మన ప్రతీ చలన - వలనాలు బొమ్మల్లా, సూత్రబద్ధంగా వుండాలంటే ఎలా? మనిషి జీవించడానికి, అతను తన మనసుకి నచ్చినట్టు బ్రతకడానికి ప్రపంచంలోని ఏ నిబంధనా అడ్డు రాకూడదు. అలా అడ్డం వచ్చి, విషాన్ని క్రిమికీటకాల మీద ప్రయోగించడం కన్న ఎక్కువగా మనిషి తన మీద తనే ప్రయోగించుకునే లాటి పరిస్థితి కలిగించ కూడదు.

ఈమె అతన్ని పెళ్ళాడితే బ్రతుకంతా పేదరికంలోనే గడుస్తుంది. అతనామెను పెళ్ళి చేసుకుంటే మన సంప్రదాయం, అంతస్థు హోదాలకి భంగం. మనలో వున్న లోపాలు, దోషాలు తెలిసేలా చేసే మనల్ని అవమానించినట్టు మరొకడిలో తెలివితేట లున్నాయని ఒప్పుకుంటే మన వ్యక్తిత్వపు పెరుగుదలకి అడ్డు. ఇలాంటివి ఎన్నో, ఎన్నెన్నో పూర్వ గ్రహ పీడితమైన మనసు ప్రతి యొక్క విషయంలోనూ పావ్లో కుక్క లాగ conditioned reflex లో బ్రతుకుతోంది.

నిజం చెప్పాలంటే నా విప్లవం ఇలాంటి పావ్లో కుక్కలకి విరుద్ధంగానే కాని ఈ ప్రపంచానికి విరుద్ధంగా కాదు. నేను ఒక మనిషిని నాకో వ్యక్తిత్వముంది. నన్ను నన్నుగానే బ్రతకనివ్వండి. నేను మంచివాడినైపోయి గాంధీ, లింకన్‌లాగా గొప్పవాడిని కానక్కర్లేదు. వాళ్ళలా వున్నారు. వీళ్ళలా వున్నారు. కాని నాకవన్నీ అక్కర్లేదు. నేను నేనుగానే వుండాలను కుంటున్నాను. దానికి గాను బజార్లో నా కెంత వెల నిజంగా రావాలని వుందో అంతే వెల కట్టండి. అలా కాకుండా మా నరకే మంచిదని. నా మానవత్వాన్ని వెక్కిరిస్తూ గంట శబ్దం విని చొంగ కార్చే కుక్కలాగ ప్రవర్తించడం సరైనది కాదు. ఎందుకంటే ఇలాంటి ప్రపంచంలో బ్రతకడం నాకిష్టం లేదు. నేను మనుషులున్న ప్రపంచంలో బ్రతకాలను

కుంటున్నాను. అందుకే మిమ్మల్ని కూడా మనుషులుగా బ్రతక మంటున్నాను. అంతే కాకుండా....

"పాపం ఆ పిల్ల చనిపోయింది సార్" ఇందాకటి నర్సు వచ్చి చెప్పింది.

"ఎందుకు చనిపోయింది సిస్టర్? ఏమన్నా లవ్ ....గివ్" నా నిరీక్షణ అబద్ధం కాదనుకుంటూ అడిగాను.

"అవునట సార్, అతనికి వేరే ఎక్కడో పెళ్ళి జరిగిపోయిందట అందుకే".

"వీళ్ళ కన్న ధనవంతుడా ఆ కుర్రాడు?"

"కాదట సార్, చాలా పేదవాళ్ళట" అందుకే ఈ అమ్మాయి నాన్న పెళ్ళికి ఒప్పుకోలేదేమో మరి.

"అది కాదు. ఆ అమ్మాయి ఇంటి వాళ్ళందరికీ ఇష్టమేనట."

"మరే మొచ్చింది వాడికి?"

"కాని ఈ విషయం ఆ కుర్రాడికి తెలీదట సార్, ఈ అమ్మాయేమో అతనికి తెలియకుండానే ఇంట్లో వాళ్ళని ఒప్పించిందట. దాన్ని తెలిపే లోపలే అతని పెళ్ళయి పోయిందట."

"అంత తొందరే మొచ్చింద తడికి?"

"గుప్త ప్రేమ అంటారు కదా, అది సార్. ఒకరి కొకరు చెప్పుకోవడం జరగలేదు. పెళ్ళయ్యాక ఉత్తరం రాశాడతను. దాన్ని చూసి ఈ అమ్మాయి విషం మింగేసింది."

"అదా సంగతి?"

మనిషి ఎప్పుడూ భావావేశానికి బలి కాకూడదు. దాని పరిణామాలే ఈ ఆత్మహత్యలు, యుద్ధాలు. ఎప్పుడూ హృదయం బుద్ధికి వశమై వుండాలి. హృదయం ఈ ప్రపంచం కొట్టిన దెబ్బల్ని తట్టుకునే వస్తువు మాత్రమే. ఈ దెబ్బల్ని తట్టుకుని వాటికి లొంగి పోకుండా వుండగలిగినవే బ్రతుకుతాయి. దాన్నే డార్విన్ servival of the fittest అని చెప్పాడు.

నర్సు ఎప్పుడో లైట్ వేసి వెళ్ళింది.

చాలా సేపట్నుంచి పక్కమీద పడుకుని వుండడం వల్ల విసుగ్గా వుంది. బయట నుంచున్న చప్రాసీని పిలిచి అతని సాయంతో లావెట్రీ వేపు నడిచాను. గదిలోనే క్యాన్ వున్నా అందులో మాత్రం విసర్జించాలని లేదు. లావెట్రీ నుంచి తిరిగి వచ్చి స్టూల్ మీద కూర్చుని, చప్రాసీకి చెప్పి దుప్పటి మార్పించాను. అతను ఆ పని చేసి నన్ను మంచం మీద కూర్చోబెట్టి వెళ్ళిపోయాడు.

ఇంత సేపయినా రవి రాలేదు ఎందుకని? వాళ్ళింటికి అలాంటి బంధువులెవరొచ్చుంటారు? ఆలోచించి ఆలోచించి బుర్ర వేడెక్కి పోయింది.

చప్రాసి ఎవరితోనే మాట్లాడ్డం వినిపించింది. రవి వచ్చినట్టుంది. ఇక్కడికి వచ్చేటంత వరకు ఆగలేదతను నా ఆరోగ్యపు వివరాలన్నీ తెలుసుకునే లోపలి కొస్తాడు. ఇంకా ఎంతసేపు మాట్లాడుతూ నుంచుంటాడో ఈ మహానుభావుడు.

ఈ చప్రాసీ తోవలో ఎందకు నుంచోవాలి.

మాటలు వినిపించడం లేదు. ఇటే వస్తున్నాడేమో.

"అబ్బా, అఖరికి వచ్చావు కదా. వాడితో మాట్లాడి అటు నుంచుంటే వెళ్ళిపోతావేమో అనుకున్నాను."

"ఎందుకట? ఎప్పుడూ లేని అపనమ్మకం ఇవాళెందుకుట?" అన్నాడు నవ్వుతూ.

"ఏం చెయ్యడం చెప్పు. ఇప్పుడు అఖరికి నా మీద నాకున్న నమ్మకమే లేకుండా పోతుందేమోనని అనిపిస్తుంది. ఎందుకింత ఆలస్యమైంది? ఇంటి కెవరో చుట్టాలు వచ్చారన్నాడు తమ్ముడు. వాళ్ళ కోసమా ఈ ఆలస్యం?"

"వాళ్ళ కోసం కాదు, నీ కోసం."

"నా కోసమా? నా కోసం ఎందుకయ్యా?"

"వచ్చిన వాళ్ళెవరో తెలుసా? కిరణ్, రాగానే ఇక్కడికే వస్తానని కూర్చుంది. ఆమెనిప్పుడొద్దని వొప్పించి, విశ్రాంతి తీసుకోమని చెప్పి వచ్చేసరికి ఇంత ఆలస్యమైంది."

అతని మాటలకి జవాబు ఏం చెప్పాలో తెలియలేదు. ఎవరినైతే ఇన్నాళ్ళూ పరదేశిగా చేసి మర్చిపోయానో, ఆమె ఇవాళ వచ్చిన కబురు విని నోటమాట రాకుండా వుండిపోయాను కాసేపు.

"ఎందుకు వూరుకుండి పోయావు? ఆమె రాకూడదు అనిపిస్తోందా?"

"అలా కాదు రవీ. ఆమె గురించి ఆలోచించే అధికారమే నాకు లేదు అప్పుడు నేను చేసిందే ఇవాళ నన్ను అమితమైన నీచ స్థితికి తోసేసి వికటంగా నవ్వుతోంది. ఆమె నన్ను క్షమించి వుండొచ్చు. కాని నేను దానికి అర్హుడినేనా అని నా మనసే నన్నడిగితే జవాబు ఏం చెప్పను? నీకు తెలుసు, నాకు నేను భయపడ్డట్టు మరెవరికీ భయపడనని."

"అందులో తప్పంతా నీ ఒక్కడిదే అని అనుకోవడమే నీ భయానికి కారణం. ఎప్పుడూ అన్నీ నీ వల్లనే అయాయని ఎందుకు అనుకుంటావ్? అతిగా నీ గురించి నువ్వు అనుకోవడం మంచిది కాదంటాను."

"నీకూ తెలుసు రవీ అలా వుండకూడదని నేను ఎంతగా ప్రయత్నం చేశానో. స్థిత ప్రజ్ఞత అందరికీ వచ్చే గుణం కాదు. నా మటుకు నా కది సాధ్యమే కాదు...."

సాయంత్రం నుంచి ఇప్పటిదాకా నాలో జరిగిన ద్వంద్వాన్ని వివరించాను. అందుకు వాడన్నాడు. "జీవితంలోని ప్రతి క్షణాన్ని నిండు మనసుతో అనుభవించాలి. అన్నది నా సిద్ధాంతం. నీ చుట్టూ ఇంతమంది వున్నా నువ్వు ఒంటరిని, దుఃఖభాగిని అనుకుంటావే, అసంఖ్యాకులైన అనాథలు ఎలా బ్రతుకుతారో నన్న ఆలోచన ఎప్పుడన్నా చేశావా?"

"చూడు, నేను ఎప్పుడూ నాలో లేనిదాన్ని వుందనుకునే మూర్ఖత్వానికి పోలేదు. నువ్వు ఇన్ని కబుర్లు చెబుతావు కదా మీ నాన్న దగ్గరకి వెళ్ళి అక్కడే వుండి పితృసాంగత్య సుఖాన్ని ఎందుకు అనుభవించ కూడదు?"

"నీకు తెలుసో తెలియదో ఒక చేత్తో చప్పట్లు కొట్టలేమని. నేను వేరే కులం పిల్లని పెళ్ళి చేసుకున్నాక, మా నాన్నకి మొదటే నా మీదున్న కోపం, కసి మరింత ఎక్కువయి పోయాయి. ఆయన తనకి రవి అన్న కొడుకు వున్న సంగతే మర్చిపోయారు."

"పోనీయ్ ఎంత చెప్పుకున్నా ఒకటే ఆ సంగతులు. అన్నట్టు, కిరణ్ ఎక్కడ్నుంచి వచ్చిందిప్పుడు? ఈ నాలుగైదేళ్ళల్లో ఆమె సంగతు లేమీ తెలియనే తెలియదు.

దానికి రవి చెప్పిన సంగతి ఇంతే. ఆమెకి పెళ్ళయి ఇప్పటికి మూడేళ్ళయింది. ఆమె భర్తకి ఆమె వెనుకటి కథ తెలిసి, విరసం ఎక్కువై, ఇప్పుడో సంవత్సరంగా భర్తని వదిలేసి వచ్చి ఏదో వూళ్ళో హైస్కూల్ టీచర్గా వుందట. ఇప్పుడు నా జబ్బు సంగతి తెలిసి వచ్చిందట....

తమ్ముడొచ్చాడు. రాత్రికి రవి ఇక్కడుంటాడని చెప్పి వాడిని ఇంటికి పంపించాను. కిరణ్ని చూడాలని మనసు ఆత్ర పడుతోంది. రవి నా మనసులోని భావాన్ని కనిపెట్టిన వాడిలా కిరణ్ని పంపిస్తానని చెప్పి వెళ్ళిపోయాడు.

ఈ కిరణ్ ఇప్పుడు రావడానికి బదులు ఆరు నెల్ల క్రిందటే వచ్చుంటే, నాలో బ్రతకాలన్న ఆశ కలిగి, నా ప్రాణం నిలిచే అవకాశం వుండేదేమో. ఆట చూస్తున్న వాళ్ళల్లా తెర మరుగున వుండి, అందరూ ఇప్పుడొక్కసారిగా ప్రత్యక్షమవుతున్నారు - నా ఆట సామాను అంతటినీ మూటకట్టుకుని నేను ప్రయాణానికి బయలుదేరాక....

ఇప్పుడో సంవత్సరం క్రిందటే తెలిసింది నా రోగం ముదిరి పోయిందనీ, నేనింకెక్కువ రోజులు బ్రతుకననీ. అప్పుడే Radio Therapy చికిత్స చేయించుకుని వుంటే నా పేగులు కుళ్ళిపోవడాన్ని ఆపగలిగే వారు. బ్రతుకు నుంచి విముఖమైన మనసు, ఈ రాక్షసి పుండు పెరిగి, దాని పూర్ణమైన పెరుగుదలతో పాటు, నా బ్రతుకూ సంపూర్ణతని పొందేలా ప్రేరేపించింది.

తన భర్తతో వెడిపోగానే కిరణ్ సంగతి నాకు తెలిసినట్లయితే ఏ బాధా వుండేది కాదు. ఈ మధ్య నాకు 'సరి' అనిపించిన దాన్ని అది అకార్య మనిపించినా సరే, సాధించే ధైర్యం పెరిగింది నాలో, అని నాకు అప్పుడప్పుడ నిపిస్తోంది. ఇది ముందే వుండి వుంటే, ఈ లోకాన్ని బంతిలా తన్నేసి, ఆమెతో కలిసి సుఖంగా బ్రతికేవాడిని.

బహుశః రవి చెప్పేది నిజమే అయ్యుండొచ్చు. ఇక్కడ ప్రతి సంఘటనా లోతుగా వేళ్ళూనుకునే సంభవిస్తూ వుండుండాలి. కిరణ్‌తో కలిసి బ్రతికే సుయోగం దొరికి నప్పుడు ఈ ప్రపంచాన్ని ఎదిరించే ధైర్యం నాకు లేకపోయింది. ఆ ధైర్యం వచ్చేసరికి కిరణ్ లేదు.

కిరణ్‌ని ఏ ముఖం పెట్టుకుని చూడాలి? నా లాంటి వాడి ముఖం చూడ్డానికి ఆమె మనసెలా ఒప్పిందో?" మోహించి ప్రేమించి, కలలుగని, అఖరికి ఓ రోజు ఆ కలల గూటికి నిప్పు పెట్టి, అది బూడిదై పోతుంటే ఆమెని అందులోనే వదిలేసి తప్పించుకున్న నాకు ప్రాయశ్చిత్తమనేది వుందా? ఆ ముంటల్లో ఆమెకు వద్ద పెద్ద మచ్చ ఇలా బ్రతుకంతా ఆమెని వేదించి మొత్తం బ్రతుకునే నాశనం చేసింది.)

## 4

నాకు మెలకువ వచ్చేసరికి కిరణ్ మృదువుగా నా తల నిమురుతూ వుంది. రవి ఉదయం తొందరగా వస్తానని చెప్పి వెళ్ళిపోయాడు. చాలాసేపు ఎవరూ మాట్లాడలేదు. అఖరికి నేనే ధైర్యం తెచ్చుకుని.

"నువ్వు రాకుండా వుండాల్సింది కిరణ్" అంటూ మౌనాన్ని భంగం చేశాను.

"ఏం ఎందుకని? ఈ జబ్బుతో మీకేమైనా అయితే ఆ పాపం కూడా నా నెత్తిన వేద్దామను కుంటున్నారా?" నవ్వుతూ అందామె.

"చూడు, అన్నింటినీ నీ నవ్వుతో కొట్టి పారెయ్యకు. జీవితంలో ఇంత చెడు చేశాక కూడా ఒక మనిషిని క్షమించడమంటే...." మాట పెగల్లేదు.

"తప్పించుకోవడంలో ఇదే పద్ధతి! నా కన్న ముందే మిమ్మల్ని మీరు తిట్టుకుని తప్పించు కుందామనుకుంటున్నారా?" మళ్ళీ అదే నవ్వు.

"నువ్వు ఇలా నన్ను చంపకు. నన్ను తిట్టు. నాతో దెబ్బలాడు. ఏమైనా చేసి నా మీద నీ కోపం తీర్చుకో".

"అదే కుర్రతనం. అదే ముక్కుమీద కోపం. ఈ నాలుగైదేళ్ళల్లో ఏమన్నా కొంచం మార్పు వచ్చుంటుందనుకున్నా. అతి భావుకత మంచిది కాదు. కాసిని పళ్ళు తిని శాంతించండి."

ఈమె కూడా అంతే. ఎన్నేళ్ళయినా మారదు. ఈమె ఎదుట వాదించడం,

ఓ రాతి బండ ముందు వాదించడం రెండూ ఒకటే. విన్నంత సేపూ విని తనకి తోచినట్టుగా చేసే మనిషి.

నెప్పి కొద్దిగా తగ్గినట్టనిపించి దిళ్ళు కానుకుని కూర్చున్నాను. నీళ్ళు, పళ్ళెం తెచ్చింది. నీళ్ళతో నోరు పుక్కిలించి వుమ్మేశాక గుడ్డతో నోరు తుడిచింది. తనే పళ్ళు తినిపించి, ఫ్లాస్కులో వున్న పాలు ఇచ్చింది తాగాను.

మోసం, వంచన, కుటిలత, చంచలత, అసూయ ఇలాంటి ఎన్నో గుణాలను ఆడదాని మీద ఆరోపించారు కవులు. కాని బ్రహ్మ ఈమెని సృష్టించేటప్పుడు ఆడదాని ఆ మూల ద్రవ్యాలను నింపడం మర్చిపోయివుంటాడు....

"ఏమిటలా చూస్తున్నారు?"

"ఆడదాని మనసు, గుర్రపు నెలవు కనిపెట్టలేమని సామెత వుంది. నీలో దాన్ని వెతుకుతున్నాను.

"దొరికిందా?"

"ఆ సంగతి నీకే తెలియాలి. టైమెంత?"

"ఒంటి గంట."

"ఎందుకో చాలా వుక్కగా వున్నట్టు, వూపిరి సలుపనట్టు అవుతోంది. కాస్త బయటకి తీసికెళతావా?"

"ఇంత చీకట్లో బయటకి వెళతారా? అందులో ఈ నెప్పితో!"

"ఇంకా నా మీద అపనమ్మకమా?"

"తమాషాగా మాట్లాడు తున్నానను కుంటున్నారా?"

మెల్లిగా మంచం మీద నుంచి పైకి లేపింది.

ఆసరా కోసం భుజం మీద చెయ్యి వేసి నుంచున్నాను, అలమార్లో వున్న టార్చ్ తీసుకుంది. మెల్లిగా తలుపు దాకా వచ్చాం. టార్చ్ నా చేతికిచ్చి తలుపు తెరిచింది. గది వెనకాల ఖాళీ స్థలం వుంది. టార్చ్ వెలుగులో వెళ్ళి అక్కడ కూర్చున్నాం.

అమావాస్య గడిచి రెండు మూడు రోజులై వుండవచ్చు. అన్ని చోట్లా చీకటి అలుముకుంది. ఆకాశం నిండా నక్షత్రాలు. ఆకాశంలో వెలుగు వూరేగింపుకి బయలుదేరినట్టుంది.

"హ" ఏమి నెప్పి ఇది, కడుపులో కత్తిమొన తిప్పినట్లవుతోంది."

"నెప్పి ఎక్కువయిందా ఏమిటి? కాస్త విశ్రాంతిగా ఇలా ఆనుకుని కూర్చోండి" అంటూ కిరణ్ నన్ను తన గుండెల కానించుకుంది. అలాగే పడుకుని ఆకాశం వేపు చూస్తున్నాను.

పిచ్చెక్కించేటన్ని నక్షత్రాలు. అదో పాండవుల దారి. అదే అయ్యుండవచ్చు

వర్డ్స్ వర్త్ చూసిన మిల్కీవే. ప్రతి రాత్రి ఎన్నెన్ని నక్షత్రాలు పుదయించి అస్తమిస్తాయో ఏమో! చీకటి కూడా ఇంత అందంగా సింగారించు కోగలదని తెలీదు నాకు. జీవితంలో ఇప్పటి దాకా అన్ని రాత్రులనూ వ్యర్థంగా గడిపేశానే. నిజం, రవి అన్నట్టు జీవితపు ప్రతి క్షణాన్నీ జీవించ లేదు. ప్రతి విషయానికి విరుద్ధంగా మానసికంగా ఎదురు తిరగడంతోనే ఆయుష్షంతా గడిచిపోయింది. కోట్ల సంవత్సరాల నుంచి క్షణాని కొక్క కొత్తదనాన్ని సంతరించుకుని వెలుగుతున్న ఈ నక్షత్రాలలాగ నేను ప్రతి క్షణంలోను కొత్తదనాన్ని గుర్తించాల్సింది.

"చుక్కలని చూశావా కిరణ్?"

"వాటినే చూస్తున్నా. చనిపోయిన వాళ్ళు నక్షత్రాలవుతారట. మా అమ్మ చెప్పేదలాగ".

"రేపు నేనూ చనిపోతే, నేను ఒక చుక్క అవుతానన్నమాట...."

"నేను అనకండి. మనం అనండి. మీరు చనిపోతే నేను బ్రతకడం సాధ్యమని ఇంకా అనిపిస్తోందా మీకు?"

"ఇంత కష్టపెట్టినా, నాలో ఏం చూసి ఇంకా ఇలా నా మీద అక్కర పెంచుకుంటున్నావు?"

"అదేం చూశానే నాకు మాత్రం ఏం తెలును? అన్నీ లోతుకి పోయి వెతకడం మొదలెడితే ఆఖరికి దొరికేది శూన్యమే. నాకు నా జీవితంలో ఏదీ తెలియదు. తెలిసింది అంటూ వుంటే అది మీరొక్కరే...."

"కిరణ్...."

"ఊ...."

"...."

"...."

## 5

మెలకువ వచ్చి కళ్ళు తెరచి చూశాను. ఆమె గుండెల్లో మొహం దాచుకుని ఎంతసేపు పడుకున్నానే.

"చలిగా వుంది. ఇక లోపలకి వెళదాం పదండి" అంటూ మెల్లిగా నన్ను నడిపించుకుంటూ వెళ్ళి పక్క మీద కూర్చోపెట్టింది.

"రవి పరుపు వుంది. పరుచుకుని పడుకో."

జవాబు చెప్పకుండా నన్ను పడుకోబెట్టి, స్టూల్‌మీద కూర్చుని.

"నిద్ర వస్తే పడుకుంటా లెండి" అంది.

బ్రతుకు నాతో ఎందుకిలా దాగుడు మూతలు ఆడింది? పిరికి తనపు రూపంలో వేధించి కిరణ్ బ్రతుకుని మట్టిపాలు చేసింది. అదే పిరికితనం,

అడదాని రూపంలో నా భార్యగా నిలిచి నన్ను వేధించింది. జరిగిన ఈ తప్పులన్నిటిని దిద్దుకుని బ్రతుకు కొత్తగా ప్రారంభించడానికి వీలయితే....

ఒక వేళ రేపటి ఆపరేషన్ సక్సెస్ అయ్యి, నేను బ్రతికి బయటపడితే తరువాత నా దారి ఏది? ఆఖరికి కిరణ్ దొరికిందను కునేటంతలో 'భార్య' అనే మనిషి నా బ్రతుకు మీద గద్దలా వచ్చి వాలింది. ఊహూ ఈ సారి ఆమెని శాశ్వతంగా పంపించి వెయ్యాలి. భార్య అంటూ తను ఏ కర్తవ్యాన్ని నిర్వహించిందని ఆమెనింకా భార్యగా పరిగణించాలి?

నేను కిరణ్ ఇద్దరే బయలుదేరాం. ఎంత సేపట్నుంచి నడుస్తున్నామో తెలీదు. ఓ అడవి వచ్చింది. ఓ పాము పడగెత్తి నన్ను కాటు వెయ్యబోయేటంతలో కిరణ్ దాని పడగనే పట్టుకుంది. అది విలవిల్లాడసాగింది. నేను దాని తోక పట్టుకున్నాను. నేలకేసి విసిరి కొట్టాలనుకున్నాను. అంతలో అది నా చేతుల్లోంచి జారి పులిగా మారి కిరణ్ మీదకి దూకింది. ఆ పులి మొహం నా భార్య మొహం లాగే వుంది. దాంతో కలియబడాలి అనుకున్నాను గాని, విశ్వ ప్రయత్నం చేసినా చేతులు, కాళ్ళు కదపడానిక్కూడా కుదర్లేదు. అసహాయుడినై గట్టిగా అరిచాను.

చప్పున మెలకువ వచ్చింది. భయంతో వొళ్ళంతా చెమటలు పట్టి తడిసిపోయింది. కళ్ళు తెరచి చుట్టూ చూశాను. అదే గది. స్టూలు మీద కూర్చుని, మంచం మీద తలపెట్టి అలాగే నిద్రపోయింది కిరణ్. ఆమె ఒక చెయ్యి నా గుండెల మీద వుంది. రెండు సార్లు ముట్టుకుని చూసి ఆమేనని నిశ్చయించుకున్నా. అలసిపోయినా మొహంలో ప్రశాంతత లాస్యం చేస్తోంది. ఎంతోమందిని నా వాళ్ళని అనుకున్నా. బ్రతుకంతా నాకు నువ్వేనని నన్ను నమ్ముకున్న జీవి ఇదొక్కటే. నీ లోనూ మానవత వుంది. నువ్వూ, ఒక మనిషి వంటూ నన్ను నాకు పరిచయం చేసినది ఆమే. సమీపంలో వున్నప్పుడు నాలో నిద్రాణంగా వున్న చైతన్యాన్ని మనసు లోతుల్లోంచి పైకి లేపి, పాతాళం నుంచి లేచి గగనానికి గాలి పటంలా ఎగిరి పోతోందామె. నాతో బాటు నుంచుంటే లోకము వున్నంత వెడల్పుగా, ఆకాశమంత విశాలంగా విశ్వపు పొడుగు, వెడల్పులని కొలవడానికి మొదలెడుతుంది. మనసులోని వీణా ఝుంకారం వెయ్యి రాగాల్ని ఒక్కసారిగా పలికిస్తుంది. నూరు ఆశల బుద్బుదాలను సృష్టించి మనసుని పొంగించే ఈమె, వాస్తవికత అనే నీళ్ళు జల్లి పొంగు అంచులు దాటి నేలపాలు కాకుండా కాపాడుతుంది.

కిటికీ బయటకి చూశాను. ఉదయపు శుక్ర నక్షత్రం మెరుస్తూ పైకి వస్తోంది. ప్రతి రోజు ఆ శుక్రుడు నాలాటి బందీలెందర్ని చూస్తాడో కదా! నాలుగ్గోడల

బంధనాన్ని ఛేదించుకుని బయటకి వెళితే బయట విశాల ప్రపంచానికి అష్టదిగ్బంధనం కాచుకు కూర్చుంది. భూమ్మీద పుట్టిన ప్రతివాడికీ రక్షణ పేరుతో కట్టుబాట్ల పంజరపు బంధనం తప్పింది కాదు. ఈ కట్టుబాట్ల పంజరాని కవతల దిగంతాల వెనుక ఏముంది అని చూడాలన్న ఉత్కంఠ నిండిన కోరిక, చూడలేకపోయినా చూసిన వాళ్ళనెవరినన్నా అడగాలని ఆశ. ఈ భూమి అన్న సమాధి మీద కప్పిన ఆకాశపు తెరని చీల్చి చూసి భూమిలో పెరిగి నుంచుంటానొక్కోసారి. మరుక్షణంలో దుమ్ము కణమైపోతుంది నా అస్తిత్వం. చిన్న మాలని నా ఈ ప్రియురాలి అందమైన ముడిలో సింగారించాలన్న కోర్కె. చేతికందని దాన్ని కోసి ఇమ్మని సప్తర్షి మండలంతో మొరపెట్టుకుంటాను.

ఎందుకో, ఏమో గాని ఈమె తిరిగి వచ్చినప్పట్నుంచీ బ్రతకాలన్న ఆశ, బ్రతుకు మీద తీపి ఎక్కువవుతోందేమోనన్న సంశయం కలుగుతోంది. అదే గాంభీర్యం, అదే కపటం లేని సౌమ్యత. వుండీ వుండనట్లు పెదవులపై చిన్న చిరునవ్వు మెరుపు మమత పొంగి పొరలింది. ఆమె చేతిని మెల్లిగా నా గుండెల మీంచి తీసి, లేచి, వొంగి మృదువుగా చుంబించాను.

మేలుకుని సర్దుకుంటూ లేచింది. గడియారం చూసుకుని.

"ఐదు గంటలయింది. ఇంకా నిద్రపట్టలేదా మీకు?" అంటూ నన్ను-పడుకోబెట్టి కాపలా కూర్చుంది. నాకు తెలీకుండానే నిద్రపట్టేసింది, కళ్ళు తెరచి చూసేసరికి కిటికీ లోంచి వెలుతురు పడుతోంది. ఎదుట కిరణ్ నుంచుని వుంది. నేను మేలుకోవడం చూసి మొహం కడిగించే ఏర్పాట్లు చేయసాగింది. బయట రవి తమ్ముడితో మాట్లాడుతున్నట్టుంది. మొహం కడుక్కున్నాను. కాసేపటికల్లా అమ్మ, నాన్న, అంతే కాక స్నేహితురాళ్ళ సహితంగా నా భార్య హాజరయ్యారు. ఒక్కొక్కరే పలుకరించ సాగారు. వీళ్ళంతా ఎవరో కొత్త వాళ్ళున్నట్లుగా వుంది. ఎవరి పట్లా ఏ భావమూ కలగటం లేదు.

ఏ భావాన్ని వ్యక్తపరిస్తే మాత్రం ఏమి ప్రయోజనం? చనిపోతే సరేసరి. నా కోరిక తీరినట్లవుతుంది. లేదు, బ్రతికితే.... అంతే బ్రతుకుని ఇంకా అసంపూర్ణంగా బ్రతకాలి. జీవితపు ప్రతి యొక్క క్షణాన్ని జీవించాలి. కాని, నాలో బ్రతికి తీరాలన్న మొండితనం ఏమీ లేదు. బ్రతికిన ఇన్ని రోజుల్లోనూ చావుని గురించే ఆలోచించాను. ఇప్పుడు మిగిలిన కొన్ని క్షణాల్లో బ్రతుకు గురించి ఆలోచిస్తే తప్పేమిటి?

డాక్టరు నర్సులూ వచ్చారు. నన్ను తోపుడు మంచం (స్ట్రెచర్) మీద పడుకోబెట్టారు. అందరూ వరుసగా నుంచుని చూస్తున్నారు. అమ్మ కళ్ళు నీళ్ళతో నిండి వున్నాయి. నాన్న ఓదారుస్తున్నాడు. నా భార్య అనిపించుకున్న

మనిషి ఏవో భావాలని బలవంతంగా మొహం మీదకి తెచ్చుకుందుకు ప్రయత్నిస్తోంది. కిరణ్, రవి, తమ్ముడు ఆపరేషన్ థియేటర్ గుమ్మం వరకూ వచ్చారు. అయిపోయింది, ఇంకో క్షణంలో వీళ్ళందరి నుంచి దూరమై చావు బ్రతుకుల చక్ర వ్యూహంలోకి ఈ తోపుడు బండి నన్ను తోసేస్తుంది.

# 23. ఆఖరి దారి

వీణా

ఇవ్వాళ రోజల్లా తిరగడమే అయిపోయింది. అబ్బా! ఎంత ఆకలి ఆ గోవింద మూర్తికి. ఎన్ని విషయాలు తెలుసుకున్నాడు 'దీన్ని' గురించి! డాక్టర్ కదూ ఛ! ఈ డాక్టర్లు మరీ గలీజు మనుషులు.మనిషి దేహాన్ని కోసి కోసి అంతా అనలైజ్ చేసి, అన్నీ చూసిన వాళ్ళు. అందుకే గోవిందమూర్తికి 'ఆ విషయాలు' మాట్లాడ్డంలో కొంచెం కూడా ఎగ్గులేదు. ఇదిలాగ, అదలాగ అంటూ నాకే వివరిస్తాడు."లిలీ, you are a perfect woman" అన్నాడివాళ చెరువు పక్కన దిబ్బ వెనకాల కూర్చున్నప్పుడు. నన్ను గురించి నాకు అభిమానం వేసిందా? అవుననుకుంటా. ఎందుక్కాకూడదూ? నీ దేహ రచన పొందికగా వుంది, పరిపూర్ణంగా వుంది అంటే ఏ ఆడదానికి మాత్రం అభిమానం అనిపించదు?

(కాని, ఛత్! గోవిందమూర్తితో రోజంతా తిరిగి, కూర్చుని, పడుకుని ఏం చేసినా ఒక్కసారికూడా ఒళ్ళు ఝల్లు మనిపించలేదు. ఇక ఇలాటి వాళ్ళ స్నేహం వద్దనిపిస్తోంది. వీళ్ళ వల్ల ప్రయోజనమేమీ లేదు. భయంకరమైన మనిషి ఈ గోవిందమూర్తి. తీరని దాహం అతనికి. మరో మాటకే అవకాశం ఇవ్వడు."జీవితం వున్నదే అనుభవించడానికి లిలీ....ఇప్పుడు కాకపోతే మరెప్పుడు మనం మజాగా వుండేది? ముసలాళ్ళయాక ఏముందిహ? పాపమా? పాపం వస్తుందంటావా? " అంటూ భయంకరంగా నవ్వడం ఇంకా గుర్తుంది నాకు.

"ఇటు విను లిలీ, పాపం - పుణ్యం అన్నీ అబద్ధాలు. నామటుకు నాకు ఇదొక్కటే నిజం, ఇదొక్కటే నిజం అంటాడతను." అతనన్నది నిజమని నాకూ అనిపించింది కదా!)

ఈ గోవిందమూర్తికి, ఆ వినయ్‌సాళకర్‌కి ఎక్కడికెక్కడ పోలిక? మాట్లాడితే పాపం - పుణ్యం, morality, ethics పురాణం విప్పుతాడు. కాలేజీలో పిల్లలకి ఫిలాసఫీ బోధించడం అలవాటయిపోయిందిఅతనికి ఏం చెయ్యాలి, ఏం చెయ్యకూడదు అనే విషయాన్ని తర్కిస్తూనే బ్రతుకు గడిపేస్తున్నాడు వినయ్. ఓ సారి ఏదైనా ప్రయత్నం చేసి అతన్ని దారికి తేవాలి.

దారి? అంటే గోవిందమూర్తి దారికా? ఊహుఁ ....వినయ్‌తో కలిసి చెప్పుకునే నీతి, నియమం, పవిత్రత, జీవితపు విలువలు గురించి గంటలు గంటలు మాట్లడేటప్పుడు దొరికే ఏదో హాయిగా వుండే భావనని అనవసరంగా పోగొట్టుకోవడానికి మనస్సు రాదు.

నిద్ర వస్తోంది, ఒళ్ళంతా నెప్పులు ....ఛా! ఆ గోవిందమూర్తి తో ఇక outingకి

పెళ్ళనే కూడదు. అతని సహవాసం చాలించాలిక. అతను నాకు కావల్సిన దానిని ఎన్నటికీ ఇవ్వలేడు.

రేపు ఖాన్‌కి పోయిన నెల accounts అప్ప చెప్పాలి. ఆఫీసు వదిలాక సాయంత్రం ఇంటికిరా అన్నారు నిన్న. ఎందుకు రాలేదని రేపు అడగొచ్చు. స్పష్టంగా చెప్పేస్తాను, నీ భార్య వూళ్ళో లేనప్పుడు మీ ఇంటికి రానని. ఈయనకి తన క్షయరోగపు భార్య బురఖా వేసుకుని ఏడుగురు పిల్లల్నేసుకుని పుట్టింటికి వెళ్ళినప్పుడల్లా నన్ను ఆఫీసు పనికోసం ఇంటికి రప్పించుకోవాలనిపిస్తుంది. అబ్బా! ఆయన గడ్డం, పొడుగాటి టోపి, మాటి, మాటికి ననదిస్తూ వుండే 'అల్లాకే కసం' పల్లవి - ఇవేవీ నాకు ఇష్టం లేదు. ఆ పుష్పాకులకర్రి ఎలా భరిస్తోందో గాని టైపు పని పూర్తిగా వాళ్ళింట్లోనే కూర్చుని చేస్తోంది.

నేను రావడానికి కుదరదని చెప్పేస్తాను రేపు మెమో ఇస్తే ఇవ్వనీ. పనిలోంచి తీసెయ్యనీ కావాలంటే, "నీకు కావాలనప్పుడు వచ్చేసెయ్, నా ఎస్టేట్ చూసుకుంటూ వుండిపోదువుగాని, నాకు మాత్రం వేరే ఎవరున్నారు?" అన్నారు శంకర్‌గౌడ, మొన్న వచ్చినప్పుడు, దేవూరు చిన్నపల్లే గాని, అయినా ఫరవాలేదు. ఈ ఖాన్‌గారి 'అల్లాకే కసమ్' నేను భరించలేను.

(జూలై 28, 1958)

విసుగు....విసుగొచ్చేస్తోంది, ఈ ఖాన్ గొడవతో ఇవాళ సాయంత్రం ఆ accounts అన్నీ రాసి ముగించేదాకా నా భుజం మీది చేతులు తీయనే లేదు. ముసలాడైనా చాపల్యం తీరలేదు అతనికి. ఊఁ, నిజంగా వుట్టి చాపల్యమే, అంతకన్న ఏం లేదు. నేను కాదంటాననుకున్నాడేమో నేను నిరోధించక పోయేసరికి ఎంత ఆశ్చర్యపోయాడు! గోవిందమూర్తి నుంచి దొరకనిది, ఇతని వల్లనైనా దొరుకుతుందేమోనని 'ఊఁ', అన్నాను. కాని, ఛా! ఇతనూ పిరికి పందే. "ఏమన్నావ్ లిలీ, బిడ్డ కావాలా నీకు? తోబా, తోబా నువ్వింకా పెళ్ళికాని పిల్లవు. నా వల్ల ఇలాంటి పాపపు పని మాత్రం జరగదు." అంటూ తడబడ్డారు.

ఇతని గడ్డానికి నిప్పంటించాలి. పెళ్ళికాని పిల్లతో పడుకోవడానికి అభ్యంతరం లేదుగాని ఈ సాయ్‌బుకి, ఆమె కావాలని కొరుకునే ఓ చిన్న సహాయం చెయ్యడానికి వీల్లేదట. అది పాపమట ధూత్....

గోవిందమూర్తి వల్లనే అవ్వాల్సిన పని ఇది. అతను పాప పుణ్యాల గురించి తర్కిస్తూ కూర్చోడు. కాని అతను ఎప్పుడూ జాగ్రత్తలో వుండే మనిషి. నేను కావాలన్నదాన్ని కరుణించి బంధంలో చిక్కుకోనవసరం లేదని, ఇప్పటి లాగే స్వేచ్ఛగా వుండొచ్చనీ, కొంచెం కూడా ఇందులో ఇరికించననీ ఎంతగా చెప్పినా వినడు. 'లిలీ, క్షమించాలి, నన్ను ఇలాంటి జంజాటంలో పెట్టకు. నువ్వు నాకు

బంధం వెయ్యక పోవచ్చు. కాని నా వల్ల నీకు పుట్టే బిడ్డ మీద నాకై నాకు మమత కలిగిందనుకో, అప్పుడు? అప్పుడిక జీవితంలోని మజా అంతా క్లోజ్" అంటాడతను.

వీళ్ళంతా లాభం లేదు.

వినయ్ సాళకర్‌నే కాస్త దారికి తెచ్చుకోవాలి.

(31 జూలై, 1958)

ఆఫీసు నుంచి వస్తూ తెచ్చిన చాక్‌లెట్‌ని తలుపు దగ్గర నుంచున్న మున్నీకి ఇస్తూంటే వాళ్ళమ్మ అడిగింది, "పిల్లలంటే మీకింత ఇష్టం కదా! తొందరగా పెళ్ళి చేసేసుకోండి."

ఊఁ, పెళ్ళి.... పెళ్ళి అనగానే గుర్తుకి వచ్చేదేమిటి? ఆ సందడి, బాజా భజంత్రీలు, పసుపు.... ఆ మనిషి .... నన్ను చేపట్టిన పశువు - పతి 'దేవుడు' దాంతో బాటే అతని అరుపులు, త్రాగుడు, అతని ముండలు, నన్నతను పెట్టిన హింసలూ, అన్నీ గుర్తొస్తాయి.... థూ....! పీడకల, అంతా వదిలించుకుని ఎలాగో ఇంత దూరం వచ్చాను. ఎలాగో రోజులు గడిపాను. ఎలాగ కొత్త మనిషి నయ్యానో - వీటన్నిటిని మర్చిపోగలనా?

పెళ్ళట పెళ్ళి! మరో పశువుతో....ఛీ....

"అందరు మగవాళ్ళు చెడ్డ వాళ్ళు కారు లీలా. నువ్వింకా చిన్న పిల్లవి. ఒక్కతివే వుండకూడదు. పెళ్ళి చేసుకో. నువ్వు 'వూ' అంటే నేను మిగతా ఏర్పాట్లు చూస్తాను." అంటారు శంకర్‌గౌడ.

అవును శంకరగౌడ లాంటి మంచి మగవాళ్ళూ వుంటారు నాకు తెలుసు. ఎలాంటి మనిషి అయన! చేసుకున్న పెళ్ళానికి పెళ్ళయి పాతికేళ్ళయినా పిల్లలు పుట్టక పోయినా నిష్ఠగా వున్న మనిషి. ఎవరే మడిగినా కాదనడు. ఎంత మంచి మనసాయనది! ఆయన ప్రేమాభిమానాలు చూస్తుంటే చినిపోయిన నాన్న గుర్తొస్తాడు.

కాని అలాగని ఆయన మాటల్ని విని మళ్ళీ పెళ్ళి చేసుకోగలనా? ఒకసారి పడి లేచిన కూపంలో మళ్ళీ పడదల్చుకో లేదు.

కాని మున్నీ ఎంత ముద్దుగా వుంది, నాకలాంటి బిడ్డకావాలి. ఎవరివల్లనైనా సరే, ఎలాగైనా సరే: కాని ఎలాగ!

మధ్యాహ్నం ఆఫీసులో లెక్కలు రాస్తూ దీన్ని గురించే ఆలోచిస్తుంటే ఎదుటి బల్ల దగ్గర కూర్చున్న విలియమ్స్ కనిపించాడు. ఇక విలియమ్స్‌ని నమ్ముకోవడానికి లేదు. మొన్న స్పష్టంగా చెప్పేశాడు ఇక నన్ను కలుసుకోనని, ఎందుకంటే అతని లావుపాటి బొజ్జ వున్న ఆంటీ, అతను నన్ను కలుసుకున్నట్టు

తెలిస్తే అవిడ అస్తిలో చిల్లి గవ్వ కూడా అతనికి చెందనివ్వనని చెప్పేసిందిట. అంతే కాక ఆ అంటీ కూతురు పలుచటి నడుము గల ఆమె ఇతనికి కజిన్, ఆమె ఇతనితో తన engagement కూడా break చేసుకుంటానందిట. అవన్నీ పోగొట్టుకుని అతను నన్నెందుకు కలుసుకుంటాడు. ప్రతి ఆదివారం పిక్చర్‌కి ఎందుకు తీసికెళతాడు. నాతో ఎందుకు రాత్రిళ్ళు గడుపుతాడు? ఎలా మేనేజ్ చెయ్యగలడు? నీతో గడిపిన మధుర క్షణాల్ని, రోజుల్ని నేనెప్పటికీ మర్చిపోలేను, లిల్లీ. రోజూ నీ కోసం, నీకు మంచి జరగాలని జీసస్‌కి ప్రార్థన చేస్తాను. "God bless you" అంటూ విషాదంగా తల విదిల్చి, చెయ్యి నొక్కి వెళ్ళిపోయాడు ఈ విలియమ్స్ .... ఇవాళ తల వంచుకుని కూర్చుని ఏదో గ్రాఫ్ తయార్ చేస్తున్నాడు. అతని నుదుటి మీద పడే ఉంగరాల జుట్టు పాయల్ని చాలాసేపు చూస్తూ కూర్చున్నాను.

విలియమ్స్‌లోని ఈ ఉంగరాల జుట్టు అందమే కదూ అతను నన్ను రమ్మన్నప్పుడు నేను 'ఊఁ' అనడానికి కారణం? గోవిందమూర్తిలాగ అడవి మనిషి మొరటుదనం కాదు విలియమ్స్‌ది. చాలా మృదువుగా వుండేదతని ప్రవర్తన, మరీ gentle అనొచ్చు.... ఊఁ, అన్ని విషయాల్లోనూ .... అతనిలా gentle గా వుండే నీలికళ్ళ, వుంగరాల జుట్టున్న బేబిని అతని వల్ల పొందవచ్చని చాలా ఆశ పెట్టుకున్నాను. మూడు నెలల శ్రమా వ్యర్థమయి పోయింది. విలియమ్స్ సహవాసం ఫలించక మునుపే అతను దూరమై పోయాడు. అతని కజిన్, అతని అంటీ, ముఖ్యంగా ఆ అంటీ ఆస్తి అన్నీ అతన్ని తన నుంచి దూరం చేశాయి.

మున్నీ.... మున్నీ గుర్తువస్తే తన మనసంతా అస్తవ్యస్తమైపోతుంది ..... వినయ సాళకర్‌తో appointment రేపు సాయంత్రం ఐదు గంటలకి అపేరాలో.

4 ఆగస్టు 1958

శంకర్‌గౌడ ఎందుకనే ఇవాళ అదోలా వున్నారు. అరగంట కూడా వుండ లేదు. "హైబ్రిడ్ పంటకి ఎరువు కొందామని వచ్చాను. అలాగే నిన్నూ చూసి పోదామని ఇటు వచ్చాను. చీకటి పడే లోపల దేవూరు చేరాలి. ఎలా వున్నావమ్మాయ్ నువ్వు?" అన్నారు.

ఆయన మాటల వేపు దృష్టే లేదు నాకు. ఆయన కొత్త ఇంపాలా చూస్తున్నాను. అరడుగుల ఎత్తు, వెడల్పాటి ఛాతి, గుబురు మీసాల శంకర్‌గౌడ గారికి ఇంతకు ముందున్న ఫియట్ కన్న ఇదే ఎక్కువ నప్పుతుంది, అనిపించింది. కాలం, దుఃఖం, వేసవి వేడి - ఇవేవీ గుట్టలూ, చెట్లూ దాటి దేవూరు చేరుకుని ఈ గౌడగారి దాకా వెళ్ళనే లేదేమో అనిపిస్తోంది. చాలా ఏళ్ళ వెనుక నేను కన్నడం స్కూల్లో చదువుకునే టప్పుడు మొదటిసారిగా నాన్న ఆయన్ని

ఇంటికి తీసికొచ్చి, "ఓయ్, ఏం చేస్తున్నావ్ వేయ్?" అంటూ అమ్మని పిలిచి, "చూడు, శంకరు నా జానీ దోస్త్ వచ్చాడు. సేమ్యా చెయ్యి". అని చెబుతుంటే ఆ అజానుబాహువు నన్ను భుజంమీద కూర్చోబెట్టుకుని మూడు చుట్లు తిప్పినప్పుడెలా వుండే వారో అలాగే వున్నారు. ఆయన జీవితం ఎప్పుడూ ఒక్కలాగే వుంది. పక్షవాతంతో మంచం పట్టిన భార్య, ఇంట్లో నిత్య దాసోహం, లెక్కలేనన్ని కమిటీల మెంబర్‌షిప్, తోటకి కొత్తగా బావి, పొలానికి ట్రాక్టర్, ఆ జోడుగుళ్ళ పిస్తోలు, అన్నీ అలాగే వున్నాయి దాంతో బాటు ఈ గౌడగారి ఎత్తు, వెడల్పు, మీసాల గుబురు కూడా అలాగే వుంది.

"నీ బ్రతుకు బాగు పడ్డం కోసం, నా ప్రాణమైనా ఇస్తాను...." అని ఎన్నిసార్లు అనలేదీయన.

అలాంటి మనిషికి ఏమి చింత పట్టుకుందో ఇవాళ మొదటిసారిగా ఆ విశాలమైన నుదుటి మీద గీతలని చూశాను. ఆయన మౌనంగా కూర్చోవడం చూస్తే చప్పున వెళ్ళి ఆయన తలని నా ఒళ్ళోకి లాక్కుని పసిపిల్లవాడిని లాలించినట్టు లాలించాలనిపించింది.

దుమ్ము రేపుతూ ఇంపాలా కనుమరుగయింది. నా గది వేపు వెళుతుంటే మున్నీ, "అంటీ చాక్‌లెట్ తేలేదా? అంది.

ఈ మున్నీని kidnapచేసుకుపోతే ఎలా వుంటుంది....

14 అగస్టు 1958

ఎన్నో రోజుల తరువాత ఇవాళ వినయ్‌సాళకర్‌ని కలుసుకున్నాను. విషాదాంత సినిమాలో హీరోలాగా, గద్గద స్వరంతో నన్ను తిట్టి, శపించి అతను వెళ్ళిపోయి ఆరు నెలలయింది.

"నిన్ను దేవతలా పూజించాను లిలీ, ఎన్నో జన్మల నుంచి నా అంతరాత్మ వెతుకుతున్న వ్యక్తివి నువ్వే అని నమ్మాను. నువ్వు లేని జీవితమే లేదనుకున్నాను." అతని కళ్ళల్లో ఎరుపు జీరలు. "నువ్వు నా హృదయాన్ని తూట్లు పొడిచావు. నా కలల్ని నాశనం చేశావు. నా బ్రతుకులో నిప్పులు పోశావు."

నేను మౌనంగా వుండిపోయాను. వినయ్ చెబుతున్న దాంట్లో నిజం వుండి వుండవచ్చు. ఎన్నో సార్లు అతను నా కాళ్ళ దగ్గిర కూర్చుని నా పాదాలు చుంబించాడు."నువ్వు నా సర్వస్వం" అన్నాడు. కాలేజి వదలగానే ఇంట్లో ఇద్దరు పిల్లలతో తను వచ్చే దారి వేపే చూస్తూ ఎదురు చూసే భార్య దగ్గరకి వెళ్ళడం మానేసి తిన్నగా నా దగ్గరకే పరిగెత్తుకు వచ్చేవాడు. అన్నీ బాగానే నడిచాయి. ఇంకా కొన్ని రోజులలాగే నడిచి వుంటే, అతని సంప్రదాయపు ఆలోచనల్ని చదివి చదివి, ఆ ఖట్టతల లోంచి అవన్నీ బయటికి లాగేసి అతన్ని దారికి తేవడానికి

పిలయ్యేది. కాని ఆ లోపలే వినయ్ అన్నట్టుగా అతని హృదయాన్ని నేను తూట్లు పొడిచాను.

కారణం డాక్టర్ గోవిందమూర్తి తోటి స్నేహం గురించి నేనతడికి ఏమీ తెలియపరచకపోవడం. వినయ్‌ని మోసగించాలని నేనుఎప్పుడూ అనుకోలేదు. అయినా నేనెప్పుడూ అతనికి ఎవరి గురించీ ఏమి చెప్పలేదెందుకని?

వినయ్ ఒథెల్లో లాంటి నిజాయితీ పరుడైన ప్రేమికుడు. ప్రేమ, ఆత్మ, జన్మజన్మల అనుబంధం వీటి గురించి అతను లెక్చర్ ఇస్తున్నప్పుడల్లా నా కది తెలుస్తూనే వుండేది. మాటల వల్ల, ఒట్టి మాటల వల్ల, అదికూడా ఎప్పుడూ ఒకటిన్నర అడుగుల దూరంలో కూర్చుని అదే మాటల వల్ల నన్ను ఆకాశంలో తేలిపోయేలా చేసే సామర్థ్యం వుందతనిలో. అలాంటి వినయ్‌ని అనవసరంగా పోగొట్టుకోవడమా? అతనికి గోవిందమూర్తి లాంటి 'ఛ' materialistic మనిషిని గురించి చెప్పడమా?

"అంతా అయిపోయిందిక, నేనిక వెళతాను. మంచి పాఠమే చెప్పావు. నీ నుంచి నాకు తగిలిన దెబ్బ చచ్చేదాకా నన్ను బాధిస్తూనే వుంటుందన్న పంగతి మర్చిపోకు. అయినా తప్పు నాదే. నన్నే సర్వస్వంగా నమ్ముకున్న భార్యని వదిలేసి నీ వెంట పడ్డాను. దేవుడు తగిన శిక్ష విధించాడు." అంటూ పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళిపోయాడు వినయ్, తననే స్వర్గంలా భావిస్తున్న భార్య దగ్గరికి - నువ్వే సర్వస్వం అని నన్ను అంటున్నప్పుడు మరచిపోయిన భార్య దగ్గరికి.

ఇవ్వాళ చాలా రోజుల తరువాత "లిల్లీ నిన్ను మర్చిపోలేక పోయాను. నేను జన్మలో ప్రేమించింది నిన్ను మాత్రమే. నీలో ఎలా గైనా మార్పువుండదు." అన్నాడు. ఇదే నిజమైన ప్రేమ యొక్క లక్షణం అని వివరించాడు.

వినయ్ వల్ల ప్రయోజనం వుండొచ్చేమోనని అనిపిస్తోంది....

14 ఆగస్ట్ 1958

ఇవాళ మధ్యాహ్నం ఎంత హాయిగా నిద్ర పట్టింది, ఎన్నో రోజులుగా మధ్యాహ్నం పూట నిద్రపోయి ఎరుగను. ఇవాళ ఒళ్ళెరక్కుండా నిద్రపోయాను. ఆఫీసు బెంగలేదు. అకౌంటు గురించి బాధలేదు. ముఖ్యంగా ఆ గడ్డపు బాస్ చింత లేదు.

నేను క్షమించ మంటానని, అతను చెప్పినట్టు వింటానని అనుకున్నాడా సాయిబు. "ఇటు చూడు లిలీ, నిన్ను పనిలోంచి డిస్‌మిస్ చేసినట్టు ఆర్డరొచ్చింది జనరల్ మేనేజర్ దగ్గర్నుంచి." అన్నాడు నన్ను తినేసేలా చూస్తూ.

నాకు తెలీదూ దాని వెనకాల జరిగిన కుట్ర ఏమిటో! నేను సరిగ్గా

పనిచేయనని, నా నడవడిక బాగోలేదనీ ఎవరు ఫిర్యాదు చేస్తూ రాశారో తెలిదు. ఆమె, "ఆలోచించుకో లిలీ నీ ఉద్యోగం పోకుండా చూడగలను. అల్లాకే కసమ్" అన్నాడతను. నాకు అవసరం లేకపోయింది. ఈ బాన్ టి.బి.భార్య ఊరికి వెళ్ళినప్పుడల్లా అతని పడక పంచుకోడం, అందులోనూ దాని వల్ల ఏ ఉపయోగమూ లేనప్పుడు, ఉత్తి ఈ ఉద్యోగం నిలుపుకోడం కోసం అతని జీబురు గడ్డం, అతని అల్లాకే కసమ్ భరించడం నా వల్లకాదు.

ఇంటికొచ్చి నప్పుడు శరీరమూ మనసూ అంతా బరువుగా అనిపించింది. గాఢంగా నిద్రపట్టేసింది.... కలలో ఎవరో నన్ను గట్టిగా కౌగలించుకున్నట్టు, "నేనున్నాను నీకు, ఎప్పటికీ నిన్ను వదిలి పెట్టను, నీక్కావల్సిందల్లా ఇస్తాను. ష్లా బిడ్డల్ని కూడా! ఎంతమంది కావాలి? చెప్పు, ఒకరా? నలుగురా?" అన్నట్టు ....

ఎవరిదా బిగి కౌగిలి? ఎవరివా బలమైన భుజాలు?

ఆ కలలోనే ఎంత సేపున్నానే నా చుట్టూరా చిన్న చిన్న పిల్లలు. భలే ముద్దుగా వున్నారు.... అందరూ నా పిల్లలే.... నా పిల్లలే.... నాపిల్లలే.... వాళ్ళ మధ్య ఆ పిల్లల్ని నాకిచ్చిన వెడల్పాటి ఛాతిగల పురుషుడు.

ఎవరది?

చప్పున మెలకువ వచ్చేసింది.

20 ఆగస్ట్ 1958

ఛా! వినయ్ సాళకర్ మరీ పిరికి పంద, బొత్తిగా లాభం లేదు. అతని ఫిలాసఫీ, అతని ప్లేటోనిక్ లవ్, అతని వాదం, అంతా బోగస్.

ఎంత ఆశగా వెళ్ళానతని దగ్గరకి? నా మీద అతనికున్న ప్రేమ గురించి అంతగా మాట్లడతాడు గాని, నాకో చిన్న ఉపకారం చెయ్యమంటే చెయ్యలేకపోయాడు కదా, ఎలా అదిరిపడ్డాడు నా మాట విని పాముని తొక్కిన వాడిలాగ!

"ఛా! లిలీ, ఇలాంటి మాట కలలో కూడా ఆలోచించొద్దు, మనిద్దరిదీ ఆత్మ గత బంధం. దైహిక మోహంతో మన ఆత్మలఅనుబంధాన్ని కలుషితం చెయ్యకూడదు, దైహిక వ్యామోహం క్షణికం .... ఆ క్షణికమైన వ్యామోహం కోసం శాశ్వతమైన అనుబంధాన్ని అపవిత్రం చెయ్యకూడదు...." అంటూ లెక్చరిచ్చాడు.

వినయ్ నన్ను ఎప్పటికీ అర్థం చేసుకోలేదు....ఎప్పటికీ.... ఎప్పటికీ సాధ్యం కాదు. "దేవుడు మనిద్దర్నీ ఈ జన్మలో కలుపలేదు లిలీ, బహుశః దూరంగా వుండి, దుఃఖాన్ని అనుభవించి ఇంకా మన ప్రేమ గట్టిపడాలని

అనుకుని వుండవచ్చు. నేను దేవుడి ఇచ్ఛకు విరుద్ధంగా నడవలేను. నేను దూరంగానే వుంటాను. మన ప్లేటోనిక్ ప్రేమని ఇలాగే వుండనియి, పెరగనియ్యి. వచ్చే జన్మలో మాత్రమే మనం....

24 ఆగస్టు 1958

సాయంత్రం అయిదు గంటలయింది.

అన్నీ సిద్ధంగా వున్నాయి. నా గుడ్డలు పుస్తకాలతో నింపిన సూట్‌కేస్, గది అద్దె, పాల లెక్క, మున్నీకి ఆఖరి సారి చాక్‌లెట్ అన్నీ ఇవ్వడం అయింది. బయట వున్నది ఈ డైరీ ఒక్కటే.

ఉదయం గుమ్మం దగ్గర నుంచున్నప్పుడు స్పీడుగా వచ్చిన శంకర్‌గౌడగారి ఇంపాలా ఠక్కున ఆగింది.

"లీలా...."

నేను మౌనంగా వున్నాను.

"లీలా నీ ఉత్తరం అందింది."

అప్పటికీ నేను మౌనంగానే వున్నాను.

"కాస్త మార్కెట్‌లో పని వుంది. చూసుకుని వస్తాను. సాయంత్రం ఐదుగంటలూ ఆ మధ్యన.... సిద్ధంగా వుండు. వెళదాం."

....

-కారు వచ్చినంత వేగంగా వెనక్కి వెళ్ళింది.

-నాకు తెలుసు.

ఎప్పుడూ, దేని కోసమూ, ఎవరికైనా సరే లేదన్న వారు కాదాయన.

నా దేహం గాలిలో తేలిపోతున్నంత హాయిగా వుంది. కళ్ళనిండా మొన్న మధ్యాహ్నం కన్న కల....

ఓ హార్న్....

●

# 24. సంబంధం

**శ్రీకృష్ణ అలనహాళ్ళి**

విపరీతమైన ఎండ, తల పగిలిపోతుందేమో అన్నంత భయంకరమైన ఎండలో నడిచి వచ్చి గదిలో కూర్చోగానే మనసుకి కాస్త ప్రశాంతత కలిగింది. ఏప్రిల్ నెలలోని క్రూరమైన ఎండ వేడిమికి అడ్డుగా, నా గది కప్పు వేపు వాలి నుంచుని తన చల్లటి నీడనందిస్తున్న పెద్ద సంపంగి చెట్టు నిశ్చలంగా వుంది. గది కిటికీలన్నీ తెరిచాను. గాలెయ్యటం లేదు. చెమటతో తడిసిన గుడ్డల్ని విప్పాను. సిమెంట్ నేలమీద హాయిగా దొర్లాను. ఒళ్ళు చల్లబడినా లోపల మంటగా వుంది. కడుపులో ఓ రకమైన గుబులు. నీళ్ళ గదిలోకి వెళ్ళి జోరుగా కుళాయి తిప్పి దాని కింద నుంచున్నాను. ఇంక చాలనిపించే వరకు అలాగే కూర్చున్నాను. తరువాత బయటికి వచ్చి పడుకుని సిగరెట్ వెలిగించాను. పరీక్ష ఇంకో నెల మాత్రమే వుందన్న జ్ఞాపకం గుచ్చుకున్నట్టు అయింది. టేబుల్ మీదున్న "Problems of Philosophy" తీసి నాలుగు పేజీలు తిప్పాను. బోర్‌గా అనిపించి దాన్ని విసిరేశాను. ఇవాళెందుకిలా అనిపిస్తోంది? ఉంగరాలుగా పొగ వదిలాను. అయిపోయింది. మరొకటి వెలిగించాను. పొగపీల్చాను. లోపలి మంట ఆరలేదు. మట్టి కూజాలోని నీళ్ళని గట గట త్రాగాను. చల్లబడలేదు. ఎందుకిలా? ఎండవేడిమి వల్లనా? లేక అనిరీక్షితంగా లలితని కలుసుకోవడమా? ఎనిమిదేళ్ళ తరువాత అకస్మాత్తుగా కళ్ళెదుట వచ్చి నిలిచిన లలిత - నా మానసిక అస్వస్థతకి కారణమా?

ఇంతకీ లలిత నాకు ఏమవుతుందని? చిన్నప్పటినుంచి కలిసి, ఆడుకుని, చదువుకుని పెరిగినా ఒకే ఒక్క రోజు కూడా వాళ్ళింటి హాలు దాటి నట్టింట్లోకి కాలుపెట్టిన గుర్తు లేదు. చుట్టు పక్కల అన్నీ శూద్రుల ఇళ్ళే అయినా, వూరి కొకటే బ్రాహ్మణుల ఇల్లైనా లలిత తండ్రి బ్రాహ్మణత్వం కించిత్తు కూడా మైల బడలేదు. (అడవికి మేతకి వెళ్ళిన పశువు చీకటి పడినా ఇంటికి రాకపోతే తాతయ్య నన్ను పిలిచి లలితా వాళ్ళ నాన్న దగ్గిర మంత్రం వేయించుకురమ్మనే వాడు. అయన మంత్రం చేశారంటే ఇక తప్పిపోయిన మా పశువు తన ఇంటి ముందుకు వచ్చినా సరే పులిగాని, చిరుత గాని ఇక తినలేదు. పశువు ఇంటికి వచ్చేశాక అయన కట్టినకట్టు విప్పేస్తారట. అంతే కాకుండా మా ఇంటి పిల్లలకి జ్వరం వస్తే విభూది మంత్రించి ఇవ్వడం కూడా లలితా వాళ్ళ నాన్నగారి పనే. నేను వెళ్ళినప్పుడు అయన స్నానం చేసి వచ్చి ఎర్రటి పట్టుబట్ట చుట్టుకుని నట్టింట్లోకి వెళ్ళి గంట వాయిస్తూ మంత్రం చెప్పేవారు. లలిత చెప్పేది, వాళ్ళ నాన్నగారు మంత్రం చేసేటప్పుడు దేవుడితో మాట్లాడతారని. ఎప్పుడైనా ఓ సారి

దొంగతనంగా చూసెయ్యాలని మహా అనిపించేది నాకు. మారమ్మ పండుగలో మా కెళగల వారి సిద్దే గౌడు మీద దేవుడు పూనాడని అందరూ ధూపం వేసేవారు. కళ్ళు ఎర్రగా చేసుకుని వాళ్ళు వెలిగించి ఇచ్చిన కర్పూరపు బిళ్ళలని అరటిపండు మింగినట్టు మింగేవాడు. నాకు ఒకటే ఆశ్చర్యం. కాని లలిత మాత్రం, "మీ సిద్దేగౌడు వంటి మీద వచ్చేది దేవుడు కాదుట. అదో రకం గాలి. దేవుడు గౌడు జాతి వాళ్ళ మీదకి రాడట. మా నాన్నయ్య చెప్పారు" అనేది. అయితే లలిత ఇంటి దేవుడు ఎలా వున్నాడో మరి, చూడాలొకసారి. లలితా వాళ్ళింట్లో ఎక్కువమంది లేరు. వాళ్ళ పిన్ని, అమ్మ, నాన్న, ఎప్పుడూ గొణుగుతూ వుండే ఒక అవ్వ. ఓ రోజు విబూది మంత్రించుకు రావడాని కెళితే ఆ అవ్వ, లలిత ఎవరూ కనిపించ లేదు. లలితా వాళ్ళ నాన్న పూజకి వెళ్ళగానే నేను నెమ్మదిగా లేచి నుంచున్నాను. ఒక్కొక్క అడుగే వేస్తూ, ఇవాళ ఎలాగైనా వీళ్ళ దేవుణ్ణి చూసెయ్యాలన్న ఉద్దేశంతో, దొంగ లాగా ఇంక గడపదాటాలి. ఎక్కడుందో ఆ ముసలి మామ్మ, "అయ్యో, అయ్యో, శూద్ర ముండా వాడా, లోపలి కొచ్చేస్తున్నా వేమిట్రా...." అని అరుస్తూ నా వెనకాలే వచ్చి, చంకలో పెట్టుకున్న కర్రతో ఒక్కటిచ్చుకుంది. నేను ఏడుస్తూ హాల్లోకి వెళ్ళాను. ఇంట్లో వాళ్ళంతా గుమిగూడారు. అందరి వేపూ చూశాను. అందరూ నేను అపరాధినన్నట్లుగా చూస్తున్నారు. సిగ్గుతో, భయంతో వణకి పోయాను. లలిత పరిగెడుతూ వచ్చి, నా పరిస్థితికి సానుభూతి చూపుతున్నట్టుగా చూసింది. వాళ్ళమ్మ "పోనియ్యండి పాపం, ఏమీ తెలిని కుర్రాడు" అంటుండగానే ముసలమ్మ "మీకో కట్టుబాటు, పాడు లేదు. శూద్రముండా వాళ్ళు. రేపు మీ తాతయ్యని రానీయ్. నీ పని చెబుతాను". అనగానే నా పై ప్రాణాలు పైనే పోయాయి. చేట నెత్తుకుని బయలుదేరాను. లలిత నాన్న 'వుండరా' అంటూ విభూది తెచ్చి చేటలో వేశారు. చేట ఎత్తుకుని వెళుతూ వాళ్ళింటి మెట్లు దిగేటప్పుడు తిరిగి చూశాను. నా వెనకాలే వచ్చి నుంచున్న లలిత మొహంలోనూ ఏడుపు. ఆమె కళ్ళల్లోనూ నీళ్ళు నిండాయి.

అదే మొహం ఇవ్వాళ ఆసుపత్రిలో కనిపించింది. మెడమీద ఎక్కువవుతున్న తామర దద్దుర్లని చూపించుకుందామని వెడితే, అక్కడ లలిత కనిపించింది. మొదట చూడగానే గుర్తు పట్టలేక పోయాను. నా ముందొచ్చి నిలబడి, నేను లలితని గుర్తులేదా అనేసరికి చెంపపెట్టు పెట్టినట్టుగా అనిపించింది. మూడేళ్ళ తన కూతుర్ని చంకనేసుకుని నుంచున్న లలిత చాలా మారిపోయింది. నా బాల్యపు నేస్తం, బంగారు బొమ్మలాంటి లలిత...ఎంత పెద్ద మరుపు నాకు. ఎనిమిదేళ్ళు మాత్రమే అయిందామెను చూసి. కాని మా ఇద్దరి మధ్యన ఎలాంటి

కందకం....

లలితని ఆఖరిసారిగా చూసింది ఎనిమిదేళ్ళ క్రితం. మా ఇంట్లో దానం ఇచ్చి దేవుడి పూజ పెట్టుకున్న రోజు. ఆనాటి రాత్రి ఇంకా కళ్ళకి కట్టినట్లుగా వుంది. మా ఇంటికి ఆ రోజు కావల్సిన వాళ్ళంతా వచ్చారు. మైసూర్ నుంచి నేనూ వెళ్ళాను. లలితా వాళ్ళ నాన్న, మామ్మ, అమ్మ అందరూ వచ్చి కూర్చున్నారు. లలిత మాత్రం రాలేదు. చిన్నతనం నాటి మా చదువు పూర్తయ్యాక, నేను మైసూరు వెళ్ళినా, లలిత అక్కడే ఇంటి దగ్గరే వున్నా, నేను వూరికి వెళ్ళినప్పుడల్లా ఏదో ఒక నెపంతో మా ఇంటి దగ్గరకి వచ్చి నాతో మాట్లాడి వెళ్ళేది. ఇవాళెందుకు రాలేదా అనుకుంటూ వాళ్ళింటికి వెళ్ళాను. తలుపు తోస్తూ 'లలితా' అన్నాను. లలిత లోపల చిన్న తమ్ముణ్ణి ఉయ్యాల్లో వేసి వూపుతోంది. "ఎవరూ?" అంది.

వెలిగించిన ప్రమిద వెలుగులో అదే మొదటి సారిగా లలిత చీర కట్టుకుని నుంచోవడాన్ని చూశాను. చాలా పెద్ద పిల్లయిపోయింది. తనకి ఏదేదో చెప్పాలని వచ్చాను. లలిత మొదటిలా నన్ను చూడగానే ఒక్క గంతులో నా దగ్గరకొచ్చి పలుకరించకుండా మౌనంగా నుంచుంది. దగ్గర కెళ్ళి మా ఇంటికెందుకు రాలేదు లలితా? అన్నాను. లలిత, "ఇకమీదట నేనెక్కడికీ వెళ్ళకూడదట". అంది. ఆమె మాటల్లో భావం నా కర్థం కాలేదు. బయలు దేరుతూ మరొకసారి ఆమె వేపు చూశాను. లలిత చాలా అందంగా కనిపించింది. తన పెద్ద కళ్ళతో నా వేపు తినేసేలా చూస్తోంది. "మామ్మ నాన్న వస్తారేమో" అంది. నేను నవ్వి బయటకు వచ్చేశాక లోపల గడియ పెట్టుకుంది. ఇంటి కొచ్చాను. కథ వింటూ నిద్రపోయాను. ఉదయం మైసూరికి వచ్చేశాను. కొద్ది రోజుల్లోనే మా మామయ్య కొడుకు మైసూరు వచ్చినప్పుడు లలితకి పెళ్ళయిన సంగతి చెప్పాడు. అతడామాట చెపుతుంటే నాలో దేన్నో పోగొట్టుకున్న అనుభవం కలిగింది.

లలితతో బాటు ఆసుపత్రి ముందున్న పెద్ద చెట్టు క్రిందున్న రాతి బెంచీ మీద కూర్చున్నాను. లలిత కళ్ళ చుట్టూ గీతలు. నిస్తేజమైన ముఖం. ఉత్సాహం పురకలు వేసేలా వుండే లలిత ఎండి శల్యమైపోయింది. తన పక్కన కూతుర్ని కూర్చోబెట్టుకుంటూ "నా మూడో కూతురు" అంది. లెక్క వేస్తున్నాను. "ఇంకో మగపిల్లాడు పుట్టి పోయాడు. దీని కంటె చిన్న పాప మరొకతి వుంది." అంది. దిగ్భ్రమ కలిగింది. స్థూలంగా తన కథ చెప్పింది. దగ్గరగా చూస్తుంటే ఆ రోజు ఆఖరిసారిగా వాళ్ళింట్లో చీరె కట్టుకుని నుంచున్న, యవ్వనం నిండిన సుందర దేహం. పీల్చి పిప్పి చేసిన చెరుకులా నిస్సారమై పోయింది. రంగు వెలసిన చీర, బిడ్డకి చిరిగిన లంగా, జాకెట్. చాలా దుంఖం కలిగింది. ఎనిమిదేళ్ళకే ఆమె

బ్రతుకులోంచి వసంతం తొలిగిపోయింది. ఆమె వయసే గల ఆడపిల్లలు వేలమంది, ఇంకా పెళ్ళి కాకుండా సుఖ స్వప్నాలకి నిలయం అయిన కాలేజీల్లో నాతో బాటు చదువుకోవడం లేదా? లలిత ఎంత తొందరగా గృహిణి అయిపోయింది. గుమాస్తా మొగుడితో కడుపు, కనడం, మళ్ళీ వూరు మార్పు, మళ్ళీ కడుపు, కాన్పు....లలిత పూర్తిగా లోతుగా కూరుకుపోయింది.

లలిత తన లాగే అందంగా, తనలాగే కృశించిపోయి వున్న బుల్లిపాప లంగా పక్కకి జరిపి,"చూడండి వారం రోజుల క్రితం ఎక్కడో ఆడుకుంటూంటే కుక్క కరిచిందట. అది పిచ్చి కుక్కేమోనని భయం." అంది. గాయం వాచింది. ఇవాళ ఇంజక్షన్ గుచ్చుతారని ఆ పిల్లకి భయంతో కళ్ళల్లో నీళ్ళొస్తున్నాయి. డాక్టరు, 'మరో రెండు రోజులు చూద్దాం తరువాత బెంగళూరు వెళ్ళాల్సొస్తుందేమో' నంటున్నారు అంది. ఇప్పుడు కుక్క కరిస్తే పెద్ద ప్రమాదం ఏమీ లేదు. నయమవుతుంది అన్నాను. "అంతా నా కర్మ" అని వేదాంతం మాట్లాడింది. ఆమెతో బాటు నేనూ వెళ్ళి డాక్టరుతో మాట్లాడాను.

ఆయన, "పిచ్చికుక్కే అయ్యుండొచ్చు. పిల్ల మాటల్లో ఇంకా తేడా కనిపించడం లేదు. చూద్దాం." అన్నారు.

బయటకి వచ్చి లలిత వద్దన్నా వినకుండా బండి మాట్లాడాను. నడిచే వెడతాను అంటున్న లలిత వేపు చూశాను. ఇంజక్షన్ నొప్పికి వెక్కుతున్న పాపని భుజం మీద వేసుకుంది. బండిలో ఎక్కి కూర్చున్నాక లలిత చాముండీపురంలో తన ఇంటి గుర్తు చెప్పింది. "తీరికైనప్పుడు రండి" అంది. పాపకి ఏమీ ఇవ్వలేదన్న సంగతి గుర్తు వచ్చి, జేబులో వున్న డబ్బు తీసి ఆ పాప ఒళ్ళో పెట్టి "పిల్లల కేదైనా తిండానికి తీసికెళ్ళు లలితా" అన్నాను. లలిత వొద్దొద్దు అన్నా నేను వినలేదు. రేపు మళ్ళీ ఇక్కడే కలుస్తాను అన్నాను. లలిత నా వేపేచూస్తోంది. బండివాడు గుర్రాన్ని తోలాడు. బరువుగా అడుగులు వేసుకుంటూ గదివేపు నడిచాను. కుక్క కరిచిన నొప్పితో ఏడుస్తున్న పాపని, బీదతనంతో కృశించిన పాపని, నిస్సత్తువగా వున్న లలిత ఎత్తుకుని అంత దూరం వుట్టి కాళ్ళతో ఈ మండుటెండలో ఎలా వెళుతుంది అని తల్చుకుంటే కడుపులో దేవినట్టయింది.

× × ×

మర్నాడు వుదయం ఏదో పని బడి ఆసుపత్రికి వెళ్ళలేకపోయాను. వస్తానని వెళ్ళలేక పోయినందుకు తనేమనుకుందో, సాయంత్రం వాకింగ్‌కి బదులు వాళ్ళిల్లు వెతుక్కుంటూ వెళితే సరి అనుకున్నాను.

వొళ్ళు విరుచుకుంటూ లేచి గది తలుపులు తెరిచాను. సంపంగి చెట్టుమీద

పదిరకాల పక్షులు కిచకిచ లాడుతున్నాయి. రోడ్డు మీద చిన్న చిన్న పిల్లలు కళ్ళు చెదిరేలాంటి గుడ్డలు వేసుకుని గెంతుతున్నారు. మొహం కడక్కుని బయలుదేరాను. తోవ పొడుగునా మనసులోనే నేను చూడని లలిత భర్త రూపాన్ని వూహించుకుంటూ వెళ్ళాను. కాస్సేపు వెతికాక చాముండీ పురంలోని మురికి సందులో వున్న లలిత ఇల్లు కనుక్కున్నాను.

నాలుగారు ఇళ్ళు ఒకటికొకటి అతికినట్లు వున్న ఆ లోగిట్లోకి అడుగు పెట్టాను. అక్కడే ఓ మూల వున్న కుళాయి దగ్గర నలుగురైదుగురు ఆడవాళ్ళు బిందెలు పట్టుకుని నుంచున్నారు. అందరి కళ్ళూ నా వేపు తిరిగాయి. నన్ను చూడగానే లలిత బిందె అక్కడే వున్న రాతి మీద పెట్టి "రండి" అంటూ ఓ సందులోంచి రెండే గదులున్న ఇంట్లోకి తీసికెళ్ళింది. ఒకటి వంట గది. మరొకటి సామాన్లతో నిండిన, అందరూ కూర్చునే పడుకునే గది. అస్తవ్యస్తంగా వున్న ఆ ఇంట్లోకి అడుగు పెడుతూ వుండగానే లలిత రక్త మాంసాలని పంచుకున్న నాలుగు జీవులు నా వేపు గుడ్లప్పగించి చూడసాగారు. ఈ పిల్లకేమన్నా తిండానికి తేవల్సింది అనుకున్నాను. నుంచునే వున్న నా వేపు మడత పెట్టిన పాత కుర్చీని తీసి వేస్తూ కూర్చోండి. అంటూ కుళాయి వేపు వెళ్ళింది లలిత. ఇల్లంతా పరికించాను. నాలుగు వేపులా బీదతనం తాండవ మాడుతోంది.

నీళ్ళు నిండిన బిందె వంట గది లో పెట్టి వచ్చిన లలిత "ఇల్లంతా ఎంత సర్దినా చెత్త చేసేస్తారు పిల్లలు" అంది. ఓ చిన్న కిటికీ మాత్రమే వున్న, గాలి ఆడని ఆ గదిలో ఆరు జీవాలెలా వూపిరి పీల్చుకుంటాయోనని ఆలోచించాను. బయట వెలుగున్నా లోపల చీకటి కమ్ముకుంది. లలిత లైటు వేసి వంటింట్లోకి వెళ్ళింది. "కాఫీ గీఫీ ఏమీ వద్దు లలితా" అన్నాను. లలిత వినలేదు. కాసేపట్లో కాఫీ తెచ్చిచ్చింది. ఆమె తృప్తి కోసం తాగాను. ఆమె కుక్క కరిచిన పాప పక్కన కూర్చుంటూ, ఆయనా వచ్చే వేళయింది; అంది. "ఉదయం ఆసుపత్రికి రాలేకపోయాను లలితా" అన్నాను.

"డాక్టరు ఏ సంగతి రేపు ఖచ్చితంగా చెబుతానన్నారు" అంది. చిరుగుల చాప మీద పడుకున్న పిల్ల నిన్నటి కంటే నీరసంగా కనిపిస్తోంది. ఆ పిల్లకన్న కొంచెం పెద్దపిల్ల చంటి పాపని ఒళ్ళో వేసుకుని మా మాటలు వింటూ కూర్చుంది. మరో కుర్రాడు ఎక్కాలు వల్లెవేయడం ఆపి కూర్చున్నాడు.

లలితతో వాళ్ళ నాన్నగార్ని గురించి మాట్లాడాను. లలిత మొగుడికీ, ఆయనకీ ఏదో విషయంలో గొడవ జరగడం, నువ్వు చచ్చినా దాన్ని నీ ఇంటి గడప తొక్కనియ్యనని ఇతడు పంతం పట్టడం - ఇలా కొన్ని విషయాలు చెప్పింది. ఆమె

మాటల వల్ల ఆమె భర్త మంచివాడులా అనిపించలేదు.

కాసేపట్లోనే ఆమె భర్త వచ్చాడు. పొట్టమీదకి వెదులుగా వున్న ప్యాంటుని బెల్టుతో బిగించాడు. అతను రాగానే చప్పున లేచి నుంచుని లలిత నన్ను పరిచయం చేసింది. అతను లలితలా గాని, ఆమె పిల్లల్లాగ కాని బలహీనంగా లేడు. దృఢంగా వున్నాడు. నాతో ఒకటి రెండు మాటలు మాట్లాడి, వదులు ప్యాంటుని, షర్టుని దండెం మీద వేసి నా వేపు చూడకుండా ఒక తువ్వాలు భుజం మీద వేసుకుని బయట వున్న నీళ్ళ గది వేపు నడిచాడు.

"వెళతాను లలితా. రేపు ఆస్పత్రికి వస్తాను" అన్నాను. "ఏమీ అనుకోకండి, ఆయన తీరే అంత." అంది. జాలేసింది - అతను తిరిగొచ్చాడు. రోమాలు నిండిన తొడల్ని తుడుచుకుంటూ, "మా ఇల్లు ఇక్కడుందని ఎలా తెలిసింది?" అన్నాడు. నిన్న ఆస్పత్రిలో లలిత కనిపించి చెప్పిందని అన్నాను.

వంటింట్లోకి వెళ్ళాడు. లలితనేదో అంటున్నాడు. నాకు స్పష్టంగా వినిపించలేదు. లేచి నుంచున్నాను. అతను బయటకి వచ్చి గదుసుగా "పిళ్ళ నాన్నకి మేము ఇక్కడుంటున్నామని చెప్పకండి" అన్నాడు. "అలాగే" అన్నాను. అతని వెనకాల మొహం వేలాడేసుకుని నిలబడింది లలిత. "వస్తాను" అనేసి చక చక బయటపడ్డాను.

× × ×

డాక్టరు "ఇంకో రెండురోజుల్లో బెంగుళూరికి తీసికెళ్ళండి, లేకపోతే ప్రమాదం" అన్నారు. లలిత ఏడుపు మొహంతో నుంచుండి పోయింది. నేను అలాగే సర్ అన్నాను. లలితని బయట ఓ రాతి బెంచీ మీద కూర్చోమని, నాకు బాగా తెలిసిన డాక్టర్‌ని చూడ్డానికి లోపలికెళ్ళాను. ఆయన నా స్నేహితుడు కూడా. ఆయన్ని వెతికి పట్టుకుని విషయం అంతా చెప్పాను. ఆయనకి ఇబ్బంది కలిగినా చేస్తున్న పని వదిలి పెట్టి వచ్చి R.M.O. గారి దగ్గర్నుంచి ఓ కాయితం రాయించి ఇచ్చారు. ఆ కాయితం లలిత చేతుల్లో పెడుతూ "ఇవాళ సాయంత్రమే బెంగళూరు వెళ్ళి పాపని ఆస్పత్రిలో చేర్పించు. ఈ ఉత్తరం చూపిస్తే బాగా చూస్తారు" అన్నాను. లలిత మాట్లాడలేదు.

ఇంజక్షన్ నొప్పితో బాధపడుతూ లలిత భుజం మీద నిస్తేజంగా పడుకుంది పాప. ఆ పాప నెత్తుకుని మెట్లు దిగడానికి ప్రయాసపడుతోంది లలిత. నేను ఆమె పాప నెత్తుకుని "నెమ్మదిగా దిగు లలితా" అన్నాను. లలిత నెమ్మదిగా దిగినా అలసి పోయింది. "ఏదైనా కూల్‌డ్రింక్స్ తాగి వెడదాం రా లలితా" అన్నాను. లలిత ఒప్పుకోలేదు. "ఇంట్లో పిల్లలు బాగా గొడవ చేస్తుంటారు." అంటూ పాప నెత్తుకుంది. "ఇక్కడే నుంచో లలితా బండి తెస్తాను". అని

బయలుదేరాను. "ఒద్దు" అంది. అంత కష్టంలోనూ స్వాభిమానం. దుష్టుడైన భర్త, అయినా కించిత్తూ కోపం లేదు. ప్రేమే తప్ప.

బండిలో కూర్చున్న లలిత మొన్నటిలా "ఇంటివేపు రండి" అని పిలవలేదు. నేనే "మూడు నాలుగు రోజులు ఆగి వస్తాను. ఆలోపున అడ్మిట్ చేసి వస్తారుగా" అన్నాను.

ఏమి చెప్పాలనుకుందో చెప్పలేక మూగగా, బాధగా నా వేపు చూసింది. పొంగి వస్తున్న దుఃఖం అసహాయత ఆమె కళ్ళల్లో గూడు కట్టుకుంది.

బండి బయలుదేరింది.

నేను నుంచునే వున్నాను. నాకు తెలీకుండానే నా కళ్ళు చెమర్చాయి. గుండె బరువెక్కింది.

× × ×

కాలేజి ముందు వున్న పార్కులో కూర్చున్నాను. చెట్టూ చేమా చిగిర్చి, ఆకుపచ్చ, ఎరుపు రంగుల్లో మిలమిల మెరుస్తున్నాయి. నేల మాత్రం ఎండి బీటలు వారింది. ఈ ఏప్రిల్ నెలలో మాడ్చేసే ఎండల్లో కూడా చెట్లు చిగిర్చి కళకళ్ళాడ్డాన్ని చూసి విస్మయం కలిగింది. ఈ సృష్టి వైచిత్ర్యాన్ని గురించి ఆలోచించ సాగాను. అలాగే లలిత గుర్తొచ్చింది. లలితకు నేను, నాకు లలితా ఏమవుతామన్న ప్రశ్న ఇప్పుడు నన్ను వేధించ లేదు. వీస్తున్న గాలికి, జ్ఞాపకాల పుటలు చక చక తెరుచుకున్నాయి.

ఎనిమిదేళ్ళుగా నేను లలితా ఒకర్నొకరు చూసుకోలేదు. మేమిద్దరం పూర్తిగా భిన్న సంస్కారాలలో పుట్టి పెరిగిన వాళ్ళమైనా ఏదో తంతు బాల్యంలో మా హృదయాలని కలిపింది. మేమిద్దరం కలిసి ఆడుతూ పాడిన రోజులు గుర్తొచ్చాయి. దూరంగా వున్న పల్లెకి నేనూ - లలిత కలిసే వెళ్ళే వాళ్ళం. నేను తీసికెళ్ళే భోజనం లలిత ఎప్పుడూ తినేదే కాదు. వాళ్ళింటి నుంచి తెస్తున్న రుచిరుచిగా వుండే పదార్థాలని నాకు పెట్టకుండా లలిత ఎప్పుడూ తినేది కాదు. మా ఇంట్లో ఏదైనా ప్రత్యేకంగా చేసి ఇచ్చిన నాడు "కొంచెం తిను లలితా ఏమీ అవదులే" అనేవాడిని. లలిత మాత్రం "మా బామ్మగారు చెపుతారు, మేం బ్రాహ్మలం కదా, శూద్రుల ఇంటి తిండి తింటే నరకానికి పోతామట" అనేది. మా తాతయ్య నోట్లోంచి అప్పుడప్పుడు నరకపు వర్ణన విన్న నేను ఇక మాట్లాడలేక వూరుకునే వాడిని.

దీపావళి పండుగ వచ్చిందంటే చాలు - వూళ్ళో మరెక్కడా దొరకని డేలియా పూలు మా తోటలో రాశులు రాశులుగా పూసేవి. మా మామయ్య మైసూరు నుంచి విత్తనాలు తెచ్చి పెంచాడు. పండుగ రోజున అందరిళ్ళల్లోనూ పశువుల

మెడకి, ఆడవాళ్ళ తల్లోకి వెట్టి బంతిపూలు మాత్రమే గతి. మాకు మాత్రం రంగురంగుల డేలియా పూలు. పండుగ ముందు రోజు సాయంత్రమే నాతో బాటు వచ్చి లలిత మొయ్యలేనన్ని పూలు కోసుకుని మోసుకెళ్ళేది. మా కందరికీ కొత్త బట్టలు దొరికేది ఇలాంటి పండుగల్లో మాత్రమే. నేనూ కొత్త బట్టలు తొడుక్కుని దేవాలయం వేపు పరుగు తీసేవాడిని. లలిత కూడా కొత్త బట్టలు కట్టుకుని సంభ్రమంతో వచ్చేది. "దేవుడి వాహనాన్ని వూరేగింపు కోసం అలంకరించటాన్ని మా యింటి నౌకర్లు అవాళ పల్లేకి రాకుండా దేవస్థానం ఎదుట ఆవేశంతో డప్పు మ్రోగించడాన్ని చూస్తూ మమ్మల్ని మేమే మరిచిపోయేవాళ్ళం.

పాత జ్ఞాపకాలు కళ్ళముందు నిలిచాయి. మనసు తేలిక పడింది.

వీధి దీపాలు వెలగసాగాయి. లేచి గదివేపు బయలుదేరాను.

× × ×

సమయం మూడు గంటలయింది. లలిత పాప సంగతేమయిందో తెలుసుకుందామని వాళ్ళింటి వేపు వెళ్ళాను. ఎండ తగ్గి ముఖం పడుతోంది. లలిత భర్త అనాదరణ గుర్తొచ్చింది. అతని అసభ్య ప్రవర్తన గుర్తొచ్చింది. లలిత ఏం పాపం చేసిందని ఇలాటి భర్త దొరికాడేనని పించింది. లోగిట్లోకి అడుగు పెడుతుండగానే నిశ్శబ్దాన్ని చీల్చేసేలా క్షీణంగా అరుస్తున్న లలిత కూతురి కంఠం వినిపించి గుండె ఆగినంత పనయింది. ఒక్క క్షణం అక్కడే నిలబడి, తెరచి వున్న తలుపు సందులోంచి లోపలకి తొంగి చూశాను. మూల మూలుగుతూ అరుస్తున్న కూతురి వేపు చూస్తూ, తనని అతుక్కున్న చంటి బిడ్డకి చన్ను అందించి దిక్కు తోచనిదానిలా కూర్చున్న లలితని చూశాను. దీర్ఘంగా నిట్టూర్చాను. లలిత కళ్ళు గుంటలు పడ్డాయి. "లలితా బెంగళూరికి వెళ్ళనే లేదా? అన్నాను. లలిత వెక్కి వెక్కి ఏడవసాగింది. పాలు త్రాగడం మానేసి చంటిపాప కెవ్వున అరిచింది. ఆ పాపని ఓదారుస్తూ లలిత కళ్ళు తుడుచుకుంది. "ఏమిటి లలితా, ఏమిటయిందసలు?" అన్నాను కంగారుగా. లలిత మౌనంగా వుంది. "నీ భర్త ఏమన్నాడు?" అన్నాను. కాసేపయాక లలిత వెక్కి వెక్కి ఏడుస్తూ జరిగిన సంగతి చెప్పింది. అతనన్నట్టు అంత డబ్బు ఎక్కడ్నుంచి తేగలం? అలా అరుస్తూ అరుస్తూ అదే తగ్గిపోతుంది అన్నాడట. పల్లెటూరి అమాయకురాల్ని రాక్షసుళ్ళా పీల్చి పిప్పి చేస్తూనే వున్నాడు. అతని మృగ ప్రవృత్తికి అసహ్యం వేసింది.

అక్కడ్నుంచి తిన్నగా గదికి వచ్చాను. పాస్‌బుక్ తీసుకుని తిన్నగా కాలేజి సొసైటీకి వెళ్ళాను. అప్పుడే అకౌంట్ క్లోజయింది. పరిచయమున్న మ్యానేజర్ నా పరిస్థితిని అర్థం చేసుకుని, "రేపటి తేదీకి చెక్ రాసివ్వండి సర్. నా సొంత

డబ్బుంది ఇస్తాను" అన్నాడు. డబ్బు తీసుకుని సైకి లెక్కి లలితా వాళ్ళింటికి వెళ్ళాను.

లలిత ముందు డబ్బుంచాను. "ఈ సాయంత్రం బస్సుకి తీసికెళ్ళు లలితా" అన్నాను. అరచి అరచి నీరసంతో ఆ పాప నిద్రపోయింది. లలిత మౌనంగా వుంది. దుఃఖాన్ని దిగమ్రింగి దిగమ్రింగి రోజురోజుకి మౌనపు ముద్దలా తయారవుతున్న లలితని చూడలేక పోయాను. కడుపులో చెప్పలేని బాధ కలిగింది. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. గదికి తిరిగి వచ్చేశాను. కళ్ళముందు చీకటే మిగిలింది. అంతా శూన్యంగా అనిపించింది.

ఒక్కోసారి ఇదంతా ఎందుకొచ్చిన గొడవ అనిపించినా అమ్మ చెబుతున్న మాటలు గుర్తొచ్చాయి. "మనిషి అన్నాక దుఃఖంలో ఒకరికొకరు కాకపోతే ఇక మనిషిగా పుట్టి ఏం ప్రయోజనం? మనం ఒకరికి చేస్తే మనకే మరొకరు చేస్తారు. "ఇలా ఇప్పటికీ అమ్మ చెబుతున్న మాటలూ చెవిలో గింగురు మంటాయి. ఆలోచించి చెప్పినవి గాని, రాసిన మాటలు గాని కావవి. అంతఃకరణలోంచి వచ్చిన మాటలవి.

నన్ను గురించి, ఈ ప్రపంచాన్ని గురించి లోతుగా తెలుసుకోవాలి. తెలుసుకుని బ్రతకాలి అన్న ఉత్కృష్టమైన ఆకాంక్ష వల్ల ఫిలాసఫీని ఎన్నుకున్నాను. చదువులో ఎంతోమంది తాత్వికులు రాసిన వందలాది పుస్తకాలు చదివాను. అర్థం చేసుకుని, మథించి, అందులోని సారాన్ని గ్రహించడానికి పగలు, రాత్రి, శ్రమపడ్డాను.

కొద్ది కాలంలోనే కొంత గ్రహించాను. ఆలోచనా పరుణ్ణి అయ్యాననుకున్నాను. మా వూరికి వెళ్లాను. అమ్మ, ఆర్థికంగా చితికిపోయి వచ్చిన కూతుర్ని, ఆమె భర్తని, పిల్లల్ని అందర్నీ ఇంట్లో పెట్టుకుంది. నాకు నచ్చలేదా పని. కోపగించాను. అమ్మ ఆరోజు చెప్పిన మాటలు ఇంకా నా గుండెల్ని చీలుస్తూనే వున్నాయి. ఎన్నోసార్లు నేనెలాంటి హృదయ హీనుణ్ణి, పశువుని అని నన్ను నేను శపించుకున్నాను.

మా అక్క గురించి నేనాడిన మాటలు విని ఆ రోజు మా అమ్మ కార్చిన కన్నీరు నన్నింకా కాలుస్తూనే వుంది. మానవీయతలేని విజ్ఞానం, విద్య, సంపద ఎంత వున్నా నిరర్థకమని ఇప్పుడే అర్థమవుతోంది నాకు.

× × ×

అవును, ఇవాళిటికి పదిహేను రోజులయింది. లలిత పాపకి ఈ పాటికి నయమయి వుండవచ్చు. పిచ్చి కుక్క కరిస్తే నయం కావడం ఈ రోజుల్లో ఏమంత కష్టం కాదు. మళ్ళీ లలిత భర్త ఏం చేసి వుంటాడో నన్న అనుమానం.

లలిత ఇంటివేపు బయలుదేరాను. పొద్దుగూకే వేళ. పెద్ద పెద్ద చెట్లక్రింద నల్లటి తారు రోడ్డు. చెట్లు చీకటిని కక్కుతున్నాయి. నలుపు రంగు అరిష్టానికి సంకేతం కదూ, ఏదో మనసుకి భ్రమ అనుకుంటూ లలిత ఇల్లు చేరాను.

బయట గుమ్మం ముందు ఇద్దరాడవాళ్ళు నుంచున్నారు. అందులో ఒకామెని, "లలిత బెంగళూర్నించి రాలేదా?" అని అడిగాను. ఆమె, లలిత బెంగళూరికీ వెళ్ళలేదు, ఎక్కడకీ వెళ్ళలేదు. ఆ పాప రాత్రి - పగలు అరచీ అరచీ నాలుగు రోజుల క్రితం చచ్చిపోయింది." అంది. కడుపు తరుక్కు పోయింది నాకు. "లలితమ్మ ఏమవుతుంది మీకు?" అన్నది మరొకామె. "మీరేదో పెద్దమనుషుల్లా వున్నారు. ఆ మొగుడికి పెద్ద రోగం. దేవతలాంటి లలితమ్మని చచ్చేలా కొట్టాడు. మేం లేకపోతే చంపేసేవాడేమో. మిమ్మల్ని చెడ్డగా ఏదో అన్నాడు. వాడినోట్లో పురుగుల పడ...." ఆమె బూతులు తిడుతూనే వుంది.

వెనక్కి వెళ్ళిపోదామని ఒకడుగు వేశాను. ఆమె మళ్ళీ అంది, "ఆడు లేడు. ఆయమ్మని మీరోసారి చూసి పొండి...." అంది. కడుపులో నిప్పులు పోసినట్లయినా. కాళ్ళీడ్చుకుంటూ లలిత ఇంటి ముందు నుంచున్నాను. తలుపు సగమే తెరచి వుంది. కంపిస్తున్న కంఠంతో "లలితా" అన్నాను. కాసేపయ్యాక నెమ్మదిగా ఎవరూ?" అన్న నిర్జీవమైన కంఠం వినిపించింది. తలుపుతోసి లోపలకి వెళ్ళి, "లలితా, నేను" అన్నాను. లలిత మొహం తెల్లగా పాలిపోయింది. నుదుటి మీద ఓ చోట గాయానికి పౌడర్ అద్దింది. లేచి కూర్చోవడానికి శక్తి లేదు. చంటిపాప ఆమెని అతుక్కునే వుంది.

లలిత మాట్లాడ లేదు. ఆమె కళ్ళల్లో వెలుగే లేదు. చెంపల్లో ఎముకలు బయటకి పొడుచుకొచ్చాయి. రాక్షసుడు ఆమె వొళ్ళు హూనం చేసేశాడు. "మాట్లాడు లలితా అన్నాను." మౌనం భరించలేనంత భయంకరంగా వుంది. వణికి పోయాను. లలిత పుల్లల్లాంటి చేతులతో స్టాండు వేపు చూపించింది. నేనిచ్చిన డబ్బు, డాక్టరు చేత రాయించిచ్చిన కాగితం అక్కడే వున్నాయి. లలితని ఈ పరిస్థితిలో వుంచడానికి కారణమయిన ఆ డబ్బుని చేతుల్లోకి తీసుకుని నలిపేశాను. లలిత దగ్గరగా వెళ్లి, వొంగుని "నీకు అన్యాయం చేశాను లలితా?" అన్నాను. లలిత నీరసంగా 'లేదు' అని అడ్డంగా తలవూపింది. కళ్ళు లోతుకి పోయినా కన్నీరు పొంగుతూనే వుంది. లలిత లేవడానికి ప్రయత్నించింది. "లేవకు, లలితా పడుకో" అన్నాను.

దిక్కు తోచలేదు నాకు. ఇదే ఆఖరిసారి అన్నట్టుగా లలితని హృదయం నిండా నింపుకున్నాను. "నేనిక వెళ్ళిరానా లలితా?" అన్నాను. లలిత చాలా

సేపు మౌనంగానే వుండిపోయింది. ఆమె జవాబు కోసం నేను కాచుకు నుంచునే వున్నాను. మౌనం గడ్డకడుతోంది.

# 25. అమాస

దేవనూర మహాదేవ

అమాస అన్నది అమాసుడి పేరు. అతను నల్లగా వున్నందు వల్లనే, అమావాస్య రోజున పుట్టినందు వల్లనే అతనికి ఆ పేరే నిలిచిపోయింది. అమాస అన్న పేరు ఎందుకు వచ్చిందని అతని అమ్మ, నాన్న బ్రతికి వుంటే అడగడానికి వీలుండేది. కానీ అతను పుట్టాకే, నడక వచ్చే వేళకే, కన్న తల్లి, పుట్టించిన వాడు రకరకాల కారణాల వల్ల దైవాధీనులయ్యారు. ఇంక అమాస పని ఏమయిందంటే, మారెమ్మ గుడి, అమాసుడు ఒక్కటే అన్నట్టుగా అయిపోయింది. మారెమ్మ గుడి అన్నంత మాత్రాన దిక్కూ దివాణం లేదని అర్థం కాదు. అమాస లాంటి ఎంతోమందికి మారెమ్మ గుడి ఆశ్రయమిస్తూ వచ్చింది. వేసవిలో మరీను. ఎండని భరించలేని జనం జాతరలా వుంటారక్కడ. అదలా వుంచి అక్కడ అమాస కాకుండా మరో పాత తలకాయ నివాస మేర్పరుచుకుంది. పాత తలకాయ అంటే అతని వేళ్ళు చేతులు, తల అని కాకుండా జుట్టున్నంత మేరా తెల్లగా పండిపోయి, అతని దేహమూ జీర్ణించిపోయింది. ఇంతవరకు అతను కూర్చున్న చోటినుంచి లేవడాన్ని ఎవరూ చూడలేదు. మారెమ్మ గుళ్ళో ఒక మూల, పాతకాలపు నల్ల కంబళి ఒక దాన్ని పరచుకొని, దాని మీద కాళ్ళు జాపుకునో, పక్కస్థంబాన్నానుకొనో, లేదా చేతులు వెనక్కి కట్టుకునో కూర్చునే వుంటాడు. అతనికి ఇలాంటి మూడు నాలుగు భంగిమలు తప్పించి వేరే ఏదీ ఉన్నట్టు లేదు. అతనలా కూర్చున్నప్పుడల్లా సగం కళ్ళు మూసుకుని కూర్చోవడం మొదట్నుంచీ ఎలాగో అలవాటయిపోయింది. అలాకాకుండా మరో రకంగా అతనెప్పుడూ కూర్చోడు. అతడినా స్థితిలో చూస్తే దేని గురించో తీవ్రంగా ఆలోచిస్తున్నట్టు అనిపిస్తుంది. ముడతలు పడ్డ అతని మొహం కూడా అతనలా కనపడ్డానికి కారణం కావొచ్చు. లేదా ఆ ముడతల మొహానికి నప్పేలాగ మెడ దాకా దిగజారిన ఇంత లావు తెల్లటి మీసమూ కారణం కావచ్చు. మొత్తం మీద అతనేదో తీవ్రంగా ఆలోచిస్తున్నట్టే కనిపిస్తుంది. అక్కడతని ప్రక్కగా అనుకుని మనిషెత్తు వెదురు కర్ర ఎప్పుడూ ఉండనే వుంటుంది. అతడటూ ఇటూ తిరగవలసి వచ్చినప్పుడల్లా అమాస చేతి ఆసరా వుండడం వల్ల ఆ వెదురు కర్ర అంతగా వాడ బడటం లేదు. కాని కోడి, గొర్రె, మేక - ఏమన్నా దగ్గరకొస్తే వాటిని అదిలించడానికి అది అప్పుడప్పుడు అవసరం వస్తుంది. ఇన్ని విషయాలూ చెప్పి అతని పేరే చెప్పలేదు. చిన్న వాళ్ళ నుంచి పెద్ద వాళ్ళదాకా అతన్ని కురియయ్య (కురి =గొర్రె), కురియయ్య అనే పిలుస్తారు. అదేమన్నా అతని

అసలు పేరా? ఆ ప్రశ్న మాకూ వద్దు మీకూ వద్దు. ఈ మాత్రం అందరికీ తెలిసినదే. అతనికి జ్ఞాపకం వచ్చినప్పట్నుంచీ అతని తొడలు నడక కోల్పోయే వరకూ ఆ వూరి గౌడు గారి పాకలో గొర్రెల్ని మేపుతూ వుండేవాడు. ఇప్పుడు కూడా అతనలా సగం కళ్ళు మూసుకుని కూర్చున్నప్పుడు వేలితో ఒక్కో గొర్రెని లెక్క పెడుతున్నట్టుగా అల్లాడిస్తూ తనలో తనే ఏదో గొణుక్కుంటూ వుంటాడు. రోజులో ఆ రేడు సార్లు ఇది తప్పదు. అంతేకాదు, ఏ రోజూ ఈ పద్ధతి తప్పదు. అమాస కురియణ్ణ ఆశ్రయంలో పెరగసాగాడు. ఇప్పుడతనికి పదేళ్ళో, పదకొండేళ్ళో వుంటాయి. కురియయ్య "అమాసా" అనగానే 'ఆఁ' అని బదులు పలకడం అతని పగటి డ్యూటీ అయింది.

ఊరిని చీకటి అలుముకోవడం మొదలెట్టగానే అమాస, కురియయ్య మఠం గంట ఎప్పుడు మ్రోగుతుందా అని ఎదురు చూస్తూ వుండేవాడు. మఠం గంట మ్రోగగానే అమాస కురియయ్య పక్కనున్న కంచము, గ్లాసు తీసుకుని పరిగెత్తేవాడు. అప్పుడు పరిగెత్తడం కనిపించేది కాదు. కళ్ళు చించుకుని చూస్తే అతని పరుగు వేగానికి చీకటి అల్లాడుతున్నట్టు తోస్తుంది. అలా వెళ్లిన వాడు ఎప్పుడొచ్చాడన్నదీ తెలియదు. వచ్చిన వాడు 'అయ్యా' అనడం చీకటిని చీలుస్తూ వినిపించినపుడే తెలిసేది. అప్పుడు గనుక కురియయ్య పడుకునుంటే లేచి కూర్చుంటాడు. అలవాటు చొప్పున ఆ చీకట్లోనే మఠం వాళ్ళ సంగటి ముద్ద, చారు తిని తరువాత అమాస పడుకునే వాడు. ఆ పాటికి అలుముకున్న చీకటితో బాటు వూరంతా మాటుమణిగి పడుకున్నా అక్కడక్కడ కుక్కల మొరుగుళ్ళు, గుడ్లగూబ 'గూక్కూ' ధ్వని వినిపిస్తూనే వుంటుంది. ముసలతనికి నిద్ర రాక పోవడంతో కళ్ళు తెరచి కంటికానినంత మేరా చూస్తూనే, మెలకువగా వున్నంత సేపూ తనలో తనే మాట్లాడుకుంటూ వుండి 'అమాసా' 'అమాసా' అని రెండు సార్లు పిలిచి బదులు రాక తనూ పడుకునే వాడు.

2

ఆ చుట్టుప్రక్కల అన్ని వూళ్ళల్లో ప్రతి సంవత్సరం వచ్చేలాగే ఈ వూరిక్కూడా మారెమ్మ పండుగ వస్తుంది. అప్పుడు మాత్రం కురియయ్య తన నివాసాన్ని వేరు వేరు చోట్లకి మార్చాల్సి వుంటుంది. అప్పుడు గుడికి దుమ్ము, ధూళి దులిపి, తుడిచి, సున్నం కొట్టి, ఎర్రమట్టి రంగు గీతలు తీర్చి, కళ్ళకి నదురుగా కనిపించేలా అలంకరిస్తారు. ఇప్పుడు సున్నం, ఎర్రమన్ను పట్టీలు తీర్చడం పూర్తయి, లేత ఎండలోంచి పట్టీలు మెరుస్తున్నాయి. కురియయ్య చుట్టు పక్కల మాత్రం అలాగే వుండిపోయి, మిగతా చోట్లంతా సున్నం కొట్టి తెల్లగా మెరుస్తూ వుండటం వల్ల, అక్కడ మరీ నల్లగా కనిపిస్తోంది. అక్కడ

మండువాలో చాలా మంది అటూ ఇటూ తిరుగుతూ కాగదాలు సిద్ధం చెయ్యడం, రంగురంగుల కాగితాలు కత్తిరించి ముంగిట్లో అలంకరించడం మొదలైన పనులు చేస్తున్నారు. అక్కడందరూ ఇంచుమించు తెల్లటి కొత్త గుడ్డలు కట్టుకోవడంతో మారెమ్మ గుడి నిండా మొత్తానికి తెలుపు మెరుపుతో నిండిపోయింది. అక్కడున్న బసణ్ణ అన్నతను ఒకడు ఫ్రెంచి మీసం పెంచి, నల్లగా పొట్టిగా వున్నాడు. అతడూ తెల్లగుడ్డలు కట్టుకోడంతో మరింత నల్లగా మెరుస్తున్నాడు. అతను నోరు తెరవక పోయినా అతని పాచి పట్టిన పళ్ళు తెల్ల గుడ్డల కారణంగా మెరుస్తూ బయటే వున్నాయి. అతని చేతిలో ఓ చీపురు వుంది. బసణ్ణ దడ దడ అడుగులు వేస్తూ కురియయ్య వున్న మూలకి వచ్చి 'అయ్యా', అని గట్టిగా అరిచాడు. ఎవరైనా సరే కురియయ్యని రెండు సార్లైనా పిలిస్తే తప్ప అతను 'అ' అనేవాడు కాదు గనుక అందరూ మొదటే గట్టిగా అరుస్తూ మాట్లాడేవారు. బసణ్ణ పిలుపుకి కురియయ్య మెల్లిగా కళ్ళు తెరచి అతని వేపు చూశాడు. అతను తన ఎదుట తెల్లగా తిరుగుతున్న ఆకారాల్ని చూస్తూనే వున్నాడు. అలా చూస్తుంటే అతనికి వెనుకటి జ్ఞాపకాలు కళ్ళ ముందు తిరుగుతున్నట్టుగా వున్నాయి. మారెమ్మ పండుగ అంటే పులి వేషం వెయ్యాలంటే అతనే. అతను వయసులో వున్నపుడు అతని పులి వేషం లేకుండా సంబరమే లేదు. పులి వేషం అతని కళ్ళెదుట గంతులెయ్య సాగింది. డప్పుల చప్పుడు చెవిలో వినిపించ సాగింది. అప్పుడు పెద్ద గౌడు గారు బతికున్నంత కాలం - కురియయ్య అమాస వయసులో వుండేవాడేమో, గౌడు గారు కురియయ్య పులివేషపు ధాటికి మెప్పుదలగా తలూపేవారు. చొక్కా గుడ్డ బహుమతిగా ఇస్తూ "నువ్వున్నంత కాలం మా ఇంట్లో వుండు. భోజనం చెయ్యి, బట్టలు కట్టుకో. గొర్రెలు మేపు అంతే చాలు" అన్నారు. అతని ముడతల మొహంలోని ప్రతి ముడతా మారెమ్మ గుడి తెల్లరంగు వల్లనే, అక్కడున్న గుంపు కట్టుకున్న తెల్ల గుడ్డల వల్లనే తెల్లగా వెడల్పుగా విచ్చుకోసాగింది. బసణ్ణ మరోసారి గట్టిగా 'అయ్యా' అన్నాడు. కురియయ్య తలెత్తి అతని వేపు చూశాడు. బసణ్ణ నుంచున్న తీవి చూడగానే అతనికి కారణం తెలిసిపోయింది. కురియయ్య కుడి చేత్తో వెదురు కర్ర పట్టుకుని మరో చెయ్యి ఆసరా కోసం పైకి చాపాడు. చాచిన చేతిని బసణ్ణ పట్టుకోగానే దాని మీద భారం మోపి లేచి నుంచుని, వెదురు కర్ర ఆసరాతో నడుస్తూ, మరో మూలకి నడిచి అక్కడ కూర్చున్నాడు. అక్కడున్న కంబళిని బసణ్ణ బాగా దులిపి కురియయ్య కూర్చున్న మూలకి తెచ్చి పరిచాడు. కంబళి బాగా ఝూడించి దులపడంతో దానిలో పేరుకున్న దుమ్ము, చెత్త అంతా ఎండలోకి ఎగిరి ఈద సాగాయి. కంబళి పరచి వున్న ఆ కాస్త మేరా అరచేతి మందం

బూడిద రంగులో వున్న దుమ్ము, చెత్త - చెదారం నిండి వుంది. దాని మీద కూడా అప్పుడు లేత ఎండ పడి దానిక్కూడా తెల్ల రంగు వేసినట్టుగా వుంది.

అటు ఆడుకోవడానికని ఎక్కడికో వెళ్ళిన అమాస మధ్యాహ్నం తరువాత మారెమ్మ గుడికి వచ్చాడు. వచ్చి చూస్తే కళ్ళు చెదిరేలా ఏమేమో నిండి వుందక్కడ. పచ్చి సున్నం, ఎఱ్ఱమన్ను, నేల అలికిన పేడ వాసన అన్నీ కలిసి ఒకదాని తరువాతొకటి ముక్కుకి ముసురుకుంటూ మారెమ్మ గుడి వాసనే అదో రకంగా వుంది. కురియయ్య ఈ మూల నుంచి ఆ మూలకి స్థాన చలనం చేసి మొదటిలా కూర్చున్నాడు. వసారా మధ్యలో గుండ్రంగా కొందరు గుంపు కూడి దేన్నో నిక్కినిక్కి చూస్తున్నారు. గుంపులో ఒకడేదో చేస్తున్నాడు. చటుక్కున అమాస అటు వెళ్ళి తొంగి చూశాడు. చూస్తే రంగు రంగుల కాగితాల్తో గండ భేరుండ కిరీటం మొదలైన అలంకారాలన్నీ చేస్తున్నాడు. అక్కడ చేసినవన్నీ కళ్ళకింపుగా వున్నాయి. అక్కడ అతను బొమ్మ తయారు చేస్తుంటే చుట్టూ వున్న వాళ్ళు అలా వుండాలి, ఇలా వుండాలి, భేష్! అంటూ తలో రకంగా మాట్లాడుతున్నారు. వాటిని తృప్తిగా చూశాక అమాస అక్కడ్నుంచి ఛెంగున దూకి కురియయ్య పక్కన చేరాడు. ఎదుటి లోగిల్లో గోడకి ఆనుకున్నట్టుగా ఎరుపు, తెలుపు రంగుల్లో వున్న పెద్ద పెద్ద ఛత్ర చామరాలని బయటకి తీసి, ఎండలో వేసి వరుసగా నిలబెట్టారు. వాటి దగ్గరగా మూలన ఆకాశం అంటుతున్నట్లుగా కొబ్బరి చెట్టు తలెత్తి నుంచుని వుంది. దాని వేపు కళ్ళు తిప్పి అమాస చూపు అనినంత మేరా దృష్టి సారించాడు. ఆరేడు గెలల కాయల భారంతో చెట్టు వాలిపోతోంది. చెట్టు మొదట్లోకి చూస్తే అక్కడ దానిక్కూడా సున్నం, ఎఱ్ఱమన్ను రాశారు శుభ్రంగా. దాన్ని చూసి అమాస కురియయ్య పక్కకి మరింత దగ్గరగా జరుగుతూ 'అయ్యా' అన్నాడు. 'ఏమిటన్నట్టు చూశాడు కురియయ్య. "చూడయ్యా, చూడయ్యా నీ కొబ్బరి చెట్టుకెవరో సున్నమూ రంగూ పూశారు" అన్నాడు. కురియయ్య చూడబోతే కాస్త దూరం కనిపించింది. గాని, తరువాత మసగ్గా అలుక్కుపోయిందంతా అతనిక్కనిపించింది. చేతబడి చేసి ఎవరో స్మశానంలో కొబ్బరికాయ పూడ్చి పెట్టడం, అది మొలకెత్తి భూమిని చీల్చుకు రావడం, దాన్ని తెచ్చి 'తనది' అంటూ ఒకటుందనీ అనుకుంటూ మారెమ్మ గుడి మూల నాటడం అది తన కళ్ళెదుటే చిగురించి, పురి విప్పుకుంటూ, మట్టలు వేస్తూ, అవి రాలిన చోట్ల గుర్తులు మిగులుస్తూ, పెరిగి పెరిగి పైపైకి ఎదిగి నుంచుంది.

3

పండగ రోజు పొద్దెక్కే కొద్దీ పొరుగూళ్ళ నుంచి చుట్టాలు, పక్కాలు ఒక్కొక్కరే

వచ్చి వూళ్ళో దిగడం ఎక్కువైంది. వచ్చిన వాళ్ళు అనవాయితీ ప్రకారం మారెమ్మ గుడికి వెళ్ళొచ్చి తరువాత మిగతా పనులు చేసేవారు. కొందరు అక్కడే కూర్చుని అన్నీ మరిచిపోయి కబుర్లలో లీనమయ్యేవారు. వాళ్ళవాళ్ళ వూళ్ళల్లో జరిగిన ఎప్పటివో పోట్లాటల్ని గురించి అదెలా జరిగింది, ఎందుకు జరిగింది. వివరాలన్నీ లాగి లాగి చర్చించటం మొదలెట్టారు. అప్పుడే బయట జొన్న గడ్డితో మంట చేసి బసణ్ణ దప్పు వేడి చేస్తూ దాని ధ్వని బిగిస్తున్నాడు. అతని చుట్టూ వానర సేనలా పిల్లా జెల్లా మూగి వున్నారు. వాళ్ళల్లో అమాస కూడా వున్నాడు. బసణ్ణ దప్పు పట్టుకుని "చడ చడ నకుననకున" అంటూ పుల్లతో కొట్టగానే దాని ధ్వని కంచుమీద కొట్టినట్టుగా వూళ్ళో నాలుగు మూలలకీ వినిపించ సాగింది. చుట్టూ వున్న కుర్రగుంపు వూరుకోక గెంతడం మొదలెట్టారు. బసణ్ణకి కూడా ఉత్సాహం పొంగి అతనూ దంగుదంగు దంగ్ దంగుమని పుల్లతో కొడుతూ తనూ గెంతసాగాడు. అదికుర్రాళ్ళకి అడుగులెయ్యడానికి అనువుగా వుండటంతో బసణ్ణా, కుర్రాళ్ళు దప్పు చప్పుడుకి అనుగుణంగా అడుగులెయ్య సాగారు. అమాసకెవరు నేర్పారో గాని అందరికన్న బాగా అడుగు లేస్తున్నాడు. అందరూ ఆశ్చర్యంతో 'అరెరె, ఎంత బాగా చేస్తున్నాడో కదా' అని చూడసాగారు. ఆపాటికి చూడ్డానికి ఆడవాళ్ళు కూడా వచ్చి చేరారు. బంగారి అమాసుడి మీంచి కళ్ళు తిప్పలేక పోయింది. అమాసని చూస్తూ చూస్తూ ఆమె మనసులో అలాంటి బుల్లిబాబు కావాలన్న తీవ్రమైన కోరిక కలిగింది. ఆమెకి పెళ్ళయి ఆరే డేళ్ళు గడిచినా ఇంతవరకూ తల్లి కాలేదు. వాళ్ళు వీళ్ళు అనే మాటలు భరించలేక ఆ మంటతో నలుగురైదు గురితో సంబంధం పెట్టుకుంది. అయినా ఫలించ లేదు. బాబాల దగ్గర కెళ్ళడానికి బీదతనం అడ్డొచ్చింది. ఆమె తోటి వాళ్ళు ముప్పయ్యేళ్ళకే ముసలితనం తెచ్చుకున్నా బంగారి మాత్రం పెళ్ళి కూతుర్లా అలాగే వుంది. ఆమెని చూసినవాళ్ళు అరక్షణం అయినా ఆశపడేలాంటి లావణ్యం, వయ్యారం ఉండామెలో. అదలా వుండనిద్దాం. అయినా ఫలితం కనిపించలేదు. కాని అలా కూడా చాలా రోజులు జరగలేదు. రాత్రయిందంటే గుడిసె మీద రాళ్ళు పడసాగాయి. ఆమె మొగుడు బంగారి వీపు సాపు చేసి తల బాదుకుని, బయట మొహం చూపించలేక లోపల కూర్చున్నాడు. ఆ తరువాత రాళ్ళు పడటం ఆగిపోయి, ఇప్పుడు మర్చిపోయేటంత కాలమయి పోయింది. ఆమె కళ్ళెదుట అమాసవేసే రక రకాల గంతులు కనిపిస్తున్నాయి.

ఆ సమయంలో ఇద్దరు పెద్దలు బాగా బలిసిన రెండు మేక పిల్లల్ని అక్కడికి లాక్కొచ్చారు. అప్పుడు అక్కడున్న గుంపు రెండుగా చీలింది. కుర్రమూక

అటూ - ఇటూ సర్దుకున్నారు. మేకలు డప్పుల చప్పుడికి ఎటు పడితే అటు లాగ సాగాయి. అప్పుడు మరొక ఇద్దరు కలిసి వాటిని కదపకుండా పట్టుకుని మారెమ్మ గుడి ఎదుట తెచ్చి నిలబెట్టారు. బయట డప్పు జోరుగా మ్రోగుతోంది మేకలు కదలక మెదలక కళ్ళని మాత్రం చుట్టూ తిప్పుతున్నాయి. ఎదుట గుడి తలుపులు తెరచి వుంది, లోపల వెండి ప్రతిమ మెరుస్తూ వుంది. గుడి లోపల్నుంచి అగరు వత్తుల పొగ దట్టంగా బయటకి తేలి వస్తోంది. మోకాలి పైకి పంచె కట్టుకున్న ఒకతను తీర్థమూ, చారెడు పూలూ తెచ్చి మేకల ముందు నుంచుని కళ్ళు మూసుకుని, పెదవులు కదిలిస్తూ పటపటమని ప్రారంభించాడు. అతని దేహం నల్లగా వుండి నరాలు పొంగి కనిపిస్తున్నాయి. పటపట మంటుంటే నరాలు పైకి కిందకి పొంగి కుంగుతున్నాయి. తరువాత అతను పూల దండని రెండు ముక్కలు చేసి మేకల మెడలకి చుట్టాడు. ఆ తరువాత ఎడి పూలని వాటి తలల మీద పెట్టాడు. తీర్థాన్ని వాటి వొంటి మీద జల్లి, చేతులు జోడించి, "ఏవనా తప్పులుంటే కడుపులో దాచుకోమ్మా, మమ్మల్ని చమించి ఆన ఇవ్వు తల్లీ" అన్నాడు. అతని కీచు గొంతు మారెమ్మ గుడిలో ప్రతిధ్వనించింది. దూరంగా గలాభా తప్పించి, మారెమ్మ గుడిలో అందరూ వూపిరి బిగపట్టి నుంచున్నారు. వాళ్ళలా నుంచోవడం, మేకలు చుట్టూ కళ్ళు తిప్పడం కాసేపు జరిగింది. ఆ తరువాత మేకలు ఏకబిగిన ఒళ్ళు, తల విదిలించడం మొదలెట్టాయి. ఆ తరువాత మేకల్ని పట్టుకున్న వాళ్ళు వాటిని బర బర బయటికి లాక్కెళ్ళారు. డప్పు చప్పుడు అక్కడ మొదలువుతున్న గుస గుస చప్పుణ్ణి మించి వినిపించసాగింది. అలా బయటకి వెళుతున్న వాళ్ళతో కుర్రమూక బయలుదేరింది. వాళ్ళలో అమాసా వున్నాడు. పెద్దవాళ్ళు కోప్పడ్డా, వాళ్ళ కన్ను గప్పి వెళ్ళారు. అలా వెళ్ళి పెరట్లోకి చేరుకున్నారు. అక్కడ బలంగా వున్న ఒకతను కత్తిని అవలీలగా పట్టుకుని నుంచున్నాడు. అందరి ధ్యాసా ఒకే వేపు వుండటంతో దూర దూరంగా వున్న కుర్రమూక దగ్గరగా వచ్చి మూగడాన్ని గమనించలేదు. ఇద్దరు మేక వెనక కాళ్ళు, ముందు కాళ్ళు పట్టుకొని దాని మెడని దిమ్మ మీద పెట్టగానే దాని కోసమే కాచుకున్న కత్తిమనిషి చకమని మెడమీద కత్తితో ఒక దెబ్బవేసి 'చ....వ్' అనిపించగానే తల, మొండెం రెండు భాగాలయ్యాయి. తెగి ఒక వేపు పడిన తల తాలూకు నోట్లో ఒకడు నీళ్ళు పోశాడు. ఒకటి రెండు సార్లు నోరు పకపకమని మూసుకుంది. అటు మొండెం విలవిల్లాడుతోంది. తల మాత్రం కళ్ళు పైకెత్తి బిగుసుకుంది. విలవిల్లాడుతున్న మొండెం నుంచి రక్తం సలసల చిమ్ముతూ టొణటొణమని నేల మీద పడి చుట్టూ రక్తమయం మయింది. ఎవరో కుర్రాడొకడు చప్పున పరుగెత్తి మేక మెడకి చుట్టిన

రక్తం కారుతున్న పూల దండని తీసుకొచ్చాడు. తెచ్చిన వాడు పూరుకోక దాన్ని అమాసుడి మెళ్ళో వేసి 'గెంతు' అన్నాడు. అమాసకి మెడ చుట్టూ చల్లగా అయి, అతని మెడనుంచి కూడా రక్తం బొట్లు కారుతున్నట్లయితే వాడు బెదిరి అక్కడ్నుంచి పారిపోయాడు. ఇంకా కొంతమంది అలాగే పారిపోయారు. పడుకున్నా కూడా ఆ దృశ్యమే అమాస కళ్ళముందు మెదలుతోంది. చాలా సార్లు నిద్రలో బెదురుతూ లేచి కూర్చున్నాడు. ఆ రోజు రాత్రంతా లైట్లు వెలుగుతున్నాయి. పొరుగూళ్ళ వాళ్ళు చాలా మంది ఇంచుమించు తెల్ల దుప్పట్లు కప్పుకుని మారెమ్మ గుడి నిండా వరుసగా పడుకున్నారు. దానితో మారెమ్మ గుడంతా తెల్లటి తెలుపుగా కనిపిస్తోంది.

అవాళ రాత్రి రైల్వే గాంగ్‌మన్ సిద్ధప్ప ఓవర్‌గా కడుపునిండా పరమాత్ముడిని సేవించి వచ్చాడు. అతని తప్పు కాకపోయినా అది ఆ రాత్రి అతన్ని చాలా ఇబ్బంది పెడుతోంది. కళ్ళు మూసుకుంటే ప్రళయం కనిపిస్తోంది. అందుకే అతను కళ్ళు మూసుకోకుండా అల్లల్లాడుతున్న వీధిలో, చేతిలో కర్ర అసరాతో అటూ ఇటూ పూగుతూ నడుస్తున్నాడు. అలా నడుస్తున్నప్పుడు వెలిగే లైటు స్థంభం కనిపిస్తే రోషం ముంచు కొచ్చింది. దాన్ని ఝాడించి తన్ని కర్రతో కొట్టేవాడు. ఆ చప్పుడు చుట్టు పక్కల ప్రదేశాల్ని వణికించేది. అప్పటికీ తృప్తి కలగకపోతే 'హెూహెూ' మని అరుస్తూ ఒక రాజకీయ వాదినే, కంట్రాక్టర్నో, రైల్వే బాన్‌నే, వడ్డీకి అప్పులిచ్చే మాదప్పనే అన్నట్టుగా, థూ! లంజకొడకా, తెల్ల గుడ్డలేసుకుని దేశాలు తిరిగి పెద్దవాడి వవుతావా? నన్ను చూసి ముక్కు మూసుకుంటావా? మేమంటే దిక్కులేని వాళ్లం. ఎక్కడో అక్కడ వీధిలో పడుంటాం (వే....అని పెద్దగా గొంతెత్తి 'గొళో'మని ఏడ్చాడు. మళ్ళీ జోరుగా మాట్లాడసాగాడు) "మీ కారు మా మీదకి వదలకండయ్యో! నా మాటిని నవ్వుతూ చూడండయ్యో! నవ్వరా....! నవ్వు .... నవు.... నీకు నవ్వే కాలం ఏం చేస్తావు నవ్వక? నవ్వరా కొడకా! పేదోళ్ళని ఉద్ధరించే వాడివి నువ్వు. నవ్వు కొడకా! కమ్యూనిసం రావాల, అప్పుడు నీ నవ్వు ఆగాల. అప్పటి దాకా నవ్వుతావ్.... నవ్వయ్యో....నవ్వు" అల్లకల్లోలం రేపుతూ, అతని మాటలు, నవ్వు, అన్నీ వీధి నిండా నిండిపోయి, ఆ చలిరాత్రి చీకట్లో ఏలవిల్లాడుతున్నాయి. ఆ మాటలు, నవ్వు నిద్రపట్టని అమాసుడిని చెదర గొడుతున్నాయి. ఇలా చాలా సేపు జరిగాక సిద్ధప్ప శరీరం ఎక్కడ పడిందో, ఎలా పడిందో ఏమో గాని అతని మాటలూ నవ్వు ఆగిపోయాయి.

## 4

మరుసటి రోజు వచ్చింది కదా! ఆ రోజు పూరు అవలిస్తూ గడిపింది. ఏ

అరుగు మీద చూసినా జనమే. ఇంతకీ ఎంతోమంది ఇంకా నిద్ర లేవలేదు. ఉదా: సిద్ధప్ప. మధ్యాహ్నా మవగానే పులి వేషాల గుంపు మారెమ్మ గుడి దగ్గరకి వచ్చింది. గౌడు గారి నౌకరు వచ్చి గౌడు గారింటి కొబ్బరికాయలు కావాలట అన్నాడు. కురియయ్య కోసుకో అనగానే వాడు నిమిషాల మీద చెట్టెక్కి కాయల్ని దులిపి పట్టుకుపోయాడు. అక్కడ ఇళ్ళల్లో ఆడవాళ్ళు లక్షణంగా తలలు దువ్వుకొని, పూలు పెట్టుకుని, బయటకి లోపలకీ తిరుగుతున్నారు. వయసు కుర్రాళ్ళు అప్పుడప్పుడు అమ్మాయి ల్నేడిపిస్తూ వాళ్ళ చేత తిట్లు తింటున్నారు.

మారెమ్మ గుళ్ళో పులివేషపు డప్పుల చప్పుడు అందర్నీ అటువేపే లాగుతోంది. అందరూ వచ్చే పులుల కోసమే కాచుకునున్నారు. ఒక్కసారిగా పులి వేషాల వాళ్ళున్న తలుపు తెరచుకుంది. అందరి చూపులు అటే మళ్ళాయి. ఒక పెద్ద పులి నిమ్మకాయని నోటితో కరచుకుని లోపల్నుంచి ఒక్క గంతుతో బయట కొచ్చింది. రాగానే జనమంతా బెదిరి పక్కకి జరగటంతో అక్కడే గుండ్రంగా చోటు ఏర్పడింది. ఆ తరువాత నాలుగారు పెద్దపులులు, తోడేలు, కొంటె కోణంగి, ఒకటి తరువాతొకటి బయటకొచ్చాయి. వచ్చిన వాటిలో ఒక పులి పిల్ల కూడా వుంది. అంతా వచ్చాక వరుసగా నుంచుని దేవుడికి చేతులు జోడించి తీర్థం తీసుకున్నారు. తరువాత అక్కడ్నుంచే "ఆట" ప్రారంభం అయింది. సివంగి అందరికన్న జోరుగా వుంది. భేషుగ్గా, అతని వేషం బలే భేషుగ్గా కుదిరింది. మేక పిల్లని అవలీలగా తెగ్గోసిన వాడే వాడు. అతను డప్పుల చప్పుడుకి అనుగుణంగా గంతులేస్తూ వచ్చాడంటే జనం ఫర్లాంగు దూరం వెనక్కి గెంతేవారు. పులివేషాలు వీధిలోకి వచ్చాయంటే ఆడవాళ్ళు, పిల్లలు అరుగు దిగకుండానే ప్రాణాలుగ్గ బట్టుకుని చూసేవారు. వేషాల వాళ్ళు అడుగులేస్తూ వాళ్ళ వేపు వచ్చారంటే చాలు ధడక్కన లోపలకి వెళ్ళి తలుపు లేసుకునే వారు. చిన్న పిల్లలు దూరదూరంగా వుంటూనే పులి వేషాల్ని వెంబడిస్తున్నారు. అలా గంతులేసుకుంటూ కాపుల వాడకి వచ్చి అక్కడ చావడి ముందు తమ వేషాన్ని ప్రదర్శించారు. పులి వేషం చూడ్డానికి గౌడు గారు, కరణం మొదలయిన వాళ్ళంతా చేరారు. వాళ్ళంతా పులి వేషం వేసి ఆడిన వాళ్ళ కల్లా తమ స్థాయికి తగ్గట్టు కానుకలిచ్చి శభాష్ గిరి పుచ్చుకున్నారు. చీకటి పడి 'ఆట ముగిసినా వూరివాళ్ళ కళ్ళల్లో పులివేషమే. కళ్ళు మూసుకున్నా, పులివేషమే, "ఢంగు ఢంగు ఢంగు చుక్కి" డప్పుల చప్పుడుతో సహా కనిపిస్తోంది.

గౌడు పడుకున్నా నిద్ర పట్టక పోవడంతో బయట కొచ్చి పచార్లు మొదలెట్టారు. వాళ్ళింటి జీతగాడు మెలకువగానే వుండటంతో గౌడుగారు

బయటకి రాగానే లేచి కూర్చున్నాడు. అయన బీడీ నోట్లో పెట్టుకుని పుల్ల గియ్యగానే ఆ వెలుతురు ఆ చీకట్లో వాళ్ళ మొహం ఎర్రగా కనిపించి ఆరిపోయింది. గౌడు గారు పొగ పీలుస్తూ వుండిపోయి, తరువాత జీతగాడి వేపు తిరిగి, "అరే పులి పిల్ల వేషం వేసిన కుర్రాడెవర్రా?" అన్నారు. జీతగాడు, "ఆదేనండి, అమాసుడని" అన్నాడు. "అమాసుడంటే?" అని మళ్ళి రెట్టించి అడిగారు. "అదేనండి ఆ కురియయ్యతో బాటు ఓ కుర్రాడు, తల్లి దండ్రి లేని కుర్రాడు వున్నాడు కదా, వాడే" అన్నాడు. గౌడు గారు వినగానే "ఎంత ఆశ్చర్యం" అన్నారు. అరె, వాడా? "అంత పెద్ద కుర్రాడయ్యాడా అప్పుడే?" అన్నారు. గౌడు కళ్ళ ముందు అమాస పులివేషం వేసుకుని రకరకాలుగా గెంతుతూ కనిపించసాగాడు....

# కథకుల సంక్షిప్త పరిచయం

## 1. పంజె మంగేశరావు (కవి శిష్య)

జననం : ఫిబ్రవరి 22, 1874. మరణం: అక్టోబరు 25, 1937 దక్షిణ కన్నడ జిల్లా సుబ్రహ్మణానికి సమీపంలో వున్న పంజ వారి పూర్వీకుల ఊరు. మంగుళూరు తాలుకా ఒంటవాళ వారు పుట్టిన ఊరు. బి.ఎ(1904) ఎల్.టి(1905) కన్నడ పండితులుగా, విద్యాశాఖలో ఇన్‌స్పెక్టర్‌గా ట్రైనింగ్ కాలేజీ ముఖ్యోధ్యాపకులుగా, ఆఖరికి మడికేరి హైస్కూలు ముఖ్యోపాధ్యాయులుగా వుండి నివృత్తులైనారు. చిన్న కథల జన్మకారకులు రాయచూరులో జరిగిన కన్నడ సాహిత్య సమ్మేళనానికి అధ్యక్షులుగా వున్నారు.(1934 లో) పంజెగారి శతాబ్ది ఉత్సవానికి(1973లో) ఓరియంటల్ లాంగ్‌మాన్ లిమిటెడ్ ప్రకాశన సంస్థ ఆయన రచనలన్నిటినీ నాలుగు సంపుటాలాగా ప్రకటించింది.

## 2. డా.. మాస్తి వెంకటేశ అయ్యంగార్ (శ్రీనివాస)

జననం: జూన్ 6, 1891 కోలారు జిల్లా మాలూరు తాలూకా మాస్తిలో. ఇప్పుడు బెంగుళూరులోని గవిపురం ఎక్స్టెంషన్‌లో నివాసం. మద్రాసులో ప్రెసిడెన్సీ కాలేజీలో చదివి కొంతకాలం అక్కడే అధ్యాపక వృత్తి చేశారు. తరువాత సివిల్ సర్వీసు పరీక్షలో ప్రప్రథమంగా ఉత్తీర్ణులై అసిస్టెంట్ కమీషనర్‌గా వున్నారు. బెళగావిలో జరిగన సాహిత్య సమ్మేళనానికి అధ్యక్షత వహించారు(1929) కర్నాటక విశ్వవిద్యాలయం నుంచి గౌరవ డాక్టరేట్, కేంద్ర సాహిత్య అకాడెమీ నుంచీ చిన్న "కథలు", కథా సంకలనాలకి 1968 వసంవత్సరపు బహుమతి 1970 లో. కేంద్ర అకాదమీ 'ఫెలో' పదవి(1974) 1984 'జ్ఞానపీఠ' గౌరవం - ఇవి ఆయన పొందిన గౌరవాలు, బహుమతులు. కావ్యం, నాటకం, నవల, విమర్శ, జీవితచరిత్ర మొదలైన సాహిత్య ప్రక్రియల్లో కూడా కృషి చేశారు.

## 3. ఎ.ఆర్.క్రిష్ణశాస్త్రి (శ్రీపతి)

జననం: ఫిబ్రవరి 12, 1890 మైసూరు. మరణం : ఫిబ్రవరి 1, 1968. మైసూరు విశ్వవిద్యాలయంలో బి.ఎ., మద్రాసు విశ్వవిద్యాలయంలో ఎం.ఎ., పట్టా తీసుకున్నారు. విశ్వవిద్యాలయంలో కన్నడ ప్రొఫెసర్‌గా పనిచేసి, ముఖ్యస్థులుగా వుండి నివృత్తులయ్యారు. (1939-1946) హైదరాబాదులో

జరిగిన కన్నడ సాహిత్య సమ్మేళనానికి అధ్యక్షత(1941), మైసూర్ విశ్వవిద్యాలయం నుంచి గౌరవ డాక్టరేట్(196 ), కేంద్ర సాహిత్య అకాడమీ నుంచి ' బంకిం చంద్ర' విమర్శ గ్రంథానికి బహుమతి (1961) - ఇవి ఆయన పొందిన గౌరవాలు, బహుమతులు. వచన భారతం, భాసకవి, సంస్కృత నాటకం, బంకిం చంద్ర- వారి కొన్ని గ్రంథాలు. 'శ్రీపతియ కథెగళు' వారి ఏకైక కథాసంకలనం

## 4 . అజ్జంపుర సీతారామ్ (ఆనంద)

జననం: ఆగస్ట్ 22, 1902 మరణం : నవంబర్ 17, 1963. అజ్జంపుర వారి పూర్వీకుల వూరు. పుట్టినది - శివమొగ్గ జిల్లా, సొరబతాలుకా ఆనవట్టిలో. జంతుశాస్త్రం, వృక్షశాస్త్ర విషయాలలో బి.ఎస్‌సీ. పట్టా పుచ్చుకున్నారు. కొంతకాలం మైసూరు ప్రభుత్వ పట్టు వ్యవసాయశాఖలో వుండి, చివరికి రచననే తమ వృత్తిగా చేసుకున్నారు. 'చంద్రగ్రహణ', సంసార శిల్ప, మాటుగాతి, స్వప్నజీవి, జోయిసర చౌడి - ఇవి కథా సంకలనాలు. నాటక, ప్రబంధ, అనువాద ప్రక్రియల్లో కూడ ప్రవేశించారు.

## 5. డా.కె.వి. పుట్టప్ప (కువెంపు)

జననం : డిశంబర్ 29, 1904. ఊరు శివమొగ్గ జిల్లా తీర్థహళ్ళి తాలుకా కుప్పళ్ళిలో. ఇప్పుడు మైసూర్‌లో దాణివిలాస పురంలో 'ఉదయరవి' లో నివాసం. కన్నడ ప్రొఫెసర్‌గా, ముఖ్యస్థులుగా వుండి (1946) తరువాత మైసూరు విశ్వవిద్యాలయం ఉపకులపతి (1956 - 1960) గా వుండి నివృత్తులయ్యారు. శ్రీ రామాయణ దర్శనం కావ్యకృతికి కేంద్ర సాహిత్య అకాదమీ బహుమతి (1955), తరువాత 1967వ సంవత్సరపు జ్ఞానపీఠ అవార్డ్ (1968 లో) రాష్ట్రపతి నుంచి పద్మభూషణ (1958), రాష్ట్రప్రభుత్వంచే 'రాష్ట్రకవి ' (1964 లో).

## 6. కొదవళ్ళి అశ్వత్థనారాయణరావ్ ( అశ్వత్థ)

జననం : జూన్ 16, 1912. చిక్కమగళూరు జిల్లా కొదవళ్ళిలో. పూర్వీకులు శివమొగ్గ జిల్లా తీర్థహళ్ళికి చెందినవారు. ఇప్పుడు మైసూరు సరస్వతీపురంలో నివాసం. సిమ్లాలో మిలటరీ ఇంజనీరింగ్ సర్వీసులో వుండి, తరువాత మిలిటరీ ఫ్యాక్టరీస్ ఎక్స్‌టెన్షన్ డైరక్టర్‌గా వుండి, ఆ తరువాత బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో సివిల్ ఇంజనీరింగ్ రీడర్‌గా వుండి నివృత్తులైనారు.

జీవన, జయంతి, నేవు - నలివు, అగ్నిసాక్షి, పట్టన్న హెండతి, దూరద కాశియల్లి, అభినయ జగత్తు మొదలైన 13 కథా సంకలనాలు, నవల, నాటకం, ప్రబంధం, ఖండకావ్యం మొదలైన ప్రక్రియల్లోను గ్రంథాలు ప్రకటించారు.

## 7. ఎ.సుబ్రహ్మణ్య రాజ అరసు (చదురంగ)

జననం : జనవరి 1, 1916 మైసూర్ జిల్లా హుణసూరు తాలూకా కల్లహళ్ళి. ఇప్పుడు మైసూరు వాణీ విలాస పురంలో నివాసం. రాజవంశానికి చెందిన వారై వుండి కూడా స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొన్నారు. స్వప్నసుందరి, ఇణికు నోట, శవద మనె, మీనిన హెజ్జె, బంగారద గెజ్జె ఇత్యాది కథా సంకలనాలు; కుమార రామ, ఇలిబోను నాటకాలు ; సర్వమంగళ, ఉయ్యాలె నవలలు; రెండు నవలలూ సినిమా తియ్యబడి మొదటి సినిమాని నిర్దేశించారు.

## 8. బసవరాజ కట్టీమని

జననం : అక్టోబర్ 5, 1919. బెళగావి జిల్లా గోకాక, తండ్రి గారి వూరు. అదే తాలుకా శిరూరు. ఇప్పుడు ధారవాడలో నివాసం. పత్రికోద్యమకారిగా ఏడెనిమిది దిన, వార, మాస పత్రికలలో పని చేశారు. 'ఉషా' మాసపత్రిక ప్రగతిశీల సాహిత్యానికి, లేఖకులకూ ప్రోత్సాహకరంగా వుండేది. 1942 వ సం. ఉద్యమంలో చేరి 9 నెలలు జైలు వాసం, శాసన సభ్య పదవి ఇచ్చి రాష్ట్రప్రభుత్వం సాహిత్య సేవని గౌరవించింది ( 1968-73 ). సుమారు 35 నవలలు. 'జ్వాలా ముఖియ మేలె' (1951) నవలకి సోవియట్ ల్యాండ్ నెహ్రూ బహుమతి (1968) కారవాన్, ఆగస్ట్ తొమ్మిది, జోళద బెళెయ నడువె, గులాబిహూ, సైనికన హెండతి మొదలైన కథాసంకలనాలు. సోవియట్ దేశ ప్రవాసం చేసి వచ్చారు (1969).

## 9. తళుకిన రామస్వామయ్య సుబ్బరావ్ (త.రా.సు)

జననం : ఏప్రిల్ 4,1920. ఊరు చిత్రదుర్గం జిల్లా చళ్ళకెరె తాలూకా తళకు. ఇప్పుడు మైసూర్ యాదవగిరిలో "గిరికన్యకా" యందు నివాసం. స్వాతంత్రోద్యమంలో చేరి జైలు వాసం. సుమారు వంద గ్రంథాలు. అందులో సుమారు డెబ్భై నవలలు, తొట్టలు తూగితు, రూపసి, గిరిమల్లిగెయ నందనదల్లి మొదలైన కథా సంకలనాలు, నాటకం, జీవిత చరిత్ర, అనువాదాలు - ఇతర ప్రక్రియలు. పూర్వజర్మనీ పర్యటన చేసి వచ్చారు.

## 10. కె.ఎస్. నిరంజన (నిరంజన)

జననం : 1923 దక్షిణ కన్నడ జిల్లా కుళకుంద. ప్రస్తుతం బెంగళూరు జయనగర్ 5 వ బ్లాక్ 515, 'కథె' లో నివాసం. ఆయన మొదటి నవల 'విమోచన' రష్యన్ భాషలోకి అనువదింపబడి ప్రకటితమైన మొదటి కన్నడ నవల. 1974 లో సోవియట్ ల్యాండ్ నెహ్రూ పురస్కారం 'చిరస్మరణ' నవలకు లభించింది. ఏడు సంపుటాలుగా వెలువడిన జ్ఞాన గంగోత్రి కి (పిల్లల విశ్వకోశం) ప్రధాన సంపాదకులుగా వున్నారు. గ్రంథాలు : 'నాస్తిక కొట్ట దేవరు' 'ఒంటి నక్షత్ర నక్కితు', 'అన్నపూర్ణా', 'రక్త సరోవర', 'వారద హుడుగ' మొదలైన కథా సంకలనాలు; అభయాశ్రమ, చిరస్మరణ, దూరద నక్షత్ర, రంగమ్మన వఠార మొదలైనవి నవలలు.

## 11. బి.సి. రామచంద్ర శర్మ

జననం: 1925, బెంగుళూరు. బాల్యం - బొంబాయి, బెంగుళూరు. బెంగుళూర్ సెంట్రల్ కాలేజీ, లండన్ యూనివర్సిటీలలో విద్యాభ్యాసం. గ్రంథాలు : మందార కుసుమ, ఏళనె జీవ, బెళగాయితు - కథాసంకలనాలు. సెరగిన కెండ, నెరళు (నాటకాలు) : ఏళుసుత్తిన కోటె, హృదయగీత, హేసరగత్తె (కవన సంకలనాలు). విలాసం: హెడ్; సైకాలజికల్ సర్వీస్, మినిస్ట్రీ ఆఫ్ ఎడ్యుకేషన్, పి.బి.ఆర్.డబ్ల్యు 93, రిడ్జ్‌వే, లుసాకా, ఝాంబియా (ఆఫ్రికా ).

## 12. యశవంత చిత్తాల

జననం : ఆగస్టు 3, 1928. ఉత్తర కన్నడ జల్లా హనే హళ్ళి, ఇప్పుడు బొంబాయిలో మార్కెటింగ్ ఒకెలాయిట్ హైలామ్ లిమిటెడ్‌లో జనరల్ మ్యానేజర్. బి.ఎస్‌సీ ( ఆనర్స్ ) బి.ఎస్.సీ (టెక్) అమెరికా ఎమ్.ఇ (కెమ్) - పదవులు. గ్రంథాలు : సందర్శన, ఆబోలిన, ఆట (కథాసంకలనాలు ); మూరు దారిగళు (నవల) చిరునామా: 2, బ్యాండ్ స్టాండ్ అపార్ట్‌మెంట్స్, 212-ఎ, బ్యాండ్ స్టాండ్, బాంద్రా, బొంబాయి - 400050.

## 13. డా.. ఎ.కె.రామానుజన్

జననం 1929, మైసూరు. మైసూరు విశ్వవిద్యాలయం, పూనా డెక్కన్ కాలేజీలలో విద్యాభ్యాసం. ఇండియానా విశ్వవిద్యాలయం వారి పిహెచ్.డి పట్టా 1963. ఇప్పుడు చికాగో విశ్వవిద్యాలయంలో ద్రావిడ భాషాధ్యయనంలో

ప్రాధ్యాపకులు. హెూక్కుళల్లి హూవిల్ల (కవితా సంకలనం), హాళదిమీను (అనువాద నవల) సామెతలు -కన్నడ గ్రంథాలు, The strides, Relation (కవితా సంకలనాలు), Speaking of Shiva, The Interior Landscape - మరికొన్ని ఇంగ్లీష్ రచనలు.

## 14. డా.. శాంతినాథ దేశాయి

జననం :జూలై, 22 1929, ఉత్తర కన్నడ జిల్లా హాళియాళ. బొంబాయి విశ్వవిద్యాలయంలో ఎం.ఎ.,పిహెచ్.డి, ఇప్పుడు శివాజీ విశ్వవిద్యాలయంలో (కొల్హాపూర్, మహారాష్ట్ర) ఇంగ్లీష్ ప్రొఫెసర్, మరియు ఆ విభాగపు ముఖ్యస్థులు. ఇంతకు ముందు కర్నాటక విశ్వవిద్యాలయంలో రీడర్‌గా వుండేవారు. గ్రంథాలు : మంజూగడ్డె, క్షితజ దండె (కథాసంకలనాలు) ముక్తి, విక్షేప (నవలలు); Experimentation with Language in Indian Writing in English (Fiction) - సంపాదిత గ్రంథం. Critical Essays in Indian Writing in English, The Image of Indian in Western Creative Writing - ఇతరులతో కలసి రాసిన సంపాదిత గ్రంథాలు.

## 15. యు.ఆర్. అనంతమూర్తి

జననం : డిసెంబర్ 21, 1932, ఊరు - శివమొగ్గ జిల్లా తీర్థహాళ్ళి తాలుకా మేగువళ్ళి. మైసూర్ విశ్వవిద్యాలయంలో ఎం.ఎ (ఇంగ్లీషు). బర్మింగ్‌హామ్‌లో రిచర్డ్ హాగర్ట్ గారి నాయకత్వాన పిహెచ్.డి ; మైసూర్ విశ్వవిద్యాలయం, మానస గంగోత్రి (స్నాతకోత్తర ) విభాగంలో ఇంగ్లీషు రీడర్‌గా వున్నారు. 1972-74 లో హెూమి బాబా ఫెలోషిప్ వచ్చింది. అయోవాలో జరిగిన World Writers Meet లో ప్రొఫెసర్‌గా ఆరు నెలల కాలం ఆహ్వానితులుగా వెళ్ళారు. గ్రంథాలు : ఎందెందూ ముగియద కథె, ప్రశ్నె, మౌని (కథా సంకలనాలు) సంస్కార (రాష్ట్రపతి బహుమతి పొందిన సినిమా కథ), భారతీపుర - నవలలు. ప్రజ్ఞ మత్తు పరిసర, సన్నివేశ -విమర్శా గ్రంథాలు. ఒక నాటకం, ఒక కవితా సంకలనం, నేషనల్ బుక్ ట్రస్ట్ ఇండియా ప్రకటించిన కన్నడ కావ్య సంగ్రహం (సంకలనం 1973).

## 16. రాఘవేంద్ర ఖాసనీస

జననం: మార్చి 2, 1933. బిజాపూర్ జిల్లా ఇండిలో. బొంబాయి విశ్వవిద్యాలయంలో ఎం.ఎ (ఇంగ్లీష్), డిప్లొమా ఇన్ లైబ్రేరియన్‌షిప్ పొందారు.

ఇప్పుడు బెంగుళూరు విశ్వవిద్యాలయంలో అసిస్టెంట్ లైబ్రేరియన్. పనిచేసిన ఇతర స్థలాలు: బొంబాయి, పూనా, వల్లభ విద్యానగర - ఆనంద.

## 17. కే. సదాశివ

జననం: మే 1934. చిక్క మంగళూరు జిల్లా. మైసూరు విశ్వవిద్యాలయంలో జంతుశాస్త్రంలో ఎం.ఎస్ సీ పట్టా పొందారు. ఇప్పుడు మైసూర్ జి.ఎస్.ఎస్ కాలేజిలో జంతుశాస్త్ర విభాగంలో రీడర్, మరియు ముఖ్యస్థులుగా వున్నారు. నల్లియల్లి నీరు బంతు (1957), అపరిచితరు (1971) కథా సంకలనాలు. ఆఖరి సంకలనానికి 1972లో రాజ్య ప్రశస్తి. నల్లియల్లి నీరు బండితు పూనా ఫిల్మ్ ఇన్స్టిట్యూట్ వారు చలన చిత్రంగా రూపొందించారు.

## 18. టి.జి.రాఘవ

జననం: మార్చి 28, 1935. ఇప్పుడు బెంగళూరు మల్లేశ్వరంలో ఎం.ఇ.ఎస్. కాలేజిలో ఇంగ్లీష్ అధ్యాపకులు. కర్నాటక విశ్వవిద్యాలయంలో ఎం.ఎ.(ఇంగ్లీష్ భాషా విజ్ఞానం) పట్టా (1967). కొంతకాలం "విశ్వ కర్నాటక" దిన పత్రిక ఉప సంపాదకులుగా(1955) వున్నారు. మైసూర్ జె.ఎస్.ఎస్. కాలేజిలో ఇంగ్లిష్ అధ్యాపకులుగా వుండేవారు (1967-71). జ్వాలె ఆరితు కథాసంకలనం.

## 19. పి. లంకేశ్

జననం: 1935. శివమొగ్గ జిల్లా కొనగన హళ్ళి. మైసూర్ విశ్వవిద్యాలయంలో ఇంగ్లీష్ అధ్యాపకులు. గ్రంథాలు: కెరయ నీరను కెరెగె చెల్లి, నానల్లి, ఉమాపతియ స్కాలర్ షిప్ యాత్రె (కథా సంకలనాలు), బిచ్చు, తలెమారు (కవితా సంకలనాలు), బిరుకు (నవల), ఏళు నాటకగళు, సంక్రాంతి (నాటకాలు) ప్రస్తుత (విమర్శాగ్రంథం) మొదలైనవి.

## 20. పూర్ణ చంద్ర తేజస్వి

జననం: 1939 మైసూర్. మైసూర్ విశ్వవిద్యాలయంలో ఎం.ఎ.(కన్నడం) 1961లో. ఇప్పుడు చిక్కమగళూరు జిల్లా మూడిగెరె తాలుకా చిత్రకూటంలో నివాసం. గ్రంథాలు: హులియూరిన సరహద్దు, అబచూరిన పోస్టాఫీసు (కథాసంకలనాలు) స్వరూప (నవల) యమళ ప్రశ్నె (నాటకం) బృహన్నళె,

సోము స్వగతలహరి (కవితాసంకలనాలు) వ్యక్తి విశిష్ట, సిద్ధాంత.

## 21. జి.ఎస్.సదాశివ

జననం : 1940, శివమొగ్గ జిల్లా సాగర్ తాలూకా గుండుమనె. ఇప్పుడు అదే తాలూకా హెుగొప్పలు. మైసూరు విశ్వవిద్యాలయం ఎం.ఎ. (రాజ్యశాస్త్రం). ఇప్పుడు బెంగళూరు 'ప్రజావాణి' దిన పత్రికలో ఉప సంపాదకులు. మగువిగాగి బందవన్ను తణుకుగళు - కథా సంకలనాలు.

## 22. రాజశేఖర వీరమాన్వి

జననం: మార్చి 5, 1942. ఊరు: రాయచూరు జిల్లా వీరమాన్వి. కర్నాటక విశ్వవిద్యాలయం ఎం.ఎస్సీ. (అప్లయిడ్ జియాలజీ). ఇప్పుడు బళ్ళారి వీరశైవ కాలేజీలో భూవిజ్ఞాన అధ్యాపకులు.

## 23. వీణా ఎలబుర్గి

జననం: ఫిబ్రవరి 22, 1945 ధారవాడ: కర్నాటక విశ్వవిద్యాలయం ఎం.ఎ. (ఇంగ్లీష్) మరియు డిప్లొమా ఇన్ టీచింగ్ పట్టా ఇప్పుడు ధారవాడ కర్నాటక కాలేజీలో ఇంగ్లీష్ సీనియర్ లెక్చరర్. ముళ్ళుగళు, కొనెయదారి - కథా సంకలనాలు.

## 24. శ్రీ కృష్ణ ఆలన హళ్ళి

జననం: 1945. మైసూర్ జిల్లా హెగ్గడ దేవన కోటె తాలుకాలోని ఆలనహళ్ళి. మైసూరు విశ్వవిద్యాలయంలో ఎం.ఎ. (కన్నడ) సుమారు ఐదేళ్ళు మైసూరు విశ్వవిద్యాలయం కాలేజీలో కన్నడ అధ్యాపకులుగా వున్నారు. ప్రస్తుతం స్వంత ఉద్యమం. రాష్ట్రస్థాయిలో 1973లో ద్వితీయ బహుమతి పొందిన, గిరిష్‌కర్నాడ్ దర్శకత్వం వహించిన 'కాడు' సినిమా. వీరి 'కాడు' నవలనుంచి తయారైనదే. మణ్ణినహాడు(కవితా సంకలనం) రాష్ట్ర స్థాయిలో బహుమతి పొందింది. తప్త, ఫినిక్స(కథా సంకలనాలు) అవలోకన, గ్రామాయణ సమీక్షె సంపాదిత గ్రంథాలు. కొంతకాలం ద్వైమాసిక సాహిత్య పత్రిక 'సమీక్ష' కి సంపాదకులుగా ప్రకాశకులుగా వున్నారు (1965 - 1966).

## 25. దేవనూర మహాదేవ

జననం: 1949 లో మైసూరు జిల్లా నంజన గూడు తాలూకా దేవనూరు.

మైసూరు విశ్వవిద్యాలయం ఎం.ఎ. (కన్నడం) 1974లో. ఇప్పుడు మైసూర్ శారదా విలాస్ లా కాలేజీలో లా విద్యార్థి. 'నర' పత్రికా సంపాదకులు (1972-74) ద్యావనూరు - కథా సంకలనం (1973). గాంధీ మరియు మావో - అనువాదం.

Printed at The Central Electric Press A12/1 Naraina Indl. Area, Phase-I, New Delhi-110028